# సన్మానము

విజయవాడ వాస్తవ్యులును, వైశ్యశిఖా మణులును అగు శ్రీమాన్ ఉదయగిరి కృష్ణారావుగారు భక్తి "నివేదన" పత్రికకు శ్రీ ఖరనామ సంవత్సరమున ఉగాదినాడు రూ. 116—0—0 లు కానుకను భక్తిపురస్సరముగ సమర్పించిరి.

వీరికి శ్రియఃపతి ఆయురారోగ్య భాగ్య భోగ్య భగవద్భాగవతాచార్య కైంకర్యనిరతులనిచ్చి రక్షించుగాక.

శ్రీమతే రామానుజాయనమః



## —: న మో వా క ము లు :—



ఓ శ్రియఃపతీ!

దాసోహము. నీయొక్క నిర్హేతుకజాయమాన కటాక్షవిశేషముచే, నీవు సంకల్పించుకొని, నీవు నడిపించుచున్న, నీ కైంకర్యరూపమైన నీకు సమర్పణరూపమైన భక్తి "నివేదన" పత్రిక రెండు సంవత్సరములు గడుప గలిగినది. మూడవ వత్సరమున ప్రవేశించుచున్నది. నీ ఈ వాఙ్మయ కైంకర్యమంది చేతనుల ఈవిధముగ నీవు ఉపయోగించు కొనుచున్నందులకు మా హృదయపూర్వక కృతజ్ఞతా పూర్వక ధన్యవాదములు.

ఓస్వామీ! ఇక ముందుకూడ ఇతోధికముగ ఈనీదాసులచే నీ కైంకర్యమును చేయించుకొనుచు కటాక్షించుమా!

దాసులు

భక్తి "నివేదన" సంపాదకవర్గము.

శ్రీమతే రామానుజాయనమః

# సవినయ వినతులు

ప్రియపాఠక మహాశయులారా!

మా హృదయపూర్వక ధన్యవాదములు. ఈ పత్రికా పుత్రిక ఈ రెండు వత్సరముల నుండి ఎటుల యున్ననూ క్షమాస్వరూపులగు తాము దీనిని ఆదరించుచున్నారు.

ఇందుల కెంతయు కృతజ్ఞులము.

ఈ మాసముతో దీనికి మూడవ సంవత్సరము ప్రారంభమగుచున్నది. ఇది అనేకానేక విధముల అభివృద్ధి చెందవలెనని ఎంతయో ఆశించుచున్నది. భగవత్కటాక్షమున్ను భాగవత యాదరణమున్ను కావలయును. వాని కెంతమాత్రము కొఱవయుండదని నమ్ముచున్నాము.

ఈచైత్రమాసమునకు తమకు క్యాలండరు, పంచాంగము అందజేసుకున్నాము. అయినను ప్రచారవిశేషముల తెలుపవలెనని ఈసంచికను కూడ తమకందజేయు చున్నాము. వచ్చే నెలనుండి మామూలు ప్రకారము అన్నివిషయములతోను కూడుకొని పత్రిక తమ హస్తమలంకరించగలదు. ఆర్థికముగ పత్రిక చాల బాధపడుచున్నది. దయయుంచి ప్రతిపాఠకులు కనీసము మరి ముగ్గురు చందాదారులనైనను చేర్పించి పత్రికాభివృద్ధికి తోడ్పడ సవినయముగ ప్రార్థించు చున్నారము.

ఇట్లు,

భక్తి "నివేదన" సంపాదకవర్గము.

☆ ప్రచార విభాగము

679/J



శ్రీమతే రామానుజాయనమః

ది 6—4—1951 తేదీ నుండి 21—4—1951 తేదీ వరకు

రాజమహేంద్రవరమున జరిగిన

# శ్రీ మహావిష్ణు కోటి తులసీ దళ పూజా మహోత్సవము

యొక్క వివరములు:

శ్రీ వికృతి నామ సంవత్సర పుష్య బహుళ త్రయోదశి మొదలు మూడు దినములు పాలకొల్లులో జరుపబడిన శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ కార్యకారిణి సమితివారిచే రాజమహేంద్రవరమున ది 6—4—1951 తేదీనుండి 15 దినములు ఈసంఘాధ్వర్యమున శ్రీమహావిష్ణు కోటి తులసీ దళ పూజా మహోత్సవమును, నిష్కామతయా, విశ్వకల్యాణార్థమై జరిపించుటకు ఈమహోత్సవాహ్వాన సంఘమువారి యాహ్వాన మంగీకరించబడి తదనుసారముగా జరుపబడినది.

ఈ మహోత్సవమును ఆహ్వాన సంఘము వారు అత్యంతమహావైభవముగా నిర్వహించిరి. ఇందు నిమిత్తమై వీరు బ్రహ్మాండమగు చక్కని ఏర్పాట్లు గావించిరి.

ఈ మహోత్సవమున ఇంచుమించు దక్షిణ హిందూదేశమందలి వేలకొలది భక్తులెల్లరు పాల్గొనిరి. పండితులందరు దీక్షితులుగను, ఉపన్యాసకులుగను పాల్గొనిరి. ఇది ఒక అపూర్వమైన క్రతు విశేషము. ఇట్టిది ఈ ప్రాంతమందింతవరకు ఎప్పుడును జరిగియుండలేదు.

ఈ క్రతువు నిమిత్తమై రాజమహేంద్రవరమున యిన్నీసుపేటలో సుమారు 500 గజముల పొడవు 75 గజములు వెడల్పుగల పెద్ద ప్రత్యేక పందిరి నిర్మించబడెను. అందు ఉత్తరపు కొనను దక్షిణపుకొనను 4, 5, వందల మంది దీక్షితులు కూర్చొనుటకువీలగునట్టి పెద్దపెద్ద వేదికలు రెండు నిర్మించబడెను. ఆవేదికలు ప్రత్యేక శిల్పులచే చిత్రవిచిత్ర శిల్పకళానిపుణతతో, తోరణ, మాలికా, వితాన, చిత్రములచే అత్యంత మనోహరముగ అలంకరించబడెను.

పందిరియంతయు విద్యుద్దీపమాలికలచే కోటి సూర్యప్రభా సమన్వితముగ అలంకరించబడెను. మరియు శబ్దవిస్తరిణీ యంత్రములు విస్తారముగ అమర్చబడెను. అర్చనమంటపము, ఆరాధనమంటపము, హోమమంటపము, పూజామంటపము, ఉపన్యాసమంటపము, పారాయణ మంటపము, భజనమంటపము ఇత్యాదులచే పందిరియంతయు విరాజిల్లుచుండెను.

దక్షిణపు వేదికపై అర్చామూర్తి నుండి వేంచేసిన శ్రీ శ్రీనివాస పెరుమాళ్లును; ఉత్తరపు

వేదికపై (పడిశలేరునుండి వేంచేసిన శ్రీ భజే నారాయణస్వామివారున్ను వేంచేసియుండిరి.

శ్రీ వికృతి సం. రం. ఫాల్గుణ బ ౩౦ శుక్రవారమునాడు సాయంకాలము అర్తమూరు పడిశలేరు పెరుమాళ్లు రాజమహేంద్రవరము లోని శ్రీ వేణుగోపాలస్వామివారి కోవిలలోకి భక్తబృందమంతటితో కలిసి వేంచేశి వారి యనుజ్ఞను తీసుకొని, గరుడవాహనారూఢులై ఛత్రచామరాదిలాంఛన లాంఛితులై ఆళ్వార్లు ఎంబెరుమానార్లు రజత పల్లకిపై వెంటరాగా, భాగవతబృందమంతయు, భజనలు, వేద, ఉపనిషత్ ప్రబంధాధ్యయనాదులు సలుపుచుండ గ్రామ ప్రదక్షిణముచేయుచు, మృత్సంగ్రహణము చేసుకొని రాత్రి ౧౦ 8-0 కు యాగశాల ప్రవేశమొనరించిరి. పిమ్మట అంకురారోపణము, ధ్వజారోహణము, వాస్తుపూజ, వాస్తుహోమము పర్యగ్నికరణము, బలిప్రదానము జరుపబడెను.

శ్రీఖరనామసంవత్సర చైత్ర శుద్ధ పాడ్యమి శనివారము ఉదయముననే దీక్షితుల బసయగు శ్రీనాళమువారి సత్రమున ప్రత్యేక తిరువారాధన, తీర్థవినియోగాదులు పూర్తియై, భాగవత గోష్ఠియంతయు తిరువీధ్యుత్సవముతో యాగశాలకువెళ్ళిరి. ఈగోష్ఠిలో రజత ఆందోళిక యందు శ్రీనమ్మాళ్వార్లు ఉడయవర్లు వేంచేపు చేయబడిరి. వారి కిరుపార్శ్వములయందును, రజత వేత్ర హస్తులు సూర్య, చంద్రులు; ఛత్ర చామరములు యుండెను. గోష్ఠికి అగ్రభాగమున మేళతాళములు, పిమ్మట భజయతిరాజ భజన, పిమ్మట ప్రబంధగోష్ఠియు ఆళ్వారెంబెరుమానారలకు వెనుక వేదగోష్ఠి, ఉపనిషత్ పారాయణ శ్రీవిష్ణుసహస్రనామస్తోత్ర పఠనము, భజన క్రమముగా నడచుచుండెను. ఈగోష్ఠి సుమారు 2 ఫర్లాంగులదూరమువరకు వ్యాపించియుండెను.

ప్రతిదినము ఉదయమున ఈగోష్ఠి యొక్క పురప్పాట్లు యిటులనే జరుగుచుండెడిది.

మార్గములో గుంటూరువారులోని శ్రీరామునాథ స్టోర్సు కార్యకర్తలు విచ్చేసిరి. వారు తమ రామునాన సంచాలక శకటమును గోష్ఠికి ముందుగ నడిపించుచు భగవన్నామమును దశదిక్కులు ప్రతిధ్వనించు నట్లు జేయుచుండిరి.

యాగశాలలో శ్రీస్వామి వారికున్ను, దీక్షితులకున్ను కార్యకర్తలకున్ను ప్రతిసరబంధనపురస్సరముగ, దీక్షావస్త్ర సమర్పణముతో దీక్ష యొసంగబడెను.

ఇందు 170 మంది తులసీదళ అర్చన దీక్షితులుగను, 4 గురు ఆరాధన దీక్షితులుగను, 24 శ్రీరామాయణపారాయణ దీక్షితులుగను, 8గురు శ్రీమద్భాగవతపారాయణదీక్షితులుగను, 1 రు శ్రీవిష్ణుపురాణపారాయణ దీక్షితులుగను, 1 రు భగవద్గీతా పారాయణ దీక్షితులుగను. 12 గురు చతుర్వేద పారాయణ దీక్షితులుగను, 7 గురు ద్రావిడ వేదాధ్యాయన దీక్షితులుగను, 3 గురు మంత్ర జపదీక్షితులుగను, 1 రు ప్రత్యేక సుందరకాండ పారాయణ దీక్షితులుగను, 9 గురు ఋత్విక్ దీక్షితులుగను, 6 గురు తళిహాకైంకర్య దీక్షితులుగను, 12

నుండి సకలకార్య నిర్వహణ దీక్షితులుగను దీక్ష వహించిరి.

వీరందరు వారివారి కార్యనిర్వహణకై వేరు వేరుగా నేర్పరచిన ప్రదేశములలో తమ తమ కార్యములను సకాలమున ప్రారంభించి రెండు వేళలయందును సక్రమముగను, నిర్విఘ్నముగను, చివరవరకు నిర్వహించిరి.

తులసీ దళ అర్చన దీక్షితులందరు ఇరుపార్శ్వములయందలి రెండు ఉన్నత వేదికలయందును అచ్చటి పెరుమాళ్ళకు రెండువైపుల యందును బారులుతీర్చి కూర్చుని, తమముందు ఉంచబడిన సుప్రతిష్ఠిత శ్రీసుదర్శన మహాయంత్రములకు తులసీదళములతో పూజను సలుపుచుండిరి.

వీరిలో ఒకరు పెరుమాళ్ళ సన్నిధిలో శబ్ద విస్తారిణీయంత్రము ముందర కూర్చొని శ్రీమన్ విష్ణు సహస్రనామములను ఒక్కొక్కదానినే సావకాశముగ గట్టిగ చెప్పగా రెండువేదికల యందును యున్నట్టి అర్చనాదీక్షితు లందరును కూడ ఆనామములను క్రమముగా అనువదించుచు ఒక్కొక్క నామమునకు ఒక్కొక్క దళము చొప్పున యంత్రముపై సమర్పించుచు చక్కగా పూజల గావించుచుండిరి.

ఈ నామములను అచ్చట యున్నట్టి భక్తులందరు కూడ అనువదించుచుండిరి. మరియు కొంతమంది భక్తులు వేదికక్రింద తమ కేర్పరుపబడిన ప్రత్యేక స్థలమున సుఖాసీనులై తమ కివ్వబడిన ప్రతిమాయంత్రముల తమముందుంచుకొని ఈ నామములనే అనువదించుచు తులసీ దళములతో పూజల సలుపుచుండిరి.

ప్రతిదినము హోమశాలలోని స్వాహాకారములతోను, పారాయణమంటపమందలి పారాయణాదులతోను, సంస్కృత – ద్రావిడ వేద–వేదాంత అధ్యయనాదులతోడను కలిసి పందిరి యొక్క రెండు అంగములయందలి వేదికలనుండి శ్రీవిష్ణు సహస్రనామములఘోష ఈ 14 రోజులు రాత్రింబగళ్లు దిగంతముల వ్యాపించి కల్యాణప్రదముగావించుచుండెను. ఇది ఒక అపూర్వ సన్నివేశము. అత్యద్భుత సమావేశము. అనుపమాన సంఘటనము.

ప్రతిదినము ఉదయమున గం 8–0లగాయతు గం 12 వరకు ఉపన్యాస మంటపమున మొదట ఎనిమిది దినములు శ్రీరామాయణము, పిమ్మట చివరివరకు శ్రీమద్భాగవతము కాలక్షేపము జరుపబడుచుండెను. మధ్యాహ్నము గం 12లకు మహానివేదన, మంగళాశాసనము, శాత్తుమొఱ జరుపబడుచుండెడిది. మధ్యాహ్నము గం 2–0 లగాయతు గం 4–0 వరకు శ్రీయతిరాజసేవా మహిళామండలివారిచే స్త్రీలకై ప్రత్యేకము విదుషీమణులచే వేదాంతోపన్యాసము లిప్పించబడుచుండెను.

సాయం గం 4–0 మొదలు గం 6–30 వరకు సుప్రసిద్ధ పండిత ప్రకాండులచే వివిధ వేదాంతోపన్యాసము లివ్వబడుచుండెను.

రాత్రి గం 6–30 నుండి గం 7–30 వరకు ఉత్తరపు వైపునయున్న

అర్చనామంటపమున దీక్షితు లందరున్ను అచ్చటికి విచ్చేసిన భక్తులందరున్ను కలిసి శ్రీ విష్ణుసహస్రనామస్తోత్ర సమిష్టి పారాయణము జరిపించుచుండిరి.

ఈకార్యక్రమము అతి విలక్షణమైనది. అదేసమయమున ఉపన్యాస మంటపమున శ్రీ కౌమారి విశ్వనాథశాస్త్రిగారు మున్నగువారిచే తరంగములు, అష్టపదులు, ఆధ్యాత్మ కీర్తనలు ఇత్యాదులను కాలక్షేపముల జేయుచుండిరి.

అదేసమయమున అర్చనామంటపములు రెండింటియందును శ్రీలక్ష్మీ సహస్రనామములతో కుంకుమపూజయు అది అయిన పిమ్మట సేవ కాలము అటుపిమ్మట ఆరగింపు, మంగళాశాసనము, చాత్తుమొఱ జరుగుచుండెడిది.

చాత్తుమొఱ సమయములో శ్రీస్వామివారి సన్నిధిని ఆనాడు జరిగిన సంస్కృత, ద్రావిడ వేదాధ్యయనములయొక్కయు, శ్రీరామాయణ శ్రీభాగవత, శ్రీవిష్ణుపురాణ, శ్రీభగవద్గీతాదుల యొక్కయు అంతిమభాగములు శాంతిపాఠములు ఆయాదీక్షితులచే విన్నవించబడుచుండెను.

పిమ్మట యజ్ఞాచార్యులచే క్షమాప్రార్థనా పురస్సరముగా మహదాశీర్వాద ప్రార్థనముచేయబడుచుండెను. పిమ్మట తీర్థప్రసాదవినియోగము జరుగుచుండెడిది. ఈపదునాలుగు దినములు రాత్రింబగళ్ళు ఒకలిప్తయైనవిడువకుండగ భజన మందిరమున భగవన్నామ అఖండ సంకీర్తనము జరుపబడుచుండెడిది.

ప్రతిదినము రాత్రులందు గం. 9-0 నుండి సుప్రసిద్ధ హరిదాసులచే హరికథాకాలక్షేపములు గావింపబడుచుండెను.

ఇందు మహారాష్ట్రమునుండి విచ్చేసిన ఒక సాధుపుంగవులచే భజనరూపముగ గావింపబడిన భక్తి ప్రబోధము యపారము. హరికాలక్షేపము పాషండులసైతము భక్తశిఖామణులుగ మార్చివైచెను.

ప్రతిదినము తెల్లవారుఝామున గం. 4-0 లకు శ్రీ కౌమారి విశ్వనాథశాస్త్రిగారిచే శ్రీస్వామివారి సుప్రభాతోత్సవము మహావైభవముగా గావింపబడుచుండెడిది. దీనివైభవము వర్ణనాతీతము.

ఇట్టివిధముగ 14 దినములు మహావైభవముగా 1,12,00000 తులసీదళ పూజ, శ్రీమహావిష్ణు సహస్రనామావళితో జరుపబడెను.

ఈ మధ్యలో ఆయాపారాయణ ఘట్టములు వచ్చినపుడు, శ్రీసీతాకల్యాణోత్సవము, పాదుకాపట్టాభిషేకోత్సవము, చూడామణి ప్రధానోత్సవము శ్రీరామ పట్టాభిషేకోత్సవము, చివరకు శ్రీరుక్మిణీకల్యాణోత్సవము అత్యంత వైభవముగా జరుపబడెను.

ది 21-4-51 ఉదయముననే చూర్ణోత్సవ, వసంతోత్సవానంతరమున మేళతాళములతోను భాగవతగోష్ఠితో సహా శ్రీశఠారిని ఊరేగింపుతో గోదావరినదియొక్క పుష్కరముల రేవునకు వేంచేపుచేసుకొనివెళ్ళి అవభృథోత్సవము అత్యంతవైభవముగా జరుపబడెను.

ఈఉత్సవములో భక్తులు చూపిన ఉత్సాహమునకు, పొందిన ఆనందమునకు మేరలేదు. సరిగా అవభృథోత్సవ సమయముననే బట్టతునుపు చినుకులను ఆగోష్టియున్న ప్రదేశమునందు మాత్రము కురిపించి దేవతలుకూడ ఈఉత్సవ కైంకర్యాన్వయమును, తత్ప్రియుక్తానందమును అనుభవించిరి.

ఆనాటి మధ్యాహ్నముననే శ్రీరుక్మిణీకల్యాణ మహోత్సవము జరిపిరాత్రిదీక్షితుల సన్మానాదుల సమర్పణముతో ఈమహోత్సవము ముగిసెను. యింతటిశ్రద్ధాభక్తులతోను యింతవైభవముగను నిర్వహించిన ఈమహోత్సవ ఆహ్వాన సంఘము వారుమిక్కిలి స్తవనీయులు. ఇందులోనుసంకల్పము నాటినుండి సమాప్తి వరకు ఆహార నిద్రలు ఎరుగకుండగ విధివిరామములులేకుండగ, తిరుప కాప్పు కైంకర్యము మొదలుకొని తిరునామ సంకీర్తన కైంకర్యము వరకు సమస్త కైంకర్యములను స్వయముగ జరిపి ఈమహోత్సవ సఫలతకు ప్రధాన కారకులైన ఆహ్వానసంఘ కార్యదర్శులైన శ్రీమాన్ ఇ. వరదారావుగారున్ను శ్రీమాన్ పినిశెట్టి ఆదినారాయణమూర్తి గారున్నూ ఈఉత్సవ ప్రబోధకులును అత్యంత సౌజన్యమూర్తులును యగు శ్రీమాన్ మాణిక్యం సుబ్బారాయుడుగారున్ను అత్యంత స్తవనీయతములు,

ఈఉత్సవనిర్వహణములో స్థానికాధికారులందరున్ను, పురపాలక సంఘము వారున్ను, పౌరులున్ను అత్యంతము తోడ్పడిరి. వాలంటీర్లు చక్కగ తమవిధిని నిర్వహించిరి.

ప్రతిఫలమును తీసుకున్నను, శబ్దవిస్తరిణీయంత్రాధికారులున్ను, విద్యుద్దీప ప్రకాశకులున్ను భక్తిశ్రద్ధలతో పనిచేసిరి.

తమ యింజనీరింగు అనుభవమును చక్కగా వినియోగించి శ్రీకృష్ణమూర్తిగారున్ను,

దగ్గరయుండి అన్నివిషయములను పరిశీలించుచు సలహాలనిచ్చి తోడ్పడుచు బ్రహ్మశ్రీ రామమూర్తిశాస్త్రిల్లువారున్ను చక్కగ సేవ చేసిరి.

ఇందు దీక్షితులందరు మహాపండితులు, స్వతసిద్ధమైన జ్ఞాన, భక్తి, వైరాగ్య సంపన్నులు, నిష్కాములు. వీరందరు ఈమహోత్సవ నిర్వహణములో బాధ్యతను స్వయముగ వహించి దీనిని చక్కగ అనుష్ఠించి ఆదర్శ పాత్రులు కాగలిగిరి.

ఈ మహోత్సవమునకై గాను రాజమహేంద్రవరప్రాంతమున 5, 6 ఎకరముల పొలముల లోను, పార్కులులోను, తోటలులోను, పెద్దపెద్ద దొడ్లలోను తులసిచెట్లు పెంచబడి వాని దళములు తెచ్చి సమర్పింపబడుచుండెను. మరియు అనేకమంది గృహస్థుల యిండ్లలోను తులసి పెంచబడి వానిదళములు తెచ్చి సమర్పింపబడుచుండెను. శీతానగరము, వడిశలేరు, తణుకు, పాలకోడు ఇత్యాది గ్రామములనుండి తులసీదళములు విరివిగ తెచ్చి సమర్పించబడుచుండెను. ఇవిచాలక ప్రతినిత్యము సుమారు 4, 5 లక్షలదళములు మదరాసునుండి కొని తెప్పించబడుచుండెను.

మదరాసులో వలయు తులసిని ఖరీదుచేసియు అందులకు వలయు సొమ్మును తాము అడ్వాన్సుచేసియు, దానినంతను ప్యాకు చేయించి సకాలములో ఈమహోత్సవ కార్యక్రమమునకు అందునటుల జేసియు సహాయము జేసిన శ్రీవిశిష్టాద్వైత ప్రచారకసంఘ మదరాసుశాఖాధ్యక్షులగు శ్రీమాన్ మట్టపల్లి రంగనాథయ్యగారున్ను కార్యదర్శులగు శ్రీమాన్ కరాళపాటి రాధాకృష్ణయ్యగారున్ను; మరియు శ్రీమాన్ నంజుడయ్యగారున్ను స్తవనీయులు.

ఇట్లు,

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము.



శ్రీమతే రామానుజాయ నమః

## శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ వార్షిక విరాట్ సమావేశము

### రాజమహేంద్రివరము



తూర్పుగోదావరిజిల్లా రాజమహేంద్రివరమున శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘముయొక్క ద్వాదశ వార్షిక విరాట్ సమావేశము కోరుకొండ - శ్రీరంగవాస్తవ్యులగు శ్రీ ఉ. వే. శ్రీమాన్ పరాశర సుదర్శన భట్టరు అయ్యావార్లంగారి అధ్యక్షతను మహావైభవముగా జరుపబడినది.

ది 11-4-53 తేదీని కార్యకారిణి సమితియొక్కయు 12, 13 తేదీలలో విషయ నిర్ణయసమితియొక్కయు 14,15,16 తేదీలలోవార్షిక విరాట్ సభయొక్కయుసమావేశములు జరుపబడెను.

దక్షిణ భారతదేశమందలి అన్ని ప్రాంతములనుండియు సుమారు 500 మంది ప్రతినిధులు విచ్చేసి యిందు పాల్గొనిరి. నూతన కార్యకారిణిసమితి ఎన్నుకొనబడెను. ఈసంఘముయొక్క భావి కార్యక్రమమును గూర్చి ఆలోచించబడెను

శ్రీమతే రామానుజాయనమః

# శ్రీ యతిరాజ సేవా మహిళా మండలి

## వార్షిక విరాట్ సభ నివేదిక, రాజమహేంద్రవరము.

---

తూర్పుగోదావరి జిల్లా రాజమహేంద్రవర పట్టణమున ది 9—4—1951 తేదీ నుండి అయిదురోజులున్ను శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘముయొక్క శ్రీశాఖయగు శ్రీయతిరాజ సేవామహిళా మండలియొక్క వార్షిక విరాట్‌సభ అత్యంత జయప్రదముగ జరుపబడెను.

శ్రీమతి ముడుంబై రంగనాయకమ్మగారు ఆహ్వాన సంఘాధ్యక్షురాలుగను, శ్రీమతి ముడుంబై రామానుజమ్మగారు కార్యదర్శినిగను, శ్రీమతి సత్యవతమ్మగారు కోశాధికారిణిగను యుండి ఈసభను అత్యంత నిపుణతతో చక్కగా నిర్వహించిరి

నెల్లూరు, ఒంగోలు, చీరాల, బందరు, గుంటూరు, విజయవాడ, తెనాలి, రేపల్లె, ముక్తిపల్లి, అల్లూరు, తాడినాడ, కొవ్వూరు, భీమవరం, నరసాపురం, పాలకొల్లు, రేలంగి, తిరుపతిపురం, కాకినాడ, పెద్దాపురం, ఆర్తమూరు, తాపేశ్వరం, మండపేట, వేకేరు, తుని, పిఠాపురం, అనకాపల్లి, విశాఖపట్టణం, సింహాచలం, కోదుకొండ, నూజివీడు, గుడివాడ, తిరుపూరు, జగ్గయ్యపేట, విజయనగరం, శ్రీరామతీర్థం, పద్మనాభం, శ్రీకూర్మం, తంగుటూడిల్లి, బొబ్బిలి, వరంగల్లు, హైదరాబాదు, పసలపూడి, తంటికొండ, కొత్తకోట, జేగురుపాడు, శీతానగరము, దొడ్డిపట్ల, పెనుగొండ, పెంటపాడు, మదరాసు, అనపర్తి, వగైరా అనేకగ్రామములనుండి ప్రతినిధులు విచ్చేసిరి.

మొదటిదినమున మధ్యాహ్నము రెండు గంటలకు బ్రహ్మాండమైన పందిరిక్రింద భగవత్ప్రార్థనలతో శ్రీమతి మరింగంటి శీతమ్మగారి (బందరు) అధ్యక్షతక్రింద సభప్రారంభింపబడెను.

అనేకమంది విదుషీమణులు చక్కటి వేదాంత విషయములను ఉపన్యసించిరి.

మూడవనాడు శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ కార్యదర్శులు విచ్చేసి ఈసంఘముయొక్కయు, ఈమండలియొక్కయు ఆదర్శ, ఉద్దేశ, లక్ష్య, ఆచరణ, ప్రమాణ, సభ్యత్వ కార్యక్రమములగూర్చి వివరముగ తెలియజేసిరి. జిజ్ఞాసువుల ప్రశ్నలకు సముత్తరముల నిచ్చిరి. ప్రతిగ్రామమునందును ఈ మండలికి శాఖాసంఘముల స్థాపించవలసినదిగను, ఈసంఘ కార్యక్రమమును ఉత్సాహముగను, విరివిగను, పటిష్ఠముగను జరుపుచుండవలసినదిగను, ఒక్కొక్క శాఖాసంఘమువారు, ఒక్కొక్కపుస్తకము చొప్పున శ్రీఅష్టాదశ రహస్యమూల గ్రంథములను విడివిడిగా 18గ్రంథములుగ తమపేరున ప్రచురించవలసినదిగను కార్యదర్శిగారు హెచ్చరించిరి.

ఈసభలలో ఉపన్యసించిన విదుషీమణులు

1 శ్రీమతి అమరవాది వెంకట లక్ష్మీ నరసమ్మగారు (నరసాపురము)
2 ,, శాబలూరి చూడికొడుతమ్మగారు (నరసాపురము)
3 ,, ముడుంబై రామానుజమ్మగారు (రాజమహేంద్రవరం)
4 ,, మరంగంటి రంగనాయకమ్మగారు (కోదుకొండ)
5 ,, నల్లందిఘల్ లక్ష్మీనరసమ్మగారు (బందరు)
6 ,, మరంగంటి సీతమ్మగారు (మచిలీపట్టణము)
7 ,, మరింగంటి విరాట్టమ్మగారు (బందరు)
8 ,, దొడ్డిపట్ల నరసమ్మగారు (దొడ్డిపట్ల)
9 - బందరు సీతమ్మగారు (బందరు)
10 - రామినేడి రామాయమ్మగారు (పెనుగొండ)
11 - నల్లానిచక్రవర్తుల పెరుందేవి తాయారమ్మగారు (రాజమహేంద్రవరం)
12 - కందాళ తాయారమ్మగారు (శ్రీరామతీర్థం)
13 - కరిలక్ష్మీ నరసమ్మగారు (సింహాచలం)
14 - దువ్వూరి సుబ్బమ్మగారు (రాజమహేంద్రవరం)
15 - ముడుంబై భానుమతీదేవిగారు (రాజమహేంద్రవరం

ది 13-4-51 తేదీని వచ్చిన శుక్రవారమున స్త్రీలందరు కలిసి శుక్రవారోత్సవమును మహావైభవముగా జరిపిరి.

శ్రీయతిరాజసేవా మహిళా మండలి వార్షిక విరాట్ సభయొక్క జమ ఖర్చులు.

రాజమహేంద్రవరము

9-4-51 నుండి 13-4-51

విరాళముల జమ-

| | |
|---|---|
| శ్రీమతి ముడుంబై రంగనాయకమ్మగారు | 10-0-0 |
| „ ముడుంబై రామానుజమ్మగారు | 10-0-0 |
| „ రామినీడి రాయాలమ్మగారు | 10-0-0 |
| „ దాసరి ఆండాళమ్మగారు | 10-0-0 |
| „ సుభద్రమ్మగారు | 10-0-0 |
| „ ద్వారం చిన్నమ్మగారు | 10-0-0 |
| „ స, చ, తాయారమ్మగారు | 10-0-0 |
| „ రామినీడి రామాయమ్మగారు | 10-0-0 |
| „ సున్న లక్ష్మితాయారమ్మగారు | 5-0-0 |
| „ గ్రంధి రాజ్యలక్ష్మిగారు | 5-0-0 |
| „ గ్రంధి మహాలక్ష్మమ్మగారు | 5-0-3 |
| „ పేరూరి నాగరత్నంగారు | 5-0-0 |
| „ రా, సు— | 5-0-0 |
| „ రామయ్యమ్మగారు | 5-0-0 |
| „ గ్రంధి వెంకటసుబ్బమ్మగారు | 5-0-0 |
| „ పోతుల సూర్యకాంతమ్మగారు | 5-0-0 |
| „ పోతనశెట్టి మహాలక్ష్మిగారు | 5-0-0 |
| „ చిన్నం ఆదెమ్మగారు | 5-0-0 |
| „ చిర్ల సుబ్బయమ్మగారు | 5-0-0 |
| „ తాడి గంగమ్మగారు | 5-0-0 |
| „ ముడుంబై అచ్యుతవేదవల్లిగారు | 4-0-0 |
| „ పెరుమాళ్ళ సూర్యకాంతమ్మగారు | 3-0-0 |
| „ గ్రంధి రత్నమ్మగారు | 3-0-0 |
| „ అనుమాలశెట్టి వెంకటరత్నంగారు | 3-0-0 |
| „ కుమ్మరిగుంట పుల్లమ్మగారు | 2-0-0 |
| „ గొల్లపూడి సీతారత్నంగారు | 2-0-0 |
| „ నాళం సుబ్బలక్ష్మిగారు | 2-0-0 |
| „ కొల్లా అప్పలనరసమ్మగారు | 2-0-0 |
| „ జూపూడి అంజమ్మగారు | 2-0-0 |
| „ వారణాశి నూకరాజుగారు | 2-0-3 |
| „ స, చ, జగన్నాధవల్లితాయారుగారు | 2-0-0 |
| „ ఇటికిరాల అలివేలుగారు | 2-0-0 |
| „ అమరవాది మంగమ్మగారు | 2-0-0 |
| „ స, చ, మాతమ్మగారు | 2-0-0 |
| „ ఉదాసు కామేశ్వరమ్మగారు | 2-0-0 |
| „ వడిపిల్లి రత్నాలుగారు | 2-0-0 |
| „ అవికొండ తాయారమ్మగారు | 2-0-0 |
| „ పాలకోడేటి మంగమ్మగారు | 1-0-0 |
| „ చిట్టూరి సుభద్రమ్మగారు | 1-0-0 |
| „ స, చ, వెం. రామానుజమ్మగారు | 1-0-0 |
| „ బూరగడ్డ సూర్యకాంతమ్మగారు | 1-0-0 |
| „ వెత్సా రాఘవమ్మగారు | 1-0-0 |
| „ వెత్సా కల్యాణిగారు | |
| „ కొత్త కనకరత్నంగారు | 1-0-3 |
| „ భక్తురాండ్ర సమర్పణము | 36-0-0 |
| మొత్తము రాబడి | 221-1-0 |

ఖర్చులు

| | |
|---|---|
| ఉత్తరము వ్రాయు కాగితములు, కార్డులు-కవర్లు అచ్చునకు | 20-0-0 |
| ఆహ్వాన పత్రికల అచ్చునకు | 15-0-0 |
| పోస్టేజి | 20-0-0 |
| ఉత్సవములకు ఏకు బళ్ళ బాడుగలు | 8-0-0 |
| చందాలకై అనుకూల ప్రయాణములకు | 5-0-0 |
| ఉపన్యాసకురాండ్రకిచ్చిన ప్రయాణపు ఖర్చులు | 62-0-0 |
| ఫొటోకు-బ్లాకులకు | 20-0-0 |
| నివేదిక ప్రచురణకు | 40-0-0 |
| సప్లైయిలు వగైరా ఖర్చులు యావత్తు | 25-0-0 |
| కార్యదర్శినియగు శ్రీమతి ముడుంబై రామానుజమ్మ గారివద్దయున్న నిల్వ | 5-9-0 |
| | 221-1-9 |

శ్రీయుతిరాజసేవా మహిళా మండలి యొక్క రాజమహేంద్రవరపు శాఖవారు అష్టాదశ రహస్యములలో మొదటిదియగు ముముక్షుపడిని తమ సంఘము తరఫున ప్రచురించుటకు వాగ్దానము జేసిరి. ఇందు నిమిత్తమై యిప్పటికి వాగ్దానము జేసినవారి తిరునామములు

శ్రీమతి ముడుంబై రామానుజమ్మగారు
,, అమరవాది వెంకటలక్ష్మీనరసమ్మగారు
,, రామినీడి రాయాలమ్మగారు
,, ముడుంబై రంగనాయకమ్మగారు

ఇత్యాదులు.

శ్రీ



శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ వైశాఖ మాస పండిత సభ

## ★ ఆహ్వాన పత్రిక ★

(నరసాపురము — పశ్చిమగోదావరి జిల్లా.)

స్వస్తిశ్రీ ఖరనామ సంవత్సర వైశాఖ శుద్ధ విదియా మంగళవారము (ది 8-5-51) మొదలు మూడు దినములు వరుసగా పశ్చిమగోదావరిజిల్లా నరసాపురం గ్రామములోని శ్రీ ఎంబెరుమానార్ స్వామివారి కోవిలలో న్యాయ వేదాంత వాచస్పతి శ్రీ. ఉ. వే. శ్రీమాన్ తె. కం. రామానుజాచార్య స్వామివారి అధ్యక్షత క్రింద శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ (ఖర సం॥రం) వైశాఖ మాస పండిత సభ జరుపబడి అనేకమంది పండితులచే వివిధ వేదాంత విషయములు ఉదయమున గం 7-30 మొదలు గం 10-30కున్ను సాయం. గం 4-0 మొదలుగం 7-0వరకున్ను ప్రతిదినము ఉపన్యసించబడును.

మరియు ప్రతిదినము మధ్యాహ్నము గం 2-0 నుండి గం 4-0 వరకు శ్రీయతిరాజాశ్రమమున శ్రీయతిరాజ సేవా మహిళామండలి వారిచే స్త్రీలకై ప్రత్యేకము వేదాంత సభలు ఏర్పాటు చేయబడి వారికై ప్రత్యేకము విదుషీమణులచే ఉపన్యసింపబడును.

మరియు 1-5-51 తేదీ మొదలు 7-5-51 తేది వరకు ఈ కోవిలయందే తాయారు సన్నిధియందు ఉదయం గం 8-0 నుండి గం 10-0 వరకు ప్రతిదినము శ్రీ ఉ. వే. శ్రీమాన్ ఈయున్ని రాఘవాచార్యులు గారిచే ప్రపన్నామృతములోని శ్రీరామానుజ చరిత్ర కాలక్షేపము గావింపబడును.

గాన భక్తులెల్లరు విచ్చేసి యుండ ప్రార్థన గోరుచున్నారము.

ఇట్లు.

నరసాపురము
28-4-51

శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ నరసాపురము శాఖ,
శ్రీ ఎంబెరుమానారుస్వామివారి దేవస్థాన
కైంకర్య పరులు.

# సన్మానము

విజయవాడ వాస్తవ్యులును, వైశ్యశిఖామణులును అగు॥ శ్రీమాన్ ఉదయగిరి కృష్ణారావుగారు భక్తి "నివేదన" పత్రికకు శ్రీ ఖరనామ సంవత్సరమున ఉగాదినాడు రూ. 116-0-0 లు కానుకను భక్తిపురస్సరముగ సమర్పించిరి.

వీరికి శ్రియఃపతి ఆయురారోగ్య భాగ్య భోగ్య భగవద్భాగవతాచార్య కైంకర్యానిరతులనిచ్చి రక్షించుగాక.

శ్రీమతే రామానుజాయనమః



## —: సన్మానాక్షతములు :—



ఓ శ్రియఃపతీ!

దాసోహము. నీయొక్క నిర్హేతుక జాయమాన కటాక్షవిశేషముచే, నీవు సంకల్పించుకొని, నీవు నడిపించుచున్న, నీ కైంకర్యరూపమైన నీకు సమర్పణరూపమైన భక్తి "నివేదన" పత్రిక రెండు సంవత్సరములు గడుప గలిగినది. మూడవ వత్సరమున ప్రవేశించుచున్నది. నీ ఈ వాఙ్మయ కైంకర్యమందీ చేతనుల ఈవిధముగ నీవు ఉపయోగించు కొనుచున్నందులకు మా హృదయపూర్వక కృతజ్ఞతా పూర్వక ధన్యవాదములు.

ఓస్వామీ! ఇక ముందుకూడ ఇతోధికముగ ఈదాసులచే నీ కైంకర్యమును చేయించుకొనుచు కటాక్షించుమా!

దాసులు

భక్తి "నివేదన" సంపాదకవర్గము.

శ్రీమతే రామానుజాయనమః

# సవినయ వినతులు

ప్రియపాఠక మహాశయులారా!

మా హృదయపూర్వక ధన్యవాదములు. ఈ పత్రికా పుత్రిక ఈ రెండు వత్సరముల నుండి ఎటుల యున్ననూ క్షమాస్వరూపులగు తాము దీనిని ఆదరించుచున్నారు.

ఇందుల కెంతయు కృతజ్ఞులము.

ఈ మాసముతో దీనికి మూడవ సంవత్సరము ప్రారంభమగుచున్నది. ఇది అనేకానేక విధముల అభివృద్ధి చెందవలెనని ఎంతయో ఆశించుచున్నది. భగవత్కటాక్షమున్ను భాగవత యాదరణమున్ను కావలయును. వాని కెంతమాత్రము కొఱవయుండదని నమ్ముచున్నాము.

ఈ చైత్రమాసమునకు తమకు క్యాలండరు, పంచాంగమును అందజేసుకున్నాము. అయినను ప్రచారవిశేషముల తెలుపవలెనని ఈ సంచికను కూడ తమకందజేయు చున్నాము. వచ్చే నెలనుండి మామూలు ప్రకారము అన్నివిషయములతోను కూడుకొని పత్రిక తమ హస్తమలంకరించగలదు. ఆర్థికముగ పత్రిక చాల బాధపడుచున్నది. దయయుంచి ప్రతిపాఠకులు కనీసము మరి ముగ్గురు చందాదారులనైనను చేర్పించి పత్రికాభివృద్ధికి తోడ్పడ సవినయముగ ప్రార్థించు చున్నారము.

ఇట్లు,

భక్తి "నివేదన" సంపాదకవర్గము.

★ ప్రచార విభాగము



శ్రీమతే రామానుజాయనమః

6—4—1951 తేదీ నుండి 21—4—1951 తేదీ వరకు

రాజమహేంద్రవరమున జరిగిన

# శ్రీ మహావిష్ణు కోటి తులసీ దళ పూజా మహోత్సవము

యొక్క వివరములు:

శ్రీ వికృతి నామ సంవత్సర పుష్య బహుళ త్రయోదశి మొదలు మూడు దినములు పాలకొల్లులో జరుపబడిన శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ కార్యకారిణి సమితివారిచే రాజమహేంద్రవరమున ది 6-4-1951 తేదీనుండి 15 దినములు ఈసంఘాధ్వర్యమున శ్రీమహావిష్ణు కోటి తులశీ దళ పూజా మహోత్సవమును, నిష్కామతయా, విశ్వకల్యాణార్థమై జరిపించుటకు ఈమహోత్సవాహ్వాన సంఘమువారి యాహ్వాన మంగీకరించబడి తదనుసారముగా జరుపబడినది.

ఈ మహోత్సవమును ఆహ్వాన సంఘము వారు అత్యంతమహావైభవముగా నిర్వహించిరి. ఇందు నిమిత్తమై వీరు బ్రహ్మాండమగు చక్కని ఏర్పాట్లు గావించిరి.

ఈ మహోత్సవమున ఇంచుమించు దక్షిణ హిందూదేశమందలి వేలకొలది భక్తులెల్లరు పాల్గొనిరి. పండితులందరు దీక్షితులుగను, ఉపన్యాసకులుగను పాల్గొనిరి. ఇది వక అపూర్వమైన క్రతు విశేషము. ఇట్టిది ఈ ప్రాంతమందింతవరకు ఎప్పుడును జరిగియుండలేదు.

ఈ క్రతువు నిమిత్తమై రాజమహేంద్రవరమున ఇన్నీసుపేటలో సుమారు 500 గజముల పొడవు 75 గజములు వెడల్పుగల పెద్ద ప్రత్యేక పందిరి నిర్మించబడెను. అందు ఉత్తరపు కొనను దక్షిణపుకొనను 4, 5 వందల మంది దీక్షితులు కూర్చొనుటకువీలగునట్టి పెద్దపెద్ద వేదికలు రెండు నిర్మించబడెను. ఆవేదికలు ప్రత్యేక శిల్పులచే చిత్రవిచిత్ర శిల్పకళానిపుణతతో, తోరణ, మాలికా, వితాన, చిత్రములచే అత్యంత మనోహరముగ అలంకరించబడెను.

పందిరియంతయు విద్యుద్దీపమాలికలచే కోటి సూర్యప్రభా సమన్వితముగ అలంకరించబడెను. మరియు శబ్దవిస్తరిణీ యంత్రములు విస్తారముగ అమర్చబడెను. అర్చనమంటపము, ఆరాధనమంటపము, హోమమంటపము, పూజామంటపము, ఉపన్యాసమంటపము, పారాయణ మంటపము, భజనమంటపము ఇత్యాదులచే పందిరియంతయు విరాజిల్లుచుండెను.

దక్షిణపు వేదికపై అర్తిమూరు నుండి వేంచేసిన శ్రీ శ్రీనివాస పెరుమాళ్లును; ఉత్తరపు

వేదికపై వడిశలేరునుండి వేంచేసిన శ్రీ భక్త నారాయణస్వామివారున్ను వేంచేసియుండిరి.

శ్రీ వికృతి సం. ౪౦. ఫాల్గుణ బ ౩౦ శుక్ర వారమునాడు సాయంకాలము అర్థమూరు వడిశలేరు పెరుమాళ్లు రాజమహేంద్రవరము లోని శ్రీ వేణుగోపాలస్వామివారి కోవిలలోకి భక్తబృందమంతటితో కలిసి వేంచేశి వారి యనుజ్ఞను తీసుకొని, గరుడవాహనారూఢులై ఛత్రచామరాదిలాంఛన లాంఛితులై ఆళ్వార్లు ఎంబెరుమానార్లు రజత పల్లకిపై వెంటరాగా, భాగవతబృందమంతయు, భజనలు, వేద, ఉపనిషత్ ప్రబంధాధ్యయనాదులు సలుపుచుండ గ్రామ ప్రదక్షిణముచేయుచు, మృత్సంగ్రహణము చేసుకొని రాత్రి గం 8-0 కు యాగశాల ప్రవేశ మొనరించిరి. పిమ్మట అంకురారోపణము, ధ్వజారోహణము, వాస్తుపూజ, వాస్తుహోమము పర్యగ్నికరణము, బలిప్రదానము జరుపబడెను.

శ్రీ ఖరనామసంవత్సర చైత్ర శుద్ధ పాడ్యమి శనివారము ఉదయముననే దీక్షితుల బసయగు శ్రీనాళమువారి సత్రమున ప్రత్యేక తిరువారాధన, తీర్థవినియోగాదులు పూర్తియై, భాగవత గోష్ఠియంతయు తిరువీధ్యుత్సవముతో యాగశాలకు వెళ్ళిరి. ఈగోష్ఠిలో రజత ఆందోళిక యందు శ్రీనమ్మాళ్వార్లు ఉడయవర్లు వేంచేపు చేయబడిరి. వారి కిరుపార్శ్వములయందును, రజిత వేత్రహస్తులు సూర్య, చంద్రులు; ఛత్ర చామరములు యుండెను. గోష్ఠికి అగ్రభాగమున మేళతాళములు, పిమ్మట భజయతిరాజ భజన, పిమ్మట ప్రబంధగోష్ఠియు ఆళ్వారెంబెరుమానార్లకు వెనుక వేదగోష్ఠి, ఉపనిషత్ పారాయణ, శ్రీవిష్ణుసహస్రనామస్తోత్ర పఠనము, భజన క్రమముగా నడచుచుండెను. ఈగోష్ఠి సుమారు 2 ఫర్లాంగులదూరమువరకు వ్యాపించియుండెను.

ప్రతిదినము ఉదయమున ఈగోష్ఠియొక్క పురప్పాట్టు యిటులనే జరుగుచుండెడిది.

మధ్యలో గుంటూరులోని శ్రీరామనామక్షేత్ర కార్యకర్తలు విచ్చేసిరి. వారు తమ రామనామ సంపుటిక శకటమును గోష్ఠికి ముందుగ నడిపించుచు భగవన్నామమును జనేదిక్కుల మారు మ్రోగునట్లు, జేయుచుండిరి.

యాగశాలలో శ్రీస్వామి వారికున్ను, దీక్షితులకున్ను కార్యకర్తలకున్ను ప్రతిసరబంధనపురస్సరముగ, దీక్షావస్త్ర సమర్పణముతో దీక్ష యొసంగబడెను.

ఇందు 170 మంది తులసీదళ అర్చన దీక్షితులుగను, 4 గురు ఆరాధన దీక్షితులుగను, 24 శ్రీరామాయణపారాయణ దీక్షితులుగను, 8గురు శ్రీమద్భాగవతపారాయణదీక్షితులుగను, 1 రు శ్రీవిష్ణుపురాణపారాయణ దీక్షితులుగను, 1 రు భగవద్గీతా పారాయణ దీక్షితులుగను.

12 గురు చతుర్వేద పారాయణ దీక్షితులుగను, 7 గురు ద్రావిడ వేదాధ్యాయన దీక్షితులుగను, 5 గురు మంత్రజపదీక్షితులుగను, 1 రు ప్రత్యేక సుందరకాండ పారాయణ దీక్షితులుగను, 9 గురు ఋత్విక్ దీక్షితులుగను, 6 గురు తళిహాకైంకర్య దీక్షితులుగను, 12

నుండి సకలకార్య నిర్వహణ దీక్షితులుగను దీక్ష వహించిరి.

వీరందరు నానావిధ కార్యనిర్వహణార్థై వేరు వేరుగా నేర్పరచిన ప్రదేశములలో తమ తమ కార్యములను సకాలమున ప్రారంభించి రెండు వేళలయందును సక్రమముగను, నిర్విఘ్నము గను, చివరవరకు నిర్వహించిరి.

త్రికాల దశ అర్చన దీక్షితులందరు ఇరుపార్శ్వములయందలి రెండు ఉన్నత వేదికలయందును అచ్చటి పెరుమాళ్ళను రెండు నైపుల యందును బారులుతీర్చి కూర్చుని, తిరుమంజనము చేయబడిన ప్రతిష్ఠిత శ్రీసుదర్శనునకు మహాయంత్రమునకు తులసీదళములతో పూజను సలుపుచుండిరి.

వీరిలో ఒకరు పెరుమాళ్ళ సన్నిధిలో శబ్ద విస్తరిణీయంత్రము ముందర కూర్చొని శ్రీమహా విష్ణు సహస్రనామములను ఒక్కొక్కదానినే సావకాశముగ గట్టిగ చెప్పగా రెండు వేదికల యందును యున్నట్టి అర్చనాదీక్షితు లందరును కూడ ఆనామములను క్రమముగా అనువదించుచు ఒక్కొక్క నామమునకు ఒక్కొక్క దళము చొప్పున యంత్రముపై సమర్పించుచు చక్కగా పూజల నొనర్చుచుండిరి.

ఈ నామములను అచ్చట యున్నట్టి భక్తు లందరు కూడ అనువదించుచుండిరి. మరియు కొంతమంది భక్తులు వేదికక్రింద తమ కేర్పరు పబడిన ప్రత్యేక స్థలమున సుఖాసీనులై తమ కివ్వబడిన ప్రతిమాయంత్రముల తమముందుం చుకొని ఈ నామములనే అనువదించుచు తులసీ దళములతో పూజల సలుపుచుండిరి.

ప్రతిదినము హోమశాలలోని స్వాహాకార ములతోను, పారాయణమంటపమందలి పారా యణాదులతోను, సంస్కృత - ద్రావిడ వేద- వేదాంత అధ్యయనాదులతోడను కలిసి పందిరి యొక్క రెండు అగ్రములయందలి వేదికలనుండి శ్రీవిష్ణు సహస్రనామముల ఘోష ఈ 14 రోజులు రాత్రింబగల్లు దిగంతముల వ్యాపించి కల్యాణ ప్రదముగానొనర్చుచుండెను. ఇది యొక అపూర్వ సన్నివేశము. అత్యద్భుత సమావేశము. అనుప మాన సంఘటనము.

ప్రతిదినము ఉదయమున గం 8-0 లగాయతు గం 12 వరకు ఉపన్యాస మంటపమున మొదట ఎనిమిది దినములు శ్రీరామాయణము, పిమ్మట చివరివరకు శ్రీమద్భాగవతము కాలక్షేపము జరుపబడుచుండెను. మధ్యాహ్నము గం 12లకు మహానివేదన, మంగళాశాసనము, శాత్తుమొఱై జరుపబడుచుండెడిది. మధ్యాహ్నము గం 2-0 లగాయతు గం 4-0 వరకు శ్రీయతిరాజసేవా మహిళామండలివారిచే స్త్రీలకై ప్రత్యేకము విదుషీమణులచే వేదాంతోపన్యాసము లిప్పించ బడుచుండెను.

సాయం గం 4-0 మొదలు గం 6-30 వరకు సుప్రసిద్ధ పండిత ప్రకాండులచే వివిధ వేదాం తోపన్యాసము లివ్వబడుచుండెను.

రాత్రి గం 6-30 నుండి గం 7-30 వరకు ఉత్తరపు నైపునయున్న

అర్చనామంటపమున దీక్షితు లందరున్ను అప్పటికి విచ్చేసిన భక్తులందరున్ను కలిసి శ్రీ విష్ణుసహస్రనామస్తోత్ర సమష్టిపారాయణము జరిపించుచుండిరి.

ఈ కార్యక్రమము అతి విలక్షణమైనది. ఆదేసమయమున ఉపన్యాస మంటపమున శ్రీ నౌడూరి విశ్వనాథశాస్త్రిగారు మున్నగువారిచే తరంగములు, అష్టపదులు, ఆధ్యాత్మ కీర్తనలు ఇత్యాదులను కాలక్షేపములు చేయుచుండిరి.

అదేసమయమున అర్చనామంటపములు రెండింటియందును శ్రీలక్ష్మీ సహస్రనామములతో కుంకుమపూజయు అది అయిన పిమ్మట సేవాకాలము అటుపిమ్మట ఆరగింపు, మంగళాశాసనము, శాత్తుమొఱ జరుగుచుండెడిది.

శాత్తుమొఱ సమయములో శ్రీస్వామివారి సన్నిధిని ఆనాడు జరిగిన సంస్కృత, ద్రావిడ వేదాధ్యయనములయొక్కయు, శ్రీరామాయణ శ్రీభాగవత, శ్రీవిష్ణుపురాణ, శ్రీభగవద్గీతాదుల యొక్కయు అంతిమభాగములు శాంతిపాఠములు ఆయాదీక్షితులచే విన్నవించబడుచుండెను.

పిమ్మట యజ్ఞాచార్యులచే క్షమాప్రార్థనాపురస్సరముగా మహదాశీర్వాద ప్రార్థనముచేయబడుచుండెను. పిమ్మట తీర్థప్రసాదవినియోగము జరుగుచుండెడిది. ఈపదునాలుగు దినములు రాత్రింబవళ్ళు ఒకనిమిషమైనను విడువకుండగ భజనమందిరమున భగవన్నామ అఖండ సంకీర్తనము జరుగుచుండెడిది.

ప్రతిదినము రాత్రులందు గం. 8-0 నుండి సుప్రసిద్ధ హరిదాసులచే హరికథాకాలక్షేపములు గావింపబడుచుండెను.

ఇందు మహారాష్ట్రమునుండి విచ్చేసిన ఒక సాధుపుంగవులచే భజనరూపముగ గావింపబడిన భక్తి ప్రబోధము యపారము. వీరికాలక్షేపము పాషండులసైతము భక్తశిఖామణులుగ మార్చివైచెను.

ప్రతిదినము తెల్లవారుఝామున గం. 4-0 లకు శ్రీ నౌడూరి విశ్వనాథశాస్త్రిగారిచే శ్రీస్వామివారి సుప్రభాతోత్సవము మహావైభవముగా గావింపబడుచుండెడిది. దీనివైభవము వర్ణనాతీతము.

ఇట్టివిధముగ 14 దినములు మహావైభవముగా 1,12,00000 తులసీదళ పూజ, శ్రీమహావిష్ణు సహస్రనామావళితో జరుపబడెను.

ఈ మధ్యలో ఆయాపారాయణ ఘట్టములు వచ్చినప్పుడు, శ్రీసీతాకల్యాణోత్సవము, పాదుకాపట్టాభిషేకోత్సవము, చూడామణి ప్రధానోత్సవము శ్రీరామ పట్టాభిషేకోత్సవము, చివరకు శ్రీరుక్మిణీకల్యాణోత్సవము అత్యంత వైభవముగా జరుపబడెను.

ది 21-4-51 ఉదయముననే పూర్ణోత్సవ, వసంతోత్సవానంతరమున మేళతాళములతోను భాగవతగోష్ఠితో సహా శ్రీశఠారిని ఊరేగింపుతో గోదావరినదియొక్క పుష్కరముల రేవునకు తెచ్చిచేసుకొనివచ్చి అవభృథోత్సవము అత్యంతవైభవముగా జరుపబడెను.

ఈఉత్సవములో భక్తులు జూపిన ఉత్సాహామునకు, పొందిన ఆనందమునకు మేరలేదు. సరిగా అవభృథోత్సవ సమయమునకే బట్టతమష్ట చినుకులను ఆగోష్ఠియున్న ప్రదేశమందు మాత్రము కురిపించి దేవతలుకూడ ఈఉత్సవ కైంకర్యాన్వయమును, తత్ప్రీయుక్తానందమును అనుభవించిరి.

ఆనాటి మధ్యాహ్నముననే శ్రీరుక్మిణీకల్యాణ మహోత్సవము జరిపిరాత్రిదిక్షితుల సన్మానాదుల సమర్పణముతో ఈమహోత్సవము ముగిసెను. ఇంతటిశ్రద్ధాభక్తులతోను ఇంతవైభవముగను నిర్వహించిన ఈమహోత్సవ ఆహ్వాన సంఘము వారుమిక్కిలి స్తవనీయులు.ఇందులోనుసంకల్పము నాటినుండి సమాప్తి వరకు ఆహార నిద్రలు ఎరుగకుండగ విధివిరామములు లేకుండగ, తిరుప కట్టె కైంకర్యము మొదలుకొని తిరునామ సంకీర్తన కైంకర్యము వరకు సమస్త కైంకర్యములను స్వయముగ జరిపి ఈమహోత్సవ సఫలతకు ప్రధాన కారకులైన ఆహ్వానసంఘ కార్యదర్శులైన శ్రీమాన్ క. వరదారావుగారున్ను శ్రీమాన్ పినిశెట్టి ఆదినారాయణమూర్తి గారున్నూ ఈఉత్సవ ప్రబోధకులును అత్యంత సౌజన్యమూర్తులును యగు శ్రీమాన్ మాణిక్యం సుబ్బారాయుడుగారున్ను అత్యంత స్తవనీయులు,

ఈఉత్సవనిర్వాహణములో స్థానికాధి కార్లందరున్ను, పురపాలక సంఘము వారున్ను, పౌరులున్ను అత్యంతము తోడ్పడిరి. వాలంటీర్లు చక్కగ తమవిధిని నిర్వహించిరి.

ప్రతిఫలమును తీసుకున్నను, శబ్దవిస్తరిణీ యంత్రాధికారులున్ను, విద్యుద్దీప ప్రకాశకులున్ను భక్తిశ్రద్ధలతో పనిచేసిరి.

తమ యింజనీరింగు అనుభవమును చక్కగా వినియోగించి శ్రీకృష్ణమూర్తిగారున్ను,

దగ్గరియుండి అన్నివిషయములను పరిశీలించుచు సలహాలనిచ్చి తోడ్పడుచు బ్రహ్మశ్రీ రామమూర్తి శాస్త్రిల్లువారున్ను చక్కగ సేవ చేసిరి.

ఇందు దీక్షితులందరు మహాపండితులు, స్వతస్సిద్ధమైన జ్ఞాన, భక్తి,వైరాగ్య సంపన్నులు, నిష్కాములు. వీరందరు ఈమహోత్సవ నిర్వాహణములో బాధ్యతను స్వయముగ వహించి దీనిని చక్కగ అనుష్ఠించి ఆదర్శ పాత్రులు కాగలిగిరి.

ఈ మహోత్సవమునకు గాను రాజమహేంద్రవరప్రాంతమున 5, 6 ఎకరముల పొలముల లోను, పార్కులులోను, తోటలులోను, పెద్ద పెద్ద దొడ్లలోను తులసిచెట్లు పెంచబడి వాని దళములు తెచ్చి సమర్పింప బడుచుండెను. మరియు అనేకమంది గృహస్థుల యిండ్లలోను తులసి పెంచబడి వానిదళములు తెచ్చి సమర్పింపబడుచుండెను. సీతానగరము, వసిశలేరు, తణుకు, పాలకోడు ఇత్యాది గ్రామములనుండి తులసీదళములు విరివిగ తెచ్చి సమర్పించబడుచుండెను. ఇవిచాలక ప్రతినిత్యము సుమారు 4, 5 లక్షలదళములు మదరాసునుండి కొని తెప్పించబడు చుండెను.

మదరాసులో వలయు తులసిని ఖరీదుచేసియు అందులకు వలయు సొమ్మును తాము అడ్వాన్సుచేసియు, దానినంతను ప్యాకు చేయించి సకాలములో ఈమహోత్సవ కార్యక్రమమునకు అందునటుల జేసియు సహాయము జేసిన శ్రీవిశిష్టాద్వైత ప్రచారకసంఘ మదరాసుశాఖాధ్యక్షులగు శ్రీమాన్ ముట్టపల్లి రంగనాథయ్యగారున్ను కార్యదర్శులగు శ్రీమాన్ కరాళపాటి రాధాకృష్ణయ్యగారున్ను; మరియు శ్రీమాన నంజుండయ్యగారున్ను స్తవనీయులు.

ఇట్లు,

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము.



శ్రీమతే రామానుజాయ నమః

## శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ వార్షిక విరాట్ సమావేశము

### రా జ మ హేం ద్రి వ ర ము



తూర్పుగోదావరిజిల్లా రాజమహేంద్రివరమున శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘముయొక్క ద్వాదశ వార్షిక విరాట్ సమావేశము కోరుకొండ – శ్రీరంగవాస్తవ్యులగు శ్రీ ఉ. వే. శ్రీమాన్ పరాశర సుదర్శన భట్టరు అయ్యవార్లంగారి అధ్యక్షతను మహావైభవముగా జరుపబడినది.

ది 11–4–53 తేదీని కార్యకారిణి సమితియొక్కయు 12, 13 తేదీలలో విషయ నిర్ణయసమితియొక్కయు 14,15,16 తేదీలలోవార్షిక విరాట్ సభయొక్కయుసమావేశములు జరుపబడెను.

దక్షిణ భారతదేశమందలి అన్ని ప్రాంతములనుండియు సుమారు 500 మంది ప్రతినిధులు విచ్చేసి యుండిరి. నూతన కార్యకారిణిసమితి ఎన్నుకొనబడెను. ఈసంఘముయొక్క భావి కార్యక్రమమును గూర్చి ఆలోచించబడెను.

శ్రీమతే రామానుజాయనమః

# శ్రీ యతిరాజ సేవా మహిళా మండలి

## వార్షిక విరాట్ సభ నివేదిక, రాజమహేంద్రవరము.

---

తూర్పుగోదావరి జిల్లా రాజమహేంద్రవర పట్టణమున ది 9—4—1951 తేదీ మొదలు అయిదురోజులున్న శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘముయొక్క ఉపశాఖయగు శ్రీయతిరాజ సేవామహిళా మండలియొక్క వార్షిక విరాట్‌సభ అత్యంత జయప్రదముగ జరుపబడెను.

శ్రీమతి ముడుంబై రంగనాయకమ్మగారు ఆహ్వాన సంఘాధ్యక్షురాలుగను, శ్రీమతి ముడుంబై రామానుజమ్మగారు కార్యదర్శినిగను, శ్రీమతి సత్యవతమ్మగారు కోశాధికారిణి గను యుండి ఈసభను అత్యంత నిపుణతతో చక్కగా నిర్వహించిరి

నెల్లూరు. ఒంగోలు, చీరాల, బందరు, గుంటూరు. విజయవాడ. తెనాలి. రేపల్లె. ముక్త్యాల. అల్లూరు, తాడినాడ. కొవ్వూరు. భీమవరం. నరసాపురం. పాలకొల్లు. రేలంగి. తిరుపతిపురం. కాకినాడ. పెద్దాపురం. అర్తమూరు. తాపేశ్వరం మండపేట. పేకేరు. తుని. పిఠాపురం అనకాపల్లి. విశాఖ పట్టణం. సింహాచలం. కోరుకొండ. నూజివీడు. గుడివాడ. తిరువూరు, జగ్గయ్యపేట. విజయనగరం. శ్రీరామతీర్థం. పద్మనాభం. శ్రీకూర్మం. తంగుటూరు, బొబ్బిలి, వరంగల్లు, హైదరాబాదు. పసలపూడి, తంటికొండ. కొత్తకోట. జేగురుపాడు. శీతానగరము. దొడ్డిపట్ల, పెనుగొండ పెంటపాడు. మదరాసు. అనపర్తి. వగైరా అనేకగ్రామములనుండి ప్రతినిధులు విచ్చేసిరి.

మొదటిదినమున మధ్యాహ్నము రెండు గంటలకు బ్రహ్మాండమైన బందిక్రింద భగవత్ప్రార్థనలతో శ్రీమతి మరింగంటి సీతమ్మగారి (బందరు) అధ్యక్షతక్రింద సభప్రారంభింపబడెను.

అనేకమంది విదుషీమణులు చక్కటి వేదాంత విషయములను ఉపన్యసించిరి.

మూడవనాడు శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ కార్యకర్తలు విచ్చేసి ఈసంఘముయొక్కయు. ఈమండలియొక్కయు ఆదర్శ. ఉద్దేశ, లక్ష్య. ఆచరణ. ప్రమాణ, సభ్యత్వ కార్యక్రమములగూర్చి వివరముగ తెలియజేసిరి. జిజ్ఞాసువుల ప్రశ్నలకు సమాధానముల నిచ్చిరి. ప్రతిగ్రామమునందును ఈ మండలికి శాఖాసంఘముల స్థాపించవలసినదిగను, ఈసంఘ కార్యక్రమమును ఉత్సాహముగను, విరివిగను, పటిష్ఠముగను జరుపుచుండవలసినదిగను, ఒక్కొక్క శాఖాసంఘమువారు, ఒక్కొక్కపుస్తకము చొప్పున శ్రీఅష్టాదశ రహస్యమూల గ్రంథములను విడివిడిగా 18 గ్రంథములుగ తమపేరున ప్రచురించవలసినదిగను కార్యదర్శిగారు హెచ్చరించిరి.

ఈసభలలో ఉపన్యసించిన విదుషీమణులు

1 శ్రీమతి అమరవాది వెంకట లక్ష్మీ నరసమ్మగారు (నరసాపురము)
2 „ కాటలూరి చూడికొడుతమ్మగారు (నరసాపురము)
3 „ ముడుంబై రామానుజమ్మగారు (రాజమహేంద్రవరం)
4 „ మరంగంటి రంగనాయకమ్మగారు (కోరుకొండ)
5 „ నల్లందిఘళ్ లక్ష్మీనరసమ్మగారు (బందరు)
6 „ మరంగంటి సీతమ్మగారు (మచిలీపట్టణము)
7 „ మరింగంటి బిరాట్టమ్మగారు (బందరు)
8 „ దొడ్డిపట్ల నరసమ్మగారు (దొడ్డిపట్ల)
9 „ బందరు సీతమ్మగారు (బందరు)
10 „ రామినేడి రామాయమ్మగారు (పెనుగొండ)
11 „ నల్లానిచక్రవర్తుల పెరుందేవి తాయారమ్మగారు (రాజమహేంద్రవరం)
12 „ కందాళ తాయారమ్మగారు (శ్రీరామతీర్థం)
13 „ కరిలక్ష్మీ నరసమ్మగారు (సింహాచలం)
14 „ దువ్వూరి సుబ్బమ్మగారు (రాజమహేంద్రవరం)
15 „ ముడుంబై భానుమతీదేవిగారు (రాజమహేంద్రవరం

ది 13-4-51 తేదీని వచ్చిన శుక్రవారమున స్త్రీలందరు కలిసి శుక్రవారోత్సవమును మహావైభవముగా జరిపిరి.

### శ్రీయతిరాజసేవా మహిళా మండలి వార్షిక విరాట్ సభయొక్క జమ ఖర్చులు,

### రాజమహేంద్రవరము

### 9-4-51 నుండి 13-4-51

విరాళములు జమ—

| | |
|---|---|
| శ్రీమతి ముడుంబై రంగనాయకమ్మగారు | 10-0-0 |
| „ ముడుంబై రామానుజమ్మగారు | 10-0-0 |
| „ రామినీడి రాయాలమ్మగారు | 10-0-0 |
| „ దాసరి ఆండాళమ్మగారు | 10-0-0 |
| „ సుభద్రమ్మగారు | 10-0-0 |
| „ ద్వారం చిన్నమ్మగారు | 10-0-0 |
| „ న. చ. తాయారమ్మగారు | 10-0-0 |
| „ రామినీడి రామాయమ్మగారు | 10-0-0 |
| „ మన్న లక్ష్మీతాయారమ్మగారు | 5-0-0 |
| „ గ్రంధి రాజ్యలక్ష్మీగారు | 5-0-0 |
| „ గ్రంధి మహాలక్ష్మమ్మగారు | 5-0-0 |
| „ పేరూరి నాగరత్నంగారు | 5-0-0 |
| „ రా. సు— | 5-0-0 |
| „ రామయ్యమ్మగారు | 5-0-0 |
| „ గ్రంధి వెంకటసుబ్బమ్మగారు | 5-0-0 |
| „ పోతుల సూర్యకాంతమ్మగారు | 5-0-0 |
| „ పోతనశెట్టి మహాలక్ష్మీగారు | 5-0-0 |
| „ చిన్నం ఆదెమ్మగారు | 5-0-0 |
| „ చిర్ల సుబ్బయమ్మగారు | 5-0-0 |
| „ తాడి గంగమ్మగారు | 5-0-0 |
| „ ముడుంబై అచ్యుత వేదవల్లిగారు | 4-0-0 |
| „ పెరుమాళ్ళ సూర్యకాంతముగారు | 3-0-0 |
| „ గ్రంధి రత్నమ్మగారు | 3-0-0 |
| „ అనుమాల వెంకటరత్నంగారు | 3-0-0 |
| „ దుమ్మిరిగుంట పుల్లమ్మగారు | 2-0-0 |
| „ గొల్లపూడి సీతారత్నంగారు | 2-0-0 |
| „ నాళం సుబ్బలక్ష్మీగారు | 2-0-0 |
| „ కొల్లా అప్పలనరసమ్మగారు | 2-0-0 |
| „ జూపూడి అంజమ్మగారు | 2-0-0 |
| „ వాడకాశి సూకరాజుగారు | 2-0-0 |
| „ న. చ. జగన్నాధవల్లితాయారుగారు | 2-0-0 |
| „ ఇటికిరాల అలివేలుగారు | 2-0-0 |
| „ అమరవాది మంగమ్మగారు | 2-0-0 |
| „ న. చ. చూడమ్మగారు | 2-0-0 |
| „ ఉడదు కామేశ్వరమ్మగారు | 2-0-0 |
| „ నడిపిల్లి రత్తాలుగారు | 2-0-0 |
| „ వాటికొండ తాయారమ్మగారు | 2-0-0 |
| „ పాలకోడేటి మంగమ్మగారు | 1-0-0 |
| „ చిట్టూరి సుభద్రమ్మగారు | 1-0-0 |
| „ న. చ. వెం. రామానుజమ్మగారు | 1-0-0 |
| „ బూరగడ్డ సూర్యకాంతమ్మగారు | 1-0-0 |
| „ వెత్సా రాఘవమ్మగారు | 1-0-0 |
| „ వెత్సా కల్యాణిగారు | |
| „ కొత్త కనకరత్నంగారు | 1-0-3 |
| „ భక్తురాంధ్ర సమర్పణము | 36-0-0 |
| మొత్తము రాబడి | 221-1-0 |

ఖర్చులు

| | |
|---|---|
| ఉత్తరము వ్రాయు కాగితములు కార్డులు-కవర్లు అచ్చునకు | 20-0-0 |
| ఆహ్వాన పత్రికల అచ్చునకు | 15-0-0 |
| పోస్టేజి | 20-0-0 |
| ఊళ్ళోతిరుగుటకు బళ్ళ బాడ్జీలు | 8-0-0 |
| చందాలకై ఉపసర్తి పరియాణమునకు | 5-0-0 |
| ఉపన్యాసకురాండ్రికిచ్చిన ప్రయాణపు ఖర్చులు | 62-0-0 |
| ఫొటోకు-బ్లాకులకు | 20-0-0 |
| నివేదిక ప్రచురణకు | 40-0-0 |
| సప్లైయిలు వగైరా ఖర్చులు యావత్తు | 25-0-0 |
| కార్యదర్శినియగు శ్రీమతి ముడుంబై రామానుజమ్మగారివద్దయున్న నిల్వ | 5-9-0 |
| | 221-1-9 |

శ్రీయతిరాజసేవా మహిళా మండలి యొక్క రాజమహేంద్రవరపు శాఖవారు అష్టాదశ రహస్యములలో మొదటిదియగు ముముక్షుపడిని తమ సంఘము తరపున ప్రచురించుటకు వాగ్దానము జేసిరి. ఇందు నిమిత్తమై యిప్పటికి వాగ్దానము జేసినవారి తిరునామములు

శ్రీమతి ముడుంబై రామానుజమ్మగారు
„ అమరవాది వెంకటలక్ష్మీనరసమ్మగారు
„ రామినీడి రాయాలమ్మగారు
„ ముడుంబై రంగనాయకమ్మగారు

ఇత్యాదులు.

శ్రీ



శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ వైశాఖ మాస పండిత సభ

## ★ ఆహ్వాన పత్రిక ★

(నరసాపురము — పశ్చిమగోదావరి జిల్లా.)

స్వస్తిశ్రీ ఖరనామ సంవత్సర వైశాఖ శుద్ధ విదియా మంగళవారము (ది 8-5-51) మొదలు మూడు దినములు వరుసగా పశ్చిమగోదావరిజిల్లా నరసాపురం గ్రామములోని శ్రీ ఎంబెరుమానార్ స్వామివారి కోవిలలో న్యాయ వేదాంత వాచస్పతి శ్రీ. ఉ. వే. శ్రీమాన్ తె. కం. రామానుజాచార్య స్వామివారి అధ్యక్షత క్రింద శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ (ఖర సంllరం) వైశాఖ మాస పండిత సభ జరుపబడి అనేకమంది పండితులచే వివిధ వేదాంత విషయములు ఉదయమున గం 7-30 మొదలు గం 10-30కున్ను సాయం. గం 4-0 మొదలుగం 7-0వరకున్ను ప్రతిదినము ఉపన్యసించబడును.

మరియు ప్రతిదినము మధ్యాహ్నము గం 2-0 నుండి గం 4-0 వరకు శ్రీయతిరాజాశ్రమమున శ్రీయతిరాజ సేవా మహిళామండలి వారిచే స్త్రీలకై ప్రత్యేకము వేదాంత సభలు ఏర్పాటు చేయబడి వారికై ప్రత్యేకము విదుషీమణులచే ఉపన్యసింపబడును.

మరియు 1-5-51 తేదీ మొదలు 7-5-51 తేది వరకు ఈ కోవిలయందే తాయారు సన్నిధియందు ఉదయం. గం 8-0 నుండి గం 10-0 వరకు ప్రతిదినము శ్రీ, ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి రాఘవాచార్యులు గారిచే ప్రపన్నామృతములోని శ్రీరామానుజ చరిత్ర కాలక్షేపము గావింపబడును.

గాన భక్తులెల్లరు విచ్చేసి యుండు ప్రార్థన గోరుచున్నారము.

ఇట్లు,

నరసాపురము
28—4—51

శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ నరసాపురము శాఖ,
శ్రీ ఎంబెరుమానారుస్వామివారి దేవస్థాన
కైంకర్య పరులు.

# భక్తినివేదన

(వేదాంత మాసపత్రిక)

ఇందు వేదాంత విషయ రాజములున్ను; భక్తిప్రచార విషయమైన వార్తలును్ను, వేదాంత సాంప్రదాయ విషయకమైన ప్రశ్నోత్తరములున్ను ప్రచురించబడును.

చందాలు;

| | | |
|---|---|---|
| సాధారణ చందా | సం. రం 1కి | రు. 5_0_0 |
| సహాయ చందా | ,, | రు. 10_0_0 |

విరాళములు:

| | | |
|---|---|---|
| పోషకులు | సం. రం 1కి | రు. 25_0_0 |
| రాజపోషకులు | ,, | రు. 58_0_0 |
| మహారాజ పోషకులు | ,, | రు. 116_0_0 |

కార్యాలయము:

"భక్తి నివేదన" కార్యాలయము,
అర్తమూరు (వయా) ద్వారపూడి.
తూర్పు గోదావరి జిల్లా.

భక్తి "నివేదన" వేదాంత మాసపత్రిక అర్తమూరు, (వయా) ద్వారపూడి తూర్పుగోదావరి జిల్లా.

రిజిష్టరు నెం. 5049.

**Book-Post**

To
శ్రీ ఉ. వే. శ్రీమాన్.
శ్రీమాన్:
శ్రీమతి:

47. శ్రీ ఉ. వే. శ్రీమాన్ పరవస్తు రామానుజ
స్వామివారు,
S. V. S. కాలేజీ ప్రిన్సిపాల్,
తిరుపతి.

Edited printed & published by A. Ch. srimannarayanacharya, at Sriman press, Kakinada, E. G. Dt.



# శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ విజ్ఞప్తి

మహాశయులారా!

ఈ మన శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘము 14-4-1951 తేదీని మదరాసు పట్టణమున సొసైటీల రిజిస్ట్రేషను ఆక్టు XXI 1860 క్రింద రిజిస్టరు చేయబడినది. రిజిస్టరైన నియమావళిని వచ్చే నెలలో అచ్చువేసి తమ కందజేయగలము.

ఈసంవత్సరమున ఈసంఘాభిమానులగు స్త్రీలు పురుషులు అందరున్ను సభ్యులుగ జేరి తమ తమ ప్రాంతములలో ఈసభ్యులనుండి సమర్థమగు కార్యకారిణీ సమితిని ఎన్నుకొని దయయుంచి వెంటనే మాకు తెలియజేయ ప్రార్థన.

సభ్యత్వ రశీదు పుస్తకము లచ్చుపూర్తియై సిద్ధముగా యున్నవి. కోరినవారికి పోస్టులో వెంటనే పంపగలము.

సభ్యులు విరివిగా చేరినగాని సంఘము సుఘటితము కాజాలదు. సంఘము సుఘటితము కానిచో ఏ పనిని చేయజాలము కదా. గాన దయయుంచి సంఘమును బలిష్ఠపరచ ప్రార్థన.

ఇట్లు,
శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ
కార్యకారిణీ సమితి.

ఈనెలలో శుక్రవారపు పూజలు చేయించినవారు.

| పేరు, | |
|---|---|
| కరిగంగన్న భార్య మాణిక్యం | శుక్రవారం |
| కర్రి వీరన్న భార్య మంగమ్మ | ,, |
| కొప్పాడి తాతయ్య భార్య శేషమ్మ | ,, |
| సత్తి వెంకటరెడ్డి భార్య మీనాక్షమ్మ | ఏకాదశి |

శ్రీః

    

శ్రీమతే రామానుజాయనమః

భక్తి

# నివేదన

వేదాంత మాస పత్రిక

| సంపుటి ౩ | ఖర — వైశాఖమాసం | సంచిక ౨ |
| --- | --- | --- |



## భజ యతిరాజస్తోత్రము.

శ్లో॥ సత్యం సత్యం పున స్సత్యం।
యతిరాజో జగద్గురుః ।
స ఏవ సర్వలోకానాం ।
ఉద్ధర్తా నాస్తి సంశయః ॥

భజ యతిరాజం భజ యతిరాజం ।
భజ యతిరాజం భవభీరో. ॥

సంసారమువలన భయమును జెందుచున్నవాడా ! యతిరాజులను భజించుమా ! యతిరాజులను భజించుమా ! యతిరాజులను భజించుమా



శ్లో॥ శ్రీరంగేశ జయధ్వజ కేతుః ।
శ్రితజన సంరక్షణ జీవాతుః ।
భవభయజలధేః శేష హి సేతుః ।
పద్మానేతుః ప్రణతౌ హేతుః ॥భజ॥ ౧

శ్రీరంగనాయకుని జయమున కాశ్రయమైన జెండావంటి వారున్ను: ఆశ్రయించిన జనుల సంరక్షణలో ప్రాణము వంటివారున్ను: సంసారమను భయంకర సముద్రమునకుఅడ్డ గట్టైనవారున్ను: శ్రియఃపతియొక్క సేవవిషయమున కారణ భూతులైనట్టి వారున్ను ఈయతిరాజులే సుమా!

ఆదౌ జగదాధార శ్శేషః ।
తదను సుమిత్రా నందన వేషః ।
తదుపరి ధృతహల ముసల విశేషః ।
తదనంతర మభవ ద్గురు రేషః ॥భజ॥ ౨

ఈయతిరాజులే మొదట జగత్తున కాధారభూతులైనఆది శేషుడుగాను: పిమ్మట సుమిత్రాదేవి కుమారుడైన లక్ష్మణుని వేషముగలవాడుగను: తరువాత ధరించబడిన నాగలి-కాడిగల బలరాములుగను: అటుపిమ్మట ఈ గురువుగాను అవతరించిరి

భుంక్తే వైషయికం సుఖ మన్యః ।
ప్రచకాస్త్యేవా నశ్న న్నన్యః ।
ఇతి య స్తత్త్వం ప్రాహ వదాన్యః ।
తస్మా దధికః కోను వదాన్యః ॥భజ॥ 3

శరీరమునయుండువారలలో ఒకడైన జీవాత్మ విషయ సంబంధమైన సుఖము ననుభవించుచున్నాడు: మరివకడగు- పరమాత్మ, దానిని అనుభవించకుండగనే మిక్కిలియు ప్రకా శించుచునేయున్నాడు. ఇట్టి యదార్థవిషయమును ఏయుదారు లగు యతిరాజులు చక్కగా అందరికి తెలిపిరో- ఆయనకంటె అధికులైనవారు ఇతరులెవరు? చెప్పుము

నష్టే నయనే కస్యా లోకః ।
చిత్తే మత్తే కస్య వివేకః ।
క్షీణే పుణ్యే క స్సురలోకః ।
కామే భ్రష్టే క స్తవ శోకః ॥భజ॥ ౪

నేత్రము పోయినచో ఎవనికి చూపుపుండును: చిత్తము మదించినచో ఎవనికి జ్ఞానము ఉండును: పుణ్యము క్షీణించిన స్వర్గలోక మెట్లు కలుగును? కోరిక నశించినచో నీదుఃఖమెట్లు కలుగును?

నిశి వనితా సుఖ నిద్రాలోలః ।
ప్రాతః పరదూషణ పటుశీలః ।
అస్త్ర్యాతి నిజాయుః కాలః ।
కిం జానాతి నరః పశులీలః ॥భజ॥ ౫

రాత్రియందు స్త్రీసుఖమందును, నిద్రయందును ఆసక్తి గలవాడగుచు: ఉదయమున ఇతరులను నిదించుటలో నేర్పరి యగుచు: తన ఆయుర్దాయకాలమును గడుపుచున్న పశువువంటి వ్యాపారముగల నరుడు ఏమి తెలుసుకొను చున్నాడు?

కేచి ల్లీలా లాలసగతయః ।
కేచి ద్బాలా లాలిత రతయః ।
కేచి ద్దోలాయిత హత మతయః ।
కేపి న సంత్యర్చిత యతిపతయః ॥భజ॥ ౬

కొంత మంది ఆటలయందు ఆసక్తిగలవారుగను: కొంతమంది బాలికల నాడించుటయందు ఆసక్తికలవారుగను సందేహములచే కొట్టుకొనబడిన బుద్ధి గలవారుగను ఉన్నారు; ఎవరుకూడ యతిరాజార్చన కలవారలులేరు.

యావా నబలో జరయా దేహః ।
తావా న్ప్రబలో విషయే మోహః ।
వచసి విరక్తి శ్రుతిపరివాహః ।
మనసి హిత స్త్వపరోపి వివాహః ॥భజ॥ ౭

ఎంతగా ముదిమిచే దేహము బలహీనమగుచున్నదో: అంతగా విషయములయందు మోహము అధికమగుచున్నది: వాక్కునందు వైరాగ్యముతో కూడుకున్నవేదాంత వాక్యముల ప్రవాహము: మనస్సునందైతే మరొక వివాహముహితకరము

భజసి వృథా విషయేషు దురాశాం ।
వివిధ విచిత్ర మనోరథ కోశాం ।
కియదపి లభసే న హి తత్రైకం ।
కిం తు వ్రజసి మహాంతం శోకం ॥భజ॥౧౪

విషయములయందు అనేకమైన విచిత్రమైన కోరికలకు స్థానమైన దురాశను వ్యర్థముగా సేవించుచున్నావు. వానిలో ఒక్కదానినైనను కొంచమైనను పొందుటలేదు. మరి గొప్పదైన దుఃఖమును పొందుచున్నావు.

కశ్చన లోకే కరపుటపాత్రః ।
పాతుం సుత మాశ్రిత మఠ సత్రః ।
తస్మి న్వృద్ధే సతి సకళత్రః ।
శపతి హి రండాసుత ఇతి పుత్రః॥భజ॥౧౫

ఒకడు లోకమున హస్తమున పాత్ర ధరించుచున్నవాడై కుమారుని రక్షించుటకై మఠము, సత్రమునాశ్రయించినవాడగుచున్నాడు. వాడు వృద్ధుడు కాగా, పుత్రుడు భార్యతో కూడుకున్నవాడై తాత్తుకొడుకాయని తిట్టుచున్నాడు కదా!

మనుజపతిం వా దిగధిపతిం వా ।
జలజభవం వా జగదధికం వా ।
మమతాహంకృతి మలినో లోకః ।
నిందతి నిందతి నిందత్యేవ ॥భజ॥ ౧౬

మనుజులకు రాజునైనను, దేవేంద్రునైనను, బ్రహ్మదేవునైనను, విష్ణువునైనను, మమకార-అహంకారములచే దూషితమైన జనము తప్పక నిందించుచునే యుండును.

పాపహతో వా పుణ్యయుతో వా ।
సుర నర తిర్యక్ జాతిగతో వా ।
రామానుజ పద తీర్థా న్ముక్తిం ।
విందతి విందతి విందత్యేవ ॥భజ॥ ౧౭

పాపపీడితుడైనప్పటికిన్ని, పుణ్యము గలవాడైనప్పటికిన్ని దేవతలయొక్క నరులయొక్క జంతువులయొక్క జాతిని పొందినవాడైనప్పటికిన్ని, రామానుజులయొక్క పాదతీర్థమునుండి ముక్తిని తప్పక పొందుచున్నాడు.

గుణాగుణినో ర్భేదః కిల నిత్యః ।
చిదచిద్ద్వయ పర భేద స్సత్యః।
తద్ద్వయ దేహో హరి రితి తత్త్వం।
పశ్య విశిష్టాద్వైతం తత్త్వం ॥భజ॥ ౧౮

గుణమునకున్ను-గుణముకలవానికి భేదము నిత్యమైనది. చేతనాచేతనములకున్ను, వీనిరెండంటికి పరమాత్మతోటిన్ని భేదము సత్యమైనది. చేతనాచేతనముల రెండింటిని దేహముగాగల విష్ణువే తత్త్వము అను యదార్థమైన విశిష్టాద్వైతమును చూడుము.

యతిపతి పదజల కణికా సేకః ।
చతురక్షరపద యుగ్మ వివేకః ।
యస్య తు సాలనగ ర్యవలోకః ।
తస్య పదేన హతో యమలోకః॥భజ ॥౧౯

ఎవనికైతే రామానుజులవారి యొక్క పాదతీర్థ జలపానము లభించునో, నాలుగక్షరములు రెండుపదములుగల దానియొక్క జ్ఞానము కలుగునో, మిథులాసాలగ్రామపట్టణదర్శనము కలుగునో వానియొక్క పాదముచేత యమలోకము పోగొట్టబడును.

చింతయ సర్వం చిదచిద్రూపం ।
తను రితి తస్య హి తే కచురూపం ।
తస్మాత్కస్మి న్నకలయసి కోపం ।
పశ్చాత్ప్రాప్స్యసి దుస్తాపం తాపం ॥భజ॥ ౨౦

చేతనాచేతనాత్మకమైన సర్వమును అవిష్టమూర్తికిఅను రూపమైన శరీరమని తలచుమా। గాన ఎవనియందు కోపము జేసెదవు. అటు పిమ్మట పొందశక్యముగాని పరితాపమును పొందుదువు.

య శ్చతురక్షర మంత్రరహస్యం ।
వేద తమేవ వృణీహి సదస్యం ।
తచ్చరణద్వయ దాస్యముపాస్యం ।
తద్విపరీతం మత ముపహాస్యం ॥భజ॥ ౨౧

ఎవడైతే నాలుగక్షరములుగల మంత్రరహస్యము తెలుసుకొనుచున్నాడో వానినే గురువుగా వరించుమా ఆయన యొక్క పాదద్వంద్వముయొక్క సేవయే ఉపాసించతగినది. అందుకు విరుద్ధమైన మతము పరిహసించతగినది.

విష్ణుజనకులగుణ దూషణచింతాం ।
మాకురు నిజకుల శీలాహంతాం ।
యతిపతి రేవ హి గురు రేతేషాం ।
ఇతి జానీహి మహత్త్వం తేషాం ॥భజ॥ ౨౨

తనయొక్క కులము శీలములను నశింపజేయునట్లు విష్ణుభక్తుల కులమును గుణమును దూషించునట్టు ఆలోచనను చేయకుమా. వీరలకు రామానుజులవారే గురువులు ఇట్టి వారి మాహాత్మ్యమును తెలుసుకొనుమా

విద్యానిపుణా వయ మిత్యన్యే ।
హృద్యా ధనినో వయ మిత్యన్యే ।
సత్కులజాతా వయ మిత్యన్యే ।
తేషు కలిం పరిపూర్ణం మన్యే ॥భజ॥ ౨౩

కొందరు మేము విద్యలలో నిపుణులమని, కొందరు మేము అందమైన ధనికులమని, కొందరు మేము గొప్పవంశోద్భవులమని, తలతురు. అట్టివారలయందు కలిదోషముబాగుగా యున్నదని తలంపుము.

యమకింకర కర శూలాలోలే ।
సతదభిఘాత విఘాతే ఘాతే ।
దహతి తనుం ప్రతికూలే కాలే ।
కిం రమయసి తత్కాలే బాలే ॥భజ॥ ౨౪

ఓచిన్నదానా యమకింకరుల చేతియందలి శూలము చలించు చుండగా, నువురు పడుచున్న దెబ్బలచే పగులుచుండగా, ప్రతికూలమైన మృత్యువు శరీరమునుదహించుచుండగా, ఆకాలమున ఏలసుఖింతువు?

సుమసుకుమారం శోభితమారం ।
రతిసుఖసారం యువతిశరీరం ।
గతజీవిత మతిఘోర వికారం ।
దృష్ట్వా గచ్ఛతి దూరం దూరం ॥భజ॥ ౨౫

పువ్వువలె కోమలమై, ప్రకాశింపజేయబడినమన్మథుని కలిగినదై రతిసౌఖ్యమునకు సారమైయున్నట్టి స్త్రీశరీరము, ప్రాణము పోయినదికాగానే అత్యంత ఘోర వికారమైనది. గా చూచి [లోకములో జనుడు] అత్యంతదూరముగ పారి పోవుచున్నాడు.

నర వాహన గజ తురగారూఢాః ।
నారీ సుత పోషణ గుణ గూఢాః ।
నానారంజక విద్యా ప్రౌఢాః । ౨౬
నాగరికాః కిం యతయో మూఢాః ॥భజ॥

పల్లకిలమీద ఏనుగులమీదను గుర్రములమీదను ఎక్కువారలై స్త్రీలను పిల్లలను పోషించునట్టి గుణమును రహస్యముగా గలిగి, వివిధములైన మనోహరవిద్యలయందు నేర్పరులై యున్నట్టి, నాగరికులైన మూఢులు సన్యాసులనదగుదురా?

యస్య ముఖస్థా యతిపతిసూక్తిః ।
తస్య కరస్థా విలసతి ముక్తిః ।
నరకే పతితం నవనవయుక్తిః ।
నహి రక్షతి సామాన్య నిరుక్తిః ॥భజ॥ ౨౭

ఎవనికి యతిరాజులవారి ఉపదేశములు కంఠస్థములై యుండునో, వానికి మోక్షము హస్తగతమై యుండును. నరకమునందు పడినవానిని క్రొత్తక్రొత్తయుక్తులుగల సామాన్య నిరుక్తియను గ్రంథము రక్షించజాలదు.

శ్రుతిశిరసా మత్యంత విరుద్ధం ।
సూత్రానభిమత మతివైరుద్ధ్యం ।
ప్రథమ మమంగళ మనృత విశేష్యం ।
పఠసి కిం ప్రాకృతకృత భాష్యం ॥భజ॥ ౨౮

ఉపనిషత్తులకు మిక్కిలి విరుద్ధమైనటియు వ్యాససూత్రములకు అనుగుణముగానట్టియు. ఏమాత్రము పాండిత్యము లేనటియు ప్రారంభమున మంగళము లేనటియు, పామరులచే జేయబడిన భాష్యమును ఏలచదివెదవు?

తస్కర జార విదూషక ధూర్తాః ।
మస్కర మౌని దిగంబర వృత్తాః ।
గుప్త సతీ సుత ధన మదమత్తాః ।
గురవః కిం పరవంచక చిత్తాః ॥భజ॥ ౨౯

దొంగలు-వ్యభిచారులు-పరిహాసకులు పోగరుమోతులునైన: సన్యాసులయొక్కయు మునులయొక్కయు అవధూతలయొక్కయు వ్యాపారముగలవారలై రహస్యముగా నుంచబడిన భార్య-పిల్లలు ధనములచే మదముచేమదించినవారలై పరులను వంచించు చిత్తముగలవారు గురువులగుదురా?

కాంతిమతీ సుకుమార కుమారం ।
కేశవసింహ కిశోర ముదారం ।
రామానుజ మహిరాడవతారం ।
మూకాంధానపి మోక్షయితారం ॥భజ॥ ౩౦

కాంతిమతీదేవియొక్క సుకుమారుడైన కుమారుడైనట్టియు: కేశవరాజులయొక్క కుమారులైనటియు ఉదారులైనటియు, ఆదిశేషులయవతారమైనట్టియు- మూగివానిని అంధుని కూడ మోక్షమునకు పంపినట్టియు రామానుజులను సేవించుము

కాషాయాంబర కవచిత గాత్రం ।
కలితకమండలు దండపవిత్రం ।
విధృత శిఖా హరిణాజిన సూత్రం ।
వ్యాఖ్యాతద్వైపాయనసూత్రం ॥భజ॥ ౩౧

కాషాయబట్టచే కప్పబడిన శరీరము కలిగి- ప్రకాశించు కమండలము-త్రిదండము-పవిత్రము కలిగియున్నట్టియు-ధరించబడిన శిఖయు-లేడిచర్మము-యజ్ఞోపవీతము కలిగియున్నట్టియు వ్యాఖ్యానము చేయబడిన వ్యాససూత్రము కలిగినట్టియు రామానుజుల సేవించుమా.

యామున పూర్ణ కృపోజ్జ్వలగాత్రం।
రామాబ్జాక్ష మునీక్షణ పాత్రం।
కోమల శరదిభు పదయుగ మాత్రం।
శ్రీమాధవ సేనాపతి మిత్రం ॥భజ॥ ౩౨

యామునాచార్యులవారియొక్క పూర్ణమైన దయతో ప్రకాశించు శరీరముగలిగినట్టియు- శ్రీరామమిశ్రులు పుండరీకాక్షులు అను మునుల కటాక్షమునకు పాత్రులైనటియు- మృదువైన నమ్మాళ్వారులయొక్క పాదద్వంద్వమేయైనటియు- శ్రియఃపతి యొక్కయు విష్వక్సేనులయొక్కయు మిత్రులైన రామానుజుల సేవింపుమా.

శాలగ్రామే సర్వ హితార్థం।
యేనా స్థాపి గురోః పదతీర్థం।
తత్కుల దైవత మిహ పురుషార్థం।
సకలో పాయాధిక చరమార్థం ॥భజ॥ ౩౩

సాలగ్రామ నగరమున అందరియొక్క హితముకొఱకు పెఆంధ్రపూర్ణులచే గురువులయొక్క శ్రీపాదతీర్థము స్థాపించబడెనో- ఆయనయొక్క కులదైవతమైనట్టియు, ఈలోకమున పురుషార్థముల నిచ్చునట్టియు- సమస్తమైన ఉపాయములలో అధిక ఉపాయమైన రామానుజుల సేవింపుమా!

ప్రవచనశక్తః ప్రజ్ఞాయుక్తః ।
పరహితసక్తః పరమవిరక్తః ।
నానా దైవత భక్తో వ్యక్తః ।
న భవతి ముక్తో న భవతి ముక్తః॥భజ॥ ౩౪

వేదాధ్యయనమందు శక్తిగలవాడైనను, జ్ఞానముతో కూడుకున్నవాడైనను: ఇతరులకు హితము చేయుటలో ఆసక్తి గలవాడైనను: మిక్కిలి వైరాగ్యము గలవాడైనను: అనేక దేవతలకు భక్తుడని చెప్పబడువాడైనను: [రామానుజుల నాశ్రయించనిచో] ముక్తుడు ఎంతమాత్రముగాడు.

సంత్యజ సకల ముపాయా చరణం।
వ్రజ రామానుజ చరణౌ శరణం ।
పశ్యసి తమసః పారం నిత్యం ।
సత్యం సత్యం పునరపి సత్యం ॥భజ॥ ౩౫

సమస్త ఉపాయముల నాచరణము విడువుము: శ్రీరామానుజులవారి పాదముల రక్షకములుగా స్వీకరించుము:అజ్ఞానము యొక్క అంతమును ఎప్పటికి చూతువు. ఇది ముమ్మాటికి సత్యము.

భగవ ద్రామానుజ షట్త్రింశత్ ।
సాలగ్రామ గురూత్తమవంశ్యః ।
కౌండిన్యః కవి రాహ పవిత్రం ।
రంగార్యో యతిరాజ స్తోత్రం ॥భజ॥ ౩౬

సాలగ్రామమందలి ఆంధ్రపూర్ణులను గురువుల గొప్ప వంశమునందుద్భవించిన కౌండిన్యగోత్రోద్భవులైనరంగాచార్యులవారు పూజ్యులైన శ్రీరామానుజుల విషయమైముప్పదియారు శ్లోకములుగల పవిత్రమైన యతిరాజస్తోత్రమును చెప్పిరి.

భజ యతిరాజం భజ యతిరాజం ।
భజ యతిరాజం భవభీరో ॥

ఇతి శ్రీమత్సాలగ్రామస్థలాచార్య పురుషోద్దండ వేదాంతరంగ నాథాచార్య విరచిత భజయతిరాజ స్తోత్రం

సంపూర్ణము.

ఓం.

శ్రీహయగ్రీవాయనమః

# పూర్వమీమాంసాదర్శనము

రచయిత: — శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులుగారు. కోదుకొండ.

శిష్యుడు:- స్వామీ నిన్న మీరు చదివిన యతిరాజవిజయ నాటకమున వేదమాళితో యామునాచార్యులవారు మాట్లాడుచు

స్వాస్వార్థఘటితి రిహ న క్వచి చ్ఛ్రుతీనాం ।
ప్రత్యక్షప్రభృతి రపి ప్రమాణవర్గః ।
స్వార్థేషు ప్రభవతి నిష్ప్రపత్నచారీ ।
రాజం స్తే వహతి ధురం యతీశ్వరేఽస్మిన్ ॥

అను శ్లోకమున ఓమహారాజా ! శ్రీరామానుజులు ప్రధానామాత్యులై నీరాజ్యభారమును వహించియుండ వేదవాక్యములలో నొక్క-దాని కైనను స్వార్థమును విడిచి యుపార్థము కల్పింపవలసిన పని లేదనియు, ప్రత్యక్షాది ప్రమాణములు నిర్నిరోధముగ తమ తమ యర్థముల గ్రహింపుచున్నవనియు తెలవిచ్చినట్లు చెప్పితిరే! ఇంతకు మునుపాయనర్థములుండెడివా ? ఎందుచేత?

ఆచార్యులు:- ఔను రామానుజులకు పూర్వము వేదమాళియొక్క రాజ్యభారమును శంకరయాదవాది వహించి రాజ్యచక్రమును స్వేచ్ఛగా త్రిప్పుచుండెడివారు అతిదారుణములో

శ్లో॥ ఆదౌ భేదశ్రుతీనా మనృతవిషయతా ।
లక్షణా చైక్యవాచాం ।
దూరే తావత్ప్రహాణం ।
తదుభయఘటనా తత్పరాణాం చ వాచాం ।
ప్రత్యక్షాదిప్రమాణస్వరసగతిహతి ।
స్తర్క-బాధశ్చ భూయాన్ ।
మాయావాదే - తదేతన్నిఖిలం ।
ఇతరథా లక్ష్మణాచార్యపక్షే ॥

అనగా-వేదమున భేదశ్రుతులనియు, అభేదశ్రుతులనియు, ఘటకశ్రుతులనియు నిట్లనేక విధములైన వాక్యములుండును. అందు-

"పృథగాత్మానం ప్రేరితారం చ మత్వా" (అనగా సర్వజ్ఞులగు జీవేశ్వరుల లిరువురిలో నొకడు పరమాత్మ రెండవవాడు పరతంత్రుడును అనియు,

"నిత్యో నిత్యానాం చేతన శ్చేతనానా మేకో బహూనాం యో విదధాతి కామాన్" (నిత్యులును అనేకులును నగు జీవులకు నిత్యుడును నద్వితీయుడును నగు నొక పరమచేతనుడు సమస్త కోరికలను ప్రసాదించుచున్నాడు. అనియు

"భోక్తా భోగ్యం ప్రేరితారం చ మత్వా" (అనగా-అనుభవించు జీవుడును, అనుభవించబడు

ప్రకృతి ప్రాకృతికములును, అనుభవింపజేయు పరమపురుషుడును నని వేరువేరుగా యనుసంధించి యనియు,

"పృథగాత్మానం ప్రేరితారం చ మత్వా జుష్టస్తత స్తేనామృతత్వ మేతి" (అనగా అనుభవించు జీవుని, అందులకై ప్రేరేపించు పరమాత్మను, వేరువేరుగా ననుసంధించి ప్రీతియుక్తుడగువాడట్టి భేదానుసంధానముచే మోక్షము నందుచున్నాడనియు,

"ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే తయో రన్యః పిప్పలం స్వాద్వ త్త్యనశ్న న్నన్యో అభిచాకశీతి" (అనగా సఖులును సమానగుణాదికము కలిగియున్నట్టియు రెండు పక్షులు (జీవేశ్వరులు) ఒకేవృక్షమును (శరీరమును) ఆశ్రయించియున్నారు. అందొక పక్షి (జీవుడు) రుచికరములగు రావిపండ్లను (కర్మఫలమును) తినుచున్నది. రెండవపక్షి (పరమాత్మ) ఏమియు తినకనే (కర్మఫలము ననుభవింపకయే) దేదీప్యమానముగ వెలుంగుచుండును. అనియు నిట్లనేక శ్రుతివాక్యములు స్పష్టముగా జీవేశ్వరులను భేదమును బోధించుచున్నను మాయావాదులు "అభేదమే సిద్ధాంతము. భేదము కల్పితము, కల్పిత మేదియైనను మిథ్యాభూతము. అట్టియర్థముల బోధించు వేదవాక్యము లతత్త్వవిషయములే యని యందురు.

ఇక పోనిండు ఆజీవేశ్వరుల కభేదమును బోధించు "అహంబ్రహ్మాస్మి, సోఽహంబ్రహ్మ, తత్త్వమసి" మొదలగు శ్రుతివాక్యములకైనను సరసమైన యర్థమును చెప్పక సర్వజ్ఞ కించిజ్ఞులగు జీవేశ్వరుల కైక్యము దుర్ఘటమగుటచే జహదజహల్లక్షణయను (అనగా ఒకపదమునకర్థములో కొంత గ్రహించి కొంత విడుచుట- తత్త్వమసి యనుచోట తచ్ఛబ్దార్థమగు సర్వజ్ఞత్వవిశిష్టాత్మలోని సర్వజ్ఞత్వమును, 'త్వం' శబ్దార్థమగు కించిజ్ఞత్వవిశిష్టమగు ఆత్మలోని కించిజ్ఞత్వమును విడిచి ఉభయత్ర ఆత్మరూప ఏకార్థమును పరిగ్రహించుట) నొకలక్షణావృత్తిని క్రొత్తగకల్పించి దానిచే సర్వజ్ఞత్వకించిజ్ఞత్వముల పరిహరించి ఆత్మలకైక్యమును ఘటింపచేసిరి. ఇందువలన సరసమగు సమన్వయమును విడనాడి దుర్ఘటమగు లక్షణాకల్పనా విధానము నంగీకరించ వలసివచ్చినది.

ఈ రెండువిధములగు శ్రుతులకును పైకి గోచరించు విరోధమును పరిహరించు శరీరాత్మ సంబంధ బోధకములు అనగా-చేతనాఽచేతనములు పరమాత్మకు శరీరములనియు పరమాత్మ వాటికాత్మయనియు ఈశరీరాత్మలకుగల నెడబాయని సంబంధముచే నవి యొకేపదార్థముగా గోచరించుటచే నభేదశ్రుతులును, వాస్తవముగ చేతనాచేతనములకు గల ప్రత్యేక స్వరూప స్వభావములనుబట్టి భేదశ్రుతులను చక్కగ సమన్వయమగునని కంఠరవముతో బోధించు "యః పృథివ్యాం తిష్ఠన్ పృథివ్యా అన్తరో యమయతి" (ఏపరమాత్మ భూమిలో నంతర్యామిగా నుండినను పృథివి యాతనిని యెఱుంగజాలనిదై యాతనికి శరీరమాత్రముగ నుండునో అట్టి శరీరమగు పృథివికి లోనుండి దీనిని యథేష్ట

ముగనే పరమాత్మ వినియోగించుకొనుచున్నాఁడో యట్టి పరమాత్మయగు శ్రీమన్నారాయణుఁడే నీకును నంతరాత్మ) యనియు నిర్లే "య ఆత్మని తిష్ఠన్నాత్మనో ఽన్తరో య మాత్మా న వేద యస్యాత్మా శరీరం, మొదలగు కాణ్వ మాధ్యందినశాఖయ శ్రుతి వాక్యములను బొత్తుగా పరిత్యజించిరి.

మరియు ప్రత్యక్షాది ప్రమాణములు స్వాభావికముగ కొన్ని విశేషణములతో గూడిన పదార్థములను గ్రహించుటయే పరిపాటిగా గలవగుటచే భేదసాధకములై యుండ నవి సన్మాత్రమునే గ్రహించునవి యని వాటిస్వారసిక ప్రవృత్తిని భంగపరచుచున్నారు.

ఇక ప్రపంచ కల్పనకు మూలాధారమగు నవిద్యాస్వరూపమును నిర్ణయించుటలోను, దాని కాశ్రయమును వర్ణించుటలోను, అది పరబ్రహ్మస్వరూపమును ఆవరించువిధానములోను, అవిద్యాసాధక ప్రమాణ ప్రన్యాసములోను, దాని యనిర్వచనీయ స్వరూపమును ఉపపాదించుట లోను, జ్ఞానముదానిని నిర్మూలించు విధానమును ప్రతిపాదించుటలోను, అది నివర్తించు పద్ధతిని సమర్థించుటలోను వారు ప్రదర్శించిన యుక్తులు బహుశాస్త్రానుభవ విరుద్ధములుగా నున్నవి.

సత్యజ్ఞాన మనన్తంబ్రహ్మ, పరాస్యశక్తిర్వివిధైవశ్రూయతే, యస్సర్వజ్ఞ సర్వవిత్, మొదలగు పరమాత్మను కల్యాణ గుణములను బోధించు సగుణశ్రుతులు, ప్రతియోగగుణస్వరూప సమర్పకములనియు కావున వాటికి స్వార్థమునందు తాత్పర్యము మృగ్యమనియు ఇక "నేహ నానాస్తి, నిర్గుణంనిరంజనం, ఏకమేవాద్వితీయం మొదలగు శ్రుతివాక్యములే వాస్తవములుగాన నిర్గుణమే తత్త్వమనియు వారు వాదింతురు.

శ్రీరామానుజులు ప్రధానామాత్య ...ము నలంకరించి యీయుభయ పక్షముల సన్నిహితిని పరిహరించి–

శ్లో. నిత్యం హేయగుణావహీనానపరాః ।
నైర్గుణ్యవాదా శ్శ్రుతౌ ।
సత్యార్థా స్సగుణోక్తయ శ్శుభగుణా ।
ప్రఖ్యాపనా ద్బ్రహ్మణః ।
అద్వైతశ్రుతయో విశిష్ట విషయాః ।
నిష్కృష్టవేషాశ్రయా ।
భేదోక్తి, స్తదిహాఖిల శ్రుతిమతం ।
రామానుజీయం మతం ॥

అనునట్లు వేదమునందలి నిర్గుణ వాక్యములు పరమాత్మ–గానఁగుండునట్టి పాపములు ముసలితనము, చావు, దుఃఖము, ఆకలి, దప్పి మొదలగు దుర్గుణములు లేని వాడని చెప్పును. సగుణ శ్రుతులు ఆయనను గల సర్వజ్ఞత్వ, సర్వశక్తిత్వ సత్యసంకల్పత్వ ప్రభృతులగు కల్యాణ గుణములను భోధించును. జీవేశ్వర ప్రకృతుల కభేదమును బోధించు వాక్యములు అపృథక్సిద్ధ సంబంధముచే వాటిని విశేషణములుగా పరిగ్రహించి యున్న విశిష్టతత్వ మొక్కటియే యని బోధించును. ఆమూఁడు తత్వములను వేరు వేరుగా బోధించు భేదశ్రుతులు ఆతత్వముల స్వాభావిక స్వరూపములను వేరువేరుగా బోధించును. ఇట్లు

శ్రుతివాక్యముల నన్నిటిని సమంజసముగా సమన్వయించుటచే రామానుజాచార్యులిట్లు సెలవిచ్చిరి.

శిష్యుడు:- స్వామీ! రామానుజరాద్ధాంతమున మాత్రము శాస్త్రానుభవవిరుద్ధవిషయములు లేవా? కటాక్షింపుడు. లోకమున నేకార్యము పుట్టినను దానికుపాదాన కారణమనియు, నిమిత్తకారణమనియు మూడు విధములగు కారణము లుండును. ఉదాహరణమునకై యొకకుండను చేసికొనిన దానికి మన్ను ఉపాదాన కారణము. అనగా-మూలపదార్థము (దేనికి ఘటాదివికారములు జనించుచున్నవో ఆవస్తువునకు ఉపాదానమనిపేరు.) కుమ్మరి నిమిత్తకారణము. అనగా నీవస్తువునే చేతునని సంకల్పించిన వాడు. కాలము మొదలగునవి సహకారి ఇట్లు ప్రతికార్యమునకు యీమూడు కారణములును వేరువేరై యుండ శ్రీరామానుజ సిద్ధాంతమున జగత్తునకీ మూడు కారణములును నారాయణుడొక్కడేయనుట శాస్త్రసమ్మతమేనా?

ఆచార్యుడు-అందుకు సందేహమా? చూడుము బ్రహ్మ సృష్టికి పూర్వావస్థయందును సృష్టియందును చేతనాచేతనములను తనకు శరీరముగా పరిగ్రహించియే యుండునని చెప్పితిని గదా! అవి యాతని నొక్కనాటి యైనను విడచి యుండని విశేష సంబంధముచే నొకవిధమగు మార్పు దేనికి యుండునో నదియే దానికుపాదానమగును ముద్దగానున్న మన్నునకే కుండయను నవస్థవచ్చియుండుటచే నాకుండ కామన్ను ఉపాదానకారణమైనది. అంతియకాని కుండకు భూమియైన్నను నుపాదాన కారణముగాదు. దానికట్టి సంబంధముచే నాయవస్థ లేకుండుటయే యందులకు కారణము. అట్లే పరమాత్మకు శరీరములై సూక్ష్మరూపమున నున్న చేతనాచేతనములకు స్థూలరూపమనెడు మార్పు వచ్చినది గాన తద్ద్వారా పరమాత్మయే యుపాదానమగుటచే నాతడే జగత్తున కుపాదాన మగుచున్నాడు. కుండను చేయుదునను సంకల్పము కుమ్మరి కుండుటచే నాతడా కుండకు నిమిత్త కారణమైనట్లే 'బహుస్యాం' అను ప్రపంచ సృష్టి సంకల్పము భగవంతునకుండి యాతడు ప్రపంచమును సృష్టించెను గాన నాతడు నిమిత్తకారణమయ్యెను. కాలాదులు పరమాత్మకపృథక్సిద్ధ విశేషణములై సర్వదా యాతనిని విడువకయే యుండును. గాన నట్లు కాలాది విశిష్టుడైన పరమాత్మ సహకారి కారణమగును.

శిష్యుడు:- లోకానుభవమట్లు లేదేమి?

ఆచార్యుడు:- అందులకు కారణమట్టి శరీర శరీరిభావమా నిమిత్తకారణమైన కుమ్మరికిని ఉపాదానకారణమగు మట్టిముద్దకును లేకుండుటయే. అదియొక్క పరమాత్మకే తగును.

శిష్యుడు:- లోకానుభవమునుబట్టి నిమిత్తోపాదానములు వేరువేరుగా నుండియే తీరవలెనను నియమమేర్పడియుండ దానికిది విరుద్ధము కాదా!

ఆచార్యుడు:- ఒక్కచోటనైనను తప్పని లోకానుభవమున్నచో మనమొక నియమమును

కల్పించుకొనవచ్చును. ఈనియమమున కట్టి సుద్దిలేదు. ఏలయన తార్కికుల సంప్రదాయము నారయుము. కాలమునకును ఘటమునకును సంయోగమనెడు సంబంధమొకటి గలదు. సంబంధమెప్పుడును రెండింటియందుండును. కాలమునందుండి సంయోగమనెడు కార్యమునకు నిమిత్తోపాదానకారణము లేవని వారు నిర్ణయించిరో చూతము. ఈసంయోగము పుట్టినది గాన కార్యము. కార్యములన్నిటికిని కాలము నిమిత్తకారణము, కావున నీ సంయోగమునకు నిమిత్తకారణము కాలమే. ఒక ద్రవ్యమునందు పుట్టునట్టి గుణములకుగాని క్రియలకుగాని యాద్రవ్యమే యుపాదానకారణము. కాలముకూడ ద్రవ్యమే గాన తనయందుపుట్టిన నాసంయోగమున కుపాదాన కారణము కూడ నాకాలమేయగును. ఇట్లొకేకాలము తనయందు బుట్టిన సంయోగమనెడు కార్యమునకు నిమిత్తకారణమును ఉపాదానకారణమును నగుచున్నది గాన నైవిధమగు నియమమును కల్పించుటకు వీలులేదు.

శిష్యుడు:— అపూర్వమగు నొకయర్థమును సాధింపవలెనన్న దానికి సర్వానుభవ సిద్ధమైన నొక దృష్టాంతమును చూపవలెను. అట్టివిషయమున కేదైనను దృష్టాంతము కలదా?

ఆచార్యుడు:— లేకేమి! ప్రసిద్ధమగు దృష్టాంతమే కలదు. మనయిండ్లలో మూలమూలల సాలిపురుగొక గూడు నల్లుచున్నది. చూచితివా? ఆగూడు నాపురుగెట్లు సృజించుచున్నది? ఆ పురుగు తానొక గూడును నిర్మింపవలెనని తలంచుకొని తన శరీరములోని యొక విధమగు [illegible]రుతో నాగూడు నల్లును. తిరిగి యొకప్పుడు దానిని మ్రింగివేయును. ఇట్లు గూడుగా పరిణమించు పదార్థము తన శరీరములోని యొక భాగమే గాన ఆకార్యశరీరకత్వమును అట్లు గూడును నిర్మింపవలెననెడు తలంపున్నుండుటచే తానే నిమిత్తోపాదానము లగుటలో సందేహములేదు. తాను శరీరి కాకపోవుటచే సంకల్పము లేదు గాన యచేతనమే యగు శరీరము ముఖ్య ఉపాదానము మాత్రమే యగుచున్నది. కుమ్మరి యట్లు మట్టికి శరీరముగా కలవాడు కాడు గాన నిమిత్తకారణమే యగును. ఇది యొక దృష్టాంతము మాత్రమే గాక శ్రుతి-ముండకోపనిషత్తునందును 'యథోర్ణనాభి స్సృజతే గృహ్ణతే చ' యని యీ దృష్టాంత మీయబడుటచే నీసిద్ధాంతము శ్రుతి సమ్మతమని స్పష్టమగుచున్నది.

శిష్యుడు:— స్వామీ! అభేదశ్రుతులు చేతనాచేతన విశిష్టమగు వస్తువొక్కటియే యని విశిష్టవస్తువునకభేదమును అనగా ఏకత్వమును చెప్పుటయే గాని జీవేశ్వరులకుగాని ప్రపంచేశ్వరులకుగాని యభేదమును చెప్పునవి కావనియు, భేదశ్రుతులు పరమాత్మకట్లు ఏకబాయని విశేషణములైన చేతనాచేతనముల యొక్క స్వాభావిక స్వరూపములను వేరుచేసి బోధించునవి యనియు తెలవిచ్చిరి. కాని 'నేహ నానాస్తి కించన, మృత్యోస్సమృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి' మొదలగు భేదమును కంఠరవముతో నిషేధించు శ్రుతివాక్యముల సంగతిని తెలవిచ్చినారు కారేమి?

ఆచార్యులు:— అవి విధి చెప్పబడిన యభేదము నకు (అనగా ఏకదేశీ తెలుసుకొన శక్యముగాని

సంబంధముతో—చేతనాచేతనములను శరీరముగా కలిగియుండు పరమాత్మయొక్కడే యనెడు అభేదమునకు విరోధియగు స్వతంత్రి భేదమును అనగా బ్రహ్మను ఆత్మగా కలిగి యుండకయే పదార్థము లున్నవి యని చెప్పుటను నిషేధించుచున్నవి.

శిష్యుడు:— అమతం మతం, అవిజ్ఞాతం విజానతాం, యతో వాచో నివర్తన్తే ఇత్యాది శ్రుతులు పరమాత్మ తెలియబడదనియు, శబ్దములచే జెప్పబడదనియు చెప్పుచున్నది గదా! అందుకు కారణము పరమాత్మకు గుణాదు లేవియు లేక పోవుటయే! బహ్మయన్నచో బృహత్వగుణము 'నారాయణ' యన్నచో సర్వాంతర్యామిత్వము, సర్వాధారత్వము మొదలగు గుణములున్న చెప్పబడుటచే నది యిష్టము లేక పోవుటచేతనే శబ్దములచే చెప్పబడుట నిషేధింపబడుచున్నది గదా?

ఆచార్యుడు:— ఇతర ప్రమాణములచే తెలియబడని కల్యాణగుణములు పరమాత్మకు గలవని యాదరముతో బోధించి తిరిగి యవియేమియు లేవని నిషేధించి వంచకులవలె వేదము ప్రవర్తించునా? నీవు చెప్పిన వేదవాక్యములకు తాత్పర్యము పరమాత్మకు పరిచ్ఛేదము అనగా పరిమిత పరిమాణము లేదనియే గాని గుణాదులు లేకపోవుటచే తెలియబడదనియు శబ్దాదులచే చెప్పబడదనియుగాదు.

శిష్యుడు:— 'న జాయతే' అజాయమానః మొదలగు శ్రుతి వాక్యములు పరమాత్మకు పుట్టుక లేదనియు 'బహుధా విజాయతే' సంభవామి, తథా త్మానం సృజామ్యహం, మొదలగునవి పుట్టుక కలదనియు చెప్పుచున్నవి గదా! ఈవిరోధమును రామానుజ సిద్ధాంతు లెట్లు పరిహరింతురు?

ఆచార్యులు:— దాని కేమున్నది? పుట్టుక లేదని చెప్పెడు వాక్యములు మనవలె కర్మమూలకమగు పుట్టుక లేదనియు, పుట్టునని చెప్పెడు వాక్యములు, సజ్జనులను కాపాడుటకును, దుర్జనులను శిక్షించుటకును ధర్మమును నెలకొల్పుటకును 'ఆత్మమాయయాసంభవామి' యనుటచే తన సంకల్పము మాత్రముచేతనే యవతరించుననియు చెప్పుచున్నవి గాన విరోధము లేశమైనను లేదు.

శిష్యుడు:— మీరు జీవులకైక్యమును జెప్పెడు శ్రుతివాక్యముల నెట్లు సమన్వయింతురు?

ఆచార్యుడు:— 'నిత్యోనిత్యానాం' 'నత్వేవాహంజాతు నాసం నత్వం నేమే జనాధిపాః' మొదలగు ప్రమాణవాక్యములచే జీవులకు పరస్పర భేదము నంగీకరించి తీరవలెను. ఇక వారికైక్యమును బోధించు వాక్యముల విషయమేమనగా నవి వారందరును జ్ఞానాకారులే గాన నేకరూపులే యనగా నొకవిధమైన వారని మాత్రమే చెప్పును. అట్లు గాక జీవుడొక్కడే యైనచో నొకడు ముక్తుడనియు నొకడు బద్ధుడనియు నొకడు దుఃఖవంతుడు నొకడు సుఖవంతుడనియు నిట్టి తాత్పర్యము లేకుండపోవును

శిష్యుడు:- ఆచార్యా! మీరిట్లు నాద్యంతము లగు తత్త్వములు మూడని చెప్పుచున్నారే యట్లైనచో సృష్టికి పూర్వమిప్పుడున్న పదార్థము లేవియు లేవని చెప్పుచు 'ఏకోహ వై నారాయణ ఆసీత్, ఏకమేవా ద్వితీయం' ఇత్యాది వాక్యములు బ్రహ్మ యద్వితీయుడని చెప్పుచున్నవే దాని యభిప్రాయమేమి?

ఆచార్యుడు చేతనా చేతనములను వేరని తెలుసుకొన శక్యముగాని సంబంధముతో శరీరములుగాకలవాడు ఆపరమపురుషునివలె వేరొకడు లేడనియే యావాక్యముల తాత్పర్యము గాని యనాద్యనన్తములై పరమాత్మ కపృథక్సిద్ధ (వేరు చేయశక్యముగాని) విశేషణములగుటచే నన్నివేళలయందును శరీరములై యుండు చేతనాచేతనములు లేవని యర్థము కాదు.

శిష్యుడు:- రామానుజ సిద్ధాంతమున పరమాత్మ సర్వస్వతంత్రుడుగదా అయినచో జీవులాతనికి పరతంత్రులే యగుదురు. అప్పుడు 'ఇదంకురు' కావలసివచ్చునే. ఆయన ప్రవర్తింప జేసినదే గదా యచేతనమువలె చేతనుడును ప్రవర్తించ వలసినది?

ఆచార్యుడు:- జీవు డేపనిలోనైనను ప్రప్రథమముగ ప్రవర్తించునప్పుడు సర్వేశ్వరుడు స్వతంత్రుడు గావుననే కానిమ్ము! వాని పూర్వకర్మానుగుణముగ వాడు ప్రవర్తించుగాక యని తానుపేక్షించి చూచుచుండును. వాడట్లు మంచి పనిలో ప్రవర్తించెనా సర్వేశ్వరు డానందించి యాపని నిర్విఘ్నముగ కొనసాగింపజేసి దానికి తగిన సత్ఫలము నొసగును. దుష్కర్మలో ప్రవర్తించెనా కోపముతో నాపనిని కొనసాగనిచ్చి దానికి తగిన దుఃఖము నొసంగును. కాబట్టి విధినిషేధశాస్త్రములు వ్యర్థములు కావు. ఈసిద్ధాంతము నార్యులొక శ్లోకమున సంగ్రహించి చెప్పిరి. దానినినీకు జ్ఞాపకార్థమై చెప్పుచున్నాను వినుము.

ఆదా వీశ్వరదత్తయైన పురుష |
స్స్వాతంత్ర్య శక్త్యాస్వయం |
తత్తజ్జ్ఞానచికీర్షణ ప్రియతనా |
న్యుత్పాదయ న్వర్తతే |
తత్రోపేక్ష్య తతోఽనుమత్య |
విదధ త్తన్నిగ్రహానుగ్రహా |
తత్తత్కర్మ ఫలం ప్రయచ్ఛతి |
తత స్సర్వస్య పుంసో హరిః ||

ఈవివరణము బహుగ్రంధసాధ్యము గాన దీనిని గూర్చి నీకు విపులముగ నొక ఉపన్యాసమున వివరింతును.

శిష్యుడు:- మహాప్రసాదము! అట్లు కానిండు ఇట్లు చేతనుని సదసత్కర్మలవలన సర్వేశ్వరునకు నిగ్రహాను (గ్రహములు (కోపమును, ఆనందమును) పుట్టుచున్నచో ఆయనకూడ మనవంటి హేయ గుణాకరుడే యగునే. అట్టి వాడీశ్వరుడెట్లగును? ఆయన నిర్వికారుడని బోధించు శ్రుతులు మిథ్యార్థ బోధకము లగుటచే నప్రమాణ్యములు కావా?

ఆచార్యులు:- సర్వేశ్వరుడు నిత్యమగు నట్టియు హ్రాస లేనట్టియు కల్యాణగుణములు కల

వాటికావునను, జీవుడు చేయునట్టి యాగాదుల వల్లను ఉపాసనాదులవల్లను నాతని కనుగ్రహ నిగ్రహములు కలుగునని ప్రమాణములుండుట చేతను మనకున్నట్టి పరికిమాలిన క్షుద్రవికారములు లాయనకు లేవని నిర్వికార ప్రవృత్తులకర్థము కాన్పించెను గాని మనమేమి చేసినను ముత్తేక్షించు పాషాణప్రాయుడని చెప్పరాదు. అట్టి వానున్నను లేకున్నను నొక్కటియే.

శిష్యుడు:– మనము చేసిన పుణ్యపాపముల నంకశ గొనిగా శ్రియఃపతి విషమ సృష్టిని (హెచ్చుతగ్గులుగా సృజించుటను) చేయుచున్నాడందురే. అయినచో సృష్టికిమూల మాపుణ్యపాపములే గదా! వాటిచేతనే సర్వకార్యములు జరుగుచుండగా నిక ఈశ్వరుడేల? అయినచో సర్వేశ్వరుడు కలడని బోధించు వేదవాక్యముల గాతియేమి?

ఆచార్యుడు:– పుణ్యపాపముల స్వరూపము నెరింగిన నిట్లు ప్రశ్నింపవు. వినుము. పుణ్యమనగా శాస్త్రమున చేయుమని విధించిన పనిని చేయుటచే భగవంతునకు కలుగు యనుగ్రహమే ఆయనుగ్రహమువలననే స్వర్గాది సుఖము కలుగును. పాపమనగా–శాస్త్రమున చేయరాదని నిషేధించిన పనినిచేయుటచే భగవంతునకు కలుగు నిగ్రహమే. దానివలననరకాది దుఃఖములుకలుగును. కావున సర్వేశ్వరుడు లేనిచో నీ యనుగ్రహనిగ్రహరూపములగు పుణ్యపాపములు మారెక్కడ యుండును. అందువల్లనే ప్రళయమున నింద్రాదులు నశించి పోయినను వారికంతర్యామిగానుండు పరమాత్మ నిత్యుడు గాన చేసినకర్మలు వ్యర్థముకావు.

శిష్యుడు:– ఇట్లు సర్వేశ్వరుడే స్వర్గాది సుఖదుఃఖములను కలుగజేయుచున్నచో నిక నింద్రాది దేవతలేల? సాక్షాత్తుగ బరమాత్మనే నారాధింపుమని బోధింపక నింద్రాద్యంతర్యామిగ నాతని నారాధింపుమని బోధించుటవ్యర్థము కాదా! అప్రమాణము ల ప్రమాణములేయగును గదా!

ఆచార్యుడు:– ఇంద్రాదులు భగవంతునిచె నొక్కొక్క పనిని నిర్వహించుట కేర్పరచబడిన యాధికారిక పురుషులు గాన వారి యనుగ్రహముకూడ నవాంతర కారణమగుచున్నది. అందువలననే వారికంతర్యామిగనే పరమాత్మ నారాధింపవలెను. కావుననే యింద్రాదు లారాధకులు నారాధ్యులును గూడ నగుచున్నారు. వారు స్వయముగ పరమాత్మ నారాధింతురు గాన నారాధకులును మనచే స్వర్గాది ఫలములకొరకై పరమాత్మకు శరీరభూతులుగ నారాధింప బడుచున్నారు గాన నారాధ్యులును నగుచున్నారు.

శిష్యుడు:–ఆచార్యా! పరమాత్మ సర్వజ్ఞుడును సర్వశక్తియు నిరుపమదయావంతుడు నని యుందురు గదా! యట్లగుచో చేతనుడు మొదట చెడుపనిలో ప్రవేశించినప్పుడే వాడాపనిని జేయకుండ నడ్డపడక దాని నంగీకరించుట తప్పు కాదా!

ఆచార్యుడు— అతడు స్వతంత్రుడు. కావున నిది యాతనికి సహజమే దోషముకాదు.

శిష్యుడు— అయిన నాస్వాతంత్ర్యమే తప్పు.

ఆచార్యుడు— కాదు కాదుచెప్పెదను వినుము అది తప్పనుటకేమి ప్రమాణము. ప్రత్యక్ష మందువా? ఆతడింద్రియములకు గోచరించడు గాన ప్రత్యక్ష ప్రమాణ మెట్లావిషయమున నుపక రించును? అనుమానమందువా? అయినచో నా ప్రశ్నకు సమాధాన మిమ్ము. శాస్త్రములచే దెలుపబడు భగవంతుడున్నాడనియంగీకరించియే యాతనికి స్వాతంత్ర్యముండుట తప్పని చెప్పె దవా? లేక నట్టివాని నంగీకరింపకయే పచ్ఛిం తువా? అంగీకరించియే సమ్మతువేని యేశాస్త్ర ముచే నాతని నంగీకరింతువో యాశాస్త్రమే యాతనికా స్వాతంత్ర్యము గుణమని బోధించు చున్నది. గాన నీప్రశ్న కవకాశము లేదు. లేక యట్టి భగవంతు నంగీకరింపకయే స్వాతంత్ర్యము దోషమందువేని నీవుచెప్పెడు హేతువున కాశ్ర యమేది? కావున స్వాతంత్ర్యము దోషమనుటకే ప్రమాణములును లేకపోవుటచే నది గుణమే కాని దోషముకాదు.

శిష్యుడు— అట్టి స్వతంత్రునకు పచోనికదయాది గుణము లాతనికేల? అవి యతనిని కాసినచెన్న యే యగునుగదా!

ఆచార్యులు— ఎట్టి పాపాత్ముడైనను కొంత కాలమునకు తన కృత్యములకు పశ్చాత్తప్తుడై చేనికనెన్నడును భగవంతునకు ప్రతికూలముగ ప్రవర్తించనని నిర్ధారణ గావించినచో వారిపట్ల భగవంతుని దయాదిగుణములు నిరాఘాటముగ ప్రవర్తించును. కావున నవి సార్థకములే.

శిష్యుడు— స్వామీ! జ్ఞానమువలన మోక్షము లభించునని యనేక ప్రమాణములు ఘోషించు చుండ మీరు భక్తివలన మోక్షము లభించు నందురేల?

ఆచార్యులు— మేమును జ్ఞానము వలన నే మోక్షము లభించునందుము. అయిన నాజ్ఞానము మాత్రము మతాంతరులు చెప్పునట్లు వాక్యము వలన గలుగు సాక్షాత్కార రూపమైనది మాత్రము కాదు. వారికి సంసారము త్రాటి యందు కల్పింపబడిన పామువలె పరమాత్మ యందు అవిద్యచే గల్పింపబడినది గాన త్రాటి యొక్క సాక్షాత్కారముచే పాము నశించునట్లు బ్రహ్మ సాక్షాత్కార జ్ఞానముచే సంసారము నశించును. కాని మాసిద్ధాంతమున సంసారము నిత్యమైనదిగాన నది కేవల వాక్యార్థ జ్ఞాన మాత్రముచే నశించదు. కింతు భగవదుపాస నాత్మకమైన జ్ఞానముచే యాతని యనుగ్రహ మును బడయుటచే నాతడే యీబంధమును తొలగించి తన సాన్నిధ్యమునకు దీసికొనిపోయి తన సాయుజ్యము నొసంగును. ఇట్లు వేదమం తయు ప్రమాణముగ నంగీకరించుటచే మా రామానుజసిద్ధాంతమే "పూర్ణమీమాంసాదర్శ నముగుచున్నది."

శిష్యుడు— అయినచో నపూర్ణ మీమాంస కులు కూడ కొందరు గలరా? వారెవ్వరు?

ఆచార్యులు— ఔను కలరు వారు రాహుమీ మాంసకులనియు కేతుమీమాంసకులనియు నిరు తెరంగులు. నీవు సర్వేశ్వరుడు మోహినీ

రాచార్యులు ఉజ్జీవన గ్రంథముగా నమ్మి మన స్సును స్థిరముగా చేసుకొని ఆత్మను భద్రముగా కాపాడుకొని బద్ధాత్మలను సులభముగాకడ తేర్చు చుండిరి. దీనిని పవిత్రగ్రంథముగాను భగవంతుని సాక్షాత్కరింపజేయునదిగా విశ్వసించి పెద్దలగు వారు తమ్ము నాశ్రయించిన శిష్యులకు తమ పెద్ద లగు గురుజనములవలన తాము పొందు నుపదేశ మందిరో అట్లు నుపదేశించి కృతార్థులైరి.

సూర్యాదు మొదలగు దేవతలును మనువులు మొదలగు రాజులును కృతయుగ త్రేతాయుగ ములయందు నుపదేశమును పొందిరి ద్వాపర యుగమునందు శ్రీకృష్ణునివలన అర్జునుడును సంజ యుడును సంజయునివలన ధృతరాష్ట్రుడును గీతల నుపదేశమును పొందిరి. అటు వెనుకటి వారంద రును మహాత్ములగు వ్యాసాదులవలన అంగన్యాస కరన్యాస ధ్యాన ప్రకారములతో గూడిన రీతి సాంగోపాంగముగా నుపదేశమును బొంది కృ తార్థులైరి. కలియుగమునందు శ్రీశఠగోపమునులు పరకాలయోగి భక్తిసారులు మొదలగు ఆళు వారులు పదుగురును శ్రీగోదాదేవియునుమధుర కవులును శ్రీగీతార్థమునుగురుముఖముగా తెలుసు కొని అనుష్ఠించిరి. మరియు చేతనులకు తెలియు టకై తేటుపావై నాచ్చియార్ తిరుమొழி అను రెండు ప్రబంధములను ఆండాళ్ళు పాశురములు (పద్యములు) రూపముగా ద్రావిడమున పాడిరి. మధురకవులును కణ్ణినుణ్ శిరుత్తాంబు అను ద్రవిడప్రబంధమును పాడి మనకు నిత్యాను సంధానముగా నొసగిరి. శఠగోపమునులు (నమ్మా ళ్వార్లు) తిరువాయ్‌మొழி అను నామము గల ప్రబంధమును వెయ్యిపాశురములుగా శరణాగతి నై భవమును భక్తిభావ రసములతో గూర్చి విస్తారముగా ద్రావిడభాష యందు పాశురము లుగా పాడి తామనుభవించి మధురకవులు శ్రీమన్నాథమునులు మొదలగు మహామహులకు ప్రపత్తినిష్ఠా శ్రేష్ఠత్వమును విశదీకరించిరి. పర కాలయోగులును భక్తియోగనిష్ఠతో గూడిన ప్రపత్తినిష్ఠను తిరుమొழி అను పేరుగల పాశు రములును ఇంకను 5 ప్రబంధములను ద్రావిడ ప్రబంధముగా పాడిరి. అట్టి భక్తిరూపాపన్నజ్ఞాన మును భగవత్సాక్షాత్కారముచే లభించి ముక్తులై బ్రహ్మానంద మనుభవించిరి. వారు అనుభవిం చిన బ్రహ్మానందమును అనుభవజనిత ప్రీతికర్త చే పొంగి పొరలి ప్రవాహవేగమున పద్యరూప ములై వారి ముఖారవిందములనుండి బయలు వెడలి రసవంతములగు తీర్థములై ఇప్పటికిని భక్తి ప్రపత్తులుగల అధికారులు పవిత్రముగా మునుగుటకు భోగ్యముగా పానముచేసి తృప్తి బొంది కాలక్షేపములు చేయుటకు నిత్యయోగ్య మైయున్నది. పరమాచార్యులగు శ్రీమన్నాథ మునులు మొదలుకొని మన స్వాచార్య పర్యం తము అట్టి ద్రావిడ వేదరూపములగు పాశురము లను పరంపరగా గురుముఖమున ఉపదేశముల లభించి ఇప్పటివరకు భక్తితో ననుసంధించు చున్నారు. పాశురములనగా తెలుగున పద్యము లనిచేరు ఛందోబద్ధమై ప్రాసలక్షణములతో గూడినవై సంధి సమాసములతో ననగి పెనగి పదముల్లుకొని భక్తిరసంబుచే చక్కగా దడసి యూరినవై అష్టభక్తివిధులుగా పరిణమించి

రకు ప్రపత్త్యనుష్ఠానములునువివరముగాబోధించు యీ ద్రవిడ శ్రీ పాశురములు పదుగురాళ్వార్లును ఆండాళ్లు మధురకవులును పాడిరి. ఈపాశురముల సంఖ్య (4000) దీనికి నాలాయిర ప్రబంధ మని పెద్దలచే నిర్ణయమగు పేరుగలది. ఈపాశురములు భగవంతుండగు శ్రీమన్నారాయణునితో ఆత్మలకు గల నవవిధ సంబంధజ్ఞానముచే విశదముగ పాడబడినవి. ఈపాశురములు నాటి భావములు కదళీద్రాక్షా రసపాకములతో గూడినవి. రాగజ్ఞానము గలవారుఅనేక విధములగు రాగములకు సొంపుపరచి భక్త్యుద్రేకముతో పాడును శాళ్మేళములనుకట్టుకొన్నట్లుగా శ్రావ్యముగాగానము చేయుచు భజింతురు వినువారిని భక్త్యనుభవముచే పరవశులై మైమరచునట్లు చేయును గీతార్థములతో మిళితమయిన యీ నాలాయిరప్రబంధము ప్రపన్నులగు శ్రీవైష్ణవులకు అత్యంత ఆదరణీయమైనది పరమాచార్యులగు శ్రీమన్నాథమునులు ఉయ్యక్కొండార్లు మణక్కాలనంబి వారి శిష్యులగు శ్రీయాళవందార్లు (యామునాచార్యులు) మొదలగు పూర్వగురు పరంపరలగు ఆచార్యులందరును గీతల నభ్యసించి అర్థభావములను గురువుల వాక్కులనుండి విని అనుష్ఠించిరి. ఆళవందారులకు శిష్యప్రశిష్యులగు ఎంబెరుమానారులు (ఉడయవర్లు) శ్రీగీతా వాక్యార్థలను విశిష్టాద్వైత సిద్ధాంతములకు మూలప్రమాణములుగా విశ్వశించి యంగీకరించిరి. స్వమత సిద్ధాంతములకు శాస్త్రప్రమాణము లెన్ని యో యుండినను దానిని వెనుకద్రోసి గీతాశాస్త్రమనే పుత్తమోత్తను ప్రమాణముగా తమ సూత్రభాష్యములందు ఉదహరించిరి. శ్రీభాష్యములు వ్రాసిరి. సిద్ధాంతపూర్వక మతస్థాపనలు చేసియుండిరి.

హిందూమతమునకు శ్రీభగవద్గీత ప్రాణము వంటిది. యీ కలికాలమందుగూడ ఆస్తికులగు పుణ్యాత్ములు కొందరు శ్రీభగవద్గీతలను ప్రతిదినము పఠించుచు అర్థభావములను పెద్దలవలన వినుచు చక్కగా తెలిసికొని జ్ఞానులై భక్తులై ప్రపన్నులై ముముక్షువులై ముక్తులైయున్నారు. మరికొందరు గీతాశ్లోకములను గురువుల వలన కంఠపాఠముగా నేర్చుకొని ప్రాతఃకాలమున స్నానముచేసి అనుష్ఠానసమయమున నిత్యముగా పారాయణము చేయుచున్నారు మరికొందరు అర్థములువిని పలువిధములుగా తదర్థములను అనుష్ఠించుచున్నారు. కొందరు గీతాసారార్థములను విశేషార్థములను గ్రహించి స్థిరచిత్తులై పత్రియములు వీడి సంసారమందుండు సంసారస్మృతి యుంటక బ్రహ్మానందమున నోలలాడుచును ఎప్పుడును మరల మరల వినుచు శ్రీగీతాభాష్యకాలక్షేపములు విని యొకసారి తనివితీరక యింకను వినవలయునని యువ్విళ్లూరుచు కుతూహలపడుచున్నారు. ఇంక నాస్తికులగు పలుజాతులవారును ఖండఖండాంతరముల యందు వాసముచేయు విదేశీయులును మతాంతరపరులును దేవతాంతరపరులు సకల దేశవాసులును శాస్త్రజ్ఞులును భూగోళ ఖగోళ వాయుగోళ అగ్నిగోళ జలగోళ శాస్త్రప్రవీణులును పండితులును పాఠకులును శ్రీగీతను దైవస్వరూపముగా భావించి పూజించుచు శాస్త్రము

లన్నిటికంటె వుత్తమశాస్త్రముగా నంగీకరించి యున్నారు. యీ విధముగా దేవతలును మనుష్యులును మునుపటివారును యిప్పటివారును వెనుకటివారికిని గూడ పూజనీయమగు శ్రీభగవద్గీతా గ్రంధమును పామరులగు మూఢులు అజ్ఞానులునగు కొందరు జనులు చులుకనచేసి నిర్లక్ష్యముగా మాటలాడెదరు. గీతలం దేమి విశేషము గలదని ప్రశ్నించెదరు. అట్లడిగినవారు నిరక్షరకుక్షులు గనుక వారి మాటలు విద్వాంసులకును జ్ఞానులకును లక్ష్యము చేయవలసినది గాను అట్టివారి యాత్మనాశనము గాకుండుటకై వారి నాశీర్వదించవలసియున్నది.

---

## శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ నరసాపురము శాఖ

### ఖర సంవత్సర కార్యనిర్వాహక వర్గము.

ఈకార్యనిర్వాహకవర్గము ది 12-5-1951 తేదీని సాయంకాలమున శ్రీయతిరాజాశ్రమమున ఏకగ్రీవముగ ఎన్నుకోబడినది.

అధ్యక్షులు:- శ్రీమాన్ కొమాండూరి శేషాచార్యులుగారు (ప్లీడరు)
ఉపాధ్యక్షులు:- డాక్టరు, శ్రీమాన్ కొమాండూరి శేషాచార్యులుగారు
,, శ్రీమాన్ నడాదూరి వెంకటవరదకృష్ణమాచార్యులుగారు
కార్యదర్శులు:- శ్రీమాన్ తె. కం. వాసుదేవాచార్యులుగారు
,, శ్రీమాన్ ఈయుణ్ణి రాఘవాచార్యులుగారు
కార్యనిర్వాహక సభ్యులు:- శ్రీమాన్ మాడభూషి శ్రీనివాసాచార్యులుగారు ప్లీడరు.
శ్రీమాన్ వేదాల కోనప్పాచార్యులుగారు
శ్రీమాన్ తె. కం. శ్రీమన్నారాయణాచార్యులుగారు
శ్రీమాన్ భాష్యకారుల నాయుడుగారు
శ్రీమాన్ మంగు శ్రీనివాసరావుగారు

### శ్రీయతిరాజ సేవా మహిళా మండలి నరసాపురం శాఖ

### ఖరసంవత్సర కార్యనిర్వాహక వర్గము.

అధ్యక్షురాలు:- శ్రీమతి చిలకమర్రి రంగనాయకమ్మగారు
ఉపాధ్యక్షురాలు:- శ్రీమతి కొమాండూరి లక్ష్మీనరసమ్మగారు
కార్యదర్శిని:- శ్రీమతి అమరవాది వెంకటలక్ష్మీనరసమ్మగారు

# విజ్ఞప్తి



పంచసంస్కారపరులైన ప్రతివారు జీవితాంతమువరకు ప్రతినిత్యము, గురుపరంపరను, మంత్రత్రయమును అనుసంధించుకొనుచుండవలసినది, విధాయకమై యున్నది. మఠాధిపతులు-పీఠాధిపతులు-ఆచార్యపురుషులు అగు పెద్దలు తమ శిష్యులకు పంచసంస్కారముల కృపచేయుకాలమున వీటిని ఉపదేశింతురు. గాని అటు తరువాత వానిని తిరిగి శిష్యులకు కంఠస్థముగా వచ్చువరకు చెప్పుటకు గురువులకు సావకాశము లేకపోవుచుండుటచేతను, వ్రాసియిచ్చుటకు అవకాశము లేకపోవుటచేతను, అట్టి అవకాశమును లభించుకున్న శిష్యులు కొందరు తమయొక్క ఉద్యోగపు హడావిడిచేతనో లేక చదువుల సందడిచేతనో లేక యితరకార్యవ్యగ్రతచేతనో వీనిని మరచిపోవుటయు తటస్థించుచున్నది. క్రమప్రకారము సమగ్రముగ గురువులవలన ఉపదేశమును పొంది మరచిన ప్రపన్నుల వుపయోగార్థమై యిదివరలో మేము "గురుపరంపరాది" అను పేరుతో ఈవిషయముల పుస్తకరూపమున ప్రచురించి యుంటిమి- అవి అన్నియు యిపుడు శెలవై పోయినవి.

చాలమంది వానిని అడుగుచున్నారు. అందుచే తిరిగి వాటి నిపుడు ముద్రించుచున్నారము. ఇదివరలోని పుస్తకములలో ఎవరిమట్టుకువారు స్వాచార్య తనియలను వ్రాసుకొనుటకు వీలుగా ఒక పేజీ విడిచియుంచితిమి.

చాలమంది ఆచార్యపురుషులు తమ తనయనులనుకూడ తాము తిరిగి వ్రాసి యివ్వనవసరము లేకుండగ ఇందు అచ్చువేసి యివ్వవలసినదిగ కోరుచున్నారు. అందుచే ఈపర్యాయము తమ తనియలనుకూడ ఈపుస్తకములో అచ్చువేయించుకొనవలెనను అభిప్రాయముకలవారి కొరకై ఒకపద్ధతిని ఏర్పరచితిమి. ఏకపేజీలో తమ తనయులనుకూడ అచ్చువేయగోరువారు 100 పుస్తకములకు రూ. 12-8-0 చొప్పున ముందుగ మాకు పంపించినచో అట్టివారి తనియనులు ఒక పేజీలో అచ్చువేసి పంపగలము. రెండు పేజీలలో తమ తనయులను వేయగోరువారు 100 పుస్తకములకు రూ. 15-0-0 చొప్పున పంపవలయును. కాగితముయొక్కయు, అచ్చుయొక్కయు ప్రస్తుతధరల ననుసరించి ఈరేటును ఏర్పాటు చేయడమైనది.

నూరు పుస్తకములకు తక్కువ ప్రతులు వేయబడవు.

పుస్తక వివరము:-

1/32 డెమ్మీసైజు 24 పేజీలు ఇమిటేషను ఆర్టు లేక మేలురకం బాండు పేపరుమీద ముద్రించబడును. మంచి దళసరి అట్ట వేయబడును.

ఇందు:- (1) వాక్య గురుపరంపర, (2) శ్లోక గురుపరంపర, (3) తిరుమంత్రము, (4) ద్వయమంత్రము, (5) చరమశ్లోకము, (6) శ్రీరామచరమ శ్లోకములు, (7) శ్రీసీతాచరమ శ్లోకము, (8) శ్రీవరాహ చరమ శ్లోకములు, (9) శ్రీరంగ చరమ శ్లోకములు.
(10) శ్రీసుదర్శన చరమ శ్లోకములు, (11) శ్రీపాంచజన్య చరమశ్లోకములు, (12) శ్రీమణవాళ మహామునుల తనియ లగాయతు తిరువాయిమొళిపిళ్లై-పిళ్లైలోకాచార్యులు, వడక్కు-తిరువీథిపిళ్లై-నంబిళ్లై-నంజీయర్ భట్టర్-ఎంబారు-ఎంబెరుమానార్లు పెరియనంబి-శ్రీయాళవందారు-మణక్కాల నంబి-ఉయ్యక్కొండారు-శ్రీమన్నాథమునులు-నమ్మాళ్వార్లు-సేన మొదలియారు పెరియపిరాట్టియారు పెరియపెరుమాళ్ళతనయులువరకు ఉండును.

స్వాచార్యుల ఛాయాచిత్రమును అంటించుకొనుటకు లోపలి [illegible] పేజీలో ఏర్పాటుచేయబడును.

వలయువారు ఈ నెలాఖరులోగా సొమ్ముతోపాటు ఇందు అచ్చువేయవలసిన విషయమును విడివిడిగా చక్కగా మాకు వ్రాసి పంపగోరుచున్నారము.

N. B:— ఈవిషయములనే రఫ్ పేపరుమీద సాదా అట్టతో ముద్రించి ఇచ్చుటకు 100 పుస్తకములకు రూ. 6-4-0 మాత్రము అగును.

ఇట్లు,

భక్తి "నివేదన" కార్యాలయము,

అర్తమూరు-(వయా) ద్వారపూడి,

తూర్పుగోదావరి జిల్లా.

ప్రచార విభాగము







శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము

## ద్వాదశ వార్షిక విరాట్ సమావేశ తీర్మానములు



ది 15-4-1951 సం॥ం తేదీని మధ్యాహ్నము 2 గంటలకు తూర్పుగోదావరిజిల్లా రాజమహేంద్రవరమున శ్రీ ఉ. వే. శ్రీమాన్ పరాశర సుదర్శనభట్టరు అయ్యవార్లంగారి అధ్యక్షతను సమావేశమైన శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘము విరాట్ సమావేశ తీర్మానములు.

ఈతీర్మానములు ది 11-4-1951, 12-4-1951 తేదీలలో జరిగిన ఈసంఘ కార్యకారిణి సమితిలో ప్రవేశపెట్టబడి విషయనిర్ణయ సభలో చర్చించబడి విరాట్ సమావేశమున ప్రవేశపెట్టబడినవి.

1. ఈక్రింద తెలుపబడిన మహాశయులను ఖరనామ సంవత్సరమునకు కార్యకారిణి సమితిగ ఎన్నుకోవడమైనది.

– అధ్యక్షులు –

1. శ్రీ. ఉ. వే. శ్రీమాన్ పరాశర సుదర్శన భట్టరు అయ్యవార్లంగారు కోరుకొండ (వయా) రాజమహేంద్రవరము.

– ఉపాధ్యక్షులు –

2. ,, అక్కంకి తిరుమల సమయోద్దండ కోలాహల లక్ష్మీ నృసింహ కుమార తిరువెంకట తాతదేశికాచార్యులు అయ్యవార్లంగారు చీరాల గుంటూరు జిల్లా.

3. ,, నడాదూరి శఠకోపాచార్యులు అయ్యవార్లంగారునూజివీడుకృష్ణాజిల్లా.

4. ,, రావుబహదూరు వేమూరి రంగనాథ శ్రేష్టిగారు, ధర్మకర్తలు, శ్రీపార్థసారధి దేవస్థానము. 7 దక్షిణమాడ వీధి, తిరువళిక్కేణి మదరాసు

5. ,, తె. కం. గోపాలాచార్యులుగారు, కోరుకొండ (వయా) రాజమహేంద్రవరము.

- సహాయకార్యదర్శి మరియు కోశాధికారి -

6. ,, ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులుగారు అర్తమూరు. (వయా) ద్వారపూడి తూ. గో. జిల్లా.

- కార్యనిర్వాహక సభ్యులు -

7. ,, కొమాండూరి ఝళ్ళి విల్లి వెంకటాచార్యులుగారు కాళ్ళకూరు (వయా) భీమవరం ప. గోదావరి జిల్లా.

8. ,, పండిత చక్రవర్తి శ్రీనివాసరంగాచార్యులుగారు 29 పెరుమాళ్ మొదలివీధి, మదరాసు 1

9. ,, శాంతలూరి వెంకటాచార్యులుగారు చిన్నగోపురం వీధి, పాలకొల్లు, ప. గోదావరి జిల్లా.

10. ,, కవిరత్న గుదిమెళ్ళ రామానుజాచార్యులుగారు ముక్త్యాల అగ్రహారం, కూచనపూడి పోస్టు గుంటూరు జిల్లా.

11. ,, మెలుగు రామానుజాచార్యులుగారు ముగ్గుళ్ళ, పిప్పర పోస్టు, పశ్చిమగోదావరి జిల్లా.

12. ,, కో. కం. వెం. అప్పలాచార్యులుగారు రామన్నపేట, వరంగల్లు.

13. ,, తిరుమళ పురిఘళ్ళ ధర్మాచార్యులుగారు ఏడిద. (వయా) మండపేట, తూ. గోదావరి జిల్లా.

14. ,, కందాళ అప్పలాచార్యులుగారు శ్రీరామతీర్థము (వయా) నెల్లిమర్ల విశాఖజిల్లా.

15. శ్రీమాన్ మట్టపల్లి రంగనాథయ్యగారు 33 రెడ్డిరామన్నవీధి, మదరాసు 1.

16. ,, దాసశేషుగారు దాసకుటీరం అంగలకుదురు గుంటూరుజిల్లా

17. శ్రీ ఉ. వే. శ్రీమాన్ వ్యాకరణశిరోమణి చి. మా. వెంకటరాఘవాచార్యులుగారు గద్వాల బంగాళా నాంపల్లి రోడ్డు హైదరాబాదు.

18. ,, నడాదూరి గోపాలకృష్ణమాచార్యులుగారు మంగళంపాడు (వయా సూళ్లూరుపేట, నెల్లూరుజిల్లా

19. శ్రీమాన్ పాతాళం వీరరాఘవుల శ్రేష్ఠిగారు, అడ్వకేటు ఆదియప్పనాయకన్ వీధి మదరాసు 1.

20. ,, బోయిన శీతారామయ్యగారు జేతపోలు (వయా) గుడివాడ కృష్ణాజిల్లా
21. శ్రీ ఉ. వే. శ్రీమాన్ కలవగుంట శేషాచార్యులుగారు తణుకు, పశ్చిమగోదావరిజిల్లా
22. ,, కరాళపాటి రాధాకృష్ణయ్యగారు 147 అక్కాపిళ్ళైవీధి, మదరాసు 1.
23. ,, తె. కం. వరహాస్వామిగారు కోరుకొండ,
(వయా) రాజమహేంద్రవరం.

ఇంకను ఏమగురు సభ్యులను అవసరానుసారముగ ఈసమితిలో చేర్చుకొనుటకు కార్యదర్శులకు అధికార మివ్వడమైనది.

అంగీకరించడమైనది.

2. ఈక్రింది మహాశయులు ఈసంఘశాశ్వత సభ్యులుగ చేరినందున వీరిని శాశ్వతసభ్యులుగ అంగీకరించడమైనది. మరియు వీరిని సంచాలక సమితి సభ్యత్వమును అంగీకరించడమైనది.

1. శ్రీ ఉ. వే. శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులుగారు కోరుకొండ (వయా) రాజమహేంద్రవరం.
2. ,, అ. చి. శ్రీమన్నారాయణాచార్యులుగారు, అర్తమూరు. (వయా) ద్వారపూడి.

3. శ్రీయతిరాజసేవా మహిళా మండలియొక్క మదరాసు శాఖను అంగీకరించడమైనది. అచ్చటి ఈశాఖా కార్యక్రమములు నడిపించుచు ఆశాఖకు సహాయకులుగ యుండుటకు ఈక్రింది వారిని ఏర్పాటు చేయడమైనది.

1. శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులుగారు
2. ,, అ. చి. శ్రీమన్నారాయణాచార్యులుగారు
3. ,, కరాళపాటి రాధాకృష్ణయ్యగారు
4. శ్రీమాన్ మట్టపల్లి రంగనాధయ్యగారు
5. ,, పాతాళం వీరరాఘవులు శ్రేష్ఠిగారు

అంగీకరించడమైనది.

4. ఈసంఘమును యిపుడు క్రొత్తగా రెజిష్టరు చేయడమైనది. గాన యింతవరకు ఈసంఘమునకున్న ఆర్థిక బాధ్యతలను సరిచూసి బాకీలను తీర్చివేయవలసినదిగ కార్యదర్శులను కోరుచు వారికి అధికారమివ్వడమైనది.

అంగీకరించడమైనది.

5. కాంచీపురమున విశ్వకల్యాణోత్సవమును శ్రీరంగమున శ్రీభగవద్విషయ వైభవోత్సవమును, తిరుపతిలో శ్రీ వెంకటేశ్వరవ్రతమును అవకాశానుసారముగ జరుపుటకు వలయు ఏర్పాటుల నన్నింటిని చేయ కార్యదర్శులను కోరడమైనది. అంగీకరించడమైనది.

అధ్యక్షులు,
సం॥ పరాశర సుదర్శన బట్టరు,

---

# శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము యొక్క
# 1948-1949 సంవత్సరముల జమ ఖర్చులు.

<u>సద్వృత్తసంకౌతా</u>

12—2—1948

| | | |
|---|---|---|
| శ్రీమాన్ కలవగుంట శేషాచార్యులుగారి వలన జమ 1476-1492 | 15- 0-0 | |
| వీరికైన ఖర్చులు | | 3-12-0 |
| శ్రీమాన్ కో. ఋ వేంకటాచార్యులుగారి వలన పాతబాకీక్రింద జమ | 2- 4-0 | |
| శ్రీమాన్ గు. వెం. నరసింహాచార్యులు గారివలన జమ | 2- 0-0 | |
| శ్రీమాన్ వ. గోపాలకృష్ణమాచార్యులుగారిద్వారా జమ | 6- 0-0 | |
| వీరికైన ఖర్చులు | | 1- 8-0 |
| శ్రీమాన్ క. శేషాచార్యులుగారివలనజమ | 5- 0-0 | |
| వీరికైన ఖర్చులు | | 1- 4-0 |
| శ్రీమాన్ తి. పు. జగన్నాథాచార్యులుగారి ద్వారా జమ | 20- 0-0 | |
| వీరికైన ఖర్చులు | | 5- 0-0 |

8—12—48

| | | |
|---|---|---|
| శ్రీమాన్ క. శేషాచార్యులుగారి వలనజమ | 18-0-0 | |
| వీరికైన ఖర్చులు | | 4- 8-0 |
| ,, | 4- 12-0 | |
| వీరికైన ఖర్చులు | | 1- 4-0 |
| సత్సంప్రదాయచందా 541 రశీదు | 0- 4-0 | |
| శ్రీ తి. పు. జగన్నాథాచార్యులుగారివలనజమ | 8- 2-0 | |
| వీరికైన ఖర్చులు | | 2- 0-0 |

21—9—1949

| | | |
|---|---|---|
| శ్రీ క. శేషాచార్యులుగారి వలనజమ | 1- 0-0 | |
| వీరికైన ఖర్చు | | 0- 4-0 |
| శ్రీ తి పు. జగన్నాథాచార్యులుగారి వలన జమ | 20- 0-0 | |
| వీరికైన ఖర్చులు | | 5- 0-0 |

సిబ్బంది జీతములకాతా

| | |
|---|---|
| జనవరి | 2—0—0 |
| ఫిబ్రవరి | 4—0—0 |
| మార్చి | 4—0—0 |
| ఏప్రెల్ | 4—0—0 |
| మే | 4—0—0 |
| జూన్ | 4—0—0 |
| జూలై | 4—0—0 |
| ఆగస్టు | 4—0—0 |
| సెప్టెంబరు | 4—0—0 |
| అక్టోబరు | 4—0—0 |
| నవంబరు | 4—0—0 |
| డిశంబరు | 4—0—0 |
| జనవరి—డిశంబరు | 48—0—0 |
| | 94—0—0 |

16—6—1948

ప్రచారంకాతా

| | | |
|---|---|---|
| పోష్టుకార్డులు వగైరాలకు అచ్చువేసు ఆయాసంఘములు యిచ్చిన పోష్టేజీ తీసివేయగా అదనముగా అయినది. | | 32-0-0 |
| లెటరుహెడ్డులు అచ్చువేయించుటకు ½ డెమ్మీసైజు చ్చునకు కాగితమునకు | | 22-0-0 |
| కవర్లు అచ్చునకు కవర్లుఖరీదు | | 3-0-0 |
| ఫొటో ఆల్బం | | 8-0-0 |
| శ్రీమొలుగు రామానుజాచార్యులుగారివల్ల జమ | 30-0-0 | |
| విజయవాడ నివేదిక అచ్చునకు ఈయ బడిన విరాళము | 100-0-0 | |
| Do దీని అచ్చునకు కాగితమునకు | | 90-0-0 |
| ఆచార్యప్రతిపత్తి పుస్తకముల అచ్చునకు 1500 లకు శ్రీకవిగారిచ్చిన రు 25/లతో కలిపి శ్రీకోలంక రాణీగారివలన విరాళం | 116-0-0 | |

అచ్చునకు కాగితమునకు 120-0-0
కవిగారికి 25-0-0
ఇతర ఖర్చులు 5-0-0
150-0-0

5-3-50

శ్రీచిగురుపాటి వెంకటశివరామయ్యగారి
కుమార్తె అన్నప్రాశన సమయమున 2-0-0

7-6-50

శ్రీ గుడిమెళ్ల వెంకటార్జునగారు తమ
కుమార్తె వివాహసమయమున 10-0-0

శ్రీ ముటుకూరి వెంకయ్యగారు తమ
కుమారుని వివాహ సందర్భమున
సమర్పించినది 5-0-0

శ్రీ స. చ. అప్పలాచార్యులుగారుతమచిన్న
కుమారుని ఉపనయనమునకును, తమపెద్ద
కుమారుని శుభకార్యమునకును
సమర్పించినది 5-0-0

శ్రీ ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులు
గారు తమకుమార్తె శుభకార్యమునకు
సమర్పించినది 5-0-0

10-6-50

శ్రీయతిరాజ [illegible] కుమార [illegible]
స్వామివారివలన 3-0-0

[illegible] ఆదెమ్మగారివలన 1-0-0

ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులుగారివలన
సమాశ్రయణ సమయమున 5-0-0

శ్రీమతి కస్తూరి ధనమ్మగారివలన ఆడె
[illegible]గారి [illegible] సమయమున 5-0-0

శ్రీసలాది చిన్నరామలింగయ్యగారి
పరమపదోత్సవ సందర్భమున 10-0-0

19-2-51

శ్రీఅమరవాది నారాయణాచార్యులగారివలన 5-0-0

24-2-51

శ్రీదుద్యాలటి కే. అయ్యం గారివలన 20-0-0

10-9-50

శ్రీ జి. సూర్యనారాయణ శ్రేష్ఠిగారివలన
తమ కుమారుని వివాహ సందర్భమున 10-0-0

## సభ్యత్వం కాతా

ఒంగోలులో చేర్చిన సభ్యులవలన వచ్చిన
జమ 19-8-0

నెల్లూరులో శ్రీయతిరాజసేవా మహిళా
మండలి సభ్యత్వ రుసుము వసూలు 26-0-0

Do 1-0-0

## పరీక్షల కాతా

హైదరాబాదులో పరీక్ష బహుమతుల
కిచ్చినది 22-8-0

ఏలూరులో యిచ్చిన పరీక్ష బహుమతులు 11-0-0

శ్రీమతి ముదుంబై రంగనాయకమ్మ గారి
వలన పరీక్ష బహుమతుల నిమిత్తమైజమ 44-8-0

పరీక్షల నిధికై శ్రీమాన్ కాండ్యూరి
జగన్నాధాచార్యులు గారిచ్చిన విరాళం 25-0-0

ఒంగోలులో చేసిన పరీక్ష విధాన తీర్మానం
అచ్చువేసినది పేజీలు 1000 కాపీలు ఖర్చు 42-8-0

## పోస్టేజీ కాతా

| | | |
|---|---|---|
| | కార్డులు వగైరాలకు | 4-8-0 |
| 15-4-50 | Do | 0-5-0 |
| 29-5-51 | Do | 1-12-0 |
| 1-8-50 | Do | 1-5-0 |
| 12-9-50 | Do | 3-4-0 |
| 18-9-50 | Do | 1-10-0 |

# శ్రీయతిరాజసేవా మహిళా సమితి

## వార్షిక సభ కాతా

సభ ఏర్పాటులకు 26-0-0

ఉత్తరములు కాగితములు పోస్టేజీ 12-0-0

తదీయారాధన నిమిత్తమై 250-0-0

శ్రీమతి కొంపల్లె అండాళ్ళమ్మగారి వలన
తదీయారాధన ఖర్చులకు 330-0-0

తదీయారాధనలో మిగిలిన సామానుల
అమ్మకం వలన జమ 80-0-0

## గ్రంథాలయం కాతా

మైలవరంలో శ్రీరాణీగారు సమర్పించిన
పుస్తకములుకొరకు కొండచేర్పుటకై సఖర్చు 22-8-0

ఈపుస్తకముల ప్యాకింగు వగైరాలకు
శ్రీరాణీగారు సమర్పించినది, 5-0-0

## ప్రచారం కాతా

ఈసంఘమునకు నియమావళి అచ్చునకై
కాగితమునకు 38 పేజీలు 2000కాపీలు



శ్రీ విష్ణుకోటితులసీదళ పూజామహోత్సవమునందు తీయబడిన ఛాయాచిత్రము రాజమహేంద్రవరము



పై సందర్భమున యతిరాజసేవామహిళామండలివారియొక్క ఛాయాచిత్రము

# ప్రకటన.

## శ్రీవైష్ణవ మహాశయులకొక విజ్ఞప్తి



సుమారు 30 సంవత్సరములుగ నాపురమున ఆంధ్రదేశమునందుండునట్టి శ్రీవైష్ణవబృందమునకు సహాయముగ ద్రావిడభాష యందుండునట్టి తిరుమంత్రార్థ శ్రీవచన భూషణాద్యనేక గ్రంథంబుల నాంధ్రీకరించి అచ్చొత్తించి సమర్పించుచు వచ్చియున్నాడను. ప్రస్తుతము భగవద్విషయగ్రంథమును సుమారు 8 సంవత్సరములుగ కృషి సల్పి సేకరించి అచ్చొత్తించుచున్నాడను. ఒక్కొక్క పత్తును రెండుభాగములుగా ప్రచురించుచున్నాడను. ప్రస్తుతము మొదటి పత్తును మొదటిభాగము ప్రచురింపబడినది. దీని వెల రూ 4-0-0 కాగితముల ధర హెచ్చుగా నున్నందున అచ్చువేయించుటలో కడు వ్యయము హెచ్చు అయినందునను ద్రవ్యము లేక 250 గ్రంథములను మాత్రమే అచ్చొత్తించినాడను. వలయువారు వెంటనే తెప్పించుకొనుట మేలు మంచిది. తరువాత గ్రంథములు దొరకచాలవు.

ఆంధ్రీకరించిన పద్ధతి 1. పాశురము, 2 పాశురముయొక్క ప్రతిపదార్థ 3. అన్వయ దండాన్వయములను తెలుపునట్టి యొకప్రణాళిక 3. తెనుగున ఆరాయిరప్పడి వ్యాఖ్యానము 4. ద్రావిడమునను, ఆంధ్రమునను, ఈడు ముప్పత్తారాయిరప్పడి వ్యాఖ్యానము. 5. అరుంబదవి శేషములు. 6. ప్రమాణ త్రిజట్టు విశేషములు. ఈలాగున ఒక్కొక్క తిరువాయ్ మొళిని ఆంధ్రీకరించిన పిమ్మట ఆతిరువాయ్ మొళి అంతమున ఆయాతిరువాయ్ మొళి సారాంశముగాను శ్రీవేదాంత దేశికులవారు సాయించిన ద్రవిడోపనిషత్తాత్పర్య రత్నావళి శ్లోకమును దాని టీకాతాత్పర్యంబులును దానికి పూర్వాచార్యులు సాధించిన వ్యాఖ్యానంబును ఆంధ్రీకరింపబడినవి అటుపైని అవ్విధముగానే శ్రీమనవాళమామునులు సాధించిన తిరువాయ్ మొళి నూత్తందాది పాశురమున్ను దాని టీకా తాత్పర్య వ్యాఖ్యానములు ఆంధ్రీకరింపబడినవి. ఈ మాదిరిగానే తిరువాయ్ మొళి పదిపత్తులును ఆంధ్రీకరింపబడి ప్రచురింపబడుచున్నవి. కాగితముల ధర హెచ్చయినందున కొంచముగ ధర హెచ్చయినను చదువరులు నన్ను క్షమింపవలయునని ప్రార్థించు చున్నాడను.

భగవద్విషయము మొదటి పత్తు మొదటి భాగము రూ 4-0-0

పోస్టేజి ప్రత్యేకము వలయువారు ఈక్రింది విలాసమునకు వ్రాయుడు

కందాడై శేషాచార్యులు

వేదాంత ముద్రాక్షరశాల, బ్రాడీపేట, గుంటూరు.

శ్రీ ర్జయత్

# పాదుకాయాచన

శ్లో. భగవన్ యది తే ప్రీతిః వర్తతే మయి సాంప్రతమ్ ।
"పాదోస్య విశ్వాభూతాని" శ్రుత్యా యా సంస్తుతౌ సదా ॥

శ్లో. రక్షిత స్తైర్హి తౌ పాదౌ పాదుకే భక్తిభావతః ।
భరత శ్చే న్న యాచేత రావణ స్తే లభే ద్ధ్రువమ్ ॥

శ్లో. తత్ప్రభావా చ్చిరంజీవేత్ రావణో లోకరావణః ।
ఇతి సంచింత్య ముముదే వశిష్ఠో యత్కృతే భృశమ్ ॥

శ్లో. తే శుభే పాదుకే నిత్యం మమ మూర్ధ్ని నివేశయ ।
యాభ్యాం సంపాలితా యోధ్యాఽభవ ద్ధర్మమందిరా ॥

శ్లో. కృతార్థోహం భవిష్యామి తేన సంసారనాశనమ్ ।
ప్రార్థయే త్వాం సదారామ సఫలం కురు ప్రార్థనామ్ ॥

ఏవం

దాసః

చామర్తి కూర్మాచార్యః

కళింగపట్నం.

# శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ

## వైశాఖమాస పండిత సభ

(నరసాపురం—శ్రీఎంబెరుమానార్ సన్నిధిలో)

స్వస్తిశ్రీ ఖరనామ సంవత్సర వైశాఖ శు విదియా మంగళవారం (8-5-51) నాడు పశ్చిమగోదావరిజిల్లా నరసాపురమున వేంచేసియున్న శ్రీయెంబెరుమానారుల సన్నిధిలో ఉదయం గం 8-0లకు అంతర్వేదిపాలెంలో వేంచేసియుండే శ్రీ ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి శేషశింగరాచార్యస్వామివారి అధ్యక్షతక్రింద శ్రీవిశిష్టాద్వైత ప్రచారక వైశాఖమాస పండిత సభ ప్రారంభమాయెను. స్థానికపండితులగు శ్రీ ఉ. వే శ్రీమాన్ ఈయుణ్ణి రాఘవాచార్యులుగారు మంగళశ్లోకాను సంధానము గావించి పండిత మండలికి స్వాగతమును విన్నవించిరి

పిమ్మట శ్రీ అధ్యక్షస్వామివారు శ్రీవిశిష్టాద్వైత సిద్ధాంతవైభవమును సంగ్రహముగా సాయించియీసిద్ధాంతప్రచారావశ్యకతను వివరించి సంఘసేవను ప్రశంసించిరి.

ప్రతిదినము ఉదయము గం 8-0 లు మొదలు గం 11-0ల వరకును మధ్యాహ్నము గం 4-0లు మొదలు గం5-0ల వరకును పండితులచేతను మధ్యాహ్నము గం 2-0లు మొదలు గం 4-0ర వరకు విదుషీమణులచేతను యీక్రిందివిధముగా వేదాంతవిషయము లుపన్యసించబడెను

| పండితుల తిరునామములు | ఉపన్యసించబడిన విషయములు |
|---|---|
| 1 శ్రీఅధ్యక్షులవారు | శ్రీవిశిష్టాద్వైత సిద్ధాంత సంగ్రహము, అర్చావతారవైభవము |
| 2 వ్యాకరణ శిరోమణి శ్రీ ఉ. వే. శ్రీమాన్ కిళాంబి వెంకటనరశింహాచార్యులుగారు (నెల్లూరు) | శ్రీవిశిష్టాద్వైత మతస్వరూపము |
| 3 శ్రీ ఉ వే శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్యులుగారు (అంతర్వేదిపాలెం | కప్యాస శ్రుత్యర్థవిచారము |
| 4 శ్రీ ఉ. వే. శ్రీమాన్ కిళాంబి వెంకటరంగశఠగోపరామానుజాచార్యులుగారు (అంతర్వేదిపాలెం) | ఇరామానుశనూత్తందాది పాశురార్థము |
| 5 శ్రీ ఉ. వే. శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులుగారు (కోరుకొండ) | యతిరాజ విజయనాటకము |
| 6 శ్రీ ఉ వే. శ్రీమాన్ తి. పు. వెంకటాచార్యులుగారు (మాధవరం) | "కాలత్రయేపి" అనుశ్లోకార్థోపన్యాసము |
| 7 శ్రీ ఉ. వే. శ్రీమాన్ అ. చి. శ్రీమన్నారాయణాచార్యులుగారు | శ్రీభాష్యకారవైభవము |
| 8 శ్రీ ఉ. వే. శ్రీమాన్ కాంతలూరి వెంకటాచార్యులుగారు (పాలకొల్లు) | రామానుజవైభవము |
| 9 శ్రీ ఉ. వే శ్రీమాన్ శ్రీపరాశర సుదర్శన భట్టరు అయ్యవార్లంగారు | భగవత్కల్యాణగుణములు. |

విదుషీమణుల. తిరునామములు

1 శ్రీమతి నందూరి ఆనందమ్మగారు (ఏలూరు).
2 శ్రీమతి అమరవాది వెంకటలక్ష్మీనరసమ్మగారు (నరసాపురం)
3 శ్రీమతి శాతలూరి చూడికొడుత్తమ్మగారు (నరసాపురం)
4 శ్రీమతి మరింగంటి రంగనాయకమ్మగారు (కోరుకొండ)

శ్రీమతి కత్రాణాయారమ్మగారిచే నిర్మింపబడిన శ్రీయతిరాజాశ్రమము పండితులకు విడిదిగానేర్పరచబడెను. అచ్చట ప్రతిదినము ఉదయము 7 గంటలకే తిరువారాధన తీర్థప్రసాదగోష్ఠి వగైరాలు వైభవముగా జరుపబడెను. ఈ ఆశ్రమము వచ్చిన

యాత్రికులకు వాల సదుపాయముగ నున్నది, దీనిని అన్ని విధముల భక్తులందరు ప్రోత్సహిం నుజాయ నమః

నాయకులైన శ్రీయెంబెరుమానారుల ఉత్సవ మతివైభవముతో జరిగెను. దానిని సేవింపవచ్చిన

తన్నులార సేవించి తద్విశేషములను చెవులార విని మహానందభరితులైరి. ఖడే సృష్టి – స్థితి – లయ

ఈసభా నిర్వాహకులకు శ్రీమాన్ తె. కం. వాసుదేవాచార్యులుగారు శ్రీ ఉ. వే.

గారు మొదలగు ఆహ్వాన సంఘ సభ్యుల కృషికి మాహార్ద ధన్యవాదములు. )దాత.

స్వామి – పరమాత్మ.

శ్రీ నిఖిలహేయ ప్రత్యనీక కల్యాణ

యుమైన

తాలూకు జమ ఖర్చులు సగుణకుడు.

సాంప్రదాయ విషయకమైన

త్తరములున్ను ప్రచురించబడును.

---

చందాలు:

| | | |
|---|---|---|
| సాధారణ చందా | సం. రం 1కి | రు. 5–0–0 |
| సహాయ చందా | ,, | రు. 10–0–0 |

5. ఆయనకు జీవుడు శరీరభూతుడు; శేషభూతుడు, పరతంత్రుడు; నియామ్యుడు; అనుభావ్యుడు.
6. జీవులు జ్ఞానైకాకారులు.
7. జీవులు అనంతములు.
8. జీవులు పరమాత్మకంటె భిన్నులు; ఈ భేదము సత్యమైనది; నిత్యమైనది.
9. జీవ–పరమాత్మలకు ప్రకృతి శరీరభూతమైనది; శేషభూతమైనది; పరతంత్రమైనది; నియామ్యమైనది; అనుభావ్యమైనది.
10. ప్రకృతి వికారస్పదమైనది. జీవ–పరమాత్మలకంటె భిన్నమైనది: ఈ భేదము సత్యమైనది; నిత్యమైనది.
11. జీవుడు ప్రకృతి వియుక్తుడై పునరావృత్తిరహితమైన పరమాత్మ సాన్నిధ్యానాగు పరమపదమును పొందుటయే మోక్షము.
12. భక్తి ఒక్కటియే మోక్షసాధనము.
13. భక్తియన తైలధారవలె అవిచ్ఛిన్నమైన స్మృతి పరంపర.
14. వివేక–విమోక–అభ్యాస–క్రియా – కల్యాణ అనవసాద–అనుద్ధర్షలు భక్తికంగములు.
15. ఇవి సదాచార్య–సమాశ్రయణ–లభ్యములు
16. జగద్గురువగు శ్రీరామానుజా చార్యులు వారును; వారి యనుయాయులున్ను సదాచార్యులు.

"నగురుర్వైష్ణవాత్ పరః" ఖా. సం.

Book-Post

To

Edited printed & published by A. Ch. srimannarayanacharya, at Sriman press, Kakinada, E. G. Dt.

శ్రీ

    

శ్రీమతే రామానుజాయనమః


భక్తి

# నివేదన

వేదాంత మాసపత్రిక

| సంపుటి 3 | ఖర – జ్యేష్ఠమాసము | సంచిక 3 |
|---|---|---|


## భగవద్రామానుజవైదుష్యము – కప్యాసశ్రుత్యర్థము


(ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులుగారు అర్తమూరు)


సామవేదీయమైన ప్రధానోపనిషత్తు ఛాందోగ్యోపనిషత్తు.

ఇందు ౧౩ బ్రహ్మవిద్యలుగలవు. అందు అంతరాదిత్య విద్యయని ఒక అపూర్వ బ్రహ్మవిద్య గలదు. "యోగినాం హృదయే రవౌ" అను న్యాయానుసారముగ సూర్యమండలాంతర్వర్తియైన హిరణ్మయ స్వరూపుడైన శ్రీమన్నారాయణుని ఉపాసనావిధి ఈ ఉపనిషత్తునందు గలదు.

అందు ఉపాస్యుడైన శ్రీమన్నారాయణుని స్వరూపవర్ణనము ఇటులగలదు. ఛాందోగ్యోపనిషత్తు ౧. ౬. ౬. ...

"అథ య ఏషోఽంతరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే। హిరణ్యశ్మశ్రుః హిరణ్యకేశః ఆప్రణఖాత్ సర్వ ఏవ సువర్ణః। తస్య యథా కప్యాసం పుండరీకం ఏవమక్షిణీ। తస్యోదితి నామ స ఏష సర్వేభ్యః పాప్మభ్యః ఉదితః। ఉదేతి హ వా సర్వేభ్యః పాప్మభ్యః య ఏవం వేద॥

సూర్యమండల మధ్యవర్తియై హిరణ్మయుడైన పురుషుడొకడు చూడబడుచున్నాడు. ఆయన మీసములు బంగారువర్ణములు గలవి. కేశములు బంగారువర్ణముగలవి. శిరస్సు మొదలు కాలి గోరువరకు అంతయుకూడ బంగారువర్ణమే. ఆయననేత్రములు గంభీరాంభస్సముద్భూత సుమృష్టనాళ రవికర వికసిత పుండరీక దళములవలె అమలములై ఆయతములై యున్నవి. ఆయనకు 'ఉత్' అని పేరు. ఆయన పాపములకన్నింటికిన్ని అతీతుడు. ఈవిధముగ ఈయనను ఉపాసనచేయువాడు తన సమస్తపాపములనుండి

విడివడును, అని ఈశ్రుతియొక్క అర్థము.

ఈశ్రుతిలో ఉపాస్యుడైన పరమాత్ముని రూపము-నామము-వర్ణించబడినవి. ఉపాసనకు ఉపాస్యుని రూపనామముల విధిగా నావశ్యకములు. అవియేకదా ఉపాసకుడు తెలుసుకొనవలసిన ప్రధానవిషయములు.

ఈరూపవర్ణనవిధిలో-

"తస్య యథా కప్యాసం పుండరీకం ఏవమక్షిణీ"

అని ఉపాస్యుని నేత్రవర్ణన గలదు. నేత్రములే వ్యక్తియొక్క రూపమున కత్యావశ్యకములు. మరియు భగవంతునిరూపమున అసాధారణములైన అవయవములు ఆయన నేత్రములే. గనుకనే ద్రౌపది తన ఆపత్కాలమున చేసిన ప్రార్థనలో "శంఖచక్ర-గదాపాణే; ద్వారకానిలయ; అచ్యుత, గోవింద," అని భగవంతుని ప్రార్థించెను. అందులకాయన పలుకలేదు.

చిట్టచివరకు 'పుండరీకాక్ష' అని ఆమె పిలిచెను. వెంటనే భగవదనుగ్రహము కలిగెను. మరియు ఆయన ఆమె కోరికను నెరవేర్చెను. దీనివలన ఏమి తెలుచున్నది. భగవంతునికి "పుండరీకాక్ష" యను తన నేత్రవర్ణనారూప ప్రార్థనమే మిక్కిలి ప్రియమైనది, అదియే ఆయన కసాధారణమైనది. అదియే ఆయన సర్వజ్ఞత్వమును, సర్వేశ్వరత్వమును, సౌలభ్యమును, వాత్సల్యమును ఉద్బోధించునది. మనలను ఉద్ధరించునదియున్ను. అదియే భక్తుల పాలిటి పెన్నిధి.

ఈవర్ణనలో యున్న విశేషమేమి? దీని యర్థమును పూర్తిగా గ్రహించినగాని దాని విశేషమును తెలుసుకొనజాలము. ఈఅత్యంతావశ్యకమైన భాగమునకు అనేకులు అనేక విధములుగ అర్థమును తెలుపుచుందురు.

భగవద్రామానుజులవారు యాదవ ప్రకాశులవద్ద ఈఛాందోగ్యశ్రుతికి అర్థమును తెలుసుకొనుచుండిరి. అపుడు యాదవప్రకాశులు తనకు తెలిసిన అర్థములను భగవద్రామానుజులవారికి తెలిపిరి. కాని అవి అన్నియు భగవద్రామానుజులవారికి సందర్భరహితములుగను దోషభూయిష్ఠముగను గన్పట్టెను. వారు ఆ అసందర్భములగు దోషములను శాస్త్రీయముగా గుర్తించిరి. శాస్త్రజ్ఞులైన యాదవప్రకాశులు వాని నన్నింటిని అంగీకరించక తప్పలేదు.

పిమ్మట యాదవ ప్రకాశులు భగవద్రామానుజులను ఈశ్రుతికి సరియగు అర్థమును తెలుప గోరెను. భగవదంశా సంభూతులగు భగవద్రామానుజులువారు అపుడే శ్రుతికి సరియైన యర్థమును [illegible] యుండిన ప్రకాశుల నిమిత్తముగ చేసుకొని వర్ణించి కటాక్షించిరి.

యాదవప్రకాశులు:- రామానుజా! ఏదీ, ఆ ఛాందోగ్య శ్రుతిని చదువుము. అర్థమును వివరించెదను.

రామానుజులు:-

"తస్య యథా కప్యాసం పుండరీకం
ఏవం అక్షిణీ"

యాదవప్రకాశులు:- ఇది అంతరాదిత్య విద్యలో తెలుపబడిన సూర్యమండలాంతర్వర్తియగు హిరణ్మయ వర్ణుడైన ఉపాస్యుడైన పరమాత్ముని వర్ణనము.

రామానుజులు:— చిత్తము.

యాదవప్రకాశులు:— 'కపి చలనే' అనిధాతు నిష్పన్నమైనది కపి శబ్దము. సర్వదా చరించు చుండు వాడు గాన సూర్యుడు కపిః అను శబ్ద వాచ్యుడగుచున్నాడు.

శ్లోక

యజుర్వేద ఆరణ్యక రచనలలో కపిర్భిభర్తి తేజసం' అని కలదు. ఆవైదిక ప్రయోగాను సారముగ "కం పిబతీతి కపిః" తేజస్సును భరించువాడు అనిఅర్థమగుటచేకపిః అనగా సూర్యుడు అనిఅర్థము. కపేః-సూర్యస్య ఆసం-మండలం- కప్యాసం అనగా సూర్యమండలము అనిఅర్థము. పుండరీకము (అనగా 'పద్మకోశ ప్రతీకాశం హృదయం' అను నారాయణానువాకన్యాయాను సారముగ పద్మము వంటి హృదయము అని అర్థము.

రామానుజులు:— చిత్తము. ఈ వాక్యమునకు మొత్తముమీద సిద్ధించిన తాత్పర్యమును శెలవియ్యవలెను.

యాదవప్రకాశులు:— ఉపాసనకు పరమాత్మని దర్శనమే ఫలము. అట్టి పరమాత్మను ఎచ్చటచ్చట ఏయేవిధముగా దర్శించవచ్చునో, వానిని తెలుపుటయే బ్రహ్మవిద్యల పని. ఈబ్రహ్మ విద్యలలో కూడ అటులనే ఉపాసనకనుకూలమైన పరమాత్మని స్థానములు తెలుపబడుచున్నవి.

పరమాత్మోపాసనకు ఫలమగు పరమాత్మ దర్శనమునకు సూర్యమండలము ఒకస్థానము మరియు హృదయ పుండరీకము మరియొక స్థానము. ఇవి రెండును ఎటుల ఉపాస్య స్థానములో అటులనే నేత్రములుకూడ పరమాత్మోపాసనకు స్థానములు అని ఈ శ్రుతితాత్పర్యము

రామానుజులు:— స్వామీ ఈ అర్థములో నాకు చాలసంశయములు కలుగుచున్నవి. మనస్సునకిది తృప్తిగ యుండలేదు.

యాదవప్రకాశులు:— ఏల? ఈ అర్థమును వాక్యకారులే తెలిపినారయ్యా

రామానుజులు:— వాక్యకారులే తెలిపి యున్నప్పటికి నాకు మాత్రము యుక్తి యుక్తముగా తోచుటలేదు. తాము ఆజ్ఞ యిచ్చినచో నాకుగల ఇందలి సంశయముల విన్నవించుకొందును.

యాదవప్రకాశులు:— రామానుజా! సంశయమేల నిర్భయముగా తెలుపుము. శాంతి పాఠ సమయమున మొదటనే "సహనావవతు।సహనౌ భునక్తు।సహవీర్యం కరవావహై। తేజస్వినావధీతమస్తు మావిద్విషావహై" అని ప్రతిజ్ఞ, జేసుకొని యుంటిమి కదా.

రామానుజులు:— చిత్తము నాసంశయమును విన్నవింతును. ఈశ్రుతియందు 'అగ్నిశ్చేంద్రశ్చ' అనునటుల అపవాద సూచకమగు 'చ' అను పదము లేదు. 'కప్యాసం – పుండరీకం' అను రెండు పదములున్ను సమాన విభక్త్యంతపదములగుటచే రెండును విశేషణ విశేష్యభావాపన్నములని స్వతః తెలియుచున్నది. "ఘటః పటః" అనునటుల వీని రెండింటికిన్ని అర్థవిరోధములేదు అందుచే ఈరెండింటికిన్ని సామానాధికరణ్యము స్వతః ప్రాప్తమగుచున్నది, తామిపుడు తెలిపిన వాక్యకారుల యర్థము వలన స్వతః ప్రాప్తమైన

ఈసామానాధికరణ్య స్వారస్యమునకు భంగము కలుగుచున్నది.

ఒకే విశేష్యార్థమున అపృథక్సిద్ధ సంబంధముతో నన్వయించు విభిన్న విశేషణార్థముల బోధించు సమానవిభక్తి గల పదములు సమానాధికరణము లనబడును.

యాదవప్రకాశులు:– రామానుజా! నిజమే ఈఅర్థముతో నీవు తెలిపినటుల సామానాధికరణ్య స్వారస్య భంగమున్నదోయి ఒప్పుకొనక తప్పదు.

రామానుజులు:– అంతే కాదు. మరొక దోషముకూడ గలదు. "పద్మకోశ ప్రతీకాశం హృదయం" అను తైత్తరీయ నారాయణాను వాక ౧౧. ౭. శ్రుతిలో హృదయము పద్మకోశము వంటిది. అని ఉపమాన ఉపమేయ పదములు రెండును యున్నవి. ఇచ్చట పుండరీకం అని ఉపమాన పదము మాత్రమే యున్నది. ఈపదమునకు శక్తిచే పద్మము మాత్రమే అర్థమగును. గాని తత్సదృశమైన హృదయము అర్థముకాదు. పుండరీక సదృశమైన హృదయము అని ఈపదమునకు అర్థము చెప్పుటతత్సదృశమైన దానియందు తచ్ఛబ్ద ప్రయోగరూప గౌణార్థమే యగును గాని శక్త్యర్థము కాజాలదు.

శక్తిచే చక్కని అర్థము చెప్పుకొనవీలుండగా ఆ అర్థమునకు ఏవిధమైన బాధయు లేకుండగా గౌణార్థమును ఆశ్రయించుట న్యాయమా?

యాదవప్రకాశులు:– అవును రామానుజా! శక్త్యర్థమునకు బాధ లేకుండగ గౌణార్థము నాశ్రయించుట న్యాయముకాదు. "ఉపమితం వ్యాఘ్రాదిభిః సామాన్యా ప్రయోగే" అను వ్యాకరణ సూత్రానుసారముగ పురుషవ్యాఘ్ర అను స్థలమునందువలె హృదయపుండరీకం అను ప్రయోగము ఉపమానోపమేయ వాచకశబ్దము లున్నందువలన ముఖ్యార్థమును తెలుపును. ఈ శ్రుతియందు కేవలము పుండరీకం అను శబ్దము మాత్రమే యున్నది. దీనికి హృదయ పుండరీ కార్థము ముఖ్యార్థము కాదు. ముఖ్యార్థము చెప్పుకొనుటలో బాధకము లేకుండగ గౌణ యోగార్థమును గ్రహించుట దోషమే.

రామానుజులు:– స్వామీ! మరియొక సంశయముకూడ కలదు.

యాదవప్రకాశులు:– తెలుపుము.

రామానుజులు:– ఈ శ్రుతికి అర్థమును చెప్పుకొనుటలో "సూర్యమండలమున-హృదయ పుండరీకము. అటులనే నేత్రములు." అని కదా అర్థ మనుకొంటిమి. ఈపదముల కట్టుల యర్థము చెప్పుకొనుటచే ఇవి ఆకాంక్షాయోగ్యతాసన్నిధులు లేకుటచే పరస్పర అనన్వితములై సాకాంక్షతి లేనివై, అఖండ శాబ్దబోధ సామర్థ్యము లేకయున్నవి ఈ స్థానము లేమి? అని ఆకాంక్ష కలుగుచున్నది. దానికి ఇవి "ఉపాసనాస్థానములు" అను పదమును అధ్యాహారము చేసుకొనవలెను. ఎవనియొక్క? అను ఆకాంక్ష కలుగుచున్నది. దాన్ని నివృత్తి 'ఉపాసకునియొక్క' అను పదమును అధ్యాహారము చేసుకొనవలెను.

అనగా "ఉపాసకునియొక్క" "ఉపాసనా స్థానములు" అను రెండుపదములు అధ్యాహారము

చేసుకొన్నగాని ఈపదములవలన పూర్ణ శాబ్ద బోధసిద్ధించదు. గాన ఈఅర్థమునకు అధ్యాహార దోషముకూడ తటస్థించును.

యాదవప్రకాశులు;— అవును కాని ఈ శ్రుతి వాక్యములోని మొదటయున్న "తస్య" అను పదమునకు ఉపాసకునియొక్క అని అర్థమును చెప్పుకొనినచో—

రామానుజులు:— "తస్య" అను పదమునకు పరమాత్మని యొక్క అను స్వతసిద్ధార్థమును విడిచి ఈఅధ్యాహారదోషనివృత్తికై ఉపాసకుని యొక్క అను అర్థమును చెప్పుకొనుట మరింత ప్రమాద భూయిష్టము. 'తస్య' అను పదము సర్వనామము కదా. ఇతః పూర్వము తెలిపిన నామవాచక పదమును పరామర్శించుటయే దీని స్వభావము. ఈశ్రుతిలో ఉపాసకుని తెలుపుపద మేదియు ఇతఃపూర్వము తెలుపబడలేదు. అందుచే దీనికి ఉపాసకునియొక్క అను అర్థమును ఏవిధము గను చెప్పవీలులేదు. "ఈవాక్యప్రారంభము ననే" అంతరాదిత్యే హిరణ్మయః పురుషః" అని తెలిపియుండుటచేతను, దానినే ఈతచ్ఛబ్దము పరామర్శించుచుండుటచేతను యిచ్చటి 'తస్య' అను పదమునకు సూర్యమండల మధ్యవర్తియైన హిరణ్మయ పురుషుడైన పరమాత్మునియొక్క అని మాత్రమే అర్థము చెప్పుకొనవలెను. లేనిచో అప్రకృతపరామర్శిత్వ రూప దోషముకలుగును. మరియు, ఈ వాక్యము తరువాత తెలుపబడిన "తస్య ఉదితినామ" అను వాక్యములోని తస్య అనుపదమునకు, పరమాత్మునియొక్క అని అర్థమును చెప్పుకొనుట ఎటులను తప్పదు. గాన పూర్వాపరవిరోధముల నివారణకు ఒకే చోట తెలుపబడిన తచ్ఛబ్దములకు విరూపార్థములు సంభవించకుండుటకున్ను, తస్య అను పదమునకు ఉపాసకునియొక్క అని అర్థముగాక పరమాత్మని యొక్క అని మాత్రమే అర్థము చెప్పుకొని తీర తీరవలెను. అందుచే యిచ్చట అధ్యాహార దోషము తప్పదు.

యాదవప్రకాశులు:— రామానుజా: ఈ నీ విమర్శన చాల చక్కగ ఉన్నదోయి.

రామానుజులు:— స్వామీ నాకు మరొక సంశయము కూడ తోచుచున్నది.

యాదవప్రకాశులు:— దానినికూడ తెలుపుము

రామానుజులు:— అసలీ వాక్యము ఉపాస్యుడైన పరమాత్మని యొక్క దివ్యాంగములను వర్ణించు ప్రకరణములోనిది. అట్టి ప్రకరణము లోని తస్య అను పదమునకు ఉపాస్యుడైన పరమాత్ముడే అర్థముకాని పూర్వాపర సందర్భము లేవియు లేకుండగ ఉపాసకునియొక్క అని అర్థము చెప్పుకొని ఉపాసకుని అంగవర్ణనము తెలుపుచున్నదనుట ప్రకరణవిరుద్ధము, వ్యర్థ ప్రతిపాదనము, ఉపాసనా వైకల్యాపాదకము అగును.

యాదవప్రకాశులు:— రామానుజా నీ ప్రతి పాదన బహుసమంజసమైనదయ్యా,

రామానుజులు:— మరియొక విశేషము, ఈ వాక్యములలో యథాకప్యాసం ఇత్యాదినా మొదట ఏఉపాస్యుని రూపవర్ణనము చేయబడి నదో, చివరకు ఆఉపాస్యునికే తస్య ఉదితినామ అని 'ఉత్' అని నామ నిర్దేశము చేయబడినది.

నామ నిర్దేశమునకు పూర్వము రూపనిర్దేశము ఉచితమైనది కదా.

ఈనామ నిర్దేశము పరమాత్మని దనుట నిర్వివాదము. ఆనామముచే నిర్దేశింపబడు వాని యొక్క రూపనిర్దేశకపదములలో కొన్ని ఆఉపాస్యుని తెలుపునవి, కొన్ని ప్రకరణ సందర్భము గాని పూర్వాపర పరామర్శిత్వముగాని, లేకుండగ ఉపాసకుని తెలుపునవి అని అనుట పరస్పరవిరుద్ధార్థప్రసంగము కాదా?

యాదవప్రకాశులు:– అవును నిజమే.

రామానుజులు:– మఱియొక దోషము కూడ తోచుచున్నది.

యాదవప్రకాశులు:– అదేమి?

రామానుజులు:– ఒకవేళ ఈ పుండరీకాక్షత్వముతో సంబంధము ఉపాసకునిదే యన్నను, అక్షివిద్యలో అక్ష్యుపాసనను తెలుపు శ్రుతి వాక్యమున

బృహదారణ్యకమున ౭–౫–౧ లో

'య ఏష ఏతస్మిన్ మండలే పురుషోయ

యశ్చాయం దక్షిణే ఽక్షిన్ ॥

అని దక్షిణపు నేత్రమొకటి మాత్రమే ఉపాసన స్థానముగ తెలుపబడినది. ప్రస్తుత శ్రుతియందు "అక్షిణీ" అని ద్వివచనముచే నేత్రద్వయము నిర్దేశింపబడియున్నది. గాన ఉపాసనాత్మకమైన దక్షిణాక్షిత్వ మాత్రమునకు ఇచ్చటి ద్వివచన విధి విరుద్ధమగును.

యాదవప్రకాశులు:– ఇది అక్షివిద్యయే యనకూడదా?

రామానుజులు:– ఈ ఉపనిషత్తునందే అంతరాదిత్య విద్యయనియు; అక్షివిద్యయనియు రెండు బ్రహ్మవిద్యలు గలవుకదా. సూర్యమండల మధ్యవర్తియైన శ్రీమన్నారాయణుని ఉపాసించు విధానమును విధించునది అంతరాదిత్య విద్య యనియు; అక్ష్యంతర్గత శ్రీమన్నారాయణుని ఉపాసించు విధానమును విధించునది అక్షివిద్య యనిగదా విభాగింపబడియున్నవి. ఇప్పుడీ కప్యాస శ్రుతికి ఉపాసకుని అక్షిస్థానమే అర్థమైనచో ఈ శ్రుతికూడ అక్షివిద్యను ప్రతిపాదించునది మాత్రమే కాగలదు. ఈ ప్రకరణముననే "యశ్చాయం దక్షిణేఽక్షన్" అని అక్షివిద్య ప్రత్యేకముగా ప్రతిపాదింపబడియున్నది. దానిని తిర్గి ఈకప్యాస శ్రుతి విధించునని అనినచో పునరుక్తిదోషము సంభవించదా.

యాదవప్రకాశులు:– అవును. నీవు తెలిపిన ఆక్షేపణయుక్తమైనదే గాని ఇతరత్ర తెలిపిన అక్షివిద్యా ప్రకరణమున అక్షివిద్యయొక్క సామాన్యవిధి యున్నదనియు, ఈ కప్యాసశ్రుతిచే ఆ అక్షివిద్యయందు తెలుపవలసిన ఉపాసనస్థానవిధి తెలుపబడినదనియు సమాధానము చెప్పుకొనిన పునరుక్తదోషము రాదేమో.

రామానుజులు:– అట్లు సమాధానము చెప్పుకొనుట పొసగదు. ఏలయనిన–

అంతరాదిత్యవిద్యయందు "య ఏషోంతరాదిత్యే" అని ఉపాసనాస్థానవిధి యున్నది. ప్రకరణాంతరమున గల అక్షివిద్యయందును కూడ "య ఏషోంతరక్షిణి" అని ఉపాసనాస్థానవిధి యున్నది. రెండుస్థలములయందును కూడ ఉపాస

నాస్థానవిధులు విధించబడియున్నవి. అందుచే యిక స్థానవిధిని గురించిన ఆకాంక్ష ఉత్పన్నము కాజాలదు. ఆకాంక్ష ఉపశమించినపిమ్మట తిరిగి ఉపాసనాస్థానవిధిని ఈ కప్యాసశ్రుతి తెలుపుచున్నదనుట అసన్వితముకాదా-

యాదవప్రకాశులు:- అవునవును.

రామానుజులు:- ఇంత మాత్రమే కాదు. మరొకదోషముకూడ తటస్థించగలదు.

ఈకప్యాసశ్రుతియందే "అంతరాదిత్యే" అని ఆదిత్యమండలము ఉపాసనాస్థానముగ విధించబడినది. అందుచే ఉపాసనాస్థానమేది యని ఆకాంక్ష ఉత్పన్నమేకాదు. అట్టిస్థితిలో "ఏవమక్షిణీ" అని నేత్రములు ఉపాసనాస్థానముగ విధించబడినదన్నచో ఉపాసనాస్థానములు రెండు విధించబడినవగును. స్థానభేదముచే ఉపాస్యుని రూపభేదముతటస్థించును. దానిచే విద్యాభేదము తటస్థించును. ఒకేవాక్యముచే రెండు బ్రహ్మవిద్యలు ఈవిధముగ విధించబడుట అసంగతము, అనావశ్యకము, అవకతవ్వదు. ఒకేవాక్యముగ అన్వయించుట యుక్తి యుక్తముగ యుండగా రెండువాక్యములనుట న్యాయమగునా?

యాదవప్రకాశులు:- అయితే రామానుజా! ఈ దోషమురాకుండుటకు మరియొక ఉపాయమాలోచింతము-

'కప్యాసం-పుండరీకం అను వానిని దృష్టాంతరములుగ అనువదించి "ఏవం అక్షిణీ" అని నేత్రములకు ఉపాసనాస్థానత్వము విధించబడినది అని సమాధానమును చెప్పుకొనినచో...

రామానుజులు:- అట్లు చెప్పినచో ఉపక్రమ విరోధము తటస్థించును.

ఉపక్రమమున "అథ య ఏషోంతరాదిత్యే" అని ఆదిత్యమండలము ఉపాసనాస్థానముగ విధించబడినది. గనుకనే ఇది అంతరాదిత్యవిద్యయని పేరుగలదైనది. అట్టి ఆ ఉపాసనాస్థానవిధిని అనువాదరూపమనినచో దీనికి అంతరాదిత్యవిద్య యను నామధేయము తగదు. అక్షి ఉపాసనాస్థానముగ విధింపబడినదనుటచే 'అక్షివిద్య' యనబడదగినదగును.

యాదవప్రకాశులు:- పోనీ దీనిని అంతరాదిత్యవిద్య యనుటను మానివేసి అక్షివిద్య యనినచో...

రామానుజులు:- మొదటికే మోసము కలుగదా? 'అక్షివిద్య' యనుపేరుతో మరొకబ్రహ్మవిద్య విధించబడియున్నదిగదా. దానియందలి రూపాదులు వేరు. ఉపాసనావిధానము వేరు. ఫలితము వేరు. ఈ అంతరాదిత్యవిద్యయందలి రూపాదులు వేరు. ఉపాసనావిధానము వేరు. ఫలితము వేరు. ఇట్టిస్థితిలో అంతరాదిత్యవిద్యనే అక్షివిద్యయనినచో ఇచ్చట తెలిపిన రూపాద్యతిదేశములు అసలు అక్షివిద్యయందు తెలుపుట అసంగతములగును గదా-

యాదవప్రకాశులు:- అవునుసుమా! నిజమే.

రామానుజులు:- ఇంతేకాదు. అక్షివిద్యలు రెండగును. అంతరాదిత్యవిద్య అసలే లేకుండపోవును. ఒకదానినే తిరిగి చెప్పినదనుటచే పునరుక్తిదోషము తటస్థించును.

గాన ఈవాక్యము ఉపాసనాస్థానవిధి పర

పరమనుట ఎంతమాత్రము యుక్తియుక్తముగ నాకుతోచుట లేదు.

యాదవప్రకాశులు:- రామానుజా నీవు తెలిపిన ఆక్షేపణలు చాల శాస్త్రీయములై చాల యుక్తియుక్తముగ నున్నవి. వాటి నన్నింటిని అంగీకరించక తప్పదు. అందుచేతనే కాబోలు వాక్యకారులు ఈశ్రుతికే మరొకవిధముగకూడ అర్థమును తెలిపియున్నారు.

రామానుజులు:- చిత్తము దానిని సెలవివ్వ ప్రార్థన.

యాదవప్రకాశులు:- రెండవ యర్థమును చెప్పెద వినుము. కపిః అనగా మర్కటము (కోతి) అని అర్థము. "కపిః ప్లవంగ ప్లవగ శాఖా మృగవలీ ముఖాః। మర్కటో వానరః" అనిగదా నిఘంటువు. కపేః. మర్కటముయొక్క- ఆసం- పృష్టము. కప్యాసం అనగా మర్కట పృష్టము అని అర్థము అనగా మర్కటపృష్ట సదృశమైనది అని భావము పుండరీకం అనగా తామరపద్మ సదృశమైనది అని భావము అనగా ఆ ఆదిత్యమండలాంతర్వర్తియైన పరమాత్మని యొక్క- నేత్రములు మర్కట పృష్టము వంటిది. తామరపద్మము వంటిది. అనిభావము.

రామానుజులు:-స్వామీ ఈ అర్థము మరింత సందేహముల కాస్పదమై యుండ లేదా?

యాదవప్రకాశులు:- ఈఅర్థములో నీకు తోచు ఆక్షేపణ లేవియో తెలుపుముచూతము

రామానుజులు:- తమ సెలవైనచో విన్న వింతును. కప్యాసం - అనుపదమునకు మర్కట పృష్టము అని మాత్రము మీరు తెలిపిన నిఘంటువు ననుసరించి శక్త్యా అర్థమగు చుండగా మర్కట పృష్ఠము వంటిది. అని ఏవిధమైన తాత్పర్యబాధయు లేకుండగనే శక్త్యార్థమును విడిచి లక్షణార్థమును చెప్పుకొనుట న్యాయమా?

యాదవప్రకాశులు:- శక్త్యార్థము కుదుర వలెను గదా?

రామానుజులు:- శక్త్యార్థము ఏల కుదురదు. చక్కగ సరిపోవునే.

యాదవప్రకాశులు:- సరే దాని విషయమై తరువాత చూతము. ఇదిగాక యింకను ఏమైన దోషములు నీకు తోచుచున్నవా?

రామానుజులు:- ఆహా యింకను సందేహము లున్నవి. 'అక్షిణీ' అనుదానికి కప్యాసం, పుండరీకం. అని అనునవి ఉపమానములు కదా. ఇవి ప్రత్యేక ప్రత్యేకముగా రెండు ఉపమానములా లేక ఒకే ఉపమానమా?

యాదవప్రకాశులు:- ప్రత్యేకప్రత్యేకముగా రెండు ఉపమానము లని నవో...?

రామానుజులు:. పరమాత్మని ఒక్కొక్క నేత్రమునకే రెండేసి ఉపమానములను అన్వ యించుట కుదురదుగదా-

యాదవప్రకాశులు:- ఏల?

రామానుజులు:- రెండు ఉపమానములను ఒకే నేత్రమున కనిన్చో రెండవ నేత్రమునకు ఉపమానము లేకుండపోవును. లేక తిరిగి ఈ ఉపమానములనే తిరిగి రెండవ నేత్రమునకు అన్వయించినచో ఒకపర్యాయము అన్వయించిన పదములను అవసరము లేకుండగ రెండవ పర్యాయము తిరిగి అన్వయించిన దోషము కలుగును.

లేక రెండు నేత్రములకున్ను ఒక్కొక్క ఉపమానమునే విడివిడిగా అన్వయింతమన్నచో అక్షిణీ అని ద్వివచనముచే తెలుపబడిన రెండు నేత్రములకున్ను ఏకవచనముచే తెలుపబడిన కప్యాసంగాని 'పుండరీకంగాని' ఉపమానమనుట తగదు. గనుక కప్యాసం మర్కటపృష్టము వంటిది. ఒక నేత్రము పుండరీకం తామరపద్మము వంటిది. మరొక నేత్రము. అని ఒక్కొక్క ఉపమానమును తెలుపవలసియుండును. ఇట్లు అర్థమును చెప్పినచో పరమాత్మని నేత్రములలో పరస్పర రూపభేద నిరూపణమగును. అది ఆయన కననురూపమైనదగును.

యాదవప్రకాశులు:- పరమాత్మని రెండు నేత్రములకు కప్యాసం అనునదియు పుండరీకమనునదియు విడివిడిగా ఉపమానము లగదము.

రామానుజులు:- అటుల చెప్పినచో హీనోపమ యగును. మర్కటపృష్టము వంటిది. ఉపాస్యుడగు పరమాత్మని నేత్రము అని అనుట ఎంతటి నీచభావము ఎంత యపచారము.

యాదవప్రకాశులు:- రామానుజా నీవు చెప్పినదోషము చాల యుక్తియుక్తమైనదోయి. ఉపాసనలో ఉపాసకుడు ఉపాస్యుని ముఖ్యావయవమగు నేత్రమును నీచమగు మర్కట పృష్టముతో పోల్చుట కంటె అధిక దోషమింకేమున్నది?

ఈదోషనివారణకై మరొకవిధముగ అన్వయింతము కప్యాసం అనునది పుండరీకమునకు ఉపమానము.

పుండరీకమనునది 'అక్షిణీ' ఉపమానము అనగా మర్కటపృష్టమువంటిది తామరపద్మము. అట్టి తామర పద్మము వంటివి నేత్రములు అని అనినచో ఈ దోషము పోవును కదా!

రామానుజులు:- ఈఉపమితోపమానాన్వయమువలన హీనోపమ దోషము పోవును. గాని ఉపాస్యుని నేత్రవర్ణనమునకు మాత్రము ఈవిధానము తగదు. ఏలయనిన సాక్షాత్తుగ హీనోపమ గాకపోయినను పరంపరయా అయినను ఇది నీచోపమానమని వప్పుకొనకతప్పదు. ఇదియును గాక పుండరీక పదము ఏకవచనము అక్షిణీ అని ద్వివచన మున్నది. గాన ఈరెండింటికి ఉపమానోపమేయత్వము కుదురుటలేదు. ఉందుచే ముందు తెలిపిన దోషము తప్పదు.

మరియు ముందు తెలిపిన పుండరీకము వంటిది. పరమాత్మని నేత్రముఅని పుండరీకపదమునకు గౌణార్థ కల్పనా దోషము తప్పనే తప్పదు.

యాదవప్రకాశులు:- అవును నీవు తెలిపిన దోషములు సరియైనవియే,

రామానుజులు:- ఇంతియే కాదు. స్వతః ప్రాప్తమైన సామానాధికరణ్యా పరిత్యాగమను మొదటి అర్థములో ద్యోతకమైన దోషము ఈ రెండవ అర్థములోను కూడ తటస్థించక తప్పదు

యాదవప్రకాశులు:- నిజమే. పోని ఈరెండు అర్థములు గాక వాక్యకారులు తెలిపిన మూడవ యర్థమును పరిశీలింతము.

రామానుజులు:- చిత్తము.

యాదవప్రకాశులు:- కప్యాసం-ఈషద్వికసితమైన; పుండరీకం తామరపద్మ సదృశములైనవి.

అనగా ఉపాస్యుడైన పరమ పురుషుని నేత్రములు ఈషద్వికసితమైన పుండరీక సదృశములు అని అర్థము.

రామానుజులు:- స్వామీ 'కప్యాస' శబ్దమునకు ఈషద్వికసితము అను అర్థము ఎటుల కలిగినది. అవయవశక్త్యా కలిగినదా లేక రూఢిశక్త్యా కలిగినదా? ఈపదమున కీయర్థమును చెప్పుటలో ప్రమాణమేమి?

యాదవప్రకాశులు:- వాక్యకారులే ప్రమాణము. అంతకంటె మరేవిధముగను దీనికి ప్రమాణము కనుపించదు. మరియు అవయవశక్తిచేగాని రూఢిశక్తిచేగాని ఈపదమున కీయర్థమును చెప్పుటకు సావకాశము కనుపించదు.

రామానుజులు:- స్వామీ యుక్తియుక్తమై ప్రమాణ ప్రయుక్తమై యున్నదానిని ఎవరు తెలిపినను, చంటికుఱ్ఱవాడు తెలిపినను సరియే శత్రువను కొనువాడు తెలిపినను సరియే గ్రహింపవలసినదే స్వీకరించవలసినదియే యుక్తి యుక్త రహితమైనదై ప్రామాణికము కానిదై యున్న దానిని ఎంతటి పెద్దలు చెప్పినను స్వీకారానర్హమైనదయ్యేగదా యుండును.

యాదవప్రకాశులు:- ఈవిషయము కొంత వరకు అంగీకరించక తప్పదు కాని పెద్దలు చెప్పినదానిని కాదనుట సాహసమేమో!

రామానుజులు:- ఆ చెప్పినవారలు ప్రామాణికులై యున్నారా! వారే పెద్దలు వారి శ్రీసూక్తులు సర్వదా శిరసాగ్రాహ్యములే ఎవరైతే ప్రమాణపదవిని పరిత్యజింతురో, అట్టి వారలు ఎట్టి వారలే కానిండు ప్రమాణముగా స్వీకరించదగువారలు కాజాలరు. మరొక విషయము ప్రామాణికులగు పెద్దలే ఒక్కొక్కప్పుడు పూర్వపక్షరూపమున కొన్ని యర్థముల తెలిపియుండ వచ్చును గదా. వెనుకటి రెండర్థములు వలెనే ఈమూడవ యర్థముకూడ శాస్త్రీయమై యుక్తియుక్తమై యున్నటుల తోచుటలేదు. కప్యాస శబ్దార్థమునకు ఈషద్వికసితత్వార్థమును తెలుపుటలో ప్రమాణము లేకుండుట ఒకటి అక్షిణీ యని నేత్రద్వయమునకు ద్వివచనముండ పుండరీకమును ఉపమానముగ తెలుపుట ఒకటి దోషములుగ తోచుచున్నది.

యాదవప్రకాశులు:- రామానుజా నీవు తెలిపిన దోషములన్నియు తప్పక అంగీకరించి తీరవలసినవే. నీవనినటుల బహుశ ఈమూడర్థములు కూడ పూర్వపక్షరూపములే అయి యుండవచ్చును. ఈమూడు అర్థములకు నీవు ఇన్ని దోషములను తెలుపగలిగితివే ఈదోషము లేవియు లేకుండగ నీవు ఏదేని అర్థమును తెలుపగలవా?

రామానుజులు:- చిత్తము తమ ఆజ్ఞయైనచో అటులనే చెప్ప ప్రయత్నించెదను.

యాదవప్రకాశులు:- చెప్పుము.

రామానుజులు:- కప్యాసమను పదము పుండరీక పదమునకు విశేషణము. కం అనగా జలము. "కం శిరోంబునోః" అని గదా నిఘంటువు కం పిబతీతి-కపిః-సూర్యః జలమును ఆవిరిరూపముగ త్రాగువాడు (గ్రహించువాడు) గాన సూర్యుడు కపిః అని అనబడుచున్నాడు. తేన, అస్యతే-క్షిప్యతే-వికాస్యతే ఇతి కప్యాసం అనగా అట్టి

సూర్యునిచే వికసింప చేయబడినది అని అర్థము.

ఈఅర్థమునే వాక్యకారులు కూడ యిటుల తెలిపిరి.

"ఆదిత్యక్షిస్థం వా శ్రీమత్వాత్" అని పుండరీకమును సూర్యుడు తన అవయవములగు కిరణముల ద్వారా కదా వికసింపజేయును. గనుక కప్యాసం అనగా 'రవికరవికసిత' అని అర్థమును తెలుపవచ్చును. ఇంతేకాదు. మరొక విధముగ మరొక అర్థమును తెలుపవచ్చును.

కం–జలం; తత్ పిబతీతి–కపి:–నాళ:

తస్మిన్–నాళే, ఆస్త ఇతి కప్యాసం

అనగా నీటిని బాగా పీల్చియున్న నాళమున కలిసియున్నట్టిది అని అర్థము. నాళము నుండి కోయబడిన పద్మము కంటెను నాళముతో కలిసియున్న పద్మము హెచ్చుశోభకలదై యుండును ఆనాళము నీటినుండి పైకితీసివేయబడి నీరులేకుండిన దానికంటెను నీటిలోయుండి ఆనీటిని బాగా పీల్చుకొని నీటి సంబంధముకలదై యున్నచో, అట్టి నాళముతో కలిసియున్న పద్మము మిక్కిలి శోభాయమానమైనదై యుండును. గాన కప్యాసం అనగా నీటియందున్న సుమృణ్ణనాళముగలది అని భావమును చెప్పకొనవచ్చును.

ఇంతియగాక మరొక విధముగ కూడ దీనికి అర్థమును చెప్పకొనవచ్చును. కం–జలం;తస్మిన్ అప్యాస్తే ఇతి–కప్యాసం

యాదవప్రకాశులు:– క–అప్యాస్తే ఇతి అనునప్పుడు కాప్యాసం అనిగదా వచ్చును.'కప్యాసం' అను రూపమెటుల సిద్ధించును?

రామానుజులు:– అస–ఉపవేశనే; అస–భువి అని ధాతువునకు అపి అను ఉపసర్గను పూర్వమందు చేర్చగా "వష్టి భాగురిరల్లోపమవాప్యో: ఉపసర్గయో:" అను వ్యాకరణ సూత్రానుసారముగ ఉపసర్గయందలి అకారము లోపించగా కప్యాసం అను రూపము సిద్ధించుచున్నది.అనగా "నీటి యందున్నట్టిది" అని అర్థము సిద్ధించును. దీనిని 'గంభీరాంభస్సముద్భూతం' అనిఅర్థమును చెప్పకొనవచ్చును.

దళములతో కూడుకున్న పుండరీకము అనగా ఎర్రని తామరపద్మము అని అర్థము.

యాదవప్రకాశులు:–అమరకోశమున "పుండరీకం సితాంభోజం" అని పుండరీకపదమునకు తెల్లతామరపద్మము కదా అర్థము చెప్పబడియున్నది. నీవు పుండరీకపదమునకు ఎర్రతామర పద్మదళమును అర్థమెటుల చెప్పచున్నావు ?

రామానుజులు:–స్వామీ అమరమున పుండరీకపదమునకు తెల్ల–తామరపద్మమని మాత్రము అర్థమున్నమాట నిజమే. కాని యిచ్చట ఈ అర్థమును ఆ నిఘంటువు ననుసరించి నిర్ణయించరాదు. మీమాంసామర్యాద–న్యాయముల ననుసరించి ఈ శ్రుతికి అర్థమును చెప్పవలయునుగదా ఎట్లన:–

శబరస్వామిచే నవమాధ్యాయమున

"మార్గం చరుం నిర్వపేత్ శ్రియై శ్రీకామ:"

అని ఐశ్వర్యకాముని కొరకై విధించబడిన ఇష్టివిశేషమున "పౌండరీకాణి బర్హీంషి భవంతి" అని తరణార్థత్వేన విధి విహితమైయున్నది. దీని కతిదేశముగ

"దర్భై స్తృణీత హరితై:" అని తెలుపబడిన

మంత్రవిశేషమున 'దర్భ' పదస్థానమున పుండరీకపదమున్నట్లు, హరితపదస్థానమున రక్తపద్మము ఊహించుకొనవలశినదిగ తెలుపబడినది గాన అటులనే ఇచ్చటను కూడ పుండరీక పదమునకు ఎఱ్ఱతామరపద్మ దళములను అర్థముగ చెప్పుకొనవలెను.

ఈఆరువిధములైన అర్థములను వాక్యకారులే తెలియున్నందునను మొదటి మూడు అర్థములు దోషవిశిష్టములై యున్నందునను, మిగత చివరి మూడు అర్థములు యోగ్యములై యున్నందునను, వాక్యకారులు మొదటి మూడర్థములను పూర్వపక్షార్థములుగ తెలిపిరనియు, తరువాత పైన మూడర్థములను సిద్ధాంతార్థముగ తెలిపిరనియు అనుకొనవలశియున్నది.

ఏతావతా:- సిద్ధాంతరూపములైన ఈ మూడర్థములను కలిపి చెప్పుకొనినచో ఆఆదిత్య మండలాంతర్వర్తియైన పరమపురుషుని నేత్రములు

"గంభీరాంభ స్సముద్భూత సుమృష్టనాళ
రవికరవికసిత పుండరీకదళములవంటివి"

అని తెలుచున్నది. దీని ననుసరించియే
"రామః కమలపత్రాక్షః" (రామా. సు. 35.8)
"పుండరీక పలాశాభ్యాం విప్రకీర్ణ మివోదకం"
(రామా. సు. 33.4)
"ప్రసన్నవదనం చారు పద్మ పత్రోపమేక్షణం
(వి. పు. 6 780)
"త్వత్తః కమలపత్రాక్షః"

అని సర్వేశ్వరుని నేత్రమునకు పద్మపత్ర సామ్యము సుప్రసిద్ధమై యున్నది.

యాదవప్రకాశులు:- రామానుజా నీబుద్ధి వైశద్యము అపరిమేయమైనది. నీవిచక్షణాజ్ఞానము అత్యంత సూక్ష్మము నిశితము అయి యున్నది. ఆరుఅర్థములను వాక్యకారులే తెలిపియున్నను అందు మూడర్థములను పూర్వపక్షీయార్థములుగ విడదీసి యందలి దోషముల చక్కగా తెలిపి మిగత మూడర్థములను సిద్ధాంతార్థములుగ తెలిపిన నీవిమర్శనాపటిమ, నీఔచిత్యజ్ఞత మహావిశేషమైనది. నీవైదుష్యము విశదతమమైనది రామానుజా నీవు శిష్యుడవుకావు గురువుగా యుండ యోగ్యుడవు. నీభావుకత నీభవ్యత నీమహనీయ జ్వాల భవిష్యత్తును చాటుచున్నవి. నీప్రతిభ నా కీర్తిని కూడ జనింపచేయుచున్నది. నీసాంగత్యముచే నేను ధన్యుడనైతిని నీపేరు దశదిశల మ్రోగును గాక.



శ్రీ ర్యా షూ శ్

# భగవద్వాక్య తత్త్వార్థజిజ్ఞాసా

తిరుక్కోవలూర్ మహాస్వామి
శ్రీకుమార ఆదివరాహాచార్యులుగారు.

"ద్రోణంచ భీష్మంచ జయద్రథంచ కర్ణం తథాన్యానపి
యోధవీరాన్ మయాహతాం స్త్వంజహి"

అని భగవద్గీత విశ్వరూప సందర్శన యోగమునందు జెప్ప బడియున్నది. ఇది పార్థసారథియగు శ్రీకృష్ణునివాక్యముగాక విశ్వరూపుడగు భగవంతుని శ్రీసూక్తికావున "అస్యమహతో భూతస్య నిశ్వసితమేతద్య దృగ్వేదో యజుర్వేద స్సామవేదో ధర్వాణః" ఇతి॥

ఈమహాభూతమగు భగవంతని యూర్పులే ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వణ వేదమునని చెప్ప బడుచున్నవి. అట్టి వేదములకు అపౌరుషేయత్వము, పరమప్రామాణికత్వము, భగవద్వాక్యము గావుననే సిద్ధించు చున్నది. మహమ్మదీయ విప్లవమునందు శ్రీమద్రామాయణము భగవద్గీత రామాయణ గ్రంథములు కావున మన యాచార్యులచే సంరక్షింపబడినవి. ఈరెంటియందు ప్రక్షిప్తములు చేరియుండ లేదు, అపుట నిర్వివాదాంశము కాబట్టి ఈశ్లోకములో చెప్ప బడియున్న ద్రోణుడు, భీష్ముడు మొదలైనవారు అర్జునిని చేతనే జయింపబడి యుండవలెను, లేదా మరణావస్థకుదెచ్చి విడువబడి యుండవలెను, అను నీవిషయము నించుక విచారింతము.

1 కర్ణుడు అర్జునునిచేతనే జయింపబడునట్లు ప్రతిజ్ఞ చేయ బడియున్నాడు, ఇందు గురించి సభాపర్వ కర్ణ పర్వములలో సందిగ్ధాంశము లెవియు లేవు

2 జయద్రథుడు ద్రోణుని మూడవనాటి యుద్ధమునందు పద్మవ్యూహమును భేదించి ప్రవేశించునభిమన్యుని వెనువెంట పాండవులను వ్యూహమునందు ప్రవేశింపనీక ద్వారమునందు నిరోధించెను. లోగడ పాండవులచేత పరాభవింపబడిన సైంధవుడు శివుని గురించి తపస్సుచేయగా నర్జునుని తప్ప తక్కిన నలుగుర నొకనాడు గెలువగలుగుదువని శివుడిచ్చిన వరము వెండువెన్నువలె నాటిదినమున నుపకరించెను కాని సాత్యకి దృష్టద్యుమ్నుడు మొదలైన వారెవ్వరిచేత నెట్లు నిరోధింప బడిరో వైనములేదు. పైపెచ్చు అభిమన్యుని చేతియందు ధనుస్సుండగా గెలువ నలవికాదని చెప్పిన ద్రోణాచార్యుడు వాకిట్మగా చంపిన కర్ణాదులు నుండగా వారి మీదపడ పేడు మీద పోయినట్లు సైంధవుని యుద్ధగింపు ముందుకు వచ్చినది. చెల్లెలి పెనిమిటి యసమర్థుడనుచు దయమరచి సైంధవుని జంప నర్జునుడు ప్రతిన పట్టినాడు. మరునాడు చంపినాడు కాబట్టి జద్రథుని గురించి విమర్శనము లేదు.

3 భీష్ముడు తాత పరమ భాగవతుడు లోకోత్తరుడునను భక్తితో తొమ్మిదిదినముల యుద్ధమునందర్జునుడరవిడిచి భీష్మునితో పోరాడియుండలేదు. హిరావంతుడు భీష్మని చేత చంప బడినను నర్జునున కలుకగలుగలేదు. కృష్ణుడు శేనిపోని వేదన తెచ్చుకొని చక్రము గైకొని చలకోలపూని రెండు పర్యాయములు భీష్మునిపై కుఱికినను మాటలలో చూపిన పౌరుషము నర్జునుడు బాణములలో నుపయోగింపలేదు. తొమ్మిదవ నాటి రాత్రి భీష్ముని తలపడి చంపమని కృష్ణుడు వేవిధముల పురిగొల్పుగా నన్నొత్తిపెంచిన తాత నెట్లు చంపుదునని విజయుడు వాపోయినాడు. కాని కృష్ణుని ప్రేరణము చేత, పదియవనాడు భీష్మునకు కౌరవుల సహాయము రాకుండునట్లు కౌరవవీరుల నంపర నర్దగించి శిఖండికి భీష్మ నొప్పగించినాడు భీష్మునిచే తనసైన్యము చావకుండునటుల భీష్ముడెత్తిన ధనస్సులను మూరింటిని నరికినాడు ప్రాయోపవేశమునకు నిశ్చయించుకొని రథము దిగిన భీష్మునిచేతియందలి కత్తిని గదను నరికినాడు "తతోఽస్య వ జిఘాంసయా" అని నాగరాక్షరప్రతులలో జెప్ప బడిన భీష్మునిచేత ప్రయోగింపబడిన రథశక్తిని నరకినాడు, శంతనుని వరముమాట యట్లుండగ దేవవ్రత బలమునను, యోగమహత్త్వమునను స్వచ్ఛందమరణుండై పరమభాగవతత్వసిద్ధమగు నిరంతర బ్రహ్మోపాసనమున భగవద్గుణసంపత్తి నొంది యున్నందునను, స్త్రీపూర్వుడు, పేడి మొదలైనవారితో యుద్ధముచేయనని భీష్ముడు ప్రతిజ్ఞగొని యున్నందునను అంబో పాఖ్యానము నందలి శివుని వరము, శిఖండి బలము వ్యర్థము గావున తనకెదురాని పోరాడక పెడమొగమైయున్న భీష్ముని వెన్నంటి శిఖండి భీష్ముని వీపునకు బుగుంగ్రుచ్చినరక్తపాతము చేత భీష్ముడు నీరసించి పడిపోవునట్లు చేయుటచేతనివ్వచ్ఛుడు భీష్ముని పతనమునకు కారణము కాబట్టి సర్వజ్ఞుడగుభగవంతుడట్లు సెలవిచ్చియున్నాడు. సర్వజ్ఞురాలగు గంగాదేవి నాకొడుకును చంపిన యర్జునుడు సంవత్సరములో జచ్చుతయని శపించియున్నది. దుర్యోధనుడు భీష్మునకు సేనాపతిత్వము నిచ్చినపుడే శిఖండితో నేనోహటింపనువాని నుండి నన్ను మీరే కాపాడవలెనని శాంతనవుడు చెప్పియున్నాడు. కావుననే "భీష్మమేవాభిరక్షంతు భవంతస్సర్వఏవహి" అనియుద్ధారంభ

మున దుర్యోధనుడు తన వారల ప్రబోధించి యున్నాడు. కౌరవవీరులు నల్గురు తొమ్మిదిదినములు నడుపగలిగినారు. కావున భగవద్వాక్యము శ్రీ నర్జునుని నీతికౌశల్యము, గంగాదేవి పుత్ర దుఃఖోన్మాదము నుపపన్నములగుచున్నవి. శిఖండిని ముందుంచుకొని యర్జునుడే భీష్ముని గొట్టెనని తెలుగు భారతము చెప్పుచున్నది. "కథం భీష్మమహం సంఖ్యే ద్రోణంచ మధుసూదన ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హావరిసూదన", అనిన అర్జునుడు భీష్ముని దలపడికొట్టనే లేదు. భీష్ముని విషయమున కృష్ణుని హితోపదేశమునే గాక "నేడు భీష్ముని జంపుదునిన్ను గాతు" ననిన తెచ్చికోలు వీరవిహారమున సహితము వీటిబుచ్చియున్నాడు

4 ద్రోణుడు తొలుతొలుత పేరెత్తబడియున్నను ద్రోణ మరణముతో నర్జునునికేమాత్రము సంబంధములేదు. దుర్యోధనుడు తనకు సేనాపతిత్వము నిచ్చినపుడు భీష్మునివలె కొందర జంపెదనని ప్రతిజ్ఞసేయక ద్రోణుడుబ్బి తబ్బిబ్బై నీకేమి వరముకావలె నడుగుమన్నను, అందుకు దుర్యోధనుడు ప్రాణములతో ధర్మరాజును బట్టి యిమ్మని కోరగా అర్జునుడు దగ్గరలేకున్నను యుధిష్ఠిరుడు రథముదిగి నిరాయుధుడై నిలుపకున్నను ధర్మరాజును బట్టియిచ్చెదనని వరమిచ్చినను, అర్జునుడు గురుభక్తిని మరువలేదు, ద్రోణుని పదిదినముల యుద్ధమునందలి సర్వనాశనమున కావరమే కారణమనుట స్పష్టము అయినను అభిమన్యుని మరణమువలననే కాని జయద్రథ విరాటుల చావులవలననే కాని యుధిష్ఠిరుడు నిరాయుధుడై చేతులెత్తి నిలువవలసి వచ్చినందుననే గాని దుర్యోధనున కభేద్య కవచము నిచ్చినందుననే గాని నర్జునుడు ద్రోణునిపట్లనలుకబూనలేదు. తెగించి ద్రోణునితో తలపడలేదు. "అశ్వత్థామా హతః కుంజరః" అని చెప్పువిషయమున కృష్ణుని ప్రేరేపణకు ధర్మరాజు కొంచెము ముందువెనుకలు పడియరకొరతతో మాట్లాడినాడే కాని యర్జునుడు సనేమెరాయని స్పష్టముగా నిషేధించినాడు. సంస్కృతభారతము చూడుడు కాబట్టి మూలమునందును ఆంధ్రీకరణమునందును ద్రోణమరణముతో నర్జునునకు సంబంధమే లేదు. కాబట్టి శ్రీభగవద్వాక్యమునకు సమన్వయార్థము సర్వజ్ఞు లాలోచింప వలసియున్నది. భగవద్గీతకు ఎనుబది భాష్యములు గలవట. నాచూచినంతలో భాష్యకారులైన నిదివారి కనవసరము గాన చర్చించి యుండలేదు.

ఉపసంహారము:- శ్రీమద్రామాయణము భగవద్గీతలయందు ప్రక్షిప్తములని యనుమానించ నవకాశములేదు. ఈ "ద్రోణంచ భీష్మంచ" యను భగవద్వాక్యము సత్యతమమై మహమ్మదీయుల దాడులయందు మనగ్రంథ భాండారములు తగులబెట్టబడి పండితులు చంపబడినందున మన గ్రంథములు తారుమారులైనవి.

ఇప్పటి ముద్రితములలో నాగరాక్షరప్రతులు తెలుగుప్రతులు చాలావరకు భేదించుచున్నవి. తిక్కన సోమయాజి భారతము నాంధ్రీకరించుటలో స్వతంత్రములగు భావములను కథాకల్పనమునందుగూడా విషయములను జేర్చియున్నాడు కర్ణజననము సంస్కృతభారతము ఆదిపర్వము ఉద్యోగపర్వము నొకేరీతిగానుండ తిక్కనభారతము వేరుగానున్నది. ధర్మరాజు అశ్వత్థామ హతః యనిచెప్పిన తర్వాత గూడా చాలావరకు యుద్ధముచేసిన ద్రోణుడు విరక్తుడై ప్రాణాయామము చేసి ఆత్మను లేపినట్లు చెప్పబడుట చాలావరకు అనుమానింప వలసిన విషయమే. భరద్వాజుని సన్నిధియందు విద్యల నేర్చిన వెంటనే పెండ్లాడి సంతానవంతుడై ద్రుపదుని చెంతకుపోయి యవమానింపబడి కౌరవులజేరి. ధనురాచార్యుడైనాడు. తన జీవితమంతయు రాజాశ్రయజీవనముతో గడిపినాడు. కాబట్టి అంతటియోగాభ్యాసమున కవకాశము చాలదనుట స్పష్టము. ఇందు గురించి గుజరాతీ హిందీ బెంగాలీ మొదలైన యనువాదములలో వేయి సంవత్సరములకు మించిన వెనుకటి భాషాంతరీకరణమున్న యభిజ్ఞులు పరిశీలించి సత్యము తెల్ప ప్రయత్నింపవచ్చును వస్తుతః ద్రుపద విరాటుల వధానంతరము ద్రోణునితో పోరునకు తారసిల్లిన విజయుడు మేషయుద్ధముతో ముగింపజాలడు. ఏలనన మూడవ నాటి యుద్ధమున ధర్మరాజును ద్రోణుడు నిరాయుధుని జేయుట విజయునకు తెలియకుండవచ్చును. కాని మూడవనాటి పద్మవ్యూహమువలన నభిమన్యుడు చచ్చుటయును, పాండవనాశము పోవనుండి తొలగించిన సైంధవుని పద్మవ్యూహములో శకటవ్యూహము దానిలో సూచీవ్యూహము పన్ని సైంధవుని యుద్ధమునందు నిల్పి వానిచావుని చంపగల్గె ననుదులు ఆ రాత్రి ప్రత్యేకము యుద్ధముచేసి ద్రుపద విరాటుల చంపుట నర్జునునకు కోపకారణము గాదా? ద్రోణుని గురుడైన ద్రుపదుని మామగదా విరటుడు వియ్యంకుడు అజ్ఞాతవాసమున తనకాశ్రయమిచ్చినవాడు యీ ద్రుపదవిరాటుల చావుగాంచి ద్రోణునితో తలపడిన నర్జునుడు ద్రోణుని మూర్ఛమునుగునట్లు కొట్టి యుండవచ్చును. ద్రోణుడు తెప్పరిలి లేచి లేవజాలని యవస్థలో దుష్టద్యుమ్నుడు ద్రోణుని పట్టి నుత్తరించి యుండవచ్చును అని యూహించుటలో అసంగతమేమియు లేదు. నాసామాన్యబుద్ధికి తోడకట్టిన యీ సామాన్య విషయము సర్వజ్ఞులగు నభిజ్ఞుల ఎదుట నుంచుచున్నాను. దీనిని చర్చించి సత్యము తెలుప ప్రార్థన.






# గీతాప్రభావము

శ్రీమతి వి శ్రీనివాసమ్మగారు

ఈగీత యవతారస్థలము మనహిందూదేశము గనుక ఇతరఖండములగు ఇంగ్లండు అమెరికా జర్మనీ హాలండు మొదలగు దేశములందును బౌద్ధులుండు చైనా జపాను మొదలగు దేశములందు పుట్టిన నాస్తికమతావలంబకులు కూడా శ్రీగీతగ్రంథమును కృష్ణపరమాత్మ స్వరూపముగా నెంచి పూజించుటయే గాక హిందూదేశమందును హిందూదేశ వాసులందును కూడ గౌరవ ముంచి పూజనీయముగా భావించుచున్నారు. హిందువులు విదేశీయులను నిర్లక్ష్య భావముగలవారై వారిని ఆత్మజ్ఞానములేనివారని అనుష్ఠానములు లేనివారని అనుష్ఠాన ధర్మక్రియములు తెలియనివారై వ్యర్థజన్మ లనియును వారికి పేరు పెట్టిరి. కాని విదేశీయుల కమరియుండు వేదాంతజ్ఞానమును గీతలయందు విశ్వాసమున్ను మన దేశీయులెవ్వరికిని యమరలేదు. గీతాపాఠముగాని గీతార్థజ్ఞానముగాని మనకు గలుగకపోయెనే యను పరితాపముగూడ మనకు గలుగలేదు. అందుకై మన మెంతయు సిగ్గు పడవలసియున్నది శ్రీభగవద్గీత హిందువులమగు మనకే స్వంతమయిన నిధిగదా ఇదింతయని కొలత యిడ నలవిగాక లోతైన యర్థములుగలిగి యపారమై సర్వసాధారణముగా గ్రహించుటకు అగోచరమై అసాధ్యమై రసవంతమయి భావపూరితమయి యున్న శ్రీగీతల మహిమలను వేదవ్యాసభగవానుడు విస్తారముగా వుపమానములతో వర్ణించి శ్లోకములుగా పొగడి స్తోత్రము చేసియున్నారు. యిప్పుడు నామదికి తోచినంత సంగ్రహముగా గీతామహిమనువ్యాసరూపముగా తెలుగున వ్రాయుటకు సాహసించితిని సోదర సోదరీమణులందరుదయచేసి జదువుకొని సంతసింతురు గాక.

మరియు నీకలికాలమందు స్త్రీపురుషులు విదేశీయుల వేషభాషలయందపార వ్యామోహమును జెంది నవనాగరికము గలవారై వివిధములగు శృంగారములతో విధవిహారములు నాట్య నాటక సంగీత సాహిత్య కళా వినోద వీక్షణ శ్రవణములతో కాలము గడపుచు ఒడ లెరుంగక పరవశులై యున్నారు. మరియు విజ్ఞానశాస్త్రము రసాయనశాస్త్రము భూతిభౌతికశాస్త్రములందు పరిశ్రమలు జేయుచు పాఠములు జదువుచు పాఠశాలలయందు బుద్ధికుశలులై నిపుణులై పరీక్షల

యందుపట్టభద్రులై యుత్తీర్ణులై బహుమతులు బిరుదులు బొందుచుండు విద్యార్థుల నడుమను విద్యావిషయకమగు శాస్త్రవిషయిక చర్చలు చేయుచు ప్రచండోపన్యాసములు వాదోపవాదములు చేయుచు కలికోలాహలపూరితులై తమ ఆత్మజ్ఞానమును పోగొట్టుకొని భోగేచ్ఛలతో భోగపరాయణులై ఇచ్చవచ్చినవెల్ల ననుభవించుచు కంటచూచినవెల్ల నంటి చవిచూచుచు తనివి చెందక ప్రతిక్షణమును విచిత్రసృష్టి చేయుచుండు ప్రకృతికి పరవశులై కాలము వ్యర్థము చేయు నిట్టి కలిపురుష తాండవ సమయమందు లగ్నమై వెనుక బడక అడుగున బడక స్వయంప్రకాశమై కోటిసూర్యప్రభాభాసమై యుగక్రమముగా మనుజుల నడుమను శాస్త్రముల ముందును నిలిచి ప్రకాశించు లోకోత్తమ గ్రంథరాజము శ్రీభగవద్గీత యొకటియే. అనేక శాస్త్రములు గ్రంథములు గ్రంథవ్యాఖ్యానములు మూలబడి వూరు పేరు లేక మరుగుపడిపోయినను శ్రీగీతలు మాత్రము నానాటికి విమర్శనలు వివరములతో నిండుగా అభివృద్ధిజెంది ప్రకాశించుచునేయున్నది దీనికి సరిసాటియగు ఉపనిషత్తుగాని శాస్త్రము గాని లేదు. సముద్రాంతరంబులు ఖండఖండాంతరంబులు గూడ శ్రీగీతల మహిమలు వ్యాపించి మించినకీర్తిచే శోభిల్లుచున్నవి. మరియు మన హిందూదేశమునందు అవతరించి వేదబాహ్యమతములను ఖండించి పరమాత్మ నిర్ణయము జేసి శిష్టాచారముల క్రమములను శాస్త్రరీతిగా తెలిపి బ్రహ్మసూత్రములకు భాష్యములు వ్రాసి త్రిమతస్థాపనలు చేసి ఆస్తిక సిద్ధాంతముచే సకల జనులను వైదిక హిందూమతావలంబకులుగ జేసి పరిశుద్ధమగు దేహశుద్ధి ఆత్మశుద్ధి చిత్తశుద్ధి మొదలగు శుద్ధినిష్ఠలను పేరున జనులకు సదాచార సంపత్తి సన్మార్గ ప్రవర్తన గలుగునట్లు బోధనలు చేసిన మతాచార్యులు శ్రీశంకరాచార్యులువారు. శ్రీమాన్ రామానుజాచార్యులువారు శ్రీమధ్వాచార్యులవారు ఇంకను నీలకంఠ శివాచార్యులు, వేదాంతదేశికులు మొదలగు మహనీయులు శ్రీగీతార్థములను చక్కగా గ్రహించి వివరించి శ్రీగీతలను మొట్టమొదట సిద్ధాంతములతో గూర్చి [illegible] తాము గీతాభాష్యములందు వ్రాసి వెల్లడించి యున్నారు. ఆమహామహులగు మత గురువులు లోకమున ఆస్తికజనులకు చేసియుండు మహోపకారము మనము జన్మజన్మాంతములవరకును మరువరాదు. శ్రీగీత భరతఖండమున కురువంశము వారగు రాజుల పరిపాలనాకాలమున కురుక్షేత్రమునందు భగవంతుడగు శ్రీకృష్ణపరమాత్ముని ముఖపద్మమునుండియే ప్రసారమయినది. కృతయుగమునందు త్రివిక్రమావతారుడగు శ్రీమన్నారాయణుని పాదములనుండి గంగానది యుద్భవించినట్లు ద్వాపరయుగాంతమందు శ్రీకృష్ణావతారుండగు శ్రీమహావిష్ణువు ముఖపద్మమునుండి శ్రీగీతామృత గంగయు నుద్భవించెను. అట్లుద్భవించిన గీతోపనిషత్తు భరతదేశముననే గాక అన్నిదేశములందును అన్ని కాలములందును అందరిచేత నాదరింపబడు చున్నది. అన్ని మతములవారికిని నిశ్చయమగు ఆత్మజ్ఞానమును నిశ్చల మానసమును గలిగించు

శక్తి సామర్థ్యములు గలదై సర్వదేశ సర్వకాల సర్వజనులకును మధ్యస్థమై అంగీకారమై ఆదరణీయమైయున్నది. యిట్టి గీతా ప్రభావ సంపద వలన మనహిందూదేశము మిక్కిలిగా విజ్ఞాన మహిమగలదిగా స్తోత్రము చేయబడుచున్నది. దీనిచే హిందూజనులు గర్వించి యుబ్బిపోవలసియున్నది. మరియు శ్రీగీత జ్ఞానవేదమనియు బ్రహ్మజ్ఞానవేదమనియు చెప్పవచ్చును. శ్రీగీతలు హిందూరాజుల పరిపాలనమునందు మతిజ్ఞానాభివృద్ధియగునట్లు జేయుగ్రంధము లెట్లుండెనో అట్లే మహమ్మదీయురాజుల పరిపాలనమునందు గూడ హిందూమతమును ప్రకాశింపజేయుచు ప్రవృద్ధిగలిగిన ఇంగ్లీషువారు పరిపాలనము నందును 200 సంవత్సరములుగూడ శ్రీగీతాగ్రంథ రాజము సారార్థములతోగూడి రత్నమువలె ప్రకాశించుచు ఆర్యులవలనను ఆచార్యుల వలనను పండితులవలనను దేశాంతరములందును ఖండాంతరములందును ప్రచారములు చేయబడుచు నేటికాలమున గూడ జగత్తునందంతయు నిండియుండి సకలజనుల హృదయములందును వాక్కులందును శ్రీగీతలు గీతార్థములు రుచికరముగామధురముగా ననుభవింప బడుచున్నవి. శ్రీగీతామృతసముద్రము అర్థరసపుష్టిచే నిండి పొంగి పొరలి భావతరంగములచే సకలభూమండల మాక్రమించి వ్యాపించి చుట్టుకొని విహరించుచున్నది. ఇట్టిలోకవశీకరణశక్తికి కారణము అచ్యుతుని ముఖపద్మమునుండి జారివచ్చినవాక్య ప్రవాహముల విశేషార్థముల గంభీరభావములే గాని వేరుగాదు. భగవద్గీతకు సాటిలేని మహిమ ఎట్లు గలిగినదనగా చిన్న శ్లోకములు సంగ్రహముగా నుండి అర్థపూర్తిగల శబ్దములు అర్థబాహుళ్యము కలిగియుండుటయే, ఇదియే సకల జనులహృదయములను అయఃకాంతమువలె నాకర్షించుచున్నది. యీగీతలందు ప్రతిశ్లోకమును ప్రతివాక్యమును విస్తారముగా వ్యాఖ్యానము చేయదగిన అర్థభావములతో గూడినదై సత్యమునై యున్నది. మరియు ప్రమాణము ప్రమేయమును గూడనై యున్నది సకలజనులకు నుపదేశార్హమైయున్నది. గనుకనే ఖండాంతరవాసులగు విదేశీయులుకూడ తమతమ మతగ్రంథములందు అభిమానమువదలి గీతాగ్రంథమును జదివి పూజించి కీర్తించి ధన్యులగుచున్నారు. హిందూదేశము యొక్కయు హిందువుల యొక్కయు అఖండ విస్తార కీర్తిసంపదలు శ్రీభగవద్గీతాపఠన శ్రవణ మనన అనుష్ఠానములవల్లనే కలిగినదని ధారాళముగా నొక్కి చెప్పవచ్చును మరియు సర్వోపనిషత్తులను గోవుగాను శ్రీకృష్ణ పరమాత్మను పాలుపిండు గొల్లవాడుగాను అర్జునుడు చేపునకు విడుచు దూడగాను గీతామృతమను మహత్తైన క్షీరమును పితికి జ్ఞానులకు శ్రీకృష్ణుడిచ్చెననియు అట్టి గీతామృతమను పాలనుద్రావి ఆత్మను పోషించుకొనువారు జ్ఞానులని శ్రీవేదవ్యాసులు "సర్వోపనిషదో గావో" అను శ్లోకరూపముగా వర్ణించి చెప్పియున్నారు మరియు నీగీతను గంగానదికంటెను పావనముగానుపవిత్రముగాను పునర్జన్మరహితముజేయుశక్తిగలదిగాను వర్ణించియున్నారు. "(గీతాగంగోదకం పీత్వా పునర్జన్మ న విద్యతే)" మరికొందరు వేదములను

పశువుగాను వేదవేద్యుడగు శ్రీమన్నారాయణుని ఆ వేదపశువు దివ్యాత్మగాను యుపనిషదర్థములు పాలుగాను దానిని సుఖముగా త్రాగి ఆత్మ బలము చేకూర్చుకొనువారు యోగులుగా వర్ణించియున్నారు. ఇంకను మహామతియగు వేదవ్యాసులు భారతమను వేదసముద్రమును తమ విశాలబుద్ధియగు పెద్దకవ్వముచే చిలికి ఎత్తిన వెన్నయే శ్రీగీతామృతమని చెప్పి యున్నారు. ఇట్టి మహత్తైన గౌరవము పొంది యుండునది శ్రీభగవద్గీత యొక్కటియే గదా? ఈగ్రంథము ఇహపర సాధనంబులగు అన్ని గ్రంథములవలె గాక మోక్షైకసాధనము యున్నది. సులభమగు మార్గమును మోక్ష కాముకులకు చూపించుచున్నది. గీతయందు ముఖ్య మగు ఆత్మతత్త్వములు దాని గుణములు ఆత్మ తరుణోపాయములు మాత్రమే చెప్పబడియున్నవి శ్రీగీతలు మనకు భగవంతుడుపదేశించిన వాక్య రత్నములు దీని సారతాత్పర్యములు ఏమనగా నాభక్తులగు నరులు మోక్షమునకై శ్రమపడ వలసినది లేదు సంసారకష్టములకై భయపడి పాప పుణ్యములు దలంచి యడవులకు పోనక్కరలేదు. కొండ రడవులకు పోయి పంచేం ద్రియములను నిగ్రహించి యణచుటకు సాధన ముల నన్వేషించి ప్రాణాయామ మాదిగాగల యోగమార్గముల నలవరచుకొని నవలంబింప వలదు. అట్టి కఠిననియమ నిర్బంధము లేవియు లేకుండనే గృహములను గృహిణులను గూడి యుండియే నివృత్తిమార్గ మవలంభించు కొన వచ్చునని చెప్పియున్నారు. శరీరమును ఎండ బెట్టి అన్నపానములను వర్జించి బుద్ధిని శోషింప జేసి కాయమును కష్టపరచి ఆత్మను వ్యాకుల పరచి కఠినమగు తపస్సులచే దేహమును చిత్ర వధచేయమని చెప్పియుండలేదు. ఆత్మ సుఖము ఆత్మభోగముల నలవరచుకొమ్మనియే చెప్పి యున్నారు. ఇదియే మనోనిగ్రహము. గృహస్థా శ్రమధర్మములను శాస్త్రరీతిగాను న్యాయము గాను నిర్వహించుచునే మోక్షము జెందవచ్చు నని చెప్పియున్నారు. అదెట్లనగా మోక్షమును గోరు ప్రతి ఆత్మయును సంసార మందుగాని సంసారుల సహవాసమందు గాని మనసు నంట నీయరాదు. సంసారమును నందుండి నీవు చేయు ప్రతిపుణ్యకార్యమును నాకు సమ ర్పణ చేయవలయును. పుణ్యమునందు కర్తృ త్వము ఫలముగాని నీవు ఆశింపవద్దు. పాపకార్య ములు అణుమాత్రముగూడ చేయకుము. పుణ్య ఫలములను గోరకుము. మనస్సును స్థిరపరచు కొని నాయందు లయించేసి నన్ను ధ్యానిం చుము. ఇట్లు అభ్యాసము చేసి నిశ్చలబుద్ధివై నిరహంకారుడవై నిర్మలుడవైన నీవు నాకు శరణా గతి చేసి నిర్భయముగా నుండుము. మోక్షమును నేనే ఇచ్చెదనని చెప్పియున్నారు. మరియు తామరాకుపై నీటివలె అగ్రకామములను నాశి లను అంటకుండ సకలములయందు మమతలు విడిచి స్వాభిమాననివృత్తి గలిగి యుండవలెనని బోధించుయున్నాడు. తల్లిదండ్రులను భార్యా పుత్రాదులను ధనధాన్య క్షేత్రమిత్రాదులను నా దాస్యమునకు నాకైంకర్యమునకు అనుకూలు లగు బాంధవులనుగా విడువరాదనియె

కన్నులుమూసుకొని ఆహారవిహారములను విసర్జించి కొండశిఖరముల నండజేసుకొని పర్వత గుహాల నాశ్రయించి పాటుపడ నక్కరలేదు. ఆశాపాశములచే కట్టుబడక రాగద్వేషములచే విజృంభించక లోభమోహాములచే ఆత్మదర్మములను మరువక గృహస్థాశ్రమమున నుండియే తల్లి తండ్రిలను సోదర సోదరీజనులను భార్యాపుత్రాదులను తారతమ్యము లెరిగి గౌరవించుచు పెద్దలగువారిని జ్ఞానులను భక్తులను ప్రిపన్నులు మొదలగు విలక్షణులగు వారినిన్ని భాగవతులను సత్కరించుచు న్యాయార్జితముగా ధనము సంపాదించుచు వారల నాదరించుచు లోభగుణములేక వారి వారికి చేయవలశిన యుపకారములు శరీరముచేతను ధనముచేతనుచేయుచు యధాశక్తి తనవల్లనైనంతవరకు నాకు ప్రీతిగా సత్కార్యములనే జేయుచు దుష్టులగు కపటవేషదారులతో చేరక శ్రీహరినగు నాయందు భక్తిశ్రద్దలు గలిగి అర్చనాభివందన పూర్వకముగా అక్కరగల్గి సంపూర్ణముగా నన్నునమ్మి మనఃపూర్వకముగా నేనుసంతోషించు కార్యములనే జేయుచు తాను చేసిన పాపకర్మానురూప అనుభవములగు సుఖఃదుఃఖములు కష్టనిష్టూరములు పాపపుణ్యములు భోగభాగ్యములు ననుభవించుచు వాటియందు బంధములేక విముక్తుడై నాయందు స్థిరముగా నిలిపిన మనస్సు గలవాడై ఓర్పుగలిగి యుండుటయే పరమపదము చేరుటకు సులభోపాయమని ఉపదేశించియున్నారు. గనుక గీతాచార్యుల భావము ముఖ్యముగా నేది యనగా 1. మనస్సును నిర్మలముగా నుంచుకొనుట 2. లౌకిక సుఖభోగములందు తాను మునుగక సూక్ష్మముగా శరీరధారణ మాత్రి మంగీకరించుట, 3. నిశ్చలముగా నన్ను ధ్యానించుట ఏకార్యము చేయుచుండినను నన్ను జ్ఞాపకముంచుకొని యే నాయాజ్ఞ అనుకొనుచునే చేయుట 4. పుణ్యఫలములను తాను గోరక నాకు సమర్పించుట యనునదియే మోక్షమార్గమని చెప్పినట్లు తెలియుచున్నది. నాయందు నిశ్చలభక్తిగలిగి నన్నుధ్యానించుటకు అజ్ఞానులకును శాస్త్రాధికారి యోగ్యతగల అధికారులుగాని జ్ఞానులుగాని భక్తులుగాని ఏజాతివారైనను సరియే స్త్రీలుగాని పురుషులుగాని నాకు ఆత్మసమర్పణచేసి శరణాగతినిబొంది కర్తృత్వము నారోపించుకొనక ఎప్పుడున్ను పుణ్యకార్యములనే జేయుచు ఫలములను గోరక పాపకార్యముల దిచ్ఛలేక ఇతరదేవతలను ఇతరజనులను రక్షింపుమని గోరక నన్నొకనినే రక్షకునిగా సర్వవిధబంధువుగా నమ్మి అల్పములగు కోరికల గోరక తమ జీవితకాలములను సన్మార్గమునందు గడుపుచుండుటయే గీతార్థము అనియును ఇట్టి గీతార్థజ్ఞానము జ్ఞానులకు పరమార్థమనియు మోక్షమునకు కావలశిన ముఖ్యానుష్ఠానమనియు శ్రీకృష్ణపరమాత్మ గీతలందు చెప్పిరి అదిగాక నాభక్తులగు భాగవతులకు దాసానుదాసుడై సేవజేయుచు వారికిజేయు సత్కార పూజలందును కైంకర్యములందును శ్రద్ధాభక్తులు గలిగి నిత్యముగా నడచుకొనుటయే సత్యమగు మోక్షమార్గమనియు సులభమార్గమనియు చెప్పిరి. తాము స్వయముగా గీత

యందు ప్రకటించినది గాక మనకు గురువుల వలన వివరముగా దెలియునట్లు చేసియున్నారు. గనుక నే భూమియందుపుట్టినసమస్త జనులకును శ్రీభగవద్గీతాశ్లోకపఠనము శ్రవణము మననము మిగుల ముఖ్యముగా గావలసియున్నది జ్ఞానులయినను అజ్ఞానులయినను పండితులయినను పామరులయినను ధనవంతులయినను దరిద్రులయినను విజాతివారైనను యువకులయినను వృద్ధులయినను బాలులైనను స్త్రీలయినను పురుషులయినను శ్రీగీతాశ్లోకములను పఠించుటకుగాని గీతాధ్యాయము లన్నియును వ్యాఖ్యానసహితముగా పఠించుటకును వినుటకును అనుష్టించుటకును అర్హులగుదురు. గంగానదియందు మునిగి స్నానముచేయుటకు జగతియందు సకలజనులకును అధికారము స్వతంత్రముగలదు. అటులనే భగవంతుని స్తోత్రముచేసి భక్తిశ్రద్ధలతో నర్చించుటకు అన్ని మతములవారికిని సహజముగా స్వతంత్రము గలదుగదా అటులనేభగవద్గీతలు చదువుటకుగాని ప్రతిదినము నిత్యానుష్టానముగా పారాయణముచేయుటకుగాని గీతలవ్యాఖ్యానములు వివరముగా గురువులవలన వినుటకుగాని స్నాననియమ అనుష్టాన ధ్యాననియమ ఆహారనియమములు గల మనుజులందరికిని యోగ్యతాధికారము గలదు. సకల ప్రాణులకు శ్రీగీతాశ్రవణమందు అర్హత గలదు. కాని గీతలను అలక్ష్యముచేయువారికిని అవమానించు వారికిని మాత్రము గీతాపఠన శ్రవణ మననములకు అధికారము లేదు. అట్టివారికి ఎట్టిగురువులయినను గీతోపదేశము చేయగూడ దనియు అర్థములు వినిపించరాదనియు శ్రీగీతాచార్యుడు తానే స్వయముగా గీతల కడపటి అధ్యాయ కడపటి శ్లోకములందుఖండితముగా నాజ్ఞాపించియున్నాడు

అహంకార మమకారములు నిండుగా గలిగి గర్వముచే నేను నాది యను మమతాభావము గలిగి జ్ఞానులు భక్తులు మొదలగు వారియందు అసూయాపరులై యుండువారికిని ఓర్పు ధైర్యము లేక చంచల చిత్తులగువారికిని అపరిమితమగు కోపము గలిగి ఎప్పుడును పరులను హింసించు వారికిని ఆచార్యులను పెద్దలను భగవద్భక్తులను వారి జ్ఞానానుష్ఠానములను చూచి దూషించుచు పెద్దలగౌరవమును సహించలేనివారికిని గీతోపదేశము చేయరాదని గురుజనులను గూడ గీతాచార్యులు హెచ్చరించి యున్నారు. లోకమున జనులు ఖ్యాతిలాభములు గాంచుటకై డంభముగా పలువేషములు వేయుచు కుయుక్తులు చేసి అబద్ధములను అసత్యములను అసంబద్ధమగు అర్థములను చెప్పుచు కపటమున[illegible] నుంచి మాటలు చెపుతలంపులు అను[illegible] వేషధారిన కర్తలై జనులను మోసగించు వంచకులకు గీతోపదేశము గూడదని గీతాంతశ్లోకములందు గీతాగురుడు గట్టిగా నొక్కి వక్కాణించి యున్నాడు, గనుక నరులమగు మనము దుష్టగుణములు పోగొట్టుకొని దురనుష్ఠానములను విడచి దుస్సహావాసములను వర్జించి మానస్నాన గలవారై గీతామహిమలను గీతలను విద్వాంసులగు జ్ఞానగురువులవలన చదివించి విని మీరు గీతాశ్లోకములను చెప్పుకొని చదివి పాఠముచేసి ఉపదేశముపొంది ఉపదేశరీతిగా ఆత్మస్వరూ

పము పరమాత్మస్వరూపము ప్రకృతిస్వరూపము జ్ఞాన స్వరూపము అనుష్ఠాన స్వరూపములను చక్కగా తెలుసుకొనిభగవద్గీతలందు అసూయా బుద్ధి ద్వేషస్వభావముల విడచి అర్థములువిని ఆనందించవలయును గాని అపచారపడగూడదని అభిప్రాయము గలిగి యుండవలయును,

శ్రీభగవద్గీతలు పవిత్రములలో పరమపవిత్రము పావనములలో త్రిలోకపావనము శ్రేష్ఠములలో అత్యంతశ్రేష్ఠము ఉత్తమములలో ఉత్తమోత్తమము ప్రమాణములలో మూల ప్రమాణము ఉద్ధారకములలో పరమోద్ధారకము మంగళములలో అనంతమంగళప్రదము గుహ్యములలో గూఢభావములతో గూడిన గుహ్యము మరియు బ్రహ్మవిద్యలందగ్రగణ్య మైనది యోగవిద్యలకు జన్మభూమి వంటిది. శాస్త్రములకు మూలకందము. శ్రీకృష్ణార్జున సంవాదమును పేర విరాజమానమై జీవాత్మ పరమాత్మలకుండు భేద గుణ తత్వములను ప్రకృతి కుండు గుణభేదములను నిరూపించుచున్నది భగవంతుడగు శ్రీమన్నారాయణు డెట్లు వేరు వేరు నానురూపములతో ప్రతియుగంబునందవతరించి దుష్టనిగ్రహ శిష్టపరిపాలనము చేయుచుండునో అట్లే శ్రీభగవద్గీతలును యుగయుగమునందు అవతరించి సకల జనులకు అజ్ఞాననివృత్తి జేసి జ్ఞాన భక్తి వైరాగ్య నిష్ఠాక్రమములుఅనుష్ఠింప జేసి పరమాత్మ యందు జ్ఞానాభివృద్ధిని గలిగించి మోక్షప్రాప్తిని గలుగజేయుచున్నది ముముక్షువులు భాగవతులు సత్పురుషు లందరును భగవంతుని యవతారమగు శ్రీభగవద్గీతలను శిరసాధరించి హృదయకమల పీఠములందు ప్రతిష్ఠజేసుకొని మానసిక భక్తితో పూజించి కృతార్థులు గావలయును గీతాచార్యుల శ్రీపాదపద్మములయందు నిరంతరము భక్తిగలిగి యుండవలయును. గీతాచార్యునియందు దృఢమగు విశ్వాసముంచి ప్రపత్తి జేసి శరణాగతుడై దృఢముగా జ్ఞాన భక్తి వైరాగ్య నిష్ఠలు మారకుండ స్థిరముగా జన్మజన్మాంతరములవరకు నిలిచియుండునట్లు చేయమని భగవంతుడగు శ్రీపార్థసారధి పాండవధూత యని నామములు అనంతములుగాగల గీతాచార్యుడగు శ్రీకృష్ణదేవుని అంజలిపూర్వకముగా ప్రార్థించవలయును ఇదియే గీతార్థసారము శ్రీగీతలయందుండు విషయములు మిగుల ముఖ్యమయినవి. చేతనునికి తెలియవలసిన స్వరూపానుష్ఠానము లన్నియు గీతలయందే యున్నవి అర్థపంచక స్వరూపమును ఆకారత్రయములు దానుష్ఠానములును శ్రీగీతాచార్యులు ఓ గీతలందు స్పష్టముగా వివరించి చెప్పియున్నారు. భగవంతుడగు తనకు సమస్తాత్మలు శేష భూతములనియును కర్మజ్ఞాన భక్తి ప్రపత్తి ఆచార్యాభిమానములు ఆత్మోజ్జీవనమునకు ఉపాయములనియును పలువిధముల సాటి చెప్పిరి. శ్రీగీతలందులేని యర్థము లే బ్రహ్మవిద్యయందు గాని లేవు దేహపోషణకు అన్నాదిపదార్థములు ఔషధములు ఎట్లు ముఖ్యమో అట్లే ఆత్మపోషణమునకు శ్రీగీతార్థజ్ఞానమున్ను శ్రీగీతాశాస్త్రమున జెప్పియుండు నియమములున్ను మిగుల ముఖ్యమైనది.

ఈపాశురము తిరువాయ్‌మొழிలోనిదొకపాశురము గ్రంథవిస్తర భీతివలన దానిభావము చాలా సంకుచితముగా విన్నవించుటయినది. మన ఆళ్వారులుపాడిన నాలాయిర దివ్యప్రబంధ ములలో వర్ణనాతీతము ఒకపాశురమునకే ఇంతభావమయితే 4 వేల పాటలకు ఎన్నిసుస్వర భావ ములు ఎన్నిరకముల రసానుభూతులు ఎంతభగవదనుభవానందము వుంటుందో మీరే ఆలోచిం చండి. గనుక ఇకమీద ప్రతినెలా నాలాయిర దివ్యప్రబంధములలోని భావములు వ్యాసములక్రింద పత్రికలో అచ్చుపడుతూవుంటాయి.

**తిరువాయ్‌మొழி 6 వ పదిలోని 2 వ పాశురార్థభావములు** శ్రీమతి సింగూరి ఆసంవమ్మగారు

ఏ ఆగా ౭౦.

మిన్నిడై మడవార్‌గళ్ నిన్నరుళ్ శూడువార్ । మునే నూ నాలం వందొళిందేన్
మున్నుడై ఇలంగై యరణ్ కాయంద మాయవనే
ఉన్నుడయ శుండాయమ్‌నాననరివన్ । ఇని అదులాయం త్తి మునిగేం
ఎన్నుడయ పందుం కళలుం తందు పోగు నంబీ

ఆళ్వారుల నాయికీ అవస్థ నాటిక
మొదటి రంగము ఆళ్వార్ తిరునగరియందలి పుష్పతోట

(నమ్మాళ్వారులు భగవద్వియోగ దుఃఖముతో నాయికీఅవస్థనొంది మూర్ఛిల్లియుండురు ప్రశిష్యులు మధురకవులు వారి అవస్థచూడలేక చెలికత్తె అవస్థనొంది వారికి పుష్పోపచారములు చేయు టకుండురు.)

ఆళ్వార్లనాయకి:- మూర్ఛావస్థలో కృష్ణా! కృష్ణా అని పలువరించుచుండును.

చెలికత్తె:- ఏమి ఈఆళ్వార్లనాయకి పరితాపము మొన్నటినుండి నందగోపుని కుమారుని దూత లను పంపినప్పటినుంచి భ్రాంతిగా మనస్పృహయే లేదుగదా నేనేమి చేయుదును దూతలు వెళ్ళి 2 దినములైనా తిరువణ్ వండూరిస్వామి ఇంకనూ రాలేదే! స్వామియూ రాడు నీవూ దుఃఖము విడువవు. నేనేమిచేయుదును పలుకరించి చూచెదగాక ఆళ్వార్‌నాయకీ ఆళ్వార్ నాయకీ అనిపిలుచును.

ఆళ్వార్‌నాయకి:- తుళ్ళిపడిలేచి ఏమీ మధురం వచ్చాడా నాస్వామి! ఏమా నామురళీ కృష్ణుడేడీ ఇంకా రాలేదు. ఈవియోగబాధ భరింపలేను మధురం!

చెలికత్తె:- అమ్మా అంత తొందరపడితే ఏలాగునమ్మా స్వామిది రాకుండా వుండే స్వభా వము కాదమ్మా "ఆర్తోవా యదివాదృప్తః పరేషాం శరణాంగతః" అనికదా వాని స్వభావము ఆర్తిలేనివారినే రక్షించే స్వభావము గలవాడు ఆర్తిగల మిమ్ములను విడచునా తల్లీ! అదిగాక మచ్చిశీలుడుకదా! ఈపాటికి మనము పంపిన దూతల వాక్యములన్ని వారు ఆలకించియే యుందును.

గజేంద్రుని మొరాలకించి "ఆర్తికులై యతలై కులైయ" అన్నట్లు బట్టజారిపోతూవుండగా జుట్టుముడి పోతూవుండగా రక్షించిన గజేంద్రవరదుడు మిమ్ములను విడిచి పెట్టునా తల్లీ!

నాయకి:— మధురం నీకేమే యేమోమో చెపుతావు! ఒక నిమిషము వేయియుగములగా వున్నది యేమిచేయనే! కొంచెము సేపు ఆలస్యమైతే సహించవు? దివ్యమంగళ విగ్రహమా వానిది ఆకార్ వణ్ణంతిరుమేనిని ఆనల్లని వానిని పద్మనయనంబుల వానిని నవ్వోరాజిల్లెడమోము వానిని ఇక ఒక నిమషమాతస్యమైనా చూడకుండా వుండలేనే మధురం యేమినేత్రాలే వానివి "తామరై కణ్ గళ్ క్కొండు ఈరీతియాల్" అబ్బా కృష్ణా తామర రేకులవంటి నీనేత్ర సౌందర్యము నాఆత్మని లాగివేస్తున్నదమ్మా భరింపలేను కృష్ణా

చెలికత్తె:—ఆళ్వార్ నాయకీ అటుచూడండి ఆచింతచెట్టుమీద పక్షిఏలాగున కూస్తున్నదోను "పక్షీచశాఖానిలయఃప్రహృష్టః పునః పునశ్చోత్తమ సాంత్వవాదీ" లాగకూస్తున్నదే మన వేణు గోపాలుని రాక తెలుపుతూ శుభసూచకముగా ఏలాగ కూస్తున్నదో ఇక కొంచెము సేపటిలో వారు రాగలరు. తల్లీ ఊరడిల్లుము.

నాయకి:— ఆలోచించి మధురం వాడెలాగవస్తాడు. ముఖ్యముగా నన్ను కూడి తిరిగి ఎడ బాసి ఏడిపించడానికైనా వస్తాడు ఈసారివాడువస్తే ఆమాయ గోపాలునితో మాట్లాడాలని లేదు. మధురం వానికి మనలాంటి వారెంతమందో వాడువచ్చి నాస్థిరముగా మనవద్ద వుండడుగదా ఈవియోగ దుఃఖమేకదా.

చెలికత్తె:— సరి అయితే మనమిప్పుడేమి చేయుదము.

నాయకి:— అదుగో ఆపూపొదరింటిలోకిపోదాము. గోపాలుడు వచ్చినా వాని వైపు చూడ వద్దు మాట్లాడవద్దు బొమ్మలు గచ్చకాయలు బంతి ఆడుకొంటున్నట్లుగా వుందాము ఏమంటావు మధురం

మధురం:— ఏమనేటందులకు యేముందమ్మా నీవు గోపాలుడు చేరివుంటేమీాఉభయులతో వుంటాము. మీాకు ప్రణయరోషము కలిగి వేరుగావుంటే మీాతోవుంటాను మీాఅభిప్రాయమే నాఅభిప్రాయముగదా

నాయకి:— సరీ మధురం తొందరగా పోదాముదా ఆపూపొదరింటిలోనికి, బొమ్మలు గచ్చ కాయలు బంతి తీసుకొనిరావూ తొందరగా వాడువచ్చే వేళ అయిపోతూంది

2వ రంగము ప్రవేశము (శ్రీకృష్ణపరమాత్మ మురళినూదుకొంటూ)

శ్రీకృష్ణుడు:- తోట నాలుగువైపులా కలయచూచి ఏరీ ఆళ్వార్‌నాయకి చెలికత్తె మధురము కనుపించుటలేదే సంధ్యైనాలేదే తిరిగినలువైపులా పరిశీలించి చిరునవ్వుతో అదుగో అపూపాదరింటిలో నారాకకు ఎదురుచూస్తూ నేను వచ్చుట కొంచెమాలస్యమైనదని కోపముతో ఎలాకూర్చునివున్నారో ఆహాహా! ఏమి ఈఆళ్వార్‌నాయకి భక్తి, ప్రేమలు, మొన్న నేను వారిదగ్గర వుండగానే ప్రభాతమైనది ప్రభాతవాయువులు పక్షుల కలకలారావములు ఆలకించి ఇకనీకు తెల్లవారి నది. నీవు గోవులను మేపుటకు వెళ్ళిపోతావు పోయెదవు పోవుచున్నావు కృష్ణా అని నేను ఎన్ని విధాల వెళ్లుటలేదని సమాధాన పరచినా వినిపించుకోకుండా "వెయ్‌మరు తోళ్ళై మెలియుమాలో" చూడు గోపాలా నీవు దూడలను మేపుటకు వెళ్ళిపోయినావు నా చేతులేలాగ వాలిపోయినావో అని చేతులు వాలిపోయిన హస్తాలుచూపిస్తే సర్వజ్ఞుడనయిన నాకు నిజముగా వెళ్ళిపోయినాను కాబోలు లేకుంటే వీరెండులకీవిధము పాలిపోయెదరని భ్రమ కలిగి నిజంగా దూడలను మేపుటకు వెళ్ళిపోయినానేమోననే భ్రమకలిగినది. "వాసుదేవ స్సర్వమితి సమహాత్మాసు దుర్లభః" అను సరిత పించిన నాకోరిక నెరవేర్చుటకు అవతరించిన అవతార మాలస్యమైనదని కోపగించుకొనే వారు ఎవరున్నారు. వీరిని విడిచివుండలేను. ఎటులైన పలుకరించి వీరి ప్రణయరోషము మాన్పెదగాక అని పూపాదరింటివద్దకు మురళిని మ్రోయిస్తూ పోవును గాని ఎవరూచూడరు పలుకరించరు సరి ఏదేలాగునైనా సమాధాన పరచాలని ఆలోచనలతో వుండగా పీగు మరచి పోయిన బంతి గచ్చ కాయలు కాలికి తగులును.

శ్రీకృష్ణుడు:- తవలో ఈబంతి గచ్చకాయలు దొరికెను నా అదృష్టము వీటి సాధనముతో పలుకరించి చూచెదగాక! ప్రకాశముగా ఆళ్వార్‌నాయకీ ఇదిగో మీబంతి గచ్చకాయలు ఇచ్చుట మరచిపోయినారు తీసుకొండి ఆళ్వార్‌నాయకీ

ఆళ్వార్‌నాయకీ:- కృష్ణా నీభ్రమచూస్తే నాకు నవ్వు వస్తున్నదయ్యా పచ్చకామెరలు గలవానికి ప్రపంచమంతా పచ్చగా కనుపించినటుల సర్వావస్థలయందు ఆబృందావన గోపికల స్వరూపమే నీహృదయములో వుండుటవలన ఎచ్చట ఎవరిని చూచినా వారనే భ్రమతో వుంటావు మేము ఆబృందావన గోపికలము కామయ్యా ఆళ్వార్‌నాయకినయ్యా

శ్రీకృష్ణ:- లేదు ఆళ్వార్‌నాయకీ నాసర్వస్వము మీరేనండీ

అళ్వార్‌నాయకి:- కాదు "మిన్నిడై మడవార్‌గళ్ నిన్నరుళ్ శూడువార్ మునై బునానద వఱ్" చూడు కృష్ణా మెరుపువంటి సన్ననినడుము అందమైన తిరుముఖమండలముగల ఆగోపికామ్

నీకరుణకు పాత్రిభూతులుగాని మేమూ కృష్ణా నీకృప లబించుటకు తగిన వైరాగ్యమూ జ్ఞానమూ భక్తియూ ఏమిసుగుణములు మాయందువున్నవని నీకృపకు పాత్రులమవుట సరేగాని నంద గోపాలా నీవు చాలాసేపు మావద్దవుంటే నీరాక ఆలస్యమైపోయినదని ఆగోపిమారులకు కోపము వస్తుంది. ఆకారణముతో వారు నీతో సరిగా మాట్లాడరు అందువలన నీతిరుముఖ మండలము వాడిపోతుంది నీతిరుముఖమండలము వాడిపోతే నేను చూడలేను అందుకు భయపడుచున్నాను, వెళ్ళు కృష్ణా నీరాకకు ఎదురుచూస్తూ ఆయమునానది ఒడ్డున గోపిమారులు కాచుకొని వుంటారు, నిన్ను ప్రేమించిన వారికి నీమీద ధ్యాసయేగాని వేరుభావనవుండదు. వెళ్ళు కృష్ణా

శ్రీకృష్ణః- ఆళ్వార్‌నాయకి నాకు మీకంటె ప్రేమకితగిన పాత్రిభూతులెవరైనా వున్నారా మీవంటి ఆమె కొరకే గదా రామావతారములో సేతువుకట్టి లంక ధ్వంసము చేసి అన్ని పనులు చేయుట

ఆళ్వార్నాయకి:- ఆహా అదా చూడు పూర్వము ఆషాడభూతిగాడనే శిష్యుడు పూతిక పుల్ల ఇంటివారికిచ్చి వచ్చి గురువుగారికి నమ్మకం కలిగించి గురువుసొమ్మంతా ఎత్తుకొని పారిపోయి నటుల నీవు మమ్ముల నందరినీ మోసముచేయుటకొరకు ఒకస్త్రీనిమిత్తము ఎంతపనిచేసినాడని మేము నమ్మాలని చేసావు. కృష్ణా నీమాయలు నిజమని నమ్ముటకు అమాయకురాలైన సీతాదేవినికాను, ఎన్ని అగ్నిపరీక్షలు ఎన్నిసార్లు అరణ్యవాసము ఎన్నిమాయలు అన్నిమాయలు"జనకానాంకులేకీర్తి మాహారిష్యతిమేసుతా" అన్న జనకకులసుందరి దగ్గర చెల్లుబడి అవునుగాని నాదగ్గర పనికిరావు కృష్ణా"ఉన్నుడయ శుండాయన్ నావరివర్"నీమాయలన్ని నాకు తెలుసును అవి ఇచ్చట ప్రయో గించుకు ప్రయోజనము లేదు కృష్ణా.

శ్రీకృష్ణః- ఆలోచించి ఆళ్వార్‌నాయకీ మీకు నేను సమాధానము చెప్పలేను దాని కేమి గాని ఇవిగో ఈబంతి గచ్చకాయలు ఎంతబాగున్నాయో అచ్చంగా భగవత్పరము చేసిన మీ పంచేంద్రియముల మాదిరిగా ఈగచ్చకాయ లున్నాయి పరమాత్మ అనుభవమున కుపయోగ పడేమీ త్రిగుణముల మాదిరిగా ఈబంతిరంగువున్నది ఆళ్వార్‌నాయకీ కురువేరు పెట్టుకొనేవారు మట్టికడగకుండా మట్టితోనే వుపయోగించుకొనేటటుల జ్ఞాని ఆత్మతోపాటు వారిశరీరము ఇంద్రి యాలు అంటే నాకెంతనో ప్రీతి ఆళ్వార్‌నాయకీ.

ఆళ్వార్‌నాయకి:- గోపాలా పొరపాటు పడుచున్నావు భ్రమ-నీకు నీభావనచేత సర్వ జగత్తు గోపికలమయిపోయి ఎవరినిచూచినా వారేననీ ఎవరి ఇంద్రియాలుచూచినా వారివనీ భ్రమ పడుచున్నావు. ఇవి మాఇంద్రియములేయ్యా ఏఆత్మగుణములున్నవని మమ్ములను నీవు ప్రేమింపుట

చెలికత్తె:- అన్ని తీసుకొనివచ్చాను రండి పోదాము అని ఇరువురు పూపొదరింటి లోనికేగి ఆడుకొంటూవుందురు.

"సీశనేఙ్నిత్తైబన్నుమిలేఙ్" జ్ఞానానుష్టానములు లేని చపలచిత్తుని ఇంద్రియాలుస్వామీ! నీకొరకు పరితపించి ప్రాణత్యాగముచేసిన చింతయంతి ఇంద్రియాలు కావు నీమురళీగానామృతపానముచే మైమరచి సర్వము త్యజించి ఇలువెడలి వచ్చిన గోపీమారుల ఇంద్రియాలుకావు. అజ్ఞానాగ్రేసరుల మైన మాఇంద్రియాలు స్వామీ మాగచ్ఛకాయలు మాబంతి మాకిచ్చి నెప్పనయ్యా బృందా వనమునకు

శ్రీకృష్ణ:- ఆళ్వార్ నాయకీ నారాక కొంత మాలస్యమైపోయినని ఇంతప్రణయ రోషముపొందుతే ఏలాగునండీ నావియోగ దుఃఖము మీకేటులనో మీవియోగ బాధనాకటులనే గదా అందుకనీ "నిర్పదుం-ఇరప్పదుం-కిడప్పదుం ఎన్ నెజుళ్" అని కూర్చోవడము నిలబడడము పడుకోవడము నాహృదయరంగమందే అని మీవాక్కుతో మీరే చెప్పేటులల మీహృదయ కమలమును నేను విడచి పెట్టలేదే ఆళ్వార్ లెండి మీకేమివరముకావాలి.

ఆళ్వార్ నాయకి;- అనుగ్రహింపబడితిని కృష్ణా నాకేమి కావాలయ్యా "అడిచ్చి యోమ్ తలమిశై నీఅణియాయ్" మాతలమీద నీపాదపద్మము లుంపవయ్యా "అంతకంటె వేరేమి వరము కావాలి తవామృత స్యందిని పాదపంకజే నివేశితాత్మాకథ మన్యదిచ్ఛతి" కదా

శ్రీకృష్ణ:-సరే అని ఆళ్వార్ నాయకి చెలికత్తెల శిరస్సుమీద తన పాదపద్మము లుంగనును.

ఆళ్వార్ నాయకి:-వుఙ్ తేనే మలరుంతిరుప్పాదం శేరందేఙ్ అప్పానీ వేనకారుగూ పుష్ప పాదపద్మములలో చేరిపోయినాను ఇంత కంటెయేమికావాలి ఆనదం బ్రహ్మానందం.

మధురం:- ఆహా ఏమి నాభాగ్యము "తిరితంబానిలుంతేవ పిరానుక్కై కరియకోలం తిరు వురుక్కాణ్ బఙ్నాఙ్" భగవాఙ్ వద్దనుకున్నా వాని దివ్యమంగళ విగ్రహసేవయే కాకుంటా వానిపాద పద్మములు నాశిరోభూషణమైపోయినవే ఇంత అదృష్టమున్నా, ఆళ్వారుల నాశ్రయించిన నాకు భగవద్విషయమెంత సులభమయిపోయినది ఆనందం బ్రహ్మానందం అని ఆళ్వా శ్రీకృష్ణ పరమాత్మ మధురకవి ఆళ్వార్ బ్రహ్మానందముతో వుందురు.

# ప్రచార విభాగము.



శ్రీరస్తు.

## ప్రకటన

ప్రియపాఠక మహాశయులారా !

తామత్యంతాభిమానముతో ఆదరించుచున్న భక్తి "నివేదన" పత్రిక యొక్క విక్రుతి సంవత్సరపు జమ ఖర్చులను తమ యెదుట ఇదె యుంచియున్నారము.

నిరుటి సంవత్సరము రాబడికంటె ఖర్చులు హెచ్చు అయి రూ 375-2-9 లు బదులు చేసియుంటిమి. అది అటుల యుండగనే ఈ సంవత్సరము రూ 1625-3-3ను బదులు చేయవలసి వచ్చినది.

నిరుడు దాదాపు 3000 మందికి పత్రికను పంపుచుంటిమి. చివరకు రూ 3325-0-0 లు మాత్రము అనగా దాదాపు 650 మంది మాత్రమే చందాను సమర్పించి యుండిరి.

ప్రచారము మాత్రమే మాప్రధానలక్ష్యమై యుండుటచే ఈసంవత్సరముకూడ నిరుటి వలెనే అందరకు కూడ పత్రికను పంప నుత్సాహపడితిమి. గాని నిరుటికంటె కాగితము ధరలు హెచ్చుటచేతను, ముద్రణాది వ్యయములు హెచ్చుటచేతను నిరుడుచేసిన బాకీలు తీర్చివేయుటకు ఎట్టిమార్గము కానబడక పోవుటచేతను, మాకెంత యుత్సాహమున్ననుదానిని యణచుకొని నిరుడు చందాలను చెల్లించినట్టివారికిన్ని మరియు ఈసంవత్సరమైన చందాలను చెల్లించగలరను ఆశించ తగినట్టి వారికిని కొందరు మతాభిమానులకున్ను కలిపి మొత్తము 1000 మందికి మాత్రమే పత్రికను పంపుచు వచ్చితిమి. సంవత్సరాంతమునకు సుమారు 350 మంది మాత్రమే చందాను సమర్పించిరి.

ఇంక ఈకరువుకాలములో పత్రికను నడుపుట ఎటులనో మాకు తోచకున్నది? భగవంనితు పైనను భాగవతోత్తములమీదను భారమువైచి ఏమైననుసరియే ఈసంవత్సరము కూడ

పత్రికను పూర్తిగ ప్రచురించి తీరుటకే నిశ్చయించుకొంటిమి.

ప్రచురించుటకు ప్రచురింపవలసిన వ్యాసములకు లోటులేదు. రెండు మూడు వత్సరముల వరకు ప్రచురించుటకు సరిపోవు వ్యాసములు సిద్ధముగా నున్నవి. అవి అమూల్యములైనవియే. అయినను పెద్దవి. మాకు ఏవ్యాసమును సశేషముగ మధ్యలో నిలిపివేసి ప్రచురించుచుండుట కిష్టములేదు. ఒకే పర్యాయము ప్రచురించుటకు చాల పుటలగును. అన్ని పుటలు అగు వ్యాసముల ప్రచురించుచుండుటకు తగిన ఆర్థికస్తోమతు-పాఠకుల ప్రోత్సాహము లేదు అందుచే సరియగు వ్యాసముల ప్రచురించ జాలకున్నాము.

పత్రికాప్రచురణకై ప్రత్యేక పండితుల నొకరిని నియమించవలసియున్నది. అటుల చేసిన గాని పత్రిక సర్వాంగ సుందరముగను తప్పులు లేకుండగను, సకాలములోను వెలువడ జాలదు. మాకుగల యితర ప్రచార కార్యక్రమ తొందరలో పత్రికా ప్రచురణము గురించి తగు శ్రద్ధ వహించుటకు వీలుచిక్కక చాల చిక్కులుగా యున్నది. మరియు సమగ్రముగు లేక సిద్ధయును మున్నగువానితో మన ఆళ్వార్లయొక్కయు, పూర్వాచార్యులయొక్కయు ప్రాచీన అర్వాచీన ఆచార్య పురుషులయొక్కయు పెద్దలయొక్కయు చిత్రములను ఆధారములతో ప్రచురించవలసి యున్నది. అందులకు వలయు సాధన సామగ్రిని ఫోటోలను వగైరాల నన్నింటిని చాలవరకు సమకూర్చి యుంటిమి.

మరియు యిప్పుడు మతముయొక్క ఆచార అనుష్ఠానములయొక్క సమగ్రవిషయములు మూలసిద్ధాంతములు తెలియక చాల మంది ఆస్తికులు మతవిషయమై ఉదాసీనభావులై యున్నారు. అట్టి వారికందరికి అందుబాటులో యుండునటుల మత-ఆచార-అనుష్ఠాన కట్టుబాట్లను పూర్వ ఆధునిక కాల సమన్వయ విధానములను ప్రచురించి ప్రచారము చేయవలసియున్నది. మరియు పూర్వాచార్యులు పరమకృపతో రచించియున్న మత సాంప్రదాయ గ్రంథములు యిప్పుడు దొరుకుట లేదు.

ఉదాహరణకు నిత్యానుసంధాన-పుస్తకములు లేవు. నాలాయిర ప్రబంధముల కోశములేలేవు. అష్టాదశ రహస్యముల గ్రంథములైనను లేవు. ముముక్షుప్పడి మున్నగు వ్యాఖ్యాన గ్రంథములు లేవు. శ్రీభాష్య-భగవద్విషయాది పెద్ద గ్రంథములు అసలేలేవు వీటన్నింటిని తిరిగ ముద్రింపవలసియున్నది. ఏపనిచేయవలసియున్నను ఆర్థికసహాయము కావలసియున్నది. శారీరకముగను మానసికముగను సర్వేశ్వరుడిచ్చిన శక్తినంతను సంఘసేవలో జీవితాంతమువరకు సమర్పించుటకు శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ సంచాలక సమితి సభ్యులము ప్రమాణము చేసి యున్నారము. అటుల పని చేయుచునే యున్నాము. ఆర్థికముగ కూడ అవకాశమున్నంతవరకు అర్పించుచునే యున్నాము. కాని యిది యెంతమాత్రము? సముద్రములో నీటి బొట్టంతయైనను లేదు. పదిమంది సంఘీయులు యిందులకు నడుముకట్టి తన-మన-ధనముల సమర్పణ మూలముగ పనిచేసిన గాని ఈసంఘసేవారథము సాగునది కాదు.

ఇందులకై సహృదయ హృదయులగు సంఘసేవాభిమానుల నందరను సవినయముగ ప్రార్థించుచు మీయందరియొక్క ఆదరాభిమానముల సేవానిష్ఠను యాచించుచున్నారము.

మన ఈవాఙ్మయరూప ప్రచార కార్యక్రమ యుద్దేశపరిపూర్తికై సూచనగ మన ఈ భక్తి "నివేదన" పత్రికను వారపత్రిక క్రింద మార్చవలెననియు, అందు ఒకవారము కేవలము ప్రచారమునకు సంబంధించిన విషయములనే ప్రచురించు చుండవలెననియు:

రెండవవారమున మతసాంప్రదాయ ఆచార-అనుష్ఠాన-సిద్ధాంతములకు సంబంధించిన విషయములను చిన్నచిన్న గ్రంథరూపముగ ప్రచురించు చుండవలెననియు;

మూడవవారమున ఆళ్వారులు-పూర్వాచార్యులు-పెద్దలు సాయించిన మతసాంప్రదాయ పెద్దగ్రంథములను కొద్దికొద్ది భాగముల క్రింద ప్రచురించు చుండవలెననియు;

నాలుగవవారమున పెద్దలయొక్క వ్యాసములను మాత్రము ప్రచురించు చుండవలె ననియు యభిలషించుచున్నారము. వీటిని ఒక్క ఆంధ్రభాషలోనేగాక అరవము, కన్నడము, హిందీ భాషలలోకూడ ప్రచురించవలెనని ఆశపడుచున్నారము. భగవంతుని సంకల్పమేమో? భాగవత మంగళాశాసనమెట్లున్నదో? కాలము నిర్ణయించ వలసియున్నది.

ఈపత్రికా విషయమును గూర్చియు; ప్రచార కార్యక్రమమును గూర్చియు సదయ హృదయులగు పాఠకమహాశయుల రుచులు, అభిలాషలు చేయు సహాయము ఒసంగు సలహాలను తెలుసుకొనుటకై ఇందులో ఒక పోస్టుకార్డును తమకు పంపుకొనుచున్నారము. ఈవిషయమును దయయుంచి మరువకుడు.

దయయుంచి మా ఈ విజ్ఞప్తిని తాము స్వయముగ సమగ్రముగ చదివియు, బంధు మిత్రులకు వినిపించియు ఈకార్డుపై తమ అమూల్య సమగ్ర సలహా-సహాయములను తెలుప సవినయ ప్రార్థన.

ముఖ్యమనవి:- పనిచేయుటకు సిద్ధముగా యున్నారము. పనిచేయుట మావిధి వలయు సాధన సామగ్రిని సమకూర్చి పనిచేయించుకొనుడు. ఇది మీ విధి.

ఇట్లు
సంపాదకవర్గము తరపున దాసులు
తె. కం. గోపాలాచార్యులు,
ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులు

షరా:- పత్రికకు గత సంవత్సరపు చందా బాకీలను, ఈ ఖర సంవత్సరపు క్రొత్త చందాలను పంపినగాని పత్రికను వెలువరించుటకు వీలుకలుగకున్నది. ప్రతిచందాదారులు కనీసము ముగురినైనను క్రొత్త చందాదారులును చేర్పించుట తమ విధిగ భావించి పనిజేసిన గాని పత్రిక వృద్ధి చెంద జాలదు. ఇదియు ఒక సంఘసేవయే కదా.

# పాపానాం పాప ముత్తమమ్

మరింగంటి రంగనాయకమ్మగారు, కోడకొండ.

---

లోకులు లోక పోకకాయను పాతి యది మొలచు వరకును యెరువుల జేర్చుచు నీరుపోయుచు దాని చెంత నొక గుడిశకట్టుకొని యహర్నిశములు దానిని గాచుచు పదిపన్నెండు వత్సరములు గడుప చివరకది ప్రసాదించునది నిస్సారమగు వక్క యొక్కటియే.

అట్లుగాక హేయమగు సంసారమును బాపి విలక్షణమగు పరమపదమును ప్రసాదించు భగవద్విషయమును ప్రసాదించు నాచార్యుల కిసుమంతయైనను కృతజ్ఞతనుజూపని సంసారుల యవివేకమున కేమనవలెనని తిరుమాళ్ళై యాండాన్ సాయించిరి.

నిజమారయ "కృతఘ్నే నాస్తి నిష్కృతిః" యని

ప్రాకృతద్రవ్యముల నుపకరించువారిని మఱచినవారికి పాపమునకే ప్రాయశ్చిత్తము లేదని నిర్దాక్షిణ్యముగా శాస్త్ర ముద్ఘోషించుచుండ నప్రాకృతమై నిరతిశయ వైలక్షణ్యము గల ఆత్మవస్తు వనాదికాలము నుండియు 'అసన్నేవ స భవతి' యని శ్రుతిచే పెడమొగముపెట్టి తిట్టబడి నిరసింపబడియు, నేడాచార్యుల యనుగ్రహము వలన ఆత్మజ్ఞాన సమృద్ధమై 'సంత మేనం తతో విదుః' రితి యను నట్లు శ్రుతియే యొడిలో నిడుకొని తన తిట్టిన నోటితో గాక 'విదుః' అని పెద్దల ముఖమునః ప్రశంసింప దునట్లొనర్చిన యాచార్యులపట్ల కృతఘ్నులగుట 'పాపానాం పాపముత్తమమ్మనుట' నిర్వివాదము గాదా!

శ్రీ

    

శ్రీమతే రామానుజాయనమః

భక్తి

# నివేదన

వేదాంత మాస పత్రిక

| సంపుటి ౩ | ఖర ఆషాఢమాసము | సంచిక ౪ |
|---|---|---|



## శ్రీ యతిరాజ విజయ నాటకము.

శ్రీ ఉ. వే. శ్రీమాన్ కె. ఎం. గోపాలాచార్యులుగారు, కోదకొండ.



భగవద్రామానుజులకు పూర్వాశ్రమమునందు శ్రీవత్సకులతిలకులైన మహాపండితులగు సుదర్శనులను పేరుగల మేనల్లు రొకరుండిరి. రామానుజులు వారి వైదుష్యమునకు ముగ్ధులై తమ శ్రీభాష్యసింహాసనాధికారమును వారి కర్పించిరి. వారికి శ్రుతప్రకాశకాది గ్రంథకర్తలకు గూడ నాచార్యస్థానము నలంకరించిన వేదాంత కూటస్థులైన వరదార్యులను ప్రసిద్ధ నామధేయముగల పౌత్రులుండిరి. ఆవరదార్యులకు నాల్గవ తరమున శ్రీకాంచీపురమునందు శ్రీఘటికాశత సుదర్శనాచార్యులను నొక మహాపండితులుదయించిరి. ఆసుదర్శనాచార్యుల కచ్ఛటనే వరదార్యులనెడు పుత్రులు జన్మించిరి. వారు తమ యప్రధృష్య పాండిత్య ప్రకర్షచే జగద్విఖ్యాతిని గాంచి దర్శన స్థాపకులగు వేదాంతాచార్యుల పట్లను రామానుజార్యుల పట్లను అపారశ్రద్ధాభక్తిసమన్వితులై కవిపుంగవులై యలరారుచుండిరి. వీరికి 'అమ్మాళాచార్య' లని యపరనామధేయము కలదు. వీరు శ్రవ్య ప్రబంధములకంటే దృశ్యప్రబంధములచే నెట్టి వారికైనను గంభీరమగు వేదాంతవిషయములు కూడ హృదయంగములు కాగలవను సంకల్పమునన్ శాంతరసమును అంగిగను రసాంతరములను అంకములుగను జేసి ప్రమాణమూర్ధన్యమగు నుపనిషత్తులను 'వేదమౌళి'యను పేరులో ధీరశాంత నాయకునిగ జేసి ప్రత్యక్షాది ప్రమాణాంతరములను ఇతిహాస పురాణాద్యుపబృంహణములను సకలవైదికావైదిక మతములను

త త్తదనుకూలపాత్రలుగా కల్పించి యత్యద్భుత మగు నొక వేదాంత నాటకమును కల్పించిరి. ఇదియే 'యతిరాజవిజయము' అనునాటకము

ఈనాటకమున మతాంతరము లన్నిటి కంటెను అందును శ్రీరామానుజావతార సమయమున దేశమంతట నల్లుకొనియున్న శంకర యాదవ భాస్కర మతముల కంటెను భగవద్రామానుజ సిద్ధాంతమే సకలప్రమాణ సమన్వితంబగు నుత్తమసిద్ధాంతమని స్థాపించుటయే వీరి ముఖ్యాశయము. శుష్క వేదాంతార్థముల నింత రసవంతముగ పాఠకుల కందిచ్చినవి ప్రబోధ చంద్రోదయము సంకల్పసూర్యోదయము యతిరాజవిజయమనెడు నీమూడుగ్రంథములే. ఇవ్విటికి పండితలోకమున ప్రసిద్ధికెక్కి యున్నవి. ఈకవిపుంగవుల రచనా కౌశలము నొకింత సహృదయ హృదయములయందు ప్రకాశింపజేయుటకై యీనాటక కథా సంవిధానము నిచ్చట సంగ్రహముగా పొందుపరచుచున్నాను. ఇందు గల భావార్థములను స్వాపదేశము లనుబడు ప్రకృత అంతరార్థములను ప్రాజ్ఞులూహించుకొందురుగాక!

: కథాశరీరము :

పూర్వము వేదమౌళి యనునొక రాజుండెను. ఈతడు సర్వదా సకల ప్రజానీకమునకు హితముగ మాటలాడు స్వభావముకలవాడు. సమస్త సమయాచారములను సంకరము కాకుండునట్లు స్థిరముగ కాపాడుచుండెను. మాయచే జీవించు వంచకుల నీతడెంతమాత్రమును సహించువాడు కాడు. మానపరితాపములతో నీతనికి సాటియే మృగ్యము. సకల నీతులలో నీతడాదరించదగిన వాడు. పుష్కలమైన శారీరమానసిక బలములు గల యువకుడు నాయకులలో నీతనికి సాటియే లేకుంట యతిశయోక్తి గానేరదు. ఇట్టి సద్గుణరాశియగు నీరాజు విపశ్చిదీశ్వరు లనెడు తత్వత్రయోపేతమైన [illegible] బ్రహ్మాండముల నేకఛత్రాధిపత్యముగ నేలుచుండెను. నసత్య [illegible] గుహాదేవ [illegible] ఏక [illegible] నుండెడి. వీరేగాక [illegible] మహామాత్యులుగాక [illegible] వీరం [illegible] మహా[illegible] ప్రధా [illegible]ఉండెడిది. [illegible] ప్రసిద్ధమగున బోధాయనాదు లందరును కాలధర్మమునొందిరి. ప్రత్యక్షాది మహామాత్యుల కుటుంబములో కొందరు వికలాంగులు జన్మించి దుర్మార్గులై రాజ్యభ్రష్టులు గావింపబడిరి. వారు మెల్లగ పొలిమేరలయందు నుయవన్నకై పొంచియున్న పాషండులతో చేరి వారిని ప్రోత్సహించి వారితో గలసి మహారాజు విషయములన్నియు వ్యాకులపరచసాగిరి. రాజ్యమును చక్కని మార్గమున నడిపింపదగు మంత్రిపుంగవుండు లేకుండుటం జేసి యీపాషండులు [illegible] యగు నొక మాయావి [illegible]ముతో రాజు చెంతకరుదెంచి యీతనికి తాను పరమహితైదిసు డను విశ్వాసము ను బుట్టించి క్రమముగ ప్రధాన మంత్రిపదవి నధిరోహించెను. యాదవభాస్కరులుపమంత్రులైరి. రాజునకు ప్రధానామాత్యుని ప్రేరణచే మిథ్యావిషము తలకెక్కెను. యథా రాజా న్యాయముగ నితిహాస పురాణములు తంతాన తాన యనసాగెను. మెల్లమెల్లగ ప్రథా

నామాత్యుడు రాజునకు దుర్బోధగావించి తన కుమార్తెయగు మిథ్యాదృష్టి నాతని కప్పగించి ప్రాణసఖియగు సునీతితో రాజమహిషియగు సుమతిని బహిష్కరింపజేసెను. గాని సుమతి సఖులగు సద్విద్యా గీతాదేవులను మాత్రమొక రీతిగా చేబట్టెను. సదూహుడను సేనానాయకుని తప్పించి దురూహున కాయధికార మొప్పగించెను. సదూహుడు రామానుజుల నాశ్రయించి ప్రధానామాత్యుని యున్మూలించు ప్రయత్నము గావించుచుండెను. వేదవిచారుడను (పూర్వమీమాంసాశాస్త్రము) రాజసోదరునిపై రాజుతో నేరములు చెప్పి యాతనిని రాజ్యము నుండి వెడలగొట్టించెను.

ధర్మముల కిరువురకును రాజ్యమున తావు లేకుండజేసెను. ప్రవృత్తి భర్తయగు ధర్ముడు వేదవిచారుని చేబట్టెను. పాపమా ధర్ముని చార్వాకుడు మాయావాది సౌగత దిగంబరులతో (బౌద్ధజైనులతో) గూడి పీడించ దొడంగెను. అనుకూలులుగా నాభాసించు కపిల పతంజల కపాలభట్టపాదులు "వీనికింతయు శాస్తి కావలె" నని వెనుకటి విరోధములు దలంచి చూచుచు నూరకుండిరి. పాపమా దీనుడు వంటరిగ నేమిచేయును. ఇక నివృత్తి భర్తయగు ధర్ముడు వెడలగొట్టబడి రామానుజుల చెంత జేరెను. చార్వాకుడు ప్రధానామాత్యునకు కొంత భయపడుచుండెను గాని వాని మిత్రుడగు బౌద్ధుడా భయమును తీర్చివేసెను.

ఈదుర్ఘటన నంతను రాజెరింగి తనప్రియ మిత్రులగు యామునాచార్యుల రావించి తగిన యుపాయ మాలోచించెను. వారి యాదేశాను సారము తగిన మంత్రి లభించువరకు మాయావాదిని చెండనాడిన తన శత్రువులు తన విషయముల నాక్రమింతురని భయపడి యోరిమి పట్టియుండెను.

అచ్చట సుమతి దుఃఖార్ణవ నిమగ్నమానసయై సునీతితో గూడి యా మాయామంత్రి నశించి సన్మంత్రిపుంగవుడు లభింపవలెనని యిష్టదైవమును శ్రద్ధాభక్తులతో పూజించుచుండెను. గీతా సద్విద్యలు గూడ నామెకు వలయు నంత చేదోడగుచుండిరి.

ఇట్లు మిథ్యాదృష్టి వశంగతుడై తెలివి మాలిన రాజును గాపాడుటకై యాతని సన్మిత్రులగు యామునులు రామానుజుల ప్రోత్సహించగా వారెట్లో రాజసాన్నిధ్యమును సంపాదించి యారాజు వంటరిగా నున్నతరి యాతనికి జారిణియగు నామిథ్యాదృష్టి వృత్తము నంతను సవిస్తరముగ బోధించి యామెపై యాతనికి కసహ్యమును బుట్టించి సుమతి సునీతులు లేని రాజ్యము చెడునని మెల్లగా రాజమహిషిపై యాతని మనస్సును మరలించెను.

ఈసంఘటనచే రాజునకు రామానుజుల బుద్ధికౌశల మచ్చెరువొనరించి వారినే మంత్రిగా పరిగ్రహింపవలెనను సంకల్పము జనించెను. మాయావాది దానిని కనిపెట్టి రామానుజులను రాజద్వారమున నడుగిడకుండగ జేసివేసెను. దాన రామానుజుల కాగ్రహము జనించెను. ఈ దౌష్ట్యమును పోగొట్టినగాని నిద్రాహారము లంటనని శపథము గావించి తన ప్రియశిష్యు లిరువురితో కాంచీపురి కేగెను.

యామునాచార్యులు మాత్రము రాజును వీడక యాతని హితమునే యన్వేషించుచు

వెన్నంటియే యుండిరి. మాయావాది మాత్రము కూలంకషానంద తరంగపరంపరల తానోలలాడుచు రాజు నోలలాడించుచుండెను. కాని వీనియభివృద్ధిని భాస్కరయాదవులు సహింపజాలక వీని యవమాన సుముహూర్తమునకు మాసమేషములు లెక్కించుచునే యుండిరి. రాజిదియంతయు నెఱింగియు సన్మంత్రిపుంగవ లాభమునకై భగవదనుగ్రహము నపేక్షించుచుండెను.

ఇట్లుండ నొకనాడు రాజు యామునాచార్యులతో గూడి కొలువుతీర్చియుండెను. శ్రీవరదరాజ పెరుమాళ్ళ ప్రేరణచే కాంచీపురమునుండి శ్రీయామునాచార్యులకు కాంచీపూర్ణులు పత్రరూపమగు సందేశమును పంపిరి. దానిని శిరసావహించి వాధూలులగు దాశరథులును, వాత్స్యులగు వరదవిష్ణువులును రంగప్రియ ప్రియరంగ నామములతో వైతాళిక వేషధరులై సభారంగమున ప్రవేశించిరి. వారు కొనివచ్చిన యాపత్రమును గైకొని రాజు స్వయముగ చదివెను. అందు శ్రీవరదరాజుపెరుమాళ్లు కాంచీపూర్ణులకు ప్రత్యక్షమై 'మాయావాది విప్లవముచే మహారాజు కుదృష్టకుహనాముఖమున కూలి నామావశిష్టుడై కుందుచున్నాడు గాన రామానుజులను తగిన మతి నీతి సత్య సముత్సాహాది సహాయసంతతుల నొసంగి పంపుచున్నాను గాన నీవును ఏమరక రాజును గాపాడవలెన'ని యామునాచార్యుల నాదేశించుచుండెను. రాజందుల కపరిమితానంద కందళితాంత రంగుడాయెను. మంత్రులు మండిపడ జొచ్చిరి. వైతాళిక వేషధారులగు నారామానుజ శిష్యపుంగవులు తమ శీతలయుక్తిధారా సంపాతములచే నామంటల నార్పి తమబుద్ధికౌశలముచేతను పరమతఖండన నైపుణిచేతను నొక్కసారిగా త్రయ్యంత సిద్ధాంతము ప్రక్కకు త్రిప్పివేసిరి. మంత్రులు పరాజితులై తలవంచుకొని లేచిపోయిరి. పిమ్మట రాజును వైతాళికుల తత్త్వమెఱింగి వారి మూలమున ప్రకటితమైన రామానుజుల వైదుష్యమునకు మహాశ్చర్యంబు నొంది వారి శుభాగమన సుముహూర్తమునకై యెదురు జూచుచుండెను.

ఇంతలో శ్రీవరదరాజ పెరుమాళ్ళచే ప్రేరేపించబడిన శ్రీకాంచీపూర్ణుల యానతి శిరసావహించి శ్రీరామానుజాచార్యులు వేదమార్గ నాశ్రయించి మాయావిచే బహుభంగుల పీడింపబడి ప్రధానమంత్రి [illegible] నధిరోహించిరి. వారి బోధనాకౌశలముచే క్రిమిశైవ యాదవరాజు తిరిగి తన పట్టమహిషియగు సుమతియందు సాభిలాషుడయ్యెను. సుమతియొక్క దౌత్యచాతుర్యముచేతను, గీతామాతయొక్క సదుపదేశముచేతను సుమతి వేదమార్గైక మనస్కులై సంతసించిరి.

ఇట్లు వేదమార్గ రాజ్యమంతయు ప్రధానామాత్యులగు రామానుజులచే నిష్కంటకముగ నేలబడుచుండ నిర్వ్యాకులిత హృదయుడగు నా నిష్కాసిత ప్రధానామాత్యుడగు మాయావాది శంకరుని స్మరించుకొని కేవల దేశీయులతో గూడి యొక రహస్య ప్రదేశమున దుర్గనారాధించి యామె యనుగ్రహబలమున వివిధ మాయాశక్తి సమన్వితుడై రామానుజ విజయకాంక్ష ప్రేరేపింప నింద్రజిత్తుకైవడి విజృంభింపనారంభించెను. ధ్యాన నిష్ప్రపంచ నిరోగవాదులు వృద్ధులైనను మాయావాదికి తోడ్పడుట తమ కర్తవ్యమని నిశ్చయించుకొని

రామానుజులతో తలపడదొడంగిరి గానిశంకరుని జూడగనే వెనుకకు మరలిరి. శంకర శిష్యులగు జీవైక నానాత్వవాదులగు శాక్త్యార్థజ్ఞానవాదులు వీరికి తోడ్పడుటకు మారుగా పరస్పరము కలహించుచు నెచ్చటికోపోయిరి. యామున రామానుజ సుమతి సునీతులతో రాజు కొలువుకూటమున సిష్టాగోష్ఠిని జరుపుచుండగ శంకరునూతగా గొని మాయావాది రామానుజ విజయాటోపముతో నాయన నన్వేషించుచు నేతెంచి తన పాండిత్య ప్రకర్షనంతయు ఝుంఝూమారుతము పగిది వీవ దొడంగెను గాని తంత్రిపాలుడను నామాంతరముతో మహారాజు సన్నిధిలో సేనాధిపతిగానున్న సదూహుడను శ్రీరామానుజార్యుల శిష్యుని సమీచీన తర్క ధారాపాతములచే శమించి నేలయంటి పడియుండుతరి మిథ్యాదృష్టిచే ప్రోత్సాహితులై యోగాచార మాధ్యమికులు ముందు వెనుక లారయక రంగమునకురికి శంకరున కండగ నిలిచిరి. గాని తత్క్షణమే సేనాపతిచే నిరుత్తరులు గావింపబడిరి. సరిగ నిదే సమయమునకు పరాంకుశ పరకాలాదులు సభ కేతెంచిరి అంత రామానుజులు పరాంకుశులను సగౌరవముగ తన చెంత నిడుకొని యువశిష్ట శత్రునిరశనార్థమై పరకాలాదుల నాదేశించిరి. యోగాచార మాధ్యమికులు పరాంకుశులచే లెస్సగ దండింపబడి పిక్కబలమును జూపిరి. మిథ్యాదృష్టి వారి ననుగమించి శతధా కూపం ప్రవిశంతికి పాత్రమయ్యెను.

ఇంతలో నుపమంత్రులగు యాదవభాస్కరు లందుకొనిరి. సేనాపతిచే శ్లోకైకయుక్తి శరముచేతనుమాత్రమే నిరుత్తరులుగావింపబడి శ్రీయామునాచార్యుల హితోపదేశమునాదరించి భగవద్రామానుజుల చరణారవింద శరణాగతిచే సంరక్షింపబడిరి. శంకరుడు మాత్రము తన కాపట్యము నంగీకరించి శ్రీయతిరాజయామున ప్రభృతులవద్ద సెలవు గైకొని పర్యంక విద్యోపాసనకై యనంతపురమున కేగెను.

పిమ్మట సోదరులును నగు వేదమాళి వేదవిచారుల కనాత్మజ్ఞులగు దుర్మంత్రులచే గల్పింపబడిన విరోధము నుపశమింప జేయుటకై యతిరాజులు భారతపురాణముల నంపి వేదవిచారుని రప్పించెను. పూర్వప్రాతికూల్యమును స్మరించి వేదవిచారుడు రాజుకంట బడుటకు జంకుచుండ భారత మాతనికి కర్తవ్యమును సయుక్తికముగ నుపదేశింప దానిని నాతడు శిరసావహించి ధైర్యమవలంబించి భారతపురాణముల పురస్కరించుకొని రాజు ప్రోలనిలచెను. అంత శ్రీయతిరాజ పురుషకారముచేయావరాజ్యాధికారమును బడసి రాజుచే నాజ్ఞాపితుడై సేనాధిపతియగు సదూహుని పురస్కరించుకొని బౌద్ధాదులవిజయమునకై యేతెంచెను. ఇంతవరకు నితిహాసపురాణములు గావించిన నిష్కల్మష సేవకు ప్రశంసించి యిట్లే మీపనిని మీరు జాగరూకులై నిర్వహించుచుండుడని శాసించి యతిరాజులు వారి నంపివేసిరి. అట్లే యితరరాజ్య కార్యనిర్వహణదక్షులగు ధర్మము, శబ్దము మొదలగు నిధికారులందర రావించి వారికి సత్సేవాక్రమమును విధించి ప్రధానామాత్యులగు రామానుజులు వారివారి పనులకై వారిని పంపివేసిరి.

మహారాజు సుమతి సునీతులతో గూడి శ్రీయతిరాజులు గావించిన దిగ్విజయమునకు వారిని వేనోళ్ళ గొనియాడుచుండ సేనాపతి యేతెంచి దిగ్విజయ వృత్తాంతము నంతను నవి

స్తారముగ వర్ణించి దిగ్విజయోత్సవమును మహా వైభవముతో జరిపించ యనుమతి వేడెను. రాజాజ్ఞచే శ్రీమత్పరాంకుశ పరకాలనాథ యామున శ్రీవత్సాంక దాశరథి ప్రభృతులచే నాయుత్సవ మతివైభవోపేతముగ జరుపబడెను. ఆయుత్సవ సందర్భమున మహారాజీ వైభవమున కంతకును కారణమైన ప్రియరంగ నామధేయముతో వైతాళిక వేషమున వచ్చిన వాత్స్యవంశోద్భవులగు సుదర్శనులకు యతిరాజులచే కోశాధికార పదవి యిప్పించబడెను. అంత మహారాజు సుమతి సునీతులతో గూడి యా యుత్సవమునంతను సానందముగ సేవించి భుజంగరాజ పర్యంక శాయియగు శ్రీరంగరాజుల సన్నిధిని బహు భంగుల నుతించెను. చివరకు "రామానుజార్య దివ్యాజ్ఞా వర్ధతా మభివర్ధతా" మ్మనెడు భరత వచనముతో నాటకము శుభాంతముగా ముగిసెను.

ఇట్టి మహద్వైభవోపేతమై యప్రతిమమగు నీ నాటకరత్న మేకోయొక మూల మ్రగ్గుచుండ దీని దుమ్మును దులిపి నిజప్రకాశముతో పండిత హృదయ సింహాసనము నధిరోహింప జేసిన న్యాయవేదాన్త వాచస్పతి శ్రీ ఉ. వే. శ్రీమాన్ తె.కం.రామానుజాచార్యస్వామివారికి శ్రీవిశిష్టాద్వైత ప్రచారక పణ్డితమణ్డలి తరపునను శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము తరపునను పరశ్శత ప్రణామ పరంపరల సమర్పించుచున్నాడ.

ఇకముందీనాటక రచనా శైలియు, ఈకవి పుంగవుని బుద్ధికౌశలమును రసజ్ఞుల యనుభవము కొఱకై యచ్చటచ్చట కొన్నికొన్ని ఘట్టములు సాంధ్రానువాదముగా నీపత్రికలో ప్రకటింపబడగలవు.

ఈనాటకమునందలి పాత్రల పరిచయము

పురుషులు

(సప్రేక్షము)

1. వేదపురుషుడు– (ఉపనిషద్విచారము) నాయకుడు
2. వేదవిచారుడు– (కర్మవిచారము) రాజునకు సోదరుడు– చార్వాక శాక్యాదులను ప్రబల శత్రువు.
3. (చిన్న)ధర్ముడు– (సామాన్యధర్మములు) ప్రవృత్తికి భర్త– వేదవిచారుని మిత్రుడు.
4. (పెద్ద)ధర్ముడు– (విశేషధర్మములు) నివృత్తికి భర్త– యతిరాజుల యనుచరుడు.
5. యామునాచార్యులు– (రామానుజులకు ఆచార్యులు) నాయకుని హితైషి.
6. యతిరాజు– వేదపురుషునికి సన్మంత్రిపుంగవుడు (శ్రీవిశిష్టాద్వైత సిద్ధాంతప్రవర్తకుడు) శ్రీ రామానుజులు.
7. ప్రియరంగడు– వాత్స్యవంశీయుడు సుదర్శనుడనువరదవిష్ణువు. వైతాళిక వేషముతో నాయకునివద్దనున్న శ్రీయామునాచార్యులకు శ్రీగాంచీపూర్ణుల శ్రీముఖమును గొని వచ్చి సభారంగమున మాయావాదిని నిరుత్తరునిగ జేసిన ప్రౌఢయగు రామానుజ శిష్యుడు.
8. రంగప్రియుడు– వాధూల వంశోద్భవుండు– దాశరథుడు– రెండవ వైతాళికుడు రామానుజుల శిష్యుడు– మొదటివైతాళికునకుతోడైన వాడు.

9. సదూహుడు– వేదమాళి సేనానాయకుడు మాయావాది ప్రధాన మంత్రిత్వములో పదవీభ్రష్టుడు గావింపబడి రామానుజుల నాశ్రయించి సకలమతముల ఖండించి రామానుజులను విజయము చేకూర్చినదిట్టి ఈతడే తంత్రపాలుడను రామానుజుల ప్రధానయోధుడు. ప్రియశిష్యుడును.

10. పరాంకుశుడు(ప్రధానమంత్రియగు రామానుజ పక్షీయులు శ్రీయామున రామానుజులు పిదంచు శిష్యులను శత్రువులకైతె నమలుబకుపు మదోన్మాగులు.

11. దివ్యపురుషుడు– ఉరిశిక్షవంటి కఠినశిక్షలనాను లుపరను ఉగ్రోగి భాస్కరుని పారద్రోలెను.

12. పరకాలుడు–ఈతడొక సైన్యాధికారి–ఈతనికి రంగమునందంతగా ప్రవేశము లేదు.

స్త్రీ లు

1. సుమతి–నాయిక పట్టమహిషి
2. సునీతి–నాయికకు ప్రియసఖి అతిమేధావతి
3. గీతా–సుమతిసఖి–జనకునిమాత గొప్ప విష్ణుభక్తురాలు.
4. సద్విద్య– సుమతిసఖి–మాయావాదికి అనుకూలురాలవలె నటించుచు ఆతని కొలువుకూటమునను౦డెడిది. అంతరంగమునసుమతి సునీతి గీతలకు ప్రియసఖి

అసత్పక్షీయ పురుష పాత్రలు

1. మాయావాది– అద్వైతసిద్ధాన్త కూటస్థుడు. వేదమాళికికపట ప్రధానామాత్యుడు–గూఢ రాజద్రోహి.

2. యాదవుడు } 3. భాస్కరుడు } ప్రధానామాత్యుని పక్షీయులేయైనను ఆతనితోగాని తమలో తామనుగాని అంతగా కలియని వేదమాళి కపట ఉపమంత్రులు స్వార్థపరులు గూఢ రాజద్రోహులు మాయావాదికి అంతరంగ

4. చార్వాకుడు } 5. బౌద్ధుడు } 6. దిగంబరుడు } మిత్రులు రాజకులమునకు సహజబద్ధవిరోధులు పరస్పర సహకారులై ప్రతిపక్షితో నెదుర్కొనుమిత్రులు.

7. కపిలుడు, పతంజలుడు, కణభుక్కు, అక్షపాదుడు, వీరు మాయావాదితో నంతగా కలియక జవంశమునకు మిత్రులువలె నాభాసింతురు గాని వారికంత అనుకూలులుగారు తమచే రాజ్యమునేలవలెనను సంకల్పముతో నుండెడివారు.

8. శంకరుడు–. మాయావాదికి చేయూతయైన మహాభైరవీ సిద్ధిగల ప్రధానమిత్రుడు.

9. ధ్యాననియోగవాది } 10. నిష్ప్రపంచీకరణ నియోగవాది } వీరు వృద్ధులు.

మాయావాదికి సహచరులేగాని శంకరుడన్న వీరికి గిట్టదు.

11. శుక్లపటుడు–బహుజీవవాదీ } 12. సన్యాసీ – ఏకజీవవాదీ } ఉభయులును వ్యాక్యార్థ జ్ఞానవాదులే మాయావాదిమిత్రులే వీరిలో వీరికి మాత్రము పడదు.

13. యోగాచారుడు } శంకరునకు ప్రియమిత్రులు 14. మాధ్యమికుడు } బుద్ధశిష్యులలో నొకరు.

ఈ పక్ష స్త్రీ పాత్రలు

మిథ్యాదృష్టి:– మాయావాది కుమార్తె. జారిణి. మాయావాదిచే వేదమాళి కప్పగింపబడి సుమతి సునీతులను వెడలగొట్టించెను. ప్రాకృతమును గానముచేసి భరతశాపముచే నంతర్ధానమయ్యెను.

శ్రీమతే రామానుజాయ నమః

వేదాన్తవిలాసము (అనుబంధము)

# యతిరాజవిజయనాటకము

నందలి కొన్ని చక్కని శ్లోకములు.

(ప్రథమాంకారంభమందు)

1. శ్లో. పద్మే త్వన్నయనే స్మరామి సతతం భావో భవత్కుంతలే ।
నీలే ముహ్యతి కిం కరోమి మహితైః క్రీతో౽స్మి తే విభ్రమైః ।
ఇత్యుత్స్వప్నవచో నిశమ్య సరుషా నిర్భర్త్సితో రాధయా ।
కృష్ణస్తత్పరమేవ తద్వ్యపదిశన్ క్రీడావిటః పాతు నః ॥

తా॥ ఓ లక్ష్మీ! నేనెల్లప్పుడును నీ నేత్రములనే తలంచుకొనుచుందును. ఓ నీళాదేవీ! నామనోవృత్తి నీ ముంగురులయందే మోహమును జెంది యుండును. ఓ భూదేవీ! (మహీ = హే మహి) అని పదచ్ఛేదము) సుప్రసిద్ధములగు నీవిలాసములచే కొనబడిపోతిని ఏమి చేయుదును? అని శ్రీకృష్ణుడు నిద్రలో పలవరించుటను విని రాధ కోపముతో [illegible] క్రీడావిటుడుగాన నా ప్రలాపము నాతిను ఆ రాధపరముగనే సమన్వయించిన శ్రీకృష్ణుడు మిమ్ము రక్షించుగాక. (రాధాపరముగు సమన్వయము)

రాధా! నేనెల్లప్పుడును నీనేత్రములను తామరపువ్వులని తలంచుచున్నాను. నల్లనగు నీముంగురులయందే నామనస్సు సమ్మోహమును చెందుచున్నది. పూజ్యములగు నీవిలాసములచే కొనబడిపోతిని నేనేమిచేతును?

మొదటి యోజనలో 'పద్మే నీలే మహి' అనుపదములు క్రమముగా శ్రీనీళా భూదేవుల సంబోధనలు.

రెండవ యోజనలో 'పద్మే యనునది నయనములకును నీలే' యనునది [illegible] లకును మహితైః అనునది విభ్రమములకును విశేషణములు.

2. శయ్యా యస్య దృశా శృణోతి భవతి ఛన్దాంసి యద్వాహనం ।
లీలా యస్య జగన్తి కాలకలనామూలం చ యల్లోచనం ।
నిద్రా జాగ్రత ఏవ యస్య నిగమస్తోమో౽వతంసోత్పలం ।
దేవః పుష్యతు రఙ్గమఙ్గళనిధిః శ్రేయాంసి భూయాంసి నః ॥

తా॥ ఏ శ్రీరంగనాథునిపాన్పు కండ్లతో వినునో (ఆదిశేషువు చక్షుశ్శ్రవము) వేదములెవ్వని వాహనమో (వేదాత్మా విహగేశ్వరః) జగములెవనిలీలయో కాలమును లెక్కించుటకు మూలములగు చంద్రసూర్యులెవని నేత్రములో ఎవనికి మేల్కొనియుండగనే నిద్రయో (ఆతనిది యోగనిద్ర-జగద్రక్షణాలోచన) వేదాంతసముదాయ మెవ్వనికి తలపువ్వో, అట్టి శ్రీరంగశుభరాశియగు దేవుడు మన కపరిమితములగు శుభము లొనగూర్చుగాత!!

(ఆదిశేషునకు కన్నులే చెవులు. గరుత్మంతుడు వేదమూర్తి ఆతని వాహనము లోకముల సృష్టిస్థితిలయాదులు భగవంతునకు ఆటలు. సూర్యచంద్రులాతనికి కండ్లు. జగద్రక్షణ చింతయే ఆయనకునిద్ర వేదశిరస్సులగు ఉపనిషత్తులచేతనే ఆయన తెలుపబడును.)

# శ్రీభగవద్రామానుజాచార్య సన్యాస స్వీకార కారణము.

విద్యారణ్య పంచానన విద్యావాచస్పతి శ్రీమాన్ విక్రాల రామచంద్రాచార్యులవారు.

ఉడయవర్ భార్యను త్యజించు విషయమున గ్రంథములలోని భేదములు చూపెద.

1. దివ్యసూరిచరితములో ఘటములు మోదనముచే గురుపత్నిని అగౌరవించుట
2. ప్రపన్నామృతములో

   I అభ్యంజనము చేయువారికి అన్నములేదనుట చూడగా చద్దియన్న ముండుట.

   II బావిలోనీళ్ళను చేదునపుడు పెరియనంబిగారి భార్య కుండలోని నీళ్లు యీమె కడవలోకి చిందగా ఆమెను నీచమైన మాటలాడుట.

   III ఒకపండితుడు ఆకలిఅని అడుగగా యింటికి పంపి అన్నమడుగ మనగా ఆమెఅన్నములేదు బియ్యము లేవు నీవిచటనుండతగవు పోపో నిన్నెవరు పంపినారో వారిని పోయి అడుగు అని తలుపుగడియవేసుకొని నిష్ఠురముల పలుకుచుండెను. ఆయన రామానుజునికి ఈవైనమును తెలిపెను. అంత ఒకజాబు తనమామ తనకొడుకుపెండ్లియనియు నీవురావలిసినదనియు రాశి యిచ్చి పసుపుకుంకమ చిత్రవస్త్రమును యిచ్చి పంపినట్టుగా ఈవైష్ణవుని చేతనే పంపెను. ఆయన పోయి ఆమెకు యీవస్తువులను యిచ్చి జాబు చదివించి వినిపించెను. అంతట ఆయనకు ఆమె వండి అన్నమిడెను. ఆయన సాపాటుచేసి యుండగా రామానుజాచార్యులు వచ్చి తెలియనట్లుగా ఆవైష్ణవునివల్ల యీవర్తమానముగాని భార్యతో నీకు కావలశిన వస్త్రాభరణములను తీసుకొని ఈవైష్ణవునితోడ పుట్టింటికి పొమ్మని నేను అయిదుదినాలు తాళి వస్తాను అని చెప్పగా దాసదాసీ బంధుజనులతోడ బయలుదేరి పుట్టింటి కరిగెను. అంత వెంటనే సన్యాసమును దీసికొనెను.

3. గురుపరంపరా ప్రభావములో

   I తలంటువానికి చద్దెన్నము లేదనుట వెతకగా నిండా వుండుట.

   II గురుపత్నికి ఆమెకు బిందె తగువులు అంతట సన్యసించినారు.

4. పెరియ తిరుముడి యడవులో భార్యమీద నెపము చెప్పబడలేదు.
5. పరమయోగి విలాసములో భావిలో నీళ్లు చేదునపుడు ఇరువురిబిందెలతాకుడుచేనిరువురికితగవు.
6. ఆచార్య సూక్తి ముక్తావళిలో అభ్యంజనము చేయువానికి అన్నము లేదనుట అన్నము వెతకగా నుండెను. దానిని వానికి పెట్టెను. గురుపత్ని ఘటాంబుబిందువులు గాలిచే నీకుండలో చెదిరి పడినందున నిరువురికి గలిగిన తగవు. కాంచీపూర్ణునికి సాపాటుబెట్టి ఆయన యెంగిలాకు యెత్తివేసి సచేల స్నానము చేయుట.

   నీకు యావజ్జీవనమునకు కావలసినంత ద్రవ్యమిచ్చెద పుట్టింటనుండుమని చెప్పిపంపించి వరద

రాజుచే నివ్వబడ్డ కాషాయ త్రిదండములతో సన్యసించెను.

భగవద్రామానుజాచార్యులవారు సన్యసించుటకు కారణము భార్య విధేయురాలు కాకపోవుటయని చరిత్రలయందు దెలిపియున్నారు. ఆవిషయమై ఇంచుకంత విచారించి సత్యమును గ్రహింపవలసినది శిష్యకృత్యమై యున్నది.

భగవద్రామానుజాచార్య శిష్యవర్గము ఇటీవల తెంగల వడగలయని రెండు తెగలుగ వీడియున్నది. ఆరెండు సంఘములవారునూ ఆచార్యచరిత్రములను రచియించియున్నారు. వాటిని బట్టి ఆచార్య విషయములను గుర్తెరుంగవలయును. ఆగ్రంథము లెవ్వియన

1. దివ్యసూరిచరితము ఇది సంస్కృతము శ్లోకరూపము భగవద్రామానుజాచార్య ... కాలములోని వారగు గరుడవాహన పండితునిచే రచియింపబడినది.

2, ప్రపన్నామృతము ఇదియు సంస్కృతశ్లోకరూపము అనన్తాచార్య రచితము.

3. గురుపరంపరా ప్రభావము ఇది ద్రావిడభాష వాక్యరూపము ఇది పిన్బళగియ పెరుమాళ్ జీయ్యర్ సాధించినది.

4. పెరియతిరుముడియడవు.

5. పరమయోగివిలాసము ఇది ఆంధ్రభాషా పద్యకావ్యము. తిమ్మన్న పాలురచితము.

6. ఆచార్యసూక్తి ముక్తావళి. ఇది ఆంధ్రసీస పద్యాత్మకము. నంబూరి కేశవాచార్య విరచితము.

ఈయైదుగ్రంథములున్నూ భగవద్రామానుజాచార్యులవారి వెనుక చాలా సంవత్సర (శతాబ్ద)ములు గడచిన పిమ్మట రచింపబడినవి. ఈ యారు గ్రంథములు తెంగలవారు రచించినవి,

1. ఆంధ్రపూర్ణ విరచితముయతిరాజ వైభవము ఇది సంస్కృత శ్లోకరూపము.

2. తృతీయబ్రహ్మతంత్ర స్వతంత్రస్వామి రచితము మువ్వాయిర గురుపరంపరా ప్రభావము ఇది ద్రావిడభాషా వాక్యరూపము. ఈరెండునూ వడగలవారిచేవిరచితములు, ఆంధ్రపూర్ణులు భగవద్రామానుజాచార్యులవారి కాలములోనున్న వారికన్న ఈయతిరాజవైభవకర్త వేరుగ నుండవచ్చును. కావున నీరెండు గ్రంథములు గూడ భగవద్రామానుజాచార్యులవారికి బహుకాలానంతరము రచింపబడినవి. మరిన్ని వడగలవారిచే రచింపబడిన గ్రంథములు కొన్ని గలవు, అవి యెవ్వియనిన

1, ప్రబంధనిర్వాహము తిరుమలై శ్రీనివాసాచార్య కృతము దేశికశిష్యులు.

2. నాలాయిర త్తనియన్ వ్యాఖ్యానము.

3. పన్నీరాయిరప్పడి గురుపరంపరా ప్రభావము ఇది ద్వితీయ బ్రహ్మతంత్ర స్వతంత్ర స్వామి రచితము, ద్రావిడభాషాగద్యరూపము.

4. రామానుజ చరిత్రము కంచి శ్రీశైలతాతాచార్య విరచితము. ఈనాలుగు గ్రంథములున్నూ నాకు దొరకలేదు. నేను చూచిన నీయెనిమిది గ్రంథములలోను భగవద్రామాను

చార్యులవారు భార్యను త్యజించుటకు ఆమెయందు మూడు తప్పులున్నట్టులను వాట్లను సహింప లేక ఆమెను విడచి సన్యసించినట్లును దెలుపబడియున్నది. ఈచరిత్రములన్నియు ఒక్క తీరుననె యుండినచో తప్పైన నొప్పైన నమ్మవలసేవచ్చును. వాట్లలో విరోధము జూపట్టిన నమ్మకము తప్పిపోవును. అట్లుగాక నొకదానికన్న మరొకగ్రంధములో వింతవింతయగు కారణములను దెల్పిన యడల కొందరు కొన్నిమట్టుకు దెల్పినారనియు మరికొందరు మరికొన్నిటిని దెల్పినారనియు దలువ నగును. అవి ప్రమాణాంతర బాధితములుగానిచో అందుకై ఆగ్రంధములలోని తాత్పర్యములం దెల్పెదను. పెరియతిరుముడి యడువులో యేమికారణమున్నూ చెప్పబడి యుండలేదు. యతిరాజ వైభవములో ఘటవిషయము లేదుగాని గురుపత్నిని అధిక్షేపించినట్లున్నది.

1. ఘటవిషయము ఇంచుకంత భేదముగ మిగత నన్ని గ్రంధములందును దెలుపబడి యున్నది.

2. అభ్యంజనముచేయువానికి చద్దెన్నము విషయము ప్రపన్నామృతము గురుపరంపరా ప్రభావము ఆచార్యసూక్తి ముక్తావళి వడగల గురుపరంపరలోను ఈషద్వైషమ్యముతో దెలుపబడి యున్నది. ఎటులనైన రెండుతప్పులను వప్పిన గ్రంధములు ఈ మూడును.

3. మూడవతప్పును దెల్పిన గ్రంధములు మూడునూ మూడు దోవలగ నున్నవి.

ఆకలిగొన్న పండితునికి అన్నములేదని తన పుట్టింటినుండి శుభలేక తెచ్చిన నాపండితు నకే అన్నమును పెట్టుటయని ప్రపన్నామృతమున దెలుపబడియున్నది. తిరుక్కచ్చినంబిగారు భుజించిన విస్తరిని యెత్తివేసి సచేలస్నానము చేసినదియని ఆచార్యసూక్తి ముక్తావళి యందుగలదు ఒకభాగవతుడు వున్నచోటును నీచముగ దలంచి శుద్ధిచేసి స్నానము చేసినదియని మువ్వాయిర గురుపరంపర యందున్నది.

ఈమూడవ తప్పును దెల్పిన గ్రంధములీమూడే మూడుదోవలగ నున్నవి. ఇకమీద నెవరైన గ్రంధమును చేయునెడ మూడుచోట్ల దెల్పిన మూడు విధములైన మూడు తప్పులను మూడుగనెన్ని ఆయమ్మమీద నైదుతప్పులుగ చెప్పెదరేమో? కవులు నిరంకుశులుగదా, వారి హక్కుకు అడ్డమేమిగలదు. ఈ ప్రకారము భార్యస్థితిని కలిగించి భర్తకు యెట్టి గౌరవమును దెల్పిరో చూడుడు. పుట్టింటనుండి తన తమ్ముని పెళ్ళియని శుభలేఖ వచ్చినట్లు భగవద్రామానుజాచార్యుల వారు ఫోర్జరీచేసి అన్నములేదని అనిపించుకొని వచ్చిన పండితునిచేతికి యిచ్చి మరల నీజవాబును ఇయ్యి అన్నమును పెట్టుతుందని ఆపండితుని పంపినట్లు ప్రపన్నామృతములో దెలుపబడినది.

ఇట్లు ఒకరు వ్రాసి పంపినట్లు వుత్తరమును వ్రాసి పంపుట అసత్యము మోసము గదా? ఇట్లు భగవద్రామానుజాచార్యుల వారు చేసిరి యన్నవారికేమి గౌరవము సంపాదించినట్లు అబల యగుఒన యువిదను విడనాడుటకు ఇంత అసత్యము మోసము చేయువలయునా? నాకిష్టము లేదు. పొమ్మనిన పోదా? కర్కశురాలు గనుక నేను పోను నీవే పొమ్ము అని యెదురు తిరిగితగవులాడునని ఇట్లు చేసిరనవచ్చును. అట్లుగనుక భగవద్రామానుజాచార్యులవారు దలంచి యుండినచో యెట్లైన

వుత్తరక్షణమున సన్యసించి మనమే యిల్లువెడలి పోవుచున్నాము దీనితో యేల యీవాదులాట యని తనే పలకకుండపోయి సన్యసించెను. అయితే సన్యసించినట్లు విని ఆమె వీరివద్దకు వచ్చి ఎటుల సన్యసించినావు ఇది చెల్లదు విడచివేసి రమ్మని తగవు పెట్టునేమో? యని అసత్యము మోసముచేసి దూరముగనుండు పుట్టింటికి పంపి మరల రాదనే ధైర్యముతో సన్యసించుట కీటుల చేసినగని దలవనగును. దూరమైనను మహాచండియగు దానికి దూరమేమి అప్పుడైన విని వచ్చి తన పని తను చేసునుగదా? ఎప్పటికైన తప్పదని యేల యోచించి యుండురని గ్రంథకర్తలు దలవరైరి. ఇట్టి అసత్యము వంచనము చేయువారని గురువును దెల్పుట చండి కలహప్రియ యనక నిష్ఠురభాషిణి యని ఆచార్యపత్నిని దెలుపుట యేమి అన్యాయమో యోచింపుడీ.

ఈఘోర్జరీజాబే భగవద్రామానుజాచార్యులవారు వ్రాసిన పంపి మోసబుచ్చి నీవు మీ పుట్టింటినుంచి పిలవవచ్చిన వారితోడ పొమ్మని. నేను ౫ దినములు తరువాత వచ్చెదను అని అసత్యమును పలికినదే నిజమైనచో నీవిషయము రామపత్నీ త్యాగమును వ్యాసవిధవాగమనమును యుధిష్ఠిరా సత్యవచనమును మీమాంసకులు విచారించి తీర్మానముచేసినట్లు విచారించదగిన గొప్ప యంశము దీనిని మిగత చరిత్రకారులు వదలియుందురా. వారందరు వదలినది వీరికెటుల దెలిసెనో స్వప్నమున తెలిసినది కాబోలు. మూడవతప్పు నంగీకరించిన మరొక గ్రంథమగు ఆచార్యసూక్తి ముక్తావళియందు భగవద్రామానుజాచార్యులవారు భార్యయందు మూడు దప్పుల నిరూపించి ఇక నీవు యావజ్జీవమునకు కావలసినంత ద్రవ్యమును తీసుకొని నీపుట్టింటికి పొమ్మని అని చెప్పి తన భార్యను ప్రయాణము చేసి పంపి సన్యాసమును దీసికొనెనని యేలచెప్పెను అట్లు దెల్పుట వారికి సమ్మతము లేదేమోయన్న ఇట్లు దెల్పవలెనని వీరికి ముచ్చటయేమో?

ఈగ్రంథమును బట్టి భగవద్రామానుజాచార్యులవారి యోగ్యతయు వారి ధర్మపత్ని యొక్క యోగ్యతయు యెట్టిదని మనము కనుగొనుట సముద్రమున కౌస్తుభమణిని పొందినట్లున్నది మతాంతర గ్రంథములందు భగవద్రామానుజాచార్యులవారి యందీవంచనాసత్య ప్రతిభల కథ తాదులు గలిగినటుల ఎచ్చోటయునూ చెప్పబడియుండలేదు. అట్లు మతాంతరులు చెప్పుట గలదు. ఒకటి రెండు దృష్టాంతరములనైన దెల్పెదను. శంకరుడు పరకాయ ప్రవేశమున నూరుమంది రాజస్త్రీలతో రమించి కళాశాస్త్రమును చక్కగ అనుభవమునకు దెచ్చుకొనెననియు ఒక సమయమున శంకరునికి భగంధరవ్రణము గలిగినట్లును అద్వైతులు శంకరవిజయమున దెల్పియున్నారు. ఆవిషయములను మధ్వులు యెత్తుకొని పరకాయ ప్రవేశమున అనుభవములు జ్ఞాపకముండునెడల నిదివరకిటి జన్మములో ననుభవించిన రతులన్నియు జ్ఞాపకముండి మండనమిశ్రుని భార్యను జయింపరాదా? అదికల్ల ఈశరీరముతోనే రమించెను గాన నీశరీరమునకే భగంధరవ్రణమును గలిగినదియని వేడుకగ జెప్పెదరు. మరిన్ని వల్లభభాష్యవ్యాఖ్యానములో శైవభాష్యకర్తయగు నీలకంఠునిగూర్చి తన్మతచోరస్తు, అని వ్రాసెను. అంతకుముందు రామానుజ భాష్యమునుగూర్చి దెలిపి ఆరామానుజ భాష్యమును చౌర్యముచేసినవాడు నీలకంఠుడని వ్రాసెను. అనగా శ్రీభాష్యములోని గొప్పవిచార

స్థలముల నెత్తివేసి విష్ణువాచకములకు బదులు శివవాచకములనుపెట్టి చేసిన గ్రంథమువలె కనుపించుచున్నది గనుక అట్లు వ్రాసెను. ఈప్రకార మెవ్వరున్నూ భగవద్రామానుజాచార్యుల వారిని గూర్చి వ్రాయలేదు. గాన వారిరువురియందు సద్గుణములే నిండియుండును. అయితే ఈ యర్థము చరిత్రలందు నెల్లడిగ తెలుపబడలేదుగదా స్ఫురించునట్టి పదములైన గలవా యోచింతము. భగవద్రామానుజాచార్యులవారి సమకాలములో బుట్టిన దివ్యసూరిచరితమున మహాపూర్ణః గాథార్థాన్గురుగదితాన్స్వదర్శనస్య వ్యాఖ్యాస్యద్ధద గృహిణీ సఖాయ తస్మై గృహిణీసఖాయ రామానుజాయ యని విశేషణములోడగూడ తెలుపబడినందున భార్యాభర్తల కిరువురకును తనయాచార్యులగు భగవద్యామున ముఖ్యోపదిష్ట రహస్యార్థముల నుపదేశించునట్లు యేర్పడును. లేకపోయినచో గృహిణీసఖాయ యను విశేషణము వ్యర్థమగును కావున నీదంపతులకు అన్యోన్యము లక్ష్మీనారాయణులకువలె నధికప్రీతి యనియు మహాపూర్ణులు (పెరియనంబిగారి) యందు ఆయమ్మకును గూడ నెక్కువ ఆచార్యభక్తి గలిగి యున్నదనియు దెలియును. పెరియనంబికింగూడ యువతి సఖః అని విశేషణము వేసినందున వారునూ తమ భార్యయందత్యంత ప్రీతియుతులనియు అట్టి ఆచార్య పత్ని నెడ ఇంచుకంత అపచారము చేసినను ఆచార్యనిగ్రహము గలుగునని యెల్లరకును దెలియును గాన నట్టి ఆచార్యపత్నినెడ భగవద్రామానుజాచార్య పత్ని ద్వేషించి యుండదు. అట్లుగానియెడ గృహిణీసఖాయ, యువతిసఖః అను విశేషణములనునచినది జూడగా పితా పిత్రోర్భ్రాతా వా నైనా మధ్యాపయేత్పరః అను ధర్మశాస్త్రముంబట్టి స్త్రీ పరపురుషునివద్ద విద్య నేర్చుకునరాదు గాన మహాపూర్ణులు (పెరియనంబి) గారి భార్యవద్ద భగవద్రామానుజాచార్యులవారి ధర్మపత్ని రహస్యార్థములం గ్రహించుచుండెనను అర్థము నిచ్చుచున్నదని దోచును. అయితే బావిలో నీళ్ళు చేదుతరి ఇరువురి ఘటములు మెలితబడినందున నిరువురు కోపగించిరి. "కూపాంబు గ్రహణవిధౌ మిథః కదాచిత్ కుప్యంత్యోర్ఘటమిళనేన లక్ష్మణస్య గేహిన్యా సపది విమానితావరోధః అని ఆదివ్యసూరి చరితముననే యున్నందున ఈవిషయము లేదనుటకులేదు. అయినను ఒకరు స్నానము చేయక యుండి నీళ్ళు చేదుకొనుటకు అవసరముగ భావిలోకి చేదలను వేసియుందురు. అపుడు ఆరెండు ఘటములు మేళనము అనగా పెనయవేసుకొని ఆలస్యమైయుండును. దానిచే కాలహరణమైయ్యేను ఒకరితో నొకరు చర్చించుకొనియుండవచ్చును. కావుననే కుప్యంత్యోః అని ద్వివచనము ప్రయోగింపంబడి యున్నది. ఆవిషయమిరువురియందునూ తుల్యమే అయినను మహాపూర్ణుల భార్య ఈ స్వల్పవిషయమును తన భర్తతో దెల్పుకొనెను. ఈతనకమ్మగారో గొప్పమనస్సు గలది గనుక తనభర్తతో జెప్పకయుండె అంతట నాయాచార్యులగు మహాపూర్ణులు శ్రీరంగమునకు భార్యతోడ పోయిరి. వారి ప్రయాణమునకు ఈయిరువురి కలహము కారణమని దలచి ఈతగవు యెంతయో బ్రహ్మాండముగ జరిగియుండును. అని భగవద్రామానుజాచార్యులవారికి దోచునట్లయ్యెను. వారు శ్రీరంగమునకు వెళ్ళినందున నిది పెద్దదిగ తలవబడినదేగాని లేనిచో ఆడవార్ల మాటలు క్రింద నెన్నబడి యుండదగినది. అయితే నీవు మీయాచార్యులకు యేదో గొప్ప గౌరవమును సంపాదించ

దలంచి అవిమర్శిత కృత్యములను చేసితివే యనిన నిది యవిమర్శిత కృత్యముగాదు.

మహాపూర్ణుల (పెరియనంబి) గారు భగవద్రామానుజాచార్యులవారికి స్వాచార్య భగవద్యామునాచార్యోపదిష్ట రహస్యార్థముల నుపదేశించుట పూర్తి అయ్యె. కావుననే విరక్తి గలిగి సన్న్యాసము కొరకు బంధ్వాదులను మతికొరకు భగవద్రామానుజాచార్యులవారు స్వజన్మ గ్రామమగు శ్రీపెరుంబూదూరునకు వేంచేసిరి. ఆమరునాడు మహాపూర్ణులున్నూ వచ్చిన కార్యమైనందున వారు శ్రీరంగమునకు విచ్చేసిరి. ఈ రెంటి మధ్యకాలములో జరిగిన నీకథ కాల్పనికముగ నున్నదే కాని ఇది కారణము గాదు. వారిభార్య ఇట్టి దుర్గుణములు గలదే అయినచో నిట్టివి ఇదివరకెన్ని పర్యాయములై యుండదు. అప్పుడంతయు నిట్లు సన్న్యాసమునకు యత్నించిరా లేదు. కావున ఆచార్యోపదిష్ట రహస్యార్థగ్రహణముచే విరక్తి గలిగి స్వగ్రామమునకు బోయి తన బంధుమిత్రులను రప్పించి బంధుపుత్రి ననుమోదయిత్వాయును త్రైత్యర్థము నాచరించి వెంటనే కంచికి వేంచేసి భార్యకు యావజ్జీవనమునకు శరీరయాత్రకు కావలసినంత పుష్కలద్రవ్యము నొసంగి ఆమె పుట్టింటికి ఆమెను రప్పించిపంపించి 'యదహరేవ విరజేత్ తదహరేవ ప్రవ్రజేత్' అనుశ్రుతినిబట్టి సన్న్యసించిరి. ఇది జరిగిన యథార్థము. ఇక దీనిమీద కవులు ఎంతైన పెంచెదరు. కావున భగవద్రామానుజాచార్యులవారును వారి ధర్మపత్నియు సీతారాములవలె సుచరిత్రులు సీత కంకీర్తివలె ఈయాచార్యపత్నికిన్ని అతికించిరి కాని అది వాస్తవము గాదు వేనవేల ప్రతివాదులను జయించి వశ్యము చేసికొను శక్తిగలవారికి యింటిలోని యొకదానిని వశపరచుకొనలేక అసత్యము ప్రతారణము చేసి కొంప కోలుపోవలయునా? యోచింపుడీ.

### శ్రీ యతిరాజ భజన కీర్తనలు

కవితావతంస, గానకళానిపుణ, హరికథాధురంధర, పి. నారాయణాచార్య రచితము

"జయభారతమాత" అనుదానివలె, కన్నడ—త్రిపుట

ప॥ జయ ! కాంతిమతీతనయా ! జయ ! కరుణానిలయా !
సువిశాల హృదయ! శుభగుణాలయా ! బహుపరాక్ ! ॥జ॥

1. నీదుమతము, నీతియుతము నిఖిలవిదితము
వేదనుతము, విశ్వహితము, విగతదురితము
విపులజగదభిమతియుతము వినయభరితము బహుపరాక్ ! ॥జయ॥

2. భాష్యకార ! మౌనివర్య ! విజయీభవ ! భో !
వేంకటేశ శంఖచక్రవితరణచణ ! భో !
శుభప్రద ! నారాయణార్యసుకవినుతపదా ! బహుపరాక్ ॥జయ॥

# చక్రాంకనవార్త

శ్రీ ఉ. వే. శ్రీమాన్ తిరుమల కందాళ్ తాతాచార్యులయ్యవార్లంగారు
కాంచీపురం.

తప్తచక్రాంకనము గృహస్థులచే చేయించుకొనుట శ్రేష్టమా? లేక సన్యాసాశ్రమస్థులచే చేయించుకొనుట శ్రేష్ఠమా? అను విషయమున సన్యాసాశ్రమస్థులకు అగ్నిప్రతిష్ఠాపనాది కార్యములయందు అధికారము లేదు గనుకను సన్యాసాశ్రమస్థులగు భగవద్రామానుజులు మున్నగు పూర్వాచార్యులు తాము స్వయముగ గృహస్థులవద్దనే తప్తచక్రాంకనపరులగుట మాత్రమే గాక యితరులు తప్తచక్రాంకనపరులగుటకు గాను గృహస్థులనే ఆచార్యపీఠస్థులుగ నేర్పరచి యుండుటచే తప్తచక్రాంకనమును చేయుటకు గృహస్థులే శ్రేష్ఠులనియు, సన్యాసాశ్రమస్థులు గౌణపక్షీయులనియు ఈవ్యాసకర్తగారి యభిప్రాయము. సన్యాసాశ్రమస్థులు తమ నాశ్రయించిన శిష్యులను తప్తచక్రాంకనము చేయకూడదని లేదు. వారికది తగనిదియు కాదు. సన్యాసాశ్రమస్థులు అగ్నిప్రతిష్ఠాదులు చేయకూడకుంట శాస్త్రీయమే-శిష్టాచారసిద్ధమే అందుచే వారు యితరులచే అగ్నిప్రతిష్ఠ-తప్తాదులును చేయించి అంకనమును మాత్రము స్వయముగ చేయుచుండుట కలదు. ఇదియు శాస్త్రీయమే-శిష్టసమ్మతమే ఇంతకు గృహస్థులు-సన్యాసులు-అని భేదమును కారణముగాగొని వీరిలో వీరికి శ్రేష్టత్వ-అశ్రేష్టత్వమును ఆరోపించుకొని కులక్రమాగతులైన యోగ్యులైన స్వాచార్యులను విడిచి క్రొత్తగా మరొకరిని ఆశ్రయించుట ఎవరికిన్ని ఎంత మాత్రము తగదు.

వైదికమగు శ్రీవైష్ణవ సాంప్రదాయములో వర్ణ ఆశ్రమముల బట్టిగాక జ్ఞానానుష్ఠానముల బట్టి మాత్రమే యోగ్యత ఏర్పడును.

సంపాదకుడు.

చక్రాంకణమనునది రోగనివారణార్థమై పశ్వాదులకు చురకలు వేయుటవంటిదికాదుగదా? అగ్నిప్రతిష్ఠాపనచేసి అందు సుదర్శన హోమాదులనుచేసి అట్టి సంస్కారాగ్నియందే తప్తముచేసి సమాశ్రయణమును చేయుట శాస్త్రీయము. ఇప్పటి సన్యాసులు అట్లు చేయుట కానరాదు, అట్లు చేయుటయూ కూడదు. పశ్వాదులకు చురకలువేయుట వాతాదిరోగ నివృత్తి ప్రత్యక్షఫలము, ఇది అట్టిదికాదు, ఇది అపవర్గ సాధనము గాన ఇందునకు శాస్త్రమే ప్రమాణము.

శ్లో॥ తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య వ్యవస్థితౌ॥

కార్యాకార్యవ్యవస్థకి శాస్త్రమే ప్రమాణముగదా? యేశాస్త్రము వలన పంచసంస్కారమావశ్యకమనెదమో అట్టి శాస్త్రము వలననే అధికారి నిర్ణయముకూడ చేయుట యుక్తము.

శ్లో॥ పుర రోగ్నిం ప్రతిషాప్య స్వగృహోక్తవిధానతః॥

ఇత్యాదివచనములవలన అగ్నియందధికారులే పంచసంస్కారములు చేయుట కధికారులని యేర్పడుచున్నది.

మరియు

శ్లో. ఆచార్యకలశోద్దైస్తు వర్ధయే దభిషేచితం।
తద్వంశసంభవం వాపి పారంపర్యక్రమాగతం।
అన్యథా సకలం కర్మ యథా శూద్రీకృతం భవేత్॥

అనియును ఆచార్యపట్టాభిషిక్తులైన వారినిగాని అట్టివారి వంశ్యులనుగాని ఆశ్రయించుటే ముఖ్యమనియును సుదర్శన హోమాదులనుచేసిన అగ్నియందే తప్తముచేసి చేయవలయుననియు ఇందునకు భిన్నముగ చేసిన సంస్కారము అపవర్గ సాధనము కాదనియును స్పష్టముగ నేర్పడుచున్నది.

శ్లో. అహుతాగ్నా పంకయిత్వా పరలోకం న విన్దతి
ఆచార్యో గార్దభీం యోనిం విన్దేచ్ఛిష్యోపి తాదృశం॥

పూర్వోక్త విధిప్రకారముగ జేయని ఆచార్యులును అట్లు చేయించుకొనని శిష్యుడును. గర్దభయోనియందు జనించునని చెప్పియున్నది, సన్యాసులకు విశేషవిధియున్నదని అన్నచో

అవి ముఖ్యములుగావు. గౌణముని భావింపతగినవి గనుకనే సన్యాసులకన్న "తస్మా శ్రేష్ఠో గృహిశ్రమీ" అని యున్నందున గృహస్థుడు శ్రేష్ఠుడని చెప్పియున్నారు.

"గౌణ ముఖ్యయో ర్ముఖ్యే కార్యసంప్రత్యయః" అని యుండుటంబట్టి గృహస్థుదే శ్రేష్ఠుడు యిచ్చట సామాన్య విశేషన్యాయము ప్రవర్తింపదు. శ్రేష్ఠశబ్దాస్వారస్యమువలన ఆచార్యులంతగ విపరీతబుద్ధులచే అన్యథా ఆశ్రయింప చేయుటయు అట్లు ఆశ్రయించుటయు మిక్కిలి పాపావహము ఈవిషయమున

శ్లో. నాన్యై రూపాయై ర్వివిధై ర్మంత్రౌషధ పురస్సరైః ।
ముచ్యతే మనుజో మూఢో సర్వదుర్మతిభాజనః ॥

సర్వదుర్గతిభాక్కుగలదని చెప్పియున్నది గాన ఆ స్తికులగువారు కుపథము నవలంబించుటకన్న సత్పథము నవలంబించు చో నెంతశ్రేయోదాయకమో యోచింపుడు. గనుక ఇవి యన్నియు యోచించి శాస్త్రకారులు

శ్లో. తస్మా త్సర్వాత్మనా బ్రహ్మన్ కులాచార్యం
ప్రపూజయేత్॥

అనేక సాధకబాధకములను యోచించు కులాచార్యుల నాశ్రయించుమని విధించియున్నది. శిష్యులనుజ్జీవింపజేయ నాచార్యులు పునః పునరుపదేశముచేయుట వారి కృత్యము.

"దీర్ఘబన్ధుం దయాళుం" అని ఆచార్యులను దీర్ఘబన్ధువుగా చెప్పంబడియున్నది అనగ ఎంతచెప్పినను మళ్ళని శిష్యుని విషయమై ప్రాతికూల్యనివృత్తికొరకు భగవత్సన్నిధియందు ప్రపత్తిచేయవలయునని తాత్పర్యము. అట్లైనచో పిల్లకొరకై తల్లి పథ్యముచేసినచో పిల్లరోగము యెట్లుతీరునో అట్లు శిష్య ప్రాతికూల్యమును పోగొట్టునని అభిప్రాయము. అట్లాచార్యులాచరించనిచో "శిష్యపాపం గురో రపి" యనువచనము చొప్పున శిష్యునియొక్క పాపమాచార్యులకు సిద్ధించును తన్నివృత్తికొరకు ఆచార్యులు చెప్పక తప్పదు, అప్పటికి మళ్ళనిచో వాని బలవత్తరపాపమనే నిశ్చయింపవలయును (రావణునికి విభీషణోపదేశమువలె) మణవాళమామునులును-

"తన్ గురువిన్ తాళిణైగళ్ తన్నిలన్బొన్నిల్లాదార్
అన్బుతన్బాల్ శైదాలు మన్బుయకోన్ ఇన్బమిగు
విణ్ణాడు తానళిక్క వేండియిరాన్ ఆదలాల్ నణ్ణార
వర్ గళ్ తిరునాడు॥

తన కులక్రమాచార్యుల పాదపద్మములయందు భక్తిజేయక ఎన్నితపంబులు జేసినను సర్వేశ్వరుడు అనన్యపూర్ణమైన మోక్షమునొసంగడు,

ఇచ్చట "తన్ గురువిన్" అని సాయించుటవలన కులగురువని అర్థము. ఇట్లుచెప్పనిచో ఆ శ్రీవచనభూషణవాక్యవిరోధము సంభవించును.

ఇట్టి మహాపాతకావహ కార్యములయందు ప్రవర్తింపక విరమింతురని నమ్మెదము. ఉడయవరులుమొదలగువారు ఆచరించియున్నారని వారనుష్ఠానములు తుంగుతుపమానములుగ భావింపతగదు. ఏలన "శేషాంశం మామ ధామకం" సాక్షాదీశ్వరావతారమై లోకోజ్జీవనార్థముగ "కలౌ ఖల్వ ద్భవిష్యతి" అని అవతరించి లోకోజ్జీవనమును అనేకవిధములుగజేసి స్వప్రభావమును అనేక ప్రకారములుగ బహిరంగపరచుచూ అనేకులకు మోక్షము నిప్పించుచూ ఇచ్చుచూ

శ్లో. ప్రపీతవిషతీర్థాంఘిః ప్రకటీకృతవైభవః!

విషమిశ్రతీర్థపానాదులవలన సర్వప్రకారములచేత ప్రకటీకృత వైభవము కలిగి

శ్లో. జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా॥

యనియథార్థ తత్త్వజ్ఞానాగ్నిచే సర్వదురితములను నశింపచేయుచూ జ్ఞానీత్వాత్మైవ మే మతం, అని సర్వేశ్వరునచేగూడ నాత్మభూతులై యుండెడి వారి చరితాదులు మనకు సామ్యత్వావహములు కానేరవు. గృహస్థులవలన హుతమైన అగ్నియందే చేసి యుందురనే నిశ్చయించుటయుత్తమము.

శ్లో. అహుతాగ్నా వంకయిత్వా పరలోకం న విందతి॥

యను వచనవిరుద్ధముగచేసి యున్నారనుటకు కారణము కానరాదు. ఉడయవరులు మణవాళమహామునులు మొదలగు యతివరులను గృహస్థశిష్యులేగదా? మరియు సన్యాసులకు భ్రంశముకలిగినయడల వారికి శుద్ధికరప్రాయశ్చిత్తము కానరాదు. శ్రీభగవద్రామానుజులవారే తచ్ఛ్రుతాధికరణమున

"న చాధికారిక మపి పతనానుమానా త్తదయోగాత్"
నైష్ఠికాదీనాం ప్రచ్యుతానాం పతనస్మృతే స్తస్య
ప్రాయశ్చిత్తా సంభవాత్.

శ్లో. ఆరూఢో నైష్ఠికం ధర్మం యస్తు ప్రచ్యవతే తు యః
ప్రాయశ్చిత్తం న పశ్యామి యేన శుధ్యేత్స ఆత్మహా

అతః అధికారిలక్షణో ప్రాయశ్చిత్తం ఇతర బ్రహ్మచారి విషయంఅపియా ఉప,పాతకంవా,మహాపాతకంవా, బహిష్కార్యః కర్తవ్యః అనియూ ఆరూఢులైన నైష్ఠిక వైఖానస ప్రవ్రాజ కాశ్రమభ్రష్టులైనచో వారికి ప్రాయశ్చిత్తము లేదు. ఆరూఢపండితులగుటంబట్టి వీరు ఆత్మహంతులు వీరికి శుద్ధికరప్రాయశ్చిత్తములు ఎచ్చటను కనపడదు. వీరికి స్థాలిత్యమత్యంతము సులభతరము పంచభక్షపరమాన్నాదులను నిత్యము భుజించుచూ స్థిరమఠవాసులై శరీరాయాసోకనే పుష్టముగ నుండు సన్యాసులకు ఇన్ద్రియనిగ్రహము మానసికముగనైనను తటస్థించదనుట అనుభవసిద్ధము [illegible] వాయుభక్షః అనెడివిశ్వామిత్ర ప్రభృతులకే దక్కదేని పోతేపూర్వోక్తులకు

ఏమిచెప్పవచ్చునుగనుక నే"తస్మాచ్ఛ్రేష్ఠోగృహాశ్రమీ"యని చెప్పిరి. ఇందుకు పూర్వభాగమును పూర్వభాగముననే అచ్చు వేసియున్నాముగాన అందున చూచుకొనవలయును.

ఆచార్యకుటుంబస్థుల నాశ్రయించుటవలన అచ్చిరాలేదనుట మిక్కిలి వెర్రితనము వారినాశ్రయించిన శిష్యుల కందరికి అచ్చిరాలేదా? ఒకరికి మాత్రమే అచ్చిరాలేదా? అందరికి అచ్చిరాలేదనుట ప్రత్యక్షానుభవవిరుద్ధము ధనకనకపుత్రవాహనాదులతో సంతోషముగనే యున్నారు. ఒకరికి మాత్రమే అచ్చిరాలేదనుటలో అర్థములేదు వారివారికర్మముల ననుభవించు కాలమున ఆచార్యుల దోషమేమున్నది,

"యుగాయుగాన్తరస్థాపేణ పశుపత్నీసుతాలయాః"

యనునటుల యుగాయుగాన్తరస్థాపముగ భవత్పాపములు సంభవించును. ఇది అందరికి సామాన్యమై బ్రహ్మాది స్తంభపర్యంతము ఇంతే గనుక అందును గురించి యోచింపనిలేదు. అథవా ఒక ఆచార్యులు ఒకనికి సమాశ్రయణమును చేసినంతమాత్రమున తన భార్యావియోగము కలిగిన వీనికి సమాశ్రయణము చేయుట హేతువగునా సన్యాసుల నాశ్రయించినను? అట్టి ఆపత్తులు సంభవించుటగాని ఇంతకన్న అధికమగునట్లుగాని సంభవించినచో అప్పుడేమి చేయవచ్చును.

సాధారణముగ సన్యాసునినాశ్రయించుటగృహస్థునికియుక్తమాయను దానిని యోచింపవలెను లోకములో

"పుణ్యః పుణ్యేన కర్మణా భవతి పాపః పాపేన కర్మణా"

ఈశ్రుతివలన పుణ్యకర్మముచేయువాడు పుణ్యఫలము ననుభవించును. పాపకర్మలు చేయువాడు పాపఫలముననుభవించును పుణ్యపాపములు రెండునూ మారిమారి ఒకవ్యక్తికి తత్తత్కాలానుసారముగ అనుభవమునకు వచ్చుచుండును, అట్టిదానికి ఈపరమార్థ విషయమును జతపరచుట మిక్కిలి అనుచితము వెర్రితనము ఇందువలన కులక్రమాగతాచార్యులను తప్ప ఇతరుల నాశ్రయించుట శాస్త్రవిరుద్ధమనియూ పూర్వాచార్యులచే నిర్దేశింపబడినవారి తిరువంశ్యులనే ఆశ్రయించవలయుననియూ సన్యాసులకన్న గృహస్థులే ముఖ్యులనియూ ఇవియున్నియు అన్వయ వ్యతిరేకాదుల వలన స్పష్టముగ ప్రతిపాదితమయ్యె.

---

## శ్రీమద్రామానుజ భజన కీర్తనలు.

శ్రీమాన్ శ్రీమత్తిరుమలై నల్లాన్‌చక్రవర్తి సంవత్కుమార జగన్నాథ తిరువేంకటాచార్యులవారిచే రచింపబడినది

ఉ॥ మానక మోహమింతయుర మాపతిపాదపయోజయుగ్మరు।
క్మానదన్యమున్ దృణము గాదలపోసిననాగురుండున ।
మ్మానితకీర్తిశాలియన మానదమైకపయోధిమైనరా ।
మానుజుపాదముల్ శరణ మంచుదలంచినుతించిమ్రొక్కెదన్॥

1 కీర్తన బేగడ-త్రిశ్రగతి.

ప॥ మీపరిభావమపరిమేయము స్వామీయతీంద్ర ॥మీపరి॥

అ॥ మీపదాబ్జరజముసోక పాపములకు దావులేక ।
శ్రీపతిసాన్నిధ్యంబు జేరుకొనుటనిశ్చయంబు ॥మీ॥

చ॥ కారుణికోత్తములుమీరలు లోకముననింక గలరెమిమ్మబోలువారలు।
కూరపతికినరుడుగాగ గొంటెరటగదయ్యమూగ ।
ధారుణినిదివిన్నవారు ధన్యులుగాకుండబోరు ॥మీ॥౧॥






శ్రీమతి వి. శ్రీనివాసమ్మగారు

# గీతా

1. గీత వేదసాగరమందు పుట్టిన చంద్రుడని చెప్పవచ్చును. పాలసముద్రము తరచినప్పుడు పుట్టిన చంద్రునివలె కాంతియుతమగు శాంతి ప్రభలీనుచున్నవి.

2. శ్రీభగవద్గీత శ్లోకరసపుష్పములను జలముతో అర్థభావములను అమృతజలతరంగములతో పొంగి పొరలుచు సముద్రమువలె గంభీరముగను స్వచ్ఛముగను ప్రకాశించుచున్నది. ఇదియే గీతా సముద్రము.

3. శ్రీగీత సూర్యమండలమువలె తేజః పూర్ణమై తేజరిల్లుచు దేదీప్యమానమై వెలుగుచున్నది. సకలాత్మలందుండు అజ్ఞానమను చీకటిని బోగొట్టి ఆత్మస్వరూపసాక్షాత్కారమును జ్ఞానమును ప్రకాశింపచేయుచున్నది. మరియును నాస్తికమతములను ఎండింపజేసి కాల్చివేయుచున్నది. పుట్టుగ్రుడ్డివానికి సూర్యప్రకాశ మెట్లు తెలియదో అట్లే నాస్తికులకు తెలియనలవిగాని యర్థభావములు గలవి.

4. భగవద్గీత మేఘమువంటిది. మేఘమెట్లు చల్లదనము నిచ్చి తాపమును పోగొట్టునో అట్లే శ్రీ భగవద్గీతా మేఘము తాపత్రయములను పోగొట్టి చిత్తవిశ్రాంతి కలుగజేసి ఉదారముగా పరమార్థములను వర్షించును. మరియును ఆత్మలనెడు ధాన్యమును పండించి సత్తకలుగునట్లు చేయును.

5. శ్రీగీత చంద్రునివంటిది. పూర్ణచంద్రుడెట్లు ఆకాశమున 16 కళలతో గూడి ప్రకాశించుచున్నాడో అట్లే శ్రీగీత 18 కళలతో గూడి భూమండలమంతయు తన శీతలామృత కిరణములచే తడుపుచు అజ్ఞానులనెడు ఎండిపోయిన మానులను చిగిరింపజేసి జ్ఞానపుష్పములనెడు పుష్పములను పుష్పించి ఆనందదాయకంబై యున్నది. మరియు ధవళతరంబై యుండు వెన్నెలలు గాయుచు హృదయకమలమును పరిశుద్ధమగు కాంతియుతముగా జేయుచున్నది. మరియును చంద్రుడెట్లు చంద్రకాంతశిలలను కరిగించి తన యమృత కిరణముల స్పర్శచే ద్రవీభూతముగా జేయుచున్నాడో అట్లే శ్రీగీతా చంద్రుడును తన స్వచ్ఛభావార్థచంద్రికలచే భక్తుల హృదయములను కరిగించి భక్తిచే ద్రవీభూతమగునట్లు చేసి ముక్తునిగా జేయుచున్నది. సత్త్వగుణప్రియులు క్షమగునట్లు మనస్సును సాత్విక

జ్ఞానముతో పరిశుద్ధముగా నుండునట్లు జేయుచున్నది.

6. శ్రీభగవద్గీత ఆత్మలకు అన్నమువలె పోషకమై తీర్థమువలె ధారకమై నెయ్యిపాలు పెరుగు పప్పువలె భోగ్యమై కాయకూరలు పండ్లవలె రుచికరమై ఆత్మలకు ఆరోగ్యవర్ధకమై బుద్ధికి జాడ్యము లంటనీయక బలమునిచ్చునదై మధుర ఫలరసములతో గూడిన రసాయనమువలె భక్తి రసమును పానముచేయించి మనస్సునకు సద్గుణ పుష్టి గలుగజేసి జ్ఞాన భక్తి వైరాగ్యము మొదలగు సాత్వికానుష్ఠానముచే అధికారులగునట్లు జేయును. శ్రీ గీతాన్నభోజనము ఆత్మలను తృప్తిపరచును.

7. శ్రీభగవద్గీత గంగా ప్రవాహమువలె విస్తారమై పరమపావనమై జీవాత్మల కాలపక్వదశలందు పూర్వజన్మ సంచితములను పాపకర్మలను పోగొట్టి వెంటవచ్చుచున్న ఆగామి సంచిత ప్రారబ్ధములను రూపుమాపుచేయ సమర్థమై పవిత్రమై ఒకసారి చదివినంత మాత్రముననే ఆత్మశుద్ధిచేసి నిర్మలునిగా జేయుచున్నది. ఇదియే గీతాగంగోదకము ఈగంగోదకమును ద్రావిన వారికి మరలజన్మమెత్తవలసినది లేదు.

8. శ్రీగీత యరటిపండువలె మృదుపాకము గలిగి రుచికరముగా పలుకుటకు సుఖముగా నుండును అన్నిపండ్లయందును పారవేయవలసిన గింజలుగలవు. కదలీఫలములందు పారవేయదగిన గింజలు లేవు అట్లే శ్రీగీతా కదళీఫలమందు త్యాజ్యమగునట్లుగాని కఠినముగాగాని ఏయర్థమ్మున్ను లేదు.

9. శ్రీభగవద్గీత ద్రాక్షపండ్లవలె అర్థరస పుష్టిగల శ్లోకములు భావములు గలిగియున్నది. వినుటకు మధురమై చదువుటకు ఇంపుగలిగి నవరసపూరితమై యున్నది.

10. శ్రీభగవద్గీత పుష్పమువంటిది. ఈగీతా పుష్పము పరమాత్మస్వరూపమైన వేదకల్పవృక్షమునందు పుట్టినది. ఈకల్పవృక్షము ఉపనిషదర్థములనెడు శాఖలచే నలరారి శబ్దములనెడి ఆకుల నడుమ శ్లోకజ్ఞానభావములనెడు కొమ్మలచే వ్యాపించి విశేషజ్ఞానమనెడి చిగురుపెట్టి భక్తినిష్ఠలనెడి మొగ్గలుగా బయటికివచ్చి భగవత్కటాక్షమనెడు శీతలవాయుస్పర్శచే చక్కగా పుష్పించి ప్రపత్తియను జ్ఞానపరిమళముతోగూడి శేషత్వపారతంత్ర్యజ్ఞానమనుమకరందసారముతో పూరితమై జ్ఞానులు, భక్తులు, ప్రపన్నులు అనెడు తుమ్మెదలకు దేహపోషణకు జీవనమై తన జ్ఞాన పరిమళవ్యాప్తిచే జగత్తంతయు స్వభావ సుగంధ సౌరభ మిళితంబుగా జేయుచు గీతాధ్యయన పరులకు సౌఖ్యదాయకమైన పుష్పరాజముగా నున్నది. ఇదియే గీతాకల్పపుష్పము.

11. శ్రీభగవద్గీత నందనవనమువంటిది. వనము నందు పుష్పవృక్షములును ఫలవృక్షములును తీగపందిరులును పూపొదరిండ్లును తామర తటాకములును అట్టి తామరకొలనులందు తామరాకులు మొగ్గలు తామరపూవులు గలిగి మనోహరముగా నుండును. అట్టి తామరతటాకములందు హంసపక్షులు. కొంగలు నీరుకోళ్ళు మొదలగు పక్షులు నిర్భయముగాను సుఖముగాను విహరించుచు కూయుచుండును. అట్టి తామర

పుష్పములందు తేనె నాస్వాదించుచు గండు తుమ్మెదలు తుమ్మెదలు మైమరచి గానము చేయుచుండును. ఫలవృక్షములందు సొగసైన చిలుకలు, కోకిలలు, నెమళ్ళు, పావురములు మొదలగు పలువిధములగు విహంగములు పంచ విధములగు చిత్రవర్ణములచే చిత్రించినట్లుండు రెక్కలు ముక్కులుగలిగి ఈశ్వరునిచే సృష్టింపబడిన నానావిధ అండజములు పాటల నాటలచే ఎగురుచు తిరుగుచుండును. అట్టి నందనవనమున తిరుగాడుచు విహరించు జనులకు నానందదాయకమైయుండును. అటులనే ఈగీతానందనవనము గూడ వేదవృక్షములు, శాస్త్రపత్రములు, సమన్వితార్థపుష్పములు (ప్రమాణార్థప్రమేయార్థఫలములుగలిగియున్నది. తటాకములవలె ప్రమేయ నిర్ణయార్థములతోనిండినదై నిరూపణశ్లోకములు సమృద్ధగాగలదు. ఈగీతావనమున సర్వకాలములందు విహరించుచు అర్థరస తటాకములందు సదామునిగి తేలి ఈదులాడుచు రసపానము చేయుచు పరమహంసలగు యతీశ్వరులు (బ్రహ్మానందానుభవము ననుభవింతురు. మరియు మునులు, ఋషులు, యోగులు, సిద్ధులు, అవధూతలును కర్మయోగులు, జ్ఞానయోగులు, భక్తియోగులు, ప్రపన్నులు (భక్తియోగులనగా ఆళ్వార్లు, ప్రపత్తినిష్ఠులనగా పూర్వాచార్యులు) మొదలగు పక్షులు ఈగీతావనము నాశ్రయించి నిత్యవాసము చేయుచు శ్రీ గీతాచార్యులను శరణాగతిపొంది కడతేరుచున్నారు. ఆదిగురుపరంపరలు మొదలు మన స్వాచార్యపర్యంతము గీతా చరమశ్లోకార్థమును చరమోపాయమునుగా నమ్మి తానసుష్ఠించి శమదమ శిష్యుల ననుష్ఠింపజేసి తాము జీవించి యితరులను జీవింపజేసి యిప్పటికిని ఆత్మోజ్జీవనము చేయుచునేయున్నారు పక్షులు, తుమ్మెదలు అనగా స్వాపదేశమునకు భక్తులు ప్రపన్నులు అని యర్థము తటాకములనగా భగవద్గుణానుభవ రసములతో నిండియుండు స్వరూప ప్రకాశకగ్రంథములు వీని నే గీతావనమందురు.

12. శ్రీ భగవద్గీత సింహమువంటిది. నాస్తికులకు పాషండ, బౌద్ధమతావలంబకులకు భయంకరమై భయము గొలుపుచున్నది. సింహమెట్లు గంభీరమగు నాకారము గలిగి తీక్ష్ణ రూక్షములు గలిగిన కన్నులతోకూడిన ముఖమును దంష్ట్రాకరాళముకు గలిగినదై గర్జిల్లుచుండునో అట్లే శ్రీగీతాసింహమున్ను బాహ్య కుదృష్టి వాదులను తన విభూతి విశ్వరూపములను జూపించి భయమును కలిగించుచు శ్లోకరూప గర్జనలను గర్జించుచున్నది.

మరియు సింహము పర్వత శిఖరములందుండు గుహలయందు వాసముచేయుచుఏనుగులు మొదలగు పెద్ద పెద్ద జంతువులను అణగద్రొక్కి తనబలముతోనీల్చి చంపునో అట్లే శ్రీగీతాసింహముగూడ జ్ఞానులగు విద్వాంసుల హృదయగుహలందును వాటి శిఖరము లందునువాసము చేయుచు నాస్తిక అద్వైతిక బాహ్య కుదృష్టి మతములను తన వాక్యార్థములను గోళ్ళతో చీల్చి భావార్థములను కోరలతో గ్రుచ్చి యెత్తి విసరి పారవేయును (కోరలనగా శ్రుతి స్మృతులు దానిభావములు నామాన్యులకు గోచరించక వినుటకుగాని తెలుసుకొనుటకుగాని ధైర్యము చాలక భీతినొంది కంపించునట్లు చేసి అహంకారపను

లను గడగడలాడించి వణకునట్లు చేయును ఇదియే గీతాసింహము.

13. శ్రీగీత కామధేనువు వంటిది. కామధేనువు పాలసముద్రము నందు పుట్టినదై దేవేంద్రునకు దేవతలకు శ్రీమహావిష్ణువుచే ఇవ్వబడి దేవలోకము లో నుండు ఆవు దీనికి దేవసురభి యను నామాంతరము గలిగి యున్నది. వశిష్ఠాది మహర్షులు హోమకర్మలందు ఈ ధేనువును పిదికి హవిస్సును పొందుదురు. అటులనే ఈగీతా దేవసురభియను కామధేనువు జ్ఞానులగువారికి భగవదారాధన రూపముగు కైంకర్య హవిస్సు నిచ్చి నిత్యానుష్ఠానములను ఆత్మయజ్ఞమును పూర్తి చేయును. ఇట్టి గీతా కామధేనువు శ్రీమన్నారాయణుని కల్యాణగుణములను పాలసముద్రమున పుట్టి ప్రపన్నులకు ధారక పోషక భోగ్యములుగా నున్నది ఇదియే గీతా కామధేనువు.

14. శ్రీగీత కల్పవృక్షము వంటిది. కల్పవృక్షము పాలసముద్రమున పుట్టి దేవలోకమున నుండునది కోరినవారికి కోరునట్టి రత్నాభరణములను పరిమళముతో గూడి ఎప్పుడును వాడనుండు దివ్యపుష్పములు దివ్యవస్త్రములు స్వర్ణములు మొదలగునవన్నియు కోరిన వారికి కోరిన ప్రకారం ఇచ్చును మరియును నీవృక్షము తన నీడ నాశ్రయించిన వారికి ఎండవానల తగులనీయక చల్లదనమునిచ్చి కాపాడును. అటులనే శ్రీగీతాకల్పవృక్షమున్నూ ఎవరెవరికి ఏయే అర్థములు గావలసియున్నవో వారి వారి బుద్ధికి కోరికకు తగినంత అర్థభావముల నొసగి తృప్తి పొందించి ఆనందింపజేయును. మరియు నీగీతావృక్షము క్రింద నుండు వారికి చిత్తశాంతియను నీడ నిచ్చి సుఖదుఃఖములు అజ్ఞాన అన్యథాజ్ఞాన విపరీత జ్ఞానములను పాపపుణ్యములను అహంకార మమకార నరకములు మొదలగు ఎండ వానల బాధల నంటనీయక ఆత్మలను గమ్యస్థానము (అనగా భగవంతునొద్దకు చేర్చి శాంతి నిచ్చి ఆనందింపజేయును మరియును నిత్యభోగములను అనుభవింప జేయుచున్నది. ఇదియే గీతా కల్పవృక్షము.

15. శ్రీగీత వేదమువంటిది. శ్రీగీతావేదము సాక్షాత్ వేదమువలె నిర్దోషమై నిత్యమై అపౌరుషేయమై పురుషోత్తమ వాఙ్మయమై సకలలోక వ్యాప్తమై అగోచరమై అగాధమయినసముద్రము వలె బ్రహ్మాండమంతయు చుట్టుకొని అర్థములను అలలతో పొంగుచు పరిభ్రమించు చున్నది 14 లోకములందును ఈగీతలు స్మరింపబడుచున్నది. ఇదియే గీతావేదము.

16 శ్రీభగవద్గీత హంసపక్షివంటిది హంసపక్షి ఎట్లు పాలు నీరు వేరుజేయు సామర్థ్యము గలిగి యున్నదో అట్లే భగవద్గీతా హంసయు పరమాత్మ జీవాత్మలను వేరుజేసి వారి తారతమ్యములను వేరువేరుగా జూపి యున్నది.

17 శ్రీభగవద్గీతా శాస్త్రము ధర్మశాస్త్రములవలె ఆత్మధర్మము వర్ణాశ్రమధర్మము రాజనీతి దండనీతి మొదలగు లౌకిక ధర్మములను అనేకములగు మతాచార ధర్మసంప్రదాయములును ఆత్మధర్మమును ననుసరించిన దేహధర్మములును అన్నిటిని వివరముగా బోధించి యున్నది.

18 గీత నీతిశాస్త్రము, శ్రీభగవద్గీత నీతి

శాస్త్రమువలె న్యాయములను తర్కశాస్త్రము వలె వాదోపవాద ప్రశ్నోత్తరములును మీమాంసాశాస్త్రమువలెస్పర్థలు సమాధానము లున్న జ్యోతిశ్శాస్త్రమువలె భూతభవిష్యద్వర్తమాన కాలములను కాలచక్ర విధములు యుగ ధర్మములు కాల యుగ పరిమితి సంఖ్యలు బ్రహ్మాదుల దినసంఖ్యలు సంవత్సర యుగముల గణితములు బ్రహ్మాదుల ఆయుఃపరిణామములు గూడ గణించి వివరించి యున్నది.

19 వ్యాకరణ శాస్త్రమువలె శ్రీగీత ఛన్దో బద్ధమై ప్రాసలక్షణ పాద బద్ధాక్షర సంఖ్య నియమములు గల వృత్త భేదములతో గూడి యున్నది.

20 శ్రీగీతలు మంత్రశాస్త్రమువలె ప్రణవ మంత్రముయొక్క గొప్పదనము తెలుపుచున్నది ఇది అజ్ఞాన అశాపిశాచ గ్రస్తమైన వ్యాధిని బోగొట్టు మంత్ర రాజమై ఆత్మసంజీవనియై యున్నది.

ఇట్టి పరమోత్తరకమగు గీతామంత్రమును మనుజులగువారు తమతమ హృదయకోశములు నిర్మలములై జ్ఞానప్రకాశమై ఆత్మ పరమాత్మల సాక్షాత్కారములంది మోక్షము లభించుట్కై సమస్తజనులును శ్రీభగవద్గీతల నుగురుముఖముగా తెలుసుకొని పలువిధములగు అభిప్రాయము గల వారై జ్ఞాన నిష్ఠలు గలిగి పలువిధములగు భాషలచే గీతాభాష్యము వ్రాసి జనులనుపకరించి నేటివరకు ఉపన్యాసములు చేయుచున్నారు యిదియే గీతామంత్రము.

---

## స్వస్వరూప వైశద్యదశ యనగా నేమి !

పరస్వరూప విషయమున స్వీకరింపవలసిన వాటినిగురించియు, త్యజించవలసిన వాటినిగురించియును జాగరూకతగల వాడుగానుండుట, అని శ్రీరామానుజులవారు సాయించిరి.

ఇతరసంగములను త్యజించి అటుపిమ్మట భగవంతుని ఆశ్రయించునది అని కూరత్తాళ్వార్ సాయించిరి.

పర్వేశ్వరుని ఆశ్రయించి అటుపిమ్మట యితరసంగములను వదలుకొనునది యని ముదలి యాండార్ సాయించిరి.

అజ్ఞానముపోయి జ్ఞానము కలవాడగుట యని ఆండార్ సాయించుదురు.

## శ్రద్ధాంజలి

(శ్రీమాన్ ఈయుణ్ణి శేషాచార్యులుగారు)

1. శా. శ్రీరంగస్థలగ బద్మసంభవహాయ - గ్రీవామరాచార్య భా
షారాకేందుసుధీఘజీర్వరులు వాచా చాతురీమాధురీ
సారస్ఫారత సుప్తకింపుడు మన-స్సమ్మోదముంజూపి పెం
పారన్ వైష్ణవసంఘముల్ బ్రముదిత-స్వాన్తులు పొంగగన్

2 ఉ. ఎందఱు వైష్ణవోత్తములో యెందఱు ధర్మగుణానువర్తులో
యెందఱు పుణ్యవర్తనులో-యెందఱు భూతదయావిలాసులో
యెందఱు సర్వమొప్పిదరి-యుంచెడిధన్యులో వీరిబోధనల్
బొందగ భక్తిరోవినుచె-పుణ్యము సద్గతిగా దెచూడగన్.

4. ఉ. ఎవ్వరిచేత భారతము-హీనతస్థాపనమై చరించెనో
యెవ్వరిచేత పెంపుగను-యేక్రియ బ్రాకెనొ దేశదేశమం
దవ్విబుధాగ్ర గణ్యుల మ-హత్తరకార్యము లెల్ల భూసురుల్
నివ్వెఱవోవ జెప్పినని-నిర్మలచిత్తులువారి కంజలుల్

5. సీ. ఎవ్వాని ఘనదంశ మిహలోక పరలోక
వాంఛల కనువుగా-వరలుచుండె
నెవ్వాని హోమంపు-నెల్లియెసకలలో
కములకు బ్రాణమై క్రాలుచుండె
నేవాని సద్యశం-బీరేడులోకాల
కగ్గల వ్యాప్తమై-యలరుచుండె
నెవ్వాని మతరాజ-మీదేశమున బూజ
నీయమై శోభతో-నెగడుచుండె

గీ. నెవరిఘనతను స్మరియించి-రెడదయందు
నఖిలమాళ్వారులందఱు-నాశతోడ
నట్టిరామానుజార్యుల-హర్నిశముల
వరవిశిష్టసంఘముఁగాచి-పరగుగాత

6. సీ. సంపూర్ణచంద్రుని-చాయల నిరసించు
మోమునఁజిఱునవ్వు-మొలకలెత్త
కమనీయ గాంభీర్య-కల్యాణయుతచర్య
వైభవోపేతమై-వరలుచుండ
బుస్తకరత్నాల-హస్తంమ్ములధరించి
యజ్ఞానతిమిరంబు-నణచుచుండ
పూర్ణవాంచితమగు మధురభాషణములు
కపటపండిత మతిఘ్నములుగాగ

గీ. సంగమంతంతకనుజాలి-పొంగుచుండ
నొయ్యనొయ్యన పాదంబు-లుర్విమీఁద
నిడుచు సుయ్యారమలరగ-నడచివచ్చు
వైష్ణవోత్తములకెనాడు వందనంబు

## లోకరీతి

శ్రీమాన్ ఆరవిల్లి శోభనాద్రినరసింహాచార్యులుగారు

ఉ॥ భావనసేయరేమి? భగవంతుఁడెవండు?
మరెచ్చటుండు? యా
పావనమూర్తిరూపమేది? పాన్పదియెవ్వరు? భార్యయెవ్వరో?
యేవనమందునుండు? నట యెవ్వరు స్నేహితులంత శిష్యమే
ధావులు సేవకుందగిన ధన్యులు యెవ్వరు? భృత్యులెవ్వరో?

ఉ॥ ఎందుకు జన్మనిచ్చె మన కెందుకు నీభువియందు సార్థకం
బొందఁగఁ జేసి మా దభవ బంధునిఁ జేసెనతండ దేమి? సం
బంధమదేమి వానికిని బద్ధులకున్ సమదృష్టిలేని, యీ
మందునిజేసెనేమి? ఘన మాయలవేమి? యటంచుదల్పరే

ఉ॥ శ్రీపతిదైవమంటపరి సేవకులే సురలందరంట శ్రీ
కౌస్తుభమాపరంపదము కానఁగ మంగళరూపమంట, సం
తాపముదీర్ప శేషుడట తద్దయు పాన్పట, పాలసంద్రమం
దాపరమాత్ముఁడాడునట నారయ యోగులు
గొల్చుచుండినన్.

చ॥ కన క్షణభంగురంబయిన కాయము నిత్యమటంచు దల్చిగ
ర్జనలను జేసి స్వర్గమన సౌఖ్యముఁ బొందెదమంచు దుఃఖమం
దనుమత నామరూపులయి నాశనమందఁగనేల కృష్ణునిన్
మననము జేసి మోక్షమును మందతజ్ఞానమునందు బొందరే.

గీ॥ "దుష్టచింతలు నామది దోఁగనీక
కుజనస్నేహంబు నెప్పుడు గోరనీక
సర్వవేళల హృదయంబు సరసిజాక్ష
నీదు స్మరణంబు సేయంగ నెరపు" మనరె.

---

## భక్తి "నివేదన" పత్రిక

సంవత్సర చందా రూ. 5—0—0 లు
మాత్రమే. వెంటనే చేరండి

శ్రీమతే రామానుజాయ నమః

# ఆచార్య తిరుమేని వైభవము

[మరంగంటి రంగనాయకమ్మగారు కోరుకొండ]

తిరుక్కోష్టియూర్ నంబిగారు శ్రీరంగమున తిరునాళ్ళ మహోత్సవమును సేవించి తిరిగి వేంచేయుచుండగా ఎంబెరుమానారు వారిననువర్తించి స్వామీ! నాకు రక్షకమగు నొక శ్రీసూక్తిని సాయించి కృపచేయు'డని ప్రార్థింపగా నంబి గారు కొంచెమాలోచించి 'మాయాచార్యులగు శ్రీఆళవందారులు నీటిలోనిలిచి యఘమర్షణ మంత్రమును జపించునపుడు వారిపృష్ఠభాగము బోర్లించిన కాగువలె నుండును. నేనదియే రక్షించుటకు తగినదని నమ్మియుంటిని. మీరు నట్లే నమ్మి యుండుడ'ని సాయించిరి.

ఒకతరి యుడయవరులొక మూగభక్తునిపట్ల తమకుగల కృపాతిశయముచే నాతని నుజ్జీవింపచేయనెంచి యాతనినొక యేకాంతస్థలమునకు గొంపోయి తనశరీరము నాతనికింజూపి యిదియే రక్షకమని నమ్మియుండుమని సంజ్ఞజేసిచూపిరి. దీనిని తలుపు రంధ్రమునుండి జూచిన కూరత్తాళ్వాను మూర్ఛిల్లి కొంతతడవునకు తెప్పిరిల్లి 'అయ్యో! నేనంత పాపిని! శాస్త్రము నధిగమించి మహాపాపినైతినే! ఏమియు తెలియని మూగనై పుట్టిన నీప్రసాదమును ఉడయవరులు కనికరించి నాకుగూడ ప్రసాదించి యుందురుగదా! హా! దైవమా! కూరత్తాళ్వానై శాస్త్రములను విస్తారముగా జదివియుండుటచే గదా నాకు నాకులదైవము తమ దివ్యమంగళవిగ్రహము ను దిక్కుగా నొసంగక ప్రపత్తి నుపదేశించిరి' అని మిక్కిలి విలపించిరి.

ఇందుచే నాచార్యుల దివ్యమంగళవిగ్రహమే శిష్యునకు నిరతిశయపురుషార్థ సాధన మని పెద్దల విశ్వాసమని సిద్ధాంతీకరించబడుచున్నది.

# ప్రచార విభాగము



శ్రీమతే రామానుజాయ నమః

గుంటూరుజిల్లా తెనాలి తాలూకా శ్రీరంగపురం అగ్రహారం గ్రామంలో శ్రీవైష్ణవమత ప్రచారకసంఘకార్యదర్శిగారైన శ్రీఉ.వే. శ్రీమాన్ ఆ.చి. శ్రీమన్నారాయణాచార్యస్వామి వేంచేసిన సందర్భములో శ్రీమోహనరంగనాయకస్వామివారి సన్నిధిలో శ్రీమాన్ గుదిమెళ్ళ తిరుమల తాతాచార్యులుగారి అధ్యక్షతన జరిగిన సభా సందర్భములో శ్రీస్వామివారు "మానవుని నిత్యజీవితములో మతముయొక్క ఆవశ్యకత" అను శీర్షికను గురించి యుపన్యసించినారు.

ఆసందర్భములో ఈక్రింది కార్యవర్గముతో పైసంఘము యొక్క శాఖ స్థాపించబడినది.

ది 11-6-51

శ్రీ రంగ పు ర ము

అధ్యక్షులు:- శ్రీమాన్ గుదిమెళ్ళ తిరుమలచిన వెంకటరంగాచార్యులు

కార్యదర్శి:- వేదాల సుందరరాజగోపాలాచార్యులు

స భ్యు లు

1. గుదిమెళ్ళ తిరుమల వెంకటలక్ష్మణాచార్యులు
2. గుదిమెళ్ళ తిరుమల తాతాచార్యులు
3. వేదాల వెంకటప్పలాచార్యులు
4. పంచాంగం శ్రీమన్నారాయణాచార్యులు
5. సముద్రాల మాడాచార్యులు
6. ఉత్పల వెంకటనరసింహాచార్యులు
7. వేదాల తిరుమల రంగరామానుజాచార్యులు
8. మద్దూరి హనుమరెడ్డిగారు బి. ఎ.
9. తాళ్ళూరి బసవపున్నయ్యగారు, గ్రామమునసబు.

శ్రీ

    

శ్రీమతే రామానుజాయనమః

భక్తి

# నివేదన

వేదాంత మాస పత్రిక

| సంపుటి 3 | ఖర — ఆషాఢమాసము | సంచిక ౮ |
| --- | --- | --- |



# శ్రీ యతిరాజ విజయ నాటకము.

శ్రీ ఉ. వే. శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులుగారు, కోరుకొండ.



భగవద్రామానుజులకు పూర్వాశ్రమము నందు శ్రీవత్సకులతిలకులైన మహాపండితులగు సుదర్శనులను పేరుగల మేనల్లు రొకరుండిరి. రామానుజులు వారి వైదుష్యమునకు ముగ్ధులై తమ శ్రీభాష్యసింహాసనాది కారమును వారి కర్పించిరి. వారికి శ్రుతప్రకాశికాది గ్రంథకర్తలకు గూడ నాచార్యస్థానము నలంకరించిన వేదాంత కూటస్థులైన వరదార్యులను ప్రసిద్ధ నామధేయముగల పౌత్రులుండిరి. ఆవరదార్యులకు నాల్గవ తరమున శ్రీకాంచీపురమునందు శ్రీఘటికాశత సుదర్శనాచార్యులను నొక మహాపండితులుదయించిరి. ఆసుదర్శనాచార్యుల కచ్చటనే వరదార్యులనెడు పుత్రులు జన్మించిరి. వారు తమ యప్రధృష్య పాండిత్య ప్రకర్షచే జగద్విఖ్యాతిని గాంచి దర్శన స్థాపకులగు వేదాంతాచార్యుల పట్లను రామానుజార్యుల పట్లను అపారశ్రద్ధాభక్తిసమన్వితులై కవిపుంగవులై యలరారుచుండిరివీరికి 'అమ్మాళాచార్యు' లని యపరనామధేయము కలదు. వీరు శ్రవ్య ప్రబంధములకంటె దృశ్యప్రబంధములచే నెట్టి వారికైనను గంభీరమగు వేదాంతవిషయములు కూడ హృదయంగమములు కాగలవను సంకల్పమునే శాంతరసమును అంగిగను రసాంతరము లనుఅంకములుగను జేసి ప్రమాణమూర్ధన్యమగు నుపనిషత్తులను 'వేదవాళి'యను పేరులో ధీర శాంత నాయకునిగ జేసి ప్రత్యక్షాది ప్రమాణాంతరములను ఇతిహాస పురాణాద్యుప బృంహణములను సకలవైదికావైదిక మతములను

తత్తదనుకూలపాత్రలుగా కల్పించి యత్యద్భుతమగు నొక వేదాంత నాటకమును కల్పించిరి. ఇదియే 'యతిరాజవిజయము' అనునాటకము

ఈనాటకమున మతాంతరము లన్నిటి కంటెను అందును శ్రీరామానుజావతార సమయమున దేశమంతట నల్లుకొనియున్న శంకర యాదవ భాస్కర మతముల కంటెను భగవద్రామానుజ సిద్ధాంతమే సకలప్రమాణ సమన్వితంబగు నుత్తమసిద్ధాంతమని స్థాపించుటయే వీరి ముఖ్యాశయము. శుష్క వేదాంతార్థముల నింత రసవంతముగ పాఠకుల కందిచ్చినప్రబోధ చంద్రోదయము సంకల్పసూర్యోదయము యతిరాజవిజయమనెడు నీమూడుగ్రంథములే. ఇప్పటికి పండితలోకమున ప్రసిద్ధికెక్కి యున్నవి. ఈకవిపుంగవుల రచనా కౌశలము నొకింత సహృదయ హృదయములయందు ప్రకాశింపజేయుటకై యీనాటక కథా సంవిధానము నిచ్చట సంగ్రహముగా పొందుపరచుచున్నాను. ఇందు గల బాహ్యార్థములను స్వాపదేశము లనుబడు ప్రకృత ఆంతరార్థములను ప్రాజ్ఞులూహించుకొందురుగాక!

: కథా శరీరము :

పూర్వము వేనమాలి యనునొకరాజుండెను. ఈతడు సర్వదా సకల ప్రజానీకమునకు హితముగ మాటలాడు స్వభావముకలవాడు. సమస్త సమయాచారములను సంకరము కాకుండునట్లు స్థిరముగ కాపాడుచుండెను. మాయచే జీవించు వంచకుల నీతడెంతమాత్రమును సహించువాడు కాడు. మానప్రతాపములతో నీతనికి సాటియే మృగ్యము. సకల నీతులలో నీతడాదరించదగిన వాడు. పుష్కలమైన శారీరమానసిక బలములు గల యువకుడు నాయకులలో నీతనికి సాటియే లేడనుట యతిశయోక్తి గానేరదు. ఇట్టి సద్గుణ రాశియగు నీరాజు చిదచిదీశ్వరు లనెడు తత్త్వత్రయోపేతమైన పదునాలుగు బ్రహ్మాండముల నేకచ్ఛత్రాధిపత్యముగ నేలుచుండెను. నసత్యవాదులగు బోధాయన టంక ద్రమిడ గుహదేవ కపర్ది భారుచి ప్రభృతులీతని కమాత్యులై ఐకమత్యముతో రాజ్యచక్రము నేలించుచుండిరి. వీరేగాక ప్రత్యక్షాది మహామాత్యులుగూడ నీమహారాజునకు వానోడ్డై నిలిచియుండిరి. వీరందరియందును మహారాజునకు మిక్కిలి [illegible] బుద్ధి యుండెడిది. ఇట్లుండ కాలక్రమమున బోధాయనాదు లందరును కాలధర్మము నొందిరి. ప్రత్యక్షాది మహామాత్యుల కుటుంబములలో కొందరు వికలాంగులు జన్మించి దుర్మార్గులై రాజ్యభ్రష్టులు గావింపబడిరి. వారు మెల్లగ పొలిమేరలయందుసమయమునకై పొంచియున్న పాషండులతో జేరి వారిని ప్రోత్సహించి వారితో గలసి మహారాజు విషయములన్నిటిని వ్యాకుపరచదొడంగిరి. రాజ్యమును చక్కని మార్గమున నడిపించదగు మంత్రిపుంగవుండు లేకుండుటం జేసి యీపాషండులలో విదగ్ధవంచక శిఖామణి యగు నొక మాయావి విరాగివేషముతో రాజు చెంతకరుదెంచి యాతనికి తాను పరమవైదికుడను విశ్వాసము నుబుట్టించి క్రమముగ ప్రధాన మంత్రిపదవి నధిరోహించెను. యాదవభాస్కరులుపమంత్రులైరి. రాజునకు ప్రధానామాత్యుని ప్రేరణచే మిథ్యావిషము తలకెక్కెను. యథా రాజా న్యాయముగ నితిహాస పురాణములు తంతాన తాన యనజొచ్చెను. మెల్లమెల్లగ ప్రధా

నామాత్యుడు రాజునకు దుర్బోధగావించి తన కుమార్తెయగు మిథ్యాదృష్టి నాతని కప్పగించి ప్రాణసఖియగు సునీతితో రాజమహిషియగు సుమతిని బహిష్కరింపజేసెను. గాని సుమతి సఖులగు సద్విద్యా గీతాదేవులను మాత్ర మొక రీతిగా చేబట్టెను. సదూహుడను సేనానాయకుని తీసివైచి దురూహుని కాయధికార మొప్పగించెను. సుదూహుడు రామానుజుల నాశ్రయించి ప్రధానామాత్యుని యున్మూలించు ప్రయత్నము గావించుచుండెను. వేదవిచారుడను (పూర్వమీమాంసాశాస్త్రము) రాజపోషకుని పై రాజుతో నేరములు చెప్పి మాత్రినిని రాజ్యము నుండి వెడలగొట్టించెను.

ధర్మల కిపుడుకును రాజ్యమున తావు లేకుండజేసెను. ప్రవృత్తి భర్తయగు ధర్ముడు వేదవిచారుని చేబట్టెను. పాపమా ధర్ముని చార్వాకుడు మాయావాది సౌగత దిగంబరులతో (బౌద్ధజైనులతో) గూడి పీడించ దొడంగెను. అనుకూలులుగా నాభాసించు కపిల పతంజల కపాలభట్ట పాదులు "వీనికింతయు శాస్తి కావలె" నని వెనుకటి విరోధముల దలంచి చూచుచు నూరకుండిరి. పాపమా దీనుడు వంటరిగ నేమిచేయును. ఇక నివృత్తి భర్తయగు ధర్ముడు వెడలగొట్టబడి రామానుజుల చెంత జేరెను. చార్వాకుడు ప్రధానామాత్యునకుకొంత భయపడు చుండెను గాని వాని మిత్రుడగు బౌద్ధుడా భయమును తీర్చివేసెను.

ఈదుర్నడత నంతను రాజెరింగి తనప్రియమిత్రులగు యామునాచార్యుల రావించి తగిన యుపాయ మాలోచించెను. వారి యాదేశాను సారము తగిన మంత్రి లభించువరకీ మాయావాదిని చెండనాడిన తన శత్రువులు తన విషయముల నాక్రమింతురని భయపడి యోరిమి పట్టియుండెను.

అచ్చట సుమతి దుఃఖార్ణవ నిమగ్నమానసయై సునీతితో గూడి యీ మాయామంత్రి నశించి సన్మంత్రిపుంగవుడు లభింపవలెనని యిష్టదైవమును శ్రద్ధాభక్తులతో పూజించుచుండెను. గీతా సద్విద్యలు గూడ నామెకు వలయు నంత చేదోడగుచుండిరి.

ఇట్లు మిథ్యాదృష్టి వశంగతుడై తెలివి మాలిన రాజును గాపాడుటకై యాతని సన్మిత్రులగు యామునులు రామానుజుల ప్రోత్సహించగా వారెట్లో రాజసాన్నిధ్యమును సంపాదించి యారాజు వంటరిగా నున్నతరి యాతనికి జారిణియగు నామిథ్యాదృష్టి వృత్తము నంతను సవిస్తరముగ బోధించి యామెపై యాతనికి కసహ్యమును బుట్టించి సుమతి సునీతులు లేని రాజ్యము చెడునని మెల్లగా రాజమహిషిపై యాతని మనస్సును మరలించెను.

ఈసంఘటనచే రాజునకు రామానుజుల బుద్ధికౌశల మచ్చెరువొనరించి వారినే మంత్రిగా పరిగ్రహింపవలెనను సంకల్పము జనించెను. మాయావాది దానిని కనిపెట్టి రామానుజులను రాజద్వారమున నడుగిడకుండగ జేసివేసెను. దాన రామానుజుల కాగ్రహము జనించెను. ఈ దౌష్ట్యమును పోగొట్టినగాని నిద్రాహారములంటనని శపథము గావించి తన ప్రియశిష్యు లిరువురితో కాంచీపురి కేగెను.

యామునాచార్యులు మాత్రము రాజును వీడక యాతని హితమునే యన్వేషించుచు

వెన్నంటి యుండిరి. మాయావాది మాత్రము కూలంకషానంద తరంగపరంపరల తానోలలాడుచు రాజు నోలలాడించుచుండెను. కాని వీనియభివృద్ధిని భాస్కరయాదవులు సహింపజాలక వీని యవమాన సుముహూర్తమునకు మీనమేషములు లెక్కించుచునే యుండిరి. రాజిదియంతయు నెఱింగియు సన్మంత్రిపుంగవ లాభమునకై భగవదనుగ్రహము నపేక్షించుచుండెను.

ఇట్లుండ నొకనాడు రాజు యామునాచార్యులతో గూడి కొలువుతీర్చియుండెను. శ్రీవరదరాజ పెరుమాళ్ళ ప్రేరణచే కాంచీపురమునుండి శ్రీయామునాచార్యులకు కాంచీపూర్ణులు పత్రిరూపమగు సందేశమును పంపిరి. దానిని శిరసావహించి వాధూలులగు దాశరథులును, వాత్స్యులగు వరదవిష్ణువులును రంగప్రియ ప్రియరంగ నామములతో వైతాళిక వేషధరులై సభారంగమున ప్రవేశించిరి. వారు కొనివచ్చిన యాపత్రమును గైకొని రాజు స్వయముగ చదివెను. అందు శ్రీవరదరాజు పెరుమాళ్లు కాంచీపూర్ణులకు ప్రత్యక్షమై 'మాయావాది విప్లవముచే మహారాజు కుదృష్టకుహనాముఖమున కూలి నానా వశిష్టుడై కుందుచున్నాడు గాన రామానుజులను తగిన మతి నీతి సత్య సముత్సాహాది సహాయ సంపదల నొసంగి పంపుచున్నాను గాన నీవును ఏమరక రాజును గాపాడవలెన'ని యామునాచార్యుల నాదేశించుచుండెను. రాజందుల కపరిమితానంద కందళితాంత రంగుడాయెను. మంత్రులు నుండిపడ జొచ్చిరి. వైతాళిక వేషధారులగు నారామానుజ శిష్యపుంగవులు తమ శితల యుక్తి ధారా సంపాతములచే నామంటల నార్పి తమబుద్ధికౌశలముచేతను పరమతఖండన నైపుణిచేతను నొక్కసారిగా త్రయ్యంత సిద్ధాంతము ప్రక్కకు త్రిప్పివేసిరి. మంత్రులు పరాజితులై తలవంచుకొని లేచిపోయిరి. పిమ్మట రాజును వైతాళికుల తత్త్వమెఱింగి వారి మూలమున ప్రకటితమైన రామానుజుల వైదుష్యమునకు మహాశ్చర్యంబు నొంది వారి శుభాగమన ముహూర్తమునకై యెదురు జూచుచుండెను.

ఇంతలో శ్రీవరదరాజ పెరుమాళ్ళచే ప్రేరేపించబడిన శ్రీకాంచీపూర్ణుల యానను శిరసావహించి శ్రీరామానుజార్యులు వేదమౌళి నాశ్రయించి యాతనిచే బహుభంగుల సన్మానింపబడి ప్రధానమంత్రి పదము నధిరోహించిరి. వారి బోధనాకౌశలముచే క్రమశః యావేదమౌళి తిరిగి తన పట్టమహిషియగు సుమతియందు సాభిలాషుడయ్యెను. సునీతియొక్క దౌత్యచాతుర్యముచేతను, గీతామాతయొక్క సదుపదేశముచేతను సుమతి వేఱమాగ లేక మనస్కురాలై సంశ్లేషించిరి.

ఇట్లు వేదమౌళి రాజ్యమంతయు ప్రధానామాత్యులగు రామానుజులచే నిష్కంటకముగ నేలబడుచుండ నీర్ష్యాకషాయిత హృదయుడగు నా నిష్కాసిత ప్రధానామాత్యుడగు మాయావాది శంకరుని పురస్కరించుకొని కేరళదేశీయులతో గూడి యొక రహస్య ప్రదేశమున దుర్గ నారాధించి యామె యనుగ్రహబలమున వివిధ మాయాశక్తి సమన్వితుడై రామానుజ విజయ కాంతి ప్రేరేపింప నింద్రజిత్తువలె విజృంభింప నారంభించెను. ధ్యాన నిష్ప్రపంచ నియోగవాదులు వృద్ధులైనను మాయావాదికి తోడ్పడుట తమ కర్తవ్యమని నిశ్చయించుకొని

రామానుజులతో తలపడదొడంగిరి గాని శంకరుని జూడగనే వెనుకకు మరలిరి. శంకర శిష్యులగు జీవైక నానాత్వవాదులగు శాక్త్యార్థజ్ఞానవాదులు వీరికి తోడ్పడుటకు మారుగా పరస్పరము కలహించుచు నెచ్చటికో పోయిరి. యామున రామానుజ సుమతి సునీతులతో రాజు కొలువుకూటమున నిష్ఠాగోష్ఠిని జరుపుచుండగ శంకరుమాత్రగా గాని మాయావాది రామానుజ విజయాటోపముతో నాయన నన్వేషించుచు నేతెంచి తన పాండిత్య ప్రకర్షనంతయు ఝంఝామారుతము వలె వీచ దొడంగెను గాని తంత్రిపాలుడను నామాంతరముతో మహారాజు సన్నిధిలో సేనాధిపతిగానున్న సదూహుడను శ్రీరామానుజార్యుల శిష్యుని సమీచీన తర్కధారాపాతములచే శమించి చేలయంటి పడియుండుతరి మిథ్యాదృష్టిచే ప్రోత్సాహితులై యోగాచార మాధ్యమికులు ముందువెనుక లారయక రంగమునకురికి శంకరున కండగ నిలిచిరి. గాని తత్క్షణమే సేనాపతిచే నిరుత్తరులు గావింపబడిరి. సరిగ నిదే సమయమునకు పరాంకుశ పరకాలాదులు సభకేతెంచిరి. అంత రామానుజులు పరాంకుశులను సగౌరవముగ తన చెంత నిడుకొని యవశిష్ట శత్రునిరశనార్థమై పరకాలాదుల నాదేశించిరి. యోగాచార మాధ్యమికులు పరాంకుశులచే లెస్సగ దండింపబడి పిక్కబలమును జూపిరి. మిథ్యాదృష్టి వారి ననుగమించి శతధా రూపం ప్రవిశంతికి పాత్రమయ్యెను.

ఇంతలో నుపమంత్రులగు యాదవభాస్కరులందుకొనిరి. సేనాపతిచే నొక్కొక్కయుక్తి శరముచేతనుమాత్రమే నిరుత్తరులుగావింపబడి శ్రీయామునాచార్యుల హితోపదేశమునాదరించి భగవద్రామానుజుల చరణారవింద శరణాగతిచే సంరక్షింపబడిరి. శంకరుడు మాత్రము తన కాపట్యము నంగీకరించి శ్రీయతిరాజయామున ప్రభృతులవద్ద సెలవు గైకొని పర్యంక విద్యోపాసనకై యనంతపురమున కేగెను.

పిమ్మట సోదరులును నగు వేదమాళి వేదవిచారుల కనాత్మజ్ఞులగు దుర్మంత్రులచే గల్పింపబడిన విరోధము నుపశమింప జేయుటకై యతిరాజులు భారతపురాణముల నంపి వేదవిచారుని రప్పించెను. పూర్వప్రాతికూల్యమును స్మరించి వేదవిచారుడు రాజుకంట బడుటకు జంకుచుండ భారత మాతనికి కర్తవ్యమును సయుక్తికముగ నుపదేశింప దానిని నాతడు శిరసావహించి ధైర్యమవలంభించి భారతపురాణముల పురస్కరించుకొని రాజు మ్రోల నిలచెను. అంత శ్రీయతిరాజ పురుషకారముచేయగా వరాజ్యాధికారమును బడసి రాజుచే నాజ్ఞాపితుడై సేనాధిపతియగు సదూహుని పురస్కరించుకొని బౌద్ధాదులవిజయమునకై యేతెంచెను. ఇంతవరకు నితిహాసపురాణములు గావించిన నిష్కల్మష సేవకు ప్రసంసించి యిట్లే విూపనిని మీరు జాగరూకులై నిర్వహించుచుండుడని శాసించి యతిరాజులు వారి నంపివేసిరి. అట్లే యితరరాజ్య కార్యనిర్వహణదక్షులగు ధర్మము, శబ్దము మొదలగు నిధికారులందర రావించి వారికి సత్సేవాక్రమమును విధించి ప్రధానామాత్యులగు రామానుజులు వారివారి పనులకై వారిని పంపివేసిరి.

మహారాజు సుమతి సునీతులతో గూడి శ్రీయతిరాజులు గావించిన దిగ్విజయమునకు వారిని వేనోళ్ళ గొనియాడుచుండ సేనాపతి యేతెంచి దిగ్విజయ వృత్తాంతము నంతను సవి

స్తృతముగ వర్ణించి దిగ్విజయోత్సవమును మహా వైభవముతో జరిపించ యనుమతివేడెను. రాజాజ్ఞచే శ్రీమత్పరాంకుశ పరకాలనాథ యామున శ్రీవత్సాంక దాశరథి ప్రభృతులచే నాయుత్సవ మతివైభవోపేతముగ జరుపబడెను. ఆయుత్సవ సందర్భమున మహారాజీ వైభవమున కంతకును కారణమైన ప్రియరంగ నామధేయముతో వైతాళిక వేషమున వచ్చిన వాత్స్యవంశోద్భవు లగు సుదర్శనులకు యతిరాజులచే కోశాధికార పదవియిప్పించబడెను. అంత మహారాజు సుమతి సునీతులతో గూడి యా యుత్సవమునంతను సానందముగ సేవించి భుజంగరాజ పర్యంక శాయియగు శ్రీరంగరాజుల ప్రణమిల్లి బహు భంగుల నుతించెను. చివరకు “రామానుజార్య దివ్యాజ్ఞా వర్ధతా మభివర్ధతా” మ్మనెడు భరత వచనముతో నాటకము శుభాంతముగా ముగిసెను.

ఇట్టి మహద్వైభవోపేతమై యత్యుత్తమమగు నీ నాటకరత్న మేదోయొక మూల మగ్గుచుండ దీని దుమ్మును దులిపి నిజప్రకాశముతో పండిత హృదయ సింహాసనము నధిరోహింప జేసిన న్యాయవేదాన్త వాచస్పతి శ్రీ ఉ. వే. శ్రీమాన్ తె.క౦.రామానుజాచార్యస్వామివారికి శ్రీవిశిష్టాద్వైత ప్రచారక పండితమండలి తరపునను శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము తరపునను పరశ్శత ప్రణామ పరంపరల సమర్పించు చున్నాడ.

ఇకముందీనాటక రచనా శైలియు, ఈకవి పుంగవుని బుద్ధికౌశలమును రసజ్ఞుల యనుభవము కొఱకై యచ్చటచ్చట కొన్నికొన్నిఘట్టములు సాంధ్రానువాదముగా నీపత్రికలో ప్రకటింపబడగలవు.

## ఈనాటకమునందలి పాత్రల పరిచయము

### పు రు షు లు

(సత్పక్షము)

1. వేదమౌళి– (ఉపనిషద్విచారము) నాయకుడు
2. వేదవిచారుడు– (కర్మవిచారము) రాజునకు సోదరుడు– చార్వాక బౌద్ధాదులకు ప్రబల శత్రువు.
3. (చిన్న)ధర్ముడు– (కామ్యకర్మలు) ప్రవృత్తికి భర్త–వేదవిచారుని మిత్రుడు.
4. (పెద్ద)ధర్ముడు– (నిష్కామకర్మ) నివృత్తికి భర్త–యతిరాజుల యనుచరుడు.
5. యామునాచార్యులు–(రామానుజులకు ఆచార్యులు) నాయకుని హితైషి.
6. యతిరాజు2 వేదమౌళికి సన్మంత్రిపుంగవు (శ్రీవిశిష్టాద్వైత సిద్ధాంతప్రవర్తకుడు) వీరే రామానుజులు.
7. ప్రియరంగడు– వాత్స్యవంశీయుడు సుదర్శను డనువరదవిష్ణువు. వైతాళిక వేషముతో నాయకునివద్దనున్న శ్రీయామునాచార్యులకు శ్రీగాంచీపూర్ణుల శ్రీముఖమును గొని వచ్చి సభారంగమున మాయావాదిని నిరుత్తరునిగ జేసిన ప్రౌఢయగు రామానుజ శిష్యుడు.
8. రంగప్రియుడు– వాధూల వంశోద్భవుండు– దాశరథుడు–రెండవ వైతాళికుడు రామానుజుల శిష్యుడు–మొదటివైతాళికునకుతోడైన వాడు.

9. సదూహుడు– వేదమౌళి సేనానాయకుడు మాయావాది ప్రధాన మంత్రిత్వములో పదవీభ్రష్టుడు గావింపబడి రామానుజుల నాశ్రయించి సకలమతముల ఖండించి రామానుజులకు విజయము చేకూర్చినదిట్ట ఈతడే తంత్ర పాలుడను రామానుజుల ప్రధానయోధుడు. ప్రియశిష్యుడును.

10. పరాంకుశుడు(ప్రధానమంత్రియగు రామానుజ పక్షీయులు శ్రీయామున రామానుజులు విధించు శిక్షలను శత్రువులకై నములుజరుపు నుగ్రోగులు.

11. దివ్యపురుషుడు– ఉరిశిక్షవంటి కఠినశిక్షలను లుపరచు ఉగ్రోగ్రి భాస్కరుని పారద్రోలెను.

12. పరకాలుడు–ఈతడొక సైన్యాధికారి–ఈతనికి రంగమునందంతగా ప్రవేశము లేదు.

స్త్రీలు

1. సుమతి–నాయిక పట్టమహిషి
2. సునీతి–నాయికకు ప్రియసఖి అతిమేధావతి
3. గీతా–సుమతిసఖి–జనకునిమాత గొప్ప విష్ణుభక్తురాలు.
4. సద్విద్య– సుమతిసఖి–మాయావాదికి అనుకూలురాలవలె నటించుచు ఆతని కొలువు కూటమునను0డెడిది. అంతరంగమునసుమతి సునీతి గీతలకు ప్రియసఖి

అసత్పక్షీయ పురుష పాత్రలు

1. మాయావాది– అద్వైతసిద్ధాన్త కూటస్థుడు. వేదమౌళికికపట ప్రధానామాత్యుడు–గూఢ రాజద్రోహి.

2. యాదవుడు } ప్రధానామాత్యుని పక్షీయులే
3. భాస్కరుడు } యైనను ఆతనితోగాని తమలో తాముగాని అంతగా కలియని వేదమౌళి కపట ఉపమంత్రులు స్వార్థపరులు గూఢ రాజద్రోహులు మాయావాదికి అంతరంగ

4. చార్వాకుడు } మిత్రులు రాజకులమునకు
5. బౌద్ధుడు } సహజబద్ధవిరోధులు పరస్పర
6. దిగంబరుడు } సహకారులై ప్రతిపక్షితో నెదుర్కొనుమిత్రులు.

7. కపిలుడు, పతంజలుడు, కణభుక్కు, అక్షపాదుడు, వీరు మాయావాదితో నంతగా కలియక జనంశమునకు మిత్రులువలె నాభాసింతురు గాని వారికంత అనుకూలులుగారు తమరే రాజ్యమునేలవలెనను సంకల్పముతో నుండెడివారు.

8. శంకరుడు– మాయావాదికి చేయూతయైన మహాభైరవీ సిద్ధిగల ప్రధానమిత్రుడు.

9. ధ్యాననియోగవాది } వీరు
10. నిష్ప్రపంచీకరణ నియోగవాది } వృద్ధులు. మాయావాదికి సహచరులేగాని శంకరుడన్న వీరికి గిట్టదు.

11. శంఖపటుడు–బహుజీవవాదీ } ఉభయులును
12. సన్యాసీ – ఏకజీవవాదీ } వ్యాఖ్యార్థ జ్ఞాన వాదులే మాయావాదిమిత్రులే వీరిలో వీరికి మాత్రము పడదు.

13. యోగాచారుడు } శంకరునకు ప్రియమిత్రులు
14. మాధ్యమికుడు } బుద్ధశిష్యులలో నొకరు.

ఈ పక్ష స్త్రీ పాత్రలు

మిథ్యాదృష్టి:– మాయావాదికి కుమార్తె. జారిణి. మాయావాదిచే వేదమౌళి కప్పగింపబడి సుమతి సునీతులను వెడలగొట్టించెను. ప్రాకృతమును గానముచేసి భరతశాపముచే నంతర్ధానమయ్యెను.

శ్రీమతే రామానుజాయ నమః

# వేదాన్తవిలాసము (అనెదు)

# యతిరాజవిజయనాటకము

## నందలి కొన్ని చక్కని శ్లోకములు.

(ప్రథమాంకారంభమందు)

1. శ్లో. పద్మే త్వన్నయనే స్మరామి సతతం భావో భవత్కున్తలే ।
నీలే ముహ్యతి కిం కరోమి మహితైః క్రీతో ఽస్మి తే విభ్రమైః ।
ఇత్యుత్స్వప్నవచో నిశమ్య సరుషా నిర్భర్త్సితో రాధయా।
కృష్ణస్తత్పర మేవ తద్వ్యపదిశన్ క్రీడావిటః పాతు వః ॥

తా॥ ఓ లక్ష్మీ! నేనెల్లప్పుడును నీ నేత్రములనే తలంచుకొనుచుందును. ఓ నీళాదేవీ! నామనోవృత్తి నీ ముంగురులయందే మోహమును జెంది యుండును. ఓభూదేవీ! (మహీ = తైః) అని పదచ్ఛేదము) సుప్రసిద్ధములగు నీవిలాసలచే కొనబడిపోతిని ఏమిచేయుదును? అని శ్రీకృష్ణుడు నిద్రలో పలవరించుటను విని రాధ కోపముతో భయపెట్టగా క్రీడావిటుడుగాన నా ప్రలాపము నంతయు ఆ రాధపరముగనే సమన్వయించిన శ్రీకృష్ణుడు మిమ్ము రక్షించుగాక. (రాధాపరముగ సమన్వయము)

రాధా! నేనెల్లప్పుడును నీనేత్రములను తామరపువ్వులని తలంచుచున్నాను. నల్లనగు నీముంగురులయందే నామనస్సు సమ్మోహమును చెందుచున్నది. పూజ్యములగు నీవిలాసలచే కొనబడిపోతిని నేనేమిచేతును?

మొదటి యోజనలో 'పద్మే నీలే మహి' అనుపదములు మూడును శ్రీనీళా భూదేవుల సంబోధనలు.

రెండవ యోజనలో 'పద్మే యనునది నయనమునకును నీలే' యనునది కుంతలములకును మహితైః అనునది విభ్రమములకును విశేషణములు.

2. శయ్యా యస్య దృశా శృణోతి భవతి ఛన్దాంసి యద్వాహనం ।
లీలా యస్య జగన్తి కాలకలనామూలం చ యల్లోచనం ।
నిద్రా జాగ్రత ఏవ యస్య నిగమస్తోమో ఽవతంసోత్పలం ।
దేవః పుష్యతు రఙ్గమఙ్గళనిధిః శ్రేయాంసి భూయాంసి నః ॥

తా॥ ఏ శ్రీరంగనాథునిపాన్పు కండ్లతో వినునో (ఆదిశేషువు చక్షుశ్శ్రవము) వేదము లెవ్వని వాహనమో (వేదాత్మావిహగేశ్వరః) జగములెవనిలీలయో కాలమును లెక్కించుటకు మూలములగు శ్చంద్రసూర్యులెవని నేత్రములో ఎవనికి మేల్కొనియుండగనే నిద్రయో (అతనిది యోగనిద్ర-జగద్రక్షణాలోచన) వేదాంతసముదాయ మెవ్వనికి తలపువ్వో, అట్టి శ్రీరంగశుభరాశియగు దేవుడు మన కపరిమితములగు శుభము లొనగూర్చుగాత!!

(ఆదిశేషునకు కన్నులేచెవులు. గరుత్మంతుడు వేదమూర్తి అతని వాహనము లోకముల సృష్టిస్థితిలయాదులు భగవంతునకు ఆటలు సూర్యచంద్రులాతనికి కండ్లు. జగద్రక్షణ చింతయే ఆయనకునిద్ర వేదశిరస్సులగు ఉపనిషత్తులచేతనే ఆయన తెలుపబడును.)

# శ్రీభగవద్రామానుజాచార్య సన్యాస స్వీకార కారణము.

విద్యారణ్య పంచానన విద్యావాచస్పతి శ్రీమాన్ విక్రాల రామచంద్రాచార్యులవారు.

ఉడయవర్ భార్యను త్యజించు విషయమున గ్రంథములలోని భేదములు చూపెద.

1. దివ్యసూరిచరితములో ఘటముల మేళనముచే గురుపత్నిని అగౌరవించుట

2. ప్రపన్నామృతములో

I అభ్యంజనము చేయువారికి అన్నము లేదనుట చూడగా చద్దెన్న ముండుట.

II బావిలోనీళ్ళను చేదునపుడు పెరియనంబిగారి భార్య కుండలోని నీళ్లు యీమె కడవలోకి చిందగా ఆమెను నీచమైన మాటలాడుట.

III ఒకపండితుడు ఆకలిఅని అడుగగా యింటికి పంపి అన్నమడుగ మనగా ఆమెఅన్నములేదు బియ్యము లేవు నీవిచటనుండతగవు పోపో నిన్నెవరు పంపినారో వారిని పోయి అడుగు అని తలుపుగడియవేసుకొని నిష్ఠురముల పలుకుచుండెను. ఆయన రామానుజునికి ఈవైనమును తెలిపెను. అంతి ఒకజాబు తనమామ తనకొడుకుపెండ్లియనియు నీవురావలిసినదనియు రాశి యిచ్చి పసుపుకుంకమ చిత్రవస్త్రమును యిచ్చి పంపినట్టుగా ఈవైష్ణవుని చేతనే పంపెను. ఆయన పోయి ఆమెకు యీవస్తువులను యిచ్చి జాబు చదివించి వినిపించెను. అంతట ఆయనకు ఆమె వండి అన్నమిడెను. ఆయన సాపాటుచేసి యుండగా రామానుజాచార్యులు వచ్చి తెలియనట్లుగా ఆవైష్ణవునివల్ల యీవర్తకనుగొని భార్యతో నీకు కావలశిన వస్త్రాభరణములను తీసుకొని ఈవైష్ణవునితోడ పుట్టింటికి పొమ్మని నేను అయిదుదినాలు తాళి వస్తాను అని చెప్పగా దాసదాసీ బంధుజనులతోడ బయలుదేరి పుట్టింటి కరిగెను. అంత వెంటనే సన్న్యాసమును దీసికొనెను.

3. గురుపరంపరా ప్రభావములో

I తలంటువానికి చద్దెన్నము లేదనుట వెతకగా నిండా వుండుట.

II గురుపత్నికి లమెకు బిందె తగువులు అంతట సన్యసించినారు.

4. పెరియ తిరుముడి యడవులో భార్యమీాద నెపము చెప్పబడలేదు.

5. పరమయోగి విలాసములో భావిలో నీళ్లు చేదునపుడు ఇరువురిబిందెలతాకుడుచేనిరువురికితగవు.

6. ఆచార్య సూక్తి ముక్తావళిలో అభ్యంజనము చేయువానికి అన్నము లేదనుట అన్నము వెతకగా నుండెను. దానిని వానికి పెట్టెను. గురుపత్ని ఘటాంబుబిందువులు గాలిచే నీకుండలో చెదిరి పడినందున నిరువురికి గలిగిన తగవు. కాంచీపూర్ణునికి సాపాటుబెట్టి ఆయన యెంగిలాకు యెత్తివేసి సచేల స్నానము చేయుట.

నీకు యావజ్జీవనమునకు కావలసినంత ద్రవ్యమిచ్చెద పుట్టింటనుండుమని చెప్పిపంపించి వరద

రాజుచే నివ్వబడ్డ కాషాయత్రిదండములతో సన్యసించెను.

భగవద్రామానుజాచార్యులవారు సన్యసించుటకు కారణము భార్య విధేయురాలు కాకపోవుటయని చరిత్రలయందు దెలిపియున్నారు. ఆవిషయమై ఇంచుకంత విచారించి సత్యమును గ్రహింపవలసినది శిష్యకృత్యమై యున్నది.

భగవద్రామానుజాచార్య శిష్యవర్గము ఇటీవల తెంగల వడగలయని రెండు తెగలుగ చీలియున్నది. ఆ రెండు సంఘములవారునూ ఆచార్యచరిత్రములను రచించియున్నారు. వాటిని బట్టి ఆచార్య విషయములను గుర్తెరుంగవలయును. ఆగ్రంథము లెవ్వియన

1. దివ్యసూరిచరితము ఇది సంస్కృతము శ్లోకరూపము భగవద్రామానుజాచార్య సమకాలములోని వారగు గరుడవాహన పండితునిచే రచియింపబడినది.

2. ప్రపన్నామృతము ఇదియు సంస్కృతశ్లోకరూపము అనన్తాచార్య రచితము.

3. గురుపరంపరా ప్రభావము ఇది ద్రావిడభాష వాక్యరూపము ఇది పిన్బళగియ పెరుమాళ్ జీయ్యర్ సాదించినది.

4. పెరియతిరుముడియడవు.

5. పరమయోగివిలాసము ఇది ఆంధ్రభాషా పద్యకావ్యము. తిమ్మక్క పాలంచితము.

6. ఆచార్యసూక్తి ముక్తావళి. ఇది ఆంధ్రసీస పద్యాత్మకము. నంబూరి కేశవాచార్య విరచితము.

ఈయైదుగ్రంథములునూ భగవద్రామానుజాచార్యులవారి వెనుక చాలా సంవత్సర (శతాబ్ద)ములు గడచిన పిమ్మట రచింపబడినవి. ఈ యారు గ్రంథములు తెంగలవారు రచించినవి.

1. ఆంధ్రపూర్ణ విరచితముయతిరాజ వైభవము ఇది సంస్కృత శ్లోకరూపము.

2. తృతీయబ్రహ్మతంత్ర స్వతంత్రస్వామి రచితము మువ్వాయిర గురుపరంపరా ప్రభావము ఇది ద్రావిడభాషా వాక్యరూపము. ఈ రెండునూ వడగలవారిచేవిరచితములు, ఆంధ్రపూర్ణులు భగవద్రామానుజాచార్యులవారి కాలములోనున్న వారికన్న ఈయతిరాజవైభవకర్త వేరుగ నుండవచ్చును. కావున నీరెండు గ్రంథములు గూడ భగవద్రామానుజాచార్యులవారికి బహుకాలానంతరము రచింపబడినవి. మరిన్ని వడగలవారిచే రచింపబడిన గ్రంథములు కొన్ని గలవు, అవి యెవ్వియనిన

1, ప్రబంధనిర్వాహము తిరుమలై శ్రీనివాసాచార్య కృతము దేశికశిష్యులు.

2. నాలాయిర త్తనియన్ వ్యాఖ్యానము.

3. పన్నిరాయిరప్పడి గురుపరంపరా ప్రభావము ఇది ద్వితీయ బ్రహ్మతంత్ర స్వతంత్ర స్వామి రచితము, ద్రావిడభాషాగద్యరూపము.

4. రామానుజ చరిత్రము కంచి శ్రీశైలతాతాచార్య విరచితము. ఈనాలుగు గ్రంథములున్నా నాకు దొరకలేదు. నేను చూచిన నీయెనిమిది గ్రంథములలోను భగవద్రామానుజా

చార్యులవారు భార్యను త్యజించుటకు ఆమెయందు మూడు తప్పులున్నటులను వాట్లను సహింప లేక ఆమెను విడచి సన్యసించినట్లును దెలుపబడియున్నది. ఈచరిత్రములన్నియు ఒక్క తీరుననె యుండినచో తప్పైన నొప్పైన నమ్మవలసేవచ్చును. వాట్లలో విరోధము జూపట్టిన నమ్మకము తగ్గిపోవును. అట్లుగాక నొకదానికన్న మరొకగ్రంధములో వింతవింతయగు కారణములను దెల్పిన యడల కొందరు కొన్నిమట్టుకు దెల్పినారనియు మరికొందరు మరికొన్నిటిని దెల్పినారనియు దలువ నగును. అవి ప్రమాణాంతర బాధితములుగానిచో అందుకై ఆగ్రంధములలోని తాత్పర్యములం దెల్పెదను. పెరియతిరుముడి యడువులో యేమికారణమున్నూ చెప్పబడి యుండలేదు. యతిరాజ వైభవములో ఘటవిషయము లేదుగాని గురుపత్నిని అధిక్షేపించినట్లున్నది.

1. ఘటవిషయము ఇంచుకంత భేదముగ మిగత సర్వ గ్రంధములందును దెలుపబడి యున్నది.

2. అభ్యంజనముచేయువానికి చద్దెన్నము విషయము ప్రపన్నామృతము గురుపరంపరా ప్రభావము ఆచార్యసూక్తి ముక్తావళి వడగల గురుపరంపరలోను ఈషద్వైషమ్యముతో దెలుపబడి యున్నది. ఎటులనైన రెండుతప్పులను నప్పిన గ్రంధములు ఈ మూడును.

3. మూడవతప్పుగా దెల్పిన గ్రంధములు మూడునూ మూడు దోవలగ నున్నవి.

ఆకలిగొన్న పండితునికి అన్నములేదని తన పుట్టింటినుండి శుభలేక తెచ్చిన నాపండితు నకే అన్నమును పెట్టుటయని ప్రపన్నామృతమున దెలుపబడియున్నది. తిరుక్కచ్చినంబిగారు భుజించిన విస్తరిని యెత్తివేసి సచేలస్నానము చేసినదియని ఆచార్యసూక్తి ముక్తావళి యందుగలదు ఒకభాగవతుడు వున్నచోటును నీచముగ దలంచి శుద్దిచేసి స్నానము చేసినదియని ముమ్వాయిర గురుపరంపర యందున్నది.

ఈమూడవ తప్పును దెల్పిన గ్రంధములీమూడే మూడుదోవలగ నున్నవి. ఇకమీద నెవరైన గ్రంధమును చేయనెడ మూడుచోట్ల దెల్పిన మూడు విధములైన మూడు తప్పులను మూడుగనెన్ని ఆయమ్మమీద నైదుతప్పులుగ చెప్పెదరేమో? కవులు నిరంకుశులుగదా, వారి హక్కుకు అడ్డమేమిగలదు. ఈప్రకారము భార్యస్థితిని కలిగించి భర్తకు యెట్టి గౌరవమునుదెల్పిరో చూతుడు. పుట్టింటనుండి తన తమ్ముని పెళ్ళియని శుభలేఖ వచ్చినట్లు భగవద్రామానుజాచార్యుల వారు ఫోర్జరీచేసి అన్నములేదని అనిపించుకొని వచ్చిన పండితునిచేతికి యిచ్చి మరల నీజవాబును ఇయ్యి అన్నమును పెట్టుతుందని ఆపండితుని పంపినట్లు ప్రపన్నామృతములో దెలుపబడినది.

ఇట్లు ఒకరు వ్రాసి పంపినట్లు వుత్తరమును వ్రాసి పంపుట అసత్యము మోసము గదా? ఇట్లు భగవద్రామానుజాచార్యుల వారు చేసిరి యన్నవారికేమి గౌరవము సంపాదించినట్లు అబల యగున యువిదను విడనాడుటకు ఇంత అసత్యము మోసము చేయవలయునా? నాక్షిప్తము లేదు. పొమ్మనిన పోదా? కర్కశురాలు గనుక నేను పోను నీవే పొమ్ము అని యెదురు తిరిగితగవులాడునని ఇట్లు చేసిరనవచ్చును. అట్లుగనుక భగవద్రామానుజాచార్యులవారు దలంచి యుండినచో యెట్లైన

వృత్తరక్షణమున సన్యసించి మనమే యిల్లువెడలి పోబోవుచున్నాము దీనితో యేల యీవాదులాట యని తనే పలకకుండపోయి సన్యసించెను. అయితే సన్యసించినట్లు విని ఆమె వీరివద్దకు వచ్చి ఏటుల సన్యసించినావు ఇది చెల్లదు విడచివేసి రమ్మని తగవు పెట్టునేమో? యని అసత్యము మోసముచేసి దూరముగనుండు పుట్టింటికి పంపి మరల రాజనే ధైర్యముతో సన్యసించుట కిటుల చేసినదని దలవ నగును. దూరమైనను మహాచండియగు దానికి దూరమేమి అపుడైన విని వచ్చి తన పని తను చేసునుగదా? ఎప్పటికైన తప్పదని యేల యోచించి యుందురని గ్రంథకర్తలు దలవరైరి. ఇట్టి అసత్యము వంచనము చేయువారని గురువును దెల్పుట చండి కలహప్రియ కోపన నిష్ఠురభాషిణి యని ఆచార్యపత్నిని దెలుపుట యేమి అన్యాయమో యోచింపుడీ.

ఈఘోర్జరీజాబే భగవద్రామానుజాచార్యులవారు వ్రాసిన పంపి మో. బుచ్చి నీవు మీ పుట్టింటినుంచి పిలవవచ్చిన వారితోడ పొమ్ము. నేను ౨ దినములు తాళి వచ్చెదను అని అసత్యమును పలికినదే నిజమైనచో నీవిషయము. రామపత్నీ త్యాగమును వ్యాసవిధవాగమనమును యుధిష్ఠిరా సత్యవచనమును మీమాంసకులు విచారించి తీర్మానముచేసినట్లు విచారించదగిన గొప్ప యంశము దీనిని మిగత చరిత్రకారులు వదలియుందురా. వ్రాయకరు వదలినది వీరికెటుల దెలిసెనో స్వప్నమున తెలిసినది కాబోలు. మూడవతప్పు నంగీకరించిన మరొక గ్రంథమగు ఆచార్యసూక్తి ముక్తావళియందు భగవద్రామానుజాచార్యులవారు భార్యయందు మూడు దప్పుల నిరూపించి ఇక నీవు యావజ్జీవమునకు కావలసినంత ద్రవ్యమును తీసుకొని నీపుట్టింటికి పొమ్ము అని చెప్పి తన భార్యను ప్రయాణము చేసి పంపి సన్యాసమును దీసికొనెనని యేలచెప్పను అట్లు దెల్పుట వారికి సమ్మతము లేదేమోయన్న ఇట్లు దెల్పవలెనని వీరికి ముచ్చటయేమో?

ఈగ్రంథమును బట్టి భగవద్రామానుజాచార్యులవారి యోగ్యతయు వారి ధర్మపత్ని యొక్క యోగ్యతయు యెట్టిదని మనము కనుగొనుట సముద్రమున కౌస్తుభమణిని పొందినట్లున్నది మతాంతర గ్రంథములందు భగవద్రామానుజాచార్యులవారి యందీవంచనా. త్యాగ పరిశీలాల కళత్రాదులు గలిగినటుల ఎచ్చోటయున్నూ చెప్పబడియుండలేదు. అట్లు మతాంతరులు చెప్పుట గలదు. ఒకటి రెండు దృష్టాంతరమునకై దెల్పెదను. శంకరుడు పరకాయ ప్రవేశముననమరుకుండి రాజస్త్రీలతో రమించి కళాశాస్త్రమును చక్కగ అనుభవమునకు దెచ్చుకొనెననియు ఒక సమయమున శంకరునికి భగంధరవ్రణము గలిగినట్లును అద్వైతులు శంకరవిజయమున దెల్పియున్నారు. ఆవిషయములను మధ్వలు యెత్తుకొని పరకాయ ప్రవేశమున అనుభవములు జ్ఞాపకముండునెడల నిదివరకటి జన్మములో ననుభవించిన రతులన్నియు జ్ఞాపకముండి మండనమిశ్రుని భార్యను జయింపరాదా? అదికల్ల ఈశరీరముతోనే రమించెను గాన నీశరీరమునకే భగంధరవ్రణమును గలిగినదియని వేడుకగ జెప్పెదరు. మరెన్ని వల్లభభాష్యవ్యాఖ్యానములో శైవభాష్యకర్తయగు నీలకంఠునిగూర్చి తస్కృతచోరస్తు, అని వ్రాసెను. అంతకుముందు రామానుజ భాష్యముగూర్చి దెలిపి ఆరామానుజ భాష్యమును చౌర్యముచేసినవాడు నీలకంఠుడని వ్రాసెను. అనగా శ్రీభాష్యములోని గొప్పవిచార

స్థలముల నెత్తివేసి విష్ణువాచకములకు బదులు శివవాచకములనుపెట్టి చేసిన గ్రంధమువలె కనుపించు చుండెది గనుక అట్లు వ్రాసెను. ఈప్రకార మెవ్వరున్నూ భగవద్రామానుజాచార్యుల వారిని గూర్చి వ్రాయలేదు. గాన వారిరువురియందు సద్గుణములే నిండియుండును. అయితే ఈ యర్థము చరిత్రలందు వెల్లడిగ దెలుపబడలేదుగదా స్ఫురింతునట్టి పదములైన గలవా యోచింతము. భగవద్రామానుజాచార్యులవారి సమకాలములో బుట్టిన దివ్యసూరిచరితమున మహాపూర్ణః।గాథాధ్యాగ్రాన్గురురిదితాస్వదర్శనస్య వ్యాకార్షీదథ గృహిణీ సఖాయ తస్మై॥౬౭॥ గృహిణీసఖాయ రామానుజాయ యని విశేషణముతోడగూడ దెలుపబడినందున భార్యాభర్తల కిరువురికిని తనయాచార్యులగు భగవద్యామునమునుల్యుపదిష్ట రహస్యార్థముల నుపదేశించునట్లు యేర్పడును. లేకపోయినచో గృహిణీసఖాయ యనువిశేషణము వ్యర్థమగును కావున నీదంపతులకు అన్యోన్యము లక్ష్మీనారాయణులకువలె నధికప్రీతి యనియు మహాపూర్ణులు (పెరియనంబిగారి) యందు ఆయమ్మకును గూడ నెక్కువ ఆచార్యభక్తి గలిగి యున్నదనియు దెలియును. పెరియనంబికింగూడ యువతి సుఖః అని విశేషణము వేసినందున వారునూ తమ భార్యయందత్యంత ప్రీతియుకులనియు అట్టి ఆచార్య పత్ని నెడ ఇంచుకంత అపచారము చేసినను ఆచార్యునిగ్రహము గలుగునని యెల్లరకుం దెలియును గాన నట్టి ఆచార్యపత్ని నెడ భగవద్రామానుజాచార్య పత్ని ద్వేషించి యుండదు. అట్లుగానియెడ గృహిణీసఖాయ, యువతిసఖః అను విశేషణములనునచినది జూడగా పితా పితృవ్యో భ్రాతా వా నైనా మథ్యాపయే త్పరః అను ధర్మశాస్త్రముంబట్టి స్త్రీ పరపురుషునివద్ద విద్య నేర్చుకునరాదు గాన మహాపూర్ణులు (పెరియనంబి) గారి భార్యవద్ద భగవద్రామానుజాచార్యులవారి ధర్మపత్ని రహస్యార్థములం గ్రహించుచుండెనను అర్థము నిచ్చుచుయెరిని దోచును. అయితే బావిలో నీళ్ళు చేదుతరి ఇరువురి ఘటములు మెలితబడినందున నిరువురు కోపగించిరి. "కూపాంబు గ్రహణవిధౌ మిథః కదాచి త్కుంభ్యోర్న్యోన్య ఘటమిళనేన లక్ష్మణస్య।గేహిన్యా సపదివి మానితావరోధః అని ఆదివ్యసూరి చరితముననే యున్నందున ఈవిషయము లేదనుటకులేదు. అయినను ఒకరు స్నానము చేయక యుండి నీళ్ళు చేదుకొనుటకు అవసరముగ బావిలోకి చేదలను వేసియుందురు. అప్పుడు ఆరెండు ఘటములు మేళనము అనగా పెనియ వేసుకొని ఆలస్యమైయుండును. దానిచే కాలహారణమైయ్యెను ఒకరితో నొకరు చర్చించుకొనియుండవచ్చును. కావుననే కుమ్భ్యోః అని ద్వివచనము ప్రయోగింపబడి యున్నది. ఆవిషయమిరువురియందునూ తుల్యమే అయినను మహాపూర్ణుల భార్య ఈ స్వల్పవిషయమును తన భర్తతో దెల్పుకొనెను. ఈకనకమ్మగారో గొప్పమనస్సు గలది గనుక తనభర్తకో జెప్పకయుండె అంతట నాయాచార్యులగు మహాపూర్ణులు శ్రీరంగమునకు భార్యతోడ బోయిరి. వారి ప్రయాణమునకు ఈయిరువురి కలహము కారణమని దలంచి ఈతగవు యెంతయో బ్రహ్మాండముగ జరిగియుండును. అని భగవద్రామానుజాచార్యులవారికి దోచునట్లయ్యెను. వారు శ్రీరంగమునకు వెళ్ళినందున నిది పెద్దదిగ తలవబడినదేగాని లేనిచో ఆడవార్లమాటలు క్రింద నెన్నబడి యుండదగినది. అయితే నీవు మీయాచార్యులకు యేదో గొప్ప గౌరవమును సంపాదించ

దలంచి అవిమర్శిత కృత్యములను చేసితివే యనిన నిది యవిమర్శిత కృత్యముగాదు.

మహాపూర్ణుల (పెరియనంబి) గారు భగవద్రామానుజాచార్యులవారికి స్వాచార్య భగవద్యామునాచార్యోపదిష్ట రహస్యార్థముల నుపదేశించుట పూర్తిఅయ్యె కావుననే విరక్తి గలిగి సన్యాసము కొరకు బంధ్వాదులను మతికోరకు భగవద్రామానుజాచార్యులవారు స్వజన్మగ్రామమగు శ్రీపెరుంబూదూరునకు వేంచేసిరి. ఆమరునాడు మహాపూర్ణులున్నూ వచ్చిన కార్యమైనందునవారు శ్రీరంగమునకు విచ్చేసిరి. ఈరెంటి మధ్యకాలములో జరిగిన నీకథ కాకతాళీయముగ నున్నదే కాని ఇది కారణము గాదు. వారిభార్య ఇట్టి దుర్గుణములు గలదే అయినచో నిట్టివి ఇదివరకెన్ని పర్యాయములై యుండదు. అప్పుడంతయు నిట్లు సన్యాసమునకు యత్నించిరా లేదు. కావున ఆచార్యోపదిష్ట రహస్యార్థగ్రహణముచే విరక్తి గలిగి స్వగ్రామమునకు బోయి తన బంధుమిత్రులను వప్పించి బంధుపుత్రి మనుమోదయిత్యాంతును ఋత్యర్థము నాచరించి వెంటనే కంచికి వేంచేసి భార్యకు యావజ్జీవనమునకు శరీరయాత్రకు కావలసినంత పుష్కలద్రవ్యము నొసంగి ఆమె పుట్టింటికి ఆమెను వప్పించిపంపించి 'యదహరేవ విరజేత్ తదహరేవ ప్రవ్రజేత్' అనుశ్రుతిరింబట్టి సన్యసించిరి. ఇది జరిగిన యథార్థము. ఇక దీనిమీద కవులు ఎంతైన బెంచెదరు. కావున భగవద్రామానుజాచార్యులవారునూ వారి ధర్మపత్నియు సీతారాములవలె సుచరిత్రులు సీత కుక్షిరవలె ఈయాచార్యపత్నికిన్ని అతికించిరి కాని అది వాస్తవము గాదు వేనవేల ప్రతివాదులను జయించి వశ్యము చేసికొను శక్తిగలవారికి యింటిలోని యాడుదానిని వశపరచుకునలేక అసత్యము ప్రతారణము చేసి కొంప కోలుపోవలయునా? యోచించుడీ.

---

### శ్రీ యతిరాజభజన కీర్తనలు

కవితావతంస, గానకళానిపుణ, హరికథాచతురానన, తరి నారాయణాచార్య నాగపురి

"జయభారతమాత" అనుదానివలె, కన్నడ—త్రిస్రగతి

ప॥ జయ ! కాంతిమతీయా ! జయ ! కరుణానిలయా !
సువిశాలహృదయ!సుభగుణాలయా ! బహుపరాక్ ! ॥జ॥

1. నీదుమతము, నీతియుతము నిఖిలవిదితము
వేదనుతము, విశ్వహితము, విగతదురితము
విపులజగదభిమతియుతము వినయభరితము బహుపరాక్ ! ॥జయ॥

2. భాష్యకార ! మౌనివర్య ! విజయీభవ ! భో !
వేంకటేశ శంఖచక్ర వితరణచణ ! భో!
శుభప్రద ! నారాయణార్యసుకవినుతపదా ! బహుపరాక్ ॥జయ॥

# చక్రాంకనవార్త

శ్రీ ఉ. వే. శ్రీమాన్ తిరుమల కండ్యూరి తాతాచార్యులయ్యవార్లంగారు

కాంచీపురం.

తప్తచక్రాంకనము గృహస్థులచే చేయించుకొనుట శ్రేష్టమా? లేక సన్యాసాశ్రమస్థులచే చేయించుకొనుట శ్రేష్ఠమా? అను విషయమున సన్యాసాశ్రమస్థులకు అగ్నిప్రతిష్ఠాపనాది కార్యములయందు అధికారములేదు గనుకను సన్యాసాశ్రమస్థులగు భగవద్రామానుజులు మున్నగు పూర్వాచార్యులు తాము స్వయముగ గృహస్థులవద్దనే తప్తచక్రాంకనపరులగుట మాత్రమే గాక యితరులు తప్తచక్రాంకన పరులగుటకు గాను గృహస్థులనే ఆచార్యపీఠస్థులుగ నేర్పరచి యుండుటచే తప్తచక్రాంకనమును చేయుటకు గృహస్థులే శ్రేష్ఠులనియు, సన్యాసాశ్రమస్థులు గౌణపక్షీయులనియు ఈవ్యాసకర్తగారి యభిప్రాయము. సన్యాసాశ్రమస్థులు తమ నాశ్రయించిన శిష్యులకు తప్తచక్రాంకనము చేయకూడదని లేదు. వారికది తగినదియు కాదు. సన్యాసాశ్రమస్థులు అగ్నిప్రతిష్ఠాదులు చేయకూడకనుట శాస్త్రీయమే-శిష్టాచారసిద్ధమే అందుచే వారు యితరులచే అగ్నిప్రతిష్ఠ-తప్తాదులును చేయించి అంకనమును మాత్రము స్వయముగ చేయుచుండుట కలదు. ఇదియు శాస్త్రీయమే-శిష్టసమ్మతమే ఇంతకు గృహస్థులు-సన్యాసులు-అని భేదమును కారణముగాగొని వీరిలో వీరికి శ్రేష్టత్వ-అశ్రేష్టత్వమును ఆరోపించుకొని కులక్రమాగతులైన యోగ్యులైన స్వాచార్యులను విడిచి క్రొత్తగా మరొకరిని ఆశ్రయించుట ఎవరికిన్ని ఎంత మాత్రము తగదు.

వైదికమగు శ్రీవైష్ణవ సాంప్రదాయములో వర్ణ ఆశ్రమముల బట్టిగాక జ్ఞానానుష్ఠానముల బట్టి మాత్రమే యోగ్యత ఏర్పడును.

సంపాదకుడు.

చక్రాంకణమనునది రోగనివారణార్థమై పశ్వాదులకు చురకలు వేయుటవంటిదికాదుగదా? అగ్నిప్రతిష్ఠాపనచేసి అందు సుదర్శన హోమాదులనుచేసి అట్టి సంస్కారాగ్నియందే తప్తముచేసి సమాశ్రయణమును చేయుటె శాస్త్రీయము. ఇప్పటి సన్యాసులు అట్లు చేయుట కానరాదు. అట్లు చేయుటయూ కూడదు. పశ్వాదులకు చురకలువేయుట వాతాదిరోగ నివృత్తి ప్రత్యక్షఫలము. ఇది అట్టిదికాదు. ఇది అపవర్గ సాధనముగాన ఇందునకు శాస్త్రమే ప్రమాణము.

శ్లో॥ తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య వ్యవస్థితౌ॥

కార్యాకార్యవ్యవస్థకి శాస్త్రమే ప్రమాణముగదా? యేశాస్త్రము వలన పంచసంస్కారమావశ్యకమనెదమో అట్టి శాస్త్రము వలననే అధికారి నిర్ణయముకూడ చేయుట యుక్తము.

శ్లో॥ పురతోగ్నిం ప్రతిష్ఠాప్య స్వగృహ్యోక్తవిధానతః॥

ఇత్యాదివచనములవలన అగ్నియందధికారులే పంచసంస్కారములు చేయుట కధికారులని యేర్పడుచున్నది.

మరియు

శ్లో. ఆచార్యకులజో దైశ్యస్సు వర్ణయే దభిషేచితం ।
తద్వంశసంభవం వాపి పారంపర్యక్రమాగతం॥
అన్యథా సకలం కర్మ యథా శూద్రకృతం భవేత్॥

అనియును ఆచార్యపట్టాభిషిక్తులైన వారినిగాని అట్టివారి వంశ్యులనుగాని ఆశ్రయించుటే ముఖ్యమనియును సుదర్శన హోమాదులనుచేసిన అగ్నియందే తప్తముచేసి చేయవలయుననియు ఇందునకు భిన్నముగ చేసిన సంస్కారము అపవర్గ సాధనము కాదనియును స్పష్టముగ నేర్పడుచున్నది.

శ్లో. అహుతాగ్నా వంకయిత్వా పరలోకం న విన్దతి॥
ఆచార్యో గార్దభీం యోనిం విన్దేచ్ఛిష్యోపి తాదృశీం॥

పూర్వోక్త విధిప్రకారముగజేయని ఆచార్యులును అట్లు చేయించుకొనిన శిష్యుడును. గర్దభయోనియందు జనించునని చెప్పియున్నది. సన్యాసులకు విశేషవిధియున్నదని అన్నచో

అవి ముఖ్యములుగావు. గౌణమని భావింపతగినవి గనుకనే సన్యాసులకన్న "తస్మా చ్ఛ్రేష్ఠో గృహాశ్రమీ" అని యున్నందున గృహస్థుడు శ్రేష్ఠుడని చెప్పియున్నారు.

"గౌణ ముఖ్యయో ర్ముఖ్యే కార్యసంప్రత్యయః" అని యుండుటంబట్టి గృహస్థుడే శ్రేష్ఠుడు యిచ్చట సామాన్య విశేషన్యాయము ప్రవర్తింపదు. శ్రేష్ఠశబ్దాస్వారస్యమువలన ఆచార్యులుంతగ విపరీతబుద్ధులచే అన్యథా ఆశ్రియింప చేయుటయు అట్లు ఆశ్రయించుటయు మిక్కిలి పాపావహము ఈవిషయము

శ్లో. నాన్యై ర్రూపాయై ర్వివిధై ర్మంత్రౌషధ పురస్సరైః ।
ముచ్యతే మనుజో మూఢో సర్వదుర్మ విభాజనః ॥

సర్వదుర్గతిభాక్కుగలదని చెప్పియున్నది గాన ఆస్తికులగువారు కుపథము నవలంబించుటకన్న సత్పథము నవలంబించు చో యెంతశ్రేయోదాయకమో యోచింపుడు. గనుక ఇవి యన్నియు యోచించి శాస్త్రకారులు

శ్లో. తస్మా త్సర్వాత్మనా బ్రహ్మాన్ కులాచార్యం
ప్రపూజయేత్॥

అనేక సాధకబాధకములను యోచించు కులాచార్యుల నాశ్రయించుమని విధించియున్నది. శిష్యులనుజ్జీవింపజేయ నాచార్యులు పునః పునరుపదేశముచేయుట వారి కృత్యము.

"దీర్ఘబన్ధుం దయాళుం" అని ఆచార్యతను దీర్ఘబన్ధువుగా చెప్పంబడియున్నది అనగ ఎంతచెప్పిననూ మళ్ళని శిష్యుని విషయమై ప్రాతికూల్యానివృత్తికొరకు భగవత్సన్నిధియందు ప్రపత్తిచేయవలయునని తాత్పర్యము. అట్లైనచో పిల్లకొరకై తల్లి పథ్యముచేసినచో పిల్లరోగము యెట్లుతీరునో అట్లు శిష్య ప్రాతికూల్యమును పోగొట్టుకని అభిప్రాయము. అట్లాచారు లాచరించనిచో "శిష్యపాపం గురో రపి" యనువచనము చొప్పున శిష్యునియొక్క పాపమాచార్యులకు సిద్ధించును తన్నివృత్తికొరకు ఆచార్యులు చెప్పక తప్పదు. అప్పటికి మళ్ళనిచో వాని బలవత్తరపాపమనే నిశ్చయించవలయును (రావణునికి విభీషణోపదేశమువలె) మణవాళమామునులును-

"తన్ గురువిన్ తాళిణైగళ్ తన్నిలన్బొన్నిల్లాదార్
అన్బుతన్పాల్ శైవాలు మన్బుయకోన్ ఇన్నమిగు
విణ్ణాడు తానళిక్క వేండియిరాన్ ఆవలాల్ నణ్ణార
వర్ గళ్ తిరునాడు॥

తన కులక్రమాచార్యుల పాదపద్మములయందు భక్తిజేయక ఎన్నితపంబులు జేసిననూ సర్వేశ్వరుడు అనన్యపూర్ణమైన మోక్షమునొసంగడు.

ఇచ్చట "తన్ గురువిన్" అని సాయించుటవలన కులగురువని అర్థము. ఇట్లుచెప్పనిచో అశ్రీవచనభూషణవాక్యవిరోధము సంభవించును.

ఇట్టి మహాపాతకావహ కార్యములయందు ప్రవర్తింపక విరమింతురని నమ్మెదము. ఉదయవరులాదిమొదలగువారు ఆచరించియున్నారని వారనుష్ఠానములు తుసిపువమానములుగ భావించతగదు. ఏలన "శేషాంశం మామ భావుకం" సాక్షాదీశ్వరావతారమై లోకోజ్జీవనార్థముగ "కలౌ ఖ ల్వ ద్భవిష్యతి" అని అవతరించి లోకోజ్జీవనమును అనేకవిధములుగజేసి స్వప్రభావమును అనేక ప్రకారములుగ బహిరంగపరచుచూ అనేకులకు మోక్షము నిప్పించుచూ ఇచ్చుచూ

శ్లో. ప్రపీతవిషతీర్థాంభః ప్రకటీకృతవైభవః॥
విషమిశ్రతీర్థపానాదులవలన సర్వప్రకారములనేతప్రకటీకృత వైభవము కలిగి

శ్లో. జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా॥
యనియథార్థ తత్వజ్ఞానాగ్నిచే సర్వదురితములను నశింపచేయుచూ జ్ఞానీత్వాత్మైవ మే మతం. అని సర్వేశ్వరుననుంగూడ నాత్మభూతులై యుండెడి వారి చరితాదులు మనకు సామ్యశాస్త్రవహములు కానేరవు. గృహస్థులవలన హుతమైన అగ్నియందే చేసి యుందురనే నిశ్చయించుటయుక్తము.

శ్లో. అహూతాగ్నా వంకయిత్వా పరలోకం న విందతి॥
యను వచనవిరుద్ధముగచేసి యున్నారనుటకు కారణము కానరాదు. ఉడయవరులు మణవాళమహామునులు మొదలగు యతివరులును గృహస్థశిష్యులేగదా? మరియు సన్యాసులకు భ్రంశముకలిగినయడల వారికి శుద్ధికరప్రాయశ్చిత్తము కానరాదు. శ్రీభగవద్రామానుజులవారే తద్వ్యాతాధికరణమున

"న చాధికారిక మపి పతనానుమానా త్తదయోగాత్"
నైష్ఠికాదీనాం ప్రచ్యుతానాం పరస్మృతే స్తస్య
ప్రాయశ్చిత్తా సంభవాత్.

శ్లో. ఆరూఢో నైష్ఠికం ధర్మం యస్తు ప్రచ్యవతే పునః
ప్రాయశ్చిత్తం న పశ్యామి యేన శుద్ధ్యేత్స ఆత్మహా

అతః అధికారిలక్షణోక్తి ప్రాయశ్చిత్తం ఇతర బ్రహ్మచారి విషయంఅనియూ ఉపపాతకంవా. మహాపాతకంవా. బహిష్కార్యః కర్తవ్యః అనియూ ఆరూఢులైన నైష్ఠిక వైఖానస ప్రవ్రాజకాశ్రమభ్రష్టులైనచో వారికి ప్రాయశ్చిత్తము లేదు. ఆరూఢపతితులగుటంబట్టి వీరు ఆత్మహంతులు వీరికి శుద్ధికరప్రాయశ్చిత్తములు ఎచ్చటను కనపడదు. వీరికి స్ఖాలిత్యమత్యంతము సులభతరము పంచభక్షపరమాన్నాదులను నిత్యము భుజించుచూ స్థిరముగ వాసులై శరీరావిశేషచే పుష్టముగ నుండు సన్యాసులకు ఇన్ద్రియనిగ్రహము మానసికముగనైనను తటస్థించదనుట అనుభవవిరుద్ధము ఉపస్థితో వాయుభక్షః అనెడివిశ్వామిత్ర ప్రభృతులకే దిక్కులేకపోతేపూర్వోక్తులకు






శ్రీమతి వి. శ్రీనివాసమ్మగారు

# గీతా

1. గీత వేదసాగరమందు పుట్టిన చంద్రుడని చెప్పవచ్చును. పాలసముద్రము తరచినప్పుడు పుట్టిన చంద్రునివలె కాంతియుతమగు శాంతి ప్రభలీనుచున్నవి.

2. శ్రీభగవద్గీత శ్లోకరసపుష్కలమను జలముతో అర్థభావములను అమృతజలతరంగములతో పొంగి పొరలుచు సముద్రమువలె గంభీరముగను స్వచ్ఛముగను ప్రకాశించుచున్నది. ఇదియే గీతా సముద్రము.

3. శ్రీగీత సూర్యమండలమువలె తేజఃపూర్ణమై తేజరిల్లుచు దేదీప్యమానమై వెలుగుచున్నది. సకలాత్మలందుండు అజ్ఞానమను చీకటిని పోగొట్టి ఆత్మస్వరూపసాక్షాత్కారమును జ్ఞానమును ప్రకాశింపచేయుచున్నది. మరియును నాస్తికమతములను ఎండింపజేసి కాల్చివేయుచున్నది. పుట్టుగుడ్డివానికి సూర్యప్రకాశ మెట్లు తెలియదో అట్లే నాస్తికులకు తెలియనలవి గాని యర్థభావములు గలవి.

4. భగవద్గీత మేఘమువంటిది. మేఘమెట్లు చల్లదనము నిచ్చి తాపమును పోగొట్టునో అట్లే శ్రీ భగవద్గీతా మేఘము తాపత్రయములను పోగొట్టి చిత్తవిశ్రాంతి కలుగజేసి ఉదారముగా పరమార్థములను వర్షించును. మరియును ఆత్మలనెడు ధాన్యమును పండించి సత్తకలుగునట్లు చేయును.

5. శ్రీగీత చంద్రునివంటిది. పూర్ణచంద్రుడెట్లు ఆకాశమున 16 కళలతో గూడి ప్రకాశించుచున్నాడో అట్లే శ్రీగీత 18 కళలతో గూడి భూమండలమంతయు తన శీతలామృతకిరణములచే తడుపుచు అజ్ఞానులనెడు ఎండిపోయిన మానులను చిగిరింపజేసి జ్ఞానపుష్పములనెడు పుష్పములను పుష్పించి ఆనందదాయకంబై యున్నది. మరియు ధవళతరంబైయుండు వెన్నెలలు గాయుచు హృదయకమలమును పరిశుద్ధమగు కాంతియుతముగా జేయుచున్నది. మరియును చంద్రుడెట్లు చంద్రకాంతశిలలను కరిగించి తన యమృత కిరణముల స్పర్శచే ద్రవీభూతముగా జేయుచున్నాడో అట్లే శ్రీగీతా చంద్రుడును తన స్వచ్ఛభావార్థచంద్రికలచే భక్తుల హృదయములను కరిగించి భక్తిచే ద్రవీభూతమగునట్లు చేసి ముక్తునిగా జేయుచున్నది. సత్త్వగుణప్రయుక్తమగునట్లు మనస్సును సాత్త్విక

జ్ఞానముతో పరిశుద్ధముగా నుండునట్లు జేయుచున్నది.

6. శ్రీభగవద్గీత ఆత్మలకు అన్నమువలె పోషకమై తీర్థమువలె ధారకమై నెయ్యిపాలు పెరుగు పప్పువలె భోగ్యమై కాయకూరలు పండ్లవలె రుచికరమై ఆత్మలకు ఆరోగ్యవర్ధకమై బుద్ధికి జాడ్యము అంటనీయక బలమునిచ్చునదై మధుర ఫలరసములతో గూడిన రసాయనమువలె భక్తి రసమును పానముచేయించి మనస్సునకు సద్గుణ పుష్టి గలుగజేసి జ్ఞాన భక్తి వైరాగ్యము మొదలగు సాత్వికానుష్ఠానముచే అధికారులగునట్లు జేయును. శ్రీగీతాన్నభోజనము ఆత్మలను తృప్తిపరచును.

7. శ్రీభగవద్గీత గంగా ప్రవాహమువలె విస్తారమై పరమపావనమై జీవాత్మల కాలపక్వ దశలందు పూర్వజన్మ సంచితములను పాపకర్మలను పోగొట్టి వెంటవచ్చుచున్న ఆగామి సంచిత ప్రారబ్ధములను రూపుమాపుచేయ సమర్థమై పవిత్రమై ఒకసారి చదివినంత మాత్రముననే ఆత్మశుద్ధిచేసి నిర్మలునిగా జేయుచున్నది. ఇదియే గీతాగంగోదకము ఈగంగోదకమును త్రావిన వారికి మరలజన్మమెత్త వలసినది లేదు.

8. శ్రీగీత యరటిపండువలె మృదుపాకము గలిగి రుచికరముగా పలుకుటకు సుఖముగా నుండును అన్నిపండ్లయందును పారవేయవలసిన గింజలుగలవు. కదలీఫలములందు పారవేయదగిన గింజలులేవు అట్లే శ్రీగీతా కదళీఫలమందు త్యాజ్యమగునట్లుగాని కఠినముగాగాని ఏయర్థమున్ను లేదు.

9. శ్రీభగవద్గీత ద్రాక్షపండ్లవలె అర్థరసపుష్టిగల శ్లోకములు భావములు గలిగియున్నది. వినుటకు మధురమై చదువుటకు ఇంపుగలిగి నవరసపూరితమై యున్నది.

10. శ్రీభగవద్గీత పుష్పమువంటిది. ఈగీతా పుష్పము పరమాత్మస్వరూపమైన వేదకల్పవృక్షమునందు పుట్టినది. ఈకల్పవృక్షము ఉపనిషదర్థములనెడు శాఖలచే నలరారి శబ్దములనెడి ఆకుల నడుమ శ్లోకజ్ఞానభావములనెడు కొమ్మలచే వ్యాపించి విశేషజ్ఞానమనెడి చిగురుపెట్టి భక్తినిష్టలనెడి మొగ్గలుగా బయటికివచ్చి భగవత్కటాక్షమనెడు శీతలవాయుస్పర్శచే చక్కగా పుష్పించి ప్రపత్తియనెడు జ్ఞానపరిమళముతోగూడి శేషత్వపారతంత్ర్యజ్ఞానమనుమకరందసారముతో పూరితమై జ్ఞానులు, భక్తులు, ప్రపన్నులు అనెడు తుమ్మెదలకు దేహపోషణకు జీవనమై తన జ్ఞాన పరిమళవ్యాప్తిచే జగత్తంతయు స్వభావ సుగంధ సౌరభ మిళితంబుగా జేయుచు గీతాధ్యయన పరులకు సౌఖ్యదాయకమైన పుష్పరాజముగా నున్నది. ఇదియే గీతాకల్పపుష్పము.

11. శ్రీభగవద్గీత నందనవనమువంటిది. వనమునందు పుష్పవృక్షములును ఫలవృక్షములును తీగపందిరియలును పూపొదరిండ్లును తామర తటాకములును అట్టి తామరకొలనులందు తామరాకులు మొగ్గలు తామరపూవులు గలిగి మనోహరముగా నుండును. అట్టి తామరతటాకములందు హంసపక్షులు కొంగలు నీరుకోళ్ళు మొదలగు పక్షులు నిర్భయముగాను సుఖముగాను విహరించుచు కూయుచుండును. అట్టి తామర

పుష్పములందు తేనె నాస్వాదించుచు గండు తుమ్మెదలు తుమ్మెదలు మైమరచి గానము చేయుచుండును. ఫలవృక్షములందు సొగసైన చిలుకలు, కోకిలలు, నెమళ్ళు, పావురములు మొదలగు పలువిధములగు విహంగములు పంచ విధములగు చిత్రవర్ణములచే చిత్రించినట్లుండు రెక్కలు ముక్కులుగలిగి ఈశ్వరునిచే సృష్టింపబడిన నానావిధ అండజములు పాటల నాటలచే ఎగురుచు తిరుగుచుండును. అట్టి నందనవనమున తిరుగాడుచు విహరించు జనులకు నానందదాయకమైయుండును. అటులనే ఈగీతానందనవనము గూడ వేదవృక్షములు, శాస్త్రపత్రములు, సమన్వితార్థపుష్పములు (ప్రమాణార్థప్రమేయార్థఫలములుగలిగియున్నది. తటాకములవలె ప్రమేయ నిర్ణయార్థములతో నిండినదై నిరూపణశ్లోకములు సమృద్ధగాగలదు. ఈగీతావనమున సర్వకాలములందు విహరించుచు అర్థరస తటాకములందు సదామునిగి తేలి ఈదులాడుచు రసపానము చేయుచు పరమహంసలగు యతీశ్వరులు (బ్రహ్మానందానుభవము ననుభవింతురు. మరియు మునులు, ఋషులు, యోగులు, సిద్ధులు, అవధూతలును కర్మయోగులు, జ్ఞానయోగులు, భక్తియోగులు, ప్రపన్నులు (భక్తియోగులనగా ఆళ్వార్లు, ప్రపత్తినిష్ఠులనగా పూర్వాచార్యులు) మొదలగు పక్షులు ఈగీతావనము నాశ్రయించి నిత్యవాసము చేయుచు శ్రీ గీతాచార్యులను శరణాగతిపొంది కడతేరుచున్నారు. ఆదిగురు పరంపరలు మొదలు మన స్వాచార్యపర్యంతము గీతా చరమశ్లోకార్థమును చరమోపాయమునుగా నమ్మి తామనుష్ఠించి తమతమ శిష్యుల ననుష్ఠింపజేసి తాము జీవించి యితరులను జీవింపజేసి యిప్పటికిని ఆత్మోజ్జీవనము చేయుచునేయున్నారు పక్షులు, తుమ్మెదలు అనగా స్వాపదేశమునకు భక్తులు ప్రపన్నులు అని యర్థము తటాకములనగా భగవద్గుణానుభవ రసములతో నిండియుండు స్వరూప ప్రకాశకగ్రంథములు వీనినే గీతావనమందురు.

12. శ్రీ భగవద్గీత సింహమువంటిది. నాస్తికులకు పాషండ, బౌద్ధమతావలంబకులకు భయంకరమై భయము గొలుపుచున్నది. సింహమెట్లు గంభీరమగు నాకారము గలిగి తీక్ష్ణ రూక్షములు గలిగిన కన్నులతో కూడిన ముఖమున దంష్ట్రాకరాళములు గలిగినదై గర్జించుచుండునో అట్లే శ్రీగీతాసింహమున్ను బాహ్య కుదృష్టి వాదులను తన విభూతి విశ్వరూపములను జూపించి భయమును కలిగించుచు శ్లోకరూప గర్జనలను గర్జించుచున్నది.

మరియు సింహము పర్వత శిఖరములందుండు గుహలయందు వాసముచేయుచు ఏనుగులు మొదలగు పెద్ద పెద్ద జంతువులను అణగద్రొక్కి తనబలముతో నీల్చి చంపునో అట్లే శ్రీగీతాసింహముగూడ జ్ఞానులగు విద్వాంసుల హృదయ గుహలందును వాటి శిఖరములందును వాసము చేయుచు నాస్తిక అవైదిక బాహ్య కుదృష్టి మతములను తన వాక్యార్థములను గోళ్ళతో చీల్చి భావార్థములను కోరలతో గ్రుచ్చి యెత్తి విసరి పారవేయును (కోరలనగా శ్రుతి స్మృతులు దానిభావములు సామాన్యులకు గోచరించక వినుటకుగాని తలంచుటకుగాని ధైర్యము చాలక భీతినొంది కంపించునట్లు చేసి అహంకారపరు

శాస్త్రమువలె న్యాయములను తర్కశాస్త్రము వలె వాదోపవాద ప్రశ్నోత్తరములును మీమాంసాశాస్త్రమువలెస్పర్థలు సమాధానము లున్న జ్యోతిశ్శాస్త్రమువలె భూతభవిష్యద్వర్తమాన కాలములను కాలచక్ర విధములు యుగ ధర్మములు కాల యుగ పరిమితి సంఖ్యలు బ్రహ్మదుల దినసంఖ్యలు సంవత్సర యుగముల గణితములు బ్రహ్మదుల ఆయువుపరిణామములు గూడ గణించి వివరించి యున్నది.

19 వ్యాకరణ శాస్త్రమువలె శ్రీగీత ఛన్దోబద్ధమై ప్రాసలక్షణ పాద బద్ధాక్షర సంఖ్య నియమములు గల వృత్త భేదములతో గూడి యున్నది.

20 శ్రీగీతలు మంత్రశాస్త్రమువలె ప్రణవ మంత్రముయొక్క గొప్పదనము తెలుపుచున్నది ఇది అజ్ఞాన అశాపిశాచ గ్రస్తమైన వ్యాధిని బోగొట్టు మంత్ర రాజమై ఆత్మసంజీవనియై యున్నది.

ఇట్టి పరమోత్తరకమగు గీతామంత్రమును మనుజులగువారు తమతమ హృదయకోశములు నిర్మలములై జ్ఞానప్రకాశమై ఆత్మ పరమాత్మల సాక్షాత్కారములంది మోక్షము లభింపుట్కై సమస్తజనులును శ్రీభగవద్గీతలనుగురుముఖముగా తెలుసుకొని పలువిధములగు అభిప్రాయము గల వారై జ్ఞాన నిష్ఠలు గలిగి పలువిధములగు భాషలచే గీతాభాష్యము వ్రాసి జనులనుపకరించి నేటివరకు ఉపన్యాసములు చేయుచున్నారు యిదియే గీతామంత్రము.

---

## స్వస్వరూప వైశద్యదశ యనగా నేమి !

పరస్వరూప విషయమున స్వీకరింపవలసిన వాటినిగురించియు, త్యజించవలసిన వాటినిగురించియును జాగరూకతగలవాడుగానుండుట, అని శ్రీరామానుజులవారు సాయించిరి.

ఇతరసంగములను త్యజించి అటుపిమ్మట భగవంతుని ఆశ్రయించునది అని కూరత్తాళ్వాన్ సాయించిరి.

సర్వేశ్వరుని ఆశ్రయించి అటుపిమ్మట యితరసంగములను వదలుకొనునది యని ముదలి యాండాన్ సాయించిరి.

అజ్ఞానముపోయి జ్ఞానము కలవాడగుట యని ఆండాన్ సాయించుదురు.

## శ్రద్ధాంజలి

(శ్రీమాన్ ఈయుణ్ణి శేషాచార్యులుగారు)

శా. శ్రీరంజిల్లగ జన్మసంభవమహాయ - శ్రీవామరాచార్య ని
షారాకేందుముఖీపజేశ్వరులు వాచావాతకీమాధుకీ
సారస్ఫారత సుస్థిరించుచు మహస్సమ్మోదముంజూపి పెం
పారన్ వైష్ణవసంఘమున్ బ్రహ్మవిశిష్టాద్వైతులుప్పొంగగన్

ఉ. ఎందఱువైష్ణవోత్తములొ యెందఱుధర్మగుణానువర్తులో
యెందఱు పుణ్యవర్తనులొ-యెందఱు భూతదయావిలాసులో
యెందఱు సర్వమొప్పిచరి-యించెడిధన్యులొ వీరిజోదనల్
పొందుగ భక్తిశోభినుతి-పుణ్యము సద్గతిగాదె మాడగన్.

ఉ. ఎవ్వరిచేత భారతమ-హీసకలస్థానసమై చరించెనో
యెవ్వరిచేత పెంపుగని-యేక్రియద్రావెనొ దేశదేశమం
దవ్విజతాగ్రగణ్యుల మ-హత్తరకార్యములెల్ల భూసురుల్
నివ్వెఱపోవ చెల్విడని-నిర్మలచిత్తులువారి కింజలుల్

సీ. ఎవ్వాని మనమింక యిహలోక పరలోక
వాంఛల నసువుగా-వరలుచుండె
నెవ్వాని హోమంపు-వెల్లియెసకలలో
కములకు ద్రాణమైత్రాలుచుండె
సేవానిసద్గ్రంథం-బీరేడులోకాల
నగ్గల వ్యాప్తమై-యలరుచుండె
నెవ్వాని మతవాజి-మీదేశమున బూజ
నీయమై శోభతో-నెగడుచుండె

గీ. నెవనిఘనతను స్మరియించి-రెడదయందు
ననిశమాళ్వారులందఱు-నాశతోడ
నట్టిరామానుజార్యుల-హర్నిశముల
వరవిశిష్టసంఘముఁగాచి-పరగునాత

సీ. సంపూర్ణచంద్రుని-చాయల నిరసించు
మోమునఁజిఱునవ్వు-మొలకలెత్త
కమనీయ గాంభీర్య-కల్యాణయుతచర్య
వైభవోపేతమై-వరలుచుండ
బుస్తకరత్నాల-హస్తమ్ములధరించి
యజ్ఞానతిమిరంబు-నణచుచుండ
మార్గవాంఛితమగు మధురభాషణములు
కపటపండిత మతిఘ్నములుగాగ

గీ. సంగమంతంతకునుజాల-పొంగుచుండ
నొయ్యనొయ్యన పాదంబు-లుర్విమీఁద
నిడుచు సుయ్యారమలరగ-నడచివచ్చు
వైష్ణవోత్తములకెనాడు వందనంబు

## లోకరీతి

శ్రీమాన్ అరవిల్లి శోభనాద్రినరసింహాచార్యులుగారు

ఉ॥ భావనసేయరేమి? భగవంతుఁడెవండు?
మరెచ్చటుండు? యా
పావనమూర్తిరూపమేది? పొన్నదియెవ్వరు? దారయెవ్వరో?
యేవనమందునుండు? నట యెవ్వరుస్నేహితులంతశిష్యమే
హావుల సేవకుంచగిన ధన్యులెవ్వరు? భృత్యులెవ్వరో?

ఉ॥ ఎందుకుజన్మనిచ్చెమన కెందుకనీభువియందుసార్థకం
బందఁగలేని మూఢభవ బంధమునిఁజేసెనతండదేమి? సం
బంధమదేమివానికిని బద్ధులకున్ సమదృష్టిలేని, యీ
మందునిజేసెనేమి? ఘన మాయలవేమి? యటంచుదల్పరే

ఉ॥ శ్రీపతిదైవమంటపరి సేవకులే సురలందరంట శ్రీ
కాపురమాపరంపదము కానఁగమంగళరూపమంట, సం
తాపముదీర్చ శేషుడట తద్దయుపాన్పట, పాలసంద్రమం
దా పరమాత్ముఁడాడునట నారయ యోగులు
గొల్చుచుండినన్.

చ॥ కన క్షణభంగురంబయిన కాయమునిత్యమటంచుదల్చిగ
ర్జనలను జేసిస్వర్గమన సౌఖ్యముబొందెదమంచుదుఃఖమం
దనసుత నామరూపులయి నాశనమందఁగనేల కృష్ణునిన్
మననముజేసి మోక్షమును మందతజ్ఞానమునందు బొందరే.

గీ॥ "దుష్టచింతలునామది దోఁగనీక
కుజనస్నేహంబునెప్పుడు గోరనీక
సర్వవేళలహృదయంబు సరసిజాక్ష
నీదుస్మరణంబుసేయంగ నేరవు"మనరె.

---

## భక్తి "నివేదన" పత్రిక

సంవత్సర చందా రూ. 5—0—0 లు

మాత్రమే. వెంటనేచేరండి.

శ్రీమతే రామానుజాయ నమః

# ఆచార్య తిరుమేని వైభవము

[మరంగంటి రంగనాయకమ్మగారు కోరుకొండ]

తిరుక్కోట్టియూర్ నంబిగారు శ్రీరంగమున తిరునాళ్ళ మహోత్సవమును సేవించి తిరిగి వేంచేయుచుండగా నంబెరుమానారు వారిననువర్తించి స్వామీ! నాకు రక్షకమగు నొక శ్రీసూక్తిని సాయించి కృప చేయుడని ప్రార్థింపగా నానంబిగారు కొంచెమాలోచించి 'మాయాచార్యులగు శ్రీఆళవందారులు నీటిలోనిలిచి యఘమర్షణ మంత్రమును జపించునపుడు వారిపృష్ఠభాగము బోర్లించిన కాకువలె నుండును. నేనదియే రక్షించుటకు తగినదని నమ్మియుంటిని. మీరు నట్లే నమ్మి యుండుడ'ని సాయించిరి.

ఒకతరి యుడయవరులొక మూగభక్తునిపట్ల తమకుగల కృపాతిశయముచే నాతని నుజ్జీవింపచేయ నెంచి యాతనినొక యేకాంతస్థలమునకు గొంపోయి తనశరీరము నాతనికింజూపి యిదియే రక్షకమని నమ్మియుండుమని సంజ్ఞజేసిచూపిరి. దీనిని తలుపు రంధ్రమునుండి జూచిన కూరత్తాళ్వాను మూర్ఛిల్లి కొంతతడవునకు తెప్పిరిలి 'అయ్యో! నేనంత పాపిని! శాస్త్రము నధిగమించి మహాపాపినైతినే! ఏమియు నెఱుంగని మూగనై పుట్టిన నీపురుషార్థమును ఉడయవరులు కనికరించి నాకుగూడ ప్రసాదించి యుందురుగదా! హా! దైవమా! కూరత్తాళ్వానునై శాస్త్రములను విస్తారముగా జదివియుండుటచే గదా నాకు నాకులదైవము తమ దివ్యమంగళవిగ్రహమును దిక్కుగా నొసంగక ప్రవృత్తి నుపదేశించిరి' అని మిక్కిలి విలపించిరి.

ఇందుచే నాచార్యుల దివ్యమంగళవిగ్రహమే శిష్యునకు నిరతిశయపురుషార్థ సాధన మని పెద్దల విశ్వాసమని సిద్ధాంతీకరించబడుచున్నది.

# ప్రచార విభాగము



శ్రీమతే రామానుజాయ నమః

గుంటూరుజిల్లా తెనాలి తాలూకా శ్రీరంగపురం అగ్రహారం గ్రామంలో శ్రీవిశిష్టాద్వైత ప్రచారకసంఘకార్యదర్శిగారైన శ్రీఉ. వే. శ్రీమాన్ ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యస్వామి వేంచేసిన సందర్భములో శ్రీమోహనరంగనాయకస్వామివారి సన్నిధిలో శ్రీమాన్ గుదిమెళ్ళ తిరుమల రంగాచార్యులుగారి అధ్యక్షతన జరిగిన సభా సందర్భములో శ్రీస్వామివారు "మానవుని నిత్యజీవితంలో మతము యొక్క ఆవశ్యకత" అను శీర్షికను గురించి యుపన్యసించినారు.

ఆసందర్భములో ఈక్రింది కార్యవర్గముతో పై సంఘము యొక్క శాఖ స్థాపించబడినది.

ది 11-6-51

శ్రీ రంగపురము

అధ్యక్షులు:- శ్రీమాన్ గుదిమెళ్ళ తిరుమలచినవెంకటరంగాచార్యులు

కార్యదర్శి:- వేదాల సుందరరాజగోపాలాచార్యులు

సభ్యులు

1. గుదిమెళ్ళ తిరుమల వెంకటలక్ష్మణాచార్యులు
2. గుదిమెళ్ళ తిరుమల తాతాచార్యులు
3. వేదాల వెంకటప్పలాచార్యులు
4. పంచాంగం శ్రీమన్నారాయణాచార్యులు
5. సముద్రాల చూడాచార్యులు
6. ఉత్పల వెంకటనరసింహాచార్యులు
7. వేదాల తిరుమల రంగరామానుజాచార్యులు
8. మద్దూరి హనుమరెడ్డిగారు బి. ఎ.
9. తాళ్ళూరి బసవపున్నయ్యగారు, గ్రామమునసబు.

## శుక్రవారపు పూజలు

### అర్తమూరు

1 పెరడు మంగయ్యమ్మ
2 దాసరి సూర్యాకాంతం
3 చిర్ల బాపనమ్మ
1 కరిరి పత్రిమ్మ — ఏకాదశపూజ
2 చింతా సరయ్య — ,,

ఈపూజలు చాల వైభవముగను భజనలు తోటి కూడా జరుపబడెను.

సం. కార్యదర్శి,
చి. ఆదెమ్మ

### విజయవాడ

| | | |
|---|---|---|
| 4-5-51 | కె. ధనమ్మగారు | 0-14-0 |
| 11-5-51 | ,, ధనమ్మగారు | 1- 2-0 |
| 18-5-51 | ,, ధనమ్మగారు | 1- 2-0 |
| 25-5-51 | కూరపాటి గోదాదేవిగారింట్లో | 1- 5-0 |

పై విధముగా శుక్రవారోత్సవములు జయప్రదముగా జరిపించినారు.

కార్యదర్శి,
కె. ధనమ్మగారు

---

### సవరణ

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ పాలకొల్లు శాఖతాలూకు తమవద్ద నిల్వసొమ్ము రూ50-0-0 లును శ్రీ ఉ. వే. శ్రీమాన్ తిరుమల పురి హెళ్ళ వెంకట ధర్మాచార్యులుగారు ఇదివరలోనే ఆశాఖా కార్యదర్శులకు ఇచ్చివేసినామని తెలిపిరి.

## యతీంద్రస్తుతి

మొవ్వ దాశరధి సూరి, పూడివాడ.

కం. శ్రుతితతులకు సంగతమౌ
వితతార్థము దేటపరచి విశ్వమునెల్లన్.
జతురతఁ బ్రోచిన శ్రీమ
ద్యతిపతినాత్మం దలంతునతులితభక్తిన్.

శా. కాషాయాంబరధారివై మృదులవాక్య బ్రహ్మసిద్ధాంతమున్
ఘోషించె న్నిఖిలాగమస్మృతులనీలో జ్యోతులై మన్న ని
ర్దోషవ్యాసమతార్థ బోధపదపంక్తుల్ గావె యోచింపఁగా
భాషాయోషకునాంతరంబుఁగరగింపంగల్గెనిమ్మేదినిన్ 2.

ఉ. మౌనిలలామనీ జిలుఁగు మాటలయందలితత్త్వబీజముల్
మానవునేటికిన్ విబుధమానసపీఠులఁ దాండవంబు నీ
లోన వసించినట్టి యతిలోకదయాపహినాంధవృష్టిలో
స్నానములాడెఁబో నిఖిల జంతువితానముతోడ లోకముల్

మ. యతికంఠీరవ మాభవద్వచననిర్యత్తత్త్వగర్జాధ్వని
ప్రతతుల్ కర్ణపుటంబులంబడినధైర్యంబెల్లఁబోనాడి దు
ర్మతవాతాయువెల్ల ఘూర్ణిలెను నిర్బాధంబులైనట్టి నీ
వచురామ్నాయవచోవిచారములకాచంద్రార్క మాయుష్యమౌ

ఉ. మానితయోగిచంద్ర, యసమానకృపాధరిబాత్మ నీవు బ్ర
హ్మానుభవైక సౌగపదమందఱు నెక్కరచించినట్టి సో
పాన పరంపరల్ దెలియనిచ్చెను గన్నులువిచ్చువారికిన్
గానఁగరావు పూర్వభవకర్మకళంకిత నేత్రదృష్టికిన్ 5

శా. లోకంబెల్ల తమోభిభూతమయినన్ లోకేశునాజ్ఞప్తి నీ
లోకంబందుదయించి నాల్గుదిశలాలోకంబుచేసెంచి నీ
రాకల్ సార్థమలైనతోడ జగమారాటింపఁగాఁగ్రుఁకితే
మోకారుణ్య విసార్ధ్రభావయతిభానూనీతనంతాంబలుల్. 6



# సంభావనలు  కట్నములు

గుంటూరుజిల్లా తెనాలి తాలూకా శ్రీరంగపురం అగ్రహారంలో జరిగిన సభాసందర్భమున యుపన్యాసానంతరం ఈ భక్తుల సమక్షములో శ్రీవిశిష్టాద్వైత ప్రచారకసంఘవ్యాప్తినిమిత్తం శ్రీఉ. వే. శ్రీమాన్ గుదిమెళ్ళ తిరుమల చినవెంకటరంగాచార్యులుగారు రు 116-0-0లు భక్తితో సమర్పించినారు. గాన వీరికి శ్రియఃపతి ఆయురారోగ్య ఐశ్వర్యము లిచ్చి రక్షించుగాక.

మరియు

శ్రీవైష్ణవ యువజన సంఘంవారు రు 116--0--0 లు సమర్పించినారు. వీరికి శ్రియఃపతి ఆయురారోగ్య ఐశ్వర్యములిచ్చి రక్షించుగాక.

## శ్రీరామతీర్థం

శ్రీమాన్ తి. వ. రామానుజస్వామిగారి జ్యేష్ఠకుమారుని భార్య నూతన గృహప్రవేశ సమయమున (అనగా 13-6-51 తేదీ శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘమునకు రు 2-0-0లు సమర్పించినారు. వీరికి శ్రియఃపతి ఆయురారోగ్య ఐశ్వర్యముల నిచ్చి రక్షించుగాక.

## కాకినాడ

కాకినాడ జగన్నాథపురం కా॥ శ్రీ ఉ. వే. శ్రీమాన్ ఫణిహారం తిరువెంకళాచార్యులుగారు తమ జ్యేష్ఠ కుమార్తె వివాహ సందర్భములో శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘమునకు సమర్పించినది కట్నం రూ 10-0-0 లు వీరికి శ్రియఃపతి ఆయురారోగ్య ఐశ్వర్యముల నిచ్చి రక్షించుగాక.

## గద్దనాపల్లి

గద్దనాపల్లి కాపురస్థులు శ్రీ ఉ. వే. శ్రీమాన్ వేదపండితులైన, గుదిమెళ్ళ వెంకటనరసింహాచార్యులుగారు తమ జ్యేష్ఠ పుత్రుని వివాహ సందర్భమున శ్రీ. వి. ప్ర. సంఘమునకు కట్నంగా రూ 2-0-0లు సమర్పించినారు. వీరికి శ్రియఃపతి ఆయురారోగ్య ఐశ్వర్యముల నిచ్చి రక్షించుగాక.

## రాజమండ్రి

టి. కె. రామానుజాచార్యులుగారి జ్యేష్ఠ కుమారుని ఉపనయన సందర్భమున 14-6-51 తేదీ శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘమునకు కట్నంగా రు 2-0-0లు సమర్పించినారు వీరికి శ్రియఃపతి ఆయురారోగ్య ఐశ్వర్యములు నిచ్చి రక్షించుగాక.

శ్రీమతే రామానుజాయనమః

# శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ

## జ్యేష్ఠమాస పండిత సభలు

రేపల్లెతాలూకా ముక్తిపల్లి అగ్రహారంలో శ్రీమాన్ కీ. శే. పండిత గుదిమెళ్ళ తిరుమల వెంకటరంగాచార్యస్వామివారి జయంతీ సందర్భమున జరిగిన శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ జ్యేష్ఠమాస సభలు శ్రీమాన్ న్యాయశిరోమణి వేదాల తిరువేంగళాచార్యస్వామి వారి అధ్యక్షతక్రింద 3 దినములు వైభవోపేతముగా జరిగినవి. ఆసంసర్భములో శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ కార్యదర్శి అ. చి. శ్రీమన్నారాయణాచార్య స్వామివారు తమ మృదుమధుర శైలిలో భగవద్గీతోపన్యాసములు గావించి అశేషజనములను ఆనందపరచిరి. వారి సమక్షములో అధ్యక్షుల వారిని అర్థనూటపదహార్లతో సత్కరించిన పిమ్మట ఈదిగువవారితో ఉపసంఘము ఏర్పాటు గావింపబడెను.

అధ్యక్షులు.

శ్రీమాన్ తిరుమల గుదిమెళ్ళ అంతర్వేది నృసింహాచార్యులుగారు.

ఉపాధ్యక్షులు.

శ్రీమాన్ కాండూరు నరసింహాచార్యులుగారు.

శ్రీమాన్ గుదిమెళ్ళ చిన్నరంగాచార్యులుగారు

కార్యదర్శి.

శ్రీమాన్ కవిరత్న గుదిమెళ్ళ రామానుజాచార్యులుగారు.

---

పశ్చిమగోదావరి జిల్లాలో పాలకొల్లు గ్రామమున ది 6-5-1951 తేదీని శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ స్త్రీ విభాగమునకు చెందిన శ్రీయతిరాజసేవా మహిళా మండలి శాఖ ఏర్పాటు చేయబడినది.

అధ్యక్షురాలు:- శ్రీమతి సలాది ఆండాళమ్మగారు

ఉపాధ్యక్షురాలు:- ,, చెన్నా తాయారమ్మగారు

కార్యదర్శిణులు:- కనుమూరిరంగనాయకమ్మగారు

,, దూళిపాటి శేషమ్మగారు

కార్యదర్శిణి:- తుమ్మలపల్లి సుభద్రమ్మగారు

కార్యకారిణీసభ్యురాండ్రు

శ్రీమతి మాచెపల్లి రత్నమాణిక్యముగారు
,, రేపాక కనకమ్మగారు
,, రేపాక సీతారత్నముగారు
,, రేపాక మంగరాజుగారు
,, రేపాక మంగరాజుగారు
,, రేపాక సీతామహాలక్ష్మిగారు
,, రేపాక నవరాజుగారు
,, బంగారు సుందరమ్మగారు
,, బంగారు సత్యవతిగారు
,, కంతేటి రంగనాయకమ్మగారు
,, బొండాడయతిరాజవల్లి తాయారమ్మగారు

    

శ్రీమతే రామానుజాయ నమః


భక్తి

# నివేదన

వేదాంత మాస పత్రిక

| సంపుటి 3 | ఖర_శ్రావణమాసము | సంచిక ౫ |
| --- | --- | --- |


## నేనెవడను ?

కోఽహ మిత్యత్ర నిపుణో భూత్వా చిన్తయ

పార్థివ !


శ్రీ ఉ. వే. శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులుగారు


(ఓ సౌవీరమహారాజా ! "నేనెవ్వడను" అను విషయమును గూర్చి నేర్పరివై విచారించుము)

విష్ణు. పు. ద్వి. అం. ౧౩_అధ్యా. ౧౦౩-శ్లో.

ఆధ్యాత్మిక సౌధమునకు శరీరాత్మ వివేకము ప్రథమసోపానము. ఇది లేకుండుట దుఃఖ హేతువు. ఈ వివేకము లేకయే యర్జును డట్లు విలపించెను. కావుననే శ్రీకృష్ణుడు-

అశోచ్యా నన్వశోచ స్త్వం ।
ప్రజ్ఞావాదాంశ్చ భాషసే ।
గతాసూ నగతాసూంశ్చ ।
నానుశోచన్తి పణ్డితాః ॥

పామరులట్లు దుఃఖించతగని భీష్మాదులను గూర్చి దుఃఖించితివి. శరీరాత్మవివేకము గల ప్రాజ్ఞులట్లు దేహాన్తరానుభవముల నుగ్గడించు చున్నావు. దేహాత్మవివేకజ్ఞానముకలవారు దేహములను గూర్చిగాని యాత్మలగూర్చిగాని విలపించరు) అని యాక్షేపించెను.

ఈ యాక్షేపణను హృదయమున నిడుకొనియే తనకాజ్ఞానమున్నగాని తరించుట దుష్కరమని నిశ్చయించుకొని యర్జునుడు శ్రీకృష్ణుని శరీరాత్మస్వరూపములను గూర్చియు శుద్ధాత్మస్వరూప తత్ప్రాప్తి సాధనములను గూర్చియు ప్రశ్నించెను. శ్రీకృష్ణు డాప్రశ్నలకు విపులముగా సమాధానమొసంగి "క్షేత్రక్షేత్రజ్ఞయోర్జ్ఞానం యత్తద్జ్ఞానం మతం మమ" అని దేహాత్మ వివేకజ్ఞానము తనకిష్టమైనదని ప్రశంసించెను.

ఆత్మకు ప్రాకృతిక దేహసంబంధ మొక మొండివ్యాధి. అది సకలానర్థమూలకందము. రోగనిదానమెరుంగుట దాని చికిత్స కెట్లు అవసరమో యట్లే దేహస్వరూపము నెఱుంగుటయు నవసరమని భట్టరు శ్రీరంగరాజస్తవము నందు

ఉత్తరశతకప్రారంభమున "అచిదవిశేషితాన్" అనెడు శ్లోకమున శరీర నిర్మాణమును వర్ణించిరి.

ఈశరీరాత్మవివేకమే లేనిచో చార్వాక చక్రమునబడి యడుగంటవలసినదే. చూడుడు చార్వాక ప్రబోధవిధానము-

యస్నాస్త్యేవ తపస్వి వస్త్విత్యతి ।
మృషా జల్పద్భి ర్దేవాస్తికైః ।
వాచాలై ర్బహుభి శ్చ సత్యవచసో ।
నింద్యాః కృతా నాస్తికాః ।
హంహో! పశ్యత తత్వతో యది ।
పున శ్చిన్నాద్ దితో వర్ష్మణః ।
దృష్టః కిం పరిణామరూపితచితేః ।
జీవః పృథ క్కైరపి ॥

(అస్తికులమని విర్రవీగుట లేనిదాని నున్నదని యసత్యముగ వాదించు పెక్కుమంది వదరుబోతులచే సత్యభాషణ పారీణులగు నాస్తికులెట్లు నిందింపబడుచున్నారో గాంచుడు. నిజముగ నీశరీరమును నరికినచో నందు భూత సంఘాత సునిష్పన్నమగు జ్ఞానముకంటె వేరగు జీవుడనెడు వాడెవ్వనిచేతనైనను చూడబడెనా?) అనిసాటుచున్నారు. వీరి సిద్ధాంత తత్వమిది.

కుడ్యేకు వేత్తి చ దేహ ఏవ
స మహాభూతాని, తేష్వేవ ధీః
కిణ్వాదా మదశక్తివత్,
క్రతుఫలం భోక్తా న కో౽పి స్థిరః.
దగ్ధః కిం పున రభ్యుపైతి,
నియమో న క్వాపి, జీవే త్సుఖం
యావజ్జీవతి, దైవతం
నరపతి ర్న్యాయో బలం కేవలమ్.

(అనుభవించునదియు నెఱుంగునదియు దేహమే భూతచతుష్టయ సంఘాతమే యీదేహము. మాదక ద్రవ్యములగు గంజాయి మొదలగు పదార్థములయందు కొన్ని యితర పదార్థములు మేళనచే మత్తును బుట్టించుశక్తి యుత్పన్నమగునట్లు యీ సంఘాతమునందును జ్ఞాన ముదయించును. శరీరవియోగానంతరము యజ్ఞయాగాది ఫలముల ననుభవించుటకు స్థిరమగు భోక్త యొకడు లేడు. అవియన్నియు బ్రాహ్మణుల బ్రతుకు తెరువున కేర్పడిన బూటక తంతులేగాని వాస్తవములుగావు. కాలిచో కాలి భస్మమైన వాడెట్లు తిరిగియాఫలానుభవమునకు సిద్ధపడును? స్నానసంధ్యావ్రతోపవాసాదినియమములునున్న బ్రతికి యున్నంతవరకు సుఖముగ బ్రతుకవలసినదే. రాజుకంటె దేవుడెవడు? న్యాయముకంటె బలమేది?

ఇంతకు మించిన తత్వములేదు.) అనిచార్వాకులందురు ఈవిషయము తలకెక్కనచో నిక నేమణి మంత్రింతౌషధులకును బ్రతుకుటకల్ల కావున ముందుగనే జాగ్రత్తపడి శరీరాత్మవివేకము నార్జించవలెను.

ప్రజాపతి, ఇంద్రవిరోచనులకీ వ్యాధి కుదురువరకెంత యనువర్తించినను పరమార్థము నుపదేశించనేలేదు. విరోచనుడా వ్యాధితో నేమ్రగ్గెను. ఇంద్రుడు మాత్రమది కుదుర్చుకొని సదుపదేశమును బడసి యుజ్జీవించెను.

కావున మన శరీరాత్మ వివేకము నార్జించి తరించుట ప్రధాన కర్తవ్యముగాన "నేనెవడను" విషయమును సావధానముగ పరికించవలెను. ఇదియే గీత రెండవయధ్యాయ ప్రధాన ప్రమేయము.

యం యం వా ఉపిస్మరన్ భావం।
త్యజత్యన్తే కళేబరం।
తం తమే వైతి కౌన్తేయ।
సదా తద్భావభావితః॥

చివరకాలమున నేయే యాకారమును తలంచుచు శరీరమును విడుచునో చిరంతరభావనా భావితమగు నాయాకారములనే తిరిగి జన్మలో లభించును (గీతా. 8 అధ్యా. శ్లో)

ఈ శ్లోకమునకు లక్ష్యభూతుఁడగు జడభరతుని చరితమే మనసు స్పష్టముగ శరీరాత్మ వివేకమును గావించును "సేనవ్వాడ" నను సందేహము దీర్చునుగాన నాచరితమును సంగ్రహముగ నెరుంగుదము.

## —♦ జడభరత చరితము ♦—

ఈతడొక మహారాజు. పూర్వము ప్రాయశః రాజులందరును "వార్ధకే మునివృత్తీనా" మ్మను నట్లు ముసలితనము పైబడగనే యిదివరకే తమపైబడియున్న రాజ్యభారమును పుత్రులకప్పగించి యరణ్యములకేగి తమ మనమును విషయప్రవణము గానీయక భగవత్ప్రవణ మొనరింతురు. అట్టివాడొకడీ జడభరతుఁడు ఈతఁడీయవస్థలో సాలగ్రామక్షేత్రము నాశ్రయించి యోగము నభ్యసించుచుండెను, ఇతఁడు విష్ణుభక్తులలో సాటిలేనిమేటి యనుట నిర్వివాదము. తనసర్వాంగములను భగవత్కైంకర్యమునం దన్వయింపజేసినజెట్టి.

ఈతఁడొకనాడు స్నానసంధ్యాద్యనుష్ఠానార్థమై సమీపతరవర్తియగు నొక మహానదికేగెను తన యనుష్ఠానమును ముగించుకొని యీతఁడు తన యాశ్రమోన్ముఖుఁడగుతరి యచ్చటికి నిండుచూడితోనున్న లేడియొకటి నీరుద్రావుటకై యేతెంచి త్రాగుచుండగనే సింహమొకటి సర్వప్రాణిభయంకరముగ గర్జించెను. దానిని విని యాలేడి భయభ్రాంతమై తటాలున నొడ్డున కెగురుటకై గర్భమునిర్భిన్నమై పాపమాలేడి చనిపోయెను. గాని దానిచిన్నబిడ్డ యానదీప్రవాహమున బడెను. ప్రారబ్ధప్రేరితుఁడై యాభరతుఁ డాపిల్లను బట్టుకొని తన యాశ్రమము జేరి పుత్రనిర్విశేషముగా నాలేడిపిల్ల నల్లారు ముద్దుగా పెంచుచుండెను. అది చెంతలేని క్షణమాత్రని కొక యుగమై గడచుచుండెను. చివరకీతనికి మరణ మాసన్నమయ్యెను. ఆలేడిపిల్ల భవిష్యత్తును గూర్చి చింతతప్ప యీతనికి వేరొకచింత లేకుండెను. అట్లామృగపోత చింతతో నాప్రాజ్ఞుఁడు ప్రాణములవీడెను.

జంబూమార్గమనెడు గంగాతీర్థ విశేషమందొక యరణ్యమున పూర్వజన్మ జ్ఞానముతో లేడియై పుట్టెను. వెంటనే తల్లిని విడిచి సాలగ్రామ క్షేత్రమున కేతెంచి ఆజన్మ మచ్చట సురక్షితముగా గడపి ప్రారబ్ధావసానమున నాశరీరమును వీడి పూర్వజన్మ జ్ఞానముతో నొక సదాచార సంపన్నులగు పరిశుద్ధయోగుల కులమున బ్రాహ్మణుడై జన్మించెను.

సహజముగ సర్వవిజ్ఞాన సంపన్నుఁడును సర్వశాస్త్రార్థ తత్వవేత్తయునగు నాతఁడుప నీతుఁ డయ్యెను వేదమును చదువక కర్మల నాచరించక జడ సంభాషణ గావించుచు జీవించుటకు మాత్రము లభించిన దానిని దినుచు జీవితమును గడుపుచుండెను. అట్టియ్యాదృఢగాత్రుఁడై సోదరులచే కృషి కర్మయందు నియుక్తుఁడై యుండెను.

సౌవీరరాజు చెంతనుండు శత్రుయాతనిని కాళికి బలివేయవలెనని యెంచి తుదకా కాళిచేతనే వధింపబడెను.

ఇట్లుండ నొకనాడు సౌవీరరాజు పల్లకినెక్కి పయనించుచుండ నాతని భటులీ భరతుని పల్లకి మోతకు నియోగించిరి. మానావమాన సమదర్శియగు నీ యోగిపుంగవుడందుల కియ్యకొని నడచుచుండెను. అసమాన స్కంధులపొందు కుదురక నాపల్లకి కుదుపజొచ్చెను. రాజునౌకరుల గద్దింప నానేరమీ భరతునిపై మోపబడెను.

అంతట నారాజునకు భరతునకు నీక్రింది సంభాషణ ప్రారంభమయ్యెను. (రాజు శరీరాత్మ భ్రాంతితోను భరతుడు శరీరాత్మ విజ్ఞానము తోను మాట్లాడుదురు.)

రాజు:- ఏమిరా! తింటిపోతా! ఈపాటి దూరముననే యలసిపోతివా? ఇంత బలిసి యున్నావే యీపాటి శ్రమనే యోర్వజాలవా?

భర:- నేను బలిసియూలేను, నీపల్లకికి మోయుటయూలేదు. ఇకనాకు శ్రమయేల? ఆయాస మెందులకు?

రాజు:- ఏమి! విపరీతముగా మాట్లాడు చున్నావే! ప్రత్యక్షముగా బలిసి కాన్పించు చున్నావు. ఇచ్చటకింకను పల్లకిని మోయుచునే యున్నావు. బరువుమోయువాడు శ్రమచెం దుట లోకరివాజుగదా!

భర:- నీవు ప్రత్యక్షముగా జూచుచున్న దేదో ముందుగా జెప్పుము (కంటికగబడని యాత్మను చూచుట యెట్లు?) బలాబలముల మాటపిమ్మట విచారింతము. (విశేష్యమగుధర్మి (ఆత్మ) యే గోచరించనపుడు దాని విశేషణము లగు బలము దుర్బలము మొదలగునవి గోచరించుట సుతరాంకల్ల యే)

నీవు నాపల్లకి నిప్పటికిని మోయుచునే యున్నావనియు, ఇప్పటికిని యది నీభుజముపైన జూడ బడుచునే యున్నదనియు నంటివే యారెండును శుద్ధకల్ల. అదియెట్లో వినుము పాద యుగ్మము భూమిపై నున్నది. ఆపాదములపై పిక్కలున్నవి. వాటిపై తొడలున్నవి. వాటి నాధారముగా జేసుకొని కడుపున్నది. దాని నాశ్రయించి రొమ్ము భుజములు బాహువులు కలవు. ఆ భుజములపై పల్లకీ దండియున్నది. ఇట్లుండ నాకెట్లు భారముండును. ('నేను' అనునది వీటికంటె వేరగు ఆత్మగాన దానికి భార మెట్లుండును? కావున 'నేను' మోయుటలేదని భావము)

నీవుమోయబడు చున్నావనుటయు నసత్యమే (నీవు అనగా రాజశరీరాంతర్గమగు నాత్మని భావము) ఏలననగా-పల్లకియందున్నది నీవుకాదు నిన్నాత్మగా కలిగియుండి భ్రాంతిచే తానాత్మగా గోచరించు దేహమే. ఆదేహమందు నీవున్నావు ఈదేహమునందు నేనున్నాను. ఇట్లున్నను నేను మోయుచున్నాను నీవు మోయబడుచున్నావను కొనుట అయదార్థము.

రాజు:- నేను నీచే మోయబడకున్నచో మరి యెవ్వరిచే మోయబడుచున్నాను?

భర:- అట్లనుగుము. నీవు, నేను, ఇతరులు, అందరమును దేహముగా మారిన పృథివ్యాది భూతములచే మోయబడుచున్నాము.

రాజు:- అచేతనములగు నాభూతములకీ గమనాది వ్యాపారము లెట్లు సిద్ధించును?

భర:- నీరు, గాలి మొదలగు వాటిచే గడ్డి దూది మొదలగు పదార్థములవలెను, దుర్బలుడు పెంకి గుఱ్ఱములచే వలెను సత్త్వరజస్తమోగుణ పరిణామరూపమైన తీవ్రప్రవాహముచే యీ భూతములు తమతమ పనుల గావించుచున్నవి. అనగా నంతఃకరణపర్యంతమగు నీభూతసంఘాతమును వాటి యందున్న గుణములు నడుచుట కూర్చొనుట కోరుట కలహించుట మొదలగు పెక్కువిధముల ప్రవర్తింప జేయుచుండును.

రాజు:- గుణములట్లు తాము ప్రవర్తించి తదనుగుణముగా వీటిని ప్రవర్తింపజేయుట కేమి కారణము?

భర:- సత్త్వరజస్తమో గుణములు ప్రాచీన కర్మమున నట్లు ప్రవర్తించును.

రాజు:- ఆకర్మకు నిదానమేమి?

భర:- అవిద్యయే.

రాజు:- అవిద్యయనగానేమి?

భర:- ఇదిగో యిప్పుడు నీకు వర్తించునదియే. ఆత్మగానట్టి దేవాదిదేహములను ఆత్మయని తలంచుటయే.

రాజు:- అది సాధారణముగా నెట్టి వారికుండును?

భర:- అది బ్రహ్మాది పిపీలికాపర్యంతము సకల ప్రాణులకు నుండును. కావున నాత్మ కాన్పించుటయు మోయుటయు నసంగతములు. ఇక బలసి యుండుటయు నిట్టిదియే వాస్తవముగ నాత్మకు కర్శలు లేవు. రక్తమాంసాది సంస్పర్శ దానికిలేదు, అది నశించదు. శోకమోహజరామరణ క్షుత్పిపాసలు దానిని బాధింపజాలవు. సత్త్వరజస్తమో గుణములు దానికి లేనేలేవు. అందులకు కారణమది ప్రకృతికంటె వేరైనదగుటయే. కావుననే దానికి పెరుగుట తరుగుట లేదు కొన్ని పదార్థములు కలిసి యేర్పడిన శరీరాదులకే వృద్ధిక్షయములు గాని అట్లు సంఘాతరూపములు కాని యాత్మకు ఆకాశపరమాణ్వాదులకు వలెనవి యుండవు.

భుజమునందుండు భార మాభుజముకన్నను వేరగు నాయందుండు నందువేని యది నీ యందేల యుండరాదు? సకలాత్మలయందేలయుండరాదు? ఇట్లన్ని భారము లాదరకుండవలయుననెడి వాహ్యాతి ప్రసంగము వాహకాతి ప్రసంగము సిద్ధించకుండునా?

ఈకారణములచే నేను నీభారవాహకుడను గాకుండుటచే నాకాశ్రమము లేదని వేరుగా చెప్పవలెనా?

పార్థివములగు కాష్ఠాదులయందు మమకారమెట్లు నింద్యమో యట్లే దేహములును పార్థివములే గాన వాటియందలి మమకారమున్ను నట్టిదేయగును. ఇంక నహంకారముమాట చెప్పనేల? భూతసంఘాతమగు దేహమునందలి మమకారము (ఇది నా దేహమనుకొనుట) ఆరోపితమేగాని స్వతస్సిద్ధము కాదు.

అని చెప్పి భరతుడూరకుండి పూర్వమువలెనే పల్లకిని మోయుచునే యుండెను. అంత నారాజాతని విజ్ఞానమున కచ్చెరువొంది యీతడు సామాన్య మానవుడు కాడని గ్రహించి యిట్టివానిచే తన పల్లకిని మోయించుకొనుటయే గాక తానాతనిని గద్దించినందుకు సిగ్గును భయమును ఆశ్చర్యమును ముప్పిరిగొన తటాలున పల్లకినుండి భూమిపై నురికి యాతని పాదపద్మములను గట్టిగబట్టి

రాజు;- మహాత్మా! నన్ను మన్నించి పల్లకిని వీడుడు. నాయందనుగ్రహముంచి నన్ను క్షమింపుడు. ఇట్లు మూఢునివలెనిది కాన్పించు తమ జాతికి చెందినవారో తమకులమేదియో, తమరేమి గోరి యిట్లు విచ్చేసిరో వచ్చుటకు కారణమేదియో యిదియంతయు సవిస్తరముగా జెప్పుడు.

భర:- రాజా! జాతికులాదు లాత్మధర్మములు గావు. అవి శరీరధర్మములు. కావున (జాతి కులాది గర్భితమగు) నీవెవ్వరని ప్రశ్నించుటయు నేనిట్టివాడనని ప్రాక్కుచ్చుటయు నసంగతములు

ఇక యెందు నిమిత్తమై వచ్చితివని యడిగితివి. వినుము. పుణ్యాపాపముల వలన సుఖదుఃఖాది భోగములుద్భవిల్లుచుండును. అవి నిర్దిష్టమగు నొక దేశమునందు నిర్దిష్టమగు నొక దేహమునందు మాత్రమే యనుభవించదగియుండును. కావున జీవుడు వాటి ననుభవించుటకే దేహాంతరమును దేశాంతరమును పర్యటించుచుండును. అట్లే నేనును యీదేహమున ప్రవేశించితిని?

ఇక కారణము నారయదలంచుచున్నావా? అదియు వినుము. ప్రతిప్రాణికిని ప్రతిజన్మకును సుఖదుఃఖ తత్సాధనాదులతో ధర్మాధర్మములే కారణము. ఇక ప్రత్యేకించి నారాకకు కారణము నేల ప్రశ్నింతువు?

రాజు:- స్వామీ! స్వకారణనిమిత్త ప్రశ్నలకుత్తరములు సంతృప్తికరముగనే యున్నవి గాని నీవెవ్వరవని ప్రశ్నించుటయు నేనిట్టి వాడనని వాక్రుచ్చుటయు నసంగతములంటిరే? అది యెట్లు? ఆత్మ కర్తగాను భోక్తగాను సహాసుఖరించుచునే యున్నదిగదా! అట్టితరి నేను ఫలాన యని యేలజెప్పరాదు? 'అహం'శబ్దమున కర్థమే లేదా? తదర్థమగు నాత్మకు ధర్మములు లేవా? అవి లేనిచో గదా చెప్పబడజాలకుండుట? ఇంతకు ముందే ఆత్మ నశించినది. శోకమోహాదులు లేనిది. అని యేయోగానికి కొన్ని ధర్మములు జెప్పితిరి గదా! కావున నీవెట్టివాడవని ప్రశ్నించుటయు నేనిట్టివాడనని జెప్పుటయు ననుపన్నములు కావని తలంతును. శరీరము నునేననుట పొసగదు గాని ఆత్మను నేననుట కేమిలోటు?

భర:- నిజమే! ఆత్మను నేననుటలో తప్పిమియును లేదు. ఆత్మ ప్రత్యక్కు, అనగా తనను తానే ప్రకాశించునది. అట్లు భాసించునది ఆత్మయే గాని దేహముకాదు. కావున దానిని నేనని చెప్పవచ్చును. కాని జాత్యాది ధర్మగర్భితములగు నీవెవ్వడవని యడుగుటయు నేనిట్టి వాడనని చెప్పుటయు మాత్రముతగదు. ఆత్మకు శుద్ధ్యాది విశేషణములున్నను జాత్యాది ధర్మములు లేవు. కావున దేహముకన్న వేరగునాత్మ యున్నదని యంగీకరించు పక్షమున పైవిధమగు ప్రశ్నోత్తరము లసంగతములగును.

రాజు:- అట్లగుచో నాత్మ శరీరము కంటె వేరెట్లగునో నెలవిండు.

భర:- రాజా! నేననునదేది? నాలుకయా? దంతములా? పెదవులా? తాలువులా? లేక యుచ్చారశబ్దోత్పత్తిస్థానములా? అవియన్నియు ననేకములు. ఆత్మ యొక్కటియే. కావున నవి యాత్మ కాజాలవు. మరియు నచేతనములగు నాలుక మొదలగునవి శబ్దములు పుట్టుటకు సాధనము గాని కర్తలు గానేరవు. కర్త, చేతనమగు

నాత్మయే, ఇట్లే నేను తాగుచున్నాను. నేను స్మరించుచున్నాను మొదలగు యనుభవములకు సాధనమగు బాహ్యకరణములున్ను అంతరకరణములున్ను ఆత్మలు కాజాలవు.

రాజు:- వాగింద్రియమే జిహ్వాది సాధనములచే స్వాతంత్ర్యముగా 'నేననుచున్నదనినచో నది యాత్మ కానచ్చునా?

భర:- నీము వాక్కు-గూడ సాధనమే గాని దానికి స్వాతంత్ర్యము లేదు. అదియాత్మయన్నను దానికి స్థౌల్యమేది? అప్పుడు నీవు బలిసితివనుట యెట్లు?

అదియునుగాక "నావాక్కు-ని" నేననుదానికంటె వాక్కు-వేరుగా ననుసంధింప బడుచున్నది గదా! యాత్మ యెట్లగును?

రాజు:- పోనిండు ఇట్టి జిహ్వాదుల కాధారమైన శిరస్సునుగాని కాళ్ళు చేతులు మొదలైనవాటిని గాని తత్సముదాయమగు దేహమును గాని యాత్మయన్నచో?

భర:- జాగరావస్థలో నాతల నాచేతులు నా కాళ్లు అని నేననుదానికంటె వేరుగా యనుసంధింపబడుటవల్లను, స్వప్నావస్థలో ఆత్మ ప్రకాశించు చున్నను దేహమన్యథా భాషించుటచేతను సుషుప్త్యవస్థలో నాత్మ భాషించుచున్నను దేహము భాషింపక పోవుటచేతను "స్వర్గకామో యజేత" యనెడు శ్రుతివాక్యముచే శరీరముకంటె వేరగు నాత్మకలదని సుస్పష్టముగా సూచింపబడుట విపరీతమగుటచేతను దేహేంద్రియాదులాత్మలు కాజాలవుగాన రాజా! ఇక నేనని చెప్పబడునదేది?

"స్వర్గకామోయజేత" యను శ్రుతి జ్యోతిష్టోమము చేసిన వానికి శరీరవిమోచనానంతరము స్వర్గము వచ్చునని చెప్పుచున్నది. దీనిచే శరీరముకంటెవేరగు నాత్మకలదని స్పష్టమగుచున్నదిగదా! శరీరమే యాత్మయనిన యీ శ్రుతి కోపింపదా?

ఇట్లు దేహేంద్రియాదు లాత్మ కాజాలవు. గాన వాటిలో దేనిని నేనందును?

నాకంటె వేరై నాయాకారమగు జ్ఞానాకారముకంటె వేరైన యాకారము కలిగి యొకయాత్మయున్నచో, నప్పుడు నేనే యాకారము కలవాడును యీయాత్మ వేరొక యాకారము కలదియని చెప్పవచ్చును. అట్లున్నదామరి ఆత్మలన్నియు నొకే జ్ఞానాకారముతో సమమై యున్నవి, జాతికులాదు లాత్మధర్మములు కానే కావు.

రాజు:- ఒకే యాకారము కలిగి యున్నంత మాత్రమున ఒకే వస్తువుగా జెప్పవచ్చునా?

భర:- "వకో వ్రీహి స్సునిష్పన్న స్సుపుష్టాః కురుతే ప్రజాః" (ఒకే ధాన్యము బాగుగా పండినది. ప్రజలను బాగుగ పోషించును) అను ముఖ్య ప్రయోగముండుటచే నిచ్చటను ప్రకారైక్యమును పురస్కరించుకొని యేకత్వ వ్యవహారము సమంజసమే యగును.

ఆత్మయొక్కటే యన్నచో 'నిత్యోనిత్యానాం చేతనశ్చేతనానాం ఏకో బహూనాం యో విదధాతి కామాన్' అనెడుఆత్మలకు బహుత్వమును జెప్పెడు శ్రుతి విరోధించును. సమానాకారత్వము 'నిర్దోషంహి సమం బ్రహ్మ' మొదలగు బహుతర ప్రమాణసిద్ధము.

ఇట్లాత్మలకు వైషమ్యమే లేదుగాన ప్రశ్నోత్తరము లసంగతములు.

ఓరాజా! ఇంతవరకు నీకు దేహాదులాత్మ కంటె వేరుగా గాన్పించుట అనేకములుగా నుం డుట, మొదలగు కారణములచే నాత్మ కాజాల వని చెప్పితిని. ఇప్పుడవి యనిత్యములగుటచే నాత్మలు కాజాలవని చెప్పెద వినుము.

ఓరాజా! దారునిర్మితమగుటచే నీపల్లకి యనిత్యమగుటంజేసి యెట్లాత్మకాజాలదో యట్లే రాజగునీవు, వాహకులమగు మేము, అందరము అనిత్యమగుటచే నాత్మ కాజాలము.

ఈపల్లకిని జూడుము ఇది బ్రతికియుండగా చెట్టని పిలువబడును. భేదింపబడి దారువైనది. పిమ్మట వడ్రంగిచే కోయబడి చెక్కబడి కూర్చబడి యీపల్లకియైనది. ఇప్పుడాచెట్టు దారువనెడు పేర్లేవి?

1. ఇప్పుడు నీవు చెట్టు నెక్కితివందురా? కర్రనెక్కితి వందురా? పల్లకినెక్కితినందురు.

2. ఆయాయవస్థలు నశించునే ఆయాపేరులున్ను నశించినవి.

3. ఈపల్లకి యైనను చెక్కబడిన యాకర్రల కూర్పు చెడినచోనేది?

ఇట్లే ఊచలు, కర్ర, గుడ్డ వేరువేరుగా విడిపోయినచో గొడుగేది? 'నీవు నేను' యని లోకులనుకొనెడు శరీరముల గతియు నిట్టిదే కావున నవి యెన్నడు నాత్మ కాజాలవు.

ఆడది, మొగవాడు, గోవు, గొఱ్ఱె, గుఱ్ఱము గాడిద, చెట్టు, పిట్ట మొదలగు పేరులు కర్మవశమున లభించెడు దేహములకు లోకులచే పెట్టబడినవే గాని శాస్త్రన్యాయములచే తెలియదగిన యాత్మలకు చెందునవి కావు. ఆత్మ యెన్నడును దేవాది రూపుడు కాజాలడు. దేవత్వాది శరీరాకారభేదములు కర్మమూలములు తండ్రి కొడుకు రాజు భటుడు మొదలగునవి నిత్యములు గావు. పుట్టుకను బట్టి వచ్చినవే.

అచిత్పదార్థమును అవస్తువు అసత్తు అనుట అదితుచ్ఛము మిథ్యయనిగాదు. నశించునదనియే కావుననే కాలాంతరమునందైనను యేమార్పులను జెందక నామాంతరములను గురికాని పదార్థమును పరమార్థవస్తువందురు. అట్టితెరి 'అవస్తు' వనగా నట్టి మార్పులను నామాంతరములను చెందునదియేగదా. అది తుచ్ఛము మిథ్యయు నెట్లగును, అస్థిరమైనది అసత్తనుట కింకొక యుదాహరణము గలదు. చూడుము నీవు ప్రజలకు రాజువు. తండ్రికి బిడ్డవు, శత్రువునకుశత్రువు భార్యకు భర్తవు, కొడుకునకు తండ్రివి నీవెవగని నిలుకడగా జెప్పదును. ఇవి యస్థిరములు గాన అసత్తులగుచున్నవి. అంతియుగాని మిథ్యగావు.

కావుననో రాజా!

త్వం కిమేతచ్ఛిరః కిం ను
  గ్రీవా తవ తథోదరం ।
కిము పాదాదికం త్వం వై
  తవైతత్కిం మహీపతే ॥
సమస్తావయవేభ్య స్త్వం
  పృథగ్భూప! వ్యవస్థితః ।
కో ఽహ మిత్యత్ర నిపుణో
  భూత్వా చింతయ పార్థివ ॥

నీవీ కాన్పించు తల యగుదువా? మెడయగుదువా? ఈకడుపునీదా? (ఆత్మకు అవయవములు లేవు) కాలుచేతులునీవగుదువా? అవినీవియగునా? నీవీ యవయవము లన్నిటికంటె వేరైనవాడవు

అహంబుద్ధ్యా పరాగర్థా త్ప్రత్యగర్థో హి

భిద్యతే, ప్రత్యగర్థ (ఆత్మ) పరాగర్థ (విషయ) ములకు భేదము వాటికి అహంబుద్ధియుండుటయు లేకుండుటయునే గదా!

కావున రాజా! నేనెవడనను విషయమును గూర్చి నీవే నేర్పుతో నాలోచించుకొనుము.

ఇట్లాత్మ స్వరూపము నిర్ణయింపబడినది గాన దేవాదిజాతికుల చగశాదులు దేహ ధర్మములే గాని యాత్మధర్మములు కావని తేలినది. అట్టితరి "నేను సర్వసాధారణాకారుడన"ని చెప్పదగినదే గాని యితరాత్మలనుండి తనను (సోఽహం( నేనిట్టి విలక్షణమైన వాడనని చెప్పుట బొత్తుగ సంగతము కానేరదు. నీప్రశ్న యసమంజస మంటిని.

రాజు:- (వినయముతో సాష్టాంగనమస్కారము గావించి) స్వామీ! ఆత్మయాథ్యాత్మ్య ప్రతిపాదకమగుటచే పరమప్రయోజనమగు తమ యుపన్యాసమును విని ధన్యుడనైతిని. ఇట్టి పరమార్థమునే కపిలమహర్షి వలన తెలియగోరి నేను పయనమైతిని. మార్గమధ్యమున తమ రెదురైనా కీరహస్యార్థముల ప్రసాదించితిరి. లోకులయజ్ఞానాంధకారమునుబారద్రోలుటకై శ్రీమహావిష్ణువు యొక్క యంశావతారమగు నాకపిలమహర్షి వే నీవా? కానిచో నిట్టి యుపన్యాస మెవ్వడుచేయ గలడు? నాజన్మ సార్థకమైనది. నాకింకను పరమార్థముల ననుగ్రహింపమని ప్రార్థించెను.

ఈ రాజ భరత సంవాద మెంత సరసముగ శరీరాత్మ వివేకమును బోధించు చున్నదో గాంచుడు. నేనెవడనను సందేహమింకను ఆరాజును బాధించు నందురా?

---

## యతిరాజభజనకీర్తనలు

కవితావతంస, గానకళానిపుణ, హరికథాచతురానన కరి నారాయణాచార్య భాగవతార్

ఝంఝూటి రాగము — త్రిపుటగతి.

1. యతీశ! భాష్యకార! రామానుజార్య! జయ! జయ! ॥య॥
శ్రితావనా! సుపావనా! విశిష్టజనోద్ధారణా!
సతంబు నీనుతంబు శాశ్వతము హితము! జయ! జయ! ॥య॥

2 నీపవిత్రనామము, నిఖిలజనోద్ధారము
పాపతిమిరహారము, భవభయాపహారము
శ్రీపరాంకుశాంఘ్రి సంసేవి జనాధారము ॥య॥

3. ఈవిశాలజగతిలో, నెల్లమానవాళికీ
శ్రీవిశిష్టమంత్రమున్, జెప్పి యైకమత్యమున్
నీవిశాలహృదయమున్, నెనరుఁజూపినావహో! ॥య॥

4. దేశసేవ యేరమా, ధీశసేవయనుహితో
ద్దేశమెల్లవారికీ, దెలియఁజేసినావుదా
రాశయంబుతోడనా, రాయణార్యనుతపదా! ॥య॥

శ్రీమతే రామానుజాయ నమః

# రహస్యత్రియార్థసారము

శ్రీమాన్ శ్రీమత్తిరుమలై నల్లాన్ చక్రవర్తి సంపత్కుమార జగన్నాథతిరువేంకటాచార్యులవారు

## తిరుమంత్ర ప్రకరణము

### పాట

చాపుతాళము

తిరుమంత్రమందును దీపించు నర్థంబు । నరసి యెన్కొద వినుండార్యవరులారా ॥
పదము మొదటిదకార మిదిహరికి నామమౌ । నిది యెట్టులనియందు రేని వినుశికను ॥
అన్నిపదములకు నియ్యదిమూలమైయుండు । నన్నివస్తువులకును హరిమూలమగుచు ॥
కనుకనియ్యదివాచక మతండువాచ్యుండు । వినుడు మరియుక హేతువును వచించెదను ॥
అవ ధాతువును రక్షణార్థకంబనియుండు । రవనినిదియుత్పన్నమయ్యె నంచుండి ॥
హరిసర్వరక్షకుండగుటచే నిదివాని । నెరింగించునట్టిదగు నింకనుంగలదు ॥
సిరిపురుషకారంబు జేయకరక్షణము । జరుగమిని కలుగుద త్సంబంధమిచట ॥
దీనిపయిబ్రాప్తించి కానబడని చతుర్థి । కౌనుదాదర్థ్యమను నట్టిదర్థంబు ॥
కనుక హరిశేషత్వమును నకారార్థంబు । గాను బరిగణించెదరు కారంబుదీని ॥
అవధారణార్థకంబగుటనునననన్యార్హ । మవునంచు దెల్పునది యంతయేగాక ॥
ఇది శ్రీమహాలక్ష్మి కెసగువాచకమగుచు । మిథునశేషత్వమీ పదవినిలభించు ॥
ఇది కొందరిమతంబు మొదటిదే ముఖ్యమని । యెదరన్యశేషత్వ మదుమునదిగనుక ॥
సోవధారణము వాక్యము సర్వమనుటనం । దావిధము సిద్ధించు ననియు జెప్పెదరు ॥
వీరుకంఠోక్తమై వెలయుటప్రధానమని । వారితో వాదింత్రు వారంతబోక ॥
అపుడుభయశేషత్వ మస్త్రికంఠోక్తమన । నెపుడైనబల్కవీ లేయనుమనంద్రు ॥
దానికన్నని దేప్రధానమ్ముహరిశేష । మైనదెటుసిరికిగా దనియంద్రువీరు ॥
ఇకమకారమునాత్మలకువాచకంబంద్రు । ప్రకటంబుగాదీని పథతివినుండు ॥
ఇరువదైదవవర్ణ మిదియనుచుగణియింతు । రిరువదైదవతత్వ మీయనుజీవుడు ॥
గనుకనిదిగుదిరెనది గాకజ్ఞానార్థమౌ । మనధాతువుననుండి జనియించెగనుక ॥
ఈమకారముజ్ఞాన మేరూపమగుజీవ । సామాన్యమునకువాచకమైయెలంగ ॥
మరియునవబోధనము నెరిగించుమనుధాతు । వరయదీనికిమూల మనిననర్థమిదె ॥
ఆనందమయుడనుచు నర్థమగుహార్ధార । మైనమదిధాతువున నయ్యెనిదియనిన ॥
పరిమాణమర్థమై పరగుమసిధాతువున । ధరనిదిజనించెనన దగునణుత్వంబు ॥
పరగునిదిజాత్యేక వచనముగుటపమిష్టి । నెరిగించునట్టిదై యెల్లరునుమెచ్చ ॥

ఈమూడువర్ణములు నేకమైయోంకార । మైమెలగెదీనిఫలి తాంశమేమనిన ॥
సర్వకారణమునకు సర్వరక్షకునకా । సర్వేశ్వరునకుశే షంబాత్మసమితి ॥
అతనికేదక్కదన కైననన్యులకైన । నితడుశేషంబుగా జెప్పటికైన ॥
అతనితోడ ననన్య రాలౌటశ్రీదేవి । కితడుశేషమనివే రేజెప్పనేల ॥
అనుచునిశ్చితమైన యదియిట్టి శేషత్వ । మునుభగవదాశ్రితుల దనుకజెప్పెదరు ॥
కొందరిదిప్రథమపద మందుజెప్పెదరుమరి । కొందరు ద్వితీయపద మందుజెప్పెదరు ॥
ఇదియెప్రణవార్థమగు నిద్దానివివరించు । నదిమంత్రశేషమిప్పు డదియువినుపింతు ॥
నారాయణపదంబ కారవివరణమునకు ! కారవివరణమునకు గానమఃపదము ॥
తనకునారాయణప దంబుమీదిచతుర్థి । యునుమకారమువివృతి కనుకూలమగును ॥
కొందరిదినారపద మందనివచింతురిపు । డందముగనునమఃప దార్థంబువినుము ॥
కలరెండుభేదముః ఖండమునఖండమని । తెలిపెదనువానివే గలుగునర్థములు ॥
మొదటిపక్షమునందు నిదిరెండువర్ణములు । బొదలియుండగ రెండు పదములైయొప్పు ॥
మొదటిపదము నకార మునిషేధవాచకము । తుదిపదమువచియించునదిమమతయండ్రు ॥
కనుకమమకారమి క్కడనిషేధింపబడె । గననహంకారసహ కారమిదిగనుట ॥
మమతానిషేధంబు మరియహంతానిషే । ధమునకునుపలక్ష ణముగాగ్రహింతు ॥
ఈరెంటికినివృత్తి యొసగిననవిద్యామ । హీరుహమునకుబీజ మింకేదియులేదు ॥
ఈనమఃపదమందె నిచటదుదినన్వయము । దానొందినైరుత్రితయమునునడంచు ॥
వరుసగానిదిస్వరూ పముపాయముఫలంబు । జెరచునట్టివియని చింపగాబడియె ॥
మరియుఖండంబగున మఃపదముపాయంబు । నెరిగించునట్టిదై యొపగుననియండ్రు ॥
నారాయణపదంబు నకుసమాసములుసాం । పారంగరెండుగల వవియుదెల్పెదను ॥
ఒకటితత్పురుషమరి యొక్కటిబహువ్రీహి । ప్రకటముగమొదటిదిప రత్వంబుదెల్పు ॥
సౌలభ్యమునుదెల్ప జాలినదిరెండవది । క్రాలునారపదంబు గదయందుమునుందు ॥
ఇదితెలియమాఁబోధించి యొపగుణీఞ్ధాతువున । నొదివినప్లునునాది నొదవువృద్ధిగని ॥
మరియుబహువచనంబు ధరియించితానన । శ్వరవస్తుసంఘముల బల్కునదియయ్యె ॥
అయనపదమునకుగ త్యర్థకంబైనట్టి । యయధాతువుననుండి యమరెనుదయంబు ॥
కర్తరివ్యుత్పత్తి కర్మణివ్యుత్పత్తి । వర్తించునీయయన పదమునననుగనుక ॥
మొదటిదమరనుపాయ మునుదెల్పుమరిరెండ । వదియుఃపేయముననియు బల్కగావచ్చు ॥
అలబహువ్రీహియం గనుగుణంబుగగుణాం ! బులనారపదమునం దొలగింపవలయు ॥
అయనపదమునుపా యముపేయమునుబల్క । నయినపుడచేతనము నల్లితగుదొలగ ॥
నారాయణపదంబు పైరవాల్లుచతుర్థి । గోరుకైంకర్యములు గొనసాగునట్లు ॥

తిరుమంత్రమునకిట్లు దెలుపబడెనర్థంబు । పరమగోప్యంబిది ప్రపన్నగోచరము ॥
దీనిదగుగౌరవము న్యూనంబుగాకుండ । జ్ఞానులగువారలను సంధింపవలయు ॥
అవ్యాపకంబులకు నందరానిమహత్త్వ । మావ్యాపకంబులన నగుమంత్రములకు ॥
వానిలోనిదియర్థ పరిపూర్తిశిష్టజను । లైనవారిపరిగ్రహముగల్గియుడరు ॥
దీనినేగాకాయి ద్దానివాచ్యునిమరియు । దీనిజెప్పినవాని నౌనుమన్నింప ॥
ఇదియుమంగళసూత్రమేయనన్యార్హుడై । పాదలునాత్మయటంచు బోధించుగాన ॥
ఇదియెరుకపడనినాడేముజన్మించియు । న్నదిలేదనిరి పూర్వులైనదేశికులు ॥
ఎరుకపడినంతనిగ యేదప్పవేరొకటి । యెరుగరప్పుడెజని యించినామనిరి ॥
ఇదిశబ్దశక్తిచే నెలమిరక్షించుచు । న్నదియుపాసకులైన యట్టివారలను ॥
హరియుపాయము పేయమునుకొనుప్రపన్నులను । నరసిరక్షించునిది యర్థబోధమున ॥
దీనియర్థముమహిమ దెలిసినంతయుమీకు । నేనుసంగ్రహముగా నిపుడుజెప్పితిని ॥

## యతిరాజవిజయ నాటకమునందలి కొన్ని చక్కని శ్లోకములు

శ్రీ ఉ. వే. శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులుగారు

శ్లో. బ్రహ్మత్రాణప్రవీణో ధృతధరణిధరః క్ష్మాసముత్క్షేపదక్షః ।
ప్రహ్లాదహ్లాదకారీ మథితబలిబలో భగ్నరాజన్యజన్యః ।
లజ్కాలజ్కారహారీ హాలహతకలహో వల్లవోల్లాసకారీ ।
భావీ పాషణ్డశత్రుః భవతు మధురిపుః శ్రేయసే భూయసేనః ॥

తాత్పర్యము

(పోయిన వేదముల నిచ్చి) బ్రహ్మను కాపాడుటలో నేర్పరియు (మత్స్యావతారము), పర్వతమునెత్తినవాడును (కూర్మావతారము), భూమినుద్ధరించుటలో సమర్థుడును (వరహావతారము), ప్రహ్లాదునకానందప్రదుడును (నృసింహావతారము), బలిచక్రవర్తి బలమును మథించినవాడును (వామనావతారము), రాజమండలిని భంగపరచినవాడును (పరశురామావతారము), లంకయందమును చెడగొట్టినవాడును (శ్రీరామావతారము), నాగలిచే శత్రువుల సంహరించినవాడును (బలరామావతారము) గోపకులకానందప్రదుడును (శ్రీకృష్ణావతారము), రాబోవు నాస్తికసంహర్తయు (కలికావతారము) నగు శ్రీమన్నారాయణుడు మనకు మహత్తర మంగళావహు డగుగాక!

శ్లో. మత్స్యః కూర్మో వరాహ శ్చ నారసింహ శ్చ వామనః ।
రామోరామ శ్చ రామ శ్చ కృష్ణః కలిక ఏవ చ ॥

అను శ్లోకము నవలంబించి దశావతారము లిందుక్రమముగా వర్ణింపబడినవి,

# త్రియా విచారము

శ్రీమాన్ రావుబహదూర్ వేమూరి రంగనాథశాస్త్రిగారిచే కూర్పబడినది.

రత్నస్తమ్భసమాన సుందరతర ప్రోత్తుఙ్గ జానుద్వయం ।
జానుప్రాన్తవిలమ్బి బాహుయుగళం దోర్లమ్బి కర్ణద్వయమ్ ।
కర్ణాన్తాయత నేత్రపద్మయుగలం నేత్రాన్తనిర్యత్కృపా ।
పూరం ధీర ముదార మున్నస మముం శ్రీపార్థసూతం స్తుమః ॥

త్వా మన్తరా న ఖలు మే పరదైవ మన్యత్ ।
నో మాదృశో౽పి దయనీయ ఇహాస్తి తేఽన్యః ।
దైవా దియం సముచితా ఘటనా ప్రవృత్తా ।
కిం త్వం తథాపి భగవన్! సముపేక్షసే మామ్ ॥

నాలుగు వేదములు ఉపవేదములు వేదాంగములు పురాణములు ఇతిహాసములు ధర్మ దర్శనములు అని ఆఱుశాస్త్రములు వివరింప బడియున్నవి. అవి చేతనులనుష్ఠింపవలసిన నియమములు 'శాసనాత్ శాస్త్ర'మ్మని చెప్పిరి. శాసనశబ్దమనునది హూణభాషయందు 'to ordain' అను 'రూట్' నుండి వచ్చినది. శాస్త్రములు దైవముచే విధింపబడిన చట్టములు, (ordenana) అని ఊహించుకొనవలయును. ఇప్పుడు రాజ్యపరిపాలకులు జనులకు మేలుచేయుటకు విధించు శాసనములవలె మన వేదశాస్త్రములందలి విధులు మన యాత్మలు చెడకుండుటకును మనము సద్గతి జెందుటకును విధింపబడిన శాసనములనదగినవి. రాజ్యపరిపాలకులు విధించు శాసనములను మీఱిన వారి కేప్రకారము రాజదండన మేర్పడునో అట్లే శాస్త్రవిధులను మీఱినవారును దైవ దండనకు పాత్రులు కావలసిన వారగుదురు.

ఈ వేదశాస్త్రములనాటింటిని శ్రీభగవద్రామానుజాచార్యులవారు శ్రీమధ్వాచార్యులవారు, శ్రీవల్లభాచార్యులవారు, నాదరించెదరు. శ్రీశంకరాచార్యులుమాత్రము పరతత్త్వమొక్కటియే సత్యమనియు నదితరములన్నియు మిథ్యయనియు జెప్పుదురు.

ఈ వేదములయందు హూణభాషలో (Ettrens) అని చెప్పబడు నీతులు, ఆత్మగుణములును నీలోకమునందు మనుజుడు నడుచుకొనవలసిన పద్ధతులు వివరింపబడుచున్నవి.

పురాణాదులయందు, గృహస్థులుగానుండువారు పతిపుత్రులుగలవారలు వారొకర్ప్ప కొనవలసిన యన్యోన్యోపకారములును వారు ప్రాణివర్గమునందు జూపవలసిన రీతియును విశదపఱుపబడినది. వేదములను, కర్మభాగమనియు, జ్ఞానభాగమనియు, ఉపాసనభాగమనియు మూడు విధములుగా విభజింపవచ్చును. మనపూర్వాచార్యులు నాథయామున యతివరాదులు, కర్మములను కైంకర్యమునందుపయోగించువానిగను, జ్ఞానమును శాస్త్రములయందు మహావిశ్వాసమును కలిగించుదానిగను, ఉపాసనమును దివ్యాలయములయందారాధనరూపమైన దానినిగను నాదరించుచు వచ్చిరి.

భగవద్రామానుజాచార్యులవారు వేదములను గురించి శ్రీభాష్యమునందు ఈప్రకారము వివరించియున్నారు:

ప్రథమంతావత్ స్వాధ్యాయోఽధ్యేతవ్యః ఇత్యధ్యయనేనైవ స్వాధ్యాయశబ్దవాచ్య వేదాక్షర రాశిగ్రహణం విధీయతే, తచ్చాధ్యయనం కింరూపం కథమితికర్తవ్య మిత్యపేక్షాయాం, అష్టవర్షం బ్రాహ్మణముప నయీత తమధ్యాపయే దిత్యనేన "శ్రావణ్యాం వా ప్రోష్ఠపద్యాంవా ఉపాకృత్య యథావిధియుక్త శ్ఛన్దాంస్యధీయీత మాసాన్విప్రోర్ధ పంచమానిత్యనేన వ్రతనియమ విశేషోపదేశైశ్చా పేక్షితాని విధీయన్తే ఏవం సత్సన్తానప్రసూత సదాచారనిష్ఠాత్మగుణోపేత వేదవిదాచార్యోపనీతస్య వ్రతనియమ విశేషయుక్త స్యాచార్యోచ్చారణా నూచ్చారణరూప మక్షరరాశి గ్రహణఫల మధ్యయన మిత్యవగమ్యతే. అధ్యయన శ్చస్వాధ్యాయ సంస్కారః, స్వాధ్యాయోఽధ్యేతవ్య ఇతి స్వాధ్యాయస్య కర్మత్వావగమాత్, సంస్కారోహినామ కార్యాన్తరయోగ్యతాకరణమ్, సంస్కార్యత్వంచ స్వాధ్యాయస్య యుక్తం ధర్మార్థ కామమోక్ష రూప పురుషార్థ చతుష్టయ తత్సాధనావబోధి తత్వాత్ "జపాదినాస్వరూపేణాపి తత్సాధన త్వాచ్చ-

అనగా ప్రథమమున వేదమధ్యయనము చేయవలసినది అను విధివాక్యము, వేదాక్షర గ్రహణరూపమగు వేదాధ్యయనమును విధించుచున్నది. వేదాధ్యయనమెట్టిది? దానినెట్లు చేయవలయును? అనగా "అష్టవర్షం బ్రాహ్మణ ముపనయీత తమ ధ్యాపయేత్" (ఎనిమిదవయేట బ్రాహ్మణబాలున కుపనయనముచేసి వేదముల నభ్యసింపజేయవలయును. బ్రాహ్మణుడు శ్రావణ పూర్ణిమనాడు గాని, భాద్రపద పూర్ణిమనాడుగాని శాస్త్రానుసారముగ నుపాకరణ మొనర్చి శ్రద్ధాయుక్తుడై నాలుగుమాసముల పదునైదుదినములు వేదముల నభ్యసింపవలయును.) మొదలుగాగల శాస్త్రవాక్యములు, వేదాధ్యయనమునకుగావలసిన వ్రతనియమములు, మొదలగు సంగములను విధించుచున్నది. ఈప్రకారము సద్వంశ్యుడును సదాచార సంపన్నుడును ఆత్మగుణోపేతుండును వేదాధ్యయనపరుడును, నగునాచార్యునివలన నుపనయనమును బొందినవాడై యుపాకరణాది వ్రతనియమములుగల శిష్యుడాచార్యునిచే నంత చెప్పించుకొని వేదములను గ్రహించుటయే వేదాధ్యయనమని తెలియుచున్నది. కావున అధ్యయనమనునది వేదములయొక్క సంస్కారము. సంస్కారమనగా, ఏదైన నొకవస్తువును మఱియొకకార్యమున కుపయుక్తమగునటుల చేయుటయే! అధ్యయనమను సంస్కారమును వేదములు పొందుటచే నవి, ధర్మార్థ కామ చతుర్విధపురుషార్థములను వానిని బొందుటకగు సాధనములను దెలియజేయునవిగా జపాదులచేత స్వయముగ గూడ నట్టి పురుషార్థములను జేకూర్చునదిగను నగుచున్నవి.

ఆహ్ వేదాః ప్రమాణం స్మృతి రుపకురుతే సేతిహాసైః పురాణై ।
ర్న్యాయై స్సార్ధం త్వదర్చా విధి ముపరి పరిక్షీయతే పూర్వభాగః ।
ఊర్ధ్వోభాగ స్త్వదీహా గుణ విభవ పరిజ్ఞాపనై స్త్వత్పదాప్తౌ
వేద్యో వేదైశ్చ సర్వై రహ మితి భగవన్ స్వేన చ వ్యాచకర్థ ॥

అనఁగా; ప్రపథమమున వేదములు, ప్రమాణములు స్మృతీతిహాస పురాణ న్యాయములు వానికి సహాయకారులుగా నుండునవి. వేదములలోని పూర్వభాగము భగవదారాధనమును గుఱించి వచించుచున్నవి. ఉత్తరభాగము భగవంతుని సంకల్ప గుణ విభవములను గుఱించి యనువదించుచు వానిని బొందుమార్గమును దెలుపుచున్నవి. శ్రీకృష్ణుఁడు గీతయందు సర్వవేదములచేతను దెలిసి కొనవలసినవాఁడు భగవంతుఁడు తానే యని స్పష్టపఱచెను.

హిందువులనఁగా, వేదవేదాంతములను నితిహాస పురాణాదులను నమ్ముటయేగాక, అందుఁ జెప్పబడియున్న వర్ణాశ్రమధర్మములను ఆచరించుచు, అందువిధింపబడిన విధి నిషేధములకు లోబడి నడుచుకొనువారు.

## వేదములు

ఆదియందు వేదములు చతుర్ముఖ బ్రహ్మనుండి వెలువడినవి. వేదాక్షరరాశి గణించుటకును వీలుగానిది. అయినను శ్రీ వేదవ్యాసభగవానులు, ఆ వేదాక్షరరాశిని ఋక్కు, యజుస్సు, సామము, అథర్వణ వేదము అని నాల్గువిధములుగా విభజించిరి. (అథర్వణవేదము-సామవేదాన్తర్గతము) కావు ననే వేదవ్యాసులని వారికి జగత్ప్రసిద్ధమగు నామమేర్పడినది.

ఋగ్వేద మగ్నినుండి వెలువడినది, యజుర్వేదము వాయువునుండి వెలువడినది, సామ వేదము సూర్యునినుండి వెలువడినది. అథర్వణవేదము వేఱుపడి యున్నది.

అమరసింహుఁడు మూఁడువేదములను గుఱించి మాత్రము ప్రస్తావించి యున్నాఁడు.

అథర్వణవేదమునందలి మంత్రములు దివ్యమంగళవిగ్రహాదులను ప్రతిష్ఠచేయుటకును, ప్రోక్ష ణాదులకును, శతృసంహారాదులకును ప్రతిపాదింపబడుచున్నవి.

వేదవ్యాస మహర్షికి నలుగురు శిష్యులుండిరి. అందులో "పైలులు" అనువారికి ఋగ్వేద మును, "వైశంపాయనులు" అనువారికి యజుర్వేదమును, "జైమిని" అను మహర్షికి సామవేదమును, "సుమంతుఁడు" అను వారికి అథర్వణ వేదము నుపదేశించిరి. ఇతిహాస పురాణాదులను సూతు నకు దెలిపిరి. వీరలు వారివారి శిష్యవర్గమున కుపదేశించుచు పరంపరగాఁ బ్రచారమునకుఁ దెచ్చిరి,

ఋగ్వేదమునందు పదునాఱుసంహితలు; యజుర్వేదమునందు ఎనుబదియేఁడు సంహితలున్ను సామవేదమునందు వెయిసంహితలకుఁ దక్కువ లేకయు; అథర్వణవేదమునందు, తొమ్మిదిసంహిత లున్ను ఉన్నవి.

వైశంపాయనులు యజుర్వేదమును నిరువదియేడుగురు శిష్యుల కుపదేశించిరి. వైశంపాయ నులు దన ప్రధానశిష్యుఁడైన యాజ్ఞ్యవల్క్యునకుఁ దన యితరశిష్యులకు నుపదేశింపుమని చెప్పిరి.

ఆసమయమున వైశంపాయనులు తనసోదరకుమారులను ప్రమాదమున చంపివైచెను. అందు వలన సంభవించిన పాపమునందలి భాగమును యాజ్ఞవల్క్యులను బంచుకొనుమని చెప్పిరి. యాజ్ఞ వల్క్యులు పాపమును దాముదీసుకొనసమ్మతింపలేదు అందువలన ఆచార్యాజ్ఞనుల్లంఘించినవారైరి.

వైశంపాయనులు ఆపైన యాజ్ఞవల్క్యులను దాముచెప్పిన వేదములను గ్రక్కుమనిరి. వెంటనే వారు వైశంపాయనులకడ నధ్యయించిన వేదములను గ్రక్కివైచిరి. వైశంపాయనుల యితర శిష్యులు గుర్వాజ్ఞను దలదాల్చి పావురములయి వేదముల మింగివైచిరి. కావుననే దీనికి 'కృష్ణయజుస్సు' అను పేరేగాక "తైత్తిరీయము" అను పేరును గలిగినది. సంస్కృతమున 'తిత్తిరి' యనగా 'పావు రము' లని యర్థము.

ఈ ప్రకారము సంభవించినదానినిజూచి యాజ్ఞవల్క్యులు బహువ్యసనముతో సూర్యదేవత నుపాశించి వారితేజస్సువలన క్రొత్తయజుర్వేదమును సాక్షాత్కరింప జేసికొనిరి. దీనినే శుక్ల యజుర్వేదమందురు. శుక్లయజుర్వేదమనగా "శుద్ధమైన యజుర్వేదమని యర్థము. దీనినే "వాజస నేయిని" అని చెప్పటయు గలదు.

కాని శ్రీవిష్ణుపురాణమునందు ఈశుక్లయజుర్వేదాధ్యాపకులు "వాజినులు" అని వ్యవహ రింపబడిరి. ఇందులకుగారణము సూర్యభగవానుడీ వేదముల నుపదేశించునప్పుడొక గుఱ్ఱము రూపము ధరించి దీనినుపదేశించుటయే! అని కొందర యభిప్రాయము మఱికొందరు వైశంపా యనులకు వ్యాసమహర్షి యుపదేశించిరనియు వారు 'తిత్తిరి' అను వారికుపదేశించిరనియు, వారి వద్దనుండి 'ఉఖులు' అనువారు భుజించిరనియు, వారివద్దనుండి యాత్రేయు లుపదేశము పొంది రనియు, వారలు "శాఖ" యను విభాగము నేర్పఱచిరనియు, అప్పటినుండియే శాఖావిభాగ మేర్పడినదనియు జెప్పుదురు.

ఈ శుక్లయజుర్వేదమును యాజ్ఞవల్క్యులు పదునైదుమంది శిష్యుల కుపదేశించిరి. అందు కాణ్వశాఖ, మాధ్యందినశాఖ, సుప్రసిద్ధములు వానితరువాత జాబాలశాఖ, బౌధాయనశాఖ, తాపనీయశాఖ. అనునవి ప్రసిద్ధములు వాని నుండి యనేకములగు నవాంతర సాఖలుద్భవించినవి. వానిలో ఆపస్తంభశాఖ, ఆత్రేయశాఖ, ఇప్పటికచ్చటచ్చటగనబడుచున్నది. ఇతరశాఖలు చాల వఱకు జీర్ణములైననియే చెప్పనగును.

జైమినిమహర్షి కుమారులు సుమంతులు అనువారు దనతండ్రియొద్ద సామవేదమును నధ్య యనముచేసిరి. సుమంతుని కుమారులు "సుకాత్రిమణి" యనువారు జైమినిమహర్షియొద్ద నధ్యయ సించినవారు, వేయిశాఖల నేర్పఱచిరి. ఆశాఖలన్నియు ఇంద్రుని వజ్రాయుధము వలన నా వని ప్రసిద్ధము.

అథర్వణవేదమును సుమంతులు తనశిష్యులైన కబంధున కుపదేశించి పాశ్న అను వారలకు భాగించి ఇచ్చిరి. ఇందు మొదటిశాఖ 'దేవదర్శి' సాఖ 'పిప్పలాద'మనియూ వ్యవహారమునగనబడు చున్నది. ఈయథర్వణ మఱియొక శాఖ కలదు. మిగిలినవంత ప్రసిద్ధిలోనివి కావు.

ఒక్కొక్క వేదమునందును 'మంత్ర' భాగమనియు 'బ్రాహ్మణ' భాగమనియు విభాగ మున్నది. భగవంతునికై చేయు ప్రార్థనలు, స్తోత్రములు, తత్సంబన్ధి వేదమంత్రములు "సంహిత" యనబడును. ఆచారములు, వానిని వివరించు నైతిహ్యములు, అనుష్ఠానములు దేవతావిచారములు కల భాగమునకు "బ్రాహ్మణ" మని వ్యవహారము. కాని ఇప్పుడుండు బ్రాహ్మణములయందనేక స్తోత్రములు లేక మంత్రములు మాత్రము చేర్చబడినవి.

ఇందు. వేదాంతభాగములకు "ఉపనిషత్తు" లనిపేరు. ఋగ్వేదములోని "ఋక్" అనునది (land) అను (Root) నుండి వచ్చిన (ఋచ్) అను ధాతువునుండి వచ్చినది. (ఋచ్యన్తేస్తూయన్తే అనయా దేవాః) అనియు నర్థము. అనఁగా 'దేవతావిషయకమైన స్తోత్రము' అనిభావము. ఇది యెనిమిది కాండములుగా విభాగింపఁబడినది. కాండము కొన్ని యధ్యాయములుగా విభజింపబడినవి ఇట్లుగాక మఱియొకవిధముగా పదిమండలములుగా విభజింపబడినది. అవి నూఱు అనువాకము లుగా విభజింపబడినవి. ఇందు వేయి సూక్తములున్నవి. రెండువేలు వర్గములుగా విభజింపబడినవి, మొత్తమునఁ బదివేల శ్లోకములిందుఁగలవు.

ఈఋగ్వేదము మహారాష్ట్ర దేశమునందును త్రిలింగదేశమునందును, పంజాబు దేశము నందును, వ్యవహారమునయున్నట్లు గనఁబడుచున్నది. వేదములను సంహిత, పదము,క్రమము, జట, ఘనము, అను ఐదు విధములుగ విభజించి యధ్యయనము చేయుదురు.'సంహితయనఁగా ఉదాత్తా నుదాత్త స్వరములు అను వీనితో నధ్యయనము చేయునది.

పదమనగా: పదపదములుగా సమాసములను విడదీసి యందుగల్గుమైన పదముల కర్థము అను వివరించు మఱికొన్ని పదములను జేర్చి చెప్పునది.

క్రమమనగా: ప్రథమపదమును రెండవపదముతో జేర్చి రెండవపదమును మూడవ పదముతో జేర్చి చెప్పునది. "జట" యనగా మొదటి పదమును రెండవపదముతోను రెండవ పదమును మొదటిపదముతోను త్రిప్పి చెప్పునది.

ఘనమనగా: జటక్రమముగా, మొదటిపదమును రెండవపదముతో జేర్చి చెప్పి మూడవపదమును జేర్చి చెప్పుట; ఆ పదములను దల్కిందగా మార్చి చెప్పుట.

ఒక్కొక్కమంత్రమును అనుసంధించునప్పుడు మంత్రద్రష్టయయిన ఋషిపేరును, ఛన్ద స్సును, దేవతపేరును జెప్పి సంకల్పించుకొని ప్రారంభించుట ఆచారమైయున్నది.

ఋగ్వేదముయొక్క అనుక్రమణికచూడగా రెండవకాండమునకు మంత్రద్రష్ట గృత్సమ దుఁడనుఋషి, మూడవకాండమునకు మంత్రద్రష్ట విశ్వామిత్రుఁడు. నాల్గవకాండమునకు మంత్ర ద్రష్ట వామదేవుఁడు. ఐదవకాండమునకు మంత్రద్రష్ట అత్రిమహర్షి కుమార్తె బుధుఁడు. ఆరవ కాండమునకు మంత్రద్రష్ట భరద్వాజుఁడు. ఏడవకాండమునకు మంత్రద్రష్ట వసిష్ఠుఁడు. ఇతర కాండములకు అగస్త్యుఁడు, కాశ్యపుఁడు, అంగిరసుఁడు, జమదగ్ని, పరాశరుఁడు, వ్యాసుఁడు, గౌతముఁడు,

బృహస్పతినారదుఁడు ఇందు ముఖ్యముగా కాణ్వులును, చెప్పబడుచున్నారు. విశ్వామిత్ర సంతతి వారు. శునశ్శేపులు, కుత్సులు అని అనేక ఋషులును జెప్పబడియున్నారు.

అనేక రాజులు కూడా మంత్రద్రష్టలుగా చేర్పఁబడియున్నారు. వారు ఎవరనగా బృహాంగిర, త్రయారుణ, త్రసదస్యులు అనువారు.

మఱికొన్ని సంహితలకు యువనాశ్వులు వారికుమారులు మంధాతృ అనువారును ఉశనస్సుల కుమారులు చక్రవర్తి అనువారును రోహితాశ్వుల కుమారులు వసుమనసులనువారును కాశీరాజు దేవోదాసి కుమారులు ప్రతర్దనులనువారును రాజులలో మంత్రద్రష్టలుగా వ్యవహరింపఁబడియున్నారు.

ఐతరేయారణ్యకము.

ఇందు జగత్సృష్టి చెప్పబడియున్నది. జీవాత్మతత్త్వమును గురించియు పంచభూతములను గురించియు పరమాత్మనుగురించియు వచింపఁబడియున్నది. ఇందు ఐదుఆరణ్యకములుకలవు. వానిని పదునెనిమిది అధ్యాయములుగా విభజింపబడి, అవి డెబ్బదిరెండు ఖండములుగా భాగింపబడినవి.

కౌశీతకీ బ్రాహ్మణోపనిషత్

ఇందు ఇంద్రునకును ప్రతర్దనునకును జరిగిన పరబ్రహ్మ విచారముకలదు. అజాత శత్రువను కాశీదేశపురాజు బాలాకి అను బ్రాహ్మణునకు పరబ్రహ్మవిషయము నుపదేశించిన విచారము కలదు. ఇదే విషయము యజుర్వేదము నందలి బృహదారణ్యకోపనిషత్తునందును గనఁబడుచున్నది ఈకౌశీతకీ బ్రాహ్మణము ఋగ్వేదముయొక్క శాఖయని విద్యారణ్య స్వాములవారియభిప్రాయము

ఇందు అరుణుని కుమారులు ఉద్దాలకులకును వారి కుమారులు శ్వేతకేతువునకును, చైత్రునకును జరిగిన సంవాదము కలదు.

శుక్ల యజుర్వేదము

దీనిని "వాజసనేయి" అనియు "శుక్లయజుర్వేద"మనియుఁజెప్పుదురు. ఇందలి మంత్ర భాగము వేదములలో నెల్లచిన్నది. భగవత్ స్తోత్రములు ప్రార్థనలు కల భాగమును "సంహిత" యందురు. ఇందు నలుబది యధ్యాయములు కలవు. ఇవి 'ఖండిక'లు అను పేరుతో చిన్న చిన్న భాగములుగ విభజింపబడియున్నవి. ఇందుఁ బ్రార్థనా మంత్రములున్నవి.

ఋగ్వేదమువలె ననువాకములుగా నిది విభజింపబడియున్నది. ఇటువంటివి రెండువందల యెనుబదియారుఁ గలవు. దాదాపు రెండు వేల శ్లోకములు గలవు.

'యజుస్' అనుపదము "యజనమ్" అను ధాతువు నుండి వ్యుత్పన్నమైనది. 'యాజనమ్' అనగా దేవతాపూజ, దేవతారాధనము ఈయజుర్వేదమునందు యాగవిధానములు వివరింపబడియున్నవి. అందు ప్రథమాధ్యాయము, రెండవ యధ్యాయము నందలి చాల భాగము వర్ణసరు జంద్రుని వృద్ధిక్షయముల ననుసరించి యాగములు చేయవలసిన విధులు చెప్పఁబడియున్నవి. మూడవయధ్యాయమునందు "భార్యాగ్ని ప్రతిష్ఠ" చేయవలసిన విధానమును వివరింపబడినది.

పైనైదధ్యాయములయందును అగ్నిష్టోమయాగమును గురించి చెప్పబడినది. అటుపైని రెండధ్యాయములయందు వాజపేయము, రాజసూయయాగము వీని విధానము లున్నవి. కడపటి భాగమునందు రాజుల పట్టాభిషేకవిషయము విశదముగా గలదు. పదునొకండవ యధ్యాయమునుండి పదునెనిమిదవ యధ్యాయమువఱకు (అనగా ఎనిమిదధ్యాయములయందు) సౌత్రామణి యాగమునకు సంబంధించిన యగ్నిప్రతిష్ఠాదులను వివరించి పందొమ్మిదవయధ్యాయము మొదలు ఇరువదియొక్కధ్యాయమువఱకు సౌత్రామణి యాగవిధానము వచింపబడినది ఇరువదిరెండవ యధ్యాయము మొదలు ఇరువదియైదవ యధ్యాయము వరకు భూమండలచక్రవర్తి పదవినభిలషించు క్షత్రియులు చేయవలసిన యశ్వమేధయాగమును గురించి చెప్పబడియున్నది. పైరెండధ్యాయములయందు నానావిధయాగములు వివరింపబడినవి. ముప్పది ముప్పదియొకటవ యధ్యాయమున శ్రీమన్నారాయణుని ప్రీత్యర్థముగాజేయు పురుషమేధమును గురించినదిగానున్నది. పైమూడధ్యాయములు సర్వమేధమను యజ్ఞమును గురించి వివరించినవి. దీనికి ఫలము సర్వకార్యములయందు జయమును సంపాదించుటయే! దీని పైయధ్యాయమునందు పితృపితామహ ప్రపితామహాదులు సద్గతిని పొందుటకు చేయవలసిన పితృమేధయజ్ఞవిధానము వచింపబడినది. కడపటి పైయైదధ్యాయములయందు అథర్వకుమారులకు దధీచివలన సాక్షాత్కరింపబడిన స్తోత్రములు (ప్రార్థనలు, మంత్రములు, తపోవిషయములునున్నవి. కడపటి యధ్యాయమునందు పరబ్రహ్మ విచారమున్నది. దీనినే "ఈశావాస్యోపనిషత్తు అని చెప్పుదురు. దీనికి మంత్రద్రష్ట దధీచి! ఈశుక్లయజుర్వేదము యొక్క రెండవభాగమగు మాధ్యందినశాఖ"ను "శతపథబ్రాహ్మణ"మని చెప్పెదరు. ఇందు పదునాల్గు కాండములు కలవు. దానిని రెండు భాగములుగ విభజించిరి. మొదటి భాగమునందు పదికాండములును, రెండవభాగమునందు నాల్గుకాండములును గలవు. ఈపదునాల్గు కాండములయందు నాలుగువందల నలుబది బ్రాహ్మణములుకలవు. మొత్తము ఏడువేలయారువందల యిరువదినాల్గు ఖండికలున్నవి. ఈవేదము నభ్యసించువారు కాశీదేశమునందును గుజరాత్ దేశమునందును, అక్కడక్కడున్నారు, మహారాష్ట్రమునందును, త్రిలింగదేశమునందును వేదములలో విధింపబడిన అశ్వమేధము, పురుషమేధము, అను యజ్ఞములయందు అశ్వములయు మనుష్యులయు విశసనము విధింపబడలేదు.

అశ్వమేధయజ్ఞమునందు, ఆఱువందల తొమ్మిదివిధములైన గ్రామ్యారణ్యకమృగము పక్షులను, చేపలను, పురుగులను పాము మొదలగు వానిని నుపవాసముచేయించి గ్రామ్యమృగాదులను నిరువదియొక్క యూపస్తంభములకుగట్టి వానికి మధ్యమధ్యమున అరణ్య మృగ పరస్పపాదులనుంచి యజ్ఞాంతమునందు వానిని యథేచ్ఛముగా సంచరించునటులు వదల వలిసి. పురుషమేధయజ్ఞము నందు నానావిధ గ్రామారణ్యములయందుసంచరించుమనుష్యులను మూటయెనుబదియైదుమందిని పదునొక్కయూప స్తంభములకుగట్టి శ్రీమన్నారాయణునికి ప్రీతిగలుగజేయు స్తోత్రములను మంత్రములను జేర్పించి యాగము సమాప్తికాగానే ఆమనుష్యవర్గమునకు

ఏవిధమైన శ్రమముగలిగింపక యథేచ్ఛముగా సంచరింప జేయవలయును. హోమమునందు వెన్నను ఆహుతిచేయుట యాచారము. కొందఱు అశ్వముయొక్క మాంసమునాహుతిజేసి శేషమును యజమానుడు స్వీకరింపవలయునని చెప్పుదురు. అట్లైనయెడల పురుషమేధయజ్ఞముచేయు మానవుడు నరమాంసమును హోమముచేసి దాని శేషము యజమానుడు స్వీకరింప బడవలసినదేర్పడును. అట్టాచారముచందు గనబడలేదు. మాంసాదులను స్వీకరించుటయను నాచారము పురాణములయందును దంత్రములయందును గృహ్యసూత్రములయందును గనబడుచున్నవి. దీనికి సమాధానము నీవిధముగా నూహింపనగును. అశ్వమేధ నరమేధయజ్ఞములను పరమాత్మ ప్రీత్యర్థమారాధన రూపముగా నెంచి యాగముల జేయువారు జీవహింసచేయక యథేచ్ఛగా సంచరించునట్లు వానిని వదలివేయుదురు. అట్లుగాక, ఇహలోకమునందుఁ కీర్తి, ప్రజ్ఞ, ధనము పుత్రసంతానాదుల నపేక్షించు మానవులు, చేయు యాగములయందు గృహ్యసూత్రకారులు విధించినరీతిని హింసను జేయువలసినట్లు గానవచ్చుచున్నది.

అశ్వమేధయాగమునందుఁ జెప్పబడు నశ్వమును విరాట్పురుషుని స్వరూపముగా తైత్తిరీయ సంహితయందు వర్ణింపబడియున్నది. అశ్వముల యవయవములు కాలముయొక్క విభాగములుగను ప్రపంచముయొక్క విభాగములుగను చెప్పబడియున్నవి. ఉదయము దాని శిరస్సుగను, సూర్యుడు కన్నులుగను, వాయువు దాని యుచ్ఛ్వాస నిశ్వాసములుగను, చంద్రుడు దాని చెవులుగను వర్ణింపబడినది. ఇట్లుండగా, అశ్వమును విశసనముచేసి దాని మాంసమును హోమము చేయుట యనునాచారము, తాంత్రికులవలననో, పౌరాణికులవలనో గృహ్యసూత్రకారులవలననో కామ్యఫలముల నభిలషించువారికి గర్తవ్యముగా నేర్పడియుండునని యూహింపనగును.

## యాజ్ఞికులు

మంత్రములను ప్రయోగించి వైదికక్రియలను జేయించువారు "యాజ్ఞికు"లనబడుదురు. వారికి సంహిత, పదము క్రమము, జట, ఘనము అనునవి చక్కగఁ దెలిసియుండవలయును.

## కృష్ణయజుర్వేదము

ఇందు శుక్లయజుర్వేదముకంటె నెక్కువగా మంత్రములున్నవి. సంహితాభాగమును నేడష్టకములనియు, కాండములనియు వ్యవహరింతురు. ఒక్కొక్క కాండమును, ఐదు లేక యెనిమి దధ్యాయములనియు లేక నలువదినాల్గు ప్రశ్నములనియు, ప్రపాఠకములనియువిభజించిరి. ఒక్కొక్క ప్రశ్నను అనువాకములుగా విభజించిరి. మొత్తము (సుమారు) ఆరువందల నలువదియారను వాకములు గలవు.

ఈకృష్ణయజుర్వేదము మొదటి యనువాకమునందు ప్రార్థనలు, స్తోత్రములు, శుక్లయజుర్వేదము నందలి ప్రథమ ఖండికయందుఁగూడఁగలవు.

ఇందు మంత్రద్రష్టలగు ఋషులుపేర్కొనబడలేదు. ప్రజాపతి, సోమదేవత, అగ్నిదేవత మొదలగు దేవతా విశేషములే మంత్రద్రష్టలుగఁ జెప్పబడిరి.

(పారాయణ ప్రారంభము జేయుటకు పూర్వము అనుసంధానము చేయవలసినమంత్రములు)

శన్నోమిత్రశ్శంవరుణః । శంనో భవత్వర్యమా ।
శంనఇన్ద్రోబృహస్పతిః । శంనోవిష్ణు రురుక్రమః ।
నమోబ్రహ్మణే । నమస్తేవాయో । త్వమేవప్రత్యక్షం బ్రహ్మాసి ।
త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మవదిష్యామి । ఋతం
వదిష్యామి । సత్యంవదిష్యామి । తన్మామవతు ।
తద్వక్తారమవతు । అవతుమామ్ । అవతువక్తారం ।
ఓమ్ శాన్తి శ్శాన్తి శ్శాన్తిః ॥
సహనావవతు । సహనౌభునక్తు । సహవీర్యంకరవావహై ।
తేజస్వినావధీతమస్తుమావిద్విషావహై । ఓమ్ శాన్తి శ్శాన్తి శ్శాన్తిః ।

తైత్తిరీయ సంహిత దీనిని ఏడుకాండములనియు లేక నాలుగుకాండములు మూడష్టకములనియు వ్యవహరింతురు. ప్రథమకాండమునందు ఎనిమిది ప్రపాఠకములున్నవి. దీనిని నూటనలుబదియారనువాకములుగా విభజించిరి. రెండవకాండమునందు ఆఱుప్రపాఠకములు కలవు. వీనిని డెబ్బదిమైదనువాకములుగా విభాగించిరి. మూడవకాండమునందు ఐదు ప్రపాఠకములు కలవు. అందు ఏబదియైదనువాకములున్నవి. నాల్గవకాండము ఇందు ఏడుప్రపాఠకములున్నవి. ఇవి ఎనుబది రెండనువాకములుగా విభజింపబడినవి. ఐదవయష్టకము, ఇందు ఏడు ప్రపాఠకములు కలవు. వానిని నూటయిరువది యనువాకములుగా విభాగించిరి. ఆఱవయష్టకము ఇందు ఆఱు ప్రపాఠకములుకలవు. వానిలో నలువది యారనువాకములున్నవి. ఏడవ యష్టకము ఇందు ఐదు ప్రపాఠకములు కలవు. వీనినినూట ఏడనువాకములుగా విభజించిరి.

మొత్తము సంహితాభాగమునందు నాలుగు కాండములు మూడష్టకములున్నవి. వానిని నలుబదినాలు ప్రపాఠకములుగా విభజించిరి. మొత్తము ఆఱువందల నేబదియొక్క యనువాకములిందు గలదు.

తైత్తరీయ బ్రాహ్మణము ఇందు మూడుకాండములు గలవు. వానిని ఇరువది యెనిమిది ప్రపాఠకములుగా విభజించిరి. అందు మూడువందల ముప్పది యెనిమిది యనువాకములున్నవి.

తైత్తరీయారణ్యకం! ఇందు ఆఱు ప్రపాఠకములు నూటముప్పది తొమ్మిది అనువాకములు కలవు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| సంహితా | 44 | ప్రశ్నలు | బ్రాహ్మణము | 25 | ప్రశ్నలు |
| ఆరణ్యకము | 8 | ,, | మంత్రప్రశ్నము | 2 | ,, |
| కాఠకము | 3 | ,, | శుభకార్యములకు | | ,, |
| | | | మొత్తం | 82 | ,, |

తైత్తిరీయ ఆరణ్యకము- ఇందు మూడవప్రపాఠకమున బ్రహ్మమేధ సంస్కారము వివరింప బడియున్నది. ఆరవ ప్రపాఠకమునందు పితృమేధ సంస్కారము వివరింపబడియున్నది. తైత్తిరీయోపనిషత్తు శీక్షావల్లియందుఁబదునొకండనువాకములు కలవు. ఆనందవల్లియందుఁదొమ్మిది యనువాకములు కలవు. భృగువల్లియందుఁబదియనువాకములు కలవు. నారాయణమునందుఁ ఏబదిరెండనువాకములు గలవు. అధర్వణ వేదమునందు వచింపబడిన బృహన్నారాయణోపనిషత్తు ఇందు గలదు. దీనిని ఏకాగ్నికాండమందురు. ఇందు మైత్రాయణీశాఖ, కఠోపనిషత్తు శ్వేతాశ్వతరోపనిషత్తు కలవు.

సా మ వే ద ము

ఈవేదము, సామగానముతో పారాయణచేయఁబడినయెడల భగవంతునికి మిక్కిలి ప్రీతిని గలిగించునదిగఁగనఁబడుచున్నది. శ్రీభగవద్గీతయందు "వేదానాంసామవేదోఽస్మి" అని శ్రీకృష్ణులు తానే దీనిని శ్లాఘించి చెప్పెను. సామవేదమనుపదము "స్యతిఛిన త్తి దుఃఖమ్" గేయత్వాత్, స్యతి దుఃఖయతి దురయత్వాదితివా, స్యతి పాపం సామధ్యేయ నాశే (అసుమితిమన్.) ఇతి భరతః

"సామ"అనునది షహాఅను క్రియాపదమునుండి యేర్పడినది. స్య అనగా నశింపజేయుట వీనిని (పాపములను) సామవేదమును పారాయణచేయగాఁ బాపములు నశించునని యర్థము. ఇందు వేయిశాఖలుగలవు. అవి అర్చిక అనియు ఆరణ్యకమనియు రెండు భాగములుగ విభజింపబడియున్నవి. అర్చికభాగమున "దశతి" అనుపేరుతో పదిపది మంత్రములు చేర్పబడియున్నవి. ఇట్లు గ్రామగేయ గానమని పదునేడు యధ్యాయముగా విభజింపబడియున్నది. ఇందు (సుమారు) ఆఱువందల శ్లోకములు గలవు.

ఆరణ్యకమును ఆరణ్యగానమనియు వ్యవహరింతురు. ఈబ్రాహ్మణభాగము షడ్వింశద్బ్రాహ్మణము. అద్భుతబ్రాహ్మణము పంచవింశతిబ్రాహ్మణము తండ్యబ్రాహ్మణము అనురీతిని విభజింపఁబడినది. ఇందు తండ్యబ్రాహ్మణము మిక్కిలి శ్రేష్ఠమని సాయనాచార్యుల వారి యభిప్రాయము.

ఈసామవేదమునందు ఎనిమిది అధ్యాయములు లేక ప్రపాఠికలు గల ఛాందోగ్యోపనిషత్తు గలదు. ఇందు సుమారు నూటయేఁబది భాగములు గలవు.

ఇందు సనత్కుమార నారదసంవాదము కలదు. అరుణుని కుమారుడు ఉద్దాలకుడు వానికుమారుడు శ్వేతకేతువు కేకయరాజు కుమారుడు అశ్వపతియొద్దకు వెళ్ళి. పరమాత్మ స్వరూపము జీవాత్మ స్వరూపమును గురించి విచారించినట్లు చెప్పబడియున్నది. నాల్గవ అధ్యాయమునందు పౌత్రాయణి కుమారుడగు జానశ్రుతి చరిత్రము వివరింపబడియున్నది.

ఉపమన్యులకుమారులు ప్రాచీనశాల, పులస్త్యుల కుమారులు సత్యాజస్య, వల్లభుల వంశమునబుట్టిన ఇంద్రద్యుమ్నులు, అశ్వతరేశ కుమారులు విదులులు. వీరందరు జీవాత్మ పరమాత్మలను గురించి విచారించియున్నారు.

పైజెప్పబడిన ఋషులందఱును అరుణికుమారులు ఉద్దాలకుల యొద్దకు వెళ్ళిరి. వారిని కేకయరాజు కుమారులు అశ్వపతి యొద్దకు వెళ్ళుమనిరి.

సామవేదమునందలి యొకశాఖకు 'తలవకారము'లని వ్యవహరింతురు. దీనినే కేనోపనిషత్తు అనియు వ్యవహారము.

### అథర్వణ వేదము

ఈవేదమును చతుర్ముఖబ్రహ్మ తన కుమారుడైన అథర్వున కుపదేశించెను. అతడు భరద్వాజుని కుమారుడగు సత్యవాహునకుపదేశించెను. అతడు అంగిరసున కుపదేశించెను.

సంహితాభాగమునందు, ఇరువదికాండములు కలవు. అవి అనువాకములుగను, సూక్తములుగను, ఋక్కులుగను విభజింపబడినవి. ఇందు ఆరువేల శ్లోకములు కలవు. వీనిని నూఱు అనువాకములగ విభాగించిరి. ఇందు సుమారు ఏడువందల యిరువది మంత్రములు కలవు. నలుబది ప్రపాఠకలుగ నివి విభజింపబడినవి.

వీరి మతమునందు నక్షత్రములు ఇరువది యెనిమిది. వీరిదిగణనమున కృత్తికా నక్షత్రము మొదలు ఆశ్లేషానక్షత్రమంత్యము. 'అభిజిత్తు' అను దానిని జేర్చుకొనెదరు.

ఈఅథర్వణవేదమునందు శత్రునిరసనమేకాక, అనేక సత్కార్యములను సఫలముగా జేయుటకును ఆపత్తులను నివర్తించుటకును, తగిన స్తోత్రములు ప్రార్థనలు కలవు.

ఇందు గోపథ బ్రాహ్మణముకలదు. అందు ఐదు ప్రపాఠికలు కలవు. మొదటిప్రపాఠిక యందు ప్రపంచసృష్టివివరింపబడి ప్రజాపతి అథర్వులు అను తన కుమారులను ప్రపంచమును సృష్టించుటకును కాపాడుటకును నేర్పచినవిధులు చెప్పబడియున్నది.

ఇందు ముండకోపనిషత్తు, ప్రశ్నోపనిషత్తు మాండూక్యోపనిషత్తు, నరసింహపూర్వతాపనీయోపనిషత్తు, ఉత్తరతాపనీయోపనిషత్తు కఠవల్ల్యుపనిషత్తులు కలవు.

కఠవల్లియందు యమధర్మరాజునకును నచికేతస్సునకును జరిగిన పరబ్రహ్మ విచారముకలదు.

ఈనాల్గువేదములయందును లోకనీతులు అర్థశాస్త్రము, జ్యోతిషము, ఆయుర్వేదము గలవు

సాంఖ్యమతమునకు మూలపురుషుడు ఈశ్వరకృష్ణుడనువాడు. వీరు కపిలఋషియొద్ద సాక్షాత్తుగా నుపదేశమును బొందినవారు. సాంఖ్యమతమునందలి కొన్ని నీతులను బౌద్ధులవలంబించిరి.

### ఉపవేదములు

ఇవి ఆయుర్వేదము, గాంధర్వవేదము, ధనుర్వేదము, స్థాపత్యము, అని విభజింపబడినవి.

ఆయుర్వేదమునందు రోగములు, వానిచికిత్స చెప్పబడినది.

గాంధర్వవేదమునందు నాట్యము, సంగీతమును, వివరింపబడినది.

ధనుర్వేదమునందు అస్త్రశస్త్రముల గురించియు, వాని ప్రయోగోపసంహారములు

మొదలగు వానినిగురించి వివరింపబడినది.

స్థాపత్యమునందు అరువదినాల్గు విధముల శిల్పనైపుణ్యమునుగుఱించి వచింపబడినది.

వేదాంగములు 6

శిక్ష, కల్పము, వ్యాకరణము, ఛన్దస్సు, జ్యోతిషము, నిరుక్తి, వీనిని గుఱించిన విషయమిందుగలదు,

ఉపాంగములు 4

పురాణము, న్యాయము, మీమాంస, ధర్మశాస్త్రము అనినాల్గు.

మీమాంసయందు, కర్మమీమాంసమనియు, బ్రహ్మమీమాంసమనియు గురు వ్యాసులు పరబ్రహ్మ విషయకముగా నాల్గు కాండములను పదునారు అధ్యాయములుగను విభజించియున్నారు. సర్వవిషయములను కరతలామలకముగా మనకెఱింగించుచు మన శ్రేయస్సునకు మూలసాధనమైన వేదములను గాపాడుట బ్రాహ్మణులకు ధర్మమైయున్నది. "బ్రాహ్మణానాంధనం వేదః" అనియు, ద్రావిడభాషయందు "అన్దణర్ మాడు" అనియు జెప్పినారు. కావున ఈవేదముల నధ్యయనముచేసి కాపాడవలసినవారు బ్రాహ్మణులు కనుక ఉన్నతపదవిలో నున్నవారు వేదాధ్యయనపరులైన బ్రాహ్మణుల రప్పించి తమ బాలుర కుపయుక్తములగు, పురుషసూక్తములు, ఉపనిషత్తులు, ప్రతిదినము ఒకగంట కాలమైనను జెప్పించి వానినభివృద్ధి పఱుపవలయును. ఇదిగాక వీరలు సంపాదించెడి ద్రవ్యమునందు కొంతభాగమును ఇందులకై ప్రత్యేకము ఒక సభకూర్చి సేకరించి యాద్రవ్యమును, సప్తమకాండమో లేక అశీతిద్వయమో సంహితాపారాణచేయుటకును పదము, క్రమము చెప్పయోగ్యత సంపాదించినవారికి మాసమొక్కింటికింతయని వారి దేహయాత్రకుగాను గావలసిన ద్రవ్యము నిప్పించి వారికి శాశ్వతమైన ఉద్యోగము దొరకువరకు సహాయమొనర్చి పోషించినయెడల, బాలురు కొందరైనను వేదముల నభ్యసించుటకు రాగలరు. ఈవిషయమును గుఱించి పెద్దలాలోచించి, మహామహిమగల వేదములు నష్టముకాకుండునటులు ఏర్పాటు చేయవలయునని దాసుని ప్రార్థన.



శ్రీమతే రామానుజాయ నమః

# పరవిద్య

సాహిత్యభూషణ శ్రీ ఉ. వే. శ్రీమాన్ సముద్రాల లక్ష్మణాచార్యులుగారు
ముక్తిపల్లి అగ్రహారం.

శ్లో. శ్రీమద్వేంకటరఙ్గాఖ్యదేశికేన్ద్రపదాబ్జయోః
అనులోమవిలోమాభ్యాం మనోలగతుమామకమ్

ఆర్యమిత్రులారా "సర్వేశ్వరసృష్టములగు ఈప్రకృతిమండలములందు చేతనులందరునూ సుఖము నపేక్షింతురే కాని దుఃఖమపేక్షింపరు. అయినను ఒకచేతనుడైననూ దుఃఖ మిశ్రముకాని సుఖమును పొందజాలడు. అట్టి సుఖమును పొందవలయునన్న సర్వేశ్వర సాన్నిధ్యమునందే లభించును. అట్టిసాన్నిధ్యము లభింపవలయునన్న వారి నుగ్రహమును సంపాదించు కొనవలయును. అట్టి యనుగ్రహమునకు పరవిద్యయే సాధనము. అనగా భక్తియే సాధనము. తత్స్వరూపాదులు తెలియవలయునన్న స్వతః ప్రమాణమైన శ్రుతియే శరణ్యము. ఆశ్రుతి గంభీరార్థము కలదగుటచేత దదర్థము నెఱుగుట మానవులకు సాధ్యము కానేరదు. గాన తన యాజ్ఞారూపమగు వేదాభిప్రాయమును తానే తెలుపదలచి "వ్యాసోనారాయణాంశజః" యన్నటుల సర్వేశ్వరుడు వ్యాసరూపమున నవతరించి శ్రుత్యభిప్రాయమును బ్రహ్మసూత్రరూపమున తెలియపరచెను. నిత్యమునూ సర్వేశ్వరునికి శయ్యారూపమున కైంకర్యమొనర్చుచూ సల్లాపము లాడుచుండెడు యనన్తుడే సర్వేశ్వరహృదయాభిప్రాయ మెఱిగిన వాడగుటచేత ఆయనన్తుడు భగవద్రామానుజ రూపమున యవతరించి యాబ్రహ్మసూత్రాభిప్రాయమును శ్రీభాష్యమువందు పరవిద్యయె పరబ్రహ్మప్రాప్తికి సాధనమని ప్రసాదింపబడినది. పరవిషయకవిద్య యగుటచేకావి సర్వవిద్యాశ్రేష్ఠత్వరూపోత్కృష్టము కలది యగుటచేగాని పరవిద్యయన సార్థకము.

"అథపరాయయా తదక్షరమధిగమ్యతే యత్తద
ద్రేశ్యమగ్రాహ్య మవర్ణమగోత్రమచక్షుశ్శ్రోత్రం
తదపాణిపాదం నిత్యంవిభుం సర్వగతం సుసూక్ష్మం
తదవ్యయం యద్భూతయోనిం పరిపశ్యన్తిధీరాః॥

యని యుపనిషత్తునందు పరవిద్యయె పరబ్రహ్మ ప్రాప్తి సాధనమని చెప్పబడెనది. (పరవిద్యయనగా భక్తిరూపాపన్న జ్ఞానమేయని ముఖ్యాంశ విషయముకాగా) అక్షరశబ్దవాచ్యుడైన అద్రేశ్యత్వాది ధర్మవిశిష్టుడైన పరబ్రహ్మముయొక్క ప్రాప్తికి పరవిద్యయె సాధనము.

వాది: అయితే అక్షరశబ్ద వాచ్యుడు పరబ్రహ్మమైనచో తత్ప్రాప్తికి పరవిద్యసాధనమని చెప్పవచ్చును. ఇచ్చట పరశబ్దవాచ్యమైనది సూక్ష్మరూప ప్రకృతియెగాన మీయిష్ట సిద్ధి కానేరదు.

అయితే చేతనాచేతన సాధారణములైన యదృశ్యత్వాది గుణములను బట్టి సూక్ష్మరూప ప్రకృతియె అక్షరశబ్దవాచ్య మనుట న్యాయమా? అనితరసాధారణ ధర్మములచే నిర్ణయింపవలెనందువా నిశ్చయమె వినుము.

అబ్రాహ్మణాది శబ్దములు బ్రాహ్మణభిన్న సమస్తవ్యక్తులను బోధించినను సజాతీయములగు ఆప్రసక్తిగల శీఘ్రోపస్థితులైన క్షత్రియాదులనె బోధించునుగాని వస్త్రాలాదులను బోధింపనేరవు. అటులనె అదృశ్యత్వాది శబ్దములున్నూ స్థూలరూపాచేతనగత దృశ్యత్వాది ధర్మములు నిషిద్ధములై సజాతీయమై ప్రసక్తిగల అవస్థాన్తరమును పొందిన సూక్ష్మరూపాచేతనమునె బోధించును. గాని విజాతీయమై అప్రసక్తమైన కాష్ఠాదులను బోధించనేరదు.

"అక్షరాత్పరతఃపరః" యన్నచోటనూడ పరభూతమైన యక్షరముకంటె పరుడగు వానిని నిర్దేశించినది గాని వాని కంటె పరుడగు వానిని నిర్దేశింపలేదు. అందువలన పురుష గత పరత్వావధిగా నిర్దేశింపబడినవాడు పరమపురుషుడు కానేరడు గాన యక్షరశబ్దవాచ్యమైన భూతయోనియగునది ప్రధానమే, దానికంటెపరుడుగా నిర్దేశింపబడినవాడు ఇది వరకెవవ వాడైన పురుషుడె పరమాత్మ కానేరడు.

అక్షరాత్పరతః పరః యన్నచోట అక్షరముకంటె పరుడు జీవుడు అతనికంటెపరుడు పరమాత్మయని సామానాధికరణ్యమునువిడచి చెప్పకూడదాయనియందువేమో అనరాదు. సమాన విభక్తితో నిర్దేశింపబడిన వాటికి సామానాధికరణ్యముచే నన్వయించుట యుచితముగాన ఈసామానాధికరణ్య స్వారస్య భంగముకాకుండ విశేషణ విశేష్యభావమె న్యాయము.

కాబట్టియె ప్రకృతి సమష్టిపురుషాధిష్ఠితమై భూతసృష్టిని చేయుటచే భూతయోనిత్వముసిద్ధించును "యథోర్ణనాభి స్సృజతే గృహ్ణతేచ" యనువాక్యశేషము ప్రకటన చేయుచున్నది. ప్రథమదృష్టాన్తము పురుషాధిష్ఠితమైన ప్రకృతి భూతసృష్టిని చేయునట్టి విధమునున్నూ-రెండవదృష్టాన్తము పురుషానధిష్ఠితమై భూతసృష్టిచేయు విధమునున్నూ-మూడవ దృష్టాన్తము పురుషసన్నిధానమున భూతసృష్టిచేయు విధమునున్నూ-తెలియ చేయుచున్నది కావున రెండు స్థలములయందునూ పరబ్రహ్మ కానేరదు.

సిద్ధాన్తి: చాలాపొరపడితివి, సావధానముగా వినుము.

"అథపరాయయాతదక్షరమధిగమ్యతే" యను శ్రుతిని ఉభయసాధారణములైన ధర్మములనుబట్టి సూక్ష్మరూపప్రకృతి పరముగా నన్వయించితివి గాని ఈప్రకరణమునందు

'యస్సర్వజ్ఞస్సర్వవిత్' అన్నిశ్రుతి అనితరసాధారణములైన సర్వజ్ఞత్వాది గుణములను ఆయక్షరమునకే విధించుటచే యక్షరశబ్దవాచ్యుడు పరమాత్మయే. కావుననే ,,యద్భూతయోనింవా అని చెప్పిన భూతయోనిత్వము సర్వేశ్వరునికి స్వరసముగా సమన్వయించును. ఏలయందువా ,,అక్షరాత్సంభవతీహ విశ్వమ్" విశ్వశబ్ద ప్రయోగముచేత చేతనాచేతనాత్మకమైన నిఖిలప్రపంచ సృష్టి తెలుపబడుచున్నది. గాన అట్టి చేతనాచేతనాత్మక ప్రపంచసృష్టికి ప్రకృతికారణము కానేరదు.

అయితే భూతయోనియనగా భూతోపాదాన కారణమనిగదా నీవు చెప్పునది అట్లుకు ఘటాదులకుపాదానకారణము మృదాదులగాన సమస్త భూతోపాదానకారణత్వము పరమాత్మకు సిద్ధింపనేరదే. కాను ,,యస్యాత్మా శరీరం యస్యపృథివీ శరీరం" అనియెడి శ్రుతియందు పృథివీశరీరకునిగా చెప్పుటచే మృత్తునందుకూడా నన్తర్యామిగానుండుటచే ఘటాద్యుపాదాన కారణము సర్వేశ్వరుడగుటచే సర్వభూతయోనిత్వముపపన్నమే గనుకనే యథోర్ణనాభిస్సృజతే గృహ్ణతేచ" యనువాక్యశేషము చక్కగా పరమాత్మను భూతయోనిగా స్వీకరించుచున్నది. ఎటులనగా

1 లోకమునందు ఉపాదానకారణము తనకంటె భిన్నమగు నిమిత్తకారణము నపేక్షించుట చూచుచున్నారము. గాన పరమాత్మయును స్వభిన్ననిమిత్త కారణాపేక్షియైనచో ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞానము అనుపపన్నముకాదా.

2 ఒక పరబ్రహ్మకు పరస్పర విలక్షణ ప్రపంచోపాదాన కారణత్వము ఎటుల సంభవించును.

3 ఘటాద్యుత్పత్తియందు ఉపాదానకారణములైన మృత్పిండాదులకు పూర్వావస్థోపమర్దము కనపడుచున్నది.

4 ప్రాకారమునకు ఉపాదానకారణములైన యిటుకరాళ్ళయందు చతురశ్రత్వాది రూప పూర్వాకార తిరోధానము కనపడుచున్నది అక్షరశబ్దవాచ్యుడైన నిర్వికారుడైన పరబ్రహ్మకు పూర్వాకారోపమర్ద తిరోధానములు సంభవింపవుగాన ఉపాదానకారణత్వము ఎటుల సిద్ధించును, అనునట్టి యాశంకలకు సమాధానముగ ,,యథోర్ణనాభిస్సృజతే గృహ్ణతేచ యను వాక్యశేషము ఒసంగుచున్నది. ,,యథోర్ణనాభిర్హృదయాత్ తంతూన్ సంతత్యవక్త్రతః ॥ తయావిహృత్య భూయస్తాంగ్రసత్యేవం జనార్దనః యను నటుల సాలెపురుగు తనలోపలనున్న తంతువులను బయల్పరచుటకు మరల మ్రింగుటకును నిరపేక్ష కర్తృత్వము కలదియో

ఒకటియైన పృథ్వికి పూర్వావస్థోపమర్ద తిరోధానములు లేకున్నను అతి విలక్షణములైన ఓషధులకు ఉపాదానత్వమెటుల సిద్ధించినదో.

పరస్పర విలక్షణుడైన చేతనునికి అచేతనములైన కేశలోమాద్యుపాదానత్వమెటుల సిద్ధించునో అటులనె నిమిత్తకారణాన్తరాపేక్షలేని ఉపాదేయవిలక్షణుడైన నిర్వికారుడైన పరమాత్మనుండి పరస్పరవిలక్షణమైన చేతనాచేతనాత్మకమైన నిఖిల జగత్తు కలుగుచున్నదని సమాధాన మొసంగినది.

,,అక్షరాత్పరతః"యను శ్రుతికినీవు చెప్పునది సరికాదు. ఇచ్చట పఞ్చమ్యన్తముగా నిర్దేశింపబడిన పరతఃయనునది పరశబ్దము పఞ్చమ్యన్తపదాపేక్ష కలదియనుటచే వచ్చినదిగాని సామానాధికరణ్యసిద్ధికికాదు. ఇదిగాక పరతఃయనుపదము స్వకార్యవర్గబోధకపదాధ్యాహారాపేక్షకలదిగాన దానినపేక్షించుచో అధ్యాహారదోషదుష్టమగును. మరియును అక్షరాత్పరతః పరుడు జీవుడుకాడు పరతఃఅక్షరాత్ అని శ్రుతిచెప్పలేదు, అక్షరాత్పరతఃపరః అని శ్రుతిక్రమము చెప్పినది గాన అక్షరాత్పరతః పరుడుగా నిర్ణయింపబడినవాడు పరమాత్మయె కాని జీవుడుకాడు.

మరియు ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞాన రూపవిశేషణముచేత కూడ అక్షరశబ్దవాచ్యుడు పరమాత్మయని నిర్ణయింపబడినది.

"సబ్రహ్మవిద్యాంసర్వ విద్యాప్రతిష్ఠాం అథర్వాయజ్యేష్ఠ పుత్రాయప్రాహ" బ్రహ్మదేవుడు తన పెద్దకుమారుడగు అంగిరసునకు సర్వవిద్యాశ్రయమైన బ్రహ్మవిద్య నుపదేశించెను. ఇట్లు చతుర్ముఖాదిగురుపరంపరాలబ్ధమైన బ్రహ్మవిద్యను అంగిరసుని వలన వినగోరి శౌనకుడు బ్రహ్మవిద్య సర్వవిద్యాశ్రయమగుటచే ఒక బ్రహ్మజ్ఞానమువలన సర్వవిజ్ఞానము కలుగుననెడి యాశచే "కస్మిన్నుభగవోవిజ్ఞాతె సర్వమిదం విజ్ఞాతం భవతియనియడిగెను. ఈప్రశ్నకు శౌనకుడు "ద్వేవిద్యెవెదితవ్యే ఇతిహస్మయద్బ్రహ్మ విదోవదన్తి పరాచైవాపరాచేతియని సమాధానము చెప్పను. ఈతావున బ్రహ్మను పొందగోరువాడు పరాపరవిద్యలను తెలుసుకొనవలయుననగా పరాపరవిద్యలు బ్రహ్మవిద్యకు అర్థాన్తరములు కావని తేలినది. ఆట్టి పరాపరవిద్యలలో పరవిద్యయనగా భక్తిరూపాపన్నజ్ఞానమె యని "నాయమాత్మాప్రవచనె నలభ్యఃయను శ్రుతి జ్ఞానము యొక్క విశేషస్వరూపమును తెలుపుచున్నది. అయితే పరబ్రహ్మప్రాప్తికి ఒకవిద్యచాలదా ఒకవిద్యచేతనే బ్రహ్మప్రాప్తి కలుగుచుండగా రెండవవిద్య వ్యర్థమేకదాయని యందువేమో కాదు పరాపరవిద్యలలో పరవిద్యయోగజన్యమైనది, దానిని అపరోక్షజ్ఞానమందురు. అదియే భక్తిరూపాపన్నజ్ఞానము. అపరవిద్య శాస్త్రజన్యజ్ఞానము దీనిని పరోక్షజ్ఞానము ఈరెంటిలో అపరోక్షమైన భక్తిరూపాపన్నజ్ఞానము అవ్యవధానముగా పరబ్రహ్మప్రాప్తిసాధనము. పరోక్షజ్ఞానమో వ్యవధానముగా పరబ్రహ్మప్రాప్తిసాధనముగాన రెండునూ సార్థకములెగాన అక్షరశబ్దవాచ్యుడైన జగత్కారణుడైన సర్వజ్ఞత్వాది సమస్త కళ్యాణగుణాకరుడైన నారాయణ పరబ్రహ్మయొక్క ప్రాప్తికి ముఖ్యసాధనమైనది పరవిద్యయె యని సిద్ధాన్తము.






శ్రీమతి వి. శ్రీనివాసమ్మగారు

# గీత

గీత బంగారము వంటిది. ఈగీతా స్వర్ణము ఎవనిహృదయమునందు భద్రమై యున్నదో అట్టి నరుడు జ్ఞానధనవంతుడు అగుచున్నాడు ఎట్లనగా అధికమగు బంగారముచేత గలినవాడు లోకములో గొప్ప ధనవంతుడుగా భావింపబడుచు గౌరవింపబడుచున్నాడు. అటులనే గీతాస్వర్ణము తనవశమందు గలవాడు జ్ఞాన ధనికుడు గౌరవింపబడువాడు, మరియును స్వర్ణముగలవాడు స్వర్ణమును సొమ్ములుగాను, నవరత్నములు పొదిగిన భూషణములుగాను, నాణ్యములుగాను, పాత్రలుగాను. ద్రవ్యరూపముగాను మార్చి క్రయవిక్రయార్హముగాచేసి నిర్భయముగా ఆనందభరితుడై అనుభవించుచు భోగ సుఖ పరాయణుడై యుండునో అట్లే భగవద్గీతా స్వర్ణ విగ్రహము తనవద్ద కలవాడు. శ్లోకముగా జపించుచు నిత్య పారాయణముచేయుచు, ఆచార్యులవలన విశేషార్థములను వినుచు తెలుసుకొనుచు విధ విధములుగా భావార్థముల గ్రహించుచు, ఇతరులకు తానుచెప్పి వారిచే మరియితరులుకు చెప్పించుచూ ఇష్టమువచ్చినట్లు గీతానుష్టానములను అనుష్టించుచు సుఖించుచున్నాడు. ఇట్టి గీతార్థ జ్ఞానముగల యాచార్యులు శిష్యులు అందరు లోకములోనుండు జనులవలన గౌరవింపదగిన వారు. మరియు బంగారమెట్లు అన్నిలోహముల కన్న శ్రేష్టమో అట్లే శ్రీగీతార్థ జ్ఞానముగల పెద్దలు విద్వాంసులలోను పండితులలోను, శ్రేష్టులుగానుందురు. మరియు బంగారును, ఇత్తడియు, సామాన్యులకు ఒకే వర్ణముగా తోచును. దానిని పుటమువేయగానే వాటివాటి వేరువేరు నిజస్వరూపములు కంసాలివానికెట్లు తెలియునో అట్లే సామాన్యులకు అన్ని శాస్త్రములును గీతాశాస్త్రమును ఒకటిగా తోచినను జ్ఞానులగు పండితులకు మాత్రము గీతాశాస్త్రము శాస్త్ర ప్రధానముగానే తోచును. బంగారము పుటము వేశి కరగించిచూడగా వన్నెఎట్లు గణనకువచ్చుచున్నదో. అట్లే శ్రీగీతలు పెద్దలచే నిర్ణయించి చెప్పబడు వ్యాఖ్యానములు విస్తారముగా విన గలిగిన గీతామహాత్మ్యము తెలియుచున్నది.

శ్రీగీతలు కౌస్తుభమణివంటిది. కౌస్తుభమణి పాలసముద్రమున బుట్టిన దేవమణి సముద్రుడు ఈదివ్యరత్నమును శ్రీమహాలక్ష్మి కల్యాణకాలమునందు శ్రీమహావిష్ణువునకు సమర్పించెను. శ్రీవిష్ణుమూర్తి శ్రీమహాలక్ష్మిని ఎల్లప్పుడు వక్షస్థలమున ధరియించి యుండునట్లే ఈకౌస్తుభ

మణిని కూడ సర్వకాలములయందు విష్ణువక్షస్థలమున ధరించియుండును. అట్లే ఈగీతా కౌస్తుభమణియును శ్రీకృష్ణభగవానుని హృదయపీఠమునందును, వాక్కునందును నిత్యవాసము చేయుచు భగవంతుడగు పరమాత్మయొక్క విగ్రహగుణవిభూతులను ప్రకాశింపచేయుచుతన దీప్తిచే భక్తుల అజ్ఞానమను చీకటిని బోగొట్టతగిన ప్రభావంతములగు అర్థములను కల్పించి ఇచ్చుచు రత్నభూషణమువలె జ్ఞానుల ఆత్మలను జ్ఞానప్రకాశకమగునట్లు అలంకరించుచు. శ్రీమహాలక్ష్మికి కౌస్తుభమణి సహజన్మస్థానమును,సమానస్థానమును ఎట్లు వహించెనో అట్లే శ్రీభగవద్గీయును భగవంతుడగు శ్రీమన్నారాయణుని, (శ్రీకృష్ణుని) సనాతనస్థానమును స్వరూపస్థానమును వహించియున్నది. గనుక యిన్ని మహిమలతో గూడి 14 లోకములుగల బ్రహ్మాండమంతయు నిండి సూర్యచంద్ర నక్షత్రాదులవలె ఎల్లకాలమును ప్రకాశించుచు ప్రసిద్ధివహించియున్న శ్రీగీతాశాస్త్ర గ్రంథమును కేవలము సామాన్యమైనదిగా గాని, ప్రకృతిసంభంధము కలదిగా గాని, విషయాంతరములతో చేరిన సాధారణ పుస్తకముగాగానిఎంచరాదు. శ్రీగీతలు అప్రాకృతమగు దైవసంభంధ పరమాత్మస్వరూపంబుగా నెంచవలయును. వ్యాఖ్యాతులతో గూడిన, ప్రణవస్వరూపముగా నెంచవలయును. 24 అక్షరములతో గూడిన గాయత్రీ మంత్రముగా నెంచవలయును మరియును భగవదాత్మ భగవద్గుణ, భగవద్విగ్రహ, భగవద్విభూతులను విస్తారముగా వివరముగా, దెలుపు వేదముల స్వరూపముగా ఉపనిషత్తుల స్వరూపముగానెంచవలయును. ముముక్షువులకు సదనుష్టానమార్గములను దెలుప శాస్త్రముల మూలస్వరూపముగా నెంచవలయును. భగవదవతార విశేషములను, కారణములను తెలిపించు ఇతిహాస శ్రేష్టస్వరూపములుగాను, భగవంతుని లీలావిశేషములను దుష్టనిగ్రహ శిష్టపరిపాలనమును వివరించి తెలియజేయు పురాణ స్వరూపములని ఎంచవలయును.

శ్రీగీత 700 వందల శ్లోకములు కలది. 3 భాగములు లేక 6 భాగములు, 3 అర్థములు లేక 6 అర్థములు గలది.

18 అధ్యాయములు గలది. ఆఅధ్యాయముల పేర్లు వరుసగా ఆయాయర్థములను బట్టి తెలుపబడియున్నది. అవి ఏవియనగా?

1 అర్జునవిషాదయోగము. 2 సాంఖ్యయోగము. 3 కర్మయోగము 4 జ్ఞానయోగము 5 కర్మసన్యాసయోగము, 6 ఆత్మసంయమ యోగము, 7 జ్ఞానవిజ్ఞానయోగము 8 అక్షరపరబ్రహ్మయోగము, 9 రాజవిద్యారాజగుహ్యయోగము, 10 విభూతియోగము, 11 విశ్వరూపసందర్శనయోగము, 12 భక్తియోగము, 13 క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగము, 14 గుణత్రయవిభాగయోగము, 15 పురుషోత్తమప్రాప్తియోగము, 16 దైవాసురసంపద్విభాగయోగము 17 శ్రద్ధాత్రయవిభాగయోగము, 18 మోక్షసన్యాసయోగము — మరియును 3 భాగములు 1 కి ఆరుఅధ్యాయములుగా విభజింపబడినది. అట్టి 3 భాగములున్ను, కర్మయోగ, జ్ఞానయోగ, భక్తియోగములుగా వివరింపబడియున్నది. ఈ మూటియందు ప్రపత్తినిష్టయు నిమిడియున్నది. శ్రీగీతా గ్రంధము పఠించువారిని శ్రీగీతా స్వరూ

ప్రదగు శ్రీకృష్ణపరమాత్మ సంసార సముద్రము నుండి రక్షించును. సంసారము నమునుగనీయక వివేకము కలుగజేయును. సముద్రము దాటుటకు పడవ ముఖ్యముగా కావలశియున్నది. పడవ ఎట్లు తన్నాశ్రయించిన వారిని యొడ్డుచేర్చునో అట్లే శ్రీగీతయు తన్ను పఠించువారిని సంసార సముద్రము నుండి తరింపజేసి, భగవత్పాదార విందములయందు జేర్చి సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్యములను భగవత్కైంకర్యముల నొసంగి పునర్జన్మరహితము జేయు మహా ప్రభావము. ఈగీతోపనిషత్తునకు గలదు. జనులారా! ఈకాలమునందు కలిపురుష పట్టసామ్రాజ్యకోలాహలమునందు మనలనుద్ధరించునది శ్రీభగవద్గీతయే, మనకు మనుష్యజన్మము లభించుటదుస్తరము. ఇట్టి సమయమున నరజన్మమున స్వయముగ నాత్మజ్ఞానమును వృథాచేయక ఆయుఃకాలమును దినముల ప్రొద్దులను దండుగబుచ్చక ఆటలు పాటలు వేడుకలును నిద్రలునిట్టూర్పులు పరదూషణములు, ఆత్మభూషణయు, మూర్ఖుల సహవాసము జేయక సత్సహవాసము జేయుచు డాంబికులతో జేరక అడకువగలవారి ననుసరించుచు ఆడంబర మొగవేషములు అబద్ధ సంభాషణలు వంచనతోగూడిన తలంపులు, మోసముతో గూడిన ముచ్చటలు, మాయలతో గూడిన మచ్చికలు, మర్మములతో గూడిన నడవడికలు, పటాటోపములు, ఆర్భాటములు, అట్టహాసములు జేయుచు మేము భాగవతులము, అనుష్ఠానపరులమని కొందరును, ప్రపన్నుల మనియును, ప్రథమనిష్ఠాపరులనియు, కొందరుచరమ పర్వనిష్ఠాపరులమనియు, కొందరు చరమ చరమార్థమెరిగిన పరిపూర్ణులమనియు, కొందరు గురువులుగాను, కొందరు ఆచార్యులుగాను, కొందరు మనకు మించిన జ్ఞానాధికులులేరనియు, మోక్షము మాయరచేతులోనున్నది మేమిచ్చిన వారికి ఉన్నదనియు, మాతోచేరని వారికి మోక్షములేదనియు, మేమే ఉత్తారకులము ఉపకారకులము, అని తమతమ ప్రభావములను దంభముగా పలుకుచును ప్రచారములు చేయుచుండు అహంకారపరులతో చేరక శ్రీగీతలను చదువుచు, గీతార్థములను వినుచు, గీతాగ్రంథమును పూజించుచు, అనుష్ఠానములు చేయుచు దినములను, కాలమును, గడుపు మహనీయులే మోక్షార్హులు, ముముక్షువులు మూర్తీభవించిన భగవదవతారములు అనినమ్మి పెద్దలయందు భక్తిగల్గి ఆత్మక్షేమమునుగోరుచు శ్రీగీతాచార్యులను, మరవకుండుటయే శ్రేయోదాయకము. శ్రీకృష్ణపరమాత్ముని మహిమకంటె శ్రీకృష్ణుని వాక్కుచే చెప్పబడిన గీతా వాక్యార్థముల మహిమ అపారము గనుక అట్టి గీతలను నమ్మికడతేరి ధన్యులు గావలెను.

మరియు నీగీతామహిమయందు చెప్పబడిన ముఖ్యమగు సారార్థము లేవియనగా శ్రీభగవద్గీత సాయించిన శ్రీపార్థసారథిస్వామిని మరువక భక్తిగలిగి శ్రద్ధగా పూజించవలయును నిశ్చలముగా నిర్మలముగా గలిగిన మనస్సుచే ఏకాంతముగా ధ్యానించవలయును. శ్రీగీతలను నిత్యము అనుసంధించు చుండవలయును.

అర్థములు వుపదేశముఖముగా తెలుసుకొని అనుష్ఠించుచుండవలయును. గీతల మహిమలు మనకు తెలియజెప్పి శ్లోకార్థములు కాలక్షేపము

సాయించిన గురువును జ్ఞానము గలిగించి ఆత్మ పరిశుద్ధముచేసి మనసును నిర్మలముగా చేసిన యాచార్యుని అలక్ష్యము చేసి మరచిపోయిన యెడల అట్టివారికి ఏయర్థమున్నూ ఫలించదు గనుక గీతాచార్యుని గీతలను గీతలు సాయించి అర్థములు విశదముచేసి చెప్పిన ఆచార్యుని త్రికాలములందు ధ్యానము చేయుచుండ వల యును. పరమాత్మయగు శ్రీకృష్ణుడు ఏకాంత ముగా అర్జునునికి గీతోపదేశముచేసి లౌకిక క్షత్రియధర్మమగు యుద్ధమునందు పురికొల్పి భూభారనివారణము మాత్రమేచేసెను. మన యాచార్యులు అట్లుచేయక ప్రత్యక్షులై నమై లోకాంతముగా గీతార్థములు చెప్పి ఆత్మశుద్ధి చేసిరి. గనుక భగవంతునికన్న ఆచార్యులే ప్రత్యక్షముగా పూజనీయులు స్మరించదగినవారు భగవంతుడగు గీతాచార్యులు ఇట్టి గీతాజ్ఞానము గల ఆచార్యుల హృదయకమల పీఠములందు స్థిరముగా నివాసముచేసి యుండును గనుక భగవం తుడు ఆచార్యరూపియై మనలను కడతేర్చునని నిశ్చయముగా నమ్మవలయును. భగవంతుడే సాక్షాత్తుగా ఆచార్య స్వరూపుడు అని అనేక ప్రమాణములు గలదు.

భగవంతుడు ఆచార్యుని అంతర్యామి రూపి గానుండి ఆచార్యరూపియై శ్రీగీతార్థశ్లోకములను మనకు చెప్పి ఆత్మను ప్రకాశింపజేసి ఉజ్జీవింప చేసిరి. గనుక శ్రీగీతాచార్యుడగు కృష్ణావ తారము శ్లోకములతో నిండియుండు శ్రీభగవ ద్గీతా భాష్యగ్రంథావతారము శ్రీగీతలభాష్యము లను అర్థములు మనకు కాలక్షేపముగా ఉపదేశిం చిన ఆచార్యావతారము ఈమూడును ఒకటే తత్వముగానెంచి శ్రద్ధాభక్తులు గలిగి యుండ వలయును.

ఈ విషయములందు చపలబుద్ధి యుండ కూడదు. మూర్ఖులగువారు చేయు మూఢోప దేశములు నమ్మగూడదు. మూఢులతో చేరక దూరముగా తొలిగియుండవలయును. ఇదియే స్వరూపజ్ఞానమునకు అనుష్టానమునకు ముక్తికి ముఖ్యసాధనము.

---

## పరమపదమెట్లు సిద్ధించును ?

స్వరూపనాశకులతో కలసి మెలసియుండుట యనర్థము.
స్వరూపవర్ధకులతో కలియకపోవుట యనర్థము.
సత్పురుషులుకానివారితో గలసి మెలసియున్నట్లయిన అనర్థముచేకూరును
సత్పురుషులతో గలసి మెలసియుండుట 'సదాపశ్యంతి' అన్నట్లు పరమ పదప్రాప్తిని చేకూర్చును.

# ఉడయవరులకు దివ్యప్రబంధమందలి యాదరణ.

శ్రీమతి మరంగంటి రంగనాయకమ్మగారు.

ఉడయవరులొకసారి యాళ్వారుల సేవింప తిరునగరికి వేంచేయుచు మార్గమధ్యమున తిరుప్పుళింగుడియందు విడిదిచేయసంకల్పించి స్వయంపాకమునకై వలసిన సామగ్రులనెల్ల సంగ్రహించుకొని బయలు వేంచేయుచుండ దారిలో నొక బ్రాహ్మణబాలిక కాన్పించెను. అప్పుడు వారిరువురకు నిట్లు సంవాదము జరిగెను.

రామా:- అమ్మాయీ! తిరునగరిచ్చటికెంత దూరము?

బాలిక:- (పరిహాసముగా) ఏమయ్యా! ఇంత పెద్దవాడవే! తిరువాయ్మొళియే చదువుకొనలేదా! అయ్యో పాపము.

రామా:- ఏమమ్మాయీ! తిరువాయ్మొళిలో యీవూరునకావూరింత దూరమని వ్రాయబడి యుండునా ఇది యేమి చిత్రముగా మాట్లాడుచున్నావే!

బాలిక:- సరి సరి ఇది యొక యాక్షేపణయా? ప్రపంచమునందలి నగరము లన్నిటి దూరము నుడుండు నంటినా? ఈ వూరునకు తిరునగరి దూరముమాత్రి మందవళ్యము వ్రాయబడియే యున్నది. అందుచే నిట్లంటిని.

రామా:- అది యెచ్చటనో చూపగలవా?

బాలిక:- నేను చూపుటకేమున్నది! అదియే తనను చూపుకొనుచున్నంత స్పష్టముగానున్నది. తొమ్మిదవ పదిలోని రెండవ తిరువాయ్మొళి యందలి పదియవ పాసురమున.

... ... ... ... ... తిరుప్పుళి గుడియాయ్!
వడివిణైయిల్లా మలర్ మగళ్
మత్తైనిలమగళ్ పిడిక్కుమెల్లడియై
కొడువినైయేనుమ్ పిడిక్క నీయొరు
నాళ్ కూవుతల్ వరుతల్ శెయ్యాయ్॥

తిరుప్పుళింగుడియందు వేంచేసియున్న స్వామీ! సాటిలేని సౌందర్యముతోనొప్పు దివ్యమంగళ విగ్రహముగల శ్రీపిరాట్టియు, అట్టి స్వభావమే గల భూపిరాట్టియు స్పృశించదగిన మృదువైన నీశ్రీపాదములను క్రూరపాపములు గలనేనుకూడ స్పృశించునటుల నీవొకదినమందైనను నన్ను నీ తావునకు పిలుచుకొనుట గాని లేదా నీవే నే నున్నచోటునకు వేంచేయుటగాని చేయవా? తండ్రీ!

అని యాళ్వారు సాయించిన పాసురము జ్ఞాపకమేలేదా!

రామా:- ఊ! ఉన్నచో-

బాలిక:- అయ్యో! రామా! ఇంక నేనేమి చెప్పను. ఇది నాపాపమే. అందాళ్వారులు 'కూవుదల్ శెయ్యాయే' యనుటచే తిరునగరికి తిరిప్పుళింగుడి కూతవేటు దూరమని యీ మాత్రమే యెరుంగరా?

రామా:- (మహాశ్చర్యానందములుప్పొంగ( నాతల్లీ! యిటురా తల్లీ! నిన్ను ముద్దు పెట్టుకొందునా! నిన్నాశీర్వదింతునా? నీచరణ కుసుమములకు మ్రొక్కుదునా! నాచిరుతా! నీవున్న యూ రెంత పవిత్రమమ్మ! నీతల్లిదండ్రులేమి పుణ్యము జేసిరమ్మా! అయ్యో! నిర్భాగ్యుడను. ఇట్టి గ్రామమున నా స్వయంపాక ప్రయత్నము

పాపమునకే గాదా! (అని యాసామగ్రిలు నెల్ల పారవేసి కుండల బ్రద్దలగొట్టి)

నాతల్లీ! నీయిల్లు చూపుమమ్మా! నీతల్లిదండ్రుల సేవించి వారి ప్రసాదము నారగించి తరింతును. పద పద తల్లీ! జాగు చేయకుము.

బాలిక:- (తెల్లబోయి చూచుచు) స్వామీ! అయినచో వేంచేయుడు (అని ముందునడుచును)

అంత నాబాలిక యిల్లుచేరి యచ్చట నామె తల్లిదండ్రులు బంధువులతో సంభాషించుచుండ ఉడయవరులు వారిని సేవించి మీరు తెలియచేసి మాకింత ప్రసాదమును ప్రసాదింపుడని ప్రార్థించి తమతోనున్న ప్రధానాచార్య పురుషవర్గముతో నారగించి యాబాలిక సంబంధము గలవారి నందర నంగీకరించి వారి మన్ననల నంది పెద్దలందరితోను తిరునగరికి వేంచేసిరి.

ఇందువలన ఉడయవరులకు దివ్యప్రబంధమందున్న యాదరము సువ్యక్తమగుచున్నది గాదా?

---

# ★ ఇండుపగింజ ★

శ్రీమతి మరంగంటి రంగనాయకమ్మగారు

వర్షఋతువునందు నదులు నదములు సరస్సులు, తటాకములు మొదలగు వాటియందలి నీరెర్రనై చిక్కనై పానమున కనర్హమై యనారోగ్యకరమై యుండుట ప్రత్యక్షసిద్ధము. ఆనీటిని పానార్హ మొనరింప వలెననిన దాని నొక భాండమందుంచి యొక యిండుపగింజ గంధమును దీసి దాని నాజలమున బాగుగ విలీనము గావింపవలెను. అంత నాబురద యాకుండ యడుగునకు దిగి నీరు తేరి పానార్హమై యుండును. కాని వాడుకొనుట కానీటిని పైకితీసినప్పుడెల్ల నడుగున నడగియుండు నాబురద కలిగి నీటిని కలుష పరచుచునే యుండును. కావున నానీటిని వేరొక శుద్ధపాత్రలో జేర్చిన పవిత్రమై యెల్లప్పుడును పానార్హమై యుండును.

అట్లే యజ్ఞానప్రదమగు శరీరమునందుండు ఆత్మను ఆచార్యుడను మహోపకారకుడు తిరుమంత్రజ్ఞానమనెడు యిండుపగింజ గంధముచే తేర్చ నాయజ్ఞానమడుగంటి జ్ఞానమొకింత పైకి తేరి ప్రకాశించును. ఆయాత్మ యింకను నాశరీరమందే యున్నచో నొకనాడైనను అజ్ఞానము కలుషపడుట యనివార్యముగాన నాయాత్మ ప్రాకృత శరీరమును వీడి యప్రాకృత శరీరమున జేరువరకు కలతజెందక గాపాడు భారమును వహించియున్న సదాచార్యుని సన్నిధిని వర్తించుటయే యాత్మకుస్వరూపానురూప ధర్మమని పూర్వాచార్యులు సాయించుదురు.




## శుక్రవార పూజలు

### అర్తమూరు

1. తాడి రామన్న భార్య చిట్టెమ్మ 0-4-3
2. ఎనమండి నరశింహమూర్తిభార్య సీతామహాలక్ష్మి 0-4-3
3. తాడి వెంకన్న భార్య గంగమ్మ 0-4-3
4. కోనాల అమ్మిరెడ్డి భార్య సత్తెమ్మ 0-4-3
5. కొప్పూరి సూరిరెడ్డి భార్యమహాలక్ష్మి 0-4-3
6. మంశ రామన్న భార్య మంగయ్యమ్మ 0-4-3
7. ద్వారంపూడి వెంకటరెడ్డిభార్యమంగమ్మ 0-4-3

పైప్రకారం శుక్రవారోత్సవములు జయప్రదముగా జరిపించినారు.

సం॥ కార్యదర్శి,
చి. ఆదెమ్మ.

## ఏకాదశి పూజలు

### అర్తమూరు

1. ఎనమండి నరశింహమూర్తి భార్య సీతామహాలక్ష్మి 0-4-0
2. పోతంశెట్టి వెంకన్నభార్యమహాలక్ష్మి 0-4-3
3. కొప్పూరి సత్తెయ్య భార్య సత్యవతి తొలి ఏకాదశి 0-4-3

ఈపూజలు సహస్రనామములు భజనలు తోను చాల వైభవముగా జరుపబడెను.

సం॥ కార్యదర్శి,
చి. ఆదెమ్మ.



శ్రీమతే రామానుజాయనమః

# శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ

## ఆషాఢమాస పండిత సభాహ్వాన పత్రిక

స్వస్తి శ్రీ ఖరనామసంవత్సర ఆషాఢబహుళ తదియా శనివారము (21-7-51) మొదలు మూడుదినములు కాకినాడ దేవాలయము వీధిలో వేంచేసియున్న శ్రీ వేణుగోపాలస్వామివారి ఆలయమునందు, "న్యాయవేదాన్త విద్వాన్" శ్రీ ఉ. వే. శ్రీమాన్ గొడవర్తి శఠగోపాచార్యస్వామిగారి అధ్యక్షతక్రింద శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ ఆషాఢమాస పండితసభలు జరుపబడును. అందు పండితులచే వివిధవేదాంత విషయములు ఉపన్యసింపబడును గాన తామెల్లరు నిందుపాల్గొని అనందింపగోరుచున్నాము.

శ్రీ యతిరాజ సేవా మహిళా మండలి యాజమాన్యమున ప్రతిదినము మధ్యాహ్నము గం॥ 2-0 లు మొదలు 4-0 వరకు స్త్రీలకు ప్రత్యేకము విదుషీమణులచే ఉపన్యాసము లివ్వబడును.

ఇట్లు,

ఆహ్వాన సంఘము

| | ఉపన్యాసకులు | | విషయములు |
|---|---|---|---|
| 1 | శ్రీ ఉ. వే. శ్రీమాన్. | గొడవర్తి శఠగోపాచార్యులుగారు. | శ్రీవిశిష్టాద్వైతమతస్వరూపము |
| 2 | ,, | శొంఠెలూరి వెంకటాచార్యులుగారు. | పురుషార్థములు |
| 3 | ,, | శ్రీ తి. పు. ధర్మాచార్యులుగారు. | భగవద్భజనము |
| 4 | ,, | మొలుగు రామానుజాచార్యులుగారు. | భక్తి |
| 5 | ,, | శ్రీ "కవిరత్న" గు. రామానుజాచార్యులుగారు. | ధనుర్దాసు |
| 6 | ,, | కో. ఋ. వెంకటాచార్యులుగారు. | గీత |
| 7 | ,, | తె. కం. గోపాలాచార్యులుగారు. | సద్విద్యా |
| 8 | ,, | ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులుగారు. | ధ్యానయోగము |
| 9 | ,, | తి. పు. వెంకటాచార్యులుగారు. | ప్రణవము |
| 10 | ,, | వింజమూరి రామానుజాచార్యులుగారు. | రామానుజవైభవము |
| 11 | ,, | ఈయుణ్ణి వీరరాఘవాచార్యులుగారు. | మానవకర్తవ్యము |
| 12 | ,, | కే. శఠకోపాచార్యులుగారు. | రామాయణభాతృప్రేమ |
| 13 | ,, | పెద్దింటి రాఘవాచార్యులుగారు. | శ్రీకృష్ణుని ఉపదేశము |
| 14 | ,, | విశ్వపతి శాస్త్రులుగారు | |
| 15 | ,, | M. V. V. K. రంగాచార్యులుగారు. | శ్రీవిశిష్టాద్వైతము నూతన మానవ లోకము. |

# సంభావనలు

## రాజమహేంద్రవరం

ముత్తంగి సుబ్బరామయ్యగారి పరమపదోత్సవ సందర్భములో వారికుమాళ్ళు సంఘమునకు సమర్పించిన సంభావన రు. 5—0—0

## నరసాపురం

కందాళ రాజగోపాలాచార్యులుగారి భార్య జానికమ్మగారి పరమపదోత్సవ సందర్భములో ఆవిడ కుమార్తు తిరునారాయణ రవిబాబుగారు సంఘమునకు సమర్పించినవి రు. 5—0—0 లు

పై సంభావనలు రెండున్ను కలవగుంట శేషాచార్యులుగారి ద్వారా మాసంఘమునకు చేరినవి.

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ

# శ్రావణమాస పండితసభాహ్వానపత్రిక

## (శ్రీపాదుకాక్షేత్రం, నడిగడ్డపాలెం, తెనాలి తాలూకా)

స్వస్తిశ్రీ ఖరనామసంవత్సర శ్రావణశుద్ధ ద్వాదశీ మంగళవారం (14–8–51) మొదలు మూడుదినములు తెనాలితాలూకా నడిగడ్డపాలెంలోనున్న శ్రీపాదుకా క్షేత్రమున ఉపన్యాసకేసరి సుబోధక సుధీమణీ శ్రీ ఉ. వే. శ్రీమాన్ కోయిల్ కందాడై రంగాచార్యులుగారి అధ్యక్షతక్రింద శ్రీవిశిష్టాద్వైత ప్రచారకసంఘ శ్రావణ మాస పండిత సభలు జరుపబడును. అందు పండితులచే వివిధవేదాంత విషయములు ఉపన్యసింపబడునుగాన తామెల్లరును యిందు పాల్గొని ఆనందింప గోరుచున్నాము.

శ్రీపాదుకాక్షేత్రం, } ఇట్లు,

నడిగడ్డపాలెం. } శ్రీకోదండరామ సేవక సమాజము.

| ఉపన్యాసకులు | విషయములు |
|---|---|
| 1, శ్రీ కో. కం. రంగాచార్యులుగారు | విభీషణ శరణాగతి |
| 2. శ్రీ బెల్లంకొండ రాఘవాచార్యులుగారు | చక్రవర్తి తిరుమగన్ |
| 3. శ్రీ మహాభాష్యం వరదాచార్యులుగారు | సీతావతార వైభవము |
| 4. శ్రీ కో. యి. శ్రీనివాస రామానుజాచార్యులుగారు | తిరువడి వైభవము |
| 5. శ్రీ కవిరత్న గు. రామానుజాచార్యులుగారు | శబరి |
| 6. శ్రీ సముద్రాల లక్ష్మణాచార్యులుగారు | అంగుళీ ప్రధానము |
| 7. శ్రీ శాంతలూరి వెంకటాచార్యులుగారు | గుహప్పెరుమాళ్ |
| 8. శ్రీ తి. పు. వెంకటాచార్యులుగారు | సీతాకల్యాణము |
| 6. శ్రీ కో. యి. వెంకటాచార్యులుగారు | శ్రీరామజననము |
| 10. శ్రీ ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులుగారు | పాయస విభాగం |
| 11. శ్రీ తె. కం. గోపాలాచార్యులుగారు | ఇళైప్పెరుమాళ్ |
| 12. శ్రీ పరాశర సుదర్శన భట్టరు అయ్యవార్లంగారు | భరతాళ్వాన్ |
| 13. శ్రీ ఈయుణ్ణి శ్రీనివాసాచార్యులుగారు | సముద్ర తరణము |
| 14, శ్రీ ఆయుర్వేద మహోపాధ్యాయ తి. ప. రామానుజ స్వామిగారు | శ్రీరామపట్టాభిషేకము |

మార్గము:— మదరాసురైలులోని చుండూరు స్టేషన్‌లోదిగిన ఈశాన్యముగా మైలుదూరములో నడిగడ్డపాలెమున్నది.



శ్రీరస్తు

శ్రీమతే రామానుజాయ నమః



# గీతామందిరము

శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘముచే, దీని యొక్క స్త్రీ శాఖయగు శ్రీయతిరాజ సేవా మహిళా మండలి యొక్క సంపూర్ణసహాయము వలన కొనబడిన, మదరాసులోని వరదాముత్తియప్పన్ వీధిని గల నెం. 1'7రు, గీతామందిరమను నామము గల యింటిలో ఈ క్రింద తెలుపబడిన మూడువిధములైన కార్యక్రమములు ఈ సంవత్సరమున ప్రారంభించబడును.

1. ఉభయవేదాంత పాఠశాల,
2. బాలికా పాఠశాల.
3. నిత్యకాలక్షేపగోష్ఠి.

## వివరములు

### ఉభయవేదాంతపాఠశాల 1

ఆదర్శము :- జ్ఞాన-భక్తి-వైరాగ్య సంపన్నులగు విద్యార్థులకున్ను; ప్రచారకులకున్ను; జిజ్ఞాసువులకున్ను ముఖ్యమైన అవసరమగు ప్రకరణ గ్రంథములతో సహా ఉభయవేదాంత గ్రంథముల తాము ఉపదేశమును బొందుట; ఇతరులకు వాటిని పాఠరూపముగను, కాలక్షేపరూపముగను, ఉపన్యాసరూపముగను, బోధించగల శక్తిని సంపాదించుట; ఆత్మోత్తారణకున్ను ప్రచారమునకున్ను అనువగు అనుభవాత్మక జ్ఞానమును సంపాదించుట; అను ఈ మూడింటికి తగువిధమున శిక్షణ నిచ్చుట.

కాలము:- ఈ పాఠశాలలోని కార్యక్రమము వరుసగ రెండు సంవత్సరముల పరిమితి గలదిగ యుండును. ఆ రెండు సంవత్సరముల యనంతరము గాని తిరిగి క్రొత్త విద్యార్థులు చేర్చుకొనబడరు.

పాఠములు ఉదయము గం. 6-30. లగాయతు గం.10-0 వరకున్ను;

సాయం. గం. 2-0. లగాయతు గం. 5-0 వరకున్ను సామాన్యముగ జరుగును.

అనధ్యయనములలో నూతన పాఠముల అధ్యయనము లేదు. అప్పటివరకు అయిన పాఠములపై విమర్శనలు, విశేషములు, వాక్యార్థములు, సింహావలోకనము, పెద్దలచే ఉపన్యాసములు, విద్యార్థుల పరీక్షలు జరుపబడును.

### పాఠ్యక్రమము – సంస్కృతవేదాంతము

వేదాంతకౌముది, యతీంద్రమతదీపిక, సిద్ధాంతసిద్ధాంజనము, గీతాభాష్యము, ఉపనిషద్భాష్యము, వేదార్థసంగ్రహము – శ్రీభాష్యము – శ్రుతప్రకాశిక (చతుస్సూత్రి).

### ద్రావిడవేదాంతము

అష్టాదశరహస్యములు, తత్త్వత్రయవ్యాఖ్యానము, ముముక్షుపడి, శ్రీవచనభూషణమువ్యాఖ్యానము, భగవద్విషయము, ఆచార్యహృదయము.

## విద్యార్థి యోగ్యతలు

అ. చాతుర్వర్ణ్యమందలి స్త్రీలు, పురుషులు యిందు చేర్చుకొనబడుదురు.

ఆ. వయోనియమము గాని ఆశ్రమనియమము గాని లేదు.

ఇ. ఇందుచేరువారు శిరోమణిగాని, ఉభయభాషా ప్రవీణగాని లేక వీనితో సమానమగు సంస్కృత పరీక్షలు గాని లేక ఈ పాఠ్యగ్రంథముల గురుముఖతః చదివి ఈ పరీక్షలలో ఉత్తీర్ణులు కాగలిగిన పాండిత్యమునుగాని కలిగి యుండవలయును.

ఈ. పంచసంస్కారపరులై యుండవలయును.

ఉ. శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘసభ్యులై యుండవలయును.

ఊ. శిష్టాచారసంప్రదాయములయందు సంపూర్ణ విశ్వాసముగలవారై వేదాంతోపదేశమునకు తగిన జ్ఞాన-అనుష్ఠాన-శక్తి-వైరాగ్యముల గలవారై యుండవలయును.

ఋ. తమ విద్యాభ్యాసానంతరము శ్రీవిశిష్టాద్వైత ప్రచారమును చేయగల శక్తి-సామర్థ్యములు-ఉత్సాహమును గలవారై యుండవలయును.

ౠ. పంచసూక్తములు-పంచోపనిషత్తులు; నిత్యానుసంధానము-తిరువాయ్మొళ్ళి కంఠస్థముగా వచ్చినవారలై యుండవలయులు

ఌ. దైవికాటంకములవలన తప్ప మరి యే యితరకారణములవలనను ఈ రెండు సంవత్సరముల మధ్యను ఈ విద్యాభ్యాసమును మానకుండునటుల ప్రతిజ్ఞచేయువారై యుండవలయును.

ౡ. అనుపనీతులకు, ఉపనిషద్భాష్యము, శ్రీభాష్యముల శ్రవణమూత్రమే.

## సదుపాయములు

I. విద్యార్థుల యోగ్యతానుసారముగ నెలవక్కింటికి విద్యార్థినక్కింటికి రూ. 10-0-0 మొదలు రూ. 50-0-0లు వరకు ఉచితవేతన మివ్వబడును.

II. ఈ ఉచిత వేతనము పాఠశాల ప్రారంభమైన పిమ్మట మూడుమాసములవరకు ఆ యా విద్యార్థుల యోగ్యతలు పరిశీలించబడి తృప్తికరముగ యున్నపిమ్మట మాత్రమే గడచిన మూడునెలల ఉచిత వేతనములతో సహా ఈయబడును.

సామాన్యములు:- ఈ ఉచితవేతన నిర్ణయములోను, ఈ పాఠశాలకు సంబంధించిన యావత్తు నిర్ణయములలోను ఈ సంఘకార్యదర్శులదే అంత్యనిర్ణయము.

అ. ఉచితవేతనమును కోరని విద్యార్థులు కూడ యిందు చేర్చుకొనబడుదురు.

ఇ. రెండు సంవత్సరములకాలము పూర్తిగ యుండ నవకాశము లేనివారలై ఆ యా ప్రత్యేక గ్రంథముల మాత్రము సేవించదలచిన విద్యార్థులుకూడ వారివారి యోగ్యతానుసారముగ యిందుచేర్చుకొనబడుదురు.

ఈ. విద్యార్థిగ గాకుండగ కేవల శ్రవణయోగ్యతమాత్రము కలిగియుండి ఈ పాఠ్యగ్రంథమందలి కొన్నింటిని గాని లేక అన్నింటిని గాని వినవలెననిగోరువారికి కూడ యిందు అవకాశము కలిగించబడును. ఇట్టివారలు శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘసభ్యులై ఈ గ్రంథముల శ్రవణయోగ్యతను కలిగియుండవలయును.

## బాలికాపాఠశాల 2

**ఆదర్శము:-** స్త్రీలలో లౌకిక విద్యకోపాటు ఆధ్యాత్మికవిద్య నభివృద్ధిపరచుట.

**కాలము:-** సామాన్యముగ ఉదయము గం. 7-0. లగాయతు గం. 10-0. వరకున్ను, సాయం గం. 2-0. లగాయతు గం. 5-0. వరకున్ను జరుగును.

**పాఠ్యక్రమము:-** ఇందు లౌకికవిద్య:-

ప్రయివేటుగ మెట్రిక్యులేషను పరీక్షను లక్ష్యముగ నుంచుకొని 4 సంవత్సరములలో ఆ పాఠ్యక్రమము విభజించి నేర్పబడును.

గృహనిర్వహణము, గృహవైద్యము, సంస్కృతము (కావ్యజ్ఞానము ఒకనాటకము, ఒకచెంపు, అలంకారము.)

హిందీ (రాష్ట్రభాషావిశారద.)

ఆంధ్రము (కావ్యజ్ఞానము. 3 శతకములు.)

అరవము (మాటలాడుట అర్థముచేసుకొనుట.)

### ఆధ్యాత్మికవిద్య

**ఆవశ్యకస్తోత్రపాఠములు.** (ముకుందమాల, ఆళ్వందారుస్తోత్రము, గద్యత్రయము, శ్రీగుణరత్నకోశము, క్షమాషోడశి, దేవరాజాష్టకము, శ్రీకృష్ణాష్టకము, శ్రీహర్యష్టకము, శ్రీవిష్ణుసహస్రనామము, పంచాయుధస్తోత్రము, శ్రీరామ-కృష్ణ-లక్ష్మీ అష్టోత్తర శతనామస్తోత్రములు, దాటీపంచకము, వరత్వాదిపంచకము, శ్రీగోదా-లక్ష్మీచతశ్శ్లోకములు ఇత్యాదులు.

**నిత్యానుసంధానము.** తిరుపల్లాండు, కణ్ణినుణ్ శిరుత్తాంబు, తిరుపళ్లియెழுచ్చి, తిరుప్పావై, వారణమాయిరం, కోయిల్ తిరువాయ్మొழி, రామానుజనూత్తందాది, ఉపదేశరత్నమాలై, శిరియతిరుమడల్.

శ్రీ భగవద్గీత ఇత్యాదులు.

ఆళ్వారాచార్యుల చరిత్రపఠనము.

### నిత్యకాలక్షేపగోష్ఠి 3

ప్రతినిత్యము మధ్యాహ్నము గం. 2-0. లగాయతు గం. 5-0. వరకు కేవల వేదాంత గ్రంథముల కాలక్షేపము జరుగుచుండును.

ఇవిగాక ప్రతినిత్యము ఉదయాస్తమానములయందు తిరువారాధనము, సన్నిధిప్రార్థన, తిరునక్షత్ర జయంత్యాది ఉత్సవకాలములలో విశేషములు జరుగుచుండును.

కార్యాలయము:—

107, వరదాముత్తియప్పన్ వీధి, మదరాసు-1
ది. 20-6-1951.

ఇట్లు,
శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము.

శ్రీ



శ్రీరస్తు

శ్రీమతే రామానుజాయ నమః



# భక్తులకు సవినయ విజ్ఞప్తి

బ్రహ్మయజ్ఞరూపమగు నీ కార్యక్రమమును జరుపుటకు సాలు పక్కంటికి సుమారు పదివేలరూప్యముల వరకు వ్యయమగునని అంచనా వేయబడినది. ఈ సంఘము తరపున ఈ పట్టణమున యింతవరకు జరిగిన అన్ని విధములైన కార్యక్రమములకు ఈ పట్టణవాసు లందరు విరివిగ విరాళముల నిచ్చి వైభవముగ జరిపించినారు.

ఇంతవరకు జరిగిన ప్రచారఫలితముగనే సుమారు 40 వేల రూప్యములతో గీతామందిరస్థాపనయు, ఈ పాఠశాల-కాలక్షేప గోష్ఠ్యాది ప్రారంభమున్ను జరుగుచున్నవి. ఇది నిర్మాణాత్మకమైన విలక్షణ కార్యక్రమము.

విజ్ఞానముద్వారాగాని విరివిగ ప్రచారము జరుగజాలదు. వేదాంతవిజ్ఞానమును వెదజల్లజాలిన విద్యాలయములే నేడు కరువైనవి. ఉన్న ఏ కొద్ది విద్యాలయములలోను విద్యార్థు లుండుట లేదు. ఇందులకు కారణము? ప్రజలలో ఈ విషయమున ఉత్సాహము, తగిన ప్రోత్సాహము లేకుండుటయే.

అందుచే అట్టికొరతను తీర్చుటకై యిందు తెలిపిన కార్యక్రమమును జరుపింపుటకు ఈ సంఘము తల పెట్టినది.

ఈ కార్యక్రమమును నడుపుటకు కావలసిన సాలు 1కి సుమారు పదివేలరూప్యములను ఉదారమహాశయులు విరాళముల స్వ-పరహస్తములద్వారా యిప్పించ గోరుచున్నారము.

పెద్దమొత్తముల విరాళముగ నిచ్చువారి తిరునామములు గీతామందిరమున లిఖించి యుంచబడును.

దాతలు తమ పేరులతో ఆ యా ప్రత్యేక ప్రత్యేక కార్యక్రమములను నడిపించదలచినచో అటులనే జేయ వచ్చును. లేదా ఆ యా ప్రత్యేక విద్యార్థులకు ప్రత్యేక ప్రత్యేకముగ ఉచితవేతనముల తమ పేరులతో నీయదలచిన వారు అటులనే జేయవచ్చును. దాతల కెవరి కెట్టి ఉత్సాహమున్నదో తెలిపిన, అందులకు అనుకూలమగు అన్ని ఏర్పాటులను ఈ సంఘమువారు కలుగజేయగలరు.

ఒక రూపాయి మొదలు పదివేలవరకు ఎవరి కెంత అవకాశము-ఉత్సాహము-గలదో అంత విరాళమును ఈయవచ్చును.

అందరు కలిసి ఈ కార్యక్రమమును నిర్విఘ్నముగను వైభవముగను, నడిపించవలసినదిగ గోరుచున్నారము.

శ్రీ శ్రీ శ్రీ

ఇట్లు,

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము



శ్రీమతే రామానుజాయనమః



భక్తి

# నివేదన

## వేదాంత మాస పత్రిక

సంపుటి 3 || ఖర—భాద్రపదమాసము || సంచిక ౬

# శ్రీవైష్ణవుఁడెవడు?

శ్రీ ఉ. వే. శ్రీమాన్
తే. కం. గోపాలాచార్యులుగారు, కోరుకొండ.

ఏతే సత్పురుషాః పరార్థఘటకా
స్స్వార్థాన్ పరిత్యజ్యయే ॥

తన సర్వస్వమును త్యజించి పరులకార్యముల ఘటింపజేయువారే సత్పురుషులు.) భర్తృహరి.

ఎవరు తనపట్ల మిక్కిలి నిష్ఠురముగను, నిర్దయగను ప్రవర్తించువారిపట్ల గూడ నుదారముగను దయాదాక్షిణ్యములతోను ప్రవర్తింతురో వారే శ్రీవైష్ణవులు. ఇందులకు మనకు భక్తప్రహ్లాద యనుష్ఠాన మొక ప్రబల నిదర్శనము.

హిరణ్యకశిపుడు తన మారణోపాయము లన్నియు రిత్తవోవుటగాంచి చింతాక్రాంతుండై యుండ పురోహిత పుత్రులదిగాంచి రాజా! నీవీ మాత్రమునకే యింతచింతింపవలెనా మేమున్న దెందులకు? చెప్పిచూతుము. ఈతడు మారనిచో మామంత్ర శక్తిని విజృంభింపజేసి యభిచార హోమము గావించి కృత్యయను భూతము నొకదానిని బుట్టించి దానిచే నీతని రూపడంగింతుమని యోదార్చిరి.

పిమ్మట వారాతనిని తమయింటికి గొనిపోయిరి. అచ్చట గురుశిష్యుల కీవిధమగు సంవాదమొకటి జరిగెను.

గురు— నాయనా! నీయది బ్రహ్మవంశము. రాక్షసేంద్రుని పుత్రరత్నముగా జన్మించితివి నీతండ్రివలె నీవును సమస్తలోకాధార భూతుడవగుదువు. నీకా దేవతలతో పనియేమి? నీకాయ నంతుని చింతయేల? తండ్రికిమించిన దేవుడు గలడా! తండ్రికి మించిన గురుడున్నాడా?

ప్రహ్లా— మహాత్ములారా! మీరు సెలవిచ్చినట్లు యీకుల ముత్కృష్టమైనదియే. నాతండ్రి సకల జగదారాధ్యుడనుటలో సందేహమేమి?.

గురువులలో తండ్రి మొదటివాడనుటయు నిర్వివాదాంశమే. సర్వవిధముల నాతనికపరాధమును గావింపరాదనియే సర్వదా తలంచుచుండును. కాని తాము నీకాయనంతుని చింతయేల యంటిరే యది మాత్రము నిరర్థకము. మీయందలి గౌరవముచే నేనింతకంటె జెప్పజాల. (తనలో) గురువులైనను భగవంతుని నిందించినవారి నపేక్షించుటకు నాచిత్త మొప్పకున్నది. వీరికా ప్రభావ మొకింత సూచింతును గాక.

(ప్రకాశముగా) ఏమి! గురుపుంగవులారా? ఏమంటిరి? అనంతుని చింతయేల యనియా? బాగు బాగు. మంచి గురువులే దాపరించిరి. మీరు చింతాదంతుర మనస్కులు కారేని నేనా యనంతుని మహిమ నొకింత విన్నవింతు సావధాన చిత్తులగుడు.

ధర్మార్థ కామమోక్షముల కంటె సంసార మండలమున పురుషార్థాంతరము మృగ్యమే గదా! అట్టి పురుషార్థముల నాల్గింటిని యాతడు ప్రసాదించునే, యిక మనకేమి కావలెను? గురుపుంగవులారా! వేయేల! నానిశ్చయమును వినుడు ఆయనంతుడే జగత్పతి, యాతడే కర్త, ఆతడే వికర్త, ఆతడే సంహర్త, ఆతడే భోక్త. ఆతనిని మించిన ప్రభువు వేరొకడు లేడు. ఇది ముమ్మాటికి నిశ్చయము. మీరు కూడ నాతని భజించి తరించుడు. ఇట్లాడినందుకు నన్ను క్షమింతురు గాక!

గురు- (కోపముతో) ఓరీ! నిర్భాగ్యుడా! నీవు మామాటవిందువని నిప్పులో కాలకుండ కాపాడితిమి. ఇట్లింకెన్నడును వదరవని నమ్మితిమి. చూడుము. నీవు మామాటను లక్ష్యపెట్టవేని యిదుగో యిప్పుడే కృత్యను విడిచి నిన్ను నిర్మూలింతుము. మాశక్తిని చవిచూతువుగాక.

ప్రహ్లా- ఆచార్యోత్తములారా! ఇది యెంత వెర్రి. ఎవ్వనిచే నెవ్వడు రక్షింపబడువాడు? ఎవ్వనిచే నెవ్వడు భక్షింపబడువాడు? రక్షణ భక్షణములు రెండును తానాచరించు పుణ్య పాపముల మీద నాధారపడి యుండుట నెరుంగరా? అందువల్లనే గదా ప్రతివాడును సర్వప్రయత్నములచేతను సత్కర్మలనే యాచరించవలెను.

(ఆచార్యపుత్రులు పట్టరాని కోపముతో కృత్యను పుట్టించి విడుతురు. అది భయంకరాకారమును దాల్చి కోపముతో మండిపడుచు భూమిని త్రొక్కుచు శూలము నాతని రొమ్మున గ్రుచ్చును. అయ్యది యాతనిని స్పృశింపగనే తుత్తునియలై నేలంగూలును. ఆహా! భగవంతునకు ప్రియమందిరమగు నాతని హృదయము సోకిన వజ్రాయుధమే రూపడంగ నిక నీక్షుద్రశూలమా హింసించునది?

పాపులచే పాపులహింసింప నేర్పడిన యాకృత్య యిప్పుడు విపరీతముగ నుపయోగింపబడుటచే ప్రహ్లాదునిపట్ల కుంఠితశక్తియై యెదురు తిరిగి నా గురుపుత్రులనే వేదింప నారంభించెను ఓహో ఇత్తరి నాయుత్తమ భక్తుని పరార్థైక ప్రవృత్తి సువర్ణాక్షర విలేఖ్యముగదా! నిదంత రానుభావ్యముగదా! సకలపాప విమోచకము గదా!

అట్లాకృత్యచే దహ్యమాన సర్వాంగులగు నాగురుపుత్రుల గాంచి మన చిరుతభక్త శిఖామణి కన్నీరు మున్నీరుగా గార్చుచు.

ప్రహ్లా- కృష్ణా! త్రాహి త్రాహి! ఓ సర్వవ్యాపకా! ఓజగద్రూపా! ఓజగన్నాథా! యీ నాయాచార్యపుత్రులనీ మంత్రాగ్నినుండి కాపాడవా! ఇదుగో! నేప్రమాణము జేయుచున్నాను.

సకల భూతములయందును సర్వవ్యాపియగు సర్వేశ్వరుఁడు శ్రీమహావిష్ణువే యనుటకు సంశయము లేదేని యీ విప్రోత్తములు జీవింతురుగాక!

సర్వవ్యాపకుఁడగు సర్వేశ్వరుని శత్రుపక్షమందును సంభావింతునేని నాపురోహితపుత్రులు జీవింతురుగాక!

నన్ను చంపుటకు ద్యమించి.విషము నిచ్చియు నిప్పున ద్రోచియు, దిగ్గజములచే ద్రొక్కించియు, సర్పములచే గఱపించియు పీడించిన వారిపట్ల నేను నిక్కముగ మిత్రులపట్ల ప్రవర్తించితినేని యీనాసత్యముచేతనే నాయీ యాజకులు చిరంజీవులగుదురుగాక! (ఇంతలో నా మంత్రాగ్ని యదృశ్యమయ్యెను.)

గురు- ప్రహ్లాదు నాలింగనము జేసుకొని యశ్రుధారలచే నాతని నభిషిక్తుని జేయుచు;

మాతండ్రీ! దీర్ఘాయుష్మాన్ భవ!అప్రతిహత బలవీర్య సమన్వితో భవ! పుత్రపౌత్ర ధనైశ్వర్య యుక్తోభవ! నీతత్వమెఱుంగక యపచారపడితిమి. తండ్రీ! "వైష్ణవులు అపకారుల కుపకారమొనరింతుర"ను ధర్మమును వినియు విశ్వసింపక నేడు దానిని సాక్షాత్కరించితిమి గదా! మేము ధన్యులము. మేమిదేపోయి నీమహాత్మ్యమునంతను నీ తండ్రికి విన్నవింతుము. (అని నిష్క్రమింతురు)

ఇది యొక ప్రాచీనోదాహరణము.

మరియొక విచిత్రమగు నర్వాచీనోదాహరణము నిచ్చి యీ విషయమును మరింత బలపరప యత్నింతును.

పూర్వకాలమున రామదాసుఁడను నొక భక్తశిరోమణి యుండెను. ఆతడెన్నఁడును చేయిజాచి యెఱుఁగని యప్రతిగ్రహ దీక్షితుఁడు. ఒకనాఁడొక మహారాజాతనిని బహుభంగుల బలవంతపరచి బహుమూల్యరత్నాదికము నర్పించెను. భగవంతుని లీలకు విషయము కానిదేది? ఆతఁడాధనరాశిని గైకొని తన యాశ్రమమునకు మరలుచుండ మధ్యేమార్గమున నిద్దరు దొంగలాతనిని బాధించి రత్నరాశిని కొల్లగొట్టి యంతటితో పోక నాతని చేతులు నరికి తుదకాతని నొక పాడునూత పారవైచి లేచిపోయిరి.

దైవవశమున నారాజచంద్రుఁడే వేటకై యడవిని దిరుగాడుచు తృష్ణాతురుఁడై యానూతి చెంత కేతెంచి యందున్న నాదీన చేతసుని రామదాసుగా గుర్తించి యొక త్రాటి సహాయమున నాతనిని బయటకు దీయించెను. ఎంత బలవంత పరచినను తన కపకారము గావించిన యా చోరుల జాడ నొకింతయు నాభక్తుఁడు జారవిడువ లేదు. చేయునది లేక నారాజపుంగవుఁడు శ్రద్ధాభక్తులతో నాభక్తునిపరిచర్యమాత్రము గావించుచుండెను.

దైవికముగ నొకనాఁడా చోరులా రాజభవన పార్శ్వమునుండి యేగుచుండుట నా రామదాసు గాంచి రాజుచే వారల తనచెంతకు రావించెను. ఆదొంగలా రామదాసును గుర్తించి నిలువున నీరై గజగజ వణఁకజొచ్చిరి. ఆభక్తుఁడది చూచి వారల ననేక రీతుల నాశ్వాసించి రాజుతో వీరు తన మిత్రులు గాన వీరల కిచ్చవచ్చినంత ధనరాశి నొసంగుమని యాదేశించెను. నుడువుట తడవుగ ధనరాసులా దొంగలమోళ్ళ గుమ్మరింపబడెను.

ఆదొంగలాశ్చర్య చకితమనస్కులై యీవిపరీత ఫలాగమ నిదానమారయ జాలక సంశయాక్రాంత మనస్కులయ్యు యేమియు నెరుంగనట్లు నటించుచు నోపినంత ధన నిచయము నెత్తుకొని సంతుష్టాంతరంగులై రాజభటుని సహాయముతో తమ గ్రామమునకేగ దొడంగిరి. మార్గమధ్యమున నారాజభటుడు వీరలను తమకు రామదాసుతో పరిచయమెట్లు కల్గెను. ఆయన మీకింత ధనము నిప్పింపనేల యని ప్రశ్నింప వారలు నిర్భయముగా "ఓ! రాజోద్యోగీ! మేమొకసారి యీ సన్యాసిని మృత్యువాతనుండి రక్షించితిమి. ఆతడా ఋణమునుండి యిప్పటి కిట్లు విముక్తుడాయెను. యని యంతిమాక్షర సమాప్తి సమకాలముననే యెదుట భూమి బద్దలై వీరి నిరువురను తన పొట్ట బెట్టుకొనియె. ఆరాజభటుడిది గాంచి భయసంభ్రమములతో బెదరుచు రాజు చెంతకేతెంచి రామదాసు వినుచుండ నీవార్తనంతను సవిస్తరముగ విన్నవించెను. ఈమాటలు చెవిని బడినతోడనే యాభక్తశిఖామణి నేత్రముల నుండి యశ్రుధారలు జలజలరాల దొడంగెను. వాటిని తుడుచుటతడవుగ నారామదాసునకు రెండు చేతులును వచ్చివేసెను. ఇదియంతయు జూచుచున్న నారాజున కాశ్చర్యముదయించెను. దీనికేమి హేతువని నిర్బంధించుటచే నారామదాసు జరిగినదంతయు పూసగ్రుచ్చినట్లు చెప్పివేసెను. ఇది యంతయు వినిన పిమ్మట నారాజున కాశ్చర్యము మరింత వృద్ధిజెంది యాతని నిట్లు ప్రశ్నించెను.

రాజు- వారు తమ చేతుల నరకినచో తమకు మిత్రులెట్లయిరి?

దాసు- తన చాతుర్యముచే సహితమునుండి తనను మరలించినవాడే తనకు మిత్రుడు నేను చేయిజాచి యెవరినుండియు నేమియు పరిగ్రహించనని ప్రతిన గావించియుంటిని. దైవఘటనచే నేనా ప్రతిజ్ఞ నుల్లంఘించితిని అందులకు ఫలముగా వీరు నాచేతులను నరికి నాపాపమును పోగొట్టి క్రియాత్మక ఉపదేశ మూలమున హితసాధకులైరి గావున వీరు నాకు మిత్రులైరి.

రాజు- వీరికి తమరేల ధనముల నిప్పించితిరి.

దాసు- మిత్రుల కపేక్షిత ధనముల నిప్పించుట సహజముగానే ఘటించవచ్చును గదా! అదియును గాక నేను సాపరాధుడను గనుక నన్ను వీరు శిక్షించుట సరియైనది గాని మరి యొకనాడు వీరిట్లు ధనాశచే నిరపరాధుని కూడ హింసింతురేని నరకములపాలగుదురు, అందుచే వీరి ధనతృష్ణను శమింపజేయు తలంపుచే నీచే ధనము లిప్పించితిని?

రాజు-అయినచో వీరిచావునకుమీరునగవనేల?

దాసు-నావలనగదా పాపము! వీరికీ దుర్మరణమాసన్నమైనది. లోకులు నన్నుత్తముడందురు. ఉత్తముని స్నేహఫలము త్తమమే గావలెను. కాని యిచ్చట విపరీతమాయెను. కావుననేను ఓ దైవమా! నాస్నేహమున కిట్టి విపరీత ఫలము ఘటించుటకు నేనేమిపాప మాచరించితినయ్యా! యని యేడ్చితిని.

రాజు:-అయినచో మీకు చేతులెట్లువచ్చినవి?

దాసు- ఇది సర్వేశ్వరుని నిర్హేతుక కృపాఫలము. ఆమహనీయుడు తన భృత్యుని యపచారముల గణింపక తన దయాపూర్ణస్వభావమునే యావిష్కరించుచుండును.

ఇదియంతయు విని యారాజచంద్రుడు హర్షపులకిత గాత్రుడై యానందవశమున గద్గదకంఠుడాయెను.

— హా! భక్త రామదాస్ —

ఇదిగదా నిజమగు వైష్ణవలక్షణము.

# సదాదిశబ్దములకు శ్రీమన్నారాయణునియందే పర్యవసానము

కోయిల్ కన్దాద వెంకటనర్సింహాచార్యులుగారు, రామన్నపేట, వరంగల్.



భగవంతునిచే సృష్టించబడిన ఈప్రపంచమునందు చైతన్యము కలిగి ఇహపర సాధకంబయి శాస్త్రవశ్యతగలదీ మానవజన్మమే. కావుననే జ్ఞానవిహీనమగు అచేతనమువలెను దుఃఖమనుభవించు నరకస్థుల వలెను సుఖానుభవమందు తేజశ్శరీరులగు దేవతలవలెకాక కిందటి జన్మ పరంపరలనుండి వచ్చుచున్న పాపనివృత్తికి పునరావృత్తి రహితమై శాశ్వతమైన మహదానంద మందుటకు కారణమైనది. యీభూలోకమందైన మానవజన్మమే.

ఈమానవుడు ముఖ్యముగా తెలుసుకొనదగిన విషయము కారణవస్తువై పరబ్రహ్మ యనబడు శ్రీమన్నారాయణుడు ఆనారాయణ బోధకమగు జ్ఞానము అపౌరుషేయమై నిత్యమై నిర్దుష్టమై భ్రమ విప్రలంభ ప్రమాదాది దోష రహితమై స్వయంప్రమాణమై శ్రీమన్నారాయణునిచే చతుర్ముఖ బ్రహ్మ కుపదేశించబడిన వేదమువలన కల్గును. అందు సదేవసోమ్యేదమగ్ర ఆసీత్, బ్రహ్మవాఇదమగ్రఆసీత్, ఆత్మావా ఇదమగ్రఆసీత్, పురుషఏవేదగ్ంసర్వం, యదా తమస్తన్నదివానరాత్రి ర్నసన్నచాసచ్ఛివఏవ కేవలః, హిరణ్యగర్భస్సమవర్తతాగ్రే, నకిరింద్రిస్వదుత్తరః, ఆకాశోహవై నామరూపయోర్నిర్వహితా, ఏకోహవై నారాయణ ఆసీత్, ఇత్యాదివేదాన్తవాక్యములందుసామాన్య వాచకములచే కొన్ని కొన్ని విశేషవాచకములచే కారణవస్తు బహుత్వము చెప్పబడుటచే ముముక్షుజనము సంశయవిచ్ఛిత్తికాక బాగుపడకుండుటచూచి సంసారభయపీడితులగు వారల యదృష్టవిశేషమువలన యవతరించిన భగవద్రామానుజాచార్యులవారు నారాయణాంశచే యవతరించిన శ్రీవేదవ్యాసుల వారిచే వేదార్థములన్ని క్రోడీకరించి రచింపబడిన బ్రహ్మసూత్రములకు పైన జెప్పబడు వేదాంత వాక్యార్థముల కన్నింటికి సమన్వయముజేసి యదార్థార్థమును తెల్పి భాష్యమునురచించిరి. మరియు అభేదవాదు లిదివరలో బ్రహ్మసూత్రముల కర్థమునిర్ణయించిన పిమ్మట త్రిప్పి వీరి నిర్ణయ మెందులకన!

అభేదవాదులు భేదశ్రుతులకు వ్యావహారిక సత్యత్వమాత్రము జెప్పి అభేదశ్రుతులకే పారమార్థిక సత్యత్వము నంగీకరించినారు.

అత్యంత భేదవాదులు అభేదశ్రుతుల కపరమార్థత్వమును జెప్పి భేదశ్రుతులకు పరమార్థత్వము నంగీకరించినారు. ఇక శ్రీభగవద్రామానుజాచార్యుల వారైతేనో భగవదాజ్ఞారూపంబగు వేదమునందలి ప్రామాణ్యాఽప్రామాణ్యబుద్ధిచే అంగీకార అనంగీకారములుచేయరాదని తలంపుతో భేదాఽభేదశ్రుతుల నన్నిటిని ఘటకశ్రుత్యనుసారము చక్కగా విమర్శించి సమన్వయ మొనరించినారు. కాన రామానుజాచార్యులవారి సిద్ధాన్తమే సర్వజనాదరణీయమని సిద్ధాన్తము.

సచ్ఛబ్దము (సదేవసోమ్యేదమగ్రఆసీత్) అనుస్థలమందు కారణరూపద్రవ్యము మరొక అవస్థ నొందుట కార్యమని యేద్రవ్యము

స్వభావము గలది కార్యావస్థయో. అస్వభావము గల ఆద్రవ్యమే కారణావస్థము, కాన పరిదృశ్యమానమైన ఈప్రపంచమునకింత గుణసామ్యావస్థమగు దీని సూక్ష్మావస్థనే సచ్ఛబ్దము చెప్పుచున్నదని శంకకలుగగా సచ్ఛబ్దము ప్రకృతికి సంబంధించని ఈక్షణరూప సంకల్ప విశేషము కల్గి యుండుటచే ప్రకృతి పరముకాదనియు సర్వకారణత్వమును ప్రతిపాదించుటచే చేతన పరముగాక పరమచేతనంబగు నారాయణునే బోధించుచున్నది.

బ్రహ్మశబ్దము నారాయణునికన్న నితరములగు చేతనాచేతన పరముగా శంకించి స్వరూపనుచేతను అనవధికాతిశయ బృహత్త్వము బ్రహ్మశబ్దమునకు ప్రవృత్తినిమిత్తమని ఆబృహత్త్వము నారాయణునియందు తప్ప నితరత్ర లేకుండుటచే బ్రహ్మశబ్దము శ్రీమన్నారాయణ పరముగా సిద్ధాన్తమొనరించినారు. ఆత్మశబ్దము, అత్తీత్యాత్మాయను వ్యుత్పత్తిచే కర్మఫలమనుభవించువాడనియర్థము. అకర్మఫల భోక్తృత్వము జీవునికే సంభవించుటచే ఆత్మశబ్దముచే చెప్పబడువాడు జీవుడని శంకించి అదభక్షణే, యను ధాత్వనుసారముగ అదనము సామాన్య భక్షణముకాక "యస్యబ్రహ్మచక్షత్రంచ ఉభే భవత ఓదనః మృత్యుర్యస్యోపసేచనం" అని మృత్యూపసేచనసహిత సకలబ్రహ్మాండోప సంహృతిరూపమైనదగుటచే ఆఅదనము శ్రీమన్నారాయణునకు తప్ప లేదితర చేతనునికి సంభవించనందున ఆత్మశబ్దము శ్రీమన్నారాయణ పరమే.

పురుషశబ్దము పురిసీదత ఇతిఅను వ్యుత్పత్తిచే పురుషశబ్దవాచ్య ప్రకృతి పరిణామ రూపంబగు శరీరమందుండు వాడనియర్థ మగుటచే దేవాది శరీరవిశిష్టుడగు జీవుని పరముగా శంకించి పురుష ఏవేదగ్ం సర్వం యద్భూతం యచ్చభవ్యం ఉతామృ తత్వస్యేశానః॥ అని భూతభవ్యరూపవత్వ అమృత ప్రదత్వ ఈశానత్వాది ధర్మవిశిష్టునిగా చెప్పుటచే ఆధర్మంబులు ఈశ్వర వ్యతిరిక్తంబగు జీవునియందు అసంభవంబగుటచే పురుషశబ్దము శ్రీమన్నారాయణపరమే.

పరంతు శబ్దములకు అర్థమును బోధించుట పర్యవసాన వృత్తియని అపర్యవసాన వృత్తియని రెండు విధంబులు అందు విశేషణాంశమును బోధించునది పర్యవసానవృత్తియని విశేష్యాంశమును బోధించున దపర్యవసాన వృత్తియని వ్యవహరింతురు. కావున "సఆత్మాఅంగాన్యన్యాదేవతాః" అను శ్రుతిచే సకల దేవతలు శ్రీమన్నారాయణునికి విశేషణ భూతంబగు శరీరంబనియు వాడు విశేష్యమగుయాత్మయనియు అపర్యవసాన వృత్తిచే విశేష్యమగు నారాయణుని యందే పర్యవసించును.

ఇంకను వేదవాక్యంబులు విధిరూపంబులని అనువాద రూపంబులని రెండువిధంబులు అందు అనువాద వాక్యంబులుకన్న విధి వాక్యంబులకు ప్రాధాన్యము కాన (అనితర సాధారణంబగు) ఇతరులకు సాధారణముకాని నారాయణ శబ్దంబుచే కారణత్వము విధింపబడుటచే అనువాదవాక్య ఘటితంబులగు ఇంద్ర హిరణ్యగర్భ శంభ్వాదిశబ్దంబులచే విధింపబడిన కారణత్వము నారాయణునియందే పర్యవసించునుకాన సద్బ్రహ్మాత్మాది సామాన్యవాచకంబులగు శబ్దంబులు అభిన్ననిమిత్తోపాదానకారణత్వ సత్యసంకల్పత్వ

సకల జగద్రక్షకత్వ సకల జగత్సంహారకత్వ మోక్షప్రదత్వాది ధర్మసాహచర్యముచే శ్రీమన్నారాయణ ప్రతిపాదకంబులై ఇంద్రాది విశేష వాచకంబులకు తత్తదసాధారణ శబ్దంబులు పరంబ్రహ్మాఽసాధారణ ధర్మసాహచర్యంబుచే అవయవార్థ విశేషంబుచే అపర్యవసానవృత్తి పూర్వకంబుగా నారాయణ పర్యవసానంబులగుటచేః "సర్వే వేదాయత్పదమామనంతి" యనియు వేదాక్షరాణి యావంతిపఠితాని ద్విజోత్తమైః తావంతి హరినామాని కీర్తితాని నసంశయః అని శ్రుతిస్మృతులచే చెప్పబడుచున్నది.

'యస్యాత్మాశరీరంయస్య పృథ్వీశరీరం' ఇత్యాది శ్రుతులచే సకలచేతనాచేతన శరీరకుడు నారాయణుడగుటచే శరీరవాచకానాంశబ్దానాం శరీరిణి పర్యవసానంబను న్యాయం బనుసరించి సర్వశబ్ద వాచ్యత్వము శ్రీమన్నారాయణునియందు సంభవించుచుండగా సదాదిశబ్దంబులు శ్రీమన్నారాయణ పర్యవసానంబులనుట కెంతయు సందియంబుండదు. ఇదియే పరాశరపారాశర్యాది నాథయామున యతివరాది పూర్వాచార్యాభి మతమగు సమన్వయము.

---

## యతిరాజవిజయ నాటకమునందలి కొన్ని చక్కని శ్లోకములు

శ్రీ ఉ. వే. శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులుగారు

సదూహుడు—

శ్లో. విభు శ్చే న్నైవ స్యా దణుపరిమితో ఽణు ర్యది భవాన్ ।
కథం సర్వత్ర స్యా ద్ద్వివిధ ఇతి చే న్నోచిత మిదం ।
స్వయం న స్యా ద్రూపద్వయ మపి న చే త్త్వాం మధురిపో।
కథం భూతాకారం కథయ నిరణైషీ దుపనిషత్ ॥

—: తా త్ప ర్య ము :—

ఓమధురిపూ! నీవు విభుపరిమాణము కలవాడవందుమా సకల చేతనాచేతనాంతః ప్రవేశార్హమగు నణుపరిమాణుడవగుట యెప్పుడు. అందుల కణుపరిమాణుడవందుమా, నంతట నిండి యెట్లుందువు? పోనీ ఉభయకార్యనిర్వాహమున కుభయవిధపరిమాణుడవందుమా, ఒక దానికి రెండు విరుద్ధరూపములుండవు గాన నిది • యసంగతము. ఇక నుపనిషత్తు నిన్నెట్టి యాకారుడవని నిర్ణయించెనో నీవే చెప్పుము.

## భగవద్విషయ పరంపర

శ్రీరామానుజయోగి సుందరవర
శ్రీశైలనాథాన్ గురూన్ ।
లోకార్యోత్తరవీధి-కృష్ణ కలిజిత్
వేదాంతి భట్టారకాన్ ।
శ్రీగోవింద యతీంద్ర పూర్ణ యమునా
వాస్తవ్య రామాన్వజే ।
పద్మాక్షాహ్వయ నాథయోగి శఠజిత్
సేనేశ పద్మా హరీన్ ॥

[జీయర్
1. శ్రీరామానుజయోగి = ఒన్నాన వానమామల రామానుజ
2. సుందరవర = మణవాళ మామునులు
3. శ్రీశైలనాథ = తిరువాయ్మొழிప్పిళ్లై
4 లోకార్య = పిళ్లైలోకాచార్యర్
4. ఉత్తరవీధికృష్ణ = వడక్కుత్తిరువీధిప్పిళ్లై
6 కలిజిత్ = నంబిళ్లై
7. వేదాంతి = నంజీయర్
8. భట్టారక = భట్టరు
9. శ్రీ గోవింద = ఎంబారు
10. యతీంద్ర = శ్రీరామానుజులు
11. పూర్ణ = పెరియనంబి
12. యమునావాస్తవ్య = శ్రీ ఆళవందార్లు
13. రామ = మణక్కాలనంబి
14. పద్మాక్షాహ్వయ = ఉయ్యకొండారు
15. నాథయోగి = శ్రీమన్నాథమునులు
16. శఠజిత్ = నమ్మాళ్వార్లు
17. సేనేశ = విష్వక్సేనులు
18. పద్మా = శ్రీదేవి
19. హరి = శ్రియఃపతి

ఈ పందొమ్మండుగురు ఆచార్యులను గురుపరంపరా మాలికలోను శ్రీరామానుజులుమధ్యనాయకమణియైయున్నారు.

### తిరువాయిమొళి వ్యాఖ్యానములు

తిరుక్కురుగైప్పిరాన్ పిళ్లాను = ఆఱాయిరప్పడి 6000
(విష్ణుపురాణ ప్రక్రియ)
నంజీయరు = ఒంబదినాయిర ప్పడి 9000
(శ్రీభాష్యప్రక్రియ)
పెరియవాచ్చాన్ పిళ్లై = ఇరుపత్తినాలాయిరప్పడి 24000
(శ్రీరామాయణ ప్రక్రియ)
వడక్కుత్తిరువీధిప్పిళ్లై = ఈడుముప్పత్తాఱాయిరప్పడి 36000
(శ్రుతప్రకాశిక ప్రక్రియ)
వాదికేసరి అళగియ మణవాళ జీయర్ = పన్నీరాయిరప్పడి
12000 (శ్రీభాగవత ప్రక్రియ)

* "పడి" అనగా 32 అక్షరములు గల భాగమని పేరు. దీనిని ఒక "గ్రంథము" అనికూడ వాడుదురు.

## శ్రీభాష్య పరంపర

శ్లో. వరదగురు వేంకటేశౌ
రామానుజ వరద విషుచిత్తార్యాన్
కురుకేశ్వర భాష్య కృతౌ
నమామి నాథేన యామునం వ్యాసం ॥

1. వరదగురు = నయనారాయణాచార్యులు
2. వేంకటేశ = వేదాంతదేశికులు
3. రామానుజ = అప్పుళ్లార్లు
4. వరద = నడాదూర్ అమ్మాళ్
5. విషుచిత్తార్య = ఎంగళాళ్వాన్లు
6. కురుకేశ్వర = తిరుక్కురుగప్పిరాన్ పిళ్లాన్
7. భాష్యకృత్ = శ్రీరామానుజులు
8. యామున = శ్రీయాళవందార్లు
9. నాథ = శ్రీమన్నాథమునులు
10 వ్యాస = వేదవ్యాసులు
11. పరాశర = పరాశరమునులు
12. సేనముదలి = విష్వక్సేనులు
13 శ్రీహరి = శ్రియఃపతి

ఈ పదముగ్గురు ఆచార్యులను గురుపరంపరామాలికలోను శ్రీరామానుజులు మధ్యనాయకమణియై యున్నారు.

### శ్రీభాష్యవ్యాఖ్యాతలు—వ్యాఖ్యానములు

1. సోమాసియాండాన్ = నయవివేకము, మిత్రప్రకాశికా
2. సేనేశ్వరాచార్యులు = శారీరకా ధికరణార్థ సంగ్రహము (సేనానాథీయం) అనుష్టుప్పద్య రూపము 300.
3. వరదనారాయణ భట్టారకులు = న్యాయసుదర్శనము
4. విషుచిత్తాచార్యులు = శ్రీభాష్యవివరణము, సంగతిమాలా
5. వ్యాసార్యులు = శ్రుత ప్రకాశికా శ్రుతదీపికా
6. వేదాంతాచార్యులు = తత్త్వటీకా, అధికరణార్థసంగ్రహము (స్రగ్ధరావృత్తరూపము) అధికరణ దర్పణము
7. రంగరామస్వామి = మూలభావ ప్రకాశికా. (గురుభావప్రకాశికా)
8. సురపురం శ్రీనివాసాచార్యులు = తత్త్వమార్తాండము,
9. కంచి శ్రీనివాసాచార్యులు = తత్త్వరత్నావళీ, (మణిమంజూషా సహితా)
10. అప్పయ్యదీక్షితులు = నయమయూఖమాలికా

# ఉపనిషద్వాక్యములు విశిష్టాద్వైతమునకే అనుకూలములు

[illegible] వేంకటకృష్ణమాచార్యులుగారు

ఆపాతతః విచారించగా ఉపనిషత్తులలో ప్రతిపాదించబడిన అభేదశ్రుతులు పరబ్రహ్మ ఒక్కడే సత్యము; మిగిలినది సర్వము అసత్యము: భేదము అపమార్గము అని తోచునట్లు ఉన్నవి. గాని శాస్త్రసహాయముచేత సూక్ష్మదృష్టితో యోచించినయెడల విశిష్టాద్వైతమే సత్యము అని యేర్పడుచున్నది. విశిష్టాద్వైతమనగా విశిష్టం చ విశిష్టం చ విశిష్టే: విశిష్టయోః అద్వైతం, అని విగ్రహము. నామరూప విభాగములు లేని సమయమునందు సూక్ష్మరూపముగా నుండి తిరిగి నామరూప విభాగమేర్పడి నప్పుడు స్థూలరూప మగుచున్నది. ఈ విషయమే సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్ ఏకమే వా ద్వితీయం అను శ్రుతిచేత ప్రతిపాదించ బడుచున్నది. మరికొన్ని అభేదశ్రుతులను విచారింతము. "నేహ నానా స్తి కిఞ్చన. మృత్యో స్స మృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి" అను శ్రుతిని ఆపాతతః యోచించగా ఈ పరబ్రహ్మయందు యేవిధమైన భేదము లేదు. ఎవడైతే దీనియందు భేదమునుచూచునో వాడు సంసారము నుండి తిరిగి సంసారమును పొందుచునే వుండును అనితోచునట్లున్నది. గాని దానికి ఈ అర్థము. ఎట్లన ఈజగత్తంతయు బ్రహ్మాత్మకము గాని వస్తువే లేదు. ఎవడైతే ఇచ్చట బ్రహ్మాత్మకముగాని దానిగా వస్తువును చూచుచున్నాడో వాడు సంసారము నుండి తిరిగి సంసారమును పొందుచూనే ఉండును. అని అబ్రహ్మాత్మక నానాత్వమే ఇచ్చట నిషేధించబడుచున్నది.

సమస్త ప్రపంచము బ్రహ్మకార్య మగుటచేత బ్రహ్మాత్మకమగుటచేత బ్రహ్మతో ఏకమగుట చేతనున్న బ్రహ్మవ్యతిరిక్తమైన భేదము నిషేధించబడుచున్నదేగాని 'బహుస్యాం ప్రజాయేయ' అని తైత్తిరీయములో చెప్పబడిన అనేక రూపములుగా అగుట అను సంకల్పముగాని, యోఽ వ్యక్తమన్తరే సఞ్చరన్ యోఽక్షరమన్తరే సఞ్చరన్, యస్యాక్షరం శరీరం, అను శ్రుతి వాక్యములచే చెప్పబడిన అన్తర్యామిత్వముగాని 'అనేన జీవే నాత్మ నానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి' అను శ్రుతిచేత చెప్పబడిన పేరును రూపమును పొందుట అను అంశముగాని ఈశ్రుతిచేత నిషేధించబడవు. ఇందుకు ప్రమాణశ్లోకము.

యద్బ్రహ్మణో గుణ శరీర వికార భేదకర్మాది గోచరవిధి ప్రతిషేధ వాచః। అన్యోన్యభిన్న విషయా న విరోధగన్ధ మర్హన్తి తన్న విధయః ప్రతిషేధబాధ్యాః॥ సమస్త హేయగుణ రహితునికి హేయాకార వస్తువుతో ఐక్యము సంభవించుట అసఙ్గతమైనందువల్లనున్ను సర్వజ్ఞునికి తన సఙ్కల్పముచేత హేయవిషయకమైన భ్రమ కలిగినది అని చెప్పుట అసమ్భావితమైనందువల్లనున్ను సర్వజ్ఞుడుకాడు అని చెప్పినయెడల (యః సర్వజ్ఞ స్సర్వవిత్) అను శ్రుతితో విరోధించుటవల్లనున్ను సర్వశక్తునికి తనయందుగల హేయనివారణ శక్తి లేదన్నచో (పరాస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే) అను సర్వశక్తి శ్రుతులు విరోధించుట వల్లనున్ను "పృథగాత్మానం ప్రేరితారంచ మత్వాజుష్ట స్తత స్తేనామృతత్వమేతి. జుష్టంయదా

పశ్యత్యన్యమీశం) అనునట్లు భేదజ్ఞానమే మోక్షోపాయము అన్నందువల్లనున్ను ఛాగపశున్యాయముచేత సామాన్యముగా భేదనిషేధము స్వతంత్ర భేదవిశేష నిషేధపర్యవసాయి అగుటవల్లనున్ను (జ్ఞాజ్ఞౌద్వావజావీశానీశౌ) అనుటచేత ఈశ్వరుడు నియమించువాడు జీవుడు నియమించబడువాడు అని భేదము స్పష్టముగా యేర్పడుచున్నందువల్లనున్ను, ఇది అనువాద రూపమన్నట్లైతే ఘటపటాది భేదమువలెనే ప్రత్యక్షప్రమాణా గోచరము కానందువల్ల అట్లు చెప్పుటకువీలు లేనందువల్లనున్ను ప్రమాణాన్తర ప్రాప్తమైన అర్థము యొక్క పునరనుసన్ధానమేగదా అనువాదము అనుటవల్లనున్ను ఇత్యాది అనేక యుక్తులచేత ఉపనిషత్తులలో చెప్పబడిన భేదనిషేధ శ్రుతులు అబ్రహ్మాత్మక నానాత్వ నిషేధపరములే గాని భేదమాత్ర నిషేధపరములు గావు. యత్రహి ద్వైతమివభవతి, యత్రత్వస్య సర్వమాత్మైవాభూత్, తత్కేన కం పశ్యేత్ తత్కేన కం విజానీయాత్ ఇత్యాది అభేదశ్రుతులున్ను ఈ విధముగానే ఉన్నేయములు.

(తత్త్వమసి శ్వేతకేతో) అను శ్రుతియందు తచ్ఛబ్దము పూర్వవస్తు పరామర్శి అగుటవల్ల సర్వజ్ఞుడై సత్యసంకల్పుడై జగత్కారణ భూతుడైన పరబ్రహ్మనే పరామర్శిస్తుంది. దీనికి పూర్వము (తదైక్షత బహుస్యాం) అను శ్రుతులవల్ల ఆ బ్రహ్మయే చెప్పబడుటవల్ల ఆ తత్పదముతో సమానాధికరణమైన త్వం అను పదమున్ను అచేతన విశిష్టజీవుడు శరీరముగాగల పరబ్రహ్మనే ప్రతిపాదిస్తున్నది. ఇట్లే (యదాహ్యేవైష ఏతస్మిన్నుదరమన్తరం కురుతే, అథతస్య భయంభవతి) అను శ్రుతివాక్యముచేత బ్రహ్మయందు కొంచము భేదమును తలచి నప్పటికిన్ని వానికి భయము కలుగుచున్నది. అని యేర్పడుచున్నది గదా అనగా ఆశ్రుతికి అట్లు అర్థము గాదు. (సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలానితి శాన్త ఉపాసీత) అను శ్రుతిచేత సమస్త జగత్తుయొక్క సృష్టి స్థితి సంహారములు పరమాత్మ కార్యమైనందువల్ల తదాత్మకము జగత్తు అని అనుసన్ధించుట శాన్తిహేతువు. ఆరీతిగా అనుసన్ధానమే అభయహేతువు అని యేర్పడుచున్నది. అయితే (అథతస్య భయంభవతి) అని యెందువల్ల చెప్పబడినది. అనగా ఆశ్రుతికి పూర్వము (యదాహ్యేవైష ఏతస్మిన్నదృశ్యే ఽనాత్మ్యే ఽనిరుక్తే ఽనిలయనే ఽభయం ప్రతిష్ఠాం విన్దతే అథసో ఽభయంగతో భవతి) అని బ్రహ్మయందు ప్రతిష్ఠను పొందినట్లైతే అదే భయహేతువు అని అర్థము. ఈఅంశమునే మహాత్ములు చెప్పిరి (యన్ముహూర్తం క్షణం వాపి వాసుదేవో నచిన్త్యతే) సాహాని స్తన్మహచ్ఛిద్రం సాభ్రాన్తి స్సాచవిక్రియా॥ ఏకస్మిన్నప్యతిక్రాన్తే ముహూర్తే ధ్యానవర్జితే। దస్యుభిర్ముషితే నేవ యుక్తమాక్రన్దితుం భృశం॥ ఇత్యాది అనేక ప్రమాణములచేత ఉపనిషత్తులకు విశిష్టాద్వైత బోధనమునందు తాత్పర్యమేగాని కేవలాద్వైత బోధనమునందు తాత్పర్యము లేదు.

"ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః"

కాకినాడలో జరిగిన

# శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ

## ఆషాఢమాస పండిత పరిషత్సభా సందర్భమున చదువఁబడిన

# పద్యరత్నములు

(కరి నారాయణాచార్య భాగవతార్, కాకినాడ.)

శా. "దాసోహం" సకలాభినంద్య పరమ శ్రీరంగ స్థలీనేతకున్,
"దాసోహం" భగవద్గుణానుభవ పూతస్వాంత సద్యోగికిన్,
"దాసోహం" యతిసార్వభౌమ చరణ ద్వంద్వాశ్రిత శ్రేణికిన్,
"దాసోహం" మనకార్యదర్శులకు, ను ద్యాత్, వి, ప్రి, సంఘానికిన్, 1

మ. సిరులొప్పన్ సకలాగమాంత విదులౌ శ్రీవైష్ణవాగ్రేసరుల్,
హరిభక్తాగ్రణులెందఱో యిటు విశిష్టాద్వైత సిద్ధాంత స
త్పరిషన్మాస సభాప్రయుక్తముగ సందర్శించినారల్, భళీ!
పరమామోదము, కాకినాడ పుర సౌభాగ్యమ్ము ముమ్మాటికిన్ 2

సీ. శ్రీరస్తు సర్వదా శ్రీవిశిష్టాద్వైత సమయప్రచారక సంఘమునకు
భద్రమస్తు, సతమ్ము, ప్రస్తుతాషాఢమాసానుప్రయుక్తస భాధిపతికి
క్షేమమస్త్వనిశమ్ము శ్రీశాంఘ్రిభక్తికృతాహ్వాన కరణ సంఘాధిపతికి
శుభమస్తు నిత్యమ్ము సువిశాలభావ సంయుక్తక్రియాదర్శి యుగళమునకు

గీ. భాగ్యమస్తు సతము స్త్రీ వర్గమునకు, భవ్యమస్తు సదా సభా పండితులకు
శుభవితతిరస్తు సర్వదా శ్రోతలకును, సౌఖ్యమస్తు సదా మీకు సభ్యులార! 3

---

### వైష్ణవత్వ మనగా నేమి ?

పరసమృద్ధ్య సహత్వమును, పరసమృద్ధి సమత్వమును,
పరసమృద్ధ్యేక ప్రయోజనత్వమును వైష్ణవత్వ లక్షణము.

# శ్రీరామానుజ క్రితువు విజయవాడ

శతావధాని కృష్ణమాచార్యులుగారు కోరుట్ల (నైజాం)

శ్రీస్తవనీయసోదర? వశీకృత రంగవిహార హాస్తు సా
రాస్తగణోల్లసద్యతివరామల రూపకృపావిలాస భూ
మాస్తనితోన్నత స్వరవిమర్దితదుర్మద హంసనీ పదా
నుస్తుతిగల్గజేయుము మనోజ్ఞ గుణాకర శ్రీయతీశ్వరా
జగములనుద్ధరింప కడుజాలి? బూనిజెనించి వాది వ
క్రగతు లడంచి దాసజన కాంక్షలదీరిచి తాపమెల్ల బాత్
త్రుగ నడగించి విజ్ఞుల నుతుల్గొనుచుంటివి మాదృశాత్మ :
వృగద గతుల్గలుగఁబ్రోచెటి మేటివి శ్రీయతీశ్వరా.

విద్యల తత్వమెల్ల జన విశ్రుతభాష్యమునందు జూపి రా
జద్యుమణి ప్రకాశమనజాలు సుమంగళ విగ్రహా ప్రమే
యద్యుతు లుల్లసిల్లగ జయంబువహించిన దివ్యలోక దే
వాద్యుడవీవు నీమహిమనారయ నెంతటివాడ విన్న వా
ద్యతనుండు నిన్గొలచునంతటి వాడగు నాయతీశ్వరా?

ముముక్షువుకు దేవతాంతరముల యెడల ప్రీతియును, శబ్దాది విషయముల యెడల ప్రీతియును, మోక్షము గలుగుటకు ప్రతిబంధకములు. వీటిలో రెండు మాత్రమున్నవాడు కాలాంతరమందైనను కడతేరవచ్చును. వీటిలో నొక్కటిమాత్రము (విషయప్రావణ్యము) ఎప్పటికిని ప్రతిబంధకముగానే యుండగలదు.

శరణపదమునకర్థము । నిచటదల తురుపాయమేయనుచును ॥
దాననిష్టములమరును । అటుగాని, వానివారణగలుగును ॥
అవనినిబ్రపద్యేయను । డానిక ధ్యవసింతుననియర్థము ॥
ఒకమారెయిది జేయగా । దగియుండ నికవర్తమానమేల ॥
ఎపుడైనబారపడినను । బరిహృతికి నుపయుక్తమైనదియిది ॥
శ్రీపదంబుత్తరార్థ । మందలిది ప్రాప్యత్వమును దెలుపును ॥
కైంకర్యవర్ధకత్వ । మనునర్థ మింకొకటియిందుగలదు ॥
ఇందువివరింపబడియె । దిరుమంత్ర మందుజెప్పినప్రాప్యము ॥
దీనివివరింపకుండ । దెలియదటు గాన దెల్పెదనువినుడు ॥
సర్వశేషిగనుండిన । వానికని నిర్వచింతురుదీనిని ॥
ఈపదమువిగ్రహమును । గుణములను, నేపుమీరగదెల్పును ॥
ఐనశేషిత్వమునను । దీనికిబ్రధానముగజూపుండును ॥
ఇందలిచతుర్థివలన । గైంకర్యమందముగదెల్పబడును ॥
పొందుగనమఃపదంబు । గైంకర్య మందుగలుపునుదీయును ॥
తనకొరకుగావించుట । యిందుగలు పనిచెప్పబడునిజముగా ॥
ఇందుననవిద్యాదులున్ । వినివృత్తి జెందునిస్సంశయముగా ॥
సౌందర్యమొకవిఘ్నము । అట్లైమొద టందెలుపుకైంకర్యము ॥
కైంకర్యమెపుడుగోరు । నటుతడా తంకవినివృత్తిగోరు ॥
ఇదియెద్వయమునంత్రార్థము । నిదిదెలియ నొదవుబురుషార్థమెల్ల
దీనికినకించనుండ । నన్యార్హుడైననధికారియగును ॥
ఇందుబెరియపిరాట్టిచే । బురుషార్థ మందనగుననిచెప్పెను ॥
ఆత్మగుణములకెల్లను । వాసమగు నాత్మయిందధికారియగా ॥
ఇందువివరింపబడియె । దిరుమంత్ర మందుగలిగినయర్థము ॥
దీనికుస్నప్రభావము । వేదంబు లోనిరూపింపబడెను ॥
రుచిపరిగృహీతమయిన । దాచార్య నిచయంబుచేనియ్యది ॥
కనుకనాచార్యనిష్ఠ । గలిగియుం డినవారికిదిముఖ్యము ॥
ఈకారణములదీని । యర్థమును మీకువినుపించినాడ ॥



## : చరమశ్లోక ప్రకరణము :

### చాపుతాళము

వినుడుచరమశ్లోక మునకుగలయర్థమో । ఘనులారశ్రద్ధగలిగి ॥
సర్వధర్మాననియె సంగుపదమునధర్మ । శబ్దార్థమేమనినను ॥
దృష్టఫలసాధనము లిచటజెప్పంబడవ । దృష్టఫలసాధనములే ॥
అవియనేకంబులై నందుచేబహువచన । మయ్యెనిచ్చటనుండుగా ॥
అర్హతాపాదకము లగునిత్యకర్మంబు । లగుసర్వశబ్దార్థము ॥
ఇకబరిత్యజ్యయను నెడద్యాగమనెడిదా । నికిగలుగుభావమిదియె ॥
ముందటియుపాయముల యందుపాయత్వమతి । జెందినామిదిదోషము ॥
అనుపాయములగువా నినుపాయములటంచు । ననుకొంటిమిదిగూడనే ॥
భ్రాంతిపడితిమిశుక్తి రజతమనివిపరీత । భాగమునకేగితిమని ॥
ఇట్టిబుద్ధివిశేష మంగద్యజియించుమటె । యుచటిత్యాగపదార్థము ॥
పరియనెడియుపసర్గ పదముదానికినర్థ । మెరిగింతునాలింపుడీ ॥
పాతకాదులనెట్లు వర్జింతురోయట్టి రీతిరుచివాసనలతో ॥
మరలబైబడకుండ మదిసిగ్గునద్యజించు । సరణినిదిబోధించును ॥
ల్యాప్యుపాయాంతరము లనువిడచియెగ్రహింప । నొప్పననునదిజెప్పను ॥
మామనినసర్వసం రక్షకుడునీకువశు । డైమెలగునన్ననదగున్ ॥
నీమసమ్మతిజూచి నీదుతప్పులనొప్ప । గాదలచునన్నుననియుఁ ॥
సమకూర్చువారుదూరము జేసిననువిడచి ॥ యమరజాలనినన్నని ॥
స్థానబ్రమాణంబు చేనేకశబ్దార్థ । మైనదవధారణంబు ।
ఇందుచేస్వీకార మందలియుపాయత్వ । మొందుచుండెనివృత్తిని ॥
శరణశబ్దముక్రింది సందర్భములకుదా । సరిపడవలసినందున ॥
దీనికర్థములెన్ని యైననున్ననుచిచట । నౌనుపాయమెయర్థము ॥
వ్రజధాతువునకున ర్థంబుగతియదిబుద్ధి । నిజముగానిల్లగుటచే ॥
అర్థమేర్పడియెవ్రజ యనునట్టిదానిక । ధ్యవసింపుమాయనుచును ॥
అహమనినసర్వజ్ఞ డైసర్వశక్తియై । ప్రాప్తియునునగునేనని ॥
త్వాపదార్థముదెలివి బలిమిప్రాప్తియులేక । పాయమేనగునిన్నని ॥
వినుపింతుసర్వపా పేభ్యోయనెడిపదం । బునకర్థమగుదానిని ॥
నను జేరనీయనివి యనివెరతువోవేని । గనియవన్నిటినుండియు ॥
మోక్షయిష్యామియన ముక్తినందగజేసి । పుచ్చెదనటంచర్థము ॥

మనకుబని లేదవియె చనుదమంతటనుదా । మనుచుణిచ్ ప్రత్యయమనున్ ॥
మాశుచః పదవినాకృ మమువిశ్వసించిమతి । లోశోకమొందకుమనెన్ ॥
ఇటురహస్యత్రయముకి నెసగునర్థములఘు । స్ఫుటముగా వినుపించితిన్ ॥
భగవంతుడునుభాగవతులునాచార్యులీ । పగిదిననుదయజూచిరి ॥
తప్పులున్నక్షమించి యొప్పులున్నగ్రహించి । తప్పకకృపన్ జూడుడీ ॥
వసుధసల్లాన్ చక్రవర్తిసంపత్కుమా । రసదన్వయోద్భూతుడన్ ॥
గరిమనుజగన్నాథ తిరువేంకటార్యుడను । హరిదాసులకు దాసుడన్ ॥

## యతిరాజవిజయ నాటకమునందలి కొన్ని చక్కని శ్లోకములు

శ్రీ ఉ. వే. శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులుగారు

శ్లో. జానీమ స్తవ సత్య మర్జునకృతే భీష్మప్రహారోద్యమాత్ ।
గోపస్త్రైణ విహారధూర్త విదితం త్వద్బ్రహ్మచర్యం జనైః ॥
దౌత్యేన స్ఫుట మీశ్వరత్వ మపి తే స్వామిం స్తథాప్యుత్తరా ।
గర్భోజ్జీవన భేషజాయ భవతః పాదాయ తస్మై నమః ॥

తాత్పర్యము

స్వామీ! అర్జునుని నిమిత్తమై భీష్మాచార్యులను సంహరించు ప్రయత్నము వలన నీ సత్యము నెఱింగితిమి. గొల్లస్త్రీలతో విహరించుచు నీ వొనరించిన ధూర్తకృత్యములచే జనులు నీ బ్రహ్మచర్యము నెఱింగిరి. కురుపాండవులమధ్య రాయభారముచే నీ యీశ్వరత్వము వెల్లడియైనది. ఐనను ఓ స్వామీ! ఉత్తరాగర్భమునందున్న పరీక్షిద్రక్షణమునకు దివ్యౌషధమైన నీపాదమునకు వందనము.

శ్లో. అకోకిలా మాశు విధాతు ముర్వీం ।
మపాకశాలా నమరాంశ్చ కర్తుం ।
శక్తాపి శాన్తా నమస్తు వయా తే ।
తస్యై నమ స్సప్తమభూమికాయై ॥

భూమియందు కోకిలలు లేకుండ జేయుటకును, దేవతలకు వంటయిల్లు లేకుండ జేయుటకును, తగినంత శక్తిసంపదలు కలిగియుండియు పరిణతిమాత్రముచే శాంతించిన ప్రసిద్ధమగు నీయేడవదైన శ్రీరామావతారమునకు నమోవాకములు.

# బ్రహ్మవిద్యాఫల విచారము

శ్రీ ఉ. వే. శ్రీమాన్
పాలకొండ కందాడై వీరరాఘవ
అప్పలాచార్యులుగారు, శ్రీరామతీర్థము.

1. ఈవిషయమున, బ్రహ్మవిద్యలననేవి, వాటి స్వరూపమెట్టిది, వాటినధికరించు వారెట్టివారు, వారికి లభించుఫలమెయ్యది, ఆఫలమునిచ్చువారెవ్వరు, అట్టి ఫలస్వరూపమెయ్యది, యను విషయములు విమర్శనీయములుగఁ బ్రసక్తమగుచున్నవి, యిందు బ్రహ్మవిద్య లన నేవియనగా

2. ప్రాచీనులు వేదములనుపూర్వభాగమనియు ఉత్తరభాగమని రెండుభాగములుగఁజేసియున్నారు. అందుపూర్వభాగము నిత్యనైమిత్తికాదికర్మ ప్రతిపాదకము నుత్తరభాగము బ్రహ్మప్రతిపాదకమునై యున్నవి. అట్టియుత్తరభాగమనఁబడును పనిషత్తులందు, సద్విద్య, భూమవిద్య, ఉద్గీథవిద్య మొదలగుఁగొన్ని విద్యలుఁ జేర్కొనఁబడినవి. వాటినే బ్రహ్మవిద్యలందురు. వాటినేధ్యానోపాసనాది శబ్దములచేఁగూడ శాస్త్రకారులు వాడుదురు. యిక వాటి స్వరూపమెట్టిదనిన.

3. విద్యయనగా విదజ్ఞానే, యనెడి ధాతువు యొక్క రూపమగుటఁజేసి విద్యాశబ్దమునకు జ్ఞానమునుఁ గలుగఁజేయునది యని యర్థమగుటచే. బ్రహ్మవిద్యయనగా బ్రహ్మవిషయకజ్ఞానజనకమని తేలుచున్నది. కావున బ్రహ్మవిద్యయనగా బ్రహ్మయను విషయమును బోధించు జ్ఞానమనియర్థము, అట్లైనను పనిషత్తులందుఁ జేర్కొనఁబడిన బ్రహ్మవిద్యలు బ్రహ్మను బోధించుచు స్వతంత్రముగ ఫల సంపాదకములగుచున్నవా లేదాయను విషయము విచారింపవలసియున్నది. అట్లు విచ్చారించిచో నుద్గీథవిద్య "ఓమిత్యేతదక్షరముద్గీథముపాసీత" యని కర్మకాండమునఁ బఠింపఁబడినదై కర్మాంగముగఁగాన్పించుచున్నది అద్దానితోఁబాటు బ్రహ్మవిద్యలన్నియును సిద్ధరూపమగు బ్రహ్మను బోధించునవియై, తాదృశబ్రహ్మకుఁగ్రియామయకర్త్రన్వయము లభింపనందునను తమకు ప్రత్యేకముగ బ్రహ్మప్రాప్తి కన్న వేరగు ఫలము నిర్దేశింపఁబడకున్నందునను క్రత్వంగములై క్రతుద్వారా ఫలసంపాదకములగుచున్నవిగాని స్వతంత్రముగ ఫలసంపాదకములుఁ గానేరవని యిటనొక సంశయముఁ గల్గుచున్నది. గాని "యదేవవిద్యయాకరోతిశ్రద్ధయోపనిషదా తదేవ వీర్యవత్తరం" అని విద్య ప్రతిబంధనివర్తన పూర్వకముగశీఘ్రముగ ఫలమును సంపాదించు సామర్థ్యమనఁబడు నధికబలమును క్రతువునకు కలుఁజేయునని తప్ప విద్యకు వేరొక ప్రయోజనము లేదనిగాని విద్యలేనందున క్రతువునకు వైగుణ్యమనిగాని యిచట ప్రతిపాదింపఁబడ లేదు. ఇంకను బ్రహ్మవిద్యల కన్నిటికిని మోక్షరూపమగు బ్రహ్మప్రాప్తినే ఫలముగఁ బ్రమాణములు బోధించుచున్నవి. గనుక బ్రహ్మవిద్యలు కర్మాంగములు గాక స్వతంత్రఫలసంపాదకములేయని నిర్ణయింపఁబడుచున్నవి. యీవిద్యల నధికరించువారెవ్వరనిన

4. సాంగవేదాధ్యయనముఁ జేయు నపుడు పూర్వభాగమున బోధింపఁబడినకర్మలునుదత్ఫలభూతములగు స్వర్గాదులును పరిమితములు, ననిత్యములు, ననియు నుత్తరభాగమునఁ బోధింపఁబడిన బ్రహ్మజ్ఞానమునుఁ దత్ఫలభూతమగు బ్రహ్మప్రాప్తియును నపరిమితములు నిత్యములుననియు నచ్చటనే "ప్లవాహ్యేతే అదృఢాయజ్ఞరూపా"

అనియును "పరీక్ష్యలోకాన్కర్మచితాన్ బ్రాహ్మణోనిర్వేదమాయాన్నాస్త్యకృతః కృతేన, తద్విజ్ఞానార్థం సగురుమేవాభి గచ్ఛేత్సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం, తస్మైసవిద్వానుపసన్నాయసమ్యక్ప్రశాంత చిత్తాయశమాన్వితాయ, యేనాక్షరం పురుషం వేదసత్యం ప్రోవాచ తాంతోతత్త్వబ్రహ్మవిద్యామ్"అనియును వివరించుచున్న ప్రమాణములనుబట్టి కర్మఫలములందు నిర్వేదముఁగలిగిఁ మోక్షమందాసక్తి కలవాడై బ్రహ్మవిద్యలనబడు బహ్మవిద్యల నధికరించఁదగినవాడు. ఇట్టివాడుఁ బొందుఫలమెయ్యదియన-

5. "అవిద్యయామృత్యుం తీర్త్వా విద్యయామృతమశ్నుతే, బ్రహ్మవిదాప్నోతిపరమ్, నపునర్మృత్యవే, తదేకంపశ్యతి, సస్వారాడ్భవతి, పృథగాత్మానం ప్రేరితారంచ మత్వా జుష్టస్తతస్తేనామృతత్వమేతి, తమేవం విద్వానమృత ఇహాభవతి, నాన్యఃపంథాఅయనాయ విద్యతే॥ ఇత్యాది శ్రుతివాక్యములచే నిచట పూర్వభాగమందు జ్యోతిష్టోమాది కర్మలకు స్వర్గాది ఫలములువలెనే నిరతిశయానంద రూపమోక్షమనబడు భగవత్ప్రాప్తియే బ్రహ్మవిద్యా ఫలమని నిరూపింపఁబడుచున్నది. శ్రీభాష్యకారులుఁ గూడ "ఇహబ్రహ్మ విద్యా స్సర్వాబ్రహ్మ ప్రాప్తిరూపమోక్షైకఫలాః, సద్విద్యా భూమవిద్యా దహరవిద్యా ఉపకోసలవిద్యా వైశ్వానరవిద్యా ఆనందమయవిద్యాక్షరవిద్యాదికాపకశాఖాగతాశ్శాఖాన్తరగతాశ్చోదాహరణమ్॥ అనియును, బ్రహ్మప్రాప్తిఫలానాం సద్విద్యాదహరవిద్యాదీనాంనానాత్వ ముక్తం॥ అనియును పెక్కుస్థలములలో నిట్టి బ్రహ్మప్రాప్తినే విద్యాఫలముగఁ జెప్పియున్నారు. ఇట్టి ఫలము నిచ్చువారెవరనిన,

16. ఇట్టిఫలమును లభింపఁజేయువాఁడుఁగూడ నుపాసనములనబడు కర్మజ్ఞానసహాకృత భక్త్యాదులచేఁ బ్రీతుడగుసీశ్వరుడేగాని కేవల కర్మజ్ఞానాదులుగాని తత్సహాకృతములగు భక్త్యాదులుగాని సాధనములుఁగానేరవు. ఈవిషయము "ఏష హ్యేవానన్దయాతి, సవాఏషమహానజ ఆత్మా అన్నాదోవసుదాన॥" అనెడి శ్రుతులచేతను-

"యోయోయాంయాంతనుం భక్తః
శ్శ్రద్ధయా ర్చితు మిచ్ఛతి।
తస్యతస్యాచలాం శ్రద్ధాం।
తామేవ విదధామ్య హమ్॥
సతయా శ్రద్ధయాయుక్తః।
తస్యా రాధన మీహతే।
లభతేచతతఃకామాన్।
మయైవవిహితాన్ హితాన్॥

అనెడి గీతావాక్యములచేతను-

"అతఃపరముపాసనం వివక్షన్నుపాసీనానాం పరస్మాదేవాస్మాత్పరుషాత్ప్రాప్తిరూపమపవర్గాఖ్యం ఫలమితిసంప్రతిబ్రూతే" అనియును.

"అహరహరనుష్ఠీయమానః వర్ణాశ్రమధర్మానుగృహీత తదుపాసనరూప తత్సమారాధన ప్రీతః. ఉపాసీనానాదికాల ప్రవృత్తానన్తదుస్తరకర్మ సంచయరూపా విద్యాంవినివర్త్యస్వయాథాత్మ్యానుభవరూపా నవధికాతిశయానన్దంప్రాపయ్యపునరావర్త యతీత్యపి, శబ్దాదేవావగమ్యతే శబ్దశ్చ॥" సఖల్వేవంవర్తయన్ యావదాయుషం బ్రహ్మలోక మభిసంపద్యతే,

నచపునరావర్తతే॥ ఇత్యాదికః. అనియు నుదహరింపబడిన భాష్యములచేతను స్ఫుటముగ వివరింపబడుచున్నది. యింకనిట్టిఫలస్వరూపమెట్టిదనిన,

7. పైనుదహరింపఁబడిన భాష్యములచేతను, ననేకములగు స్మృతులచేతను-

"మాముపేత్య పునర్జన్మ ।
దుఃఖాలయమశాశ్వతం ।
నాప్నువంతి మహాత్మానః ।
సంసిద్ధింపరమాంగతాః ॥"

"ఆబ్రహ్మభువనాల్లోకాః ।
పునరావర్తి నోర్జున ।
మాముపేత్యతుకౌంతేయ ।
పునర్జన్మ నవిద్యతే ॥"

అనెడి యీగీతావాక్యములచేతను మోక్షరూపమగు ఫలము నిత్యమనియు, నిరవధికానందరూపమనియు స్పష్టమగుచున్నది.

## శ్రీ రామానుజ సప్తకం

సంస్కృత విద్యాకుమారక
శ్రీ ఉ. వే. శ్రీమాన్ బూతుగడ్డ కందాడ
అళహశింగరాచార్యులుగారు, నెల్లికుదురు.

శ్లో॥ శ్రీకేశవాత్మజాతం । శ్రితజనపరిపాలనైక సుస్వాంతం ।
పరమముదారగుణాఢ్యం । కలయేరామానుజం కృపాసింధుం ॥

శ్లో॥ పాషండ బౌద్ధమత । నాశకరం యతికులేశ్వరం పూజ్యం ।
కాషాయశోభినంతం । కలయేరామానుజం కృపాసింధుం ॥

శ్లో॥ శేషావతారరూపమ । శేషజనౌఘాఘహరణచరణాబ్జం ।
శ్రీభాష్యకారమమలం । కలయేరామానుజం కృపాసింధుం ॥

స్వాచార్యాజ్ఞనుమీర దోసమని సుంతైనన్ వెనుదీయకే
ప్రాచీనంబగు మంత్రరాజము మహావాత్సల్య సంపూర్ణస
ద్వాచోనైఖరి వెల్లడించితిరిగాన స్వామీ! యతీశప్రభూ!
ఆచార్యత్వమటన్న మీదె వినుడో యాచార్యచూడామణీ ॥

శ్రీభాష్యమ్మును తాధరించెనుగదా శీర్షమ్ముపై ప్రేమతో
నాభాషాసతి మీమహత్వమిక నెన్నన్ కింపునర్న్యాయమే
మీభావమ్మున చేతనోద్ధరణమే మేలైనకృత్యంబుగా
దాభావింపగ స్వామీ! తండ్రీ! యతిరాజా! ధాసకల్పద్రుమా ॥

శ్రితికినపార్థమావిధిని జూపగ దానిని లోసహించకన్
హితమతినిశ్చయార్థము రహింబ్రకటించగలేదె ? స్వామి మీ
వితరణమేమిజెప్పవలెనె వీతభయాదులమయ్యు నిట్టులే
సతతము మిమ్ము సంస్మరణ సల్పెడి భాగ్యముమాకొసంగుడీ ॥

## యతిరాజవిజయ నాటకమునందలి కొన్ని చక్కని శ్లోకములు

శ్రీ ఉ. వే. శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులుగారు

శ్లో॥ పరస్మా ద్దన్యస్మై యదపి, యదపి స్వేన పరతః ।
పరస్మై, స్వస్మై తు స్వతి ఇతరతో వా స్ఫురతి యత్ ।
త దేత త్సర్వాత్మన్! తవ భవతి షాడ్గుణ్యజలధేః ।
విధేయం చాధేయం వివిధవినియోగోచిత మపి ॥

తాత్పర్యము

షడ్గుణాకరా! సర్వేశ్వరా! ఇతరునకు (చేతనునకు) ఇతర (ప్రమాణాంతర) మువలన మాత్రమే భాసించునట్టి జడమగు లీలావిభూతియు, ఇతరునకు అజడము గాన స్వయంప్రకాశమగుటచే) తనంతను ఇతరము వలనను భాసించునట్టి నిత్యవిభూతియు, ప్రత్యగర్థమగుటచే) తనకుతాను; తనంతను ఇతరములవలనను భాసిల్లునట్టి చేతనతత్త్వమును ఓ సర్వశరీరీ! ఇదియంతయు నీకు పరతంత్రమైనదియు, ధరింపదగినదియు, యిచ్చవచ్చినట్లుపయోగించుట కుచితమైనదియు (శరీరలక్షణము) నగుచున్నది.

(భగవచ్ఛబ్దమున కర్థమగు జ్ఞాన, శక్తి, బల, ఐశ్వర్య, వీర్య, తేజస్సులనెడు ఆరుగుణములును భగవద్గుణములలో ప్రధానమైనవి.)

శ్లో. తమో యత్ప్రాగాసీ త్త్రిగుణమయ, మస్మా చ్చ య దభూ, ।
త్తతో య త్త్రేధా సీ, ద్బహువిధ మతో య త్సమజని, ।
తతః పఞ్చభ్యో య త్పవనగగనాద్యాత్మక మభూ ।
త్త దేత త్సర్వం తే భవతి ఖలు లీలాపరికరః ॥

తాత్పర్యము

సృష్టికి పూర్వావస్థలో త్రిగుణాత్మకమగు ప్రకృతి తమోమయమైన అవ్యక్తముగా నుండెను. దానినుండి మహత్తత్త్వముదయించెను. దానినుండి వైకారికము తైజసము భూతాది యనబడు సాత్త్విక రాజసతామసాహంకారము పుట్టెను. దానినుండి జ్ఞానేంద్రియములు కర్మేంద్రియములు మనస్సు పంచతన్మాత్రలని బహువిధ పదార్థములుద్భవించెను. ఆపంచతన్మాత్రలనుండి పృథివ్యాది పంచభూతములు జన్మించెను. స్వామీ! ఇదియంతయు నీకు క్రీడాకందుకముగదా!





# నా రీ వి భా గ ము



శ్రీమతే రామానుజాయ నమః

## కంగులుం-పగలుం పాశురోపన్యాసము

శ్రీమతి సంపూరి ఆనందమ్మగారు,
ఏలూరు.

తిరువాయిమొళి ౭ పత్తు. ౨ వ తిరు. ౧. పాశురము.

ఈతిరువాయ్మొళ్లిలో నమ్మాళ్వార్లు, భగవద్విశ్లేషమును సహించజాలక పెరియ పెరుమాళ్ తిరువడికళ్ళలో ప్రపత్తిచేసి అచ్చట కూడ తన మనోరథమును లభించక దుఃఖపరవశులై ఒక పిరాట్టియవస్థను బొందియుండగా, అప్పుడాపిరాట్టియొక్క-తల్లి నాకుమార్తె విషయమై నీవేమి సంకల్పించియున్నావని పెరియపెరుమాళ్ సన్నిధిలో విన్నవించుచున్నటుల తాయిమారవస్థలో విన్నవించిన పాశురము.

పాశు:— కంగులుం పగలుం కణ్డుయిలఱియాళ్ । కణ్ణనీర్ కైకళాలిఱైక్కుం ।
శంగు శక్కరంగళెన్ఱు కై కూప్పుం । తామరై కణ్ణెన్ఱే తళరుం ।
ఎంగనే తరిక్కేన్ నున్నై విట్టెన్నుం । ఇరునిలంకై తుళావిరుక్కుం ।
శెంగయల్ పాయ్నీర్ తిరువరంగత్తాయ్ । ఇవళ్ తిఱత్తెన్ శెయ్కిన్ఱాయ్ ॥

కంగులుం- రాత్రియందును
పగలుం- పగలుయందును
కణ్- నేత్రములయొక్క
తుయిల్- నిదురను
అఱియాళ్- ఎఱుగదు
కణ్ణనీర్- కంటినీటిని
కైకళాల్- చేతులచేత
ఇఱైక్కుం- జల్లును
శంగు శక్కరంగళ్-ఎన్ఱు-శంఖము-చక్రము అనుచు
కైకూప్పుం- నమస్కరించును
తామరైక్కణ్ ఎన్ఱు- పద్మమువంటి నేత్రములు అనుచు
తళరుం- శిధిలమనస్కురాలగును
ఉన్నైవిట్టు- నిన్నువదలి
ఎంగనే- ఎట్లు
తరిక్కేన్- జీవించెదను
ఎన్నుం- అని అనును
ఇరు- విశాలమైన
నిలం- భూమిని
కై- చేతులచే
తుళా-ఇరుక్కుం-తడుముచుండును
శెం- సుందరమైన
కయల్- మత్స్యములు
పాయ్- ఎగురుచున్న
నీర్- నీరుగల
తిరువరంగత్తాయ్- శ్రీరంగనాథా
ఇవళ్తిఱత్తు- ఈమెవిషయమై
ఎన్ శెయ్కిన్ఱాయ్- ఏమిచేయదలంచితివి?

**తాత్పర్యము:-** ఓ శ్రీరంగనాథా ! ఈ ఆళ్వారునాయకి నిన్ను ఎడబాసి యుండజాలక రాత్రింబగళ్లు నిద్రాహారములు లేకుండగ దుఃఖించుచు నీదివ్యావయవ దివ్యాయుధముల స్మరించుకొనుచు, నమస్కరించుచు, మూర్ఛపొందుచు, భూమిని తడుముచు ఇట్లు అమితబాధ పడుచున్నది. ఈమెను నీవేమి చేయదలచితివో?

ఈపాశురము ఆళ్వార్లు నాయకావస్థలో తల్లి భావనచేత పాడినప్పటికి ఇందులో శ్రీవిశిష్టాద్వైత మత ఆధిక్యతనంతా అన్యాపదేశముగా నిరూపించారు మనఆళ్వార్లు. ఇదిగాక ఏభగవద్గీత మన దేశమందే గాక దేశదేశాంతరములయందు అన్యమతస్థుల చేత కూడా కొనియాడబడి పూజింపబడుచుండెనో, ఆభగవద్గీత సారాంశమైన చరమశ్లోకార్థమునే ఈపాశురము ద్వారా ఆళ్వార్లు తెలుపుడు చేయుచున్నారు. ఈచరమ శ్లోకము విలువ మనసు నందుంచుకొనియే వీరు తిరువాయ్మొళిలో ఒకచోట "వార్త్తైయరిబవర్ మాయవ ర్కాళన్ఱి యావరో, అనిపాడినారు, "వార్త్త" యనగా వాక్యమని శ్రీమహాభారతమున కంతా అర్థవంతమై సారవంతమైన ఈచరమశ్లోకము వాక్యమని, అమృతము కొరకు సముద్రమథనం చేస్తే ఎన్నో రత్నములు మొదలైనవి పుట్టినటుల ఈచరమశ్లోకమును పుట్టించుట కొరకే శ్రీవేదవ్యాసభగవాన్ మహాభారతము చేయవలసి వచ్చినదని, అంటే భారతసారము చరమశ్లోక మని ఆళ్వారుల అభిప్రాయము. అందువలన నీచరమశ్లోక విలువ తెలిసినవారు శ్రీగీతాచార్యునికి తప్ప వేరొకరికి దాసులవుతారా? అని వీరి అభిప్రాయము. ఈచరమశ్లోకము నింతగా వీరు ఎందులకు కొనియాడినారంటే ఈశ్లోకములో వున్న స్వార్థ త్యాగమునకు "సర్వధర్మాన్ పరిత్యజ్య" అన్నికర్మలలోను ఫలత్యాగము కర్తృత్వత్యాగము చెప్పుటయే గాక మాం ఏకం అనుటలో నుండే స్వార్థత్యాగమును వర్ణించుటకు 10 పేజీలైనా చాలవు.

మాం, అని తిరిగి 'ఏకం' అనిసాయించుటలో శ్రీగీతాచార్యుని అభిప్రాయము. సర్వధర్మములు నీకేవిధముగ రక్షకము కాజాలవో, నీవు చేసిన ప్రపత్తికూడా నీకొక రక్షకము కాదు. నీ రక్షణకు నానిర్హేతుక జాయమాన కటాక్షమే ప్రధానకారణము. నాకటాక్షముచేతనే నీవు సంసార విముక్తిపొంది నన్ను జేర గలిగితినను కోవాలి అని గీతాచార్యుని అభిప్రాయము. ఎంత స్వార్థత్యాగమో చూడండి. శ్రీగీతాచార్యులు ఏకం అని చెప్పిన స్వార్థత్యాగమునే ఈపాశురము ద్వారా ఆళ్వార్లుపాడినారు. స్వార్థత్యాగమునకున్న గొప్పదనము మరిదేనికీ లేదు. మొదటనుంచి మనహిందూదేశము, ఇతరదేశస్థులంతా రాజ్యమును కొల్లగొట్టినవారిని నాయకులుగా ఎంచుకొంటే, రాజ్యములు విడచిపెట్టిన గోచిపాతరాయులనే నాయకులుగా ఎంచుకొని విశ్వామిత్రి సంతతివారము, భారద్వాజముని సంతతివారము. అని గొప్ప ఆధిక్యతగా చెప్పుకొని ఆనందపడి పోతున్నాము.

ఏపరమాత్మానందము కొరకు ఆఋషులందరు ఇతరవిషయములన్నీ త్యాగముచేసినారో అటువంటి భగవదానందముకూడా జీవులకొరకు

త్యాగము చేసిన స్వార్థత్యాగి. శ్రీభగవద్రామానుజ మునీంద్రులు, ఇంతమంది జీవులు పరమపదమునకు వెళ్ళితే నేను మాత్రం నరకంలో వుంటేనేమి అని గురువాజ్ఞను మీరి. మంత్రము జనులందరికి వెదజల్లిన త్యాగమూర్తి రామానుజులు, ఆ కారణంచేతనే గదా, రామానుజ సిద్ధాన్తమనుపేరుతో ఈమతము ప్రచారములో నుండుట. అట్టి స్వార్థత్యాగముతో గూడిన ఈ విశిష్టాద్వైతమతమునకు పునాది నాలాయిర దివ్యప్రబంధములు. అందులో ఈ కంగులుం, పకలుం అన్న పాశురములో మొదటి మూడు పాదములలో భగవానుని శరణుపొందిన జీవుడేవిధముగా వుండాలి, అనే విధముచెప్పి చివరి నాల్గవ పాదములో ఈజీవుడుచేసే భక్తి ఉపాయముకాదు వాని నిర్హేతుక కటాక్షమే వుపాయము అని చరమశ్లోకములో చెప్పిన "ఏకం" అన్న శబ్దమునకు వివరించుచున్నారు. ఆళ్వారులీపాశురములో "కంగులుం పకలుం, కణ్ తుయిలఱియాళ్" ఆళ్వార్ తమఅవస్థను తల్లి చెప్పినట్లుగా అన్యాపదేశముగ తమకు స్వామియందుండే ప్రీతిని(ప్రేమభక్తి అని దానికి పేర్లు) ఆభక్తిని తెలుపుడు చేస్తున్నారు. రాత్రిం బగళ్లు నాకూతురికి నిద్రలేదు. రంగనాథా అని తల్లిగారు బాధతో చెప్పతున్నారు.

ఈలోకములో ధనము లేదనో, పోయినదనో, లేక దారేషణ పుత్రేషణాదులగు యితర విషయముల యందుండే మమకారంచేత నిద్రలేనివారున్నారు గాని, పరమాత్మకొరకు పరితపించి వీని దర్శనము కాలేదని రాత్రిం పగళ్లు నిద్రలేకుండా పరితపించే వారెవరున్నారు,

ఈప్రకృతిలో రాత్రిం పగళ్ళు అనే విభాగము లేదు. ఒకే ఆలాపన రంగనాథా- కణ్ణనీర్ కైకళాలిరైక్కుం" కంటినీరునిచేతులతో తుడుచుకొంటూంది నాకూతురు. అని యన్నారు. లోకములో అదిలేదు. ప్రాకృతిక వస్తువులుపోయినవని విచారపడేవారున్నారుగాని పరమాత్మను గురించి విచారపడే వారెవరున్నారు. సామాన్యమైన కంటినీరా, ఈమె తుడుచుకొంటే నిలిచేటందుకు పదిరూపాయలు పోయిన విచారము. లక్షరూపాయలు పోయిన విచారము ఒకటవుతుందా.

క్షుద్రవిషయాలను ప్రేమించి వాటివిడబాటువలన కలిగే దుఃఖము గనుకనా అరికట్టడానికి అప్రాకృత విషయాన్ని ప్రేమించి అదిలభ్యము కాకపోతే వచ్చిన కంటనీరు అరికట్టడానికి సాధ్యమగునా. నాబిడ్డ వెర్రిగాని, అని తల్లిగారి అభిప్రాయము, "శంగు శక్కరంగళెన్ఱుకైకూప్పుం" శంఖుచక్ర గదాధరుడవై వచ్చి ఒకసారి దర్శన మీయవా అనిపోతుంది. దాహము విపరీతముగా వేసినవాడు మంచినీళ్ళను అడగలేక చేతితో సంజ్ఞచేసినటుల బలహీనతచేత శంఖము,చక్రము అని రెండు చేతులు జోడించి నమస్కారము చేస్తూన్నది. బ్రాహ్మణునికి పిచ్చిపట్టినా వేదమే మాట్లాడునటుల ఈఆళ్వార్లు ఏఅవస్థలోనున్నా, శేషత్వస్వరూపమునకు తగిన అంజలి మాత్రము మానరు. "తామరై క్కణ్ణెన్నేతళురుం- తామర రేకులవంటి నేత్రసౌందర్యము కలదానిని అని ఆ నేత్ర సౌందర్యమునే తలంచుకొని మూర్ఛపోతుంది. అశోకవనంలో చెరలోనున్నసీతాదేవి ఆవనంలోని సౌందర్యములెన్ని రావణుడు వర్ణించినా అదేమీ ఆమె కంటికగుపడలేదు. "రామంరక్తాన్త నయన మపశ్యంతీ సుదుఃఖితా"

అని శ్రీరామచంద్రుల నేత్రములు తలచుకొని దుఃఖించినటుల వాని నేత్రముల సౌందర్యము తలచుకొని మూర్ఛపొందుతూ వుంటుంది. "రామః కమలపత్రాక్షః సర్వసత్వమనోహరః అని ఆంజనేయులన్నటుల మొరటుమానసులైన మావానరజాతినంతా స్థిరత్వముతో నిలబడి పనిచేయించుకునే నేత్రసౌందర్య మారఘురామునిది. "అని వానరజాతియంతయూ ఈడుపడిన నేత్రసౌందర్యము తలచుకొని బాధపడిపోతుంది నాకూతురు.

ఎంగనే తరిక్కేనునైన్ద విట్టెన్నుం నిన్నై విడచి ఏవిధాగున బ్రతుకగలను అంటుంది. పరమపద నాథుని ప్రేమించినాను గనుకనా అది వేరే దేశము అదినాకు సాధ్యపడదు. అని వూరడిల్లుటకు- అవతారములు ప్రేమించాను గనుకనా! రామకృష్ణాద్యవతారములలో వున్నసమకాలీకులకేగాని నాకీప్రాప్తము లేదని ఊరడిల్లుటకు ఆకొరంత లేమి లేకుండా "పిన్నానార్ వణంగుం శోది" అన్నట్లు తర్వాత వారికి కూడా లభ్యమయ్యేలాగున ఉభయకావేర మధ్యలో అర్చారూపముతో మమ్ములను రక్షించుటకు దీక్ష వహించిన నిన్ను విడచి ఎటులజీవించగలనయ్యా అంటుంది.

"ఇరునిలమ్ కైతుళావిరుక్కుం" తనుమూర్ఛన్నచోటు నంతా పిచ్చపట్టిన దాని మాదిరిగా తడుముకుంటూన్నది. అని ఈమూడు పాదములలో వీరికి సర్వేశ్వరునియందు వుండే భక్తి స్వరూపమును చెప్పి చివరి నాల్గవ పాదములో ఈభక్తి ఉపాయభక్తి కాదు. ఉపాయము నీకటాక్షమేననే భావన తెలియజేస్తున్నారు.

"శెంగయల్ పా సీర్ తిరువరంగత్తాయ్ ఇవళ్ తిరత్తు ఎన్ శెయ్గిన్నాయ్" అని తోటలలో జలసమృద్ధి వుండుటచేత మత్స్యములన్నీ బలము. సంతోషముతో ఆనీటిలో తుళ్లుతున్నాయి. అటువంటి జలసమృద్ధిగల్గిన తోటలచే చుట్టబడిన శ్రమహారమయిన శ్రీరంగమునందు పవ్వళించిన రంగనాథా ఈమెవిషయములో ఏమిచేయదలచుకున్నావు, రక్షించదలచుకున్నావా? లేక యింకా ఈప్రకృతిలోనే ఉంచదలచుకున్నావా? అనిభావము-

ఇంతకు ఈపాశురమువలన మనకి తెలిసే దేమిటంటే అంటే మొదటిమూడు పాదములతో చెప్పిన భక్తి ఉపాయము క్రిందకు తీసుకొంటే వాడు పరమపదనాథుడే అవుగాక నిత్యసూరి నిర్వాహకుడే అవుగాక వీరి చింతచెట్టు తోట్ట వద్దకు వీరున్న చోటికి సర్పయాగములో మంత్రశక్తికి సర్పములన్ని అగ్నికుండములో పడినటుల వాడు వచ్చి దర్శనమిచ్చి తీరాలి. అంతటిభక్తి ప్రేమలు వీరిది గాని రక్షణ విషయములో వానిదయా కటాక్షమే వుపాయము గాని ఈజీవుడు చేసిన భక్తి కాదు. అని శ్రీగీతాచార్యులు 'మామ్' చెప్పాక 'ఏకం'లో చెప్పినఅర్థాన్ని ఈపాశురము ద్వారా ఆళ్వార్లు మనకి తెలుపును చేస్తున్నారు. సాధారణముగా లోకములో రామాకృష్ణా అనుకొండీ పుణ్యము వస్తుందని హరికథలవి వింటూ దివ్యదేశయాత్రలవి చేస్తూవుంటే పాపముపోయి పుణ్యములభిస్తుందని వాదుకగదా, సాధారణ జనమంతా ఆ అభిప్రాయములతోటే భజనలు చేసినా యాత్రలు తీర్థములకు వెళ్ళినా, కానివీరు అందులో స్వార్థత వున్నది. భగవానుని

భగవదనుభవమును విడచివుండలేని స్థితిలోకి రావాలి. మనము అన్నమెందులకు తింటున్నాము తిననిదివుండలేము గనుక ఆవిధముగనే తేనె పాల్ అముతు, తిత్తిక్కుమ్, తిరునామమ్ అని తేనెపాలు కలకండమాదిగా వుంటుంది నాకు భగవన్నామము విడచివుండలేను. ఉణ్ణుం శోఱ్ పరుగునీర్ తిన్నుమ్ వెత్తిలైయుమ్ ఎల్లాంకణ్ణన్ ఎంబెరుమాన్ అన్నస్థితిలోనికి రావాలి. తినేఅన్నము తాగేనీరు వేసుకొనే తాంబూలము అంతా నాకు శ్రీకృష్ణ పరమాత్మయే అన్నస్థితిలోకి రావాలి. గాన మన పాపాలు పోవుటకు భగవన్నామము చేస్తున్నామనే స్థితి దాటిపోవాలి.

స్వార్థహితమైన ప్రేమ భగవానుని యందుండాలి అనే స్వార్థత్యాగముతో కూడిన భక్తియే శ్రేష్ఠము. అనేసంగతి ఈపాశురము ద్వారా తెలియచేసినారు, ఆళ్వార్లు శ్రీవిశిష్టాద్వైత మతమునకు ప్రదానమీపాశురము.

రామా కృష్ణా అని పూరికే నోటితో వుచ్చరించేదానికే విలువ కట్టుతారే అటువంటిది. భగవానునికొరకు రాత్రింబగళ్లు పరిశ్రమించి దుఃఖపడేస్థితిలోకివచ్చినా అదంతా సత్తాధారకమే గాని రక్షణకు గాదు. రక్షణకు వాని కటాక్షమే కారణమనే త్యాగము స్వార్థ త్యాగము ఈ పాశురములో నిండివున్నది. ఇంతటిస్వార్థత్యాగముతో కూడిన సాంప్రదాయకము గనుగనే! మన విశిష్టాద్వైత ప్రచారక సంఘమువారు ఈగొప్పసిద్ధాంతము అందరు తెలుసుకొని ఆనందపడి వుజ్జీవించాలనే వుద్దేశముతో వూరువూరు వాడవాడలా తిరిగి సభ లేర్పరచి జనులందరిని పోగుచేసి స్వార్థ త్యాగులై కష్టనష్టముల కోర్చి ప్రచారము చేస్తున్నారు. మనమంతా వారి వుద్యమమునకు ప్రోత్సాహమిస్తూ ఈవిశిష్టాద్వైత మత ప్రచారములో వుండే విశిష్టతనుగ్రహించి తరించెదము గాక.

## భగవత్కైంకర్యమా ! భాగవతకైంకర్యమా !!

అనంతాళ్వానను భగవత్కైంకర్య నిష్ఠాగరిష్ఠు లొకరు తిరుమలైయందు నందనవనము నొక దానిని నిర్మించి తిరువేంగడముడయానుకు నిరంతర పుష్పకైంకర్యపరులై యుండిరి.

మొదట శైవులై యుండి సుకృతవశమున తొండనూర్ నంబిచే దిద్దబడి శ్రీవైష్ణవుడైన నొక మహాశయుడు తిరుమలకేగి యచ్చట మన యనంతాళ్వారుని సేవించి వారచ్చట పుష్పాల మొక్కల నొకచోట నుండి పీకి మరియొకచోట నాటగ నారసి 'స్వామీ! అనంతాళ్వానే! మీరు దయార్ద్రహృదయులనియు భాగవత పరతంత్రులనియు వింటినే ఇప్పుడేమి యింత ఘాతుకులైతిరి. శ్రియఃపతి పరమపదమును వీడి భూమండలవాసుల నుజ్జీవింపచేయ సంకల్పముతో వెంకటాద్రికి వేంచేసియుండ వారి దుస్సహావిశ్లేష వ్యసనము మెడబట్టి తోయ శ్రీవెంకటాద్రినే నిత్యవాసముగా గల్పించుకొని వృక్షరూపమున నివసించు నిత్యసూరి నివహము నొకచోట నుండనీయక మీరేల మెడపిసికి పీకి పెల్లగించి బాధింతురు? మీకు పుణ్యమే యపేక్షితమగునేని నేను నాయాచార్యులగు తొండనూర్ నంబి తిరుమాళిగ (యింటి)లో ప్రతినిత్యము తదీయారాధనమైనపిమ్మట స్వాము లారగించి విడిచిన యాకులనెత్తి పారవైచి శుద్ధిచేయుచుందును. ఆసుకృతమందలి నాల్గవవంతును మీకు నేను సమర్పింతును. కావున నాయందు దయయుంచి మీరీ పుష్పవృక్షముల బాధించుటకు విరమించరా యని ప్రార్థించిరి.

# ఆచార్య విశ్వాస బలము

శ్రీమతి నురంగంటి రంగనాయకమ్మగారు కోదకొండ.

"యాదృశీ భావనా యత్ర సిద్ధి ర్భవతి తాదృశీ" (ఏ వస్తువునందెట్టి నిశ్చలభావన యుండునో ఆ వస్తువట్టి ఫలితమునే యిచ్చును.)

ఒకనాడు నంబిళ్ళ తమ యంతరంగ శిష్య వర్గముతో తిరువెళ్ళరై నాచ్చియారును సేవించి తిరిగి శ్రీరంగమునకు వేంచేయునప్పుడు కావేరీ నది పొంగి పొరలజొచ్చెను. అప్పుడు వారందరు నొకదోనె నెక్కి నదీమధ్యమున కేగు సరికి సూర్యాస్తమయమై నలుగడల చీకటి యలమి కొనుటయే గాక పెద్దవర్షము కురియ సాగెను. ముందున కరుగుసాగుటయే దుర్భరమాయెను. దిక్కులు తోచుటలేదు. దోనెయు మునుగ నారంభించెను. హాహారవములు చెలరేగెను. అంత నా దోనె నడుపువాడు దోనెయందున్న వారిలో నొక్కరైనను దిగనిచో నంబిళ్ళ మొద లగు పెద్దలతో నందరును నదీగర్భమున స్థాయిగ విశ్రమించుట తథ్యమని చెప్పివేసెను. కాని యిట్టి సాహసమెవరికి? అందరకును ప్రాణములు తీపియే గదా! ఇక నేమున్నది? అంతపని కానున్నది. ఈ యుపద్రవమును గాంచి యొక సాత్త్విక వృద్ధ భక్తురాలొకతె "నాయనా? నాకు నూరేళ్ళు నిండినవి. నావలన నెవ్వరికి నీషత్తైన నుపకారము సున్న. నా నంబిళ్ళ బ్రతికిన పెక్కురుజీవింతురు. గాన నే నిదే నదిలో దిగుచున్నాను. నాతండ్రిని భద్రముగ దరిజేర్చు నాయనా! యని 'నంబిళ్ళై తిరువడిగళే శరణ' మను చు తటాలున నీట నురికెను. అందరు నాశ్చర్యచకితులై స్రుగ్గిలిరి. దోనె తేలినది. అందరును సురక్షితముగా నొడ్డు చేరిరి. కాని నంబిళ్ళగారి మనస్సామె సాహసకృత్య ముచే పుండుపడెను. అయ్యో! నా నిమిత్త మా యిల్లాలెంత సాహసకృత్య మొనరించి తనువు చాలించెనో యని పరిపరి విధముల విలపింప దొడంగిరి.

ఇంతలో నాయమ్మ దూరమునుండియే వీరి మాటలను విని "ఆచార్యా! నేను చావలేదు. నాకొరకై వ్యాకులపడకుడు. నేను నదిలోని కురికినతోడనే సమీపమున నాకొక దిబ్బదొరికి నది. దాని నవలంబించి నిలిచియున్నానని కేక వైచెను. అదివిని యందరు నాశ్చర్యపడిరి. వెంటనే నంబిళ్ళగారు దోనె నచట కంపిరి. నామె భద్రముగా నాచార్యుల చెంతజేరి వారిని సేవించి నిలిచెను.

నీవెట్లు బ్రతికితివని వారడుగ నామె యిట్లు త్తరమొసంగెను.

"స్వామీ! తమ పాదారవిందములనే తలచ నిడుకొని నదియందు పడి కొట్టుకొని పోవుచుం డగ వెంటనే తమ రచ్చట నొక మెరకదిబ్బగా వేంచేసి నన్ను రక్షించితిరి గాదా! యని యనుచుండగా నంబిళ్ళయు "అమ్మా! నీవిశ్వాస మట్లుండ అది యట్లు గాకుండు టెట్లు? "యాదృశీ భావనా యత్ర సిద్ధి ర్భవతి తాదృశీ" యని సెలవిచ్చిరి.

ఓం

శ్రీరస్తు

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ

# నియమావళి

రిజిష్టర్డు 1951-వ సంవత్సరం



—: కేంద్ర కార్యాలయము :—

"గీతామందిరము"

107, వరదాముత్తియప్పన్ వీధి, మదరాసు – 1.

సత్యంవద అహింసా పరమోధర్మః ధర్మం చర

# శ్రీయతిరాజసేవామహిళామండలి

## శ్రీవిశిష్టాద్వైతప్రచారకసంఘస్త్రీశాఖ

(రిజిష్టర్డు)

## శాశ్వతభవననిధి.

107, వరదాముత్తియప్పన్ వీధి మదరాసు-1

గీతామందిరము.

తిరువారాధన

సమిష్టిపారాయణ

గోశాల

కైంకర్యపరులతిరునామములు: ____________

విరాళము రూ. ____________

కాలక్షేపము | భజన | గ్రంథాలయం | అనుష్ఠానము | చేతిపనులు

శ్రీ విశిష్టాద్వైత సిద్ధాంత ప్రచారమునకై శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ స్త్రీ శాఖయగు శ్రీ యతిరాజసేవా మహిళా మండలి మదరాసు శాఖ వారిచే "గీతామందిర భవనము"ది 5-3-1951 తేదీని కొని స్వాధీనపరచుకొన బడినది.

| | |
|---|---|
| ఈ భవనము ఖరీదు | రూ. 30,000-0-0 |
| రిజిస్ట్రేషన్‌కు, రిపేర్లకు వగైరా చిల్లర ఖర్చులకు | రూ. 10,000-0-0 |
| మొత్తము | రూ. 40,000-0-0 |

ఇందు యిప్పటికి సుమారు రూ. 20,000-0-0 మాత్రము దాతలవలన విరాళముగా యివ్వబడినది. ఇంకను రూ. 20,000-0-0 కావలసి యున్నది.

ఇదియు గాక మిద్దెమీద కాలక్షేపమునకై రెండు పెద్ద హాల్సు కట్టవలసి యున్నది. ఒక్కొక్క హాలుకు సుమారు ఎనిమిదిదేసివేల రూప్యము లగునని అంచనా వేయబడినది.

ఈ పటమున సూచింపబడిన కార్యక్రమములన్నియు ఈ భవనమున జరుగవలసి యున్నవి. వీటన్నింటికిన్ని విరివిగ సొమ్ము కావలసియున్నది.

గాన దాతలు ఈ సమయమునకు తోడ్పడి స్వహస్త పరహస్తముల ద్వారా విరివిగ విరాళముల నిచ్చి సహాయ పడవలసినదిగ సవినయముగ ప్రార్థించు చున్నారము.

ఇట్లు,

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము.

శ్రీ

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము యొక్క

# మెమొరండము ఆఫ్ అసోషియేషను

I. ఈ సంఘము యొక్క పేరు:— ఈ సంఘము "శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము" అని పిలువబడును.

II. ఈ సంఘము యొక్క కార్యాలయము మదరాసు రాజధానిలో యుండును.

III. ఈ సంఘము యొక్క ఆదర్శము:— విశ్వమానవకల్యాణము; విశ్వమానవసౌభ్రాతృత్వము; ఐకమత్యము; అభ్యుదయము, నిస్స్వార్థసేవ; ఆధ్యాత్మికాభ్యున్నతి; ఆస్తిక్యత.

IV. ఈ సంఘము యొక్క ఆచరణము:— సవినయనిస్స్వార్థసేవ; త్యాగము; జీవకారుణ్యము; పవిత్రత; పూజ్యత; సర్వమతసహనము; సహకారము; సమన్వయము; స్వస్వవర్ణాశ్రమ ప్రయుక్త ధర్మ నిర్వహణము; రాజకీయకార్యక్రమ రహిత ఆధ్యాత్మికాభివృద్ధికర కార్యాచరణము; మనోవాక్కాయ కర్మతః ఏకరూప ప్రవర్తనము.

V. ఈ సంఘము యొక్క కార్యక్రమము:— ౧. సభలలోను, సాంఘికాది సమావేశములలోను భగవద్భాగవత ఉత్సవాదులలోను, పాఠశాలలోను అవకాశ అవసరముల ననుసరించి పండితులగు శ్రీవైష్ణవులచే వేదాంతోపన్యాసముల నిప్పించుట.

౨. శిష్యసంచారముగలవారు, మఠాధిపతులు, దేవాలయసంబంధులు, ఉపాధ్యాయులు మున్నగువారిద్వారా వేదాంత ప్రచారము విరివిగా జరుగునటుల ప్రోత్సహించుట, అట్టివారికి యథావకాశము తోడ్పడుచుండుట.

౩. స్థిరమైనట్టియు, తాత్కాలికమైనట్టియు, సాంచారికమైనట్టియు ప్రాచ్యవిద్య ఆధ్యాత్మిక వేదాంత పాఠశాలలను, గ్రంథాలయములను నేర్పరచి నడుపుట, ఇదివరలో ఉన్నవాటికి తోడ్పడుట, జీర్ణమైనవాటిని పునరుద్ధరించుట.

౪. పండిత పరిషత్తులు, విద్యార్థిసన్నివేశములు, సభలు, ప్రదర్శనములు జరుపుచుండుట, పరీక్షలజరిపి బిరుదములు, ధృవపత్రములు, బహుమతుల నిచ్చుచుండుట.

౫. నూతన స్వతంత్ర అనువాద గ్రంథములను వ్యాఖ్యానములను టీకలను వ్రాయించుట, ప్రచురించుట అవసరమైన పూర్వగ్రంథములను తిరిగి పునర్ముద్రింపించుట, అముద్రితగ్రంథముల సేకరించి ప్రచురించుట, గ్రంథవిమర్శనాదుల చేయించి ప్రచురించుట.

౬. సాంప్రదాయగ్రంథ కాలక్షేపములు, పురాణపఠనములు, హరికథాకాలక్షేపములు, ఉత్సవములు, వేడుకలు, రేడియోప్రసంగములు, గ్రామఫోను రికార్డులు, భజనలు, నాటకములు, సినీమాప్రదర్శనములు మున్నగువానిద్వారా జ్ఞాన-భక్తి-వైరాగ్యముల ప్రచారము చేయుట.

౭. వివిధములైన దైనిక, వార, పక్ష, మాసాదిపత్రికలు, కరపత్రములు, నివేదికల ప్రచురించుచుండుట.

౮. దేవాలయముల నిర్మించుట, ఉన్నవాటియొక్క సక్రమనిర్వహణకై తోడ్పడుట, జీర్ణోద్ధారణచేయుట.

౯. యతిరాజాశ్రమములు, రామానుజకూటములు, శఠకోపశిబిరములు, పరకాలమఠములు, కాలక్షేపకూటములు, వసతిగృహములు, సేవాసంఘములు, శాంతికుటీరములు, విశ్రాంతిశాలలు, ఆశ్రమములు మున్నగునవి స్థాపించుట, పాలించుట, ఇదివరలో యున్నవాటి సక్రమపరిపాలనకై తోడ్పడుట, జీర్ణోద్ధారణచేయుట.

౧౦. ఈ సంఘీయులయొక్క పురోభివృద్ధికిన్ని, జీవనోపాధికిన్ని, ఆధ్యాత్మికాభివృద్ధికిన్ని ఉపయోగించునట్టి స్వరూపానురూపములైన వృత్తులను, విద్యలను ఏర్పాటుచేసి పనిచేయుట.

౧౧. ఈ సంఘాభివృద్ధి కుపయోగించు అన్నివిధములైన యితర కార్యక్రమముల నవలంబించి పనిచేయుట.

VI. ఈ క్రింద తెలుపబడిన మహాశయులను ఈ సంఘమునకు కార్యనిర్వాహకవర్గముగ ఎన్నుకోవడమైనది.

### అధ్యక్షులు

శ్రీ. ఉ. వే. శ్రీమాన్ పరాశర సుదర్శనభట్టరు అయ్యవార్లంగారు, కోరుకొండ, (వయా) రాజమహేంద్రవరము, తూ. గోదావరిజిల్లా.

### ఉపాధ్యక్షులు

" " అద్దంకి తిరుమల సమయోద్దండ కోలాహల లక్ష్మీనృసింహ కుమార తిరువేంకట తాత దేశికాచార్యులు అయ్యవార్లంగారు, చీరాల, గుంటూరుజిల్లా.

" " నడాదూరి శఠగోపాచార్యులు అయ్యవార్లంగారు, నూజివీడు, కృష్ణాజిల్లా.

" " రావుబహద్దూరు వేమూరి రంగనాథం శ్రేష్ఠిగారు, ధర్మకర్తలు శ్రీపార్థసారథి దేవస్థానము, 7, దక్షిణమాడవీధి, తిరువల్లిక్కేణి, మదరాసు.

### ప్రధానకార్యదర్శి

" " తె. కం. గోపాలాచార్యులుగారు, కోరుకొండ, (వయా) రాజమహేంద్రవరము, తూ. గో. జి.

### సహాయకార్యదర్శి మరియు కోశాధికారి

" " అ. చి. శ్రీమన్నారాయణాచార్యులుగారు, అర్తమూరు, (వయా) ద్వారపూడి, తూ. గో. జి.

### కార్యనిర్వాహక సభ్యులు

" " కొమాండూరి యిశైయవిల్లి వెంకటాచార్యులుగారు, కాళ్లకూరు, (వయా) భీమవరము, పశ్చిమగోదావరిజిల్లా.

" " పండితచక్రవర్తి శ్రీనివాసరంగాచార్యులుగారు, 29, పెరుమాళ్ మొదలివీధి, మదరాసు 1.

" " కాంతలూరి వెంకటాచార్యులుగారు, చిన్నగోపురంవీధి, పాలకొల్లు, పశ్చిమగోదావరిజిల్లా.

" " కవిరత్న గుదిమెళ్ల రామానుజాచార్యులుగారు, ముక్తిపల్లి, కూచనపూడిపోస్టు, గుంటూరుజి.

" " మొలుగు రామానుజాచార్యులుగారు, ఎ. గుళ్ల, పిప్పరపోస్టు, పశ్చిమగోదావరిజిల్లా.

" " నడూరి అప్పలాచార్యులుగారు, సింహాచలము, విశాఖపట్టణముజిల్లా.

" " కో. కం. రంగాచార్యులుగారు, రామన్నపేట, వరంగల్లు నైజాం.

" " తిరుమలపురిమళ్ల ధర్మాచార్యులుగారు, ఏడిద, (వయా) మండపేట, తూర్పుగోదావరిజిల్లా.

" " కందాళ పెదఅప్పలాచార్యులుగారు, శ్రీరామతీర్థము, (వయా) నెల్లిమర్ల, విశాఖజిల్లా.

" " మట్టపల్లి రంగనాథయ్యగారు, [illegible], రెడ్డిరామన్నవీధి, మదరాసు-1.

" " దాస శేషుగారు, దాసకుటీరం, అంగలకుదురు, గుంటూరుజిల్లా.

" " చి. మా. వెంకటరాఘవాచార్యులుగారు, గద్వాలబంగళా, నాంపల్లిరోడ్డు, హైదరాబాదు.

" " శ్రీ సీతారామయతీంద్రులవారు, శ్రీకృష్ణాశ్రమము, పెదముక్తేవి, కృష్ణాజిల్లా.

" " నడాదూరి గోపాలకృష్ణమాచార్యులుగారు, మంగళంపాడు (వయా) సూళ్లూరుపేట, నెల్లూరుజి.

" " పాతాళం వీరరాఘవులు శ్రేష్ఠిగారు, అడ్వకేటు, ఆదియప్పనాయక్కన్ వీధి, మదరాసు-1.

" " బోయిన సీతారామయ్యగారు బేతవోలు, (వయా) గుడివాడ, కృష్ణాజిల్లా.

" " కలవగుంట శేషాచార్యులుగారు, తణుకు, పశ్చిమగోదావరిజిల్లా.

" " ఈయుణ్ణి రాఘవాచార్యులుగారు, శ్రీయతిరాజాశ్రమము, నరసాపురము, పశ్చిమగోదావరిజిల్లా.

" " కరాళపాటి రాధాకృష్ణయ్యగారు, 147, అణ్ణాపిళ్ళైవీధి, మదరాసు 1.

" " తె. కం. వరహస్వామిగారు, కోరుకొండ, (వయా) రాజమహేంద్రవరం.

శ్రీ

# శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము యొక్క

# ఆర్టికల్సు ఆఫ్ అసోసియేషను.

## రూల్సు అండు రిగ్యులేషన్సు

1. ఈ సంఘము యొక్క పేరు:— ఈ సంఘము "శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము అని పిలువ బడును.

2. ఈ సంఘము యొక్క ఆదర్శము:— విశ్వమానవ కల్యాణము, విశ్వమానవ సౌభ్రాతృత్వము, ఐకమత్యము, అభ్యుదయము, నిస్స్వార్థసేవ, ఆధ్యాత్మికాభ్యున్నతి, ఆస్తిక్యత.

3. ఈ సంఘము యొక్క ఆచరణము:— సవినయనిస్స్వార్థసేవ, త్యాగము, జీవ కారుణ్యము, పవిత్రత, పూజ్యత, సర్వసహనము, సహకారము, సమన్వయము, స్వస్వవర్ణాశ్రమ ప్రయుక్త ధర్మ నిర్వహణము, రాజకీయ కార్యక్రమ రహిత ఆధ్యాత్మికాభివృద్ధికర కార్యాచరణము, మనోవాక్కాయకర్మలచే ఏకరూప ప్రవర్తనము.

4. ఈ సంఘము యొక్క విశ్వాసము:— ౧. చిదచిద్విశిష్టాద్వైతుడైన శ్రీమన్నారాయణుడే పరతత్త్వము.

   ౨. కర్మ-జ్ఞానాంగక భక్తి-ప్రపత్తులచే ప్రసన్నుడైన శ్రీమన్నారాయణుడే ఉపాయము.

   ౩. అప్రాకృతదేశవిశిష్టుడైన శ్రీమన్నారాయణుడే పరమప్రాప్యము.

5. ఈ సంఘమునకు ప్రమాణము:— సత్త్వగుణప్రధానమైన శ్రుతి-స్మృతి-సూత్ర-ఆగమ-ఇతిహాస-పురాణ-శిష్టాచార సాంప్రదాయములు.

6. ఈ సంఘము యొక్క సభ్యత్వము అర్హతము:—ఇందు సభ్యత్వము సాధారణమనియు, శాశ్వతమనియు, రెండు తరగతులుగ యుండును.

## సాధారణసభ్యత్వము

సంవత్సరము వక్కంటికి రూ 1-4-0 ను చెల్లించువారు సామాన్యసభ్యులు
సంవత్సరము వక్కంటికి రూ 3-4-0 ను చెల్లించువారు సహాయసభ్యులు
సంవత్సరము వక్కంటికి రూ 5-4-0 ను చెల్లించువారు నిర్వాహకసభ్యులు
సంవత్సరము వక్కంటికి రూ 10-0-0 ను చెల్లించువారు పోషకసభ్యులు
సంవత్సరము వక్కంటికి రూ 25-0-0 ను చెల్లించువారు మహాపోషకసభ్యులు
సంవత్సరము వక్కంటికి రూ 50-0-0 ను చెల్లించువారు రాజపోషకసభ్యులు
సంవత్సరము వక్కంటికి రూ 100-0-0 ను చెల్లించువారు మహారాజపోషకసభ్యులు; అని ఎన్నబడుదురు.

వీరి సభ్యత్వము సంవత్సరములో ఎపుడు చేరినను కూడ ఆ సంవత్సర ఫాల్గుణ బ 30 నాటితో సమాప్తియగును. సభ్యత్వము సమాప్తి అయినవారు తిర్గి సభ్యత్వచందాను చెల్లించి అందులకై నిర్ణయించబడిన రశీదును పొందు వరకు తిర్గి ఈ సంఘమున సభ్యులుగ పరిగణించబడరు.

## శాశ్వతసభ్యత్వము

ఒకే పర్యాయము రూ 250/ను చెల్లించువారు శాశ్వత సభ్యులుగను
ఒకే పర్యాయము రూ 500/ను చెల్లించువారు శాశ్వత సహాయకులుగను
ఒకే పర్యాయము రూ 1000/-ను చెల్లించువారు శాశ్వత నిర్వాహకులుగను
ఒకే పర్యాయము రూ 2500/-ను చెల్లించువారు శాశ్వత పోషకులుగను
ఒకే పర్యాయము రూ 5000/-ను చెల్లించువారు శాశ్వత మహారాజ పోషకులుగను
ఒకే పర్యాయము రూ 10000/-ను చెల్లించువారు శాశ్వత రాజపోషకులుగను
ఒకే పర్యాయము రూ 11116/-ను చెల్లించువారు శాశ్వత మహారాజ పోషకులుగను ఎన్నబడుదురు.

వీరి సభ్యత్వము వీరి జీవితాంతమువరకు యుండును. ('౮' నియమములోని "ఈ" శీర్షికగల నియమమునకు లోబడి )

6. ఆ. సభ్యుల విధులు:— ౧. ఇతరులను సభ్యులుగ చేర ప్రోత్సహించుట.

౨. తమ తమ ప్రాంతములలో ఈసంఘ వ్యాప్తికై పాటుబడుట; ఈ సంఘసభలలోను, ఉత్సవములలోను వేడుకలలోను యథావకాశము పాల్గొను చుండుట.

౩. శుభా శుభకార్యములయందు ఈ సంఘమునకై ప్రత్యేక కట్నములు, బహుమతులు; సంభావనావిరాళములు ఈ మొసంగు చుండుట, యితరుల వల్ల వసూలు చేయుచుండుట.

౪. ఈ సంఘముద్వారా ప్రచురించబడు పత్రికలు పుస్తకములు, వగయిరాలకు తగినంత ప్రోత్సాహ మిచ్చు చుండుట.

౫. ఈ సంఘప్రాంతీయ పాఠశాలలకున్ను, పరివార సంస్థలకున్ను యథాశక్తి తోడ్పడుచుండుట.

౬. ఈ సంఘమునకు తమకు వీలగు ఆర్థికావకాశముల కల్పించుట.

౭. అధికార సంఘ నియమముల నాదరించి నిర్వహించుట.

౮. ఈ సంఘ ప్రచారార్థమై జరుపబడు కార్యక్రమము లన్నింటియందు యథాశక్తి పాల్గొని నిర్వహించు చుండుట.

౯. తమ తమ వర్ణాశ్రమ ధర్మముల ననుసరించి సంధ్యావందనము, దేవతార్చనము, అతిథి అభ్యాగతి సత్కార పూజలు, సత్కథాశ్రవణము, భగవద్భజనము, సత్సహవాసము, ఏకాదశి ఉపవాసము, పెద్దల సేవా శుశ్రూషాదులు, భగవద్భాగవతాచార్య జయంతులు, తిరునక్షత్రోత్సవములు యథాశక్తి సలుపుచుండుట.

౧౦. అన్ని విధముల త్రికరణాత్మనా ఆదర్శమైనట్టియు, పవిత్రమైనట్టియు అహింస-నీతి-ధర్మయుతమై నట్టియు, జీవితమును గడుపుచుండుట.

6. ఇ. ఈ సంఘము యొక్క కార్యాలయము:— సంఘకార్యదర్శి యుండు స్థలమునగాని. వారి కనువగు స్థలమునగాని సంఘకార్యాలయ ముండును, ప్రస్తుత మీ సంఘకార్యాలయము "147, అణ్ణాపిళ్ళై వీధి, మదరాసు-1."

7. ఈ. ఆర్థికము:— చందాలు, విరాళములు, ప్రతిసభ్యునియింట జరుగు శుభాశుభముల సమయముల యందీయబడిన బహుమతులు, కట్నములు, సభలు, సమావేశములు, ఉత్సవములు మున్నగు వాటియందీయబడిన ప్రత్యేక ఉమ్మడి విరాళములు, ఆయా ప్రత్యేక కార్యక్రమములకై ఏర్పడినఆహ్వానసంఘములు ఆయాకార్యముల పూర్తిచేసిన పిమ్మట మిగిలిన నిల్వధనములు కేంద్రసంఘమునకే చెందవలెను.

ఆ. ప్రత్యేక విధులకై నిర్దేశించి దాతలవలన నీయబడు సొమ్ములు ఎవ్వరి కీయబడినను అవి యన్నియు కేంద్రి సంఘముయొక్క అధికార పర్యవేక్షణ సలహా సూచనల ప్రకారము ఆయా ప్రత్యేక విధులకై మాత్రమే వినియోగింప బడవలయును.

ఇ. ఈ సంఘము యొక్క ధనము యావత్తు ప్రభుత్వముచే అంగీకరింపబడిన బ్యాంకులలో కోశాధికారి లేక కార్యదర్శులపేర నిల్వ చేయబడవలయును. అవసరమునకు మించిన ధనమును ఏవ్యక్తిఒద్దను నిల్వ యుంచరాదు.

ఈ. సంఘము యొక్క కార్యక్రమము:— ౧. సభలలోను, సాంఘికాది సమావేశములలోను, భగవత్-భాగవత-ఉత్సవాదులలోను, పాఠశాలలోను అవకాశ అవసరముల ననుసరించి పండితులగు శ్రీ-పురుషాదులచే వేదాంతోపన్యాసముల విప్పించుట.

౨. శిష్యసంచారము గలవారు, మఠాధిపతులు, దేవాలయ సంబంధులు, ఉపాధ్యాయులు మున్నగు వారి ద్వారా వేదాంత ప్రచారము విరివిగా జరుగునటుల ప్రోత్సహించుట, అట్టివారికి యధావకాశము తోడ్పడు చుండుట.

౩. స్థిరమైనట్టియు, తాత్కాలికమైనట్టియు, సాంచారిక మైనట్టియు, ప్రాచ్యవిద్య-ఆధ్యాత్మిక వేదాంత పాఠశాలలను, గ్రంథాలయములను నేర్పరచి నడుపుట, ఇదివరలో ఉన్నవాటికి తోడ్పడుట, జీర్ణమైన వాటిని పునరుద్ధరించుట.

౪. పండిత పరిషత్తులు, విద్యార్థి సన్నివేశములు సభలు, ప్రదర్శనములు జరుపుచుండుట, పరీక్షలు జరిపి బిరుదములు, ధృవపత్రములు, బహుమతుల నిచ్చుచుండుట.

౫. నూతన స్వతంత్ర - అనువాద గ్రంథములను - వ్యాఖ్యానములను - టీకలను-వ్రాయించుట - ప్రచురించుట, అవసరమైన పూర్వగ్రంథముల తిర్గి ముద్రింపించుట, అముద్రిత గ్రంథముల సేకరించి ప్రచురించుట, గ్రంథవిమర్శనాదుల చేయించి ప్రచురించుట.

౬. సాంప్రదాయ గ్రంథ కాలక్షేపములు, పురాణ పఠనములు, హరికథా కాలక్షేపములు, ఉత్సవములు, వేదుకలు, రేడియో ప్రసంగములు, గ్రామఫోనురికార్డులు, భజనలు, నాటకములు, సినీమా ప్రదర్శనములు మున్నగువాని ద్వారా జ్ఞాన-భక్తి-వైరాగ్యముల ప్రచారము చేయుట.

౭. వివిధములైన దైనిక, వార, పక్ష, మాసాది పత్రికలు, కరపత్రములు, నివేదికలు ప్రచురించుచుండుట.

౮. దేవాలయముల నిర్మించుట, ఉన్నవాటియొక్క సక్రమ నిర్వహణకై తోడ్పడుట, జీర్ణోద్ధారణ చేయుట.

౯. యతిరాజాశ్రయములు, రామానుజకూటములు, శఠకోపశిబిరములు, పరకాలమఠములు, కాలక్షేపకూటములు, శాంతికుటీరములు, విశ్రాంతిశాలలు, ఆశ్రమములు, మున్నగునవి స్థాపించుట, పాలించుట, ఇదివరలో యున్నవాటి సక్రమపరిపాలనకై తోడ్పడుట, జీర్ణోద్ధారణ చేయుట.

౧౦. ఈ సాంఘీయుల యొక్క పురోభివృద్ధికిన్ని, జీవనో పాధికిన్ని, ఆధ్యాత్మికాభివృద్ధికిన్ని ఉపయోగించునట్టి స్వరూపాను రూపములైన వృత్తులను,విద్యలను ఏర్పాటుచేసి పనిచేయుట.

8. సభ్యుల హక్కులు:— అ. ప్రతి సభ్యుడున్ను తమ గ్రామసంఘమును ఎన్నుకొనుటకున్ను,మహాజన సభాసమావేశమున పాల్గొని అందలి తీర్మానముల విషయమై తమ యభిప్రాయముల తెలుపుటకున్ను, ఒక్కొక్క "సమ్మతి సూచన"ను (ఓటును) కలిగి యుండును.

ఆ (1) సంవత్సరములో ఎపుడు సభ్యులుగ చేరినను ఆ సంవత్సర ఫాల్గుణ బహుళ ౩౦ వరకు మాత్రమే సభ్యత్వాధికారమును కలిగియుందురు.

"

(?) సంచాలక సమితి, పండిత పరిషత్తులోని సభ్యులు మాత్రము వానిలో సభ్యత్వము కలిగియున్నంత వరకు సాంవత్సరికచందా కట్టనవసరము లేకుండగనే ఈసంఘ సభ్యత్వాధికారమును కలిగియుందురు.

ఇ. ఈ సంఘ కార్యకారిణీ సమితివారు ఎవరినైనను తగినంత కారణమున్నచో ఆకారణమును తెలుపకుండగనే ఈ సంఘమున సభ్యునిగ చేర్చుకొన నిరాకరించవచ్చును.

ఈ. తాను స్వయముగ గాని, పరోక్షముగ గాని ఈ సంఘమునకు ఏవిధముగ నష్టముగాని, కళంకముగాని కలిగించిన ఏతరగతి సభ్యునైనను వారి సభ్యత్వమును ఈ కార్యకారిణీ సమితి తొలగించవచ్చును.

9. కార్యనిర్వహణము:— ఈసంఘముయొక్క కార్యనిర్వహణము ఈ క్రింది విధముగ నిర్వహించబడును.

1 గ్రామ సంఘములు, 2. సంచాలక సమితి, 3. మహాసంఘ కార్యకారిణీ సమితి = కేంద్రసంఘము, = కార్యకారిణీ సమితి (సమానార్థములు). 4. మహాజనసభ = కేంద్రసభ = వార్షిక సమావేశము = విరాట్ సమావేశము, (సమానార్థము) 5 ఆహ్వానసంఘము, 6. ఉపసమితులు, 7. పండిత పరిషత్తు, 8. సంబద్ధ సంస్థలు, 9. శ్రీ యతిరాజ సేవా మహిళా మండలులు.

(1) పైన తెలిపిన వాటిలోని అధికారవర్గము వారందరు స్త్రీలు, పురుషులు కూడ అధికారవర్గములో యుండవచ్చును. తమయొక్క జీవితములో అత్యధిక కాలమును ఈ సంఘముయొక్క సక్రమాభివృద్ధికై వినియోగించి పాటుబడువారై యుండవలెను.

(2) శ్రీవిశిష్టాద్వైత సిద్ధాంతములను బాగుగా తెలిసిన వారై వాటిని తమశక్త్యానుసారముగ ఆచరణయందుంచువారై ఆచార్యప్రాప్తులై యుండవలెను.

(3) పంచ సంస్కారపరులై యుండవలెను. (పంచసంస్కారములు = శంఖచక్రతాపము-ఊర్ధ్వపుండ్రము-నామము-మంత్రము-యాగము.)

(4) దేశకాలానుగుణ్యముగ యీసంఘాభివృద్ధికి అనుకూలమగు వ్యవహార నిర్వహణ శక్తిసామర్థ్యములు గలవారై యుండవలెను.

(5) అంటువ్యాధులులేని ఆరోగ్యవంతులై యుండవలెను.

(6) ఈ సంఘమునందు వరుసగ కనీసము మూడు సంవత్సరములు సభ్యులై యుండవలెను. (ప్రత్యేక పరిస్థితులలో కార్యకారిణీ సమితి ఈకాలపరిమితిని మార్చవచ్చును)

(7) అ. ఈ సంఘమునకు సంబంధించిన ఎన్నికలన్నియు చేతులెత్తుట మూలమునగాని, చీటివిచ్చుట ద్వారాగాని లేక ప్రత్యేక పరిస్థితులలో తమప్రతినిధుల పంపుటద్వారాగాని, లిఖితరూపముగగాని కార్యకారిణీ సమితి ఆదేశానుసారముగా జరుపబడవలెను.

ఆ. ఎన్నుకొనబడుటవలన వచ్చిన అధికారములుకూడ సంఘ సభ్యత్వముతోపాటు ఆ సంవత్సరఫాల్గుణ బ॥ అమావాస్య వరకు మాత్రమే యుండును.

ఇ. ప్రతిసమావేశమునందును హాజరైన వారిలో సగముకంటె అధికసంఖ్యాకుల సమ్మతుల ననుసరించి కార్యక్రమము నిర్ణయింపబడవలెను.

ఈ. ఇరుపక్షములయందు సమ్మతులు సమానముగ నుండునపుడు మాత్రమే ఆయా సమావేశాధ్యక్షుడు తన సమ్మతిని ఉపయోగించవలెను. ఇతర సమయముల యందెప్పుడును అధ్యక్షుడు తనసమ్మతి నుపయోగించకూడదు.

(8) ప్రతి సమావేశమునందును చర్చింపబడు కార్యక్రమము ఆ యాసమావేశములకు సంబంధించిన సభ్యులకు తగినంత ముందుగ ఆయా కార్యకర్తలచే తెలియచేయబడవలెను.

(9) ప్రతి సమావేశమునకు సామాన్యముగ ఆసమావేశ సభ్యత్వ నిర్ణీత సంఖ్యలలో అయిదవ వంతు కోరముగ నుండును.

(10) ప్రతి సమావేశమును అధ్యక్షుని సూచనపై కార్యదర్శియే తేదీ ప్రదేశాదుల నిర్ణయించి ప్రకటించుచుండవలెను.

(11) కార్యకారిణీ సమితివారు యనుమతిలేకుండగ ఈసంఘమందలి ఏతరగతి సభ్యులుకూడ ఈ సంఘమునకు సంబంధించిన ఏపనినికూడ చేయరాదు.

(12) అన్ని ఏర్పాటులయందును, అంత్యనిర్ణయము నందును కార్యకారిణి సమితివారు సంపూర్ణాధికారమును కలిగి యుందురు.

(13) ఈ సంఘముయొక్క ఏసమితిలోనసభ్యులైననుసరియే ఆసమితియొక్కగాని, కార్యనిర్వాహక వర్గము యొక్కగాని నిర్ణీతసంఖ్యలో నాలింట మూడవవంతు సభ్యులచే విశ్వాస రాహిత్యతీర్మానము చేయబడినచో గాని, తామే రాజీనామానిచ్చి అది కార్యకారిణీసమితిచే అంగీకరించబడిన వెంటనేగాని, తమ యధికారమును, సంఘసభ్యత్వమును కోల్పోవును అట్టి యధికారము వెంటనే కార్యకారిణీ సమితికి సంక్రమించును కార్య కారిణీసమితిపై విశ్వాసరాహిత్య తీర్మానము చేయబడినచోగాని లేక అది రాజీనామా నిచ్చినపుడుగాని దాని యధికారములు సంచాలకసమితికి సంక్రమించును. ఈ రెండింటియొక్కయు ఖాళీసమయముల యందు ఈ సంఘ సాధారణసభ్యులే మహాజన సభను జరిపి ఖాళీస్థానముల కన్నిటికిని నూతన ఎన్నికలు జరుపుకొన వలెను.

10. గ్రామ సంఘము:— అ. సామాన్యముగా పదిమందికంటె తక్కువగాని సభ్యులుగల ప్రదేశమునందు గ్రామసంఘ మేర్పరచబడవలెను, ఈసంఖ్యా నిర్ణయ మార్పునకు కార్యకారిణీ సమితి యధికారము కలిగి యుండును.

ఆ. వీరిలో నొకయధ్యక్షుడు, ఒక కార్యదర్శియు, ముగ్గురు సభ్యులుగల గ్రామసంఘ కార్యనిర్వాహక వర్గమును ఆగ్రామ సభ్యులు ఎన్నుకొనవలెను. అవసరమున్నచో ఉపాధ్యక్షుని, సహాయ కార్యదర్శులను, కోశాధి కారిని ఎన్నుకొనవచ్చును.

ఇ. గ్రామకార్య నిర్వాహకవర్గము అవసరమైనపుడెల్లను సమావేశమగుచు మహాజన సభయొక్కయు, కార్య కారిణీ సమితివారియొక్కయు సూచనలు, సలహాలు, ఆదేశముల ననుసరించి తమకార్యక్రమము నంతను జరుపుకొనుచు నెలవారి నివేదికలను, జమ ఖర్చులను తెలుపుచుండవలెను.

ఈ. ఈవర్గమువారు సంఘముచే ప్రచురింపబడు పత్రికను నియతముగ తెప్పించి సభ్యులనందర నొకచో సమా వేశపరచి ఆపత్రికను చదివి వినుపించుట, సంఘప్రచురణలు నన్నిటిని తమ పుస్తకభాండాగారమునకు తెప్పించి వాటిప్రాముఖ్యతను సభ్యులకు బోధించి ప్రతి సభ్యుడును ఒకపుస్తకమును కొని దాని ఉపయోగ మును పొందునట్లుచేయవలెను. మరియు తమ గ్రామమందున్న పండితులచేగాని, గ్రామాంతరములనుండి విచ్చేసిన పండితులచేగాని వేదాంత విషయక ఉపన్యాసముల నిప్పించుచుండవలెను. శుభకార్యములలో యజమానుల ప్రోత్సహించి సంఘమునకు విరివిగా ఆర్థిక సహాయమును పెంపొందించవలెను; సంఘాదేశ ములను సర్వజన విదితముల గావించవలెను.

ఉ. మహాజనసభా సమావేశమునకు ఒక నెలకుముందుగానే సంచాలక సమితివారు సూచించిన వారిలో నొకరిని రాబోవు సంవత్సరమునకు మహాజన సభాధ్యక్షులుగ గ్రామ సంఘముచే ఎన్నుకొనబడవలెను. గ్రామ సంఘ ములో హెచ్చువోటిచే సూచింప బడినవారే మహాజనసభాధ్యక్షులుగను తత్సమావేశానంతరము ఆ సంవ త్సరమంతయు ఈ సంఘమునకున్ను, కార్యకారిణీ సమితికిన్నీ అధ్యక్షులుగ నుందురు.

11. సంచాలక సమితి:— అ. (1) ఈ సంఘసభ్యత్వమును మూడు సంవత్సరములకు తక్కువ గాకుండా వరుసగా కలిగియుండి సంచాలక సమితి ప్రథమ సభ్యులచే కనీసమొక సంవత్సరము క్రమశిక్షణపొంది తమయొక్క జీవితకాలమునంతను ఈ సంఘాభివృద్ధి కొరకై ఈ సంఘ నియమ నిబంధనల ననుసరించి పనిచేయ వాగ్దానమును జేసి యిటుల నాచరించు వారు మాత్రమే ఈ సమితిలో తమయావజ్జీవితము సభ్యు లుగ నుందురు.

(2) ఈ సమితిలోని సభ్యులెవరైనను ఈ సంఘనియమ నిబంధనలకు వ్యతిరేకముగ ప్రవర్తించి నపుడుగాని లేక సంఘమునకు వీరివలన ఏవిధముగనైన నష్టముకలిగినదని ఋజువైననుగాని (ఈ విషయముయి కార్య కారిణి సమితిలోని మూడింట రెండువంతులు సభ్యులచే తీర్మానింప బడవలెను) మహాజనసభలో హాజరైన సభ్యులలో నాల్గింట మూడు వంతుల మంది వీరిపై విశ్వాస రాహిత్య తీర్మానమును జేసినపుడుగాని వీరంతట వీరే స్వయముగా రాజీనామానిచ్చినపుడుగాని వీరుగైరుహాజరగుట తటస్థించి నపుడుగాని ఈ విషయమును కార్యకారిణీ సమితి వారిచే ప్రకటింపబడిన వెంటనే ఈ సమితిలో వీరి సభ్యత్వము రద్దయిపోవును.

(3) అవసరమైనపుడు ఈ సమితిలో సభ్యులకు ఈ సంఘాభివృద్ధికై తమకాలమును, శక్తిని, వినియోగించుచున్నందులకుగాను కార్యకారిణీ సమితివారు వీరికి తగు ధనసహాయము చేయువలయును.

(4) ఎవరినైనను నూతనముగా సభ్యుల నీసమితిలో జేర్చుకొనుటకు ఈ సమితిలోని సభ్యులలో సగముకంటె హెచ్చుమంది యంగీకరించవలెను.

(5) ఎవరి సభ్యత్వధరఖాస్తునైనను ఏకారణముచెప్పకయే అంగీకరించకపోవుటకీ సమితికి సంపూర్ణాధికారము కలదు.

(6) ఈ సమితిలో సభ్యులై యున్నంతకాలము అట్టి సభ్యులు ఈ సంఘమునకు యితర సభ్యులవలె వార్షిక సభ్యత్వచందా దేనిని కట్ట నవసరములేకుండగనే ఈ సంఘములో కూడ తమ యావజ్జీవితము సభ్యత్వమును కలిగియుందురు.

(7) ఈ సమితిలో సభ్యులందరు తమ జీవితములను అన్ని విషయములలోను ఆదర్శప్రాయముగ రాజకీయ విరహిత పవిత్రతతో గడుపవలయును.

(8) త్రికరణశుద్ధికలవారై ఐహికాముష్మికానందము నొనగూర్పగల శుద్ధసాత్విక జీవితము, కట్టుబాట్లు, నీతి, నియమములు కలవారై యుండవలయును.

అ. ఈ సమితి యీ సంఘముయొక్క యావత్తు కార్యక్రమముతోను సంబంధము కలదై ఈసంఘ లక్ష్య సిద్ధికిని నిర్వహణకును అనవరతము పాటుపడుచు ఈ సంఘాభివృద్ధికిని కీర్తిప్రతిష్టలకును, కార్యనిర్వహణకున్ను బాధ్యత కలదై యుండును.

ఆ. ఈ సమితి మహాజనసభ జరుగుటకు ముందుగ జరుగు విషయ నిర్ణయ సభలో పాల్గొని మహాజనసభలో చర్చింపబడవలసిన తీర్మానములను తయారు చేయువలెను.

ఇ. కార్యకారిణీసమితివారిచే తమకు ఒప్పగించబడిన పనులను నిర్వర్తించుచు కార్యకారిణీసమితివారికి నెలవారి నివేదికలను జమఖర్చులను పంపుచుండవలెను.

ఈ. మహాజనసభకు ఒక నెలరోజులు ముందుగ మహాజనసభకు అధ్యక్షులుగ యుండతగిన వారిపేర్లను రెండింటిని గాని అంతకంటె హెచ్చుగాని నూతనాధ్యక్ష యెన్నిక నిమిత్తమై ఈ సమితి సూచించవలెను.

ఉ. కార్యకారిణి సమితికి నిర్ణీత సభ్యుల సంఖ్యలో సగముమంది సభ్యులను ఈసమితి తమలోనుండి ఎన్నుకొన వలయును (అంతమంది సభ్యులు సమితిలో లేనపుడు మిగతకావలసిన సభ్యులను ఈ సమితి వారే తమకిష్టమైన యితర యోగ్యులైన సభ్యుల కార్యకారిణి సమితికి ఎన్నుకొనవచ్చును.)

ఊ. ఈ సమితిలో వ్యవహారదక్షులును ఆదర్శప్రాయులు అయినట్టి ఒకరిని ప్రథమ సభ్యులుగను మరియిద్దరిని ద్వితీయ, తృతీయ సభ్యులుగను ఎన్నుకొనవలెను. ఈ ప్రథమ సభ్యులే కార్యకారిణి సమితికి కార్యదర్శిగ నిర్ణయింపబడవలెను. వీరి గైరు హాజరీలో క్రమముగా ద్వితీయ తృతీయ సభ్యులాస్థానమునాక్రమింతురు. వీరు ముగ్గురును హాజరుకానప్పుడు ఈ సమితిచే తమనుండి ఎన్నుకొనబడిన మరొకరు ఆస్థానమున నియమింప బడుదురు.

ఋ. వారంతట వారు రాజీనామా నిచ్చువరకుగాని, లేక వారిపై విశ్వాస రహిత్య తీర్మానముచేయబడువరకు గాని ఈ స్థానము ఇతర యే కారణముల చేతనైనను ఖాళీయగు వరకుగాని ఈ ప్రథమ సభ్యత్వ పదవియు దాని ననుసరించి కార్యకారిణీ సమితి కార్యదర్శి పదవియు కూడ స్థిరముగనే యుండును.

ౠ. ఈ సమితియందలి సభ్యులకు భూములు మొదలగువాటివలన వచ్చు స్థిరమగు ఆదాయముగాక మరియే యితరమగు ఆదాయములోనైనను కార్యకారిణీ సమితిచే నిర్ణయింపబడిన దానికంటె అదనపు ఆదాయము సంఘమునకే చెందజేయబడవలెను.

ఎ. ఈసంఘమునకు సంబంధించిన యావత్తు చరస్థిరాస్తులు ఈ సమితియొక్క ప్రథమ లేక ద్వితీయ సభ్యుల పేరున యుండి ఈ సమితియొక్క పరిపాలనలోను బాధ్యతలోను యుండవలెను.

12. కార్యకారిణీ సమితి:—ఇదియే మహాసంఘ కార్యకారిణీ సమితి యనియు కేంద్రసంఘము అనియు, కార్యకారిణీసమితి అనియుకూడ వ్యవహరింప బడును.

అ. 1 మహాజన సభా సమావేశమున నిర్ణీతమై తిరిగి మహాజనసభా సమావేశము జరుగువరకు ఈ సంఘము యొక్క యావత్తు కార్యక్రమమును బాధ్యతతో నిర్వహించుచు పనిచేయు నిమిత్తమై మహాజన సభాధ్యక్షునిచే ఈ సమితి యీ క్రిందివిధముగ నేర్పాటు చేయబడవలెను. అవసరమైనప్పుడెల్ల ఈ సమితి సమావేశమగుచు వలయు కార్యక్రమము నేర్పాటు చేసుకొనుచు పనిచేయుచుండవలెను.

2. ఈసమితి అధ్యక్షులు, గౌరవాధ్యక్షులు, ఉపాధ్యక్షులు, కార్యదర్శులు, కోశాధ్యక్షులు మొదలగువారితో కలసి 10 మంది మొదలు 30 మందివరకు అవకాశ అవసరములను బట్టి సభ్యులతో ఏర్పాటు చేయబడవలెను.

3. ఈ సమితికి మహాజన సభాధ్యక్షుడే అధ్యక్షుడుగా నుండును.

4. అ. యీ సమితిలో మొత్తము నిర్ణీత సంఖ్యలో సగముమంది సంచాలక సమితిచే వారినుండి ఎన్నుకొనబడిన సభ్యులున్ను నాలుగవ వంతు సభ్యులు పండిత పరిషత్సభ్యులున్ను ఎనిమిదవ వంతు సభ్యులు శాశ్వత సభ్యులున్ను మిగత ఎనిమిదవ వంతు సభ్యులు సమర్థులగు ఇతర సాధారణ సభ్యులున్ను అధ్యక్షులచే ఏర్పాటు చేయబడవలెను.

ఆ. వలయునంతమంది సభ్యులు సంచాలక సమితిలో లేనప్పుడు మాత్రమే సంచాలక సమితిచే సూచింపబడిన ఇతర సభ్యుల నెవరినైనను వారికి బదులుగ కార్యకారిణీ సమితి సభ్యులుగా అధ్యక్షులే ఏర్పాటు చేయవలెను.

5. సాధారణ సభ్యులను మాత్రము అధ్యక్షులు తమ ఇష్టము వచ్చిన వారినందరిని ఏర్పాటు చేసుకొనవచ్చును. మిగిలిన వారినందరిని ఆయాసమితి సభ్యులే మహాజన సభ జరుగుచున్న కాలములో తమనుండి ఎన్నుకొని అధ్యక్షులకు తెలుపవలయును. వీరిని అధ్యక్షు లంగీకరించ వలెను.

6. ఈ సమితికి సంచాలక సమితి ప్రథమ ద్వితీయ సభ్యులు ప్రధాన సహాయ కార్యదర్శులుగ నుందురు. గౌరవాధ్యక్షులను ఉపాధ్యక్షులను ఎవరినైనను సరియే అధక్షులు ఏర్పాటు చేయవచ్చును.

7. ఈ సంఘముయొక్క చరస్థిరాస్తులు యావత్తు ప్రధాన కార్యదర్శిపేర ఆయన స్వాధీనములోనే యుండవలయును.

8. అధ్యక్ష ఉపాధ్యక్ష స్థానములకు అన్ని విధములైన ఖాళీసమయములయందును సంచాలక సమితి ప్రథమ సభ్యులే అధ్యక్షాధికారములు నన్నిటిని కలిగియుందురు.

9. ఈ సమితి సమావేశములకు యీ సమితి సభ్యులు కాని వారినెవరినైనను అవసరసమయములందు కేవల సలహాకు మాత్రమే అధ్యక్షులు ఆహ్వానించ వచ్చును. అట్లు ఆహ్వానింపబడిన వారు తమసలహాల నిచ్చుటమాత్రమేగాని సమితి సమావేశములలో ఓటింగు హక్కును కలిగియుండరు.

13. మహాజనసభ:—కేంద్రసభ, వార్షిక సమావేశము:— అ. ఈ సంఘమహాజన సభాసమావేశము ప్రతిసంవత్సరము సామాన్యముగ ఫాల్గుణ మాసములో కార్యకారిణీసమితివారు నిర్ణయించిన స్థలమున జరుగుచుండును.

ఆ. ఈ సంఘము ముందు సంవత్సరమున జరుపబడవలసిన యావత్తు కార్యవిధానమున్ను ఈ మహాజనసభ యందే నిర్ణయించుచుండవలెను.

ఇ. ఈ సభయందు ఈ సంఘముయొక్క అన్నివిధములగు సభ్యులున్ను పాల్గొనవచ్చును.

ఈ. మహాజనసభయందు హెచ్చుమందిచే అంగీకరింపబడిన గాని ఏతీర్మానమున్ను ఈ సంఘము అమలుజరుప రాదు.

ఉ. మహాజనసభ జరుగుటకుముందుగ సంచాలకసమితి వారున్ను, పండితపరిషత్తు వారున్ను, కార్యకారిణీ సమితివారున్ను, గ్రామసంఘ ప్రతినిధులున్ను సమావేశమై "విషయ నిర్ణయ సమితి" యనుపేరును వహించి, మహాజనసభలో చర్చించుటకై ఈ సంఘసభ్యులచే పంపబడిన తీర్మానములను చర్చించి అందంగీకరింపబడిన తీర్మానములను మహాజనసభలో చర్చకు ప్రవేశపెట్టవలెను.

ఊ. కార్యకారిణీ సమితివారిచే సమర్పించబడిన వార్షిక నివేదికను, జమ ఖర్చులను చర్చించవలెను.

ఋ. అత్యవసర సమయములయందు సంచాలక పండిత పరిషత్తు సమితి సభ్యులలో సగముకంటె హెచ్చుమంది కోరినపుడుగాని లేక కార్యకాకారిణీ సమితి అవసరమని భావించినపుడుగాని అవసర మహాజనసభను సమావేశ పరచి అప్పటి సమస్యల చర్చించి తీర్మానించవచ్చును. ఇట్టితీర్మానములు సాధారణ మహాజనసభా సమావేశమునందు తీర్మానమైన తీర్మానముల వలెనే అమలు జరుపబడవలయును.

ౠ. మహాజనసభా సమావేశానంతరము తిరిగి మహాజన సభాసమావేశమగువరకు దీనియొక్క అధికారములు యావత్తు కార్యకారిణీ సమితికి సంక్రమించును. ఈ నియమము అవసర మహాజనసభా సమావేశమునకు కూడ చెందును.

ౡ. నియమావళి మార్పునందు మహాజనసభకు మాత్రమే అధికారముండును.

4. ఆహ్వాన సంఘము:— అ. (1) మహాజనసభా సమావేశముల జరుపుటకున్ను, మధ్యమధ్య సభలు సమావేశములు ఉత్సవములు వగయిరా కార్యక్రమములు జరుపుటకున్ను, తాత్కాలిక సాంచారిక పాఠశాలలు జరుపుటకున్ను, పండితులను పెద్దలను సన్మానించుటకున్ను వలయు యావత్తు ఏర్పాటులను చేయుటకై ఆ యా నిర్ణీత ప్రాంతములందు "ఆహ్వాన సంఘములు" అను పేరుతో సంఘములు ఏర్పడు చుండవలెను.

2. ఆయా నిర్ణీతమైన పనులు నెరవేరిన వెంటనే ఇవి తాము జరిపించిన యావత్తు కార్యక్రమమును, జమ ఖర్చులను వివరముగ తెలుపుచు మిగిలిన ధనమును కార్యకారిణీ సమితివారికి అందజేయవలెను. అంతటితో ఆ యాహ్వాన సంఘము రద్దగును.

ఆ. ఆహ్వాన సంఘములు ఏర్పడుట, పనిచేయుట వగయిరా అన్నియు మహాసభ కార్యకారిణీ సమితివారి యనుమతిని పొంది వారి యొక్క సలహాలు సూచనలు ప్రకారము మాత్రమే పనిచేయుచుండవలెను.

5. ఉపసమితులు:— అ. ఈసంఘము యొక్క ఉద్దేశాను సారముగ ఆయావిధులను బాధ్యతతో చక్కగా నిర్వహించుటకై కార్యకారిణీ సమితివారిచే అవసరమువెంబడిని ఉపసమితులు ఏర్పాటు చేయబడుచుండ వలెను.

ఆ. అన్ని ఉపసమితులయందలి సభ్యులును ఈ సంఘములో ఏదో ఒక తరగతి సభ్యతను కలవారై యుండ వలెను.

ఇ. ఈ ఉపసమితుల యొక్క కార్యక్రమము, నియమ - నిబంధనలను కార్యకారిణీ సమితివారే నిర్ణయింప వలెను. అన్ని రకముల ఉపసమితులున్ను కార్యకారిణీ సమితి వారి సలహాసూచనల ననుసరించి మాత్రమే పనిచేయ వలెను.

ఈ. ఈ ఉపసమితులు తమకు ఒప్పగించబడిన పనిపూర్తియైన వెంటనే గాని లేక మహాజనసభా సమావేశము జరుప బడినవెంటనే గాని లేక అవసరములను బట్టి కార్యరిణీ సమితివారి తీర్మానమువల్లగాని రద్దగును.

ఉ. వీరికి నియమింపబడిన విధులను సక్రమముగ జరుపుకొనుటకై వీరిలో వీరు అధ్యక్ష - కార్యదర్శులను ఏర్పాటు చేసుకొనవలయును.

16. పండిత పరిషత్తు:— అ. ఈసంఘముయొక్క కార్యక్రమములో ధార్మికమైనట్టియు, సాంఘికమైనట్టియు, విద్యాసంబధమైనట్టియు, సాంప్రదాయ సంబంధమైనట్టియు యావత్తు విషయములయందును తోడ్పడుటకై కార్యకారిణీ సమితివారిచే "పండిత పరిషత్తు" అనునది ఏర్పాటు చేయబడవలెను.

ఆ. విద్యావంతులై పూర్వాచార్య సంప్రదాయానుగుణ అనుష్ఠానపరులై యీ సంఘనియమ నిబంధనలకు లోబడినవారై ఈసంఘ కార్యకారిణీసమితివారిచే సంప్రార్థితులైనవారు ఇందు సభ్యులుగా నుండనర్హులు.

ఇ. ఈపరిషత్తునందలి సభ్యులు మూడు తరగతులుగ నుందురు.

మొదటి తరగతి :— గురుముఖతః ఉపదేశమున పొందిన శ్రీభాష్య భగవద్విషయములందును, సంస్కృత నాటకాలంకారాది సాహిత్యమున్ను, తర్కవ్యాకరణ శాస్త్రముల రెండింటియందుగాని, పూర్వమీమాంస యందు గాని, ఏయొక్కదానియందుగాని పూర్ణపర్జ్ఞ గలవారై యుండవలెను.

రెండవతరగతి :— శ్రీభాష్యమునుగాని, భగవద్విషయమునుగాని సంస్కృత నాటకాలంకారాది సాహిత్యపరులైగురుముఖతః ఉపదేశమును పొందినవారై తర్కమునగాని లేక వ్యాకరణమునగాని ప్రజ్ఞగలవారై యుండవలెను.

మూడవతరగతి :— నాటకాలంకారాది సంస్కృత సాహిత్యము కలవారై సాంప్రదాయ గ్రంథకాలక్షేపములయందు సామాన్యపరిజ్ఞానము గలవారుగాని, వేదపండితులుగాని ద్రావిడ ఆయిరాధ్యాపకులుగాని, ఆగమ పండితులుగాని ఈతరగతికి చెందుదురు.

ఈ. ఇందు మొదటితరగతి రెండవ తరగతి పండితులకు మాత్రమే పండిత పరిషత్తు సభలో చర్చించబడు ధర్మనిర్ణయాది విషయములలో పాల్గొనుటకున్ను, సమ్మతుల నిచ్చుటకున్ను హక్కుయుండును.

మూడవ తరగతి పండితులకు కేవలము ప్రచారము నిమిత్తమైన సభలలో నుపన్యాసము లిచ్చుటకు మాత్రమే అధికారముండును. విద్యాయోగ్యతాదుల ననుసరించి క్రమముగా తరగతులు మారుటకు అవకాశముండును.

ఉ. ఈపరిషత్తువారు తమకు సంబంధించిన నియమ నిబంధనలను సంఘకార్యకారిణీ సమితివారి అంగీకారమునకు లోబడి నిర్ణయించుకొను చుండవలెను.

ఊ. ఈపరిషత్తువారు తమ కార్యక్రమమును సక్రమముగ నిర్వహించుకొనుటకై తమలో మొదటితరగతి పండిత వర్గమునుండి తగినపండితుల నొకరిని అధ్యక్షులుగను, అటులనే అవసరము ననుసరించి ఉపాధ్యక్షులను, కార్యదర్శులను ఏర్పాటు చేసుకొనవలెను.

ఋ. పండిత పరిషత్తులో అప్పటి కంగీకరింపబడి ఏర్పడియున్న మొదటి తరగతి రెండవతరగతి పండితుల సంఖ్యలో సగముమందికంటె హెచ్చుమంది అంగీకరించిన గాని, సాంఘికమైనట్టిగాని, ధార్మికమైనట్టిగాని, ఆచారవిషయములయందు ఎట్టి నిర్ణయము సంఘముచే చేయబడరాదు. ఈపండితులు తమ అభిప్రాయములను వ్రాతమూలముగ తెలుపవచ్చును. వీరు తమ యభిప్రాయముల తెలుపుటకు యుక్తమగు రీతిని మూడు పర్యాయములు అవకాశ మివ్వవలయును. అప్పటికిన్ని కొందరు తమ యభిప్రాయములను తెలుపనిచో మిగత వారు తమలోని హెచ్చుమంది సమ్మతుల ననుసరించి నిర్ణయముల చెప్పవచ్చును.

ౠ. కార్యకారిణీ సమితిచేగాని మహాజన సభచేగాని, తమపై విశ్వాస రాహిత్యతీర్మానము చేయబడినపుడు గాని లేక తామే స్వయముగ రాజీనామా చేసినపుడుగాని లేక ఇతరవిధములైన గైరుహాజరుల వలనగాని వీరి సభ్యత్వము రద్దగును.

ఌ. ఈపరిషత్తువారి సంఘమువారిచే ఏర్పాటు చేయబడిన పాఠశాలాదికములలో విద్యావిధానమును నిర్ణయించుటయు అప్పుడప్పుడు విద్యార్థులయొక్కయు, నూతనముగ జేరు పండితులయొక్కయు యోగ్యతలను శక్తిసామర్థ్యములను పరీక్షించి నిర్ణయించుటయు, ఉపన్యాసాదుల నిచ్చుటయు, పత్రికలను పుస్తకములను ప్రచురించుటయు, దేవాలయ, రామానుజకూటాదుల నిమిత్తమై ప్రోత్సహించుటయు, వాటి సక్రమ పరిపాలనలో నుంచుట సంఘకార్యకారిణీసమితి వారిచే కోరబడిన శాస్త్రీయ విషయములలో తమసలహాల నిచ్చుట మున్నగు పనులు చేయవలెను.

ౡ. ప్రతి సంవత్సరమున్ను కార్యకారిణీ సమితికి తమ సమితి సభ్యులలో నుండి కార్యకారిణీ సమితియొక్క నిర్ణీత సంఖ్యలో నాలుగవ వంతు సభ్యులను ఎన్ను కొనవలెను.

17. సంబద్ధ సంస్థలు :— అ. ఈ సంఘము యొక్క ఆదర్శ-విశ్వాస-ప్రమాణాది-నియమ నిబంధనలకు వ్యతిరేకము గానట్టియు, అనుకూలమైనట్టి ఆదర్శ విశ్వాస-ప్రమాణాది నియమ, నిబంధనలను కలిగియున్నట్టియు వేదాంత - ఆధ్యాత్మిక విజ్ఞాన ప్రచారక సంస్థలను ఈసంఘమునకు సంబద్ధ సంస్థలుగ జేర్చుకొనవచ్చును.

ఆ. అట్టిసంబద్ధ సంస్థలు ఈసంఘమునకు విరుద్ధముగాకుండగ స్వతంత్రములుగా వ్యవహరించుకొనవచ్చును.

ఇ. ఈసంఘముచే నంగీకరింపబడిన ప్రతి సంబద్ధసంస్థయు ఈ సంఘమునకు సాలు 1 కి రు 3-0-0 చొ॥న చందాను చెల్లించవలెను. ఇట్లు చెల్లించనిచో తమ సభ్యత్వమును కోల్పోవును.

ఈ. ఏసంస్థనైనను, ఎప్పుడైనను సంబద్ధ సంస్థగా చేర్చుకొనుటకుగాని నిరాకరించుటకుగాని, అంగీకరించబడిన వాటితో సంబంధమును రద్దుపరచుటకుగాని ఈ సంఘకార్యకారిణీసమితి సంపూర్ణాధికారము కలిగి యుండును.

18. ఈనియమనిబంధనావళిలోని అవసరమగు మార్పులను ప్రతిసంవత్సరమునకొక పర్యాయము మాత్రమే వార్షికసభలో మాత్రమే మార్చబడవచ్చును; అవసరమహాజన సభలలోను కూడ అవసరమ ననుసరించి మార్చబడవచ్చును.

19. ఏవిధమైన అధికారపదవియందలి సభ్యులైనను వరియే ఆహ్వానింపబడిన మూడుసన్నివేశములకు వరుసగా హాజరుకానిచో ఈసంఘముయొక్క ఆ అధికారపదవియొక్క సభ్యత్వమును కోలుపోవుదురు. కాని గైరుహాజరునకు తగినంత కారణమున్నదని కార్యకారిణీ సమితివారు నిర్ణయించినచో సభ్యత్వము రద్దుపడదు. లేదా ఆపదవికి తిరిగివారే నియమింప బడవచ్చును.

20. ప్రత్యేకకార్య క్రమములకై దాతలచే నీయబడిన అన్ని విధములైన విరాళములు ఆ యాదాతలయుద్దేశాను సారముగ మాత్రమే వినియోగించబడవలయును. వాటి నిర్వహణకై ఆయాప్రాంతములందు ఉపసమితుల నేర్పాటు చేయవలయును. ఈ ఉపసమితులు సక్రమముగ పనిచేయుచున్నంతవరకు కేంద్రసంఘమువారు వాటి విషయమై కలుగజేసుకొన కూడదు. దాతల ఉద్దేశభంగము కలిగినపుడు మాత్రమే కేంద్రసంఘము వారు కలుగజేసుకొని వానిని సక్రమపరచవలెను.

21. శ్రీయతిరాజ సేవా మహిళామండలి:— అ. ఈ సంఘముయొక్క కార్యక్రమము స్త్రీలలో విరివిగా ప్రచారమై వ్యాప్తిచెంది వృద్ధియగుటకుగాను ప్రత్యేక స్త్రీశాఖగ ఈ సంఘముయొక్క యాజమాన్య పర్యవేక్షణల క్రింద పనిచేయునట్టియు ఈ సంఘమండలి స్త్రీ సభ్యురాండ్రతో మాత్రమే కూడుకున్నట్టియు "శ్రీయతిరాజ సేవా మహిళామండలి" అను పేరుతో అవకాశము, అవసరము గల స్థలముల యందెల్ల ఈ సంఘ స్త్రీ శాఖోపసమితులు ఏర్పాటు చేయబడవలెను.

ఆ. ఇందు ఈ సంఘముయొక్క స్త్రీ సభ్యురాండ్రు మాత్రమే సభ్యురాండ్రుగ నుందురు. పురుషసభ్యులిందుండ రాదు.

(1) ఈ మండలముయొక్క యావత్తు కార్యక్రమ నిర్వహణమునకై ఈ ఉపసమితికై ఏర్పరచుకున్న సరిహద్దులలో గల, ఈ సంఘము యొక్క అన్ని తరగతుల స్త్రీసభ్యురాండ్రచేతను తమలోనుండి అయిదుగురికి తక్కువ గాకుండగను, ఇరువదిమందికి ఎక్కువగాకుండగను (అవసరానుసారముగ) కార్యనిర్వాహకసభ్యురాండ్రను మరియు ఒక అధ్యక్షురాలును, నలుగురికి మించకుండగ ఉపాధ్యక్షురాండ్రను, ఇద్దరికి మించకుండగ కార్యదర్శిణులను (కార్యదర్శినులలో ఒకరిని కోశాధికారిణిగ కూడను) మూడుసంవత్సరములకొక పర్యాయము చొప్పున ఎన్నుకొనుచుండవలయును. వీరిలో అధ్యక్షురాలున్ను, ఉపాధ్యక్షురాండ్రలో యిద్దరున్ను, కార్యదర్శిణులలో ఒకరున్ను, మిగత సభ్యురాండ్రలో సగముమంది యున్ను శాశ్వత సభ్యురాండ్రనుండి ఎన్నుకొనబడవలయును. ఇంతమంది శాశ్వత సభ్యురాండ్రులేని చోట్లయందు వారంగీకరించ నపుడుగాని యితర సాధారణ సభ్యురాండ్రచే ఆస్థానముల పూర్తిచేసుకొనవచ్చును.

(2) కొన్ని ప్రత్యేక పరిస్థితుల ననుసరించి కొన్నిస్థలములలో అధ్యక్షురాలిని, ఉపాధ్యక్షులలో యిద్దరిని, కార్యదర్శిణులలో ఒకరిని, సభ్యురాండ్రలో నలుగురికి మించకుండగను, ఈ మూడుసంవత్సరముల గడువుగల ఎన్నికలతో సంబంధము లేకుండగ వారివారి జీవితాంతము వరకు ఆ యా పదవులు శాశ్వతముగ వారువారు కలిగియుండునటుల శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ కేంద్ర కార్యకారిణి సమితివారు నిర్ణయించవచ్చును.

(3) అధ్యక్ష-ఉపాధ్యక్ష-కార్యదర్శి-కార్యనిర్వాహక సభ్యురాండ్రతో కూడుకున్న దానిని "శ్రీయతిరాజ సేవా మహిళా మండలి కార్యనిర్వాహక వర్గము అని వ్యవహరించ వలయును.

(4) ఈ కార్యనిర్వాహక వర్గము నెలకొక పర్యాయమైన సమావేశమగుచు తమ కార్యక్రమమును నిర్ణయించు కొనుచుండవలయును.

(5) ఈ మండలికి సంబంధించిన యావత్తు కార్యక్రమ నిర్వాహణబాధ్యత, యాజమాన్యము శ్రీయతిరాజ సేవా మహిళామండలి కార్యనిర్వాహక వర్గమువారు కలిగియుందురు.
శ్రీయతిరాజ సేవామహిళామండలి కార్యనిర్వాహక వర్గముపై శ్రీవిశిష్టాద్వైత ప్రచారకసంఘ కేంద్ర కార్య కారిణి సమితి వారు అన్ని అధికారములను కలిగియుందురు.

(6) శ్రీయతిరాజ సేవా మహిళామండలి కార్యనిర్వాహక వర్గమువారు వరుసగ మూడు పర్యాయములు తమ ప్రత్యేక ప్రత్యేక సమావేశములలో ఒకేమాదిరిగ తీర్మానించిన విషయములను శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ కేంద్ర కార్యకారిణి సమితివారు నిరాకరించరాదు. ఇందు మూడవ పర్యాయములో కూడిన సమావేశములో మాత్రము శ్రీయతిరాజ సేవా మహిళామండలి కార్య నిర్వాహక వర్గము యొక్క నిర్దిష్టమైన సంఖ్యలో మూడింట రెండువంతుల మంది కి సభ్యురాండ్రచే ఆ తీర్మానము అంగీకరించబడవలెను. లేనిచో ఆ తీర్మానము ఉత్తీర్ణమైనటుల ఎంచబడదు. ఇట్టి మూడు సమావేశములకున్ను కనీసమొకనెల వ్యవధాన ముండవలెను.

(7) సంవత్సరమున కొకపర్యాయము శ్రీయతిరాజ సేవా మహిళామండలి యొక్క సర్వ సభ్య సమావేశమును జరుపవలెను. అందు ఆ సంవత్సరము జరిగిన కార్యక్రమము యొక్క సింహావలోకనము, ముందు సంవత్సరము జరుగవలసిన కార్యక్రమ నిర్ణయము, జమ ఖర్చులు, ముందు చేయవలసిన వాని అంచనాలు వగైరా యావత్తు విషయములు పరిశీలించబడి నిర్ణయించబడవలయును. ఈ సర్వసభ్య నిర్ణయానుసారముగ ఈ కార్యనిర్వాహక వర్గమువారు తరువాత కార్యక్రమమును నడిపించ వలయును.

8. ఈమండలి స్త్రీలలో ఆధ్యాత్మిక జ్ఞాన-భక్తి-వైరాగ్యముల యభివృద్ధికి మాత్రమే అనుకూలమగు అన్ని విధముల కార్యక్రమముల నవలంబించి పనిచేయవలయును. ఇందులకై ఆశ్రమములు, పాఠశాలలు, గ్రంథాలయములు, ఉపన్యాసభవనములు, భజనమందిరములు, కాలక్షేపకూటములు, పఠనాలయములు మున్నగువానిని ఏర్పరచవలయును,

ఈ. ఈమండలిచే స్త్రీలకై మాత్రమే ఏర్పరచబడిన ఆశ్రమాదులలో పురుషులకు ప్రవేశముండరాదు గాని ప్రత్యేక పరిస్థితులయందు మాత్రము జ్ఞాన భక్తి-వైరాగ్య సంపన్నులైనట్టి యోగ్యులగు పురుషులచే ఈ మండలివారు కాలక్షేపములనుగాని, పఠనాదులనుగాని, ఉపన్యాసములనుగాని, పాఠప్రవచనాములనుగాని, తాత్కాలికముగ మాత్రము తమకార్యక్రమములో చేర్చి ఏర్పాటుచేయవచ్చును అట్టి ప్రత్యేక పరిస్థితులలో వీనిని వినుటకై తాత్కాలికముగ పురుషులకు కూడ అవకాశమును కల్పించవచ్చును.

ఏ పరిస్థితులయందును కూడ, యిటుల తాత్కాలికముగ అవకాశము కల్పించబడిన ఈ పురుషుల సంబంధముచే ఈ మండలియొక్క కార్యక్రమమునకు ఎట్టి ఆటంకములుగాని, కష్టనష్టములుగాని, అవాంతరములుగాని, కలుగకుండునటుల జాగ్రత్తగ యుండవలయును ఇట్టి ప్రత్యేక పరిస్థితులలో ఇటికార్యక్రమ నిర్ణయమునకు ముందుగాను. కార్యక్రమ నిర్వహణములోను కూడ స్థానికమైన శ్రీ విశిష్టాద్వైత ప్రచారకసంఘ శాఖవారి సలహాలను, సహాయమును తప్పకుండగ తీసుకొనుచుండవలయును.

ఉ. ఆశ్రమములు:— (1) శ్రీయతిరాజ సేవా మహిళామండలియొక్క కార్యక్రమ ప్రచారమునకై అనువగునట్టియు, ప్రశాంత ఆదర్శ పవిత్ర జీవితమునకు అనుకూలమైనట్టియు, ప్రమాదరహితమైనట్టియు ఆశ్రమములు స్థాపించబడవలయును. ఆశ్రమ వాతావరణమంతయు అతిప్రశాంతముగను, జ్ఞాన-భక్తి-వైరాగ్య ప్రబోధకరముగను, నిరాడంబరముగను, నిర్మలముగను, దేవద్విజగురు సన్నిధానమందును, మంచినీటి వసతిగల ప్రాంతమందును యుండవలయును.

(2) మద్యమాంసాది నిషిద్ధ ద్రవ్యములుగాని, జ్ఞాన-భక్తి-వైరాగ్యములకు విరుద్ధములగు వాఙ్మయముగాని, వస్తువులుగాని ఆశ్రమములో ఉపయోగించబడకూడదు; ఆశ్రమ ఆవరణలోనికి తీసుకొని రాబడకూడదు.

(3) ఈ మండలి కార్యక్రమమున సంపూర్ణవిశ్వాసముండి, దీనిని ప్రచారము చేయుటకయ్యే తమ యావజ్జీవితమును వినియోగింప ప్రతిజ్ఞచేసి, ఈ మండలిలో మూడుసంవత్సరములకు తక్కువగాకుండగ సభ్యత్వము కలిగియుండి, తమ ఆదర్శ-సత్ప్రవర్తనలలో సంఘమునకు సంపూర్ణవిశ్వాసమును కలిగించగలిగి, ప్రచారమునకున్ను, ప్రశాంతజీవితమునకున్ను వలయు జ్ఞాన-భక్తి-వైరాగ్యములు గల స్త్రీలు మాత్రమే ఈఆశ్రమములలో స్థిరనివాసులుగ చేర్చుకొనబడుదురు.

(4) స్థిరనివాసులుగ అంగీకరించిన పిమ్మటకూడ వీరిప్రవర్తనవలన సంఘమునకు కష్ట-నష్టములు కలుగుచో అట్టివారిని శ్రీయతిరాజ సేవా మహిళామండలి కార్యనిర్వాహక వర్గమువారితో సంప్రతించి ఆశ్రమము నుండి తొలగించుటకు శ్రీ విశిష్టాద్వైత ప్రచారక కేంద్ర కార్యకారిణి సమితివారు అధికారమును కలిగియుందురు.

(5) ఆశ్రమములలో విలాసకరమైనట్టియు, భోగరూపమైనట్టియు జీవితమునకవకాశముండరాదు.

(6) ప్రతి ఆశ్రమములోను ప్రతిదినము ఉదయమునను, సాయంకాలమునను తప్పనిసరిగా ఆశ్రమవాసులందరు కలిసి సమిష్టిగా పాల్గొనుటకు వీలగునటుల భగవదారాధనము, భగవత్ప్రార్థన, స్వరూపగ్రంథపారాయణము, సాంప్రదాయ గ్రంథకాలక్షేపము, భజనయు, పఠనాదులు యుండవలయును.

(7) ఏదైన తగినంత కారణముండిననే తప్ప ఆశ్రమవాసులలో ఎవరుకూడ ఈ సమిష్టి కార్యక్రమములలో పాల్గొనకుండగ యుండరాదు.

(8) ఆశ్రమములలో జరుగు సమిష్టికార్యక్రమము లన్నింటిలోను ఆశ్రమవాసులు కానట్టియు, ఈ మండలియందు సానుభూతి, శ్రద్ధాసక్తులు కలిగినట్టియు, యితరస్త్రీలుకూడ పాల్గొనుటకు అవకాశ ముండవలయును.

(9) ప్రతి ఆశ్రమములోను స్వరూప సాంప్రదాయానుకూలమైనట్టి భగవంతుని జయంతులు, భగవత్-భాగవతాచార్య సుప్రసిద్ధ తిరునక్షత్రములు, శుక్రవారములు, ఏకాదశులు, యింకా యితర పవిత్ర పుణ్యపర్వదినములు జరుపబడుచు అందు సాంప్రదాయసిద్ధమైన ఉత్సవాది కార్యక్రమములు జరుపబడు చుండవలయును.

(10) వీలైనంతవరకు ప్రతి ఆశ్రమవాసియు తన జీవితమునకు వలయు తిండి బట్టలకు కావలసిన ధనమును తానే స్వయముగ కాయకష్టాములచే సంపాదించుటకు అనువగునట్టి స్వయాపానుకూల క టీరపరిశ్రమలు, ఆశ్రమము లోనే ఆశ్రమయాజమాన్యముననే స్థాపించబడవలయును. ఈ విషయములో స్థానికమైన శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘశాఖవారి సలహాలను, సహాయమును తప్పక తీసుకొనవలయును.

(11) ఆశ్రమవాసులు సంపాదనయంతయు ఆశ్రమాభివృద్ధికే వినియోగింప బడవలయును. వారి వారసుల వగైరాల కెట్టిహక్కులు, సంబంధము యుండరాదు.

(12) ఏ ఆశ్రమములోను ఎవరికి వ్యక్తిగతముగ ఏవిధమైన స్థిరమైన హక్కులు యుండరాదు.

(13) దీనికి సంబంధించిన చర-స్థిరాస్తులన్నియు శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ యాజమాన్య పర్యవేక్షణల క్రింద శ్రీయతిరాజ సేవా మహిళామండలి వారికి మాత్రమే సమిష్ఠిరూపముగా చెందినవై యుండును.

(14) ఆశ్రమములలోని వారందరు తమ తమ వర్ణాశ్రమానుకూల ఆచారవ్యవహారముల కనుగుణముగ నడుచు కొను చుండవలయును.

(15) ఆశ్రమము లన్నింటియందును జ్ఞానానుష్ఠానములకే ప్రాధాన్య ముండవలయును.

(16) ఆశ్రమవాసులలో పరస్పరము నీచోచ్చ వాదము లుండరాదు. "పరస్పరం భోక్తారః" అను సూత్రము ననుసరించి సమానగౌరవ ప్రతిపత్తుల కలిగి యుండవలయును.

(17) ప్రతి ఆశ్రమముయొక్క దైనందిన సామాన్య కార్యక్రమ నిర్వాహణమునకున్ను, ఆశ్రమవాసులలో ఒకరు పర్యవేక్షకురాలుగ శ్రీ యతిరాజ సేవా మహిళామండలి కార్యనిర్వాహక వర్గమువారి సంప్రతింపులపై శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ కేంద్రకార్యకారిణీ సమితివారిచే ఏర్పాటు చేయబడవలయును

(18) అవకాశమున్నంత వరకు ప్రతి ఆశ్రమమును చేర్చి పాఠశాలలు, గ్రంథాలయములు, ఉపన్యాసభవనములు, భజనమందిరములు, కాలక్షేపకూటములు యుండవలయును.

అ. ఆశ్రమములో స్థిరనివాసులుగ చేర్చుకొనబడు స్త్రీల కుండవలసిన యోగ్యతలు:— i. శ్రీయతిరాజ సేవా మహిళామండలిలో మూడుసంవత్సరములకు తక్కువగాకుండగ సభ్యురాలై యుండ వలయును.

ii. తప్తచక్రాంకనాది పంచసంస్కారపరులై యుండవలయును.

iii. తమప్రాకృత బంధువర్గముతో ఎట్టి లావాదేవీలుగాని, ప్రాకృతసంబంధముగాని యుండరాదు.

iv జాతి-ఆశ్రయ-నిమిత్తాదులచే దూషితములుగాని శాకాహారమును మాత్రమే నియమ నిష్ఠలతో భుజించు వారలై యుండవలయును.

v. జ్ఞాన-వైరాగ్య సూచకములగు నట్టియు, విలాస-భోగ రహితమైనట్టియు, నిరాడంబరము, నిర్మలము అయి నట్టి వస్త్రాలంకారణములను మాత్రమే ధరించవలయును.

ఆ. పాఠశాలలు:— బాలికలకున్ను, పెద్దవారలగు స్త్రీలకున్ను ఆధ్యాత్మికాభివృద్ధి కరములగు విద్యలున్ను (స్తోత్రపాఠములు, ప్రబంధములు, పురాణములు, సాంప్రదాయ గ్రంథములు ఇత్యాదులు) వీనికి వ్యతిరేకముగాని, అంగము గాని కలుగనట్టి యితరవిద్యలున్ను నేర్పుటకు పాఠశాల లుండవలయును. ఈ పాఠశాలలలో స్త్రీలే అధ్యాపకురాండ్రుగ నియోగించబడవలయును.

ఇ. గ్రంథాలయములు:— స్త్రీలయభివృద్ధికి అనువగునట్టి జ్ఞాన-భక్తి-వైరాగ్యబోధకములైనట్టి పత్రికలు, పుస్తకములు, పటములు మున్నగు వాఙ్మయముతో కూడుకొనియున్న గ్రంథాలయములు స్థాపించబడవలయును. ఈ గ్రంథాలయములలో ప్రాకృతిక మైనట్టియు, మనోవికారముల కలిగించునట్టియు, జ్ఞాన-

భక్తి-వైరాగ్యముల కనుకూలముకానట్టియు పత్రికలుగాని, పుస్తకములుగాని, పఠములుగాని ఎట్టి వాఙ్మయము యుండరాదు. గ్రంథాలయమునకు సంబంధించిన పరివారముగకూడ స్త్రీలే వినియోగింపబడవలయును.

ఈ ఉపన్యాసభవనములు:— జ్ఞాన-భక్తి-వైరాగ్య బోధకములగు ఉపన్యాసములనుగాని, కాలక్షేపాదులనుగాని, పఠనాదులనుగాని జరుపుటకు (చెప్పువారుస్త్రీలే, వినువారుస్త్రీలే అయియుండునట్టి) ఉపన్యాస భవనములను, కాలక్షేపకూటములను, పఠనాలయములను స్థాపించవలయును.

ఊ. శ్రీయతిరాజ సేవా మహిళామండలి యొక్క లౌకిక రాజకీయములకు సంబంధించిన పనులను నిర్వహించుటకుగాను స్థానికమైన శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘమువారి సలహా సహాయములపై ఆ సంఘములోని వారి నెవరినైనగాని లేక యోగ్యులగు యితరులనుగాని పురుషులను ఆ యా ప్రత్యేకపనులకై ఏర్పాటు చేసుకొనవచ్చును.



# CERTIFICATE OF REGISTRATION OF SOCIETIES

## ACT XXI OF 1860

S. No. 9 of 1951.

I hereby certify that "**Sri Visishtadvaitha Pracharaka Sangham**" has this day been registered under the Societies' Registration Act, XXI of 1860.

Given under my hand at Madras, this fourteenth day of March, One thousand nine hundred and fifty one.

*Additional Assistant Registrar of*
*Joint Stock Companies,*
*Chingleput District.*

# సవినయవినతి

"కలౌ సంఘే శక్తిః" కలియుగమున సంఘముననే శక్తియుండును. సుసంఘటిత సంఘము ద్వారా మాత్రమే మన మీ కాలమున ఆధ్యాత్మికాభివృద్ధిని, ఆత్మోన్నతిని, ఆనందమును పొంద కలుగుదుము. పరస్పరబోధకును, భక్తిభావ ప్రచారమునకును సంఘమే కదా సాధనము. సత్సంగమమునకును, సాదుసేవకును, సదనుష్ఠానమునకును శరణ్యము సంఘమే గాన దయయుంచి తాము ఈ సంఘమున సభ్యత వహించుట మాత్రమే గాకుండగ తమ యనుయాయుల నందరను ఇందు వెంటనే సభ్యులుగ జేర్పించి ఈ సంఘమును పటిష్ఠము, సుసంఘటితము, ఫలప్రదాయి అగునటుల జేయగోరుచున్నారము.

ప్రధాన కార్యాలయము:—
గీతామందిరము
107, వరదాముత్తియప్పన్ వీధి,
మదరాసు—1.

తమ,
శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము

శ్రీ శ్రీ శ్రీ



57607

శ్రీమతే రామానుజాయనమః

భక్తి

# నివేదన

## వేదాంత మాస పత్రిక


| సంపుటి 3 | ఖర—భాద్రపదమాసము | సంచిక ౬ |
|---|---|---|


# శ్రీవైష్ణవుఁ డెవడు?


శ్రీ ఉ. వే. శ్రీమాన్
తే. కం. గోపాలాచార్యులుగారు, కోరుకొండ.


ఏ తే సత్పురుషాః పరార్థఘటకా
స్స్వార్థాన్ పరిత్యజ్యయే ॥

తన సర్వస్వమును త్యజించి పరులకార్యముల ఘటింపజేయువారే సత్పురుషులు.) భర్తృహరి.

ఎవరు తనపట్ల మిక్కిలి నిష్ఠురముగను, నిర్దయగను ప్రవర్తించువారిపట్ల గూడ నుదారముగను దయాదాక్షిణ్యములతోను ప్రవర్తింతురో వారే శ్రీవైష్ణవులు. ఇందులకు మనకు భక్త ప్రహ్లాద యనుష్ఠాన మొక ప్రబల నిదర్శనము.

హిరణ్యకశిపుడు తన మారణోపాయములన్నియు రిత్తవోవుటగాంచి చింతాక్రాంతుండై యుండ పురోహిత పుత్రులదిగాంచి రాజా! నీవీ మాత్రమునకే యింతచింతింపవలెనా మేమున్న దెందులకు? చెప్పిచూతుము. ఈతడు మారని చో మామంత్ర శక్తిని విజృంభింపజేసి యభిచార హోమము గావించి కృత్యయను భూతము నొకదానిని బుట్టించి దానిచే నీతని రూపడంగింతుమని యొడార్చిరి.

పిమ్మట వారాతనిని తమయింటికి గొనిపోయిరి. అచ్చట గురుశిష్యుల కీవిధమగు సంవాదమొకటి జరిగెను.

గురు— నాయనా! నీయది బ్రహ్మవంశము. రాక్షసేంద్రుని పుత్రరత్నముగా జన్మించితివి నీతండ్రివలె నీవును సమస్తలోకాధార భూతుడ వగుదువు. నీకా దేవతలతో పనియేమి? నీకాయనంతుని చింతయేల? తండ్రికిమించిన దేవుడు గలడా! తండ్రికి మించిన గురుడున్నాడా?

ప్రహ్లా— మహాత్ములారా! మీరు సెలవిచ్చినట్లు యీకుల ముత్కృష్టమైనదియే. నాతండ్రి సకల జగదారాధ్యుడనుటలో సందేహమేమి?.

గురువులలో తండ్రి మొదటివాడనుటయు నిర్వి వాదాంశమే. సర్వవిధముల నాతనికపరాధమును గావింపరాదనియే సర్వదా తలంచుచుండును, కాని తాము నీకాయనంతుని చింతయేల యం టిరే యది మాత్రము నిరర్థకము. మీయందలి గౌరవముచే నేనింతకంటె జెప్పజాల. (తనలో) గురువులైనను భగవంతుని నిందించినవారి నపే క్షించుటకు నాచిత్త మొప్పకున్నది. వీరికా ప్రభావమెకింత సూచింతును గాక.

(ప్రకాశముగా) ఏమి! గురుపుంగవులారా? ఏమంటిరి? అనంతుని చింతయేల యనియా? బాగు బాగు. మంచి గురువులే దాపరించిరి. మీరు చింతాదంతుర మనస్కులు కారేని నేనా యనంతుని మహిమ నొకింత విన్నవింతు సావధాన చిత్తులగుడు.

ధర్మార్థ కామమోక్షముల కంటె సంసార మండలమున పురుషార్థాంతరము మృగ్యమే గదా! అట్టి పురుషార్థముల నాల్గింటిని యాతడు ప్రసాదించునే, యక మనకేమి కావలెను? గురు పుంగవులారా! వేయేల! నానిశ్చయమును వినుడు ఆయనంతుడే జగత్పతి, యాతడే కర్త, ఆతడే భికర్త, ఆతడే సంహర్త, ఆతడే భోక్త, ఆతనిని మించిన ప్రభువువేరొకడులేడు. ఇది ముమ్మాటికి నిశ్చయము. మీరు కూడ నాతని భజించి తరించుడు. ఇట్లాడినందుకు నన్ను క్షమింతురు గాక!

గురు— (కోపముతో) ఓరీ! నిర్భాగ్యుడా! నీవు మామాటవిందువని నిప్పులో కాలకుండ కాపా డితిమి. ఇట్లింకెన్నడును వదరవని నమ్మితిమి. చూడుము. నీవు మామాటను లక్ష్యపెట్టవేని యిదుగో యిప్పుడే కృత్యను విడిచి నిన్ను నిర్మూ లింతుము. మాశక్తిని చవిచూతువుగాక.

ప్రహ్లా— ఆచార్యోత్తములారా! ఇది యెంత వెర్రి. ఎవ్వనిచే నెవ్వడు రక్షింపబడువాడు? ఎవ్వనిచే నెవ్వడు భక్షింపబడువాడు? రక్షణ భక్షణములు రెండును తానాచరించు పుణ్యా పాపముల మీద నాధారపడి యుండుట నెరుం గరా? అందువల్లనే గదా ప్రతివాడును సర్వ ప్రయత్నములచేతను సత్కర్మలనే యాచరించ రించవలెను.

(ఆచార్యపుత్రులు పట్టరాని కోపముతో కృత్యను పుట్టించి విడుతురు. అది భయంకారా కారమును దాల్చి కోపముతో మండిపడుచు భూమిని త్రొక్కుచు శూలము నాతని రొమ్మున గ్రుచ్చును. అయ్యది యాతనిని స్పృశింపగనే తుత్తునియలై నేలంగూలును. ఆహా! భగవంతు నకు ప్రియమందిరమగు నాతని హృదయము సోకిన వజ్రాయుధమే రూపడంగ నిక నీక్షుద్ర శూలమా హింసించునది?

పాపులచే పాపులహింసింప నేర్పడిన యా కృత్య, యిప్పుడు విపరీతముగ నుపయోగింప బడుటచే ప్రహ్లాదునిపట్ల కుంఠితశక్తియై యెదురు తిరిగి నా గురుపుత్రులనే వేదింప నారంభించెను ఓహో ఇత్తరి నాయుత్తమ భక్తుని పరార్థైక ప్రవృత్తి సువర్ణాక్షర విలేఖ్యముగదా! నిరంత రానుభావ్యముగదా! సకలపాప విమోచకము గదా!

అట్లాకృత్యచే దహ్యమాన సర్వాంగులగు నాగురుపుత్రుల గాంచి మన చిరుతభక్త శిఖా మణి కన్నీరు మున్నీరుగా గార్చుచు.

ప్రహ్లా- కృష్ణా! త్రాహి త్రాహి! ఓ సర్వ వ్యాపకా! ఓజగద్రూపా! ఓజగన్నాథా! యీ నాయాచార్యపుత్రులనీ మంత్రాగ్నినుండి కాపాడవా! ఇదుగో! నేప్రమాణము జేయుచున్నాను.

సకల భూతములయందును సర్వవ్యాపియగు సర్వేశ్వరుఁడు శ్రీమహావిష్ణువే యనుటకు సంశయములేదేని యీ విప్రోత్తములు జీవింతురుగాక!

సర్వవ్యాపకుఁడగు సర్వేశ్వరుని శత్రుపక్షమందును సంభావింతునేని నాపురోహితపుత్రులు జీవింతురుగాక!

నన్ను చంపుటకు ద్యమించి,విషము నిచ్చియు నిప్పునద్రోచియు, దిగ్గజములచే ద్రొక్కించియు, సర్పములచే గఱపించియు బాధించిన వారిపట్ల నేను నిక్కముగ మిత్రులపట్ల ప్రవర్తించితినేని యీనాసత్యముచేతనే నాయీ యాజకులు చిరంజీవులగుదురుగాక! (ఇంతలో నా మంత్రాగ్ని యదృశ్యమయ్యెను.)

గురు- ప్రహ్లాదు నాలింగనము జేసుకొని యశ్రుధారలచే నాతని నభిషిక్తుని జేయుచు,

మాతండ్రీ! దీర్ఘాయుష్మాన్ భవ! అప్రతిహత బలవీర్య సమన్వితోభవ! పుత్రపౌత్ర ధనైశ్వర్య యుక్తోభవ! నీతత్వమెరుఁగక యపచారపడితిమి. తండ్రీ! "వైష్ణవుఁడు అపకారుల కుపకారమొనరింతురను ధర్మమును వినియు విశ్వసింపక నేడు దానిని సాక్షాత్కరించితిమి గదా! మేము ధన్యులము. మేమిదేపోయి నీమహాత్మ్యమునంతను నీ తండ్రికి విన్నవింతుము. (అని నిష్క్రమింతురు)

ఇది యొక ప్రాచీనోదాహరణము.

మరియొక విచిత్రమగు నర్వాచీనోదాహరణము నిచ్చి యీ విషయమును మరింత బలపరప యత్నింతును.

పూర్వకాలమున రామదాసుడను నొక భక్తశిరోమణి యుండెను. ఆతడెన్నడును చేయిజాచి యెఱుంగని యప్రతిగ్రహ దీక్షితుడు. ఒకనాడొక మహారాజాతనిని బహుభంగుల బలవంతపరచి బహుమూల్యరత్నాదికము నర్పించెను. భగవంతుని లీలకు విషయము కానిదేది? ఆతడాధనరాశిని గైకొని తన యాశ్రమమునకు మరలుచుండ మధ్యేమార్గమున నిద్దరు దొంగలాతనిని బంధించి రత్నరాశిని కొల్లగొట్టి యంతటితో పోక నాతని చేతులు నరికి తుదకాతని నొక పాడునూత పారవైచి లేచిపోయిరి.

దైవవశమున నారాజచంద్రుడే వేటకై యడవిని దిరుగాడుచు తృష్ణాతురుడై యానూతి చెంత కేతెంచి యందున్న నాదీన చేతనుని రామదాసుగా గుర్తించి యొక త్రాటి సహాయమున నాతనిని బయటకు దీయించెను. ఎంత బలవంత పరచినను తన కపకారము గావించిన యా చోరుల జాడ నొకింతయు నాభక్తుడు జారవిడువలేదు. చేయునది లేక నారాజపుంగవుడు శ్రద్ధాభక్తులతో నాభక్తునిపరిచర్యమాత్రము గావించుచుండెను.

దైవికముగ నొకనాడాచోరులా రాజభవన పార్శ్వమునుండి యేగుచుండుట నా రామదాసు గాంచి రాజుచే వారల తనచెంతకు రావించెను. ఆదొంగలా రామదాసును గుర్తించి నిలువున నీరై గజగజ వణకజొచ్చిరి. ఆభక్తుడది చూచి వారల ననేక రీతుల నాశ్వాసించి రాజుతో వీరు తన మిత్రులు గాన వీరల కిచ్చవచ్చినంత ధనరాశి నొసంగుమని యాదేశించెను. నడుపుట తడవుగ ధనరాసులా దొంగలమోపుల గుమ్మరింపబడెను.

ఆదొంగలాశ్చర్య చకితమనస్కులై యీవిపరీత ఫలాగమ నిదానమారయ జాలక సంశయాక్రాంత మనస్కులయ్యు యేమియు నెరుంగనట్లు నటించుచు నోపినంత ధన నిచయము నెత్తుకొని సంతుష్టాంతరంగులై రాజభటుని సహాయముతో తమ గ్రామమునకేగ దొడంగిరి. మార్గమధ్యమున నారాజభటుడు వీరలను తమకు రామదాసుతో పరిచయమెట్లు కల్గెను. అయున మీకింత ధనము నిప్పింపనేల యని ప్రశ్నింప వారలు నిర్భయముగా "ఓ! రాజోద్యోగీ! మేమొకసారి యీ సన్యాసిని మృత్యువాతనుండి రక్షించితిమి. ఆతడా ఋణమునుండి యిప్పటికిట్లు విముక్తడాయెను. యని యంతిమాక్షర సమాప్తి సమకాలముననే యెదుట భూమి బద్దలై వీరి నిరువురను తన పొట్ట బెట్టుకొనియె. ఆరాజభటుడిది గాంచి భయసంభ్రమములతో బెదరుచు రాజు చెంతకేతెంచి రామదాసు వినుచుండ నీవార్తనంతను సవిస్తరముగ విన్నవించెను. ఈమాటలు చెవిని బడినతోడనే యాభక్తశిఖామణి నేత్రముల నుండి యశ్రుధారలు జలజలరాల దొడంగెను. వాటిని తుడుచుటతప్పుగ నారామదాసునకు రెండు చేతులును వచ్చివేసెను. ఇదియంతయు జూచుచున్న నారాజున కాశ్చర్యముదయించెను. దీనికేమి హేతువని నిర్బంధించుటచే నారామదాసు జరిగినదంతయు పూసగ్రుచ్చినట్లు చెప్పివేసెను. ఇది యంతయు వినిన పిమ్మట నా రాజునకాశ్చర్యము మరింత వృద్ధిజెంది యాతని నిట్లు ప్రశ్నించెను.

రాజు- వారు తమ చేతుల నరకినచో తమకు మిత్రులెట్లయిరి?

దాసు- తన చాతుర్యముచే సహితమునుండి తనను మరలించినవాడే తనకు మిత్రుడు నేను చేయిజాచి యెవరినుండియు నేమియు పరిగ్రహించనని ప్రతిన గావించియుంటిని. దైవఘటనచే నేనాప్రతిజ్ఞ నుల్లంఘించితిని అందులకు ఫలముగా వీరు నాచేతులను నరికి నాపాపమును పోగొట్టి క్రియాత్మక ఉపదేశ మూలమున హిత సాధకులైరి గావున వీరు నాకు మిత్రులైరి.

రాజు- వీరికి తమరేల ధనముల నిప్పించితిరి.

దాసు- మిత్రుల కపేక్షిత ధనముల నిప్పించుట సహజముగానే ఘటించవచ్చును గదా! అదియును గాక నేను పాపరాధుడను గనుక నన్ను వీరు శిక్షించుట సరియైనది గాని మరి యొకనాడు వీరిట్లు ధనాశచే నిరపరాధుని కూడ హింసింతురేని నరకములపాలగుదురు. అందుచే వీరి ధనతృష్ణను శమింపజేయు తలంపుచే నీచే ధనము లిప్పించితిని?

రాజు-అయినచో వీరిచావునకుమీరునగవనేల?

దాసు-నావలనగదా పాపము! వీరికీ దుర్మరణ మాసన్నమైనది. లోకులు నన్నుత్తముడందురు. ఉత్తముని స్నేహఫలము త్తమమే గావలెను. కాని యిచ్చట విపరీతమాయెను. కావుననేను ఓ దైవమా! నాస్నేహమున కిట్టి విపరీత ఫలము ఘటించుటకు నేనేమిపాప మాచరించితినయ్యా! యని యేడ్చితిని.

రాజు:-అయినచో మీకు చేతులెట్లువచ్చినని?

దాసు- ఇది సర్వేశ్వరుని నిర్హేతుక కృపాఫలము. ఆమహనీయుడు తన భృత్యుని యపచారముల గణింపక తన దయాపూర్ణస్వభావమునే యావిష్కరించుచుండును.

ఇదియంతయు విని యారాజచంద్రుడుహర్ష పులకిత గాత్రుడై యానందవశమున గద్గద కంఠుడాయెను.

— హా! భక్త రామదాస్ —

ఇదిగదా నిజమగు వైష్ణవలక్షణము.

# సదాదిశబ్దములకు శ్రీమన్నారాయణునియందే పర్యవసానము

కోయిల్ కన్దాడ వెంకటనర్సింహాచార్యులుగారు, రామన్నపేట, వరంగల్.



భగవంతునిచే సృష్టించబడిన ఈప్రపంచము నందు చైతన్యము కలిగి ఇహపర సాధకంబయి శాస్త్రవశ్యతగలదీ మానవజన్మమే. కావుననే జ్ఞానవిహీనమగు అచేతనమువలెను దుఃఖమనుభవించు నరకస్థుల వలెను సుఖానుభవమందు తేజశ్శరీరులగు దేవతలవలెకాక కిందటి జన్మ పరంపరలనుండి వచ్చుచున్న పాపనివృత్తికి పునరావృత్తి రహితమై శాశ్వతమైన మహదానంద మందుటకు కారణమైనది. యీభూలోకమందైన మానవజన్మమే.

ఈమానవుడు ముఖ్యముగా తెలుసుకొనదగిన విషయము కారణవస్తువై పరబ్రహ్మ యనబడు శ్రీమన్నారాయణుడు ఆనారాయణ బోధకమగు జ్ఞానము అపౌరుషేయమై నిత్యమై నిర్దుష్టమై భ్రమ విప్రలంభ ప్రమాదాది దోష రహితమై స్వయంప్రమాణమై శ్రీమన్నారాయణునిచే చతుర్ముఖ బ్రహ్మ కుపదేశించబడిన వేదమువలన కల్గును. అందు సదేవసౌమ్యేదమగ్ర ఆసీత్, బ్రహ్మవాఇదమగ్రఆసీత్, ఆత్మావా ఇదమగ్రఆసీత్, పురుషఏవేదగ్ంసర్వం, యదాతమస్తన్నదివానరాత్రిర్నసన్నచాసచ్ఛివఏవ కేవలః, హిరణ్యగర్భస్సమవర్తతాగ్రే, నకిరిం దృష్ట్వా దుత్తరః, ఆకాశోహవై నామరూపయోర్నిర్వహితా, ఏకోహవై నారాయణ ఆసీత్, ఇత్యాదివేదాన్తవాక్యములందుసామాన్య వాచకములచే కొన్ని కొన్ని విశేషవాచకములచే కారణవస్తు బహుత్వము చెప్పబడుటచే ముముక్షుజనము సంశయవిచ్ఛిత్తికాక బాగుపడకుండుటచూచి సంసారభయపీడితులగు వారల యదృష్టవిశేషమువలన యవతరించిన భగవద్రామానుజాచార్యులవారు నారాయణాంశచే యవతరించిన శ్రీవేదవ్యాసుల వారిచే వేదార్థముల నన్ని క్రోడీకరించి రచింపబడిన బ్రహ్మసూత్రములకు పైన జెప్పబడు వేదాంత వాక్యార్థముల కన్నింటికి సమన్వయముజేసి యదార్థార్థమును తేల్చి భాష్యమునురచించిరి. మరియు అభేదవాదు లిదివరలో బ్రహ్మసూత్రముల కర్థమునిర్ణయించిన పిమ్మట తిర్గి వీరి నిర్ణయ మెందులకన!

అభేదవాదులు భేదశ్రుతులకు వ్యావహారిక సత్యత్వమాత్రము జెప్పి అభేదశ్రుతులకే పారమార్థిక సత్యత్వము నంగీకరించినారు.

అత్యంత భేదవాదులు అభేదశృతుల కపరమార్థత్వమును జెప్పి భేదశృతులకు పరమార్థత్వము నంగీకరించినారు. ఇక శ్రీభగవద్రామానుజాచార్యులవారైతెనో భగవదాజ్ఞారూపంబగు వేదమునందలి ప్రామాణ్యాప్రామాణ్యబుద్ధిచే అంగీకార అనంగీకారములుచేయ రాదని తలంపుతో భేదాభేదశృతుల నన్నిటిని ఘటకశృత్యనుసారము చక్కగా విమర్శించి సమన్వయ మొనరించినారు. కాన రామానుజాచార్యులవారి సిద్ధాన్తమే సర్వజనాదరణీయమని సిద్ధాన్తము.

సచ్ఛబ్దము (సదేవసౌమ్యేద మగ్రఆసీత్) అనుస్థలమందు కారణరూప ద్రవ్యము మరొక అవస్థ నొందుట కార్యమని యేద్రవ్యము

స్వభావము గలది కార్యావస్థయో. అస్వభావము గల ఆద్రవ్యమే కారణావస్థము, కాన పరిదృశ్యమానమైన ఈప్రపంచమునకింత గుణసామ్యావస్థమగు దీని సూక్ష్మావస్థనే సచ్ఛబ్దము చెప్పు చున్నదని శంకకలుగగా సచ్ఛబ్దము ప్రకృతికి సంబంధించని ఈక్షణరూప సంకల్ప విశేషము కల్గి యుండుటచే ప్రకృతి పరముకాదనియు సర్వకారణత్వమును ప్రతిపాదించుటచే చేతన పరముగాక పరమచేతనంబగు నారాయణునే భోదించుచున్నది.

బ్రహ్మశబ్దము నారాయణునికన్న నితరము లగు చేతనాచేతన పరముగా శంకించి స్వరూపముచేతను అనవధికాతిశయ బృహత్త్వము బ్రహ్మశబ్దమునకు ప్రవృత్తినిమిత్తమని ఆబృహత్త్వము నారాయణునియందు తప్ప నితరత్ర లేకుండుటచే బ్రహ్మశబ్దము శ్రీమన్నారాయణ పరముగా సిద్ధాన్తమొనరించినారు. ఆత్మశబ్దము, అత్తీత్యాత్మాయను వ్యుత్పత్తిచే కర్మఫలమనుభవించు వాడనియర్థము. అకర్మఫల భోక్తృత్వము జీవునికే సంభవించుటచే ఆత్మశబ్దముచే చెప్పబడువాడు జీవుడని శంకించి అదభక్షణే, యను ధాత్వనుసారముగ అదనము సామాన్య భక్షణముకాక "యస్యబ్రహ్మచక్షత్రంచ ఉభేభవత ఓదనః మృత్యుర్యస్యోపసేచనం" అని మృత్యూపసేచనసహిత సకలబ్రహ్మండోప సంహృతిరూపమైనదగుటచే ఆఅదనము శ్రీమన్నారాయణునకు తప్ప తదితర చేతనునికి సంభవించనందున ఆత్మ శబ్దము శ్రీమన్నారాయణ పరమే.

పురుషశబ్దము పురిసీదతి ఇతిఅను వ్యుత్పత్తిచే పురుషశబ్దవాచ్య ప్రకృతి పరిణామ రూపంబగు శరీరమందుండు వాడనియర్థ మగుటచే దేవాది శరీరవిశిష్టుడగు జీవుని పరముగా శంకించి పురుష ఏవేదగ్ం సర్వం యద్భూతం యచ్చభవ్యం ఉతామృ తత్వస్యేశానః॥ అని భూతభవ్యరూప వత్వ అమృతత్వప్రదత్వ ఈశానత్వాది ధర్మవిశిష్టునిగా చెప్పుటచే ఆధర్మంబులు ఈశ్వర వ్యతిరిక్తంబగు జీవునియందు అసంభవంబగుటచే పురుషశబ్దము శ్రీమన్నారాయణపరమే.

పరంతు శబ్దములకు అర్థ మును బోధించుట పర్యవసాన వృత్తియని అపర్యవసాన వృత్తియని రెండు విధంబులు అందు విశేషణాంశమును బోధించునది పర్యవసానవృత్తియని విశేష్యాంశమును బోధించున దపర్యవసాన వృత్తియని వ్యవహరింతురు. కావున "సఆత్మాఅంగాన్యన్యాదేవతాః" అను శ్రుతిచే సకల దేవతలు శ్రీమన్నారాయణునికి విశేషణ భూతంబగు శరీరం బనియు వాడు విశేష్యమగుయాత్మయనియు అపర్యవసాన వృత్తిచే విశేష్యమగు నారాయణుని యందే పర్యవసించును.

ఇంకను వేదవాక్యంబులు విధిరూపంబులని అనువాద రూపంబులని రెండువిధంబులు అందు అనువాద వాక్యంబులుకన్న విధి వాక్యంబులకు ప్రాధాన్యము కాన (అనితర సాధారణంబగు) ఇతరులకు సాధారణముకాని నారాయణ శబ్దంబుచే కారణత్వము విధింపబడుటచే అనువాదవాక్య ఘటితంబులగు ఇంద్ర హిరణ్యగర్భ శంభ్వాదిశబ్దంబులచే విధింపబడిన కారణత్వము నారాయణునియందే పర్యవసించునుకాన సద్బ్రహ్మాత్మాది సామాన్యవాచకంబులగు శబ్దంబులు అభిన్ననిమిత్తోపాదానకారణత్వ సత్యసంకల్పత్వ

సకల జగద్రక్షకత్వ సకల జగత్సంహారకత్వ మోక్షప్రదత్వాది ధర్మసాహచర్యముచే శ్రీమన్నారాయణ ప్రతిపాదకంబులె ఇంద్రాది విశేష వాచకంబులగు తత్తదసాధారణ శబ్దంబులు సరంబ్రహ్మాఽసాధారణ ధర్మసాహచర్యంబుచే అవయవార్థ విశేషంబుచే అపర్యవసానవృత్తి పూర్వకంబుగా నారాయణ పర్యవసానంబులగుటచే: "సర్వే వేదాయత్పదమామనంతి"యనియు వేదాక్షరాణి యావంతిపఠితాని ద్విజోత్తమైః తావంతి హరినామాని కీర్తితాని నసంశయః అని శ్రుతిస్మృతులచే జెప్పబడుచున్నది.

'యస్యాత్మాశరీరంయస్య పృథ్వీశరీరం' ఇత్యాది శ్రుతులచే సకలచేతనాచేతన శరీరకుడు నారాయణుడగుటచే శరీరవాచకానాంశబ్దానాం శరీరిణి పర్యవసానంబను న్యాయం బనుసరించి సర్వశబ్ద వాచ్యత్వము శ్రీమన్నారాయణునియందు సంభవించుచుండగా సదాదిశబ్దంబులు శ్రీమన్నారాయణ పర్యవసానంబులనుట కెంతయు సందియం బుండదు. ఇదియే పరాశరపారాశర్యాది నాథ యామున యతివరాది పూర్వాచార్యాభి మతమగు సమన్వయము.

## యతిరాజవిజయ నాటకమునందలి కొన్ని చక్కని శ్లోకములు

శ్రీ ఉ. వే. శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులుగారు

సదూహుఁడు-

శ్లో. విభు శ్చే న్నైవ స్యా దణుపరిమితో ఽణు ర్యది భవాన్ ।
కథం సర్వత్ర స్యా ద్ద్వివిధ ఇతి చే న్నోచిత మిదం ।
స్వయం న స్యా ద్రూపద్వయ మపి న చేన్నిత్త్వాం మధురిపో!
కథం భూతాకారం కథయ నిరణైషీ దుపనిషత్ ॥

—: తాత్పర్యము :—

ఓమధురిపూ! నీవు విభుపరిమాణము కలవాడవందుమా సకల చేతనాచేతనాంతః ప్రవేశార్హమగు నణుపరిమాణుడవగుట యొప్పదు. అందుల కణుపరిమాణుడవందుమా, నీ వంతట నిండి యెట్లుందువు? పోనీ ఉభయకార్యనిర్వాహమున కుభయవిధపరిమాణుడవందుమా, ఒకదానికి రెండు విరుద్ధరూపము లుండవు గాన నిది యసంగతము. ఇక నుపనిషత్తు నిన్నెట్టి యాకారుడవని నిర్ణయించెనో నీవే చెప్పుము.

## భగవద్విషయ పరంపర

శ్రీరామానుజయోగి సుందరవర
శ్రీశైలనాథాన్ గురూన్ ।
లోకార్యోత్తరవీధి-కృష్ణ కలిజిత్
వేదాంతి భట్టారకాన్ ।
శ్రీగోవింద యతీంద్ర పూర్ణ యమునా
వాస్తవ్య రామాన్వజే ।
పద్మాక్షాహ్వయ నాథయోగి శఠజిత్
సేనేశ పద్మా హరీన్ ॥ [జీయర్

1. శ్రీరామానుజయోగి = ఒన్నాన వానమామల రామానుజ
2. సుందరవర = మణవాళ మామునులు
3. శ్రీశైలనాథ = తిరువాయ్‌మొళి పిళ్లై
4. లోకార్య = పిళ్లైలోకాచారియర్
4. ఉత్తరవీధికృష్ణ = వడక్కుత్తిరువీధిప్పిళ్లై
6 కలిజిత్ = నంబిళ్లై
7. వేదాంతి = నంజీయర్
8. భట్టారక = భట్టరు
9. శ్రీ గోవింద = ఎంబారు
10. యతీంద్ర = శ్రీరామానుజులు
11. పూర్ణ = పెరియనంబి
12. యమునావాస్తవ్య = శ్రీ ఆళవందార్లు
13. రామ = మణక్కాలనంబి
14. పద్మాక్షాహ్వయ = ఉయ్యక్కొండారు
15. నాథయోగి = శ్రీమన్నాథమునులు
16. శఠజిత్ = నమ్మాళ్వార్లు
17. సేనేశ = విష్వక్సేనులు
18. పద్మా = శ్రీదేవి
19. హరి = శ్రియఃపతి

ఈ పందొమ్మండుగురు ఆచార్యులను గురుపరంపరా మాలికలోను శ్రీరామానుజులుమధ్యనాయకమణియైయున్నారు.

### తిరువాయిమొళి వ్యాఖ్యానములు

తిరుక్కురుగై ప్పిరాన్ పిళ్ళాను = ఆరాయిరప్పడి 6000
(విష్ణుపురాణ ప్రక్రియ)

నంజీయరు = ఒంబదినారాయిర ప్పడి 9000
(శ్రీభాష్యప్రక్రియ)

పెరియవాచ్చాన్ పిళ్లై = ఇరుపత్తినాలాయిరప్పడి 24000
(శ్రీరామాయణ ప్రక్రియ)

వడక్కుత్తిరువీధిప్పిళ్లై = ఈడుముప్పత్తారాయిరప్పడి 36000
(శ్రుతప్రకాశిక ప్రక్రియ)

వాదికేసరి అళగియ మణవాళ జీయర్ = పన్నీరాయిరప్పడి 12000 (శ్రీభాగవత ప్రక్రియ)

* "పడి" అనగా 32 అక్షరములుగల భాగమని పేరు. దీనిని ఒక "గ్రంథము" అని కూడ వాడుటకలదు.

## శ్రీభాష్య పరంపర

శ్లో. వరదగురు వేంకటేశౌ
రామానుజ వరద విష్ణుచిత్తార్యాన్
కురుకేశ్వర భాష్య కృతౌ
నమామి నాథేన యామునం వ్యాసం ॥

1. వరదగురు = నయనారాయణాచార్యులు
2. వేంకటేశ = వేదాంతదేశికులు
3. రామానుజ = అప్పుళ్లార్లు
4. వరద = నడాదూర్ అమ్మాళ్
5. విష్ణుచిత్తార్య = ఎంగళాళ్వాన్లు
6. కురుకేశ్వర = తిరుక్కురుగప్పిరాన్ పిళ్ళాన్
7. భాష్యకృత్ = శ్రీరామానుజులు
8. యామున = శ్రీయాళవందార్లు
9. నాథ = శ్రీమన్నాథమునులు
10 వ్యాస = వేదవ్యాసులు
11. పరాశర = పరాశరమునులు
12. సేనముదలి = విష్వక్సేనులు
13 శ్రీహరి = శ్రియఃపతి

ఈ పదముగ్గురు ఆచార్యులను గురుపరంపరామాలికలోను శ్రీరామానుజులు మధ్యనాయకమణియై యున్నారు.

### శ్రీభాష్యవ్యాఖ్యాతలు—వ్యాఖ్యానములు

1. సోమాసియాండాన్ = నయవివేకము, మిత్రప్రకాశికా
2. సేనేశ్వరాచార్యులు = శారీరకాధి కరణార్థ సంగ్రహము (సేనానాథీయం) అనుష్టుప్పద్య రూపము 300.
3. వరదనారాయణ భట్టారకులు = న్యాయసుదర్శనము
4. విష్ణుచిత్తాచార్యులు = శ్రీభాష్యవివరణము, సంగతిమాలా
5. వ్యాసార్యులు = శ్రుత ప్రకాశికా శ్రుతదీపికా
6. వేదాంతాచార్యులు = తత్వటీకా, అధికరణార్థసంగ్రహము (స్రగ్ధరావృత్తరూపము) అధికరణ దర్పణము
7. రంగరామస్వామి = మూలభావ ప్రకాశికా. (గురుభావప్రకాశికా)
8. సుగపురం శ్రీనివాసాచార్యులు = తత్త్వమార్తాండము,
9. కంచి శ్రీనివాసాచార్యులు = తత్త్వరత్నావళీ, (మణిమంజూషా సహితా)
10. అప్పయ్యదీక్షితులు = నయమయూఖమాలికా

# ఉపనిషద్వాక్యములు విశిష్టాద్వైతమునకే అనుకూలములు

నడాదూరి వెంకటకృష్ణమాచార్యులుగారు

ఆపాతతః విచారించగా ఉపనిషత్తులలో ప్రతిపాదించబడిన అభేదశ్రుతులు పరబ్రహ్మ ఒక్కడే సత్యము; మిగిలినది సర్వము అసత్యము; భేదము అపరమార్థము అని తోచునట్లు ఉన్నది. గాని శాస్త్రసహాయముచేత దీర్ఘదృష్టితో యోచించినయెడల విశిష్టాద్వైతమే సత్యము అని యేర్పడుచున్నది. విశిష్టాద్వైతమనగా విశిష్టం చ విశిష్టం చ విశిష్టే; విశిష్టయోః అద్వైతం, అని విగ్రహము. నామరూప విభాగములు లేని సమయమునందు సూక్ష్మరూపముగా నుండి తిరిగి నామరూప విభాగమేర్పడి నప్పుడు స్థూలరూప మగుచున్నది. ఈ విషయమే సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్ ఏకమే వా ద్వితీయం అను శ్రుతిచేత ప్రతిపాదించ బడుచున్నది. మరికొన్ని అభేదశ్రుతులను విచారింతము. "నేహ నానా స్తి కిఞ్చన. మృత్యోస్స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి" అను శ్రుతిని ఆపాతతః యోచించగా ఈ పరబ్రహ్మ యందు యేవిధమైన భేదము లేదు. ఎవడైతే దీనియందు భేదమునుచూచునో వాడు సంసారము నుండి తిరిగి సంసారమును పొందుచునే వుండును అనితోచునట్లున్నది. గాని దానికి ఈ అర్థము. ఎట్లన ఈజగత్తునందు బ్రహ్మాత్మకము గాని వస్తువే లేదు. ఎవడైతే ఇచ్చట బ్రహ్మాత్మకముగానిదానిగావస్తువును చూచుచున్నాడో వాడు సంసారము నుండి తిరిగి సంసారమును పొందుచూనే ఉండును. అని అబ్రహ్మాత్మక నానాత్వమే ఇచ్చట నిషేధించబడుచున్నది. సమస్త ప్రపంచము బ్రహ్మకార్య మగుటచేత బ్రహ్మాత్మకమగుటచేత బ్రహ్మతో ఏకమగుట చేతనున్ను బ్రహ్మవ్యతిరిక్తమైన భేదము నిషేధించబడుచున్నదేగాని 'బహుస్యాం ప్రజాయేయ' అని తైత్తిరీయములో చెప్పబడిన అనేక రూపములుగా అగుట అను సంకల్పముగాని, యోऽవ్యక్తమన్తరే సఞ్చరన్ యోऽక్షరమన్తరే సఞ్చరన్, యస్యాక్షరం శరీరం, అను శ్రుతి వాక్యములచే చెప్పబడిన అన్తర్యామిత్వముగాని 'అనేన జీవే నాత్మ నాऽనుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి' అను శ్రుతిచేత చెప్పబడిన పేరును రూపమును పొందుట అను అంశముగాని ఈశ్రుతిచేత నిషేధించబడవు. ఇందుకు ప్రమాణశ్లోకము.

యద్బ్రహ్మణో గుణ శరీర వికార భేదకర్మాది గోచరవిధి ప్రతిషేధ వాచః। అన్యోన్యభిన్న విషయా న విరోధగన్ధ మర్హన్తి తన్న విధయః ప్రతిషేధబాధ్యాః॥ సమస్త హేయగుణ రహితునికి హేయాకార వస్తువుతో ఐక్యము సమ్భవించుట అసఙ్గతమైనందువల్లనున్ను సర్వజ్ఞునికి తన సఙ్కల్పముచేత హేయవిషయకమైన భ్రమ కలిగినది అని చెప్పుట అసమ్భావితమై నందువల్లనున్ను సర్వజ్ఞుడుకాడు అని చెప్పినయెడల (య స్సర్వజ్ఞ స్సర్వవిత్) అను శ్రుతితో విరోధించుటవల్లనున్ను సర్వశక్తునికి తనయందుగల హేయనివారణ శక్తిలేదన్నచో (పరాస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే) అను సర్వశక్తి శ్రుతులు విరోధించుట వల్లనున్ను "పృథగాత్మానం ప్రేరితారంచ మత్వాజుష్ట స్తత స్తేనామృతత్వమేతి. జుష్టంయదా

పశ్యత్యన్యమీశం) అనునట్లు భేదజ్ఞానమే మోక్షోపాయము అన్నందువల్లనున్ను ఛాగపశున్యాయముచేత సామాన్యముగా భేదనిషేధము స్వతంత్ర భేదవిశేష నిషేధపర్యవసాయి అగుటవల్లనున్ను (జ్ఞాజ్ఞౌ ద్వావజావీశానీశౌ) అనుటచేత ఈశ్వరుడు నియమించువాడు జీవుడు నియమింపబడువాడు అని భేదము స్పష్టముగా యేర్పడుచున్నందువల్లనున్ను, ఇది అనువాద రూపమన్నట్లైతే ఘటపటాది భేదమువలెనే ప్రత్యక్షప్రమాణ గోచరము కానందువల్ల అట్లు చెప్పటకువీలు లేనందువల్లనున్ను ప్రమాణాన్తర ప్రాప్తమైన అర్థముయొక్క పునరనుసన్ధానమే గదా అనువాదము అనుటవల్లనున్ను ఇత్యాది అనేక యుక్తులచేత ఉపనిషత్తులలో చెప్పబడిన భేదనిషేధ శ్రుతులు అబ్రహ్మాత్మక నానాత్వ నిషేధపరములే గాని భేదమాత్ర నిషేధపరములు గావు. యత్రహి ద్వైతమివభవతి, యత్రత్వస్య సర్వమాత్మైవాభూత్, తత్కేన కం పశ్యేత్ తత్కేన కం విజానీయాత్ ఇత్యాది అభేదశ్రుతులున్ను ఈ విధముగానే ఉన్నేయములు.

(తత్త్వమసి శ్వేతకేతో) అను శ్రుతియందు తచ్ఛబ్దము పూర్వవస్తు పరామర్శి అగుటవల్ల సర్వజ్ఞుడై సత్యసంకల్పుడై జగత్కారణ భూతుడైన పరబ్రహ్మనే పరామర్శిస్తుంది. దీనికి పూర్వము (తదైక్షత బహుస్యాం) అను శ్రుతులవల్ల ఆ బ్రహ్మయే చెప్పబడుటవల్ల ఆ తత్పదముతో సమానాధికరణమైన త్వం అను పదమున్ను అచేతన విశిష్టజీవుడు శరీరముగాగల పరబ్రహ్మనే ప్రతిపాదిస్తున్నది. ఇట్లే (యదా హ్యేవైష ఏతస్మిన్నుదరమన్తరం కురుతే, అథతస్య భయంభవతి) అను శ్రుతివాక్యముచేత బ్రహ్మయందు కొంచెము భేదమును తలచినప్పటికిన్ని వానికి భయము కలుగుచున్నది. అని యేర్పడుచున్నది గదా అనగా ఆశ్రుతికి అట్లు అర్థము గాదు. (సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలానితి శాన్త ఉపాసీత) అను శ్రుతిచేత సమస్త జగత్తుయొక్క సృష్టి స్థితి సంహారములు పరమాత్మ కార్యమైనందువల్ల తదాత్మకము జగత్తు అని అనుసన్ధించుట శాన్తి హేతువు. ఆరీతిగా అనుసన్ధానమే అభయహేతువు అని యేర్పడుచున్నది. అయితే (అథతస్య భయంభవతి) అని యెందువల్ల చెప్పబడినది. అనగా ఆశ్రుతికి పూర్వము (యదా హ్యేవైష ఏతస్మిన్నదృశ్యే ఽనాత్మ్యే ఽనిరుక్తే ఽనిలయనే ఽభయం ప్రతిష్ఠాం విన్దతే అథసో ఽభయంగతో భవతి) అని బ్రహ్మయందు ప్రతిష్ఠను పొందినట్లైతే అదే అభయహేతువు అని అర్థము. ఈ అంశమునే మహర్షులు చెప్పిరి (యన్ముహూర్తం క్షణం వాపి వాసుదేవో నచిన్త్యతే) సాహాని స్తన్మహచ్ఛిద్రం సాభ్రాన్తి స్సాచవిక్రియా॥ ఏకస్మిన్నప్యతిక్రాన్తే ముహూర్తే ధ్యానవర్జితే। దస్యుభిర్ముషితేనేవ యుక్తమాక్రన్దితుం భృశం॥ ఇత్యాది అనేక ప్రమాణములచేత ఉపనిషత్తులకు విశిష్టాద్వైత బోధనమునందు తాత్పర్యమేగాని కేవలాద్వైత బోధనమునందు తాత్పర్యము లేదు.

"ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః"

కాకినాడలో జరిగిన

# శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ

## ఆషాఢమాస పరిడిత పరిషత్సభా సందర్భమున చదువబడిన

# పద్యరత్నములు

(కృతి నారాయణాచార్య భాగవతార్, కాకినాడ.)

శా. "దాసోహం" సకలాభినంద్య పరమ ద్రింగ స్థలీనేతకున్,
"దాసోహం" భగవద్గుణానుభవ పూతస్వాంత సభ్యాళికిన్,
"దాసోహం" యతిసార్వభౌమ చరణ ద్వంద్వాశ్రిత శ్రేణికిన్,
"దాసోహం" మనకార్యదక్షులకు, సు ద్యాల్, వి, ప్రి, సంఘానికిన్, 1

మ. సిరులొప్పన్ సకలాగమాంత విదులౌ శ్రీవైష్ణవాగ్రేసరుల్;
హరిభక్తాగ్రణులెల్లదబ్బోయిటు విశిష్టాద్వైత సిద్ధాంత స
త్పరిమన్మాన సభాప్రయుక్తమ్ముగ సందర్శించినారల్, భళీ !
పరమాశ్చర్యమ్ము, కాకినాడ పుర సౌభాగ్యమ్ము ముమ్మాటికిన్ 2

సీ. శ్రీరస్తు సర్వదా శ్రీవిశిష్టాద్వైత సమయప్రచారక సంఘమునకు
భద్రమస్తు, సతమ్ము, ప్రస్తుతాషాఢమాస సానుప్రయుక్తస భాధి పతికి
క్షేమమస్త్వనిశమ్ము శ్రీ శాంఘ్రిభక్తికృ తాహ్వాన కరణ సంఘాధిపతికి
శోభమస్తు నిత్యమ్ము సువిశాలభావ సం [illegible]క్తక్రియాదర్శి యుగళమునకు

గీ. భాగ్యమస్తు సతము శ్రీ వర్గమునకు, భవ్యమస్తు సదా సభా పండితులకు
శుభవితతిరస్తు సర్వదా శ్రోతలకును, సౌఖ్యమస్తు సదా మీకు సభ్యులార! 3

---

### వైష్ణవత్వ మనగా నేమి ?

పరసమృద్ధ్యేక సహాత్వమును, పరసమృద్ధి సమత్వమును,
పరసమృద్ధ్యేక ప్రయోజనత్వమును వైష్ణవత్వ లక్షణము.

# శ్రీరామానుజ కీర్తువు విజయవాడ

శతావధాని కృష్ణమాచార్యులుగారు కోరుట్ల (నైజాం)

శ్రీ స్తవనీయసోదర ? వశీకృత రంగవిహార హేమ సా
రాస్తగణోల్లసద్యుతివరామల రూపకృపావిలాస భూ
మాస్తనితోన్నత స్వరవిమర్ధితదుర్మదిహంసనీ పదా
స్సుస్తుతిగల్గజేయుము మనోజ్ఞ గుణాకర శ్రీయతీశ్వరా
జగములనుద్ధరింప కడుజాలి ? బూనిజెనించి వాది వ
క్రగతు లడంచి దాసజన కాంక్షలదీరిచి తాపమెల్ల బోత్
త్తుగ స్తనడగించి విజ్ఞులను నుతుల్గాంచుంటివి మాదృశాత్మ శ్రీ
వృగద గతుల్గలుగబ్రోచెటి మేటివి శ్రీయతీశ్వరా.

విద్యల తత్వమెల్ల జన విశ్రుతభాష్యమునందు జూపి రా
జద్యుమణి ప్రకాశమనజాలు సుమంగళ విగ్రహ ప్రభే
యద్యుతు లుల్లసిల్లగ జయుంబువహించిన దివ్యలోక దే
వాద్యుడవీవు నీమహిమనారయ నెంతటివాడ పిన్నవా
డద్యతనుండ నిన్గొలచునంతటి వాడగు నాయతీశ్వరా ?

ముముక్షువుకు దేవతాంతరముల యెడల ప్రీతియును, శబ్దాది విషయముల యెడల ప్రీతియును, మోక్షము గలుగుటకు ప్రతిబంధకములు. వీటిలో రెండు మాత్రమున్నవాడు కాలాంతరమునందైనను కడతేరవచ్చును. వీటిలో నొక్కటిమాత్రము (విషయప్రావణ్యము) ఎప్పటికిని ప్రతిబంధకముగానే యుండగలదు.

శ్రీమతే రామానుజాయ నమః

# రహస్యత్రయార్థసారము

శ్రీమాన్ శ్రీమత్తిరుమలై నల్లాన్ చక్రవర్తి సంపత్కుమార జగన్నాథపిళ్ళవేంకటాచార్యులవారు

## ద్వయమంత్రప్రకరణము

### పాట

ద్వాపుత్రాశ్రము

ద్వయమంత్రమున కర్థము । దెల్పెదను, దయయుంచి యాలింపుడీ ।
అందు శ్రీమత్పదంబు । మొదటిపద, మందుశ్రీయనలక్ష్మియా ॥
దీనికిన్ మూలమైయున । శ్రిఞ్ ధాతు, వౌను సేవార్థకంబు ॥
ఈపదంబునకు రెండు । వ్యుత్పత్తు, లేపారునవి వినుండు ॥
శ్రీయతే శ్రియతేయని । యవిరెండు, నీయర్థము లదెల్పును ॥
నరులచే నాశ్రయింప । బడునుశ్రీ, హరినాశ్రయించుచునుచు ॥
ఈరెండు హేతువులను । నగుబురుష, కారమును జేయంగను ॥
అపరాధియగునితనికి । హరిగదియు, నపుడత్యావసరంబిది ॥
నిత్యయోగంబర్థము । గామతు, ప్ప్రత్యయంబుండుగాన ॥
పురుషకారము జేసెడి । సిరియెపుడు, హరినిబాయనిదయ్యెను ॥
నరుడిందువలనహరిని । గదియునవ, సరమరయ బనిలేదికన్ ॥
కావలయు రుచియొక్కటే । హరిగదిసి, సేవింపగావీనికి ॥
పురుషకారబలంబున । స్వాతంత్ర్య, గరిమశిరమునువంచిన ॥
అపుడుతలయెత్తుగుణముల్ । నారాయ, ణపదంబుచే దెలియును ॥
గుణములవియేవికనివి । యవిజేయు, పనులేవియేవనినను ॥
పాపములకళలకుండ । గావింప, నోపువాత్సల్యమొకటి ॥
పనులుగాకుండవనుచు । నమ్మించి, తనరుస్వామిత్వమొకటి ॥
వానిస్వామిత్వమునకని । యెడబాయ, నీనిసౌశీల్యమొకటి ॥
వానిగనియాశ్రయింప । జేయునది, మైనసౌలభ్యమొకటి ॥
వైరులనుబారదోలి । చేర్చుకొని, తీరుజ్ఞానముశక్తియున్ ॥
ద్వివచనంబైనచరణ । శబ్దమిా, యవనిదెల్పునదేమన ॥
జేత్రిసౌంధర్యంబును । పాయసం, పూర్తియును దెలుపబడును ॥
శేషభూతునకు దీని । శేవందుప్రి, శేషియెడ జొచ్చుటకును ॥
ఇదివిగ్రహైకదేశ । మగుటచే, నదిసేనిలక్షితమగున్ ॥

శరణపదమునకర్థము । నిచటదల తురుపాయమేయనుచును ॥
దానినిష్టములమరును । అటుగాని, వానివారణగలుగును ॥
అవనినిబ్రపద్యేయను । దానిక ధ్యవసింతుననియర్థము ॥
ఒకమారెయిది జేయగా । దగియుండ నికవర్తమానమేల ॥
ఎపుడైనభారపడినను । బరిహృతికి నుపయుక్తమైనదియిది ॥
శ్రీపదంబుత్తరార్థ । మందలిది ప్రాప్యత్వమునుదెలుపును ॥
కైంకర్యవర్ధకత్వ । మనునర్థ మింకొకటియిందుగలదు ॥
ఇందువివరింపబడియె । దిరుమంత్ర మందుజెప్పినప్రాప్యము ॥
దీనివివరింపకుండ । దెలియదటు గాన దెల్పెదనువినుడు ॥
సర్వశేషిగనుండిన । వానికని నిర్వచింతురుదీనిని ॥
ఈపదమువిగ్రహమును । గుణములను, నేపుమీరగదెల్పును ॥
ఐనశేషిత్వమునను । దీనికిబ్రధానముగజూపుండును ॥
ఇందలిచతుర్థివలన । గైంకర్యమందముగదెల్పబడును ॥
పొందుగనమఃపదంబు । గైంకర్య మందుగలుపునుదీయును ॥
తనకొరకుగావించుట । యిందుగలు పనిచెప్పబడునిజముగా ॥
ఇందునవవిద్యాదులున్ । వినివృత్తి జెందునిస్సంశయముగా ॥
సౌందర్యమొకవిఘ్నము । అక్లైమొద టందెలుపుకైంకర్యము ॥
కైంకర్యమెపుడుగోరు । నటుతడా తంకవినివృత్తిగోరు ॥
ఇదియెద్వయమంత్రార్థము । నిదిదెలియ నొదవుబురుషార్థమెల్ల ॥
దీనికినకించనుండ । నన్యార్హుడైననధికారియగును ॥
ఇందుపెరియపిరాట్టిచే । బురుషార్థ మందనగుననిచెప్పెను ॥
ఆత్మగుణములకెల్లను । వాసమగు నాత్మయుందధికారియౌ ॥
ఇందువివరింపబడియె । దిరుమంత్ర మందుగలిగినయర్థము ॥
దీనికున్నప్రభావము । వేదంబు లోనిరూపింపబడెను ॥
రుచిపరిగృహీతమయిన । దాచార్య నిచయంబుచేనియ్యది ॥
కనుకనాచార్యనిష్ఠ । గలిగియుం డినవారికిదిముఖ్యము ॥
ఈకారణములదీని । యర్థమును మీకువినుపించినాడ ॥



## : చరమశ్లోక ప్రకరణము :

### చాపుతాళము

వినుడుచరమశ్లోక మునకుగలయర్థమో । ఘనులారశ్రద్ధగలిగి ॥
సర్వధర్మానని యె సంగుపదమునధర్మ । శబ్దార్థమేమనినను ॥
దృష్టఫలసాధనము లిచటజెప్పంబడవ । దృష్టఫలసాధనములే ॥
అవియనేకంబులై నందుచేబహువచన । మయ్యెనిచ్చటనుండుగా ॥
అర్హతాపాదకము లగునిత్యకర్మంబు । లగుసర్వశబ్దార్థము ॥
ఇకబరిత్యజ్యయను నెడద్యాగమనెడిదా । నికిగలుగుభావమిదియె ॥
ముందటియుపాయముల యందుపాయత్వమతి । జెందినామిదిదోషము ॥
అనుపాయములగువా నినుపాయములటంచు । ననుకొంటిమిదిగూడునే ॥
భ్రాంతిపడితిమిశుక్తి రజతమనివిపరీత । భాగమునకేగితిమని ॥
ఇట్టిబుద్ధివిశేష మెసగద్యజియించుటే । యిచటిత్యాగపదార్థము ॥
పరియనెడినుపసర్గ పదముదానికినర్థ । మెరిగింతునాలింపుడీ ॥
పాతకాదులనెట్లు వర్జింతురోయట్టి రీతిరుచివాసనలతో ॥
మరలబైబడకుండ మదిసిగ్గునద్యజించు । సరణినిదిబోధించును ॥
వ్యాప్యోపాయాంతరము లనువిడచియెగ్రహింప । నొప్పనదిజెప్పను ॥
మామనినసర్వసం రక్షకుడునీకువశు । డైమెలగునన్ను నదగున్ ॥
నీకుసమ్మతిజూచి నీదుతప్పులనొప్పు । గాదలచునన్ను నని యున్ ॥
సమకూర్చువారుదూరము జేసినను విడచి ॥ యమరజాలనినన్నని ॥
స్థానబ్రమాణంబు చేనేకశబ్దార్థ । మైనదనధారణంబు ।
ఇందుచేస్వీకార మందలియుపాయత్వ । మొందుచుండెనివృత్తిని ॥
శరణశబ్దముక్రింది సందర్భములకుదా । సరిపడవలసినందున ॥
దీనికర్థములెన్ని యైననున్ననుచట । నౌనుపాయమెయర్థము ॥
వ్రజధాతువునకున ర్థంబుగతియదిబుద్ధి । నిజముగానిల్లగుటచే ॥
అర్థమేర్పడియెవ్రజ యనునట్టిదానిక । ధ్యవసింపుమాయనుచును ॥
అహమనినసర్వజ్ఞు డైసర్వశక్తియై । ప్రాప్తయునగునేనని ॥
త్వాపదార్థముదెలివి బలిమిప్రాప్తియులేకు । పాయమేనగునిన్నని ॥
వినుపింతుసర్వపా పేభ్యోయనెడిపదం । బునకర్థమగుదానిని ॥
ననుజేరనీయనివి యనివెరతువోవేని । గనియవన్నిటినుండియు ॥
మోక్షయిష్యామియన ముక్తినందగజేసి । పుచ్చెదనటంచర్థము ॥

మనకుబనిలేదనియె చనుదమంతటనుడా । మనుచుణిచ్ప్రత్యయమనున్ ॥
మాశుచఃపదమీక్రమమువిశ్వసించిమఱి । లోశోకమొందకుమనెన్ ॥
ఇటురహస్యత్రయికి నెసగునర్థములఘు । స్ఫుటముగా వినుపించితిన్ ॥
భగవంతుడనుభాగవతులునాచార్యులీ । పగిదిననుదయజూచిరి ॥
తప్పులున్నక్షమించి యొప్పులున్నగ్రహించి । తప్పకకృపన్ జూడుడీ ॥
వసుధనల్లాన్ చక్రవర్తిసంపత్కుమా । రసదన్వయోద్భూతుడన్ ॥
గరిమనుజగన్నాథ తిరువేంకటార్యుడను । హరిదాసులకు దాసుడన్ ॥

## యతిరాజవిజయ నాటకమునందలి కొన్ని చక్కని శ్లోకములు

శ్రీ ఉ. వే. శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులుగారు

శ్లో. జానీమ స్తవ సత్య మర్జునకృతే భీష్మప్రహారోద్యమాత్ ।
గోపస్త్రైణ విహారధూర్తవిదితం త్వద్బ్రహ్మచర్యం జనైః ॥
దౌత్యేన స్ఫుట మీశ్వరత్వ మపి తే స్వామిం స్తథాప్యుత్తరా ॥
గర్భోజ్జీవన భేషజాయ భవతః పాదాయ తస్మై నమః ॥

తాత్పర్యము

స్వామీ! అర్జునుని నిమిత్తమై భీష్మాచార్యులను సంహరించు ప్రయత్నము వలన నీ సత్యము నెఱింగితిమి. గొల్లస్త్రీలతో విహరించుచు నీ వొనరించిన ధూర్త కృత్యములచే జనులు నీ బ్రహ్మచర్యము నెరింగిరి. కురుపాండవులమధ్య రాయభారముచే నీ యీశ్వరత్వము వెల్లడియైనది. ఐనను శ్రీస్వామీ! ఉత్తరాగర్భమునందున్న పరీక్షిద్రక్షణమునకు దివ్యౌషధమైన నీపాదములకు వందనము.

శ్లో. అకోకిలా మాశు విధాతు ముర్వీ ।
మపాకశాలా నసురాంశ్చ కర్తుం ।
శక్తాపి శాన్త్యా నమస్సు వయా తే ।
తస్యై నమ స్సప్తమభూమికాయై ॥

భూమియందు కోకిలలు లేకుండ జేయుటకును, దేవతలకు వంటయిల్లు లేకుండ జేయుటకును, తగినంత శక్తిసంపదలు కలిగియుండియు ప్రణతిమాత్రముచే శాంతించిన ప్రసిద్ధమగు నీయేడవదైన శ్రీరామావతారమునకు నమోవాకములు.

# బ్రహ్మవిద్యాఫల విచారము

శ్రీ ఉ. వే. శ్రీమాన్
పాలకొండ కందాడై వీరరాఘవ
అప్పలాచార్యులుగారు, శ్రీరామతీర్థము.

1. ఈవిషయమున, బ్రహ్మవిద్యలననేవి, వాటి స్వరూపమెట్టిది, వాటినధికరించు వారెట్టివారు, వారికి లభించుఫలమెయ్యది, ఆఫలమునిచ్చువారెవ్వరు, అట్టి ఫలస్వరూపమెయ్యది, యను విషయములు విమర్శనీయములుగఁ బ్రసక్తమగుచున్నవి, యిందు బ్రహ్మవిద్య లన నేవియనగా

2. ప్రాచీనులు వేదములనుపూర్వభాగమనియు ఉత్తరభాగమని రెండుభాగములుగఁ జేసియున్నారు. అందుపూర్వభాగము నిత్యనైమిత్తికాదికర్మ ప్రతిపాదకము నుత్తరభాగము బ్రహ్మప్రతిపాదకమునైయున్నవి. అట్టియుత్తరభాగమనఁబడును పనిషత్తులందు, సద్విద్య, భూమవిద్య, ఉద్గీథవిద్య మొదలగుఁగొన్ని విద్యలుఁ జెప్పఁబడినవి. వాటినే బ్రహ్మవిద్యలందురు. వాటినేధ్యానోపాసనాది శబ్దములచేఁగూడ శాస్త్రకారులు వాడుదురు. ఇక వాటి స్వరూపమెట్టిదనిన.

3. విద్యయనగా విదజ్ఞానే, యనెడి ధాతువు యొక్క రూపమగుటఁజేసి విద్యాశబ్దమునకు జ్ఞానమునుఁ గలుగఁజేయునది యని యర్థమగుటచే, బ్రహ్మవిద్యయనగా బ్రహ్మవిషయకజ్ఞాన జనకమని తేలుచున్నది. కావున బ్రహ్మవిద్యయనగా బ్రహ్మయను విషయమును బోధించు జ్ఞానమనియర్థము, అట్లైననుపనిషత్తులందుఁ జెప్పఁబడిన బ్రహ్మవిద్యలు బ్రహ్మను బోధించుచు స్వతంత్రముగ ఫల సంపాదకములగుచున్నవా లేదాయను విషయము విచారింపవలసియున్నది. అట్లు విచారించినచో నుద్గీథవిద్య "ఓమిత్యేతదక్షరముద్గీథముపాసీత" యని కర్మకాండమునఁ బఠింపఁబడినదై కర్మాంగముగఁగాన్పించుచున్నది అద్దానితోఁబాటు బ్రహ్మవిద్యలన్నియును సిద్ధరూపమగు బ్రహ్మను బోధించునవియై, తాదృశ బ్రహ్మకుఁ గ్రియామయకత్వన్వయము లభింపనందునను తమకు ప్రత్యేకముగ బ్రహ్మప్రాప్తి కన్న వేరగు ఫలము నిర్దేశింపఁబడకున్నందునను క్రత్వంగములై క్రతుద్వారా ఫలసంపాదకములగుచున్నవిగాని స్వతంత్రముగ ఫలసంపాదకములుఁ గానేరవని యిటనొక సంశయముఁ గల్గుచున్నది. గాని "యదేవవిద్యయాకరోతిశ్రద్ధయోపనిషదా తదేవ వీర్యవత్తరం" అని విద్య ప్రతిబంధనివర్తన పూర్వకముగశీఘ్రముగ ఫలమును సంపాదించు సామర్థ్యమనఁబడు నధికబలమును క్రతువునకు కలుఁజేయునని తప్ప విద్యకు వేరొక ప్రయోజనములేదనిగాని విద్యలేనందున క్రతువునకు వైగుణ్యమనిగాని యిచట ప్రతిపాదింపఁబడలేదు. ఇంకను బ్రహ్మవిద్యల కన్నిటికిని మోక్షరూపమగు బ్రహ్మప్రాప్తినే ఫలముగఁ బ్రమాణములు బోధించుచున్నవి. గనుక బ్రహ్మవిద్యలు కర్మాంగములు గాక స్వతంత్రఫలసంపాదకములే యని నిర్ణయింపఁబడుచున్నవి. యీవిద్యల నధికరించువారెవ్వరనిన

4. సాంగవేదాధ్యయనముఁ జేయు నపుడు పూర్వభాగమున బోధింపఁబడినకర్మలునుఁదత్ఫలభూతములగు స్వర్గాదులును పరిమితములు, ననిత్యములు, ననియు నుత్తరభాగమునఁ బోధింపఁబడిన బ్రహ్మజ్ఞానమునుఁ దత్ఫలభూతమగు బ్రహ్మప్రాప్తియును నపరిమితములు నిత్యములుననియు నచ్చటనే "ప వాహ్యేతే అదృఢాయజ్ఞరూపా"

అనియును "పరీక్ష్యలోకాన్కర్మచితాన్ బ్రాహ్మణోనిర్వేదమాయాన్నాస్త్యకృతః కృతేన, తద్విజ్ఞానార్థం సగురుమేవాభి గచ్ఛేత్సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం, తస్మైసవిద్వానుపసన్నాయసమ్యక్ప్రశాంత చిత్తాయశమాన్వితాయ, యేనాక్షరం పురుషం వేదసత్యం ప్రోవాచ తాంతత్త్వతోబ్రహ్మవిద్యామ్" అనియును వివరించుచున్న ప్రమాణములనుబట్టి కర్మఫలములందు నిర్వేదముగలిగి మోక్షమందాసక్తి కలవాడై బ్రహ్మవిద్యలనబడు బహ్మవిద్యల నధికరించదగినవాడు. ఋకినట్టివాడు బొందుఫలమెయ్యదియన-

5. "అవిద్యయామృత్యుం తీర్త్వా విద్యయామృతమశ్నుతే, బ్రహ్మవిదాప్నోతిపరమ్, నపునర్మృత్యవే, తదేకంపశ్యతి, సస్వరాడ్భవతి, పృథగాత్మానం ప్రేరితారంచ మత్వా జుష్టస్తతస్తేనామృతత్వమేతి, తమేవం విద్వానమృత ఇహభవతి, నాన్యఃపంథాఅయనాయ విద్యతే॥ ఇత్యాది శ్రుతివాక్యములచే నిచట బూర్వభాగమందు జ్యోతిష్టోమాద్ది కర్మలకు స్వర్గాది ఫలములు వలెనే నిరతిశయానంద రూపమోక్షమనబడు భగవత్ప్రాప్తియే బ్రహ్మవిద్యా ఫలమని నిరూపింపబడుచున్నది. శ్రీభాష్యకారులుం గూడ "ఇహబ్రహ్మ విద్యాస్సర్వాబ్రహ్మ ప్రాప్తిరూప మోక్షైకఫలాః, సద్విద్యా భూమవిద్యా దహర విద్యా ఉపకోసలవిద్యా వైశ్వానరవిద్యా ఆనంద మయవిద్యాక్షరవిద్యాది రూపేకశాఖాగతాశ్శాఖాన్తరగతాశ్చోదాహరణమ్॥ అనియును, బ్రహ్మప్రాప్తిఫలానాం సద్విద్యాదహరవిద్యాదీనాంస్థానాత్వ ముక్తం॥ అనియును పెక్కుస్థలములలో నిట్టి బ్రహ్మప్రాప్తినే విద్యాఫలముగం బేర్కొనియున్నారు. ఇట్టి ఫలము నిచ్చువారెవరనిన,

16. ఇట్టిఫలమును లభింపజేయువాడుంగూడ నుపాసనములనబడు కర్మజ్ఞానసహకృత భక్త్యాదులచే బ్రీతుడగునీశ్వరుడేగాని కేవల కర్మజ్ఞానాదులుగాని తత్సహకృతములగు భక్త్యాదులుగాని సాధనములుంగానేరవు. ఈవిషయము "ఏషహ్యేవానన్దయాతి, సవాఏషమహానజ ఆత్మా, అన్నాదోవసుదానః॥" అనెడి శ్రుతులచేతను-

"యోయోయాంయాంతనుం భక్తః
శ్రద్ధయార్చితు మిచ్ఛతి ।
తస్యతస్యాచలాం శ్రద్ధాం ।
తామేవ విదధామ్యహమ్॥
సతయా శ్రద్ధయాయుక్తః ।
తస్యా రాధన మీహతే ।
లభతేచతతఃకామాన్ ।
మయైవవిహితాన్ హితాన్ ॥

అనెడి గీతావాక్యములచేతను-

"అతఃపరముపాసనం వివక్షన్నుపాసీనానాం పరస్మాదేవాస్మాత్పురుషాత్తమాత్ప్రాప్తిరూపముపవర్గాఖ్యం ఫలమితి సంప్రతిబ్రూతే" అనియును.

"అహరహరనుష్ఠీయమాన వర్ణాశ్రమధర్మానుగృహీత తదుపాసనరూప తత్సమారాధన ప్రీతః ఉపాసీనానాదికాల ప్రవృత్తానన్తదుస్తరకర్మ సంచయరూపా విద్యాంవినివర్త్యస్వయాథాత్మ్యానుభవరూపా నవధికాతిశయానన్దంప్రాపయ్యపునరావర్త యతీత్యపి శబ్దాదేవావగమ్యతే శబ్దాత్॥" సఖల్వేవంవర్తయన్ యావదాయుషం బ్రహ్మలోక మభిసంపద్యతే,

నచపునరావర్తతే॥ ఇత్యాదికః. అనియు నుదహరింపబడిన భాష్యములచేతను స్ఫుటముగ వివరింపబడుచున్నది. యింకనిట్టిఫలస్వరూపమెట్టిదనిన,

7. పైనుదహరింపఁబడిన భాష్యములచేతను, ననేకములగు స్మృతులచేతను-

"మాముపేత్య పునర్జన్మ ।
దుఃఖాలయమశాశ్వతం ।
నాప్నువంతి మహాత్మానః ।
సంసిద్ధింపరమాంగతాః ॥"

"ఆబ్రహ్మభువనాల్లోకాః ।
పునరావర్తి నోర్జున ।
మాముపేత్యతుకౌంతేయ ।
పునర్జన్మ నవిద్యతే ॥

అనెడి యీగీతావాక్యములచేతను మోక్షరూపమగు ఫలము నిత్యమనియు, నిరవధికానందరూపమనియు స్పష్టమగుచున్నది.

## శ్రీ రామానుజ సప్తకం

సంస్కృత విద్యాకుమారక
శ్రీ ఉ. వే. శ్రీమాన్ బూతుగడ్డ కందాడ
అళహశింగరాచార్యులుగారు, నెల్లికుదురు.

శ్లో॥ శ్రీకేశవాత్మజాతం । శ్రితజనపరిపాలనైక సుస్వాంతం ।
పరమముదారగుణాఢ్యం । కలయేరామానుజం కృపాసింధుం ॥

శ్లో॥ పాషండ బౌద్ధమత । నాశకరం యతికులేశ్వరం పూజ్యం ।
కాషాయశోభినంతం । కలయేరామానుజం కృపాసింధుం ॥

శ్లో॥ శేషావతారరూపమ । శేషజనాఘౌఘహరణచరణాబ్జం ।
శ్రీభాష్యకారమమలం । కలయేరామానుజం కృపాసింధుం ॥

స్వాచార్యాజ్ఞనుమీర దోసమని సుంతైనన్ వెనుదీయకే
ప్రాచీనంబగు మంత్రరాజము మహావాత్సల్య సంపూర్ణస
ద్వాచోవైఖరి వెల్లడించితిరిగాన స్వామీ! యతీశప్రభూ!
ఆచార్యత్వమటన్న మీదె వినుడో యాచార్యచూడామణీ ॥

శ్రీభాష్యమ్మును తాధరించెనుగదా శీర్షమ్ముపై ప్రేమతో
నాభాషాసతి మీమహత్వమిక నెన్నన్ కింపునర్న్యాయమే
మీభావమ్మున చేతనోద్ధరణమే మేలైనకృత్యంబుగా
దాభావింపగ స్వామీ! తండ్రీ! యతిరాజా! ధాసకల్పద్రుమా ॥

శ్రుతికినపార్థమావిధిని జూపగ దానిని లోసహించకన్
హితమతినిశ్చయార్థము రహింబ్రకటించగలేదె ? స్వామి మీ
వితరణమేమిజెప్పవలెనె వీతభయాదులమయ్యు నిట్టులే
సతతము మిమ్ము సంస్మరణ సల్పెడి భాగ్యముమాకొసంగుడీ. ॥

# యతిరాజవిజయ నాటకమునందలి కొన్ని చక్కని శ్లోకములు

శ్రీ ఉ. వే శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులుగారు

శ్లో॥ పరస్మా దన్యస్మై యదపి, యదపి స్వేన పరతః ।
పరస్మై, స్వస్మై తు స్వత ఇతరతో వా స్ఫురతి యత్ ।
త దేత త్సర్వాత్మన్! తవ భవతి షాడ్గుణ్యజలధేః ।
విధేయం చాధేయం వివిధవినియోగోచిత మపి ॥

తాత్పర్యము

షడ్గుణాకరా ! సర్వేశ్వరా ! ఇతరునకు (చేతనునకు) ఇతర (ప్రమాణాంతర) మువలన మాత్రమే భాసించునట్టి జడమగు లీలావిభూతియు, ఇతరునకు అజడము గాన స్వయంప్రకాశమగుటచే) తనంతను ఇతరము వలనను భాసించునట్టి నిత్యవిభూతియు, ప్రత్యగర్థమగుటచే) తనకుతాను; తనంతను ఇతరములవలనను భాసిల్లునట్టి చేతనతత్త్వమును ఓ సర్వశరీరీ ! ఇదియంతయు నీకు పరతంత్రమైనదియు, ధరింపదగినదియు, యిచ్చవచ్చినట్లుపయోగించుట కుచితమైనదియు (శరీరలక్షణము) నగుచున్నది.

(భగవచ్ఛబ్దమున కర్థమగు జ్ఞాన, శక్తి, బల, ఐశ్వర్య, వీర్య, తేజస్సులనెడు ఆరుగుణములును భగవద్గుణములలో ప్రధానమైనవి.)

శ్లో. తమో య త్ప్రాగాసీ త్త్రిగుణమయ, మస్మా చ్చ యదభూ, ।
త్తతో య త్త్రేధా సీ, ద్బహువిధ మతో య త్సమజని, ।
తతః పఞ్చభ్యో య త్పవనగగనాద్యాత్మక మభూ ।
త్త దేత త్సర్వం తే భవతి ఖలు లీలాపరికరః ॥

తాత్పర్యము

సృష్టికి పూర్వావస్థలో త్రిగుణాత్మకమగు ప్రకృతి తమోమయమైన అవ్యక్తముగా నుండెను. దానినుండి మహత్తత్త్వముదయించెను. దానినుండి వైకారికము తైజసము భూతాది యనబడు సాత్త్విక రాజసతామసాహంకారము పుట్టెను. దానినుండి జ్ఞానేంద్రియములు కర్మేంద్రియములు మనస్సు పంచతన్మాత్రలని బహువిధ పదార్థములుద్భవించెను. ఆపంచతన్మాత్రలనుండి పృథివ్యాది పంచభూతములు జన్మించెను. స్వామీ ! ఇదియంతయు నీకు క్రీడాకందుకముగదా !









## నా రీ వి భా గ ము

శ్రీమతే రామానుజాయ నమః

# కంగులుం-పగలుం పాశురోపన్యాసము

శ్రీమతి నండూరి ఆనందమ్మగారు,
ఏలూరు.

తిరువాయిమొళి 2 పత్తు, 4 వ తిరు, 1, పాశురము.

ఈతిరువాయ్‌మొళిలో నమ్మాళ్వార్లు, భగవద్విశ్లేషమును సహించజాలక పెరియ పెరుమాళ్ తిరువడికళ్ళలో ప్రపత్తిచేసి అచ్చట కూడ తన మనోరథమును లభించక దుఃఖపరవశులై ఒక పిరాట్టియవస్థను బొందియుండగా, అప్పుడాపిరాట్టియొక్క-తల్లి నాకుమార్తె విషయమై నీవేమి సంకల్పించియున్నావని పెరియపెరుమాళ్ సన్నిధిలో విన్నవించుచున్నటుల తాయిమారవస్థలో విన్నవించిన పాశురము.

పాశు:— కంగులుం పగలుం కణ్డుయిలఱియాళ్ । కణ్ణనీర్ కైకళాలిఱైక్కుం ।
శంగు శక్కరంగళెన్ఱు కై కూప్పుం । తామరై కణ్ణెన్ఱే తళరుం ।
ఎంగనే తరిక్కేన్ ఉన్నై విట్టెన్నుం । ఇరునిలం కై తుళావిరుక్కుం ।
శెంగయల్ పాయ్‌నీర్ తిరువరంగత్తాయ్ । ఇవళ్ తిఱత్తెన్ శెయ్‌కిన్ఱాయ్ ॥

కంగులుం- రాత్రియందును
పగలుం- పగలుయందును
కణ్- నేత్రములయొక్క
తుయిల్- నిద్రను
అఱియాళ్- ఎఱుగదు
కణ్ణనీర్- కంటినీటిని
కై కళాల్- చేతులచేత
ఇఱైక్కుం- జల్లును
శంగు శక్కరంగళ్-ఎన్ఱు-శంఖము-చక్రము అనుచు
కైకూప్పుం- నమస్కరించును
తామరై కణ్ ఎన్ఱు- పద్మమువంటి నేత్రములు అనుచు
తళరుం- శిథిలమనస్కురాలగును
ఉన్నైవిట్టు- నిన్నువదలి
ఎంగనే- ఎట్లు
తరిక్కేన్- జీవించెదను
ఎన్నుం- అని అనును
ఇరు- విశాలమైన
నిలం- భూమిని
కై- చేతులచే
తుళా-ఇరుక్కుం-తడుముచుండును
శెం- సుందరమైన
కయల్- మత్స్యములు
పాయ్- ఎగురుచున్న
నీర్- నీరుగల
తిరువరంగత్తాయ్- శ్రీరంగనాథా
ఇవళ్ తిఱత్తు- ఈమెవిషయమై
ఎన్ శెయ్‌కిన్ఱాయ్- ఏమిచేయదలంచితివి?

**తాత్పర్యము:-** ఓ శ్రీరంగనాథా! ఈ ఆళ్వారునాయకి నిన్ను ఎడబాసి యుండజాలక రాత్రింబగళ్లు నిద్రాహారములు లేకుండగ దుఃఖించుచు నీదివ్యావయవ దివ్యాయుధముల స్మరించుకొనుచు, నమస్కరించుచు, మూర్ఛపొందుచు, భూమిని తడుముచు ఇట్లు అమితబాధ పడుచున్నది. ఈమెను నీవేమి చేయదలచితివో?

ఈపాశురము ఆళ్వార్లు నాయకావస్థలో తల్లి భావనచేత పాడినప్పటికి ఇందులో శ్రీవిశిష్టాద్వైత మత ఆధిక్యతసంతా అన్యాపదేశముగా నిరూపించారు మనఆళ్వార్లు. ఇదిగాక ఏభగవద్గీత మన దేశమందే గాక దేశదేశాంతరములయందు అన్యమతస్థుల చేత కూడా కొనియాడబడి పూజింపబడుచుండెనో, ఆభగవద్గీత సారాంశమైన చరమశ్లోకార్థమునే ఈపాశురము ద్వారా ఆళ్వార్లు తెలుపుడు చేయుచున్నారు. ఈచరమ శ్లోకము విలువ మనసు నందుంచుకొనియే వీరు తిరువాయ్‌మొళిలో ఒకచోట "వార్తైయరి బవర్ మాయవ ర్కాళన్ఱి యావరో, అనిపాడినారు, "వార్త" యనగా వాక్యమని శ్రీమహాభారతమున కంతా అర్థవంతమై సారవంతమైన ఈచరమశ్లోకము వాక్యమని, అమృతము కొరకు సముద్రమదనం చేస్తే ఎన్నో రత్నములు మొదలైనవి పుట్టినట్లుల ఈచరమశ్లోకమును పుట్టించుట కొరకే శ్రీవేదవ్యాసభగవాన్ మహాభారతము చేయవలశి వచ్చినదని, అంటే భారతసారము చరమ శ్లోక మని ఆళ్వారుల అభిప్రాయము. అందువలన నీచరమశ్లోక విలువ తెలిసినవారు శ్రీగీతాచార్యునికి తప్ప వేరొకరికి దాసులవుతారా? అని వీరి అభిప్రాయము. ఈచరమశ్లోకమును యింతగా వీరు ఎందులకు కొనియాడినారంటే ఈశ్లోకములో వున్న స్వార్థ త్యాగమునకు "సర్వధర్మాన్ పరిత్యజ్య" అన్నికర్మలలోను ఫలత్యాగము కర్తృత్వత్యాగము చెప్పుటయే గాక మామేకం అనుటలో నుండే స్వార్థత్యాగమును వర్ణించుటకు 10 పేజీలైనా చాలదు.

మాం, అని తిరిగి 'ఏకం' అనిసాయించుటలో శ్రీగీతాచార్యుని అభిప్రాయము. సర్వధర్మములు నీకేవిధముగ రక్షకము కాజాలవో, నీవు చేసిన ప్రపత్తికూడా నీకొక రక్షకము కాదు. నీ రక్షణకు నానిర్హేతుక జాయమాన కటాక్షమే ప్రధానకారణము. నాకటాక్షముచేతనే నీవు సంసార విముక్తినొంది నన్ను జేర గలిగితినను కోవాలి అని గీతాచార్యుని అభిప్రాయము. ఎంత స్వార్థత్యాగమో చూడండి. శ్రీగీతాచార్యులు ఏకం అని చెప్పిన స్వార్థత్యాగమునే ఈపాశురము ద్వారా ఆళ్వార్లుపాడినారు. స్వార్థత్యాగమునకున్న గొప్పదనము మరిదేనికీ లేదు. మొదటనుంచి మనహిందూదేశము, ఇతరదేశస్థులంతా రాజ్యమును కొల్లగొట్టినవారిని నాయకులుగా ఎంచుతుంటే, రాజ్యములు విడచిపెట్టిన గోచిపాతరాయులనే నాయకులుగా ఎంచుకొని విశ్వామిత్రి సంతతివారము. భారద్వాజముని సంతతివారము. అని గొప్ప ఆధిక్యతగా చెప్పుకొని ఆనందపడి పోతున్నాము.

ఏపరమాత్మానందము కొరకు ఆబుషు లందరు యితరవిషయములన్నీ త్యాగముచేసినారో అటువంటి భగవదానందముకూడా జీవులకొరకు

త్యాగము చేసిన స్వార్థత్యాగి. శ్రీభగవద్రామానుజ మునీంద్రులు,ఇంతమంది జీవులు పరమ పదమునకు వెళ్ళితే నేను మాత్రం నరకంలో వుంటేనేమి అని గురువాజ్ఞను మీరి. మంత్రము జనులందరికి వెదజల్లిన త్యాగమూర్తి రామానుజులు, ఆ కారణం చేతనే గదా, రామానుజ సిద్ధాన్తమనుపేరుతో ఈమతము ప్రచారములో నుండుట. అట్టి స్వార్థత్యాగముతో గూడిన ఈ విశిష్టాద్వైతమతమునకు పునాది నాలాయిర దివ్య ప్రబంధములు. అందులో ఈ కంగులుం,పగలుం అన్న పాశురములో మొదటి మూడు పాదములలో భగవానుని శరణుపొందిన జీవుడేవిధముగా వుండాలి, అనే విధముచెప్పి చివరి నాల్గవ పాదములో ఈజీవుడుచేసే భక్తి ఉపాయముకాదు వాని నిర్హేతుక కటాక్షమే వుపాయము అని చరమశ్లోకములో చెప్పిన "ఏకం" అన్న శబ్దమునకు వివరించుచున్నారు. ఆళ్వారులీపాశురములో "కంగులుం పకలుం, కణ్ణుయిలరియాళ్"ఆళ్వార్ తమఅవస్థను తల్లి చెప్పినట్లుగా అన్యాపదేశముగ తమకు స్వామియందుండే ప్రీతిని(ప్రేమభక్తి అని దానికి పేర్లు) ఆభక్తిని తెలుపుడు చేస్తున్నారు. రాత్రిం బగళ్లు నాకూతురికి నిద్రలేదు. రంగనాథా అని తల్లిగారు భాధతో చెప్పుతున్నారు.

ఈలోకములో ధనములేదనో, పోయినదనో, లేక దారేషణ పుత్రేషణాదులగు ఇతర విషయముల యందుండే మమకారంచేత నిద్రలేని వారున్నారు గాని, పరమాత్మకొరకు పరితపించి వీని దర్శనము కాలేదని రాత్రిం పగళ్లు నిద్ర లేకుండా పరితపించే వారెవరున్నారు,

ఈప్రకృతిలో రాత్రిం పగళ్ళు అనే విభాగము లేదు. ఒకే ఆలాపన రంగనాథా-కణ్ణనీర్ కైకళాలిరైక్కుం" కంటినీరునిచేతులతో తుడుచుకొంటూంది నాకూతురు. అని యన్నారు. లోకములో అదిలేదు. ప్రాకృతిక వస్తువులుపోయినవని విచారపడేవారున్నారుగాని పరమాత్మను గురించి విచారపడే వారెవరున్నారు. సామాన్యమైన కంటినీరా, ఈమె తుడుచుకొంటే నిలిచేటందుకు పదిరూపాయలు పోయిన విచారము. లక్షరూపాయలు పోయిన విచారము ఒకటవుతుందా.

క్షుద్రవిషయాలను ప్రేమించి వాటిఎడబాటువలన కలిగే దుఃఖము గనుకనా అరికట్టడానికి అప్రాకృత విషయాన్ని ప్రేమించి అదిలభ్యము కాకపోతే వచ్చిన కంటనీరు అరికట్టడానికి సాధ్యమగునా. నాబిడ్డ వెర్రిగాని, అని తల్లిగారి అభిప్రాయము, "శంగు శక్కరంగళెన్ఱు కైకూప్పుం" శంఖుచక్ర గదాధరుడవై వచ్చి ఒకసారి దర్శన మీయవా అనిపోతుంది. దాహము విపరీతముగా వేశినవాడు మంచినీళ్ళను అడగలేక చేతితో సంజ్ఞ చేసినటుల బలహీనతచేత శంఖము,చక్రము అని రెండు చేతులు జోడించి నమస్కారము చేస్తూన్నది. బ్రాహ్మణునికి పిచ్చిపట్టినా వేదమే మాట్లాడునటుల ఈఆళ్వార్లు ఏఅవస్థలోనున్నా, శేషత్వస్వరూపమునకు తగిన అంజలి మాత్రము మానరు. "తామరై కణ్ణెన్నేతళురుం- తామర రేకులవంటి నేత్రసౌందర్యము కలదానిని అని ఆ నేత్ర సౌందర్యమునే తలంచుకొని మూర్ఛ పోతుంది. అశోకవనంలో చెరలోనున్నసీతాదేవి ఆవనంలోని సౌందర్యములెన్ని రావణుడు వర్ణించినా అదేమీ ఆమె కంటికగుపడలేదు. "రామంరక్తాన్త నయన మపశ్యంతీ సుదుఃఖితా"

అని శ్రీరామచంద్రుల నేత్రములు తలచుకొని దుఃఖించినటుల వాని నేత్రముల సౌందర్యము తలచుకొని మూర్ఛపొందుతూ వుంటుంది. "రామః కమలపత్రాక్షః సర్వసత్వమనోహరః అని ఆంజనేయులన్నటుల మొరటుమానసులైన మావానరజాతినంతా స్థిరత్వముతో నిలబడి పనిచేయించుకునే నేత్రసౌందర్య మారఘురామునిది." అని వానరజాతియంతయూ ఈడుపడిన నేత్రసౌందర్యము తలచుకొని భాధపడిపోతుంది. నాకూతురు.

ఎంగనే తరిక్కేనున్నై విట్టెన్నుం నిన్ను విడచి ఏతాగున బ్రతుకగలను అంటుంది. పరమపద నాథుని ప్రేమించినాను గనుకనా అది వేరే దేశము అదినాకు సాధ్యపడదు. అని వూరడిల్లుటకు- అవతారములు ప్రేమించాను గనుకనా! రామకృష్ణాద్యవతారములలో వున్నసహు కాలీకులకేగాని నాకీప్రాప్తముతేదని ఊరడిల్లుటకు ఆకారణలేమి లేకుండా "పిన్నానార్ వణాంగుం శోది" అన్నట్లు తర్వాత వారికి కూడా లభ్యమయ్యేలాగున ఉభయకావేరి మధ్యలో అర్చారూపముతో మమ్ములను రక్షించుటకు దీక్ష వహించిన నిన్ను విడచి ఎటులజీవించగలనయ్యా అంటుంది.

"ఇరవినిలమ్ కై తుళావిరుక్కుం" తనుమూర్చన్నచోటు నంతా పిచ్చపట్టిన దాని మాదిరిగా తడుముకుంటూన్నది. అని ఈమూడు పాదములలో వీరికి సర్వేశ్వరునియందు వుండే భక్తి స్వరూపమును చెప్పి చివరి నాల్గవ పాదములో ఈభక్తి ఉపాయభక్తికాదు. ఉపాయము నీకటాక్షమేననే భావన తెలియచేస్తున్నారు.

"శెంగయల్ పా నీర్ తిరువరంగత్తాయ్ ఇవళ్ తిరత్తు ఎన్ శెయ్గిన్నాయ్" అని తోటలలో జలసమృద్ధి వుండుటచేత మత్స్యములన్నీ బలము. సంతోషముతో ఆనీటిలో తుళ్లుతున్నాయి. అటువంటి జలసమృద్ధిగల్గిన తోటలచే చుట్టబడిన క్షేమహారమయిన శ్రీరంగమునందు పవ్వళించిన రంగనాథా ఈమెవిషయములో ఏమిచేయదలచుకున్నావు, రక్షించదలచుకున్నావా? లేక యింకా ఈప్రకృతిలోనే వుంచదలచుకున్నావా? అనిభావము-

ఇంతకు ఈపాసురమువల్ల మనకి తెలిసే దేమిటంటే అంతే మొదటిమూడు పాదములలో చెప్పిన భక్తి ఉపాయము క్రిందకు తీసుకొంటే వాడు పరమపదనాధుడే అవుగాక నిత్యసూరి నిర్వాహకుడేఅవుగాక వీరి చింతచెట్టు తోట దగ్గరకు వీరున్నచోటికి సర్వయాగములలో మంత్రశక్తి సర్వములన్ని అగ్నికుండములో పడినటుల వాడు వచ్చి దర్శనమిచ్చి తీరాలి. అంతటిభక్తి క్షేమలు వీరిది గాని రక్షణ విషయములో వానిదయా కటాక్షమే వుపాయము గాని ఈజీవుడు చేసిన భక్తి కాదు. అని శ్రీగీతాచార్యులు 'మామ్' చెప్పాక 'ఏకం'లో చెప్పినఅర్థాన్ని ఈపాసురము ద్వారా ఆళ్వార్లు మనకి తెలుపుచు చేస్తున్నారు. సాధారణముగా లోకములో రామాకృష్ణా అనుకొండీ పుణ్యము వస్తుందని హరికథలవి వింటూ దివ్యదేశయాత్రలవి చేస్తూవుంటే పాపముపోయి పుణ్యములభిస్తుందని వాడుకగదా, సాధారణ జనమంతా ఆ అభిప్రాయములతోటే భజనలు చేసినా యాత్రలు తీర్థములకు వెళ్ళినా, కానివీరు అందులో స్వార్థత వున్నవి. భగవానుని

భగవదనుభవమును విడచివుండలేని స్థితిలోకి రావాలి. మనముఅన్న మెందులకుతింటున్నాము తిననిదివుండలేము గనుక ఆవిధముగనే తేనె పాల్ అముతు,తి త్తిక్కుమ్,తిరునామమ్ అని తేనెపాలు కలకండమాదిగా వుంటుంది నాకు భగవన్నామము విడచివుండలేను. ఉణ్ణుం శోర్ పరగునీర్ తిణ్ణుమ్ వెత్తిలై యుమ్ఎల్లాంకణ్ణన్ ఎంబెరుమాన్ అన్నస్థితిలోనికి రావాలి. తినేఅన్నము తాగేనీరు వేసుకొనే తాంబూలము అంతా నాకు శ్రీకృష్ణ పరమాత్మయే అన్నస్థితి-కి —వాలి. గాన మన పాపాలు పోవుటకు భగవన్నామము చేస్తున్నామనే స్థితి దాటిపోవాలి.

స్వార్థహితమైన ప్రేమ భగవానుని యందుండాలి అనే స్వార్థత్యాగముతో కూడిన భక్తియే శ్రేష్ఠము. అనేసంగతి ఈపాశురము ద్వారా తెలియచేసినారు, ఆళ్వార్లు శ్రీవిశిష్టాద్వైత మతమునకు ప్రదానమీపాశురము.

రామా కృష్ణా అని పూరికే నోటితో వుచ్ఛరించేదానికే విలువ కట్టుతారే అటువంటిది. భగవానునికొరకు రాత్రింబగళ్లు పరితపించి దుఃఖపడేస్థితిలోకివచ్చినా అదంతా సత్తాధారకమే గాని రక్షణకు గాదు. రక్షణకు వాని కటాక్షమే కారణమనే త్యాగము స్వార్థ త్యాగము ఈ పాశురములో నిండివున్నది. ఇంతటిస్వార్థత్యాగముతో కూడిన సాంప్రదాయకము గనుగనే! మన విశిష్టాద్వైత ప్రచారక సంఘమువారు ఈగొప్పసిద్ధాంతము అందరు తెలుసుకొని ఆనందపడి వుజ్జీవించాలనే వుద్దేశముతో వూరువూరు వాడవాడలా తిరిగి సభ లేర్పరచి జనులందరిని పోగుచేశి స్వార్థ త్యాగులై కష్టనష్టముల కోర్చి ప్రచారము చేస్తున్నారు. మనమంతా వారి వుద్యమమునకు ప్రోత్సాహమిస్తూఈవిశిష్టాద్వైత మత ప్రచారములో వుండే విశిష్టతనుగ్రహించి తరించెదము గాక.

---

## భగవత్కైంకర్యమా !

అనంతాళ్వాను భగవత్కైంకర్య నిష్ఠాగరిష్ఠు లొకరు తిరుమలైయందు నందనవనమునొక దానిని నిర్మించి తిరువేంగడముడయానుకు నిరంతర పుష్పకైంకర్యపరులై యుండిరి.

మొదట శైవుడై యుండి సుకృతవశమున తొండనూర్ నంబిచే దిద్దబడి శ్రీవైష్ణవుడైన నొక మహాశయుడు తిరుమలకేగి యచ్చట మన యనంతాళ్వారుని సేవించి వారచ్చట పువ్వుల మొక్కల నొకచోట నుండి కికి మరియొకచోట నాటగ నారసి'స్వామీ! అనంతాళ్వానే! మీరు దయార్ద్రహృదయులనియు భాగవత పరతంత్రులనియు వింటినే ఇప్పుడేమి యింత ఘాతుకులైతిరి. శ్రియఃపతి పరమపదమును వీడి భూమండలవాసుల నుజ్జీవింపచేయ సంకల్పముతో వెంకటాద్రికి వేంచేసియుండ వారి దుస్సహవిశ్లేష వ్యసనము మెడబట్టి త్రోయ శ్రీ వెంకటాద్రినే నిత్యవాసముగా గల్పించుకొని వృక్షరూపమున నివసించు నిత్యసూరి నివహము నొకచోట నుండనీయక మీరేల మెడపిసికి కికి పెల్లగించి బాధింతురు? మీకు పుణ్యమే యపేక్షితమగునేని నేను నాయాచార్యులగు తొండనూర్ నంబి తిరుమాళిగ (యింటి)లో ప్రతినిత్యము తదీయారాధన మైనపిమ్మట స్వామి లారగించి విడిచిన యాకులనెత్తి పారవైచి శుద్ధిచేయుచుందును. ఆసుకృతమందలి నాల్గవవంతును మీకు నేను సమర్పింతును. కావున నాయందు దయయుంచి మీరీ పుష్పవృక్షముల బాధించుటకు విరమించరా యని ప్రార్థించిరి.

# ఆచార్య విశ్వాస బలము

శ్రీమతి మరంగంటి రంగనాయకమ్మగారు కోరుకొండ.

'యాదృశీ భావనా యత్ర సిద్ధి ర్భవతి తాదృశీ'' ఏ వస్తువునందెట్టి నిశ్చలభావన యుండునో ఆ వస్తువట్టి ఫలితమునే యిచ్చును.)

ఒకనాడు నంబిళ్ళ తమ యంతరంగ శిష్య వర్గముతో తిరువెళ్ళరై నాచ్చియారును సేవించి తిరిగి శ్రీరంగమునకు వేంచేయునప్పుడు కావేరీ నది పొంగి పొరలజొచ్చెను. అప్పుడు వారందరు నొకదోనె నెక్కి నదీమధ్యమున కేగు సరికి సూర్యాస్తమయమై నలుగడల చీకటి యలవి కొనుటయే గాక పెద్దవర్షము కురియ సాగెను. ముందున కడుగుసాగుటయే దుర్భరమాయెను. దిక్కులు తోచుటలేదు. దోనెయు మునుగ నారంభించెను. హాహారవములు చెలరేగెను. అంత నా దోనె నడుపువాడు దోనెయందున్న వారిలో నొక్కరైనను దిగనిచో నంబిళ్ళ మొదలగు పెద్దలతో నందరును నదీగర్భమున స్థాయిగ విశ్రమించుట తథ్యమని చెప్పివేసెను. కాని యిట్టి సాహసమెవరికి? అందరకును ప్రాణములు తీపియే గదా! ఇక నేమున్నది? అంతపని కానున్నది. ఈ యుపద్రవమును గాంచి యొక సాత్విక వృద్ధ భక్తురా లొకతె "నాయనా? నాకు నూరేళ్ళు నిండినవి. నావలననెవ్వరికి నీషన్మాత్రమైన నుపకారము సున్న. నా నంబిళ్ళ బ్రతికిన పెక్కురుజీవింతురు. గాన నే నిదే నదిలో దిగుచున్నాను. నాతండ్రిని భద్రముగ దరిజేర్చు నాయనా! యని 'నంబిళ్ళ తిరువడిగళే శరణ మ' నుచు తటాలున నీట నురికెను. అందరు నాశ్చర్యచకితులై సిగ్గిలిరి. దోనె తేలినది. అందరును సురక్షితముగా నొడ్డు చేరిరి. కాని నంబిళ్ళగారి మనస్సామె సాహసకృత్యముచే పుండుపడెను. అయ్యో! నా నిమిత్త మా యిల్లాలెంత సాహసకృత్య మొనరించి తనువు చాలించెనో యని పరిపరి విధముల విలపింప దొడంగిరి.

ఇంతలో నాయమ్మ దూరమునుండియే పిరి మాటలను విని "ఆచార్యా! నేను చావలేదు. నాకొరకు వ్యాకులపడకుడు. నేను నదిలోని కురికినతోడనే సమీపమున నాకొక దిబ్బదొరికినది. దాని నవలంబించి నిలిచియున్నానని కేక వైచెను. అదివిని యందరు నాశ్చర్యపడిరి. వెంటనే నంబిళ్ళగారు దోనె నచట కంపిరి. నామె భద్రముగా నాచార్యుల చెంతజేరి వారిని సేవించి నిలిచెను.

నీ వెట్లు బ్రతికితివని వారడుగ నామె యిట్లుత్తరమొసంగెను.

"స్వామీ! తమ పాదారవిందములనే డెంద నిడుకొని నదియందు పడి కొట్టుకొని పోవుచుండగ వెంటనే తమ రచ్చట నొక మెరకదిబ్బగా వేంచేసి నన్ను రక్షించితిరి గాదా! యని యనుగగా నంబిళ్ళయు "అమ్మా! నీవిశ్వాస మట్లుండ అది యట్లు గాకుండునెట్లు? "యాదృశీ భావనా యత్ర సిద్ధి ర్భవతి తాదృశీ'' యని సాధించిరి.



ఓం

శ్రీరస్తు

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ

# నియమావళి

రిజిష్టర్డు 1951-వ సంవత్సరం



—: కేంద్ర కార్యాలయము :—

"గీతా మందిరము"

107, వరదాముత్తియప్పన్ వీధి, మదరాసు -

సత్యంవద　　అహింసా పరమోధర్మః　　ధర్మం చర

# శ్రీయతిరాజసేవామహిళామండలి

## శ్రీవిశిష్టాద్వైతప్రచారకసంఘస్త్రీశాఖ

(రిజిష్టర్డు)

## శాశ్వతభవననిధి.

107, వరదాముత్త్రియప్పన్ వీధి మదరాసు-1

గీతామందిరము.

తిరువారాధన

సమిష్టిపారాయణ

శిశుపోషణ-సంరక్షణ

పాఠశాల

కైంకర్యపరుల తిరునామములు:

---

విరాళము రూ. ...........

కాలక్షేపము | భజన | గ్రంథాలయము | అనుష్ఠానము | చేతిపనులు

శ్రీ విశిష్టాద్వైత సిద్ధాంత ప్రచారమునకై శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ స్త్రీ శాఖయగు శ్రీ యతిరాజసేవా మహిళా మండలి మదరాసు శాఖ వారిచే "గీతామందిర భవనము"ది 5-3-1951 తేదీని కొని స్వాధీనపరచుకొన బడినది.

| | |
|---|---|
| ఈ భవనము ఖరీదు | రూ. 30,000-0-0 |
| రిజిష్ట్రేషన్‌కు, రిపేర్లకు వగైరా చిల్లర ఖర్చులకు | రూ. 10,000-0-0 |
| మొత్తము | రూ. 40,000-0-0 |

ఇందు యిప్పటికి సుమారు రూ. 20,000-0-0 మాత్రము దాతలవలన విరాళముగా ఇవ్వబడినది. ఇంకను రూ. 20,000-0-0 కావలసి యున్నది.

ఇదియు గాక మిద్దెమీద కాలక్షేపమునకై రెండు పెద్ద హాల్సు కట్టవలసి యున్నది. ఒక్కొక్క హాలుకు సుమారు ఎనిమిదిదేసివేల రూప్యము లగునని అంచనా వేయబడినది.

ఈ పత్రమున సూచింపబడిన కార్యక్రమములన్నియు ఈ భవనమున జరుగవలసి యున్నవి. వీ టన్నింటికిన్ని విరివిగ సొమ్ము కావలసియున్నది.

గాన దాతలు ఈ సదుద్యమమునకు తోడ్పడి స్వహస్త పరహస్తముల ద్వారా విరివిగ విరాళముల నిచ్చి సహాయ పడవలసినదిగ సవినయముగ ప్రార్థించు చున్నారము.

ఇట్లు,

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము

శ్రీ

శ్రీమతేరామానుజాయనమః

# శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము యొక్క

# మెమొరండము ఆఫ్ అసోషియేషను

I. ఈ సంఘము యొక్క పేరు:— ఈ సంఘము "శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము" అని పిలువబడును.

II. ఈ సంఘము యొక్క కార్యాలయము మదరాసు రాజధానిలో యుండును.

III. ఈ సంఘము యొక్క ఆదర్శము:— విశ్వమానవకల్యాణము; విశ్వమానవసౌభ్రాతృత్వము; ఇక మత్యము; అభ్యుదయము, నిస్స్వార్థసేవ; ఆధ్యాత్మికాభ్యున్నతి; ఆస్తిక్యత.

IV. ఈ సంఘము యొక్క ఆచరణము:— సవినయనిస్స్వార్థసేవ; త్యాగము; జీవకారుణ్యము; పవిత్రత; పూజ్యత; సర్వమతసహనము; సహకారము; సమన్వయము; స్వస్వవర్ణాశ్రమ ప్రయుక్త ధర్మ నిర్వహణము; రాజకీయకార్యక్రమ రహిత ఆధ్యాత్మికాభివృద్ధికర కార్యాచరణము; మనోవాక్కాయ కర్మత; ఏకరూప ప్రవర్తనము.

V. ఈ సంఘము యొక్క కార్యక్రమము:— ౧. సభలలోను, సాంఘికాది సమావేశములలోను భగవద్భాగవత ఉత్సవాదులలోను, పాఠశాలలోను అవకాశ అవసరముల ననుసరించి పండితులగు శ్రీ పురుషులచే వేదాంతోపన్యాసముల నిప్పించుట.

౨. శిష్యసంచారముగలవారు, మఠాధిపతులు, దేవాలయసంబంధులు, ఉపాధ్యాయులు మున్నగువారిద్వారా వేదాంత ప్రచారము విరివిగా జరుగునటుల ప్రోత్సహించుట, అట్టివారికి యథావకాశము తోడ్పడుచుండుట.

౩. స్థిరమైనట్టియు, తాత్కాలికమైనట్టియు, సంచారికమైనట్టియు ప్రాచ్యవిద్య ఆధ్యాత్మికవేదాంత పాఠశాలలను, గ్రంథాలయములను నేర్పరచి నడుపుట, ఇదివరలో ఉన్నవాటికి తోడ్పడుట, జీర్ణమైనవాటిని పునరుద్ధరించుట.

౪. పండిత పరిషత్తులు, విద్యార్థిసన్నివేశములు, సభలు, ప్రదర్శనములు జరుపుచుండుట, పరీక్షలజరిపి బిరుదములు, ధృవపత్రములు, బహుమతుల నిచ్చుచుండుట.

౫. నూతన స్వతంత్ర అనువాద గ్రంథములను వ్యాఖ్యానములను టీకలను వ్రాయించుట, ప్రచురించుట అవసరమైన పూర్వగ్రంథములను తిరిగి ముద్రింపించుట, అముద్రితగ్రంథముల సేకరించి ప్రచురించుట, గ్రంథవిమర్శనాదుల చేయించి ప్రచురించుట.

౬. సాంప్రదాయగ్రంథ కాలక్షేపములు, పురాణపఠనములు, హరికథాకాలక్షేపములు, ఉత్సవములు, వేడుకలు, రేడియోప్రసంగములు, గ్రామఫోను రికార్డులు, భజనలు, నాటకములు, సినీమాప్రదర్శనములు మున్నగువానిద్వారా జ్ఞాన-భక్తి-వైరాగ్యముల ప్రచారము చేయుట.

౭. వివిధములైన దైనిక, వార, పక్ష, మాసాదిపత్రికలు, కరపత్రములు, నివేదికలు ప్రచురించుచుండుట.

౮. దేవాలయముల నిర్మించుట, ఉన్నవాటియొక్క సక్రమనిర్వహణకై తోడ్పడుట, జీర్ణోద్ధారణచేయుట.

౯. యతిరాజాశ్రమములు, రామానుజకూటములు, శఠకోపశిబిరములు, పరకాలమఠములు, కాలక్షేపకూటములు, వసతిగృహములు, సేవాసంఘములు, శాంతికుటీరములు, విశ్రాంతిశాలలు, ఆశ్రమములు మున్నగునవి స్థాపించుట, పాలించుట, ఇదివరలో యున్నవాటి సక్రమపరిపాలనకై తోడ్పడుట, జీర్ణోద్ధారణచేయుట.

౧౦. ఈ సంఘీయులయొక్క పురోభివృద్ధికిన్ని, జీవనోపాధికిన్ని, ఆధ్యాత్మికాభివృద్ధికిన్ని ఉపయోగించునట్టి స్వరూపానురూపములైన వృత్తులను, విద్యలను ఏర్పాటుచేసి పనిచేయుట.

౧౧. ఈ సంఘాభివృద్ధి కుపయోగించు అన్నివిధములైన యితర కార్యక్రమముల నవలంబించి పనిచేయుట.

VI. ఈ క్రింద తెలుపబడిన మహాశయులను ఈ సంఘమునకు కార్యనిర్వాహకవర్గముగ ఎన్నుకోవడమైనది.

## అధ్యక్షులు

శ్రీ. ఉ. వే శ్రీమాన్ పరాశర సుదర్శనభట్టరు అయ్యవార్లంగారు, కోరుకొండ, (వయా) రాజమహేంద్రవరము, తూ. గోదావరిజిల్లా.

## ఉపాధ్యక్షులు

" " అద్దంకి తిరుమల సమయోద్దండ కోలాహల లక్ష్మీనృసింహ కుమార తిరువేంకట తాత దేశికాచార్యులు అయ్యవార్లంగారు, చీరాల, గుంటూరుజిల్లా.

" " వడామూరి శఠగోపాచార్యులు అయ్యవార్లంగారు, నూజివీడు, కృష్ణాజిల్లా.

" " రావుబహద్దూరు వేమూరి రంగనాథం శ్రేష్ఠిగారు, ధర్మకర్తలు శ్రీపార్థసారథి దేవస్థానము, 7, దక్షిణమాడవీధి, తిరువళ్లిక్కేణి, మదరాసు.

## ప్రధానకార్యదర్శి

" " తె. కం. గోపాలాచార్యులుగారు, కోరుకొండ, (వయా) రాజమహేంద్రవరము, తూ. గో. జి.

## సహాయకార్యదర్శి మరియు కోశాధికారి

" " ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులుగారు, అర్తమూరు, (వయా) ద్వారపూడి, తూ. గో. జి.

## కార్యనిర్వాహక సభ్యులు

" " కొమాండూరి యతిరాయవిల్లి వెంకటాచార్యులుగారు, కాళ్లకూరు, (వయా) భీమవరము, పశ్చిమగోదావరిజిల్లా.

" " పండితచక్రవర్తి శ్రీనివాసరంగాచార్యులుగారు, 29, పెరుమాళ్ మొదలివీధి, మదరాసు 1.

" " కాంతలూరి వెంకటాచార్యులుగారు, చిన్నగోపురంవీధి, పాలకొల్లు, పశ్చిమగోదావరిజిల్లా.

" " కవిరత్నగుదిమెళ్ల రామానుజాచార్యులుగారు, ముక్తిపల్లి, కూచనపూడి పోస్టు, గుంటూరు జి.

" " మొలుగు రామానుజాచార్యులుగారు, ఉగ్గుళ్ళ, పిప్పరపోస్టు, పశ్చిమగోదావరిజిల్లా.

" " నందూరి అప్పలాచార్యులుగారు, సింహాచలము, విశాఖపట్టణముజిల్లా.

" " కో. కం. రంగాచార్యులుగారు, రామన్నపేట, వరంగల్లు నైజాం.

" " తిరుమలపురిపల్ల ధర్మాచార్యులుగారు, ఏడిద, (వయా) మండపేట, తూర్పుగోదావరిజిల్లా.

" " కందాళ పెదఅప్పలాచార్యులుగారు, శ్రీరామతీర్థము. (వయా) నెల్లిమర, విశాఖజిల్లా.

" " మట్టపల్లి రంగనాథయ్యగారు, 5/7, రెడ్డిరామన్నవీధి, మదరాసు-1.

" " దాన శేషుగారు, దానకుటీరం, అంగలకుదురు, గుంటూరుజిల్లా.

" " చి మా. వెంకటరాఘవాచార్యులుగారు, గద్వాలబంగళా, నాంపల్లి రోడ్డు, హైదరాబాదు.

" " శ్రీ సీతారామయతీంద్రులవారు, శ్రీకృష్ణాశ్రమము, పెదముత్తేవి, కృష్ణాజిల్లా.

" " వడామూరి గోపాలకృష్ణమాచార్యులుగారు, మంగళంపాడు. (వయా) సూళ్లూరుపేట. నెల్లూరు జి.

" " పాతాళం వీరరాఘవులు శ్రేష్ఠిగారు, అర్కకేటు, ఆదియప్పనాయకన్‌వీధి, మదరాసు-1.

" " బోయిన సీతారామయ్యగారు బేతవోలు, (వయా) గుడివాడ. కృష్ణాజిల్లా.

" " కిలపెగుంట శేషాచార్యులుగారు, తణుకు, పశ్చిమగోదావరిజిల్లా.

" " ఈయుణ్ణి రామచాచార్యులుగారు, శ్రీయతిరాజాశ్రమము, నరసాపురము, పశ్చిమగోదావరిజిల్లా.

" " కిరాళపాటి రాధాకృష్ణయ్యగారు. 147, అణ్ణాపిళ్లైవీధి, మదరాసు 1.

" " తె. కం. వరహస్వామిగారు, కోరుకొండ, (వయా) రాజమహేంద్రవరం.

శ్రీ

# శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము యొక్క

# ఆర్టికల్సు ఆఫ్ అసోసియేషను.

## రూల్సు అండు రెగ్యులేషన్సు

1. ఈ సంఘము యొక్క పేరు:— ఈ సంఘము "శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము అని పిలువబడును.

2. ఈ సంఘము యొక్క ఆదర్శము:— విశ్వమానవ కల్యాణము, విశ్వమానవ సౌభ్రాతృత్వము, ఐకమత్యము, అభ్యుదయము, నిస్వార్థసేవ, ఆధ్యాత్మికాభ్యున్నతి, ఆస్తిక్యత.

3. ఈ సంఘము యొక్క ఆచరణము:— సవినయనిస్వార్థసేవ, త్యాగము, జీవ కారుణ్యము, పవిత్రత, పూజ్యత, సర్వమతసహనము, సహకారము, సమన్వయము, స్వస్వవర్ణాశ్రమ ప్రయుక్త ధర్మ నిర్వహణము,రాజకీయ కార్యక్రమ రహిత ఆధ్యాత్మికాభివృద్ధికర కార్యాచరణము, మనోవాక్కాయ కర్మలచే ఏకరూప ప్రవర్తనము.

4. ఈ సంఘము యొక్క విశ్వాసము:— ౧. చిదచిద్విశిష్టాద్వైతుడైన శ్రీమన్నారాయణుడే పరతత్త్వము.

   ౨. కర్మ-జ్ఞానాంగక భక్తి-ప్రపత్తులచే ప్రసన్నుడైన శ్రీమన్నారాయణుడే ఉపాయము.

   ౩. అప్రాకృతదేశవిశిష్టుడైన శ్రీమన్నారాయణుడే పరమప్రాప్యుడు.

5. ఈ సంఘమునకు ప్రమాణము:— సత్త్వగుణప్రధానమైన శ్రుతి-స్మృతి-సూత్ర-ఆగమ-ఇతిహాస-పురాణ-శిష్టాచార సాంప్రదాయములు.

6. ఈ సంఘము యొక్క సభ్యత్వము అర్హతము:—ఇందు సభ్యత్వము సాధారణమనియు, శాశ్వతమనియు, రెండు తరగతులుగ యుండును,

## సాధారణసభ్యత్వము

సంవత్సరము ఒక్కంటికి రూ 1-4-0 ను చెల్లించువారు సామాన్యసభ్యులు
సంవత్సరము ఒక్కంటికి రూ 3-4-0 ను చెల్లించువారు సహాయసభ్యులు
సంవత్సరము ఒక్కంటికి రూ 5-4-0 ను చెల్లించువారు నిర్వాహకసభ్యులు
సంవత్సరము ఒక్కంటికి రూ 10-0-0 ను చెల్లించువారు పోషకసభ్యులు
సంవత్సరము ఒక్కంటికి రూ 25-0-0 నుచెల్లించువారు మహాపోషకసభ్యులు
సంవత్సరము ఒక్కంటికి రూ 50-0-0 ను చెల్లించువారు రాజపోషకసభ్యులు
సంవత్సరము ఒక్కంటికి రూ 100-0-0 ను చెల్లించువారు మహారాజ పోషకసభ్యులు; అని ఎన్నబడుదురు.

వీరి సభ్యత్వము సంవత్సరములో ఎపుడు చేరినను కూడ ఆ సంవత్సర ఫాల్గుణ బ 30 నాటితో సమాప్తి యగును. సభ్యత్వము సమాప్తి అయినవారు తిర్గి సభ్యత్వచందాను చెల్లించి అందులకై నిర్ణయించబడిన రశీదును పొందు వరకు తిర్గి ఈ సంఘమున సభ్యులుగ పరిగణించబడరు.

## శాశ్వతసభ్యత్వము

ఒకే పర్యాయము రూ 250/ను చెల్లించువారు శాశ్వత సభ్యులగను
ఒకే పర్యాయము రూ 500/ను చెల్లించువారు శాశ్వత సహాయకులగను
ఒకే పర్యాయము రూ 1000/-ను చెల్లించువారు శాశ్వత నిర్వాహకులగను
ఒకే పర్యాయము రూ 2500/-ను చెల్లించువారు శాశ్వత పోషకులగను
ఒకే పర్యాయము రూ 5000/-ను చెల్లించువారు శాశ్వత మహారాజ పోషకులగను
ఒకే పర్యాయము రూ 10000/-ను చెల్లించువారు శాశ్వత రాజపోషకులగను
ఒకే పర్యాయము రూ 11116/-ను చెల్లించువారు శాశ్వత మహారాజ పోషకులగను ఎన్నబడుదురు.

వీరి సభ్యత్వము వీరి జీవితాంతమువరకు యుండును. ('ఠ' నియమములోని "ఈ" శీర్షికగల నియమమునకు లోబడి )

6. ఆ. సభ్యుల విధులు:— ౧. ఇతరులను సభ్యులుగ చేర ప్రోత్సహించుట.

౨. తమ తమ ప్రాంతములలో ఈసంఘ వ్యాప్తికై పాటుబడుట; ఈ సంఘసభలలోను, ఉత్సవములలోను వేడుకలలోను యథావకాశము పాల్గొను చుండుట.

౩. శుభా శుభకార్యములయందు ఈ సంఘమునకై ప్రత్యేక కట్నములు, బహుమతులు; సంభావనాదికముల తా మొసంగు చుండుట, యితరుల వల్ల వసూలు చేయుచుండుట.

౪. ఈ సంఘముద్వారా ప్రచురించబడు పత్రికలు పుస్తకములు, వగయిరాలకు తగినంత ప్రోత్సాహ మిచ్చు చుండుట.

౫. ఈ సంఘప్రాంతీయ పాఠశాలలకున్ను, ప్రచార సంస్థలకున్ను యథాశక్తి తోడ్పడుచుండుట.

౬. ఈ సంఘమునకు తమకు వీలగు ఆర్థికావకాశముల కల్పించుట.

౭. అధికార సంఘ నియమముల నాదరించి నిర్వహించుట.

౮. ఈ సంఘ ప్రచారార్థమై జరుపబడు కార్యక్రమము లన్నింటియందు యథాశక్తి పాల్గొని నిర్వహించు చుండుట.

౯. తమ తమ వర్ణాశ్రమ ధర్మముల ననుసరించి సంధ్యావందనము, దేవతార్చనము, అతిథి అభ్యాగతి సత్కార పూజలు, సత్కథాశ్రవణము, భగవద్భజనము, సత్సహవాసము, ఏకాదశి ఉపవాసము, పెద్దల సేవా శుశ్రూషాములు, భగవద్భాగవతాచార్య జయంతులు, తిరునక్షత్రోత్సవములు యథాశక్తి సలుపుచుండుట.

౧౦. అన్ని విషయముల త్రికరణాత్మనా ఆదర్శమైనట్టియు, పవిత్రమైనట్టియు అహింస-నీతి-ధర్మయుతమైనట్టియు, జీవితమును గడుపుచుండుట.

6. ఇ. ఈ సంఘము యొక్క కార్యాలయము:— సంఘకార్యదర్శి యుండు స్థలమునగాని, వారి కనువగు స్థలమునగాని సంఘకార్యాలయ ముండును, ప్రస్తుత మీ సంఘకార్యాలయము "147, అణ్ణాపిళ్ళె వీధి, మదరాసు-1."

7. అ. ఆర్థికము:— చందాలు, విరాళములు, ప్రతిసభ్యునియింట జరుగు శుభాశుభముల సమయముల యందీయబడిన బహుమతులు, కట్నములు, సభలు, సమావేశములు, ఉత్సవములు మున్నగు వాటియందీయబడిన ప్రత్యేక ఉమ్మడి విరాళములు, ఆయా ప్రత్యేక కార్యక్రమములకై ఏర్పడిన ఆహ్వానసంఘములు ఆయకార్యములు పూర్తిజేసిన పిమ్మట మిగిలిన నిల్వధనములు కేంద్రసంఘమునకే చెందవలెను.

ఆ. ప్రత్యేక విధులకై నిర్దేశించి దాతలవలన నీయబడు సొమ్ములు ఎవ్వరి కీయబడినను అవి యన్నియు కేంద్ర సంఘముయొక్క అధికార పర్యవేక్షణ సలహా సూచనల ప్రకారము ఆయా ప్రత్యేక విధులకై మాత్రమే వినియోగింప బడవలయును.

ఇ. ఈ సంఘము యొక్క ధనము యావత్తు ప్రభుత్వముచే అంగీకరింపబడిన బ్యాంకులలో కోశాధికారి లేక కార్యదర్శుల పేర నిల్వ చేయబడవలయును. అవసరమునకు మించిన ధనమును ఏవ్యక్తిపద్దను నిల్వ యుంచరాదు.

ఈ. సంఘము యొక్క కార్యక్రమము:— ౧. సభలలోను, సాంఘికాది సమావేశములలోను, భగవత్-భాగవత-ఉత్సవాదులలోను, పాఠశాలలోను అవకాశ అవసరముల ననుసరించి పండితులగు శ్రీ.పురుషాదులచే వేదాంతోపన్యాసముల నిప్పించుట.

౨. శిష్యసంచారము గలవారు, మఠాధిపతులు, దేవాలయ సంబంధులు, ఉపాధ్యాయులు మున్నగు వారి ద్వారా వేదాంత ప్రచారము విరివిగా జరుగునటుల ప్రోత్సహించుట, అట్టివారికి యథావకాశము తోడ్పడు చుండుట.

౩. స్థిరమైనట్టియు, తాత్కాలికమైనట్టియు, సాంచారికమైనట్టియు, ప్రాచ్యవిద్య-ఆధ్యాత్మిక వేదాంత పాఠశాలను, గ్రంథాలయములను నేర్పరచి నడుపుట, ఇదివరలో ఉన్నవాటికి తోడ్పడుట, జీర్ణమైన వాటిని పునరుద్ధరించుట.

౪. పండిత పరిషత్తులు, విద్యార్థి సన్నివేశములు సభలు, ప్రదర్శనములు జరుపుచుండుట, పరీక్షలు జరిపి బిరుదముల, ధృవపత్రముల, బహుమతుల నిచ్చుచుండుట.

౫. నూతన స్వతంత్ర - అనువాద గ్రంథములను - వ్యాఖ్యానములను - టీకలను-వ్రాయించుట - ప్రచురించుట, అవసరమైన పూర్వగ్రంథముల తిర్గి ముద్రింపించుట, అముద్రిత గ్రంథముల సేకరించి ప్రచురించుట, గ్రంథవిమర్శనాదుల చేయించి ప్రచురించుట.

౬. సాంప్రదాయ గ్రంథ కాలక్షేపములు, పురాణ పఠనములు, హరికథా కాలక్షేపములు, ఉత్సవములు, వేడుకలు, రేడియో ప్రసంగములు, గ్రామఫోనురికార్డులు, భజనలు, నాటకములు, సినీమా ప్రదర్శనములు మున్నగువాని ద్వారా జ్ఞాన-భక్తి-వైరాగ్యముల ప్రచారము చేయుట.

౭. వివిధములైన దైనిక, వార, పక్ష, మాసాది పత్రికలు, కరపత్రములు, నివేదికలు ప్రచురించుచుండుట.

౮. దేవాలయముల నిర్మించుట, ఉన్నవాటియొక్క సక్రమ నిర్వహణకై తోడ్పడుట, జీర్ణోద్ధారణ చేయుట.

౯. యతిరాజాశ్రయములు, రామానుజకూటములు, శఠకోపశిబిరములు, పరకాలమఠములు, కాలక్షేపకూటములు, శాంతికుటీరములు, విశ్రాంతిశాలలు, ఆశ్రమములు, మున్నగునవి స్థాపించుట, పాలించుట, ఇదివరలో యున్నవాటి సక్రమపరిపాలనకై తోడ్పడుట, జీర్ణోద్ధారణ చేయుట.

౧౦. ఈ సాంఘీయుల యొక్క పురోభివృద్ధికిన్ని, జీవనోపాధికిన్ని, అధ్యాత్మికాభివృద్ధికిన్ని ఉపయోగించునట్టి స్వరూపాను రూపములైన వృత్తులను, విద్యలను ఏర్పాటుచేసి పనిచేయుట.

౮. సభ్యుల హక్కులు:— అ. ప్రతి సభ్యుడున్ను తమ గ్రామసంఘమును ఎన్నుకొనుటకున్ను, మహాజన సభాసమావేశమున పాల్గొని అందలి తీర్మానముల విషయమై తమ యభిప్రాయముల తెలుపుటకున్ను, ఒక్కొక్క "సమ్మతి సూచన"ను (ఓటును) కలిగి యుండును.

ఆ (1) సంవత్సరములో ఎపుడు సభ్యులుగ చేరినను ఆ సంవత్సర ఫాల్గుణ బహుళ ౩౦ వరకు మాత్రమే సభ్యత్వాధికారమును కలిగియుండురు.

(?) సంచాలక సమితి, పండిత పరిషత్తులోని సభ్యులు మాత్రము వానిలో సభ్యత్వము కలిగియున్నంత వరకు సాంవత్సరికచందా కట్టనవసరము లేకుండగనే ఈ సంఘ సభ్యత్వాధికారమును కలిగియుందురు.

ఇ. ఈ సంఘ కార్యకారిణీ సమితివారు ఎవరినైనను తగినంత కారణమున్నచో ఆకారణమును తెలుపకుండగనే ఈ సంఘమున సభ్యునిగ చేర్చుకొన నిరాకరించవచ్చును.

ఈ. తాను స్వయముగ గాని, పరోక్షముగ గాని ఈ సంఘమునకు ఏవిధముగ నష్టముగాని, కళంకముగాని కలిగించిన ఏతరగతి సభ్యునైనను వారి సభ్యత్వమును ఈ కార్యకారిణీ సమితి తొలగించవచ్చును.

9. కార్యనిర్వహణము:— ఈసంఘముయొక్క కార్యనిర్వహణము ఈ క్రింది విధముగ నిర్వహించబడును.

1. గ్రామ సంఘములు, 2. సంచాలక సమితి, 3. మహాసంఘ కార్యకారిణీ సమితి = కేంద్రసంఘము, = కార్యకారిణీ సమితి (సమానార్థములు). 4 మహాజనసభ = కేంద్రసభ = వార్షిక సమావేశము = విరాట్ సమావేశము, (సమానార్థము) 5 ఆహ్వానసంఘము, 6. ఉపసమితులు, 7. పండిత పరిషత్తు. 8. సంబద్ధ సంస్థలు, 9. శ్రీ యతిరాజ సేవా మహిళా మండలులు.

(1) పైన తెలిపిన వాటిలోని అధికారవర్గము వారందరు స్త్రీలు, పురుషులు కూడ అధికారవర్గములో యుండవచ్చును. తమయొక్క జీవితములో అత్యధిక కాలమును ఈ సంఘముయొక్క సర్వతోముఖాభివృద్ధికై వినియోగించి పాటుబడువారై యుండవలెను.

(2) శ్రీవిశిష్టాద్వైత సిద్ధాంతములను బాగుగా తెలిసిన వారై వాటిని తమశక్త్యానుసారముగ ఆచరణయందుంచువారై ఆచార్యప్రాయులై యుండవలెను.

(3) పంచ సంస్కారపరులై యుండవలెను. (పంచసంస్కారములు = శంఖచక్రతాపము-ఊర్ధ్వపుండ్రము-నామము-మంత్రము-యాగము.)

(4) దేశకాలానుగుణ్యముగ యీసంఘాభివృద్ధికి అనుకూలమగు వ్యవహార నిర్వహణ శక్తిసామర్ధ్యములు గలవారై యుండవలెను.

(5) అంటువ్యాధులులేని ఆరోగ్యవంతులై యుండవలెను.

(6) ఈ సంఘమునందు వరుసగ కనీసము మూడు సంవత్సరములు సభ్యులై యుండవలెను. (ప్రత్యేక పరిస్థితులలో కార్యకారిణీ సమితి ఈకాలపరిమితిని మార్చవచ్చును)

(7) అ. ఈ సంఘమునకు సంబంధించిన ఎన్నికలన్నియు చేతులెత్తుట మూలమునగాని, చీటినిచ్చుట ద్వారాగాని లేక ప్రత్యేక పరిస్థితులలో తమప్రతినిధుల పంపుటద్వారాగాని, లిఖితరూపముగగాని కార్యకారిణీ సమితి ఆదేశానుసారముగా జరుపబడవలెను.

ఆ. ఎన్నుకొనబడుట వలన వచ్చిన అధికారములుకూడ సంఘ సభ్యత్వముతోపాటు ఆ సంవత్సరఫాల్గుణ బ॥ అమావాస్య వరకు మాత్రమే యుండును.

ఇ. ప్రతిసమావేశమునందును హాజరైన వారిలో సగముకంటె అధికసంఖ్యాకుల సమ్మతుల ననుసరించి కార్యక్రమము నిర్ణయింపబడవలెను.

ఈ. ఇరుపక్షములయందు సమ్మతులు సమానముగ నుండునపుడు మాత్రమే ఆయా సమావేశాధ్యక్షుడు తన సమ్మతిని ఉపయోగించవలెను. ఇతర సమయముల యందెపుడును అధ్యక్షుడు తనసమ్మతి నుపయోగించకూడదు.

(8) ప్రతి సమావేశమునందును చర్చించబడు కార్యక్రమము ఆ యాసమావేశములకు సంబంధించిన సభ్యులకు తగినంత ముందుగ ఆయా కార్యదర్శులచే తెలియచేయబడవలెను.

(9) ప్రతి సమావేశమునకు సామాన్యముగ ఆసమావేశ సభ్యత్వ నిర్ణీత సంఖ్యలలో అయిదవ వంతు కోరముగ నుండును.

(10) ప్రతి సమావేశమును అధ్యక్షుని సూచనపై కార్యదర్శియే తేదీ ప్రదేశాదుల నిర్ణయించి ప్రకటించుచుండవలెను.

(11) కార్యకారిణీ సమితివారు యనుమతిలేకుండగ ఈసంఘమందలి ఏతరగతి సభ్యులుకూడ ఈ సంఘమునకు సంబంధించిన ఏపనినికూడ చేయరాదు.

(12) అన్ని ఏర్పాటులయందును, అంత్యనిర్ణయము నందును కార్యకారిణి సమితివారు సంపూర్ణాధికారమును కలిగి యుందురు.

(13) ఈ సంఘముయొక్క ఏసమితిగాని సభ్యులైననుసరియే ఆసమితియొక్కగాని, కార్యనిర్వాహక వర్గము యొక్కగాని నిర్ణీతసంఖ్యలో నాలింట మూడవవంతు సభ్యులచే విశ్వాస రాహిత్యతీర్మానము చేయబడినచో గాని, తామే రాజీనామానిచ్చి అది కార్యకారిణీసమితిచే అంగీకరించబడిన వెంటనేగాని, తమ యధికారమును, సంఘసభ్యత్వమును కోల్పోవును అట్టి యధికారము వెంటనే కార్యకారిణీ సమితికి సంక్రమించును కార్య కారిణీసమితిపై విశ్వాసరాహిత్య తీర్మానము చేయబడినచోగాని లేక అది రాజీనామా నిచ్చినపుడుగాని దాని యధికారములు సంచాలకసమితికి సంక్రమించును. ఈ రెండింటియొక్కయు ఖాళీసమయముల యందు ఈ సంఘ సాధారణసభ్యులే మహాజన సభను జరిపి ఖాళీస్థానముల కన్నిటికిని నూతన ఎన్నికలు జరుపుకొన వలెను.

10. గ్రామ సంఘము:— అ. సామాన్యముగా పదిమందికంటె తక్కువగాని సభ్యులుగల ప్రదేశమునందు గ్రామసంఘ మేర్పరచబడవలెను, ఈసంఖ్యా నిర్ణయ మార్పునకు కార్యకారిణీ సమితి యధికారము కలిగి యుండును.

ఆ. వీరిలో నొకయధ్యక్షుడు, ఒక కార్యదర్శియు, ముగ్గురు సభ్యులుగల గ్రామసంఘ కార్యనిర్వాహక వర్గమును ఆగ్రామ సభ్యులు ఎన్నుకొనవలెను. అవసరమున్నచో ఉపాధ్యక్షులను, సహాయ కార్యదర్శులను, కోశాధి కారిని ఎన్నుకొనవచ్చును.

ఇ. గ్రామకార్య నిర్వాహకవర్గము అవసరమైనప్పుడెల్లను సమావేశమగుచు మహాజన సభయొక్కయు, కార్య కారిణీ సమితివారియొక్కయు సూచనలు, సలహాలు, ఆదేశముల ననుసరించి తమ కార్యక్రమము నంతమ జరుపుకొనుచు నెలవారి నివేదికలను, జమ ఖర్చులను తెలుపుచుండవలెను.

ఈ. ఈవర్గమువారు సంఘముచే ప్రచురింపబడు పత్రికను నియతముగ తెప్పించి సభ్యులనందర నొకచో సమా వేశపరచి ఆపత్రికను చదివి వినుపించుట, సంఘప్రచురణల నన్నిటిని తమ పుస్తకభాండాగారమునకు తెప్పించి వాటిప్రాముఖ్యతను సభ్యులకు బోధించి ప్రతి సభ్యుడును ఒకపుస్తకమును కొని దాని ఉపయోగ మును పొందునట్లుచేయవలెను. మరియు తమ గ్రామమందున్న పండితులచేగాని, గ్రామాంతరములనుండి విచ్చేసిన పండితులచేగాని వేదాంత విషయక ఉపన్యాసముల నిప్పించుచుండవలెను. శుభకార్యములలో యజమానుల ప్రోత్సహించి సంఘమునకు విరివిగా ఆర్థిక సహాయమును పెంపొందించవలెను; సంఘాదేశ ములను సర్వజన విదితముల గావించవలెను.

ఉ. మహాజనసభా సమావేశమునకు ఒక నెలకుముందుగానే సంచాలక సమితివారు సూచించిన వారిలో నొకరిని రాబోవు సంవత్సరమునకు మహాజన సభాధ్యక్షులుగ గ్రామ సంఘముచే ఎన్నుకొనబడవలెను. గ్రామ సంఘ ములో హెచ్చువోటిచే సూచింప బడినవారే మహాజనసభాధ్యక్షులుగను తత్సమావేశానంతరము ఆ సంవ త్సరమంతయు ఈ సంఘమునకున్ను, కార్యకారిణీ సమితికిన్నీ అధ్యక్షులుగ నుందురు.

11. సంచాలక సమితి:— అ. (1) ఈ సంఘసభ్యత్వమును మూడు సంవత్సరములకు తక్కువ గాకుండా వరుసగా కలిగియుండి సంచాలక సమితి ప్రథమ సభ్యులచే కనీసమొక సంవత్సరము క్రమశిక్షణపొంది తమయొక్క జీవితకాలమునంతను ఈ సంఘాభివృద్ధి కొరకై ఈ సంఘ నియమ నిబంధనల ననుసరించి పనిచేయ వాగ్దానమును జేసి యిటుల నాచరించు వారు మాత్రమే ఈ సమితిలో తమయావజ్జీవితము సభ్యు లుగ నుందురు.

(2) ఈ సమితిలోని సభ్యులెవరైనను ఈ సంఘనియమ నిబంధనలకు వ్యతిరేకముగ ప్రవర్తించినపుడుగాని లేక సంఘమునకు వీరివలన ఏవిధముగానైన నష్టముకలిగినదని ఋజువైననుగాని (ఈ విషయములు కార్యకారిణి సమితిలోని మూడింట రెండువంతులు సభ్యులచే తీర్మానింప బడవలెను) మహాజనసభలో హాజరైన సభ్యులలో నాల్గింట మూడు వంతుల మంది వీరిపై విశ్వాస రాహిత్య తీర్మానమును జేసినపుడుగాని వీరంతట వీరే స్వయముగా రాజీనామానిచ్చినపుడుగాని వీరుగైరుహాజరగుట తటస్థించినపుడుగాని ఈ విషయమును కార్యకారిణీ సమితి వారిచే ప్రకటింపబడిన వెంటనే ఈ సమితిలో వీరి సభ్యత్వము రద్దయిపోవును.

(3) అవసరమైనపుడు ఈ సమితిలో సభ్యులకు ఈ సంఘాభివృద్ధికై తమకాలమును, శక్తిని, వినియోగించుచున్నందులకుగాను కార్యకారిణీ సమితివారు వీరికి తగు ధనసహాయము చేయవలయును.

(4) ఎవరినైనను నూతనముగా సభ్యుల నీసమితిలో జేర్చుకొనుటకు ఈ సమితిలోని సభ్యులలో సగముకంటె హెచ్చుమంది యంగీకరించవలెను.

(5) ఎవరి సభ్యత్వధరఖాస్తునైనను ఏకారణముచెప్పకయే అంగీకరించకపోవుటకీ సమితికి సంపూర్ణాధికారము కలదు.

(6) ఈ సమితిలో సభ్యులైయున్నంతకాలము అట్టి సభ్యులు ఈ సంఘమునకు యితర సభ్యులవలె వార్షిక సభ్యత్వచందా దేనిని కట్ట నవసంములేకుండగనే ఈ సంఘములో కూడ తమ యావజ్జీవితము సభ్యత్వమును కలిగియుందురు.

(7) ఈ సమితిలో సభ్యులందరు తమ జీవితములను అన్ని విషయములలోను ఆదర్శప్రాయముగ రాజకీయ విరహిత పవిత్రతతో గడుపవలయును.

(8) త్రికరణశుద్ధికలవారై ఐహికాముష్మికానందము నొనగూర్పగల శుద్ధసాత్విక జీవితము, కట్టుబాట్లు, నీతి, నియమములు కలవారై యుండవలయును.

ఆ. ఈ సమితి యీ సంఘముయొక్క యావత్తు కార్యక్రమముతోను సంబంధము కలదై ఈసంఘ లక్ష్య సిద్ధికిని నిర్వహణకును అనవరతము పాటుపడుచు ఈ సంఘాభివృద్ధికిని కీర్తిప్రతిష్టలకును, కార్యనిర్వహణకున్ను బాధ్యత కలదై యుండును.

ఇ. ఈ సమితి మహాజనసభ జరుగుటకు ముందుగ జరుగు విషయ నిర్ణయ సభలో పాల్గొని మహాజనసభలో చర్చింపబడవలసిన తీర్మానములను తయారు చేయవలెను.

ఈ. కార్యకారిణీసమితివారిచే తమకు ఒప్పగించబడిన పనులను నిర్వర్తించుచు కార్యకారిణీసమితివారికి నెలవారి నివేదికలను జమఖర్చులను పంపుచుండవలెను.

ఉ. మహాజనసభకు ఒక నెలరోజులు ముందుగ మహాజనసభకు అధ్యక్షులుగ యుండతగిన వారిపేర్లను రెండింటిని గాని అంతకంటె హెచ్చుగాని నూతనాధ్యక్ష యెన్నిక నిమిత్తమై ఈ సమితి సూచించవలెను.

ఊ. కార్యకారిణి సమితికి నిర్ణీత సభ్యుల సంఖ్యలో సగముమంది సభ్యులను ఈసమితి తమలోనుండి ఎన్నుకొన వలయును (అంతమంది సభ్యులు సమితిలో లేనపుడు మిగతకావలసిన సభ్యులను ఈ సమితి వారే తమకిష్టమైన యితర యోగ్యులైన సభ్యుల కార్యకారిణి సమితికి ఎన్నుకొనవచ్చును.)

ఋ. ఈ సమితిలో వ్యవహారదక్షులును ఆదర్శప్రాయులు అయినట్టి ఒకరిని ప్రథమ సభ్యులుగను మరియిద్దరిని ద్వితీయ, తృతీయ సభ్యులుగను ఎన్నుకొనవలెను. ఈ ప్రథమ సభ్యులే కార్యకారిణి సమితికి కార్యదర్శిగ నిర్ణయింపబడవలెను. వీరి గైరు హాజరీలో క్రమముగా ద్వితీయ తృతీయ సభ్యులాస్థానమునాక్రమింతురు. వీరు ముగ్గురును హాజరుకానప్పుడు ఈ సమితిచే తమనుండి ఎన్నుకొనబడిన మరొకరు ఆస్థానమున నియమింప బడుదురు.

ఋ. వారంతట వారు రాజీనామా నిచ్చువరకుగాని, లేక వారిపై విశ్వాస రహిత్య తీర్మానముచేయబడువరకు గాని ఈ స్థానము ఇతర యే కారణముల చేతనైనను ఖాళీయగు వరకుగాని ఈ ప్రథమ సభ్యత్వ పదవియు దాని ననుసరించి కార్యకారిణి సమితి కార్యదర్శి పదవియు కూడ స్థిరముగనే యుండును.

ౠ. ఈ సమితియందలి సభ్యులకు భూములు మొదలగువాటివలన వచ్చు స్థిరమగు ఆదాయముగాక మరియే యితరమగు ఆదాయములోనైనను కార్యకారిణి సమితిచే నిర్ణయింపబడిన దానికంటె అదనపు ఆదాయము సంఘమునకే చెందజేయబడవలెను.

ఎ. ఈసంఘమునకు సంబంధించిన యావత్తు చరస్థిరాస్తులు ఈ సమితి యొక్క ప్రథమ లేక ద్వితీయ సభ్యుల పేరున యుండి ఈ సమితియొక్క పరిపాలనిలోను బాధ్యతలోను యుండవలెను.

12. కార్యకారిణీ సమితి:—ఇదియే మహాసంఘ కార్యకారిణీ సమితి యనియు కేంద్రసంఘము అనియు, కార్యకారిణీసమితి అనియుకూడ వ్యవహరింప బడును.

అ. 1 మహాజన సభా సమావేశమున నిర్ణీతమై తిరిగి మహాజనసభా సమావేశము జరుగువరకు ఈ సంఘము యొక్క యావత్తు కార్యక్రమమును బాధ్యతతో నిర్వహించుచు పనిచేయు నిమిత్తమై మహాజన సభాధ్యక్షునిచే ఈ సమితి యీ క్రిందివిధముగ నేర్పాటు చేయబడవలెను. అవసరమైనప్పుడెల్ల ఈ సమితి సమావేశమగుచు వలయు కార్యక్రమము నేర్పాటు చేసుకొనుచు పనిచేయుచుండవలెను.

2. ఈసమితి అధ్యక్షుడు, గౌరవాధ్యక్షుడు, ఉపాధ్యక్షుడు, కార్యదర్శులు, కోశాధ్యక్షుడు మొదలగువారితో కలసి 10 మంది మొదలు 30 మందివరకు అవకాశ అవసరములను బట్టి సభ్యులతో ఏర్పాటు చేయబడవలెను.

3. ఈ సమితికి మహాజన సభాధ్యక్షుడే అధ్యక్షుడుగా నుండును.

4. అ. యీ సమితిలో మొత్తము నిర్ణీత సంఖ్యలో సగముమంది సంచాలక సమితిచే వారినుండి ఎన్నుకొనబడిన సభ్యులున్ను నాలుగవ వంతు సభ్యుల పండిత పరిషత్సభ్యులున్ను ఎనిమిదవ వంతు సభ్యులు శాశ్వత సభ్యులున్ను మిగత ఎనిమిదవ వంతు సభ్యులు సమర్థులగు ఇతర సాధారణ సభ్యులున్ను అధ్యక్షులచే ఏర్పాటు చేయబడవలెను.

ఆ. వలయునంతమంది సభ్యులు సంచాలక సమితిలో లేనప్పుడు మాత్రమే సంచాలక సమితిచే సూచించబడిన ఇతర సభ్యుల నెవరినైనను వారికి బదులుగ కార్యకారిణీ సమితి సభ్యులుగా అధ్యక్షులే ఏర్పాటు చేయవలెను.

5. సాధారణ సభ్యులను మాత్రము అధ్యక్షులు తమ ఇష్టము వచ్చిన వారినందరిని ఏర్పాటు చేసుకొనవచ్చును. మిగిలిన వారినందరిని ఆయాసమితి సభ్యులే మహాజన సభ జరుగుచున్న కాలములో తమనుండి ఎన్నుకొని అధ్యక్షులకు తెలుపవలయును. వీరిని అధ్యక్షు లంగీకరించ వలెను.

6. ఈ సమితికి సంచాలక సమితి ప్రథమ ద్వితీయ సభ్యులు ప్రధాన సహాయ కార్యదర్శులుగ నుందురు, గౌరవాధ్యక్షులను ఉపాధ్యక్షులను ఎవరినైనను సరియే అధ్యక్షుడు ఏర్పాటు చేయవచ్చును.

7. ఈ సంఘముయొక్క చరస్థిరాస్తులు యావత్తు ప్రధాన కార్యదర్శిపేర ఆయన స్వాధీనములోనే యుండవలయును.

8. అధ్యక్ష ఉపాధ్యక్ష స్థానములకు అన్ని విధములైన ఖాళీసమయములయందును సంచాలక సమితి ప్రథమ సభ్యులే అధ్యక్షాధి కారములు నన్నిటిని కలిగియుందురు.

9. ఈ సమితి సమావేశములకు యీ సమితి సభ్యులు కాని వారినెవరినైనను అత్యవసర సమయములందు కేవల సలహాకు మాత్రమే అధ్యక్షుడు ఆహ్వానించవచ్చును. అట్లు ఆహ్వానింపబడిన వారు తమసలహాల నిచ్చుటమాత్రమేగాని సమితి సమావేశములలో ఓటింగు హక్కును కలిగియుండరు.

13. మహాజనసభ:—కేంద్రసభ, వార్షిక సమావేశము:— అ. ఈ సంఘమహాజన సభాసమావేశము ప్రతిసంవత్సరము సామాన్యముగ ఫాల్గుణ మాసములో కార్యకారిణీసమితివారు నిర్ణయించిన స్థలమున జరుగుచుండును.

ఆ. ఈ సంఘము ముందు సంవత్సరమున జరుపబడవలసిన యావత్తు కార్యవిధానమున్ను ఈ మహాజనసభ యందే నిర్ణయించుచుండవలెను.

ఇ. ఈ సభయందు ఈ సంఘముయొక్క అన్నివిధములగు సభ్యులున్ను పాల్గొనవచ్చును.

ఈ. మహాజనసభయందు హెచ్చుమందిచే అంగీకరింపబడిన గాని ఏతీర్మానమున్ను ఈ సంఘము అమలుజరుప రాదు.

ఉ. మహాజనసభ జరుగుటకుముందుగ సంచాలకసమితి వారున్ను, పండితపరిషత్తు వారున్ను, కార్యకారిణీ సమితివారున్ను, గ్రామసంఘ ప్రతినిధులున్ను సమావేశమై "విషయ నిర్ణయ సమితి" యనుపేరును వహించి, మహాజనసభలో చర్చించుటకై ఈ సంఘసభ్యులచే పంపబడిన తీర్మానములను చర్చించి అందంగీకరింపబడిన తీర్మానములను మహాజనసభలో చర్చకు ప్రవేశపెట్టవలెను.

ఊ. కార్యకారిణీ సమితివారిచే సమర్పించబడిన వార్షిక నివేదికను, జమ ఖర్చులను చర్చించవలెను.

ఋ. అత్యవసర సమయములయందు సంచాలక పండిత పరిషత్తు సమితి సభ్యులలో సగముకంటె హెచ్చుమంది కోరినపుడుగాని లేక కార్యకారిణి సమితి అవసరమని భావించినపుడుగాని అవసర మహాజనసభను సమావేశ పరచి అప్పటి సమస్యల చర్చించి తీర్మానించవచ్చును. ఇట్టితీర్మానములు సాధారణ మహాజనసభా సమావేశమునందు తీర్ణమైన తీర్మానముల వలెనే అమలు జరుపబడవలయును.

ౠ. మహాజనసభా సమావేశానంతరము తిరిగి మహాజన సభాసమావేశమగువరకు దీనియొక్క అధికారములు యావత్తు కార్యకారిణి సమితికి సంక్రమించును. ఈ నియమము అవసర మహాజనసభా సమావేశమునకు కూడ చెందును.

ఌ. నియమావళి మార్పునందు మహాజనసభకు మాత్రమే అధికారముండును.

14. ఆహ్వాన సంఘము:— అ. (1) మహాజనసభా సమావేశముల జరుపుటకున్ను, మధ్యమధ్య సభల సమావేశములు ఉత్సవములు వగయిరా కార్యక్రమములు జరుపుటకున్ను, తాత్కాలిక సాంచారిక పాఠశాలలు జరుపుటకున్ను, పండితులను పెద్దలను సన్మానించుటకున్ను వలయు యావత్తు ఏర్పాటులను చేయుటకై ఆ యా నిర్ణీత ప్రాంతములందు "ఆహ్వాన సంఘములు" అను పేరుతో సంఘములు ఏర్పడు చుండవలెను.

2. ఆయా నిర్ణీతమైన పనులు నెరవేరిన వెంటనే ఇవి తాము జరిపించిన యావత్తు కార్యక్రమమును, జమ ఖర్చులను వివరముగ తెలుపుచు మిగిలిన ధనమును కార్యకారిణి సమితివారికి అందజేయవలెను. అంతటితో ఆ యాహ్వాన సంఘము రద్దగును.

ఆ. ఆహ్వాన సంఘములు ఏర్పడుట, పనిచేయుట వగయిరా అన్నియు మహాసభ కార్యకారిణి సమితివారి యనుమతిని పొంది వారి యొక్క సలహాలు సూచనలు ప్రకారము మాత్రమే పనిచేయుచుండవలెను.

15. ఉపసమితులు:— అ. ఈసంఘము యొక్క ఉద్దేశాను సారముగ ఆ యావిధులను బాధ్యతతో చక్కగా నిర్వహించుటకై కార్యకారిణి సమితివారిచే అవసరమువెంబడిని ఉపసమితులు ఏర్పాటు చేయబడుచుండవలెను.

ఆ. అన్ని ఉపసమితులయందలి సభ్యులును ఈ సంఘములో ఏదో ఒక తరగతి సభ్యతను కలవారై యుండవలెను.

ఇ. ఈ ఉపసమితుల యొక్క కార్యక్రమము, నియమ - నిబంధనలును కార్యకారిణీ సమితివారే నిర్ణయింపవలెను. అన్ని రకముల ఉపసమితులున్ను కార్యకారిణీ సమితి వారి సలహాసూచనల ననుసరించి మాత్రమే పనిచేయ వలెను.

ఈ. ఈ ఉపసమితులు తమకు ఒప్పగించబడిన పనిపూర్తియైన వెంటనే గాని లేక మహాజనసభా సమావేశము జరుప బడినవెంటనే గాని లేక అవసరములను బట్టి కార్యకారిణీ సమితివారి తీర్మానమువల్లగాని రద్దగును.

ఉ. వీరికి నియమింపబడిన విధులను సక్రమముగ జరుపుకొనుటకై వీరిలో వీరు అధ్యక్ష - కార్యదర్శులను ఏర్పాటు చేసుకొనవలయును.

16. పండిత పరిషత్తు:— అ. ఈసంఘముయొక్క కార్యక్రమములో ధార్మికమైనట్టియు, సాంఘికమైనట్టియు, విద్యాసంబంధమైనట్టియు, సాంప్రదాయ సంబంధమైనట్టియు యావత్తు విషయములయందును తోడ్పడుటకై కార్యకారిణీ సమితివారిచే "పండిత పరిషత్తు" అనునది ఏర్పాటు చేయబడవలెను.

ఆ. విద్యావంతులై పూర్వాచార్య సంప్రదాయానుగుణ అనుష్ఠానపరులై యీ సంఘనియమ నిబంధనలకు లోబడినవారై ఈసంఘ కార్యకారిణీసమితివారిచే సంప్రార్థితులైనవారు ఇందు సభ్యులుగా నుండనర్హులు.

ఇ. ఈపరిషత్తునందలి సభ్యులు మూడు తరగతులుగ నుందురు.

మొదటి తరగతి :— గురుముఖతః ఉపదేశమున పొందిన శ్రీభాష్య భగవద్విషయములందును, సంస్కృత నాటకాలంకారాది సాహిత్యమున్ను, తర్క-వ్యాకరణ శాస్త్రముల రెండింటియందుగాని, పూర్వమీమాంస యందు గాని, ఏయొక్కవానియందుగాని పూర్ణప్రజ్ఞ గలవారై యుండవలెను.

రెండవతరగతి :— శ్రీభాష్యమునుగాని, భగవద్విషయమునుగాని సంస్కృత నాటకాలంకారాది సాహిత్య పరులైగురుముఖతః ఉపదేశమును పొందినవారై తర్కమునగాని లేక వ్యాకరణమునగాని ప్రజ్ఞగలవారై యుండవలెను.

మూడవతరగతి :— నాటకాలంకారాది సంస్కృత సాహిత్యము కలవారై సాంప్రదాయ గ్రంథకాలక్షేప ములయందు సామాన్యపరిజ్ఞానము గలవారుగాని, వేదపండితులుగాని ద్రావిడ ఆయిరాధ్యాపకులుగాని, ఆగమ పండితులుగాని ఈతరగతికి చెందుదురు.

ఈ. ఇందు మొదటితరగతి రెండవ తరగతి పండితులకు మాత్రమే పండిత పరిషత్తు సభలో చర్చించబడు ధర్మ నిర్ణయాది విషయములలో పాల్గొనుటకున్ను, సమ్మతుల నిచ్చుటకున్ను హక్కుయుండును.
మూడవ తరగతి పండితులకు కేవలము ప్రచారము నిమిత్తమైన సభలలో నుపన్యాసము లిచ్చుటకు మాత్రమే అధికారముండును. విద్యాయోగ్యతాదుల ననుసరించి క్రమముగా తరగతులు మారుటకు అవకాశ ముండును.

ఉ. ఈపరిషత్తువారు తమకు సంబంధించిన నియమ నిబంధనలను సంఘకార్యకారిణీ సమితివారి అంగీకారము నకు లోబడి నిర్ణయించుకొను చుండవలెను.

ఊ. ఈపరిషత్తువారు తమ కార్యక్రమమును సక్రమముగ నిర్వహించుకొనుటకై తమలో మొదటితరగతి పండిత వర్గమునుండి తగినపండితుల నొకరిని అధ్యక్షులుగను, అటులనే అవసరము ననుసరించి ఉపాధ్యక్షులను, కార్యదర్శులను ఏర్పాటు చేసుకొనవలెను.

ఋ. పండిత పరిషత్తులో అప్పటి కంగీకరింపబడి ఏర్పడియున్న మొదటి తరగతి రెండవతరగతి పండితుల సంఖ్యలో సగముమందికంటె హెచ్చుమంది అంగీకరించిన గాని, సాంఘికమైనట్టిగాని, ధార్మికమైనట్టిగాని, ఆచారవిషయములయందు ఎట్టి నిర్ణయము సంఘముచే చేయబడరాదు. ఈపండితులు తమ అభిప్రాయము లను వ్రాతమూలముగ తెలుపవచ్చును. వీరు తమ యభిప్రాయముల తెలుపుటకు యుక్తమగు రీతిని మూడు పర్యాయములు అవకాశ మియ్యవలయును. అప్పటికిన్ని కొందరు తమ యభిప్రాయములను తెలుపనిచో మిగత వారు తమలోని హెచ్చుమంది సమ్మతుల ననుసరించి నిర్ణయముల చెప్పవచ్చును.

ౠ. కార్యకారిణీ సమితిచేగాని మహాజన సభచేగాని, తమపై విశ్వాస రాహిత్యతీర్మానము చేయబడినపుడు గాని లేక తామే స్వయముగ రాజీనామా చేసినపుడుగాని లేక ఇతరవిధములైన గైరుహాజరుల వలనగాని వీరి సభ్యత్వము రద్దగును.

ఔ. ఈపరిషత్తువారీ సంఘమువారిచే ఏర్పాటు చేయబడిన పాఠశాలాదికములలో విద్యావిధానమును నిర్ణయించుటయు అప్పుడప్పుడు విద్యార్థులయొక్కయు, నూతనముగ జేరు పండితులయొక్కయు యోగ్యతలను శక్తిసామర్థ్యములను పరీక్షించి నిర్ణయించుటయు, ఉపన్యాసాదుల నిచ్చుటయు, పత్రికలను పుస్తకములను ప్రచురించుటయు, దేవాలయ, రామానుజకూటాదుల నిమిత్తమై ప్రోత్సహించుటయు, వాటి సక్రమ పరిపాలనలో నుంచుట సంఘకార్యకారిణీసమితి వారిచే కోరబడిన శాస్త్రీయ విషయములలో తమసలహాల నిచ్చుట మున్నగు పనులు చేయవలెను.

ఓ. ప్రతి సంవత్సరమున్ను కార్యకారిణీ సమితికి తమ సమితి సభ్యులలో నుండి కార్యకారిణీ సమితియొక్క నిర్ణీత సంఖ్యలో నాలుగవ వంతు సభ్యులను ఎన్నుకొనవలెను.

17. సంబద్ధ సంస్థలు :— అ. ఈ సంఘము యొక్క ఆదర్శ-విశ్వాస-ప్రమాణాది-నియమ నిబంధనలకు వ్యతిరేకము గానట్టియు, అనుకూలమైనట్టి ఆదర్శ విశ్వాస-ప్రమాణాది నియమ, నిబంధనలను కలిగియున్నట్టియు వేదాంత - ఆధ్యాత్మిక విజ్ఞాన ప్రచారక సంస్థలను ఈసంఘమునకు సంబద్ధ సంస్థలుగ జేర్చుకొనవచ్చును.

ఆ. అట్టిసంబద్ధ సంస్థలు ఈసంఘమునకు విరుద్ధముగాకుండగ స్వతంత్రములుగా వ్యవహరించుకొనవచ్చును.

ఇ. ఈసంఘముచే నంగీకరింపబడిన ప్రతి సంబద్ధసంస్థయు ఈ సంఘమునకు సాలు 1 కి రు 3-0-0 చొ॥న చందాను చెల్లించవలెను. ఇట్లు చెల్లించనిచో తమ సభ్యత్వమును కోల్పోవును.

ఈ. ఏసంస్థనైనను, ఎప్పుడైనను సంబద్ధ సంస్థగా చేర్చుకొనుటకుగాని నిరాకరించుటకుగాని, అంగీకరించబడిన వాటితో సంబంధమును రద్దుపరచుటకుగాని ఈ సంఘకార్యకారిణీసమితి సంపూర్ణాధికారము కలిగియుండును.

18. ఈనియమనిబంధనావళిలోని అవసరమగు మార్పులను ప్రతిసంవత్సరమునకొక పర్యాయము మాత్రమే వార్షికసభలో మాత్రమే మార్చబడవచ్చును; అవసరమహాజన సభలలోను కూడ అవసరము ననుసరించి మార్చబడవచ్చును.

19. ఏవిధమైన అధికారపదవియందలి సభ్యులైనను వరుసగా ఆహ్వానింపబడిన మూడుసన్నివేశములకు వరుసగా హాజరుకానిచో ఈసంఘముయొక్క ఆ అధికారపదవియొక్క సభ్యత్వమును కోలుపోవుదురు కాని గైరుహాజరునకు తగినంత కారణమున్నదని కార్యకారిణీ సమితివారు నిర్ణయించినచో సభ్యత్వము రద్దుపడదు. లేదా ఆపదవికి తిరిగివారే నియమింప బడవచ్చును.

20. ప్రత్యేకకార్య క్రమములకై దాతలచే నీయబడిన అన్ని విధములైన విరాళములు ఆ యాదాతలయుద్దేశాను సారముగ మాత్రమే వినియోగించబడవలయును, వాటి నిర్వహణకై ఆయాప్రాంతములందు ఉపసమితుల నేర్పాటు చేయవలయును. ఈ ఉపసమితులు సక్రమముగ పనిచేయు చున్నంతవరకు కేంద్రసంఘమువారు వాటి విషయమై కలుగజేసుకొన కూడదు. దాతల ఉద్దేశభంగము కలిగినపుడు మాత్రమే కేంద్రసంఘము వారు కలుగజేసుకొని వానిని సక్రమపరచవలెను.

21. శ్రీయతిరాజ సేవా మహిళామండలి:— అ. ఈ సంఘముయొక్క కార్యక్రమము స్త్రీలలో విరివిగా ప్రచారమై వ్యాప్తిచెంది వృద్ధియగుటకుగాను ప్రత్యేక స్త్రీశాఖగ ఈ సంఘముయొక్క యాజమాన్య పర్యవేక్షణల క్రింద పనిచేయునట్టియు ఈ సంఘమండలి స్త్రీ సభ్యురాండ్రతో మాత్రమే కూడుకున్నట్టియు "శ్రీయతిరాజ సేవా మహిళామండలి" అను పేరుతో అవకాశము, అవసరము గల స్థలముల యందెల్ల ఈ సంఘ స్త్రీ శాఖోపసమితులు ఏర్పాటు చేయబడవలెను.

ఆ. ఇందు ఈ సంఘముయొక్క స్త్రీ సభ్యురాండ్రు మాత్రమే సభ్యురాండ్రుగ నుందురు. పురుషసభ్యులిందుండ రాదు.

(1) ఈమండలముయొక్క యావత్తు కార్యక్రమ నిర్వహణమునకై ఈ ఉపసమితికై ఏర్పరచుకున్న సరిహద్దులలో గల, ఈ సంఘము యొక్క అన్ని తరగతుల స్త్రీసభ్యురాండ్రచేతను తమలోనుండి అయిదుగురికి తక్కువ గాకుండగను, ఇరువదిమందికి ఏక్కువగాకుండగను (అవసరానుసారముగ) కార్యనిర్వాహకసభ్యురాండ్రను; మరియు ఒక అధ్యక్షురాలను, నలుగురికి మించకుండగ ఉపాధ్యక్షురాండ్రను, ఇద్దరికి మించకుండగ కార్యదర్శిణులను (కార్యదర్శినులలో ఒకరిని కోశాధికారిణిగ కూడను) మూడుసంవత్సరములకొక పర్యాయము చొప్పున ఎన్నుకొనుచుండవలయును. వీరిలో అధ్యక్షురాలున్ను, ఉపాధ్యక్షురాండ్రలో యిద్దరున్ను, కార్యదర్శిణులలో వకరున్ను, మిగత సభ్యురాండ్రలో సగముమందియున్ను శాశ్వత సభ్యురాండ్రనుండి ఎన్నుకొనబడవలెయును. ఇంతమంది శాశ్వత సభ్యురాండ్రులేని చోట్లయందు వారంగీకరించనపుడుగాని యితర సాధారణ సభ్యురాండ్రచే ఆస్థానముల పూర్తిచేసుకొనవచ్చును.

(2) కొన్ని ప్రత్యేక పరిస్థితుల ననుసరించి కొన్నిస్థలములలో అధ్యక్షురాలిని, ఉపాధ్యక్షులలో యిద్దరిని, కార్యదర్శిణులలో వకరిని, సభ్యురాండ్రలో నలుగురికి మించకుండగను, ఈ మూడుసంవత్సరముల గడువుగల ఎన్నికలతో సంబంధము లేకుండగ వారివారి జీవితాంతము వరకు ఆ యా పదవులు శాశ్వతముగ వారువారు కలిగియుండు నటుల శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ కేంద్ర కార్యకారిణి సమితివారు నిర్ణయించవచ్చును.

(3) అధ్యక్ష-ఉపాధ్యక్ష-కార్యదర్శి-కార్యనిర్వాహక సభ్యురాండ్రతో కూడుకున్న దానిని "శ్రీయతిరాజ సేవా మహిళా మండలి కార్యనిర్వాహక వర్గము అని వ్యవహరించ వలయును.

(4) ఈకార్యనిర్వాహక వర్గము నెలకొక పర్యాయమైన సమావేశమగుచు తమ కార్యక్రమమును నిర్ణయించు కొనుచుండవలయును.

(5) ఈ మండలికి సంబంధించిన యావత్తు కార్యక్రమ నిర్వాహణబాష్యత, యాజమాన్యము శ్రీయతిరాజ సేవా మహిళామండలి కార్యనిర్వాహక వర్గమువారు కలిగియుందురు.
శ్రీయతిరాజ సేవామహిళామండలి కార్యనిర్వాహక వర్గముపై శ్రీవిశిష్టాద్వైత ప్రచారకసంఘ కేంద్ర కార్యకారిణి సమితి వారు అన్ని అధికారములను కలిగియుందురు.

(6) శ్రీయతిరాజసేవా మహిళామండలి కార్యనిర్వాహక వర్గమువారు వరుసగ మూడు పర్యాయములు తమ ప్రత్యేక ప్రత్యేక సమావేశములలో ఒకేమాదిరిగ తీర్మానించిన విషయములను శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ కేంద్ర కార్యకారిణి సమితివారు నిరాకరించరాదు. ఇందు మూడవ పర్యాయములో కూడిన సమావేశములో మాత్రము శ్రీయతిరాజ సేవా మహిళామండలి కార్య నిర్వాహక వర్గము యొక్క నిర్దిష్టమైన సంఖ్యలో మూడింట రెండువంతుల మంది కి సభ్యురాండ్రచే ఆ తీర్మానము అంగీకరించబడవలెను లేనిచో ఆ తీర్మానము ఉత్తీర్ణమైనటుల ఎంచబడదు. ఇట్టి మూడు సమావేశములకున్ను కనీసమొకనెల వ్యవధాన ముండవలెను.

(7) సంవత్సరమున కొకపర్యాయము శ్రీయతిరాజ సేవా మహిళామండలి యొక్క సర్వ సభ్య సమావేశమును జరుపవలెను. అందు ఆ సంవత్సరము జరిగిన కార్యక్రమము యొక్క సింహావలోకనము, ముందు సంవత్సరము జరుగవలసిన కార్యక్రమ నిర్ణయము, జమ ఖర్చులు, ముందు చేయవలచిన వాని అంచనాలు వగైరా యావత్తు విషయములు పరిశీలించబడి నిర్ణయించబడవలయును. ఈ సర్వసభ్య నిర్ణయానుసారముగ ఈ కార్యనిర్వాహక వర్గమువారు తరువాత కార్యక్రమమును నడిపించ వలయును.

3. ఈమండలి స్త్రీలలో ఆధ్యాత్మిక జ్ఞాన-భక్తి-వైరాగ్యముల యభివృద్ధికి మాత్రమే అనుకూలమగు అన్ని విధముల కార్యక్రమముల నవలంబించి పనిచేయవలయును. ఇందులకై ఆశ్రమములు, పాఠశాలలు, గ్రంథాలయములు, ఉపన్యాసభవనములు, భజనమందిరములు, కాలక్షేపకూటములు, పఠనాలయములు మున్నగువానిని ఏర్పరచవలయును.

ఈ. ఈ మండలిచే స్త్రీలకై మాత్రమే ఏర్పరచబడిన ఆశ్రమాదులలో పురుషులకు ప్రవేశముండరాదు గాని ప్రత్యేక పరిస్థితులయందు మాత్రము జ్ఞాన భక్తి-వైరాగ్య సంపన్నులైనట్టి యోగ్యులగు పురుషులచే ఈ మండలివారు కాలక్షేపములుగాని, పఠనాదులనుగాని, ఉపన్యాసములనుగాని, పాఠప్రవచనాదులనుగాని, తాత్కాలికముగ మాత్రము తమకార్యక్రమములో చేర్చి ఏర్పాటుచేయవచ్చును అట్టి ప్రత్యేక పరిస్థితులలో వీనిని వినుటకై తాత్కాలికముగ పురుషులకు కూడ అవకాశమును కల్పించవచ్చును.

ఏ పరిస్థితులయందును కూడ, యిటుల తాత్కాలికముగ అవకాశము కల్పించబడిన ఈ పురుషుల సంబంధముచే ఈ మండలియొక్క కార్యక్రమమునకు ఎట్టి ఆటంకములుగాని, కష్టనష్టములుగాని, అవాంతరములుగాని, కలుగకుండునటుల జాగ్రత్తగ యుండవలయును ఇట్టి ప్రత్యేక పరిస్థితులలో ఇటికార్యక్రమ నిర్ణయమునకు ముందుగాను. కార్యక్రమ నిర్వహణములోనుకూడ స్థానికమైన శ్రీ విశిష్టాద్వైత ప్రచారకసంఘ శాఖవారి సలహాలను, సహాయమును తప్పకుండగ తీసుకొనుచుండవలయును.

ఉ. ఆశ్రమములు:—— (1) శ్రీయతిరాజ సేవా మహిళామండలియొక్క కార్యక్రమ ప్రచారమునకై అనువగునట్టియు, ప్రశాంత ఆదర్శ పవిత్ర జీవితమునకు అనుకూలమైనట్టియు, ప్రమాదరహితమైనట్టియు ఆశ్రమములు స్థాపించబడవలయును. ఆశ్రమ వాతావరణమంతయు అతిప్రశాంతముగను, జ్ఞాన-భక్తి-వైరాగ్య ప్రబోధకరముగను, నిరాడంబరముగను, నిర్మలముగను, దేవద్విజగురు సన్నిధానమందును, మంచినీటి వసతిగల ప్రాంతమందును యుండవలయును.

(2) మద్యమాంసాది నిషిద్ధ ద్రవ్యములుగాని, జ్ఞాన-భక్తి-వైరాగ్యములకు విరుద్ధములగు వాఙ్మయముగాని, వస్తువులుగాని ఆశ్రమములో ఉపయోగించబడకూడదు; ఆశ్రమ ఆవరణలోనికి తీసుకొనిరాబడకూడదు.

(3) ఈ మండలి కార్యక్రమమున సంపూర్ణవిశ్వాసముండి, దీనిని ప్రచారము చేయుటకయ్యే తమ యావజ్జీవితమును వినియోగింప ప్రతిజ్ఞచేసి, ఈ మండలిలో మూడుసంవత్సరములకు తక్కువగాకుండగ సభ్యత్వము కలిగియుండి, తమ ఆదర్శ-సత్ప్రవర్తనలలో సంఘమునకు సంపూర్ణవిశ్వాసమును కలిగించగలిగి, ప్రచారమునకున్ను, ప్రశాంతజీవితమునకున్ను వలయు జ్ఞాన-భక్తి-వైరాగ్యములు గల స్త్రీలు మాత్రమే ఈ ఆశ్రమములలో స్థిరనివాసులుగ చేర్చుకొనబడుదురు.

(4) స్థిరనివాసులుగ అంగీకరించిన పిమ్మటకూడ వీరిప్రవర్తనవలన సంఘమునకు కష్ట-నష్టములు కలుగుచో అట్టివారిని శ్రీయతిరాజ సేవా మహిళామండలి కార్యనిర్వాహక వర్గమువారితో సంప్రతించి ఆశ్రమము నుండి తొలగించుటకు శ్రీ విశిష్టాద్వైత ప్రచారక కేంద్ర కార్యకారిణి సమితివారు అధికారమును కలిగియుందురు.

(5) ఆశ్రమములలో విలాసకరమైనట్టియు, భోగరూపమైనట్టియు జీవితమునకవకాశముండరాదు.

(6) ప్రతి ఆశ్రమములోను ప్రతిదినము ఉదయమునను, సాయంకాలమునను తప్పనిసరిగా ఆశ్రమవాసులందరు కలిసి సమిష్టిగా పాల్గొనుటకు వీలగునటుల భగవదారాధనము, భగవత్ప్రార్థన, స్వరూపగ్రంథపారాయణము, సాంప్రదాయ గ్రంథకాలక్షేపము, భజనయు, పఠనాదులు యుండవలయును.

(7) ఏదైన తగినంత కారణముండిననే తప్ప ఆశ్రమవాసులలో ఎవరుకూడ ఈ సమిష్టి కార్యక్రమములలో పాల్గొనకుండగ యుండరాదు.

(8) ఆశ్రమములలో జరుగు సమిష్టికార్యక్రమము లన్నింటిలోను ఆశ్రమవాసులు కానట్టియు, ఈ మండలియందు సానుభూతి, శ్రద్ధాసక్తులు కలగినట్టియు, యితర స్త్రీలుకూడ పాల్గొనుటకు అవకాశ మిుండవలయును.

(9) ప్రతి ఆశ్రమములోను స్వరూప సాంప్రదాయానుకూలమైనట్టి భగవంతుని జయంతులు, భగవత్-భాగవతాచార్య సుప్రసిద్ధ తిరునక్షత్రములు, శుక్రవారములు, ఏకాదశులు, యింకా యితర పవిత్ర పుణ్యపర్వదినములు జరుపబడుచు అందు సాంప్రదాయసిద్ధమైన ఉత్సవాది కార్యక్రమములు జరుపబడుచుండవలయును.

(10) వీలైనంతవరకు ప్రతి ఆశ్రమవాసియు తన జీవికమునకు వలయు తిండి బట్టలకు కావలసిన ధనమును తానే స్వయముగ శారీరకష్టాములచే సంపాదించుటకు అనువగునట్టి స్వరూపానుకూల ఉటీరపరిశ్రమలు, ఆశ్రమము లోనే ఆశ్రమయాజమాన్యముననే స్థాపించబడవలయును. ఈ విషయములో స్థానికమైన శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘశాఖవారి సలహాలను, సహాయమును తప్పక తీసుకొనవలయును.

(11) ఆశ్రమవాసులు సంపాదనయంతయు ఆశ్రమాభివృద్ధికే వినియోగింప బడవలయును. వారి వారసులు వగైరాల కెట్టిహక్కులు, సంబంధము యుండరాదు.

(12) ఏ ఆశ్రమములోను ఎవరికి వ్యక్తిగతముగ ఏవిధమైన స్థిరమైన హక్కులు యుండరాదు.

(13) దీనికి సంబంధించిన చర-స్థిరాస్తులన్నియు శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ యాజమాన్య పర్యవేక్షణల క్రింద శ్రీయతిరాజ సేవా మహిళామండలి వారికి మాత్రమే సమిష్టిరూపముగా చెందినవై యుండును.

(14) ఆశ్రమములలోని వారందరు తమ తమ వర్ణాశ్రమానుకూల ఆచారవ్యవహారముల కనుగుణముగ నడుచుకొను చుండవలయును.

(15) ఆశ్రమము లన్నింటియందును జ్ఞానానుష్ఠానములకే ప్రాధాన్య ముండవలయును.

(16) ఆశ్రమవాసులలో పరస్పరము నీచోచ్ఛభావము లుండరాదు. "పరస్పరం భోదయంతః" అను సూత్రము ననుసరించి సమానగౌరవ ప్రతిపత్తుల కలిగి యుండవలయును.

(17) ప్రతి ఆశ్రమముయొక్క దైనందిన సామాన్య కార్యక్రమ నిర్వాహణమునకున్ను, ఆశ్రమవాసులలో ఒకరు పర్యవేక్షకురాలుగ శ్రీ యతిరాజ సేవా మహిళామండలి కార్యనిర్వాహక వర్గమువారి సంప్రతింపులపై శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ కేంద్రకార్యకారిణీ సమితివారిచే ఏర్పాటు చేయబడవలయును

(18) అవకాశమున్నంత వరకు ప్రతి ఆశ్రమమును చేర్చి పాఠశాలలు, గ్రంథాలయములు, ఉపన్యాసభవనములు, భజనమందిరములు, కాలక్షేపకూటములు యుండవలయును.

అ. ఆశ్రమములో స్థిరనివాసులుగ చేర్చుకొనబడు స్త్రీల కుండవలసిన యోగ్యతలు:— i. శ్రీయతిరాజ సేవా మహిళామండలిలో మూడుసంవత్సరములకు తక్కువగాకుండగ సభ్యురాలై యుండ వలయును.

ii. తప్తచక్రాంకనాది పంచసంస్కారపరులై యుండవలయును.

iii. తమప్రాకృత బంధువర్గముతో ఎట్టి లావాదేవీలుగాని, ప్రాకృతసంబంధముగాని యుండరాదు.

iv జాతి-ఆశ్రయ-నిమిత్తాదులచే దూషితములుగాని శాకాహారమును మాత్రమే వినయ విష్టంతో భుజించు వారలై యుండవలయును.

v. జ్ఞాన-వైరాగ్య సూచకములగు నట్టియు, విలాస-భోగ రహితమైనట్టియు, నిరాడంబరము, నిర్మలము అయి నట్టి వస్త్రాలంకారణములను మాత్రమే ధరించవలయును.

ఆ. పాఠశాలలు:—— బాలికలకున్ను, పెద్దవారలగు స్త్రీలకున్ను ఆధ్యాత్మికాభివృద్ధి కరములగు విద్యలున్ను (స్తోత్రపాఠములు, ప్రబంధములు, పురాణములు, సాంప్రదాయ గ్రంథములు ఇత్యాదులు) వీనికి వ్యతిరేకముగాని, ఆటంకము గాని కలుగనట్టి యితరవిద్యలున్ను నేర్పుటకు పాఠశాల లుండవలయును. ఈ పాఠశాలలలో స్త్రీలే అధ్యాపకురాండ్రుగ నియోగించబడవలయును.

ఇ. గ్రంథాలయములు:—— స్త్రీలయభివృద్ధికి అనువగునట్టి జ్ఞాన-భక్తి-వైరాగ్యబోధకము లైనటి పత్రికలు, పుస్తకములు, పటములు మున్నగు వాఙ్మయముతో కూడుకొనియున్న గ్రంథాలయములు స్థాపించబడవలయును. ఈ గ్రంథాలయములలో ప్రాకృతిక మైనట్టియు, మనోవికారముల కలిగించునట్టియు, జ్ఞాన-

భక్తి-వైరాగ్యముల కననుకూలముకానట్టియు పత్రికలుగాని, పుస్తకములుగాని, పఠనములుగాని ఏటి వాఙ్మయము యుండరాదు. గ్రంథాలయమునకు సంబంధించిన పరివారముగకూడ స్త్రీలే నియోగింపబడవలయును.

ఈ ఉపన్యాసభవనములు:— జ్ఞాన-భక్తి-వైరాగ్య బోధకములగు ఉపన్యాసములనుగాని, కాలక్షేపాదులనుగాని, పఠనాదులనుగాని జరుపుటకు (చెప్పువారు స్త్రీలే, వినువారు స్త్రీలే అయియుండునట్టి) ఉపన్యాస భవనములను, కాలక్షేపకూటములను, పఠనాలయములను స్థాపించవలయును.

ఊ. శ్రీయతిరాజ సేవా మహిళామండలి యొక్క లౌకిక రాజకీయములకు సంబంధించిన పనులను నిర్వహించుటకుగాను స్థానికమైన శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘమువారి సలహా సహాయములపై ఆ సంఘములోని వారి నెవరినైనగాని లేక యోగ్యులగు యితరులనుగాని పురుషులను ఆ యా ప్రత్యేకపనులకై ఏర్పాటు చేసుకొనవచ్చును.



# CERTIFICATE OF REGISTRATION OF SOCIETIES

## ACT XXI OF 1860

S. No. 9 of 1951.

I hereby certify that "**Sri Visishtadvaitha Pracharaka Sangham**" has this day been registered under the Societies' Registration Act, XXI of 1860.

Given under my hand at Madras, this fourteenth day of March, One thousand nine hundred and fifty one.

*Additional Assistant Registrar of*
*Joint Stock Companies,*
*Chingleput District.*

# సవినయవినతి

"కలౌ సంఘే శక్తిః" కలియుగమున సంఘమునసే శక్తియుండును. సుసంఘటిత సంఘము ద్వారా మాత్రమే మన మీా కాలమున ఆధ్యాత్మికాభివృద్ధిని, ఆత్మోన్నతిని, ఆనందమును పొంద కలుగుదుము. పరస్పరబోధకను, భక్తిబావ ప్రచారమునకును సంఘమే కదా సాధనము. సత్సంగమమునకును, సాదుసేవకును, సదనుష్ఠానమునకును శరణ్యము సంఘమే గాన దయయుంచి తాము ఈ సంఘమున సభ్యత వహించుట మాత్రమే గాకుండగ తమ యనుయాయుల నందరను ఇందు వెంటనే సభ్యులుగ జేర్పించి ఈ సంఘమును పటిష్ఠము, సుసంఘటితము, ఫలప్రదాయి అగునటుల జేయగోరుచున్నారము.


ప్రధాన కార్యాలయము:—

గీతామందిరము

107, వరదాముత్తియప్పన్ వీధి,

మదరాసు—1.

తమ,

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము


శ్రీ శ్రీ శ్రీ





శ్రీమతే రామానుజాయనమః

# భక్తి
# నివేదన
## వేదాంత మాసపత్రిక


| సంపుటి 3 | ఖర—భాద్రపదమాసము | సంచిక ౬ |
|---|---|---|


# శ్రీవైష్ణవుడెవడు?


శ్రీ ఉ. వే. శ్రీమాన్
తె. కం. గోపాలాచార్యులుగా, కోరుకొండ.


ఏతే సత్పురుషాః పరార్థఘటకా
స్స్వార్థాన్ పరిత్యజ్య యే ॥

(తన సర్వస్వమును త్యజించి పరులకార్యముల ఘటింపజేయువారే సత్పురుషులు.) భర్తృహరి.

ఎవరు తనపట్ల మిక్కిలి నిష్ఠురముగను, నిర్దయగను ప్రవర్తించువారిపట్ల గూడ నుదారముగను దయాదాక్షిణ్యములతోను ప్రవర్తింతురో వారే శ్రీవైష్ణవులు. ఇందులకు మనకు భక్త ప్రహ్లాద యనుష్ఠాన మొక ప్రబల నిదర్శనము.

హిరణ్యకశిపుడు తన మారణోపాయము లన్నియు రిక్తమైపోవుటగాంచి చింతాక్రాంతుండై యుండ పురోహిత పుత్రులదిగాంచి రాజా! నీవీ మాత్రమునకే యింతచింతించవలెనా మేమున్న దెందులకు? చెప్పిచూతుము. ఈతడు మారనిచో మామంత్రశక్తిని విజృంభింపజేసి యభిచార హోమము గావించి కృత్యయను భూతము నొక దానిని బుట్టించి దానిచే నీతని రూపడంగింతు మని యోదార్చిరి.

పిమ్మట వారాతనిని తమయింటికి గొనిపోయిరి. అచ్చట గురుశిష్యుల కీవిధమగు సంవాద మొకటి జరిగెను.

గురు— నాయనా! నీయది బ్రహ్మవంశము. రాక్షసేంద్రుని పుత్రరత్నముగా జన్మించితివి నీతండ్రివలె నీవును సమస్తలోకాధార భూతుడ వగుదువు. నీకాదేవతలతో పనియేమి? నీకాయనంతుని చింతయేల? తండ్రికిమించిన దేవుడు గలడా! తండ్రికిమించిన గురుడున్నాడా?

ప్రహ్లా— మహాత్ములారా! మీరు సెలవిచ్చినట్లు యీకుల ముత్కృష్టమైనదియే. నాతండ్రి సకల జగదారాధ్యుడనుటలో సందేహమేమి?

గురువులలో తండ్రి మొదటివాడనుటయు నిర్వివాదాంశమే. సర్వవిధముల నాతనికపరాధమును గావింపరాదనియే సర్వదా తలంచుచుందును. కాని తాము నీకాయనంతుని చింతయేల యంటిరే యది మాత్రము నిరర్థకము. మీయందలి గౌరవముచే నేనింతకంటె జెప్పజాల. (తనలో) గురువులైనను భగవంతుని నిందించినవారి నపేక్షించుటకు నా చిత్త మొప్పకున్నది. వీరికా ప్రభావ మొకింత సూచింతును గాక.

(ప్రకాశముగా) ఏమి! గురుపుంగవులారా? ఏమంటిరి? అనంతుని చింతయేల యనియా? బాగు బాగు. మంచి గురువులే దాపరించిరి. మీరు చింతాదంతుర మనస్కులు కారేని నేనా యనంతుని మహిమ నొకింత విన్నవింతు సావధాన చిత్తులగుడు.

ధర్మార్థ కామమోక్షముల కంటె సంసార మండలమున పురుషార్థాంతము మృగ్యమే గదా! అట్టి పురుషార్థముల నాల్గింటిని యాతడు ప్రసాదించునే, యిక మనకేమి కావలెను? గురుపుంగవులారా! వేయేల! నానిశ్చయమును వినుడు ఆయనంతుడే జగత్పతి, యాతడే కర్త, ఆతడే వికర్త, ఆతడే సంహర్త, ఆతడే భోక్త, ఆతనిని మించిన ప్రభువు వేరొకడు లేడు. ఇది ముమ్మాటికి నిశ్చయము. మీరు కూడ నాతని భజించి తరించుడు. ఇట్లాడినందుకు నన్ను క్షమింతురు. గాక!

గురు- (కోపముతో) ఓరీ! నిర్భాగ్యుడా! నీవు మామాటవినుదువని నిప్పులో కాలకుండ కాపాడితిమి. ఇట్లింకెన్నడును వదరవని నమ్మితిమి. చూడుము, నీవు మామాటను లక్ష్యపెట్టవేని యిదిగో యిప్పుడే కృత్యను విడిచి నిన్ను నిర్మూలింతుము. మాశక్తిని చవిచూతువు గాక.

ప్రహ్లా- ఆచార్యోత్తములారా! ఇది యెంత వెర్రి. ఎవ్వనిచే నెవ్వడు రక్షింపబడువాడు? ఎవ్వనిచే నెవ్వడు భక్షింపబడువాడు? రక్షణ భక్షణములు రెండును తానాచరించు పుణ్యపాపముల మీద నాధారపడి యుండుట నెరుంగరా? అందువల్లనే గదా ప్రతివాడును సర్వప్రయత్నములచేతను సత్కర్మలనే యాచరించవలెను.

(ఆచార్యపుత్రులు పట్టరాని కోపముతో కృత్యను సృష్టించి విడుతురు. అది భయంకరాకారమును దాల్చి కోపముతో మండిపడుచు భూమిని త్రొక్కుచు శూలము నాతని రొమ్మున గ్రుచ్చును. అయ్యది యాతనిని స్పృశింపగనే తుత్తునియలై నేలంగూలును. ఆహా! భగవంతునకు ప్రియమందిరమగు నాతని హృదయము సోకిన వజ్రాయుధమే రూపడంగ నిక నీక్షుద్ర శూలమా హింసించునది?

పాపులచే పాపుల హింసింప నేర్పడిన యా కృత్య యిప్పుడు విపరీతముగ నుపయోగింపబడుటచే ప్రహ్లాదుని పట్ల కుంఠితశక్తియై యెదురు తిరిగినా గురుపుత్రులనే వేధింప నారంభించెను. ఓహో ఇత్తరి నాయుత్తమ భక్తుని పరార్థైక ప్రవృత్తి సువర్ణాక్షర విలేఖ్యము గదా! నిరంతరానుభావ్యము గదా! సకలపాప విమోచకము గదా!

అట్లా కృత్యచే దహ్యమాన సర్వాంగులగు నాగురుపుత్రుల గాంచి మన చిరుతభక్త శిఖామణి కన్నీరు మున్నీరుగా గార్చుచు.

ప్రహ్లా- కృష్ణా! త్రాహి త్రాహి! ఓ సర్వవ్యాపకా! ఓ జగద్రూపా! ఓ జగన్నాథా! యీ నాయాచార్యపుత్రులనీ మంత్రాగ్నినుండి కాపాడవా! ఇదిగో! నేప్రణామము జేయుచున్నాను.

సకల భూతములయందును సర్వవ్యాపియగు సర్వేశ్వరుడు శ్రీమహావిష్ణువే యనుటకు సంశయములేదేని యీ విప్రోత్తములు జీవింతురుగాక!

సర్వవ్యాపకుడగు సర్వేశ్వరుని శత్రుపక్షమందును సంభావింతునేని నాపురోహితపుత్రులు జీవింతురుగాక!

నన్ను చంపుట కుద్యమించి, విషమునిచ్చియు నిప్పునద్రోచియు, దిగ్గజములచే ద్రొక్కించియు, సర్పములచే గఱపించియు పీడించిన వారిపట్ల నేను నిక్కముగ మిత్రులగనె ప్రవర్తించితినేని యీనాసత్యముచేతనే నాయీ యాజకులు చిరంజీవులగుదురుగాక! (ఇంతలో నా మంత్రాగ్ని యదృశ్యమయ్యెను.)

గురు-ప్రహ్లాదు నాలింగనము జేసుకొని యశ్రుధారలచే నాతని నభిషిక్తుని జేయుచు)

మా తండ్రీ! దీర్ఘాయుష్మాన్ భవ! అప్రతిహత బలవీర్య సమన్వితో భవ! పుత్రపౌత్రధనైశ్వర్య యుక్తో భవ! నీతత్వమెఱుంగక యపచారడితిమి. తండ్రీ! "వైష్ణవులు అపకారుల కుపకారమొనరింతురు"ను ధర్మమును వినియు విశ్వసింపక నేడు దానిని సాక్షాత్కరించితిమి గదా! మేము ధన్యులము. మేమిదే పోయి నీమహాత్మ్యమునంతను నీ తండ్రికి విన్నవింతుము. (అని నిష్క్రమింతురు)

ఇది యొక ప్రాచీనోదాహరణము.

మఱియొక విచిత్రమగు నర్వాచీనోదాహరణము నిచ్చి యీ విషయమును మరింత బలపరప యత్నింతును.

పూర్వకాలమున రామదాసుడను నొక భక్తశిరోమణి యుండెను. అతడెన్నడును చేయిజాచి యెఱుంగని యప్రతిగ్రహ దీక్షితుడు, ఒకనాడొక మహారాజాతనిని బహుభంగుల బలవంతపరచి బహుమూల్యరత్నాదికము నర్పించెను. భగవంతుని లీలకు విషయము కానిదేది? ఆతడాధనరాశిని గైకొని తన యాశ్రమమునకు మరలుచుండ మధ్యేమార్గమున నిద్దరు దొంగలాతనిని బంధించి రత్నరాశిని కొల్లగొట్టి యంతటితో పోక నాతని చేతులు నరికి తుదకాతని నొక పాడునూత పారవైచి లేచిపోయిరి.

దైవవశమున నారాజచంద్రుడే వేటకై యడవిని దిరుగాడుచు తృష్ణాతురుడై యానూతి చెంత కేతెంచి యందున్న నాదీన చేతనుని రామదాసుగా గుర్తించి యొక త్రాటి సహాయమున నాతనిని బయటకు దీయించెను. ఏంత బలవంత పరచినను తన కపకారము గావించిన యాచోరుల జాడ నొకింతయు నాభక్తుడు జారవిడువలేదు. చేయునది లేక నారాజపుంగవుడు శ్రద్ధాభక్తులతో నాభక్తుని పరిచర్య మాత్రము గావించుచుండెను.

దైవికముగ నొకనాడాచోరులా రాజభవన పార్శ్వమునుండి యేగుచుండుట నా రామదాసు గాంచి రాజుచే వారల తనచెంతకు రావించెను. ఆదొంగలా రామదాసును గుర్తించి నిలువున నీరై గజగజ వణంకజొచ్చిరి. ఆభక్తుడదిచూచి వారల ననేక రీతుల నాశ్వాసించి రాజుతో వీరు తన మిత్రులు గాన వీరల కిచ్చవచ్చినంత ధనరాశి నొసంగుమని యాదేశించెను. నుతవుట తడవుగ ధనరాసులా దొంగలవ్రాల గుమ్మరింపబడెను.

ఆదొంగలాశ్చర్య చకితమనస్కులై యీవిపరీత ఫలాగమ నిదానమారయ జాలక సంశయాక్రాంత మనస్కులయ్యు యేమియు నెరుంగనట్లు నటించుచు వారిచ్చినంత ధన నిచయము నెత్తుకొని సంతుష్టాంతరంగులై రాజభటుని సహాయముతో తమ గ్రామమునకేగఁదొడంగిరి. మార్గమధ్యమున నారాజభటుఁడు వీరలను తమకు రామదాసుతో పరిచయ మెట్లుకలిగెను. ఆయన మీకింత ధనము నిప్పింపనేల యని ప్రశ్నింప వారలు నిర్భయముగా "ఓ! రాజోద్యోగీ! మేమొకసారి యీ సన్యాసిని మృత్యువాతనుండి రక్షించితిమి. ఆతఁడా ఋణమునుండి యిప్పటి కిట్లు విముక్తుఁడాయెను. యని యంతిమాక్షర సమాప్తి సమకాలముననే యెదుట భూమి బద్దలై వీరి నిరువురను తన పొట్ట బెట్టుకొనియె. ఆరాజభటుఁడిది గాంచి భయసంభ్రమములతో బెదరుచు రాజు చెంతకేతెంచి రామదాసు వినుచుండ నీవార్తనంతను సవిస్తరముగ విన్నవించెను. ఈమాటలు చెవినిబడినతోడనే యాభక్తశిఖామణి నేత్రముల నుండి యశ్రుధారలు జలజలరాల ప్రారంభించెను. వాటిని తుడుచుటతిడువుగ నారామదాసునకు రెండు చేతులును వచ్చివేసెను. ఇదియంతయు జూచుచున్న నారాజున కాశ్చర్యముదయించెను. దీనికేమి హేతువని నిర్బంధించుటచే నారామదాసు జరిగినదంతయు పూసగ్రుచ్చినట్లు చెప్పివేసెను. ఇదియంతయు వినిన పిమ్మట నారాజున కాశ్చర్యము మరింత వృద్ధిజెంది యాతని నిట్లు ప్రశ్నించెను.

రాజు:- వారు తమ చేతుల నరికినచో తమకు మిత్రులెట్లయిరి?

దాసు- తన చాతుర్యముచే నహితమునుండి తనను పాలించినవాఁడే తనకు మిత్రుఁడు నేను చేయిజాచి యెవరినుండియు నేమియు పరిగ్రహించనని ప్రతినగావించియుంటిని. దైవఘటనచే నేనా ప్రతిజ్ఞ నుల్లంఘించితిని అందులకు ఫలముగా వీరు నాచేతులను నరికి నాపాపమును పోగొట్టి క్రియాత్మక ఉపదేశ మూలమున హితసాధకులైరి గావున వీరు నాకు మిత్రులైరి.

రాజు- వీరికి తమరేల ధనముల నిప్పించితిరి.

దాసు- మిత్రుల కపేక్షిత ధనముల నిప్పించుట సహజముగానే ఘటించవచ్చును గదా! అదియును గాక నేను సాపరాధుఁడను గనుక నన్ను వీరు శిక్షించుట సాధ్యమైనది గాని మరి యొకనాఁడు వీరిట్లు ధనాశచే నిరపరాధుని కూడ హింసింతురేని నరకముల పాలగుదురు. అందుచే వీరి ధనతృష్ణను శమింపజేయు తలంపుచే నిచ్చే ధనము లిప్పించితిని?

రాజు-అయినచో వీరిచావునకు మీరు వగవనేల?

దాసు- నావలనగదా పాపము! వీరికి మరణమాసన్నమైనది. లోకులు నన్నుత్తముఁడందురు. ఉత్తముని స్నేహఫలము క్షేమకారిగా వలెను. కాని యిచ్చట విపరీతమాయెను. కావున నేను ఓ దైవమా! నాస్నేహమునకిట్టి విపరీత ఫలము ఘటించుటకు నేనేమిపాప మాచరించితిన య్యో! యని యేడ్చితిని.

రాజు- అయినచో మీకు చేతులెట్లువచ్చినవి?

దాసు- ఇది సర్వేశ్వరుని నిర్హేతుక కృపాఫలము. ఆమహానీయుఁడు తన భృత్యుని యపచారముల గణింపక తన దయాపూర్ణస్వభావమునే యావిష్కరించుచుండును.

ఇదియంతయు విని యారాజచంద్రుఁడు హర్షపులకిత గాత్రుఁడై యానందవశమున గద్గదకంఠుఁడాయెను

—— హా! భక్త రామదాస్ ——

ఇదిగదా నిజముగు వైష్ణవలక్షణము.

# సదాదిశబ్దములకు శ్రీమన్నారాయణునియందే పర్యవసానము

కోయిల్ కన్దాడ వెంకటనర్సింహాచార్యులుగారు, రామన్న పేట, వరంగల్.



భగవంతునిచే సృష్టించబడిన ఈప్రపంచము నందు చైతన్యము కలిగి ఇహపర సాధకంబయి శాస్త్రవశ్యతగలదీ మానవజన్మమే. కావుననే జ్ఞానవిహీనమగు అచేతనమువలెను దుఃఖమనుభవించు నరకస్థుల వలెను సుఖానుభవమందు తేజశ్శరీరులగు దేవతలవలెకాక కిందటి జన్మపరంపరలనుండి వచ్చుచున్న పాపనివృత్తికి పునరావృత్తి రహితమై శాశ్వతమైన మహదానంద మందుటకు కారణమైనది. యీభూలోకమందైన మానవజన్మమే.

ఈమానవుడు ముఖ్యముగా తెలుసుకొనదగిన విషయము కారణవస్తువై పరబ్రహ్మ యనబడు శ్రీమన్నారాయణుడు ఆనారాయణ బోధకమగు జ్ఞానము అపౌరుషేయమై నిత్యమై నిర్దుష్టమై భ్రమ విప్రలంభ ప్రమాదాది దోష రహితమై స్వయంప్రమాణమై శ్రీమన్నారాయణునిచే చతుర్ముఖ బ్రహ్మ కుపదేశించబడిన వేదము వలన కల్గును. అందు సదేవసౌమ్యేదమగ్ర ఆసీత్, బ్రహ్మవాఇదమగ్రఆసీత్, ఆత్మావా ఇదమగ్రఆసీత్, పురుషఏవేదగ్ంసర్వం, యదాతమస్తన్నదివానరాత్రి ర్నసన్నచాసచ్ఛివఏవ కేవలః, హిరణ్యగర్భస్సమవర్తతాగ్రే, నకిరిం దిగ్వ్యా దుత్తరః, ఆకాశోహవై నామరూపయోర్నిర్వహితా, ఏకోహవై నారాయణ ఆసీత్, ఇత్యాదివేదాన్తవాక్యములందుసామాన్య వాచకములచే కొన్ని కొన్ని విశేషవాచకములచే కారణవస్తు బహుత్వము చెప్పబడుటచే ముముక్షుజనము సంశయవిచ్ఛిత్తికాక బాగుపడకుండుటచూచి సంసారభయపీడితులగు వారల యదృష్టవిశేషమువలన యవతరించిన భగవద్రామానుజాచార్యులవారు నారాయణాంశచే యవతరించిన శ్రీవేదవ్యాసుల వారిచే వేదార్థములనన్ని కేన్ద్రీకరించి రచింపబడిన బ్రహ్మసూత్రములకు పైన జెప్పబడు వేదాంత వాక్యార్థముల కన్నింటికి సమన్వయముజేసి యదార్థార్థమును తేల్చి భాష్యమునురచించిరి. మరియు అభేదవాదు లిదివరలో బ్రహ్మసూత్రముల కర్థమునిర్ణయించిన వివ్మట తిర్గి వీరి నిర్ణయ మెందుబకన!

అభేదవాదులు భేదశ్రుతులకు వ్యావహారిక సత్యత్వమాత్రము జెప్పి అభేదశ్రుతులకే పారమార్థిక సత్యత్వము నంగీకరించినారు.

అత్యంత భేదవాదులు అభేదశ్రుతుల కపరమార్థత్వమును జెప్పి భేదశ్రుతులకు పరమార్థత్వము నంగీకరించినారు. ఇక శ్రీభగవద్రామానుజాచార్యుల వారైతేనో భగవదాజ్ఞారూపంబగు వేదమునందలి ప్రామాణ్యాప్రామాణ్యబుద్ధిచే అంగీకార అనంగీకారములుచేయ రాదని తలంపుతో భేదాభేదశ్రుతుల నన్నిటిని ఘటకశృత్యనుసారము చక్కగా విమర్శించి సమన్వయ మొనరించినారు. కాన రామానుజాచార్యులవారి సిద్ధాన్తమే సర్వజనాదరణీయమని సిద్ధాన్తము.

సచ్ఛబ్దము (సదేవసౌమ్యేద మగ్రఆసీత్) అనుస్థలమందు కారణరూప ద్రవ్యము మరొక అవస్థ నొందుట కార్యమని యేద్రవ్యము

స్వభావము గలది కార్యావస్థయో. అస్వభావము గల ఆద్రవ్యమే కారణావస్థము, కాన పరిదృశ్యమానమైన ఈప్రపంచమునకింత గుణసామ్యావస్థమగు దీని సూక్ష్మావస్థనే సచ్ఛబ్దము చెప్పుచున్నదని శంకకలుగగా సచ్ఛబ్దము ప్రకృతికి సంబంధించని ఈక్షణరూప సంకల్ప విశేషము కల్గి యుండుటచే ప్రకృతి పరముకాదనియు సర్వకారణత్వమును ప్రతిపాదించుటచే, చేతన పరముగాక పరమచేతనంబగు నారాయణునే బోధించుచున్నది.

బ్రహ్మశబ్దము నారాయణునికన్న నితరము లగు చేతనాచేతన పరముగా శంకించి స్వరూపముచేతను అనవధికాతిశయ బృహత్త్వము బ్రహ్మశబ్దమునకు ప్రవృత్తినిమిత్తమని ఆబృహత్త్వము నారాయణునియందు తప్ప నితరత్ర లేకుండుటచే బ్రహ్మశబ్దము శ్రీమన్నారాయణ పరముగా సిద్ధాన్తమొనరించినారు. ఆత్మశబ్దము, అత్తీత్యాత్మాయను వ్యుత్పత్తిచే కర్మఫలమనుభవించువాడనియర్థము. ఆకర్మఫల భోక్తృత్వము జీవునికే సంభవించుటచే ఆత్మశబ్దముచే చెప్పబడువాడు జీవుడని శంకించి అదభక్షణే, యను ధాత్వనుసారముగ అదనము సామాన్య భక్షణముకాక "యస్యబ్రహ్మచక్షత్రంచ ఉభేభవత ఓదనః మృత్యుర్యస్యోపసేచనం" అని మృత్యూపసేచనసహిత సకలబ్రహ్మాండోప సంహృతిరూపమైనదగుటచే ఆఅదనము శ్రీమన్నారాయణునకు తప్ప తదితర చేతనునికి సంభవించనందున ఆత్మశబ్దము శ్రీమన్నారాయణ పరమే.

పురుషశబ్దము పురిసీదత ఇతిఅను వ్యుత్పత్తిచే పురుషశబ్దవాచ్య ప్రకృతి పరిణామ రూపంబగు శరీరమందుండు వాడనియర్థమగుటచే దేవాది శరీరవిశిష్టుడగు జీవుని పరముగా శంకించి పురుష ఏవేదగ్ం సర్వం యద్భూతం యచ్చభవ్యం ఉతామృ తత్వస్యేశానః॥ అని భూతభవ్యరూప వత్వ అమృత ప్రదత్వ ఈశానత్వాది ధర్మవిశిష్టునిగా చెప్పుటచే ఆధర్మంబులు ఈశ్వర వ్యతిరిక్తంబగు జీవునియందు అసంభవంబగుటచే పురుషశబ్దము శ్రీమన్నారాయణపరమే.

పరంతు శబ్దములకు అర్థమును బోధించుట పర్యవసాన వృత్తియని అపర్యవసాన వృత్తియని రెండు విధంబులు అందు విశేషణాంశమును బోధించునది పర్యవసానవృత్తియని విశేష్యాంశమును బోధించున దపర్యవసాన వృత్తియని వ్యవహరింతురు. కావున "సఆత్మాఅంగాన్యన్యాదేవతాః" అను శ్రుతిచే సకల దేవతలు శ్రీమన్నారాయణునికి విశేషణ భూతంబగు శరీరంబనియు వాడు విశేష్యమగుయాత్మయనియు అపర్యవసాన వృత్తిచే విశేష్యమగు నారాయణుని యందే పర్యవసించును.

ఇంకను వేదవాక్యంబులు విధిరూపంబులని అనువాద రూపంబులని రెండువిధంబులు అందు అనువాద వాక్యంబులకన్న విధి వాక్యంబులకు ప్రాధాన్యము కాన (అనితర సాధారణంబగు) ఇతరులకు సాధారణముకాని నారాయణ శబ్దంబుచే కారణత్వము విధింపబడుటచే అనువాదవాక్య ఘటితంబులగు ఇంద్ర హిరణ్యగర్భ శంభ్వాదిశబ్దంబులచే విధింపబడిన కారణత్వము నారాయణునియందే పర్యవసించును కాన సద్బ్రహ్మాత్మాది సామాన్యవాచకంబులగు శబ్దంబులు అభిన్ననిమిత్తోపాదానకారణత్వ సత్యసంకల్పత్వ

సకల జగద్రక్షకత్వ సకల జగత్సంహారకత్వ మోక్షప్రదత్వాది ధర్మసాహచర్యముచే శ్రీమన్నారాయణ ప్రతిపాదకంబులై ఇంద్రాది విశేష వాచకంబులగు తత్తదసాధారణ శబ్దంబులు పరంబ్రహ్మాఽసాధారణ ధర్మసాహచర్యంబుచే అవయవార్థ విశేషంబుచే అపర్యవసానవృత్తి పూర్వకంబుగా నారాయణ పర్యవసానంబులగుటచేఁ "సర్వేవేదాయత్పదమామనంతి" యనియు వేదాక్షరాణి యావంతిపఠితాని ద్విజోత్తమైః తావంతి హరినామాని కీర్తితాని నసంశయః అని శ్రుతిస్మృతులచే జెప్పబడుచున్నది.

'యస్యాత్మాశరీరంయస్య పృథ్వీశరీరం' ఇత్యాది శ్రుతులచే సకలచేతనాచేతన శరీరకుడు నారాయణుడగుటచే శరీరవాచకానాంశబ్దానాం శరీరిణి పర్యవసానంబను న్యాయం బనుసరించి సర్వశబ్ద వాచ్యత్వము శ్రీమన్నారాయణునియందు సంభవించుచుండగా సదాదిశబ్దంబులు శ్రీమన్నారాయణ పర్యవసానంబులనుట కెంతయు సందియంబుండదు. ఇదియే పరాశరపారాశర్యాది నాథ యామున యతివరాది పూర్వాచార్యాభిమతమగు సమన్వయము.

## యతిరాజవిజయ నాటకమునందలి కొన్ని చక్కని శ్లోకములు

శ్రీ ఉ. వే. శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులుగారు

సదూహుడు-

శ్లో. విభుశ్చే న్నైవ స్యా దణుపరిమితో ఽణు ర్యది భవాన్ ।
కథం సర్వత్రి స్యా ద్ద్వివిధ ఇతి చే న్నోచిత మిదం ।
స్వయం న స్యా ద్రూపద్వయ మపి న చేత్త్వాం మధురిపో ।
కథం భూతాకారం కథయ నిరణైషి దుపనిషత్ ॥

—: తాత్పర్యము :—

ఓమధురిపూ! నీవు విభుపరిమాణము కలవాడవందుమా సకల చేతనాచేతనాంతః ప్రవేశార్హమగు నణుపరిమాణుడవగుట యొప్పదు. అంతమాత్రమున నణు పరిమాణుడవందుమా, నంతట నిండి యెట్లుందువు? పోనీ ఉభయకార్యనిర్వాహమున నుభయవిధపరిమాణుడవందుమా, ఒక దానికి రెండు విరుద్ధరూపము లుండవు గాన నిది యసంగతము. ఇక నుపనిషత్తు నిన్నెట్టి యాకారుడవని నిర్ణయించెనో నీవే చెప్పుము.

## భగవద్విషయ పరంపర

శ్రీరామానుజయోగి సుందరవర
శ్రీశైలనాథాన్ గురూన్ ।
లోకార్యోత్తరవీధి-కృష్ణ కలిజిత్
వేదాంతి భట్టారకాన్ ।
శ్రీగోవింద యతీంద్ర పూర్ణ యమునా
వాస్తవ్య రామానుజే ।
పద్మాక్షాహ్వయ నాథయోగి శఠజిత్
సేనేశ పద్మా హరీన్ ॥ [జీయర్

1. శ్రీరామానుజయోగి = ఒన్నాన వానమామల రామానుజ
2. సుందరవర = మణవాళ మామునులు
3. శ్రీశైలనాథ = తిరువాయ్మొழிప్పిళ్లై
4. లోకార్య = పిళ్లైలోకాచారియర్
4. ఉత్తరవీధికృష్ణ = వడక్కుత్తిరువీధిప్పిళ్లై
6 కలిజిత్ = నంబిళ్లై
7. వేదాంతి = నంజీయర్
8. భట్టారక = భట్టరు
9. శ్రీ గోవింద = ఎంబారు
10. యతీంద్ర = శ్రీరామానుజులు
11. పూర్ణ = పెరియనంబి
12. యమునావాస్తవ్య = శ్రీ ఆళవందార్లు
13. రామ = మణక్కాలనంబి
14. పద్మాక్షాహ్వయ = ఉయ్యక్కొండారు
15. నాథయోగి = శ్రీమన్నాథమునులు
16. శఠజిత్ = నమ్మాళ్వార్లు
17. సేనేశ = విష్వక్సేనులు
18. పద్మా = శ్రీదేవి
19. హరి = శ్రియఃపతి

ఈ పందొమ్మండుగురు ఆచార్యులను గురుపరంపరా మాలికలోను శ్రీరామానుజులుమధ్యనాయకమణియైయున్నారు.

### తిరువాయిమొళి వ్యాఖ్యానములు

తిరుక్కురుగైప్పిరాన్ పిళ్ళాను = ఆరాయిరప్పడి 6000
(విష్ణుపురాణ ప్రక్రియ)
నంజీయరు = ఒంబదినారాయిరప్పడి 9000
(శ్రీభాష్యప్రక్రియ)
పెరియవాచ్చాన్‌పిళ్లై = ఇరుపత్తినాలాయిరప్పడి 24000
(శ్రీరామాయణ ప్రక్రియ)
వడక్కుత్తిరువీధిప్పిళ్లై = ఈడుముప్పత్తారాయిరప్పడి 36000
(శ్రుతప్రకాశిక ప్రక్రియ)
వాదికేసరి అళగియ మణవాళ జీయర్ = పన్నీరాయిరప్పడి
12000 (శ్రీభాగవత ప్రక్రియ)

* "పడి" అనగా 32 అక్షరములు గల భాగమని పేరు. దీనిని ఒక "గ్రంథము" అని కూడ వాడుటకలదు.

## శ్రీభాష్య పరంపర

శ్లో. వరదగురు వేంకటేశౌ
రామానుజ వరద విష్ణుచిత్తార్యాన్
కురుకేశ్వర భాష్య కృతౌ
నమామి నాథేన యామునం వ్యాసం ॥

1. వరదగురు = నయనారాయణాచార్యులు
2. వేంకటేశ = వేదాంతదేశికులు
3. రామానుజ = అప్పుళ్లార్లు
4. వరద = నడాదూర్ అమ్మాళ్
5. విష్ణుచిత్తార్య = ఎంగళాళ్వాను
6. కురుకేశ్వర = తిరుక్కురుగప్పిరాన్ పిళ్ళాన్
7. భాష్యకృత్ = శ్రీరామానుజులు
8. యామున = శ్రీయాళవందార్లు
9. నాథ = శ్రీమన్నాథమునులు
10 వ్యాస = వేదవ్యాసులు
11. పరాశర = పరాశరమునులు
12. సేనముదలి = విష్వక్సేనులు
13 శ్రీహరి = శ్రియఃపతి

ఈ పదముగ్గురు ఆచార్యులను గురుపరంపరామాలికలోను శ్రీరామానుజులు మధ్యనాయకమణియై యున్నారు.

### శ్రీభాష్యవ్యాఖ్యాతలు—వ్యాఖ్యానములు

1. సోమాసియాండాన్ = నయవివేకము, మిశ్రప్రకాశికా
2. సేనేశ్వరాచార్యులు = శారీరకా ధికరణార్థ సంగ్రహము (సేనానాథీయం) అనుష్టుప్పద్య రూపము 300.
3. వరదనారాయణ భట్టారకులు = న్యాయసుదర్శనము
4. విష్ణుచిత్తాచార్యులు = శ్రీభాష్యవివరణము, సంగతిమాలా
5. వ్యాసార్యులు = శ్రుతప్రకాశికా శ్రుతదీపికా
6. వేదాంతాచార్యులు = తత్త్వటీకా, అధికరణార్థసంగ్రహము (స్రగ్ధరావృత్తరూపము) అధికరణ దర్పణము
7. రంగరామస్వామి = మూలభావ ప్రకాశికా. (గురుభావప్రకాశికా)
8. సుదర్శనపురం శ్రీనివాసాచార్యులు = తత్త్వమార్తాండము.
9. కంచి శ్రీనివాసాచార్యులు = తత్త్వరత్నావళీ, (మణిమంజూషా సహితా)
10. అప్పయ్యదీక్షితులు = నయమయూఖమాలికా

# ఉపనిషద్వాక్యములు విశిష్టాద్వైతమునకే అనుకూలములు

నడాదూరి వెంకటకృష్ణమాచార్యులుగారు

ఆపాతతః విచారించగా ఉపనిషత్తులలో ప్రతిపాదించబడిన అభేదశ్రుతులు పరబ్రహ్మ ఒక్కడే సత్యము; మిగిలినది సర్వము అసత్యము; భేదము అపార్థము అని తోచునట్లు ఉన్నది. గాని శాస్త్రసహాయముచేత సూక్ష్మదృష్టితో యోచించినయెడల విశిష్టాద్వైతమే సత్యము అని యేర్పడుచున్నది. విశిష్టాద్వైతమనగా విశిష్టం చ విశిష్టం చ విశిష్టే; విశిష్టయోః అద్వైతం, అని విగ్రహము. నామరూప విభాగములు లేని సమయమునందు సూక్ష్మరూపముగా నుండి తిరిగి నామరూప విభాగమేర్పడి నప్పుడు స్థూలరూప మగుచున్నది. ఈ విషయమే సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్ ఏకమేవా ద్వితీయం అను శ్రుతిచేత ప్రతిపాదించ బడుచున్నది. మరికొన్ని అభేదశ్రుతులను విచారింతము. "నేహ నానా స్తి కిఞ్చన. మృత్యోస్స మృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి" అను శ్రుతిని ఆపాతతః యోచించగా ఈ పరబ్రహ్మ యందు యేవిధమైన భేదము లేదు. ఎవడైతే దీనియందు భేదమునుచూచునో వాడు సంసారము నుండి తిరిగి సంసారమును పొందుచునే వుండును అనితోచునట్లున్నది. గాని దానికి ఈ అర్థము. ఎట్లన ఈజగత్తంతయు బ్రహ్మాత్మకము గాని వస్తువే లేదు. ఎవడైతే ఇచ్చట బ్రహ్మాత్మకముగాని దానిగావస్తువును చూచుచున్నాడో వాడు సంసారము నుండి తిరిగి సంసారమును పొందుతూనే ఉండును. అని అబ్రహ్మాత్మక నానాత్వమే ఇచ్చట నిషేధించబడుచున్నది. సమస్త ప్రపంచము బ్రహ్మకార్య మగుటచేత బ్రహ్మాత్మకమగుటచేత బ్రహ్మతో ఏకమగుట చేతనున్ను బ్రహ్మవ్యతిరిక్తమైన భేదము నిషేధించబడుచున్నదేగాని 'బహుస్యాం ప్రజాయేయ' అని తైత్తిరీయములో చెప్పబడిన అనేక రూపములుగా అగుట అను సంకల్పముగాని, యోఽవ్యక్తమన్తరే సఞ్చరన్ యోఽక్షరమన్తరే సఞ్చరన్, యస్యాక్షరం శరీరం, అను శ్రుతి వాక్యములచే చెప్పబడిన అన్తర్యామిత్వముగాని 'అనేన జీవే నాత్మ నాఽనుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి' అను శ్రుతిచేత చెప్పబడిన పేరును రూపమును పొందుట అను అంశముగాని ఈశ్రుతిచేత నిషేధించబడవు. ఇందుకు ప్రమాణశ్లోకము.

యద్బ్రహ్మణో గుణ శరీర వికార భేదకర్మాది గోచరవిధి ప్రతిషేధ వాచః। అన్యోన్యభిన్న విషయా న విరోధగన్ధ మర్హన్తి తన్న విధయః ప్రతిషేధబాధ్యాః॥ సమస్త హేయగుణ రహితునికి హేయాకార వస్తువుతో ఐక్యము సమ్భవించుట అసఙ్గతమైనందువల్లనున్ను సర్వజ్ఞునికి తన సఙ్కల్పముచేత హేయవిషయకమైన భ్రమ కలిగినది అని చెప్పుట అసమ్భావితమై నందువల్లనున్ను సర్వజ్ఞుడుకాడు అని చెప్పినయెడల (యస్సర్వజ్ఞ స్సర్వవిత్) అను శ్రుతితో విరోధించుటవల్లనున్ను సర్వశక్తునికి తనయందుగల హేయనివారణ శక్తిలేదన్నచో (పరాస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే) అను సర్వశక్తి శ్రుతులు విరోధించుట వల్లనున్ను "పృథగాత్మానం ప్రేరితారంచ మత్వాజుష్టస్తతస్తేనామృతత్వమేతి. జుష్టంయదా

పశ్యత్యే న్యమీశం) అనునట్లు భేదజ్ఞానమే మోక్షోపాయము అన్నందువల్లనున్ను భాగపకున్యాయముచేత సామాన్యముగా భేదనిషేధము స్వతంత్ర భేదవిశేష నిషేధపర్యవసాయి అగుటవల్లనున్ను జ్ఞాజ్ఞౌద్వావ జావీశానీశౌ) అనుటచేత ఈశ్వరుడు నియమించువాడు జీవుడు నియమింపబడువాడు అని భేదము స్పష్టముగా యేర్పడుచున్నందువల్లనున్ను, ఇది అనువాద రూపమన్నట్లైతే ఘటపటాది భేదమువలెనే ప్రత్యక్షప్రమాణ గోచరము కానందువల్ల అట్లు చెప్పుటకువీలు లేనందువల్లనున్ను ప్రమాణాన్తర ప్రాప్తమైన అర్థము యొక్క పునరను సన్ధానమేగదా అనువాదము అనుటవల్లనున్ను ఇత్యాది అనేక యుక్తులచేత ఉపనిషత్తులలో చెప్పబడిన భేదనిషేధ శ్రుతులు అబ్రహ్మాత్మక నానాత్వ నిషేధపరములే గాని భేదమాత్ర నిషేధపరములు గావు. యత్రహి ద్వైతమివభవతి, యత్రత్వస్య సర్వమాత్మైవాభూత్, తత్కేన కం పశ్యేత్ తత్కేన కం విజానీయాత్ ఇత్యాది అభేదశ్రుతులున్ను ఈ విధముగానే ఉన్నేయములు.

(తత్త్వమసి శ్వేతకేతో) అను శ్రుతియందు తచ్ఛబ్దము పూర్వవస్తు పరామర్శి అగుటవల్ల సర్వజ్ఞుడై సత్యసంకల్పుడై జగత్కారణ భూతుడైన పరబ్రహ్మనే పరామర్శిస్తుంది. దీనికి పూర్వము (తదైక్షత బహుస్యాం) అను శ్రుతులవల్ల ఆ బ్రహ్మయే చెప్పబడుటవల్ల ఆ తత్పదముతో సమానాధికరణమైన త్వం అను పదమున్ను అచేతన విశిష్టజీవుడు శరీరముగాగల పరబ్రహ్మనే ప్రతిపాదిస్తున్నది. ఇట్లే (యదాహ్యేవైష ఏతస్మిన్నుదర మన్తరం కురుతే, అథతస్య భయంభవతి) అను శ్రుతివాక్యముచేత బ్రహ్మయందు కొంచము భేదమును తలచి నప్పటికిన్ని వానికి భయము కలుగుచున్నది. అని యేర్పడుచున్నది గదా అనగా ఆశ్రుతికి అట్లు అర్థము గాదు. (సర్వం ఖల్విదం బ్రహ్మతజ్జలానితి శాన్త ఉపాసీత) అను శ్రుతిచేత సమస్త జగత్తుయొక్క సృష్టి స్థితి సంహారములు పరమాత్మ కార్యమునందువల్ల తదాత్మకము జగత్తు అని అనుసంధించుట శాన్తిహేతువు. ఆరీతిగా అనుసంధానమే అభయహేతువు అని యేర్పడుచున్నది. అట్లనే (అథతస్య భయంభవతి) అని యెందువల్ల చెప్పబడినది. అనగా ఆశ్రుతికి పూర్వము (యదాహ్యేవైష ఏతస్మిన్నదృశ్యే ఒనాత్మ్యే ఒనిరుక్తే ఒనిలయనే ఒభయం ప్రతిష్ఠాం విన్దతే అథసో ఒభయంగతో భవతి) అని బ్రహ్మయందు ప్రతిష్టను పొందినట్లైతే అదే భయహేతువు అని అర్థము. ఈఅంశమునే మహర్షులు చెప్పిరి (యన్ముహూర్తం క్షణం వాపి వాసుదేవో నచిన్త్యతే సాహాని స్తన్మహచ్ఛిద్రం సాభ్రాన్తి స్సాచవిక్రియా॥ ఏకస్మిన్నప్యతిక్రాన్తే ముహూర్తే ధ్యానవర్జితే॥ దస్యుభిర్ముషితేనేవ యుక్తమాక్రన్దితుం భృశం॥ ఇత్యాది అనేక ప్రమాణములచేత ఉపనిషత్తులకు విశిష్టాద్వైత బోధనమునందు తాత్పర్యమేగాని కేవలాద్వైత బోధనమునందు తాత్పర్యము లేదు.

"ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః"

కాకినాడలో జరిగిన

# శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ

ఆషాఢమాస పర్వదిన పరిషత్సభా సందర్భమున చదువఁబడిన

## పద్యరత్నములు

(కర్త: నారాయణాచార్య భాగవతార్, కాకినాడ.)

శా. "దాసోఽహం" సకలాభినంద్య పరిష త్సంగ స్థలీ సేతకున్,
"దాసోఽహం" భగవద్గుణానుభవ పూ తస్వాంత సభ్యాళికిన్,
"దాసోఽహం" యతిసార్వభౌమ చరణ ద్వంద్వాశ్రిత శ్రేణికిన్,
"దాసోఽహం" మన కార్యదర్శులకు, నుద్యత్, వి, ప్ర, సంఘ[illegible], 1

మ. సిరులొప్పన్ సకలాగమాంత విదులౌ శ్రీవైష్ణవాగ్రేసరుల్,
పారిషత్త్రాగ్రణు లెందఱోయిటు విశిష్టాద్వైత సిద్ధాంత స
త్ప్రతిమన్న్యాస సభాప్రయుక్తముగ సం దర్శించినారల్, భళీ!
పరమాహ్లాదము, కాకినాడ పుర సౌభాగ్యమ్ము మున్మాటికిన్ 2

సీ. శ్రీరస్తు సర్వదా శ్రీవిశిష్టాద్వైత సమయప్రచారక సంఘమునకు
భద్రమస్తు, సతమ్ము ప్రస్తుతాషాఢమా సానుప్రయుక్తస భాపతికి
క్షేమమస్త్వనిశమ్ము శ్రీ శాంఘ్రిభక్తిక్ర తాహ్వాన కరణ సంఘాధిపతికి
శుభమస్తు నిత్యమ్ము సువిశాలభావ సం యుక్తక్రియాదర్శి యుగళమునకు

గీ. భాగ్యమస్తు సతము స్త్రీవర్గమునకు, భవ్యమస్తు సదా సభా పండితులకు
శుభవితతిరస్తు సర్వదా శ్రోతలకును, సౌఖ్యమస్తు సదా మీకు సభ్యులార! 3

---

### వైష్ణవత్వ మన్నగా నేమి?

పరసమృద్ధ్య సహత్వమును, స్వసమృద్ధి సమత్వమును,
పరసమృద్ధ్యేక ప్రయోజనత్వమును వైష్ణవత్వ లక్షణము.

# శ్రీరామానుజ క్రతువు విజయవాడ

శతావధాని కృష్ణమాచార్యులుగారు కొడట్ల (నైజాం)



శ్రీస్తవనీయసోదర ? వశీకృత రంగవిహార హోమ సా
రాస్తగణోల్లసద్యుతివరామతి రూపకృపావిలాస భూ
మాస్తనితోన్నత స్వరవిమర్దితదుర్మద హంసనీ పదా
నుస్తుతిగల్గజేయుము మనోజ్ఞ గుణాకర శ్రీయతీశ్వరా
జగములనుద్ధరింప కడుజాలి ? బూనిజెనించి వాది వ
క్రగతు లడంచి దాసజన కాంక్షలదీరిచి తాపమెల్ల బాత్
తుగ నడగించి విజ్ఞులను నుతుల్గాంచుంటివి మాదృశాత్మ కీ
వృగద గతుల్గలుగబ్రోచెటి మేటివి శ్రీయతీశ్వరా.

విద్యల తత్వమెల్ల జన విశ్రుతభాష్యమునందు జూపి రా
జద్యుమణి ప్రకాశమునజాలు సుమంగళ విగ్రహ ప్రమే
యద్యుతు లుల్లసిల్లగ జయంబువహించిన దివ్యలోక దే
వాద్యుడవీవు నీమహిమనారయ నెంతటివాడ చిన్నవా
డద్యతనుండ నిన్గొలచునంతటి వాడగు నాయతీశ్వరా ?

ముముక్షువుకు దేవతాంతరముల యెడల ప్రీతియును, శబ్దాది విషయముల యెడల ప్రీతియును, మోక్షము గలుగుటకు ప్రతిబంధకములు. వీటిలో రెండు మాత్రమున్నవాడు కాలాంతరమందైనను కడతేరవచ్చును. వీటిలో నొక్కటిమాత్రము (విషయప్రావణ్యము) ఎప్పటికిని ప్రతిబంధకముగానే యుండగలదు.

శ్రీమతే రామానుజాయ నమః

# రహస్యత్రయార్థసారము

శ్రీమాన్ శ్రీమత్తిరుమలై నల్లాన్ చక్రవర్తి సంపత్కుమార జగన్నాథతిరువేంకటాచార్యులవారు

## ద్వయమంత్రప్రకరణము

### పాట

చాపుతాళము

ద్వయమంత్రమున కర్థము । దెల్పెదను, దయయుంచి పాలింపుడీ ;
అందు శ్రీమత్పదంబు । మొదటిపద, మందుశ్రీయనలక్ష్మియా ॥
దీనికిన్ మూలమైన । శ్రిఞ్ ధాతు, వౌనుసేవార్థకంబు ॥
ఈపదంబునకు రెండు । వ్యుత్పత్తు, లేపారునవి వినుండు ॥
శ్రీయతేశ్రయతేయని । యవిరెండు, నీయర్థము లదెల్పును ॥
నరులచే నాశ్రయింప । బడునుశ్రీ,హరినాశ్రయించుననుచు ॥
ఈరెండుహేతువులను ॥ దగుబురుష. కారమును జేయంగను ॥
అపరాధియగునితనికి । హరిగదియు, నపుడత్యవసరంబిది ॥
నిత్యయోగంబర్థము । గామతు. ప్ప్రత్యయంబుండుగాన ॥
పురుషకారముజేసెడి । సిరియెప్పుడు, హరినిబాయనిదయ్యెను ॥
నరుడిందువలనహరిని । గదియునవ, సరమరయ బనిలేదికన్ ॥
కావలయు రుచియొక్కటే । హరిగదిసి, సేవింపగావీనికి ॥
పురుషకారబలంబున । స్వాతంత్ర్య, గరిమశిరమునువంచిన ॥
అపుడుతలయెత్తుగుణముల్ । నారాయ, ణపదంబుచే దెలియును ॥
గుణములవియేవియోవి । యవిజేయు, పనులేవియేవనినను ॥
పాపములకడలకుండ । గావింప, నోపువాత్సల్యమొకటి ॥
పనులుగాకుండవనుచు । నమ్మించి, తనరుస్వామిత్వమొకటి ॥
వానిస్వామిత్వమ్ముగని । యెడబాయ, నీనిసౌశీల్యమొకటి ॥
వానిగనియాశ్రయింప । జేయునది, యైనసౌలభ్యమొకటి ॥
వైరులనుబారద్రోలి । చేర్చుకొని, తీరుజ్ఞానముశక్తియున్ ॥
ద్వివచనంబైనచరణ । శబ్దమీ, యవనిదెల్పునదేమన ॥
జేత్రిసౌంధర్యంబును । పాయసం, పూర్తియును దెలుపబడును ॥
శేషభూతునకు దీని । కేవంద్రు, శేషియెడ జొచ్చుటకును ॥
ఇదివిగ్రహైకదేశ । మగుటచే, నదివీనిలక్షితమగున్ ॥

శరణపదమునకర్థము । నిచటదల తురుపాయమేయనుచును ॥
దాననిష్టములమరును । అటుగాని, వానివారణగలుగును ॥
అవనినిబ్రపద్యేయను । దానిక ధ్యవసింతుననియర్థము ॥
ఒకమారెయిది జేయగా । దగియుండ నికవర్తనమూనమేల ॥
ఎపుడైనబారపడినను । బరిహ్రాతికి నుపయుక్తమైనదియిది ॥
శ్రీపదంబుత్తరార్థ । మందలిది ప్రాప్యత్వమును దెలుపును ॥
కైంకర్యవర్ధకత్వ । మనునర్థ మింకొకటియుంచుగలదు ॥
ఇందువివరింపబడియె । దిరుమంత్ర మందుజెప్పినప్రాప్యము ॥
దీనివివరింపకుండ । దెలియదటు గాన దెల్పెదనువినుడు ॥
సర్వశేషిగనుండిన । వానికని నిర్వచింతురుదీనిని ॥
ఈపదమువిగ్రహమును । గుణములను, నేపుమీరగ దెల్పును ॥
ఐనశేషిత్వమునను । దీనికిప్రధానముగజూపుండును ॥
ఇందలిచతుర్థివలన । కైంకర్యమందముగ దెల్పబడును ॥
పొందుగనమఃపదంబు । కైంకర్య మందుగలుపునుదీయును ॥
తనకొరకుగావించుట । యిందుగలు పనిచెప్పబడునిజముగా ॥
ఇందుననవిద్యాదులున్ । వినివృత్తి జెందునిస్సంశయముగా ॥
సౌందర్యమొకవిఘ్నము । అక్లైమొద టందెలుపుకైంకర్యము ॥
కైంకర్యమెపుడుగోరు । నటుతడా తంకవినివృత్తిగోరు ॥
ఇదియెద్వయమంత్రార్థము । నిదిదెలియ నొదవుబురుషార్థమెల్ల ॥
దీనికినకించనుండ । నన్యార్హుడైననధికారియగును ॥
ఇందు పెరియపిరాట్టిచే । బురుషార్థ మందనగుననిచెప్పెను ॥
ఆత్మగుణములకెల్లను । వాసమగు నాత్మయుందధికారియగా ॥
ఇందువివరింపబడియె । దిరుమంత్ర మందుగలిగినయర్థము ॥
దీనికున్నప్రభావము । వేదంబు లోనిరూపింపబడెను ॥
రుచిపరిగృహీతమయిన । దాచార్య నిచయంబుచేనియ్యది ॥
కనుకనాచార్యనిష్ఠ । గలిగియుం డినవారికిదిముఖ్యము ॥
ఈకారణములదీని । యర్థమును మీకువినుపించినాడ ॥



: చరమశ్లోక ప్రకరణము :

చాపుతాళము

వినుడుచరమశ్లోక మునకుగలయర్థమో । ఘనులారశ్రద్ధగలిగి ॥
సర్వధర్మాననియె సంగుపదమునధర్మ । శబ్దార్థమేమనినను ॥
దృష్టఫలసాధనము లిచటజెప్పంబడవ । దృష్టఫలసాధనములే ॥
అవియనేకంబులై నందుచేబహువచన । మయ్యెనిచ్చటనుండుగా ॥
అర్హతాపాదకము లగునిత్యకర్మంబు । లగుసర్వశబ్దార్థము ॥
ఇకబరిత్యజ్యయను నెడద్యాగమనెడిదా । నికిగలుగుభావమిదియె ॥
ముందటియుపాయముల యందుపాయత్వమతి । జెందినామిదిదోషము ॥
అనుపాయములగువా నినుపాయములటంచు । ననుకొంటిమిదిగూడనే ॥
భ్రాంతిపడితిమిశుక్తి రజతమనివిపరీత । భాగమునకేగితిమని ॥
ఇట్టిబుద్ధివిశేష మొసగద్యజియించుటే । యిచటిత్యాగపదార్థము ॥
పరియనెడిదుపసర్గ పదముదానికినర్థ । మెరిగింతునాలింపుడీ ॥
పాతకాదులనెట్లు వర్జింతురోయట్టి రీతిరుచివాసనలతో ॥
మరలబైబడకుండ మదిసిగ్గునద్యజించు । సరణినిదిబోధించును ॥
ల్యాప్త్యుపాయాంతరము లనువిడచియెగ్రహింప । నొప్పననునదిజెప్పను ॥
మామనినసర్వసం రక్షకుడునీకువశు । డైమెలగునన్ననదగున్ ॥
నీమనస్సమ్మతిజూచి నీదుతప్పులనొప్పు । గాదలచునన్నుసనియుక్ ॥
సమకూర్చువారుదూరము జేసిననువిడచి ॥ యమరజాలనినన్నని ॥
స్థానబ్రమాణంబు చేనేకశబ్దార్థ । మైనదవధారణంబు ।
ఇందుచేస్వీకార మందలియుపాయత్వ । మొందుచుండెనివృత్తిని ॥
శరణశబ్దముక్రింది సందర్భములకుదా । సరిపడవలసినందున ॥
దీనికర్థములెన్ని యైనమన్ననునిచట । నౌనుపాయమెయర్థము ॥
వ్రజధాతువునకున ర్థంబుగతియదిబుద్ధి । నిజముగానిట్లగుటచే ॥
అర్థమేర్పడియెవ్రజ యనుటదానిక । ధ్యవసింపుమాయనుచును ॥
అహమనినసర్వజ్ఞుడై సర్వశక్తియై । ప్రాప్తయునునగునేనని ॥
త్వాపదార్థముదెలివి బలిమిప్రాప్తియులేక । పాయమేనగునిన్నని ॥
వినుపింతుసర్వపా పేభ్యోయనెడిపదం । బునకర్థమగుదానిని ॥
ననుజేరనీయనివి యనివెరతువోవేని । గనియవన్నిటినుండియు ॥
మోక్షయిష్యామియన ముక్తినందగజేసి । పుచ్చెదనటంచర్థము ॥

మనకుబని లేదవియె చనుదమంతటనుదా । మనుచుణిచ్ ప్రీత్యయమనున్ ॥
మాశుచః పదమిక్రి మమువిశ్వశించిమది । లోశోక మొందకుమనెన్ ॥
ఇటురహస్యత్రయికి నెసగునర్థములఘు । స్ఫుటముగా వినుపించితిన్ ॥
భగవంతుడును భాగవతులునాచార్యులీ । పగిదిననుదయజూచిరి ॥
తప్పులున్న క్షమించి యొప్పులున్న గ్రహించి । తప్పకకృపన్ జూడుడీ ॥
వసుధనల్లాన్ చక్రవర్తిసంపత్కుమా । రసదన్వయోద్భూతుడన్ ॥
గరిమనుజగన్నాథ తిరువేంకటార్యుడను । హరిదాసులకు దాసుడన్ ॥



## యతిరాజవిజయ నాటకమునందలి కొన్ని చక్కని శ్లోకములు

శ్రీ ఉ. వే. శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులుగారు

శ్లో. జానీమ స్తవ సత్య మర్జునకృతే భీష్మప్రహారోద్యమాత్ ।
గోపస్త్రైణ విహారధూర్తవిదితం త్వద్బ్రహ్మచర్యం జనైః ॥
దార్ఢ్యేన స్ఫుట మీశ్వరత్వ మపి తే స్వామిం స్తథాప్యుత్తరా ॥
గర్భోజ్జీవన భేషజాయ భవతః పాదాయ తస్మై నమః ॥

తాత్పర్యము

స్వామీ! అర్జునుని నిమిత్తమై భీష్మాచార్యులను సంహరించు ప్రయత్నము వలన నీ సత్యము నెఱింగితిమి. గొల్లస్త్రీలతో విహరించుచు నీ నొనరించిన [illegible] కృత్యములచే జనులు నీ బ్రహ్మచర్యము నెరింగిరి. కురుపాండవులయుద్ధ [illegible] ముచే నీ యీశ్వరత్వము వెల్లడియైనది. ఐనను ఓ స్వామీ! ఉత్తరాగర్భమునందున్న పరీక్షిద్రక్షణమునకు దివ్యౌషధమైన నీపాదములకు వందనము.

శ్లో. అకోకిలా మాశు విధాతు ముర్వీ ।
మపాకశాలా నమరాం శ్చ కర్తుం ।
శక్తాపి శాన్తా సమస్తు వ యా తే ।
తస్యై నమ స్సప్తమభూమికాయై ॥

భూమియందు కోకిలలు లేకుండ జేయుటకును, దేవతలకు వంటయిల్లు లేకుండ జేయుటకును, తగినంత శక్తిసంపదలు కలిగియుండియు ప్రణతిమాత్రముచే శాంతించిన ప్రసిద్ధమగు నీయేడవదైన శ్రీరామావతారమునకు నమోవాకములు.

# బ్రహ్మవిద్యాఫల విచారము

శ్రీ ఉ. వే. శ్రీమాన్
పాలకొండ కందాడై వీరరాఘవ
అప్పలాచార్యులుగారు, శ్రీరామతీర్థము.

1. ఈవిషయమున, బ్రహ్మవిద్యలననేవి, వాటి స్వరూపమెట్టిది, వాటినధికరించు వారెట్టివారు, వారికి లభించుఫలమెయ్యది, ఆఫలమునిచ్చువారెవ్వరు, అట్టి ఫలస్వరూపమెయ్యది, యను విషయములు విమర్శనీయములుగఁ బ్రసక్తమగుచున్నవి, ఇందు బ్రహ్మవిద్య లన నేవియనగా

2. ప్రాచీనులు వేదములనుపూర్వభాగమనియు ఉత్తరభాగమని రెండుభాగములుగఁజేసియున్నారు. అందుపూర్వభాగము నిత్యనైమిత్తికాదికర్మప్రతిపాదకము నుత్తరభాగము బ్రహ్మప్రతిపాదకమునైయున్నవి. అట్టియుత్తరభాగమనఁబడును పనిషత్తులందు, సద్విద్య, భూమవిద్య, ఉద్గీథవిద్య మొదలగుఁగొన్ని విద్యలుఁ బేర్కొనఁబడినవి. వాటినే బ్రహ్మవిద్యలందురు. వాటినేధ్యానోపాసనాది శబ్దములచేఁగూడ శాస్త్రకారులు వాడుదురు. ఇక వాటి స్వరూపమెట్టిదనిన.

3. విద్యయనగా విదజ్ఞానే, యనెడి ధాతువుయొక్క రూపమగుటఁజేసి విద్యాశబ్దమునకు జ్ఞానమునుఁ గలుగఁజేయునది యని యర్థమగుటచే. బ్రహ్మవిద్యయనగా బ్రహ్మవిషయకజ్ఞానజనకమని తేలుచున్నది. కావున బ్రహ్మవిద్య యనగా బ్రహ్మయను విషయమును బోధించు జ్ఞానమనియర్థము, అట్లైనను పనిషత్తులందుఁ బేర్కొనఁబడిన బ్రహ్మవిద్యలు బ్రహ్మను బోధించుచు స్వతంత్రముగ ఫల సంపాదకములగుచున్నవా లేదాయను విషయము విచారింపవలసియున్నది. అట్లు విచారించిఁచో నుద్గీథవిద్య "ఓమిత్యేతదక్షరముద్గీథముపాసీత" యని కర్మకాండమునఁబ్రతిపాదింపఁబడినదై కర్మాంగముగఁగాన్పించుచున్నది అద్దానితోఁబాటు బ్రహ్మవిద్యలన్నియును సిద్ధరూపమగు బ్రహ్మను బోధించునవియై, తాదృశబ్రహ్మకుఁ గ్రియామయక్రత్వన్వయము లభింపనందునను తమకు ప్రత్యేకముగ బ్రహ్మప్రాప్తికన్న వేరగు ఫలము నిర్దేశింపఁబడకున్నందునను క్రత్వంగములై క్రతుద్వారా ఫలసంపాదకములగుచున్నవిగాని స్వతంత్రముగ ఫలసంపాదకములుఁ గానేరవని యిటనొక సంశయముఁ గల్గుచున్నది. గాని "యదేవవిద్యయాకరోతిశ్రద్ధయోపనిషదా తదేవ వీర్యవత్తరం" అని విద్య ప్రతిబంధనివర్తన పూర్వకముగశీఘ్రముగ ఫలమును సంపాదించు సామర్థ్యమనఁబడు నధికబలమును క్రతువునకు కలుఁజేయునని తప్ప విద్యకు వేరొక ప్రయోజనములేదనిగాని విద్యలేనందున క్రతువునకు వైగుణ్యమనిగాని యిచట ప్రతిపాదింపఁబడలేదు. ఇంకను బ్రహ్మవిద్యల కన్నిటికిని మోక్షరూపమగు బ్రహ్మప్రాప్తినే ఫలముగఁ బ్రమాణములు బోధించుచున్నవి. గనుక బ్రహ్మవిద్యలు కర్మాంగములు గాక స్వతంత్రఫలసంపాదకములే యని నిర్ణయింపఁబడుచున్నవి. యీవిద్యల నధికరించువారెవ్వరనిన

4. సాంగవేదాధ్యయనముఁ జేయు నపుడు పూర్వభాగమున బోధింపఁబడినకర్మలునుఁదత్ఫలభూతములగు స్వర్గాదులును పరిమితములు, ననిత్యములు, ననియు నుత్తరభాగమునఁ బోధింపఁబడిన బ్రహ్మజ్ఞానమునుఁ దత్ఫలభూతమగు బ్రహ్మప్రాప్తియును నపరిమితములు నిత్యములుననియు నచ్చటనే "ప్లవాహ్యేతే అదృఢాయజ్ఞరూపాః"

అనియును "పరీక్ష్యలోకాన్కర్మచితాన్ బ్రాహ్మణోనిర్వేదమాయాన్నాస్త్యకృతః కృతేన, తద్విజ్ఞానార్థం సగురుమేవాభిగచ్ఛేత్సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం, తస్మైసవిద్వానుపసన్నాయసమ్యక్ప్రశాంత చిత్తాయశమాన్వితాయ, యేనాక్షరం పురుషంవేదసత్యం ప్రోవాచ తాంతోతత్వబ్రహ్మవిద్యామ్" అనియును వివరించుచున్న ప్రమాణములనుబట్టి కర్మఫలములందు నిర్వేదముంగలిగి మోక్షమందాసక్తి కలవాడై బ్రహ్మవిద్యలనబడు బహ్మవిద్యల నధికరించదగినవాడు. యిట్టివాడుం బొందుఫల మెయ్యదియన-

5. "అవిద్యయామృత్యుం తీర్త్వా విద్యయామృతమశ్నుతే, బ్రహ్మవిదాప్నోతిపరమ్, నపునర్మృత్యవే, తదేకంపశ్యతి, సస్వరాడ్భవతి, పృథగాత్మానం ప్రేరితారంచ మత్వా జుష్టస్తతస్తేనామృతత్వమేతి, తమేవం విద్వానమృత ఇహభవతి, నాన్యఃపంథాఅయనాయ విద్యతే॥ ఇత్యాది శ్రుతివాక్యములచే నిచట పూర్వభాగమందు జ్యోతిష్టోమాది కర్మలకు స్వర్గాది ఫలములు వలెనే నిరతిశయానంద రూపమోక్షమనబడు భగవత్ప్రాప్తియే బ్రహ్మవిద్యాఫలమని నిరూపింపబడుచున్నది. శ్రీభాష్యకారులుం గూడ "ఇహబ్రహ్మ విద్యా స్సర్వాబ్రహ్మ ప్రాప్తిరూపమోక్షైకఫలాః, సద్విద్యా భూమవిద్యా దహరవిద్యా ఉపకోసలవిద్యా వైశ్వానరవిద్యా ఆనందమయవిద్యాక్షరవిద్యాది కాపకశాఖాగతాశ్శాఖాన్తరగతాశ్చోదాహరణమ్॥ అనియును, బ్రహ్మప్రాప్తిఫలానాం సద్విద్యాదహరవిద్యాదీనాంనానాత్వ ముక్తం॥ అనియును పెక్కుస్థలములలో నిట్టి బ్రహ్మప్రాప్తినే విద్యాఫలముగం బేర్కొనియున్నారు. ఇట్టి ఫలము నిచ్చువారెవరనిన,

16. ఇట్టిఫలమును లభింపజేయువాడుంగూడ నుపాసనములనబడు కర్మజ్ఞానసహాకృత భక్త్యాదులచే ప్రీతుడగునీశ్వరుడేగాని కేవల కర్మజ్ఞానాదులుగాని తత్సహాకృతములగు భక్త్యాదులుగాని సాధనములుంగానేరవు. ఈవిషయము "ఏషహ్యేవానన్దయాతి, సవాఏషమహానజ ఆత్మా అన్నాదోవసుదానః॥" అనెడి శ్రుతులచేతను-

"యోయోయాంయాంతనుం భక్తః
శ్రద్ధయార్చితు మిచ్ఛతి।
తస్యతస్యాచలాం శ్రద్ధాం।
తామేవ విదధామ్యహమ్॥
సతయా శ్రద్ధయాయుక్తః।
తస్యా రాధన మీహతే।
లభతేచతతఃకామాన్।
మయైవవిహితాన్ హితాన్॥

అనెడి గీతావాక్యములచేతను-

"అతఃపరముపాసనం [illegible]
పరస్మాదేవ [illegible] పురుషాత్ప్రాప్తిరూపముప
వర్గాఖ్యం ఫలమితిసంగచ్ఛతే" అనియును,

"అహరహరనుష్ఠీయమాన [illegible]
నుగృహీత తదుపాసనరూప తత్ప్రసాద [illegible]
ప్రీతః. ఉపాసీనానాదికాల ప్రవృత్తా [illegible]
రకర్మ సంచయరూపా ప్రవిద్యాం వినివర్త్య [illegible]
ధాత్మ్యానుభవరూపా సవధికాతిశయ [illegible]
పయ్యపునరావృత్తి యాం [illegible]
మ్యతే శబ్దశ్చ॥" [illegible]
యుషం బ్రహ్మలోక [illegible] మభిసంపద్యతే,

నచపునరావర్తతే॥ ఇత్యాదికః, అనియు నుదహరింపబడిన భాష్యములచేతను స్ఫుటముగ వివరింపబడుచున్నది. యింకనిట్టిపలస్వరూపమెట్టిదనిన,

7. పైనుదహరింపబడిన భాష్యములచేతను, ననేకములగు శృతులచేతను–

"మాముపేత్య పునర్జన్మ ।
దుఃఖాలయమశాశ్వతం ।
నాప్నువంతి మహాత్మానః ।
సంసిద్ధింపరమాంగతాః ॥"

"ఆబ్రహ్మభువనాల్లోకాః ।
పునరావర్తి నోర్జున ।
మామపేత్యతుకౌంతేయ ।
పునర్జన్మ నవిద్యతే ॥

అనెడి యీగీతావాక్యములచేతను మోక్షరూపమగు ఫలము నిత్యమనియు, నిరవధికానందరూపమనియు స్పష్టమగుచున్నది.

## శ్రీ రామానుజ సప్తకం

సంస్కృత విద్యాకుమారక
శ్రీ ఉ. వే. శ్రీమాన్ బూతుగడ్డ కందాడ
అళహశింగరాచార్యులుగారు, నెల్లికుదురు.

శ్లో॥ శ్రీకేశవాత్మజాతం । శ్రితజనపరిపాలనైక సుస్వాంతం ।
పరమముదారగుణాఢ్యం । కలయేరామానుజం కృపాసింధుం ॥

శ్లో॥ పాషండ బౌద్ధమత । నాశకరం యతికులేశ్వరం పూజ్యం ।
కాషాయశోభినంతం । కలయేరామానుజం కృపాసింధుం ॥

శ్లో॥ శేషావతారరూపమ । శేషజనాఘౌఘహరణచరణాబ్జం ।
శ్రీభాష్యకారమమలం । కలయేరామానుజం కృపాసింధుం ॥

స్వాచార్యాజ్ఞనుమీర దోసమని సుంతైనన్ వెనుదీయకే
ప్రాచీనంబగు మంత్రరాజము మహావాత్సల్య సంపూర్ణస
ద్వాచోవైఖరి వెల్లడించితిరిగాన స్వామీ! యతీశప్రభూ!
ఆచార్యత్వమటన్న మీదె వినుడో యాచార్యచూడామణీ ॥

శ్రీభాష్యమ్మను తాధరించెనుగదా శీర్షమ్ముపై ప్రేమతో
నాభాషాసతి మీమహత్వమిక నెన్నన్ కింపునర్న్యాయమే
మీభావమ్మున చేతనోద్ధరణమే మేలైనకృత్యంబుగా
దాభావింపగ స్వామీ! తండ్రి! యతిరాజా! భాసకల్పద్రుమా ॥

శృతికినపార్థమావిధిని జూపగ దానిని లోసహించకన్
హితమతినిశ్చయార్థము రహింబ్రకటించగలేదె? స్వామి మీ
వితరణమేమిజెప్పవలెనె వీతభయాదులమయ్యు నిట్టులే
సతతము మిమ్ము సంస్మరణ సల్పెడి భాగ్యముమాకొసంగుడీ ॥

## యతిరాజవిజయ నాటకమునందలి కొన్ని చక్కని శ్లోకములు

శ్రీ ఉ. వే శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులుగారు

శ్లో॥ పరస్మాద్ దన్యస్మై యదపి, యదపి స్వేన పరతః ।
పరస్మై, స్వస్మై తు స్వతి ఇతరతో వా స్ఫురతి యత్ ।
త దేత త్సర్వాత్మన్! తవ భవతి షాడ్గుణ్యజలధేః ।
విధేయం చాధేయం వివిధవినియోగోచిత మపి ॥

తాత్పర్యము

షడ్గుణాకరా! సర్వేశ్వరా! ఇతరునకు (చేతనునకు) ఇతర (ప్రమాణాంతర) మువలన మాత్రమే భాసించునట్టి జడమగు లీలావిభూతియు, ఇతరునకు అజడము గాన స్వయంప్రకాశమగుటచే) తనంతను ఇతరము వలనను భాసించునట్టి నిత్యవిభూతియు, ప్రత్యగర్థమగుటచే) తనకుతాను; తనంతను ఇతరములవలనను భాసిల్లునట్టి చేతనతత్త్వమును ఓ సర్వశరీరీ! ఇదియంతయు నీకు పరతంత్రమైనదియు, ధరింపదగిన దియు, యిచ్చవచ్చినట్లుపయోగించుట కుచితమైనదియు (శరీరలక్షణము) నగుచున్నది.

(భగవచ్ఛబ్దమున కర్థమగు జ్ఞాన, శక్తి, బల, ఐశ్వర్య, వీర్య, తేజస్సులనెడు ఆరుగుణములును భగవద్గుణములలో ప్రధానమైనవి.)

శ్లో. తమో యత్ప్రాగాసీ త్త్రిగుణమయ, మస్మాచ్చ యదభూ, ।
త్తతో య స్త్రేధా సీ, ద్బహువిధ మతో య త్సమజని, ।
తతః పఞ్చభ్యో య త్పవనగగనాద్యాత్మక మభూ ।
త్త దేత త్సర్వం తే భవతి ఖలు లీలాపరికరః ॥

తాత్పర్యము

సృష్టికి పూర్వావస్థలో త్రిగుణాత్మకమగు ప్రకృతి తమోమయమైన అవ్యక్తముగా నుండెను. దానినుండి మహత్తత్త్వముదయించెను. దానినుండి వైకారికము తైజసము భూతాది యనబడు సాత్త్విక రాజసతామసాహంకారము పుట్టెను. దానినుండి జ్ఞానేంద్రియములు కర్మేంద్రియములు మనస్సు పంచతన్మాత్రలని బహువిధ పదార్థములుద్భవించెను. ఆపంచతన్మాత్రలనుండి పృథివ్యాది పంచభూతములు జన్మించెను. స్వామీ! ఇదియంతయు నీకు క్రీడాకందుకముగదా!





# నా రీ వి భా గ ము



శ్రీమతే రామానుజాయ నమః

## కంగులుం-పగలుం పాశురోపన్యాసము



శ్రీమతి నండూరి ఆనందమ్మగారు,
ఏ లూ రు.



—ooo—

తిరువాయిమొళి 2 పత్తు. 4 వ తిరు. 1. పాశురము.

ఈతిరువాయ్‌మొళ్ళిలో నమ్మాళ్వార్లు, భగవద్విశ్లేషమును సహించజాలక పెరియ పెరుమాళ్ తిరువడికళ్ళలో ప్రపత్తిచేసి అచ్చట కూడ తన మనోరథమును లభించక దుఃఖపరవశులై ఒక పిరాట్టియవస్థను బొందియుండగా, అప్పుడాపిరాట్టియొక్కతల్లి నాకుమార్తె విషయమై నీవేమి సంకల్పించియున్నావని పెరియపెరుమాళ్ సన్నిధిలో విన్నవించుచున్నటుల తాయిమారవస్థలో విన్నవించిన పాశురము.

పాశు:— కంగులుం పగలుం కణ్డుయిలఱియాళ్ । కణ్ణనీర్ కైకళాలిఱైక్కుం ।
శంగు శక్కరంగళెన్ఱు కై కూప్పుం । తామరై క్కణ్ణెన్ఱే తళరుం ।
ఎంగనే తరిక్కేన్ ఉన్నై విట్టెన్నుం । ఇరునిలంకై తుళావిరుక్కుం ।
శెంగయల్ పాయ్‌నీర్ తిరువరంగత్తాయ్ । ఇవళ్ తిఱత్తెన్ శెయ్‌కిన్ఱాయ్ ॥

కంగులుం- రాత్రియందును
పగలుం- పగలుయందును
కణ్- నేత్రములయొక్క
తుయిల్- నిదురను
అఱియాళ్ - ఎఱుంగదు
కణ్ణనీర్- కంటినీటిని
కైకళాల్- చేతులచేత
ఇఱైక్కుం- జల్లును
శంగు శక్కరంగళ్-ఎన్ఱు-శంఖము-చక్రము అనుచు
కైకూప్పుం- నమస్కరించును
తామరైక్కణ్ ఎన్ఱు- పద్మమువంటి నేత్రములు అనుచు
తళరుం- శిధిలమనస్కురాలగును
ఉన్నైవిట్టు- నిన్నువదలి
ఎంగనే- ఎట్లు
తరిక్కేన్ - జీవించెదను
ఎన్నుం- అని అనును
ఇరు- విశాలమైన
నిలం- భూమిని
కై - చేతులచే
తుళా-ఇరుక్కుం-తడుముచుండును
శెం- సుందరమైన
కయల్- మత్స్యములు
పాయ్- ఎగురుచున్న
నీర్ - నీరుగల
తిరువరంగత్తాయ్- శ్రీరంగనాథా
ఇవళ్ తిఱత్తు- ఈమెవిషయమై
ఎన్ శెయ్‌కిన్ఱాయ్- ఏమిచేయతలంచితివి?

తాత్పర్యము:- ఓ శ్రీరంగనాథా! ఈ ఆళ్వారునాయకి నిన్ను ఎడబాసి యుండజాలక రాత్రింబగళ్లు నిద్రాహారములు లేకుండగ దుఃఖించుచు నీదివ్యావయవ దివ్యాయుధముల స్మరించుకొనుచు, నమస్కరించుచు, మూర్ఛపొందుచు, భూమిని తడుముచు ఇట్లు అమితబాధ పడుచున్నది. ఈమెను నీవేమి చేయదలచితివో?

ఈపాశురము ఆళ్వార్లు నాయకావస్థలో తల్లి భావనచేత పాడినప్పటికి ఇందులో శ్రీవిశిష్టాద్వైత మత ఆధిక్యతనంతా అన్యాపదేశముగా నిరూపించారు మనఆళ్వార్లు. ఇదిగాక ఏభగవద్గీత మన దేశమందే గాక దేశదేశాంతరములయందు అన్యమతస్థుల చేత కూడా కొనియాడబడి పూజింపబడుచుండెనో, ఆభగవద్గీత సారాంశమైన చరమశ్లోకార్థమునే ఈపాశురము ద్వారా ఆళ్వార్లు తెలుపుడు చేయుచున్నారు. ఈచరమ శ్లోకము విలువ మనసు నందుంచుకొనియే వీరు తిరువాయ్మొళిలో ఒకచోట "వార్తైయఱిబవర్ మాయవఱ్కాళన్ఱి యావరో, అనిపాడినారు, "వార్త" యనగా వాక్యమని శ్రీమహాభారతమున కంతా అర్థవంతమై సారవంతమైన ఈచరమశ్లోకము వాక్యమని, అమృతము కొరకు సముద్రమదనం చేస్తే ఎన్నో రత్నములు మొదలైనవి పుట్టినటుల ఈచరమశ్లోకమును పుట్టించుట కొరకే శ్రీవేదవ్యాసభగవాన్ మహాభారతము చేయవలసి వచ్చినదని, అంటే భారతసారము చరమశ్లోక మని ఆళ్వారుల అభిప్రాయము. అందువలన నీచరమశ్లోక విలువ తెలిసినవారు శ్రీగీతాచార్యునికి తప్ప వేరొకరికి దాసులవుతారా? అని వీరి అభిప్రాయము. ఈచరమశ్లోకమును యింతగా వీరు ఎందులకు కొనియాడినారంటే ఈశ్లోకములో వున్న స్వార్థ త్యాగమునకు "సర్వధర్మాన్ పరిత్యజ్య" అన్నికర్మలలోను ఫలత్యాగము కర్తృత్వత్యాగము చెప్పుటయే గాక మాం ఏకం అనుటలో నుండే స్వార్థత్యాగమును వర్ణించుటకు 10 పేజీలైనా చాలవు.

మాం, అని తిరిగి 'ఏకం' అనినాయి.ం నుటలో శ్రీగీతాచార్యుని అభిప్రాయము. [illegible] ములు నీకేవిధముగ రక్షకము కావు. [illegible] నీవు చేసిన ప్రపత్తికూడా నీకొరకు [illegible] కాదు. నీ రక్షణకు నానిర్హేతుక జాయమాన కటాక్షమే ప్రధానకారణము. నాకటాక్షముచేతనే నీవు సంసార విముక్తిపొంది నన్ను చేర కలిగితివను కోవాలి అని గీతాచార్యుని అభిప్రాయము. ఎంత స్వార్థత్యాగమో చూడండి. శ్రీగీతాచార్యులు ఏకం అని చెప్పిన స్వార్థత్యాగమునే ఈపాశురము ద్వారా ఆళ్వార్లుపాడినారు. స్వార్థత్యాగమునకున్న గొప్పదనము మరిదేనికీ లేదు. మొదటనుంచి మనభారతదేశము, ఇతరదేశములంతా రాజ్యములను కొల్లగొట్టినవారిని నాయకులుగా ఎంచుకుంటే, రాజ్యములు విడచి [illegible] గోచిపాతరాయులనే నాయకులుగా ఎంచు[illegible]ని విశ్వామిత్ర సంతతివారము, భారద్వాజముని సంతతివారము. అని గొప్ప ఆధిక్యతగా చెప్పుకొని ఆనందపడి పోతున్నాము.

ఏపరమాత్మానందము కొరకు ఆబుషు లందరు యితరవిషయములన్నీ త్యాగముచేసినారో అటువంటి భగవదానందముకూడా జీవులకొరకు

త్యాగము చేసిన స్వార్థత్యాగి. శ్రీభగవద్రామానుజ మునీంద్రులు, ఇంతమంది జీవులు పరమ పదమునకు వెళ్ళితే నేను మాత్రం నరకంలో వుంటేనేమి అని గురువాజ్ఞను మీరారి. మంత్రము జనులందరికి వెదజల్లిన త్యాగమూర్తి రామానుజులు, ఆ కారణంచేతనే గదా, రామానుజ సిద్ధాన్తమను పేరుతో ఈమతము ప్రచారములో నుండుట. అట్టి స్వార్థత్యాగముతో గూడిన ఈ విశిష్టాద్వైతమతమునకు పురాది నాలాయిర దివ్య ప్రబంధములు. అందులో ఈ కంగులుం, పగలుం అన్న పాశురములో మొదటి మూడు పాదములలో భగవానుని శరణుపొందిన జీవుడేవిధముగా వుండాలి, అనే విధముచెప్పి చివరి నాల్గవ పాదములో ఈజీవుడుచేసే భక్తి ఉపాయముకాదు వాని నిర్హేతుక కటాక్షమే వుపాయము అని చరమశ్లోకములో చెప్పిన "ఏకం" అన్న శబ్దమునకు వివరించుచున్నారు. ఆళ్వారులీపాశురములో "కంగులుం పకలుం, కణ్డుయిలరియాళ్" ఆళ్వార్ తమఅవస్థను తల్లి చెప్పినట్లుగా అన్యాపదేశముగ తమకు స్వామియందుండే ప్రీతిని(ప్రేమభక్తి అని దానికి పేర్లు) ఆభక్తిని తెలుపుడు చేస్తున్నారు. రాత్రిం బగళ్లు నాకూతురికి నిద్రలేదు. రంగనాథా అని తల్లిగారు భావతో చెప్పుతున్నారు.

ఈలోకములో ధనములేదనో, పోయినదనో, లేక దారేషణ పుత్రేషణాదులగు యితర విషయముల యందుండే మమకారంచేత నిద్రలేని వారున్నారు గాని, పరమాత్మకొరకు పరితపించి వీని దర్శనము కాలేదని రాత్రిం పగళ్లు నిద్ర లేకుండా పరితపించే వారెవరున్నారు,

ఈప్రకృతిలో రాత్రిం పగళ్ళు అనే విభాగము లేదు. ఒకే ఆలాపన రంగనాథా—

కణ్ణనీర్ కైకళాలిరైక్కుం" కంటినీరుని చేతులతో తుడుచుకొంటూంది నాకూతురు. అని యన్నారు. లోకములో అది లేదు. ప్రాకృతిక వస్తువులుపోయినవని విచారపడేవారున్నారుగాని పరమాత్మను గురించి విచారపడే వారెవరున్నారు. సామాన్యమైన కంటినీరా, ఈమె తుడుచుకొంటే నిలిచేటందుకు పదిరూపాయలు పోయిన విచారము. లక్షరూపాయలు పోయిన విచారము ఒకటవుతుందా.

క్షుద్రవిషయాలను ప్రేమించి వాటిఎడబాటు వలన కలిగే దుఃఖము గనుకనా అరికట్టడానికి అప్రాకృత విషయాన్ని ప్రేమించి అదిలభ్యము కాకపోతే వచ్చిన కంటనీరు అరికట్టడానికి సాధ్యమగునా. నాబిడ్డ వెర్రిగాని, అని తల్లిగారి అభిప్రాయము, "శంగు శక్కరంగళెన్ఱుకైకూప్పుం" శంఖుచక్ర గదాధరుడవై వచ్చి ఒకసారి దర్శన మీయవా అనిపోతుంది. దాహము విపరీతముగా వేశినవాడు మంచినీళ్ళను అడగలేక చేతితో సంజ్ఞ చేసినటుల బలహీనతచేత శంఖము, చక్రము అని రెండు చేతులు జోడించి నమస్కారము చేస్తూన్నది. బ్రాహ్మణునికి పిచ్చిపట్టినా వేదమే మాట్లాడునటుల ఈఆళ్వార్లు ఏఅవస్థలోనున్నా, శేషత్వస్వరూపమునకు తగిన అంజలి మాత్రము మానరు. "తామరైక్కణ్ణెన్నే తళుంరు– తామర రేకులవంటి నేత్రసౌందర్యము కలదానిని అని ఆ నేత్ర సౌందర్యమునే తలంచుకొని మూర్ఛ పోతుంది. అశోకవనంలో చెరలోనున్న సీతాదేవి ఆవనంలోని సౌందర్యములెన్ని రావణుడు వర్ణించినా అదేమీ ఆమె కంటికగుపడలేదు. "రామంరక్తాన్త నయన మపశ్యంతీ సుదుఃఖితా"

అని శ్రీరామచంద్రుల నేత్రములు తలచుకొని దుఃఖించినటుల వాని నేత్రముల సౌందర్యము తలచుకొని మూర్ఛపొందుతూ వుంటుంది. "రామః కమలపత్రాక్షః సర్వసత్వమనోహరః" అని ఆంజనేయులన్నటుల మొరటుమానసులైన మావానరజాతినంతా స్థిరత్వముతో నిలబడి పనిచేయించుకునే నేత్రసౌందర్య మూరఘురాముని. అని వానరజాతియంతయూ ఈడుపడిన నేత్రసౌందర్యము తలచుకొని భాధపడిపోతుంది నాకూతురు.

ఎంగనే తరిక్కేనున్నై విట్టునుం నిన్ను విడచి ఏతాగున బ్రతుకగలను అంటుంది. పరమపద నాథుని ప్రేమించినాను గనుకనా అది వేరే దేశము అదినాకు సాధ్యపడదు. అని వూరడిల్లుటకు- అవతారములు ప్రేమించాను గనుకనా! రామకృష్ణాద్యవతారములలో వున్నసమకాలీకులకేగాని నాకీప్రాప్తము లేదని ఊరడిల్లుటకు ఆకారత లేమి లేకుండా "పిన్నానార్ వణంగుం శోది" అన్నట్లు తర్వాత వారికి కూడా లభ్యమయ్యేలాగున ఉభయకావేరి మధ్యలో అర్చారూపముతో మమ్ములను రక్షించుటకు దీక్ష వహించిన నిన్ను విడచి ఎటులజీవించగలనయ్యా అంటుంది.

"ఇరునిలమ్ కై తుళావిరుక్కుం" తనుకూర్చున్నచోటు నంతా పిచ్చిపట్టిన దాని మాదిరిగా తడుముకుంటూన్నది. అని ఈమూడు పాదములలో వీరికి సర్వేశ్వరునియందు వుండే భక్తి స్వరూపమును చెప్పి చివరి నాల్గవ పాదములో ఈభక్తి ఉపాయభక్తి కాదు. ఉపాయము నీకటాక్షమేననే భావన తెలియపరుస్తున్నారు.

"శెంగయల్ పా సీర్ తిరువరంగత్తాయ్ ఇవళ్ తిరత్తు ఎన్ శెయ్ గిన్నాయ్" అని తోటలలో జలసమృద్ధి వుండుటచేత మత్స్యములన్నిబలము, సంతోషముతో ఆనీటిలో తుళ్లుతున్నాయి. అటువంటి జలసమృద్ధిగల్గిన తోటలచే చుట్టబడిన శ్రమహారమయిన శ్రీరంగమునందు పవ్వళించిన రంగనాథా ఈమెవిషయములో ఏమిచేయదలచుకున్నావు, రక్షించదలచుకున్నావా? లేక ఇంకా ఈప్రకృతిలోనే [illegible] దలచుకున్నావా? అనిభావము-

ఇంతకు ఈపాసురమువలన మనకి తేలిన దేమిటంటే అంటే మొదటిమూడు పాదములలో చెప్పిన భక్తి ఉపాయము క్రిందకు తీసుకొంటే వారు పరమపదనాథుడే అవ్వగాక నిత్యసూరి నిర్వాహకుడేఅవ్వగాక వీరి చింత [illegible] దగ్గరకు వీరున్న చోటికి సర్పయాగములో మంత్రశక్తి సర్పములన్ని అగ్నికుండములో పడినటుల వారు వచ్చి దర్శనమిచ్చి తీరాలి. అంతటిభక్తి [illegible] వీరిది గాని రక్షణ విషయములో నాసికటాక్షమే వుపాయము గాని ఈజీవుడు చేసిన భక్తి కాదు. అని శ్రీగీతాచార్యులు 'మామ్' చెప్పాక 'ఏకం'లో చెప్పినఅర్థాన్ని ఈపాసురము ద్వారా ఆళ్వార్లు మనకు తెలుపుచున్నారు. సాధారణముగా లోకములో రామాకృష్ణా అనుకొంటే పుణ్యము వస్తుందని హరికథలవి వింటూ దివ్యదేశయాత్రలవి చేస్తూవుంటే పాపముపోయి పుణ్యములభిస్తుందని పాడుకగదా, సాధారణ జనమంతా ఆ అభిప్రాయములతో భజనలు చేసినా యాత్రలు తీర్థములకు వెళ్ళినా, కానివీరు అందులో స్వార్థత వున్నది. భగవానుని

భగవదనుభవమును విడచివుండలేని స్థితిలోకి రావాలి. మనముఅన్న మెందులకుతింటున్నాము తిననిదివుండలేము గనుక ఆవిధముగనే తేనె పాల్ అముతు, తి త్తిక్కుమ్, తిరునామమ్ అని తేనెపాలు కలకండమాదిగా వుంటుంది నాకు భగవన్నామము విడచివుండలేను. ఉణ్ణుం శోర్ పరుగునీర్ తిన్నుమ్ వెత్తిలై యుమ్ఎల్లాంకణ్ణన్ ఎంబెరుమాన్ అన్నస్థితిలోనికి రావాలి. తినేఅన్నము తాగేనీరు వేసుకొనే తాంబూలము అంతా నాకు శ్రీకృష్ణ పరమాత్మయే అన్నస్థితికి రావాలి. గాన మన పాపాలు పోవుటకు భగవన్నామము చేస్తున్నామనే స్థితి దాటిపోవాలి.

స్వార్థరహితమైన ప్రేమ భగవానుని యందుండాలి అనే స్వార్థత్యాగముతో కూడిన భక్తియే శ్రేష్ఠము. అనేసంగతి ఈపాశురము ద్వారా తెలియచేసినారు. ఆళ్వార్లు శ్రీవిశిష్టాద్వైత మతమునకు ప్రధానమీపాశురము.

రామా కృష్ణా అని వూరికే నోటితో వుచ్చరించేదానికే విలువ కట్టుతారే అటువంటిది. భగవానునికొరకు రాత్రింబగళ్లు పరితపించి దుఃఖపడేస్థితిలోకివచ్చినా అదంతా సత్తాధారకమే గాని రక్షణకు గాదు. రక్షణకు వాని కటాక్షమే కారణమనే త్యాగము స్వార్థ త్యాగము ఈ పాశురములో నిండివున్నది. ఇంతటిస్వార్థత్యాగముతో కూడిన సాంప్రదాయకము గనుగనే! మన విశిష్టాద్వైత ప్రచారక సంఘమువారు ఈగొప్పసిద్ధాంతము అందరు తెలుసుకొని ఆనందపడి వుజ్జీవించాలనే వుద్దేశముతో వూరువూరు వాడవాడలా తిరిగి సభ లేర్పరచి జనులందరిని పోగుచేశి స్వార్థ త్యాగులై కష్టనష్టముల కోర్చి ప్రచారము చేస్తున్నారు. మనమంతా వారి వుద్యమమునకు ప్రోత్సాహమిస్తూ ఈవిశిష్టాద్వైత మత ప్రచారములో వుండే విశిష్టతనుగ్రహించి తరించెదము గాక.

---

## భగవత్కైంకర్యమా !

అనంతాళ్వానను భగవత్కైంకర్య నిష్ఠాగరిష్ఠు లొకరు తిరుమలైయందు నందనవనము నొకటి దానిని నిర్మించి తిరువేంగడముడయానుకు నిరంతర పుష్పకైంకర్యపరులై యుండిరి.

మొదట శైవులై యుండి సుకృతవశమున తొండనూర్ నంబిచే దిద్దబడి శ్రీవైష్ణవుడైన నొక మహాశయుడు తిరుమలకేగి యచ్చట మన యనంతాళ్వారుని సేవించి వారచ్చట పువ్వుల మొక్కల నొకచోట నుండి పీకి మరియొకచోట నాటగ నారసి 'స్వామీ! అనంతాళ్వానే! మీరు దయార్ద్రహృదయులనియు భాగవత పరతంత్రులనియు వింటినే ఇప్పుడేమి యింత ఘాతుకులైతిరి. శ్రియఃపతి పరమపదమును నీడి భూమండల వాసుల నుజ్జీవింపచేయు సంకల్పముతో వెంకటాద్రికి వేంచేసియుండ వారి దుస్సహావిశ్లేష వ్యసనము మెడబట్టి త్రోయ శ్రీవెంకటాద్రినే నిత్యవాసముగా గల్పించుకొని వృక్షరూపమున నివసించు నిత్యసూరి నివహము నొకచోట నుండనీయక మీరేల మెడపిసికి పీకి పెల్లగించి బాధింతురు? మీకు పుణ్యమే యపేక్షితమగునేని నేను నాయాచార్యులగు తొండనూర్ నంబి తిరుమాళిగ (యింటి)లో ప్రతినిత్యము తదీయారాధన మైనపిమ్మట స్వామి ఆరగించి విడిచిన యాకులనెత్తి పారవైచి శుద్ధిచేయుచుందును. ఆసుకృతమందలి నాల్గవవంతును మీకు నేను సమర్పింతును. కావున నాయందు దయయుంచి మీరీ పుష్పవృక్షముల బాధించుటకు విరమింపరా యని ప్రార్థించిరి.

# ఆచార్య విశ్వాస బలము

శ్రీమతి మరంగంటి రంగనాయకమ్మగారు కోసకొండ.

"యాదృశీ భావనా యత్ర సిద్ధి ర్భవతి తాదృశీ" (ఏ వస్తువునందెట్టి నిశ్చలభావన యుండునో ఆ వస్తువట్టి ఫలితమునే యిచ్చును.)

ఒకనాడు నంబిళ్ళ తమ యంతరంగ శిష్య వర్గముతో తిరువెళ్ళరై నాచ్చియారును సేవించి తిరిగి శ్రీరంగమునకు వేంచేయునప్పుడు కావేరీ నది పొంగి పొరలజొచ్చెను. అప్పుడు వారందరు నొకదోనె నెక్కి నదీమధ్యమున కేగు సరికి సూర్యాస్తమయమై నలుగడల చీకటి యలమి కొనుటయే గాక పెద్దవర్షము కురియ సాగెను. ముందునకడుగుసాగుటయే దుర్భరమాయెను. దిక్కులు తోచుటలేదు. దోనెయు మునుగ నారంభించెను. హాహారవములు చెలరేగెను. అంత నా దోనె నడుపువాడు దోనెయందున్న వారిలో నొక్కరైనను దిగనిచో నంబిళ్ళ మొదలగు పెద్దలతో నందరును నదీగర్భమున స్థాయిగ విశ్రమించుట తథ్యమని చెప్పివేసెను. కాని యిట్టి సాహసమెవరికి? అందరకును ప్రాణములు తీపియే గదా! ఇక నేమున్నది? అంతపని కానున్నది. ఈ యుపద్రవమును గాంచి యొక సాత్త్విక వృద్ధ భర్తృరాలొకతె "నాయనా? నాకు నూరేళ్ళు నిండినవి. నావలననెవ్వరికి నీషత్తైన నుపకారము సున్న. నా నంబిళ్ళ బ్రతికిన పెక్కురుజీవింతురు. గాన నేనిదే నదిలో దిగుచున్నాను. నాతండ్రిని భద్రముగ దరిజేర్చు నాయనా! యని 'నంబిళ్ళ తిరువడిగళే శరణ' మనుచు తటాలున నీట నురికెను. అందరు నాశ్చర్యచకితులై స్రుక్కిలిరి. దోనె తేలినది. అందరును సురక్షితముగా నొడ్డు చేరిరి. కాని నంబిళ్ళగారి మనస్సామె సాహసకృత్యముచే పుండుపడెను. అయ్యో! నా నిమిత్త మా ముల్లాలెంత సాహసకృత్య మొనరించి ప్రాణము చాలించెనో యని పరిపరి విధముల విలపింప దొడంగిరి.

ఇంతలో నా యమ్మ దూరమునుండియే వీరి మాటలను విని "ఆచార్యా! నేను చావలేదు. నా కొరకై వ్యాకులపడకుడు. నేను నదిలోని కురికినతోడనే సమీపమున నొక దిబ్బదొరికినది. దాని నవలంబించి నిలిచియున్నా"నని కేక వైచెను. అదివిని యందరు నాశ్చర్యపడిరి. వెంటనే నంబిళ్ళగారు దోనె నచటకు పంపిరి. ఆమె భద్రముగా నాచార్యుల చెంతజేరి వారిని సేవించి నిలిచెను.

నీవెట్లు బ్రతికితివని నడుగగా నామె యిట్లు ప్రత్యుత్తర మొసంగెను.

"స్వామీ! తమ పాదారవిందములనే యనుస్మరించుకొని నదియందు పడి కొట్టుకొని పోవుచుండగ వెంటనే తమరచ్చట నొక చిన్నదిబ్బగా వేంచేసి నన్ను రక్షించితిరి గాదా! యని యనగా నంబిళ్ళయు "అమ్మా! నీవిశ్వాస మట్లుండ అది యట్లు గాకుండునెట్లు? "యాదృశీ భావనా యత్ర సిద్ధి ర్భవతి తాదృశీ" యని సెలవిచ్చిరి.

ఓం

శ్రీరస్తు

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ

## నియమావళి

రిజిష్టర్డు 1951-వ సంవత్సరం



—: కేంద్ర కార్యాలయము :—

"గీతా మందిరము"

107, వరదాముత్తియప్పన్ వీధి, మదరాసు – 1.

సత్యంవద        అహింసా పరమోధర్మః        ధర్మం చర

# శ్రీయతిరాజసేవామహిళామండలి

## శ్రీవిశిష్టాద్వైతప్రచారకసంఘస్త్రీశాఖ

(రిజిష్టర్డు)

## శాశ్వతభవననిధి.

107, వరదాముత్తియప్పన్ వీధి మదరాసు-I

గీతామందిరము.

తిరువారాధన

సమష్టిపారాయణ

పాఠశాల

కైంకర్యపరులతిరునామములు: ____________________

విరాళము రూ.____________________

కాలక్షేపము | భజన | గ్రంధాలయము | అనుష్ఠానము | చేతిపనులు.

శ్రీ విశిష్టాద్వైత సిద్ధాంత ప్రచారమునకై శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ స్త్రీ శాఖయగు శ్రీ యతిరాజసేవా మహిళా మండలి మదరాసు శాఖ వారిచే "గీతామందిర భవనము"ను 5-3-1951 తేదీని కొని స్వాధీనపరచుకొనబడినది.

| | |
|---|---|
| ఈ భవనము ఖరీదు | రూ. 80,000-0-0 |
| రిజిస్ట్రేషన్‌కు, రిపేర్లకు వగైరాచిల్లర ఖర్చులకు | రూ. 10,000-0-0 |
| మొత్తము | రూ. 40,000-0-0 |

ఇందు యిప్పటికి సుమారు రూ. 20,000-0-0 మాత్రము దాతలవలన విరాళములుగా యివ్వబడినవి. ఇంకను రూ. 20,000-0-0 కావలసి యున్నది.

ఇదియు గాక మిద్దెమీద కాలక్షేపమునకై రెండు పెద్ద హాల్సు కట్టవలసి యున్నది. ఒక్కొక్క హాలుకు సుమారు ఎనిమిదిదేసివేల రూప్యము లగునని అంచనా వేయబడినది.

ఈ పత్రమున సూచింపబడిన కార్యక్రమములన్నియు ఈ భవనమున జరుగవలసి యున్నవి. వీటన్నింటికిన్ని విరివిగ సొమ్ము కావలసియున్నది.

గాన దాతలు ఈ సమయమునకు తోడ్పడి స్వహస్త పరహస్తముల ద్వారా విరివిగ విరాళముల నిచ్చి సహాయ పడవలసినదిగ సవినయముగ ప్రార్థించుచున్నారము.

ఇట్లు,

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము

శ్రీ

శ్రీమతేరామానుజాయనమః

# శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము యొక్క

# మెమొరండము ఆఫ్ అసోషియేషను

I. ఈ సంఘము యొక్క పేరు:— ఈ సంఘము "శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము" అని పిలువబడును.

II. ఈ సంఘము యొక్క కార్యాలయము మదరాసు రాజధానిలో యుండును.

III. ఈ సంఘము యొక్క ఆదర్శము:— విశ్వమానవకల్యాణము; విశ్వమానవసౌభ్రాతృత్వము; ఐకమత్యము, అభ్యుదయము, నిస్స్వార్థసేవ; ఆధ్యాత్మికాభ్యున్నతి; ఆస్తిక్యత.

IV. ఈ సంఘము యొక్క ఆచరణము:— సవినయనిస్స్వార్థసేవ; త్యాగము; జీవకారుణ్యము; పవిత్రత; పూజ్యత; సర్వమతసహనము; సహకారము; సమన్వయము; స్వస్వ వర్ణాశ్రమ ప్రయుక్త ధర్మ నిర్వహణము; రాజకీయకార్యక్రమ రహిత ఆధ్యాత్మికాభివృద్ధికర కార్యాచరణము; మనోవాక్కాయ కర్మతః ఏకరూప ప్రవర్తనము.

V. ఈ సంఘము యొక్క కార్యక్రమము:— ౧. సభలలోను, సాంఘికాది సమావేశములలోను భగవద్భాగవత ఉత్సవాదులలోను, పాఠశాలలోను అవకాశ అవసరముల ననుసరించి పండితులగు శ్రీ పురుషులచే వేదాంతోపన్యాసముల నిప్పించుట.

౨. శిష్యసంచారముగలవారు, మఠాధిపతులు, దేవాలయసంబంధులు, ఉపాధ్యాయులు మున్నగువారిద్వారా వేదాంత ప్రచారము విరివిగా జరుగునటుల ప్రోత్సహించుట, అట్టివారికి యథావకాశము తోడ్పడుచుండుట.

౩. స్థిరమైనట్టియు, తాత్కాలికమైనట్టియు, సాంచారికమైనట్టియు ప్రాచ్యవిద్యా ఆధ్యాత్మిక వేదాంత పాఠశాలలను, గ్రంథాలయములను నేర్పరచి నడుపుట. ఇదివరలో ఉన్నవాటికి తోడ్పడుట, జీర్ణమైనవాటిని పునరుద్ధరించుట.

౪. పండిత పరిషత్తులు, విద్యార్థిసన్నివేశములు, సభలు, ప్రదర్శనములు జరుపుచుండుట, పరీక్షలజరిపి బిరుదములు, ధృవపత్రములు, బహుమతుల నిచ్చుచుండుట.

౫. నూతన స్వతంత్ర అనువాద గ్రంథములను వ్యాఖ్యానములను టీకలను వ్రాయించుట, ప్రచురించుట అవసరమైన పూర్వగ్రంథములను తిరిగి ముద్రింపించుట, అముద్రితగ్రంథముల సేకరించి ప్రచురించుట, గ్రంథవిమర్శనాదుల చేయించి ప్రచురించుట.

౬. సాంప్రదాయగ్రంథ కాలక్షేపములు, పురాణపఠనములు, హరికథాకాలక్షేపములు, ఉత్సవములు, వేడుకలు, రేడియోప్రసంగములు, గ్రామఫోను రికార్డులు, భజనలు, నాటకములు, సినిమాప్రదర్శనములు మున్నగువానిద్వారా జ్ఞాన-భక్తి-వైరాగ్యముల ప్రచారము చేయుట.

౭. వివిధములైన దైనిక, వార, పక్ష, మాసాదిపత్రికలు, కరపత్రములు, నివేదికలు ప్రచురించుచుండుట.

౮. దేవాలయముల నిర్మించుట, ఉన్నవాటియొక్క సక్రమనిర్వహణకై తోడ్పడుట, జీర్ణోద్ధారణచేయుట.

౯. యతిరాజాశ్రమములు, రామానుజకూటములు, శఠకోపశిబిరములు, పరకాలమఠములు, కాలక్షేపకూటములు, వసతిగృహములు, సేవాసంఘములు, శాంతికుటీరములు, విశ్రాంతిశాలలు, ఆశ్రమములు మున్నగునవి స్థాపించుట, పాలించుట, ఇదివరలో యున్నవాటి సక్రమపరిపాలనకై తోడ్పడుట, జీర్ణోద్ధారణచేయుట.

౧౦. ఈ సంఘీయులయొక్క పురోభివృద్ధికిన్ని, జీవనోపాధికిన్ని, ఆధ్యాత్మికాభివృద్ధికిన్ని ఉపయోగించునట్టి స్వరూపానురూపములైన వృత్తులను, విద్యలను ఏర్పాటుచేసి పనిచేయుట.

౧౧. ఈ సంఘాభివృద్ధి కుపయోగించు అన్నివిధములైన యితర కార్యక్రమముల నవలంబించి పనిచేయుట.

VI. ఈ క్రింద తెలుపబడిన మహాశయులను ఈ సంఘమునకు కార్యనిర్వాహకవర్గముగ ఎన్నుకోవడమైనది.

అధ్యక్షులు

శ్రీ. ఉ. వే శ్రీమాన్ పరాశర సుదర్శనభట్టరు అయ్యవార్లంగారు, కోరుకొండ, (వయా) రాజమహేంద్రవరము, తూ. గోదావరిజిల్లా.

ఉపాధ్యక్షులు

" " అద్దంకి తిరుమల సమయోద్దండ కోలాహల లక్ష్మీనృసింహ కుమార తిరువేంకట తాత దేశికాచార్యులు అయ్యవార్లంగారు, చీరాల, గుంటూరుజిల్లా.
" " సదామూరి శఠగోపాచార్యులు అయ్యవార్లంగారు, నూజివీడు, కృష్ణాజిల్లా.
" " రావుబహాదూరు వేమూరి రంగనాథం శ్రేష్ఠిగారు, ధర్మకర్తలు శ్రీపార్థసారథి దేవస్థానము, 7, దక్షిణమాడవీధి, తిరువళ్లిక్కేణి, మదరాసు.

ప్రధానకార్యదర్శి

" " తె. కం. గోపాలాచార్యులుగారు, కోరుకొండ,(వయా)రాజమహేంద్రవరము,తూ.గో.జి.

సహాయకార్యదర్శి మరియు కోశాధికారి

" " ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులుగారు, అర్తమూరు, (వయా) ద్వారపూడి, తూ. గో. జి.

కార్యనిర్వాహక సభ్యులు

" " కొమాండూరి యజ్ఞేయవిల్లి వెంకటాచార్యులుగారు, కాళ్లకూరు, (వయా) భీమవరము, పశ్చిమ గోదావరిజిల్లా.
" " పండితచక్రవర్తి శ్రీనివాసరంగాచార్యులుగారు, ౩౦, పెరుమాళ్ మొదలివీధి, మదరాసు1.
" " కాంతలూరి వెంకటాచార్యులుగారు, చిన్నగోపురంవీధి, పాలకొల్లు, పశ్చిమగోదావరిజిల్లా.
" " కవిరత్నగుదిమెళ్ల రామానుజాచార్యులుగారు,ముక్తిపల్లి, కూచనపూడిపోస్టు, గుంటూరు జి.
" " మొలుగు రామానుజాచార్యులుగారు, ఉంగుటూరు, పిప్పరపోస్టు, పశ్చిమగోదావరిజిల్లా.
" " నందూరి అప్పలాచార్యులుగారు, సింహాచలము, విశాఖపట్టణముజిల్లా.
" " కో. కం. రంగాచార్యులుగారు, రామన్నపేట, వరంగల్లు నైజాం.
" " తిరుమలపురిపల్ల ధర్మాచార్యులుగారు, ఏడిద, (వయా) మండపేట, తూర్పుగోదావరిజిల్లా.
" " కందాళపెదఅప్పలాచార్యులుగారు, శ్రీరామతీర్థము, (వయా) నెల్లిమర్ల, విశాఖజిల్లా.
" " మట్టపల్లి రంగనాథయ్యగారు, ౫౨, రెడ్డిరామన్నవీధి, మదరాసు-1.
" " దాన శేషుగారు, దానకుటీరం, అంగలకుదురు, గుంటూరుజిల్లా.
" " చి మా. వెంకటరాఘవాచార్యులుగారు, గద్వాలబంగళా, నాంపల్లిరోడ్డు, హైదరాబాదు.
" " శ్రీ సీతారామయతీంద్రులువారు, శ్రీకృష్ణాశ్రమము, పెదముత్తేవి, కృష్ణాజిల్లా.
" " సదాదూరి గోపాలకృష్ణమాచార్యులుగారు,మంగళంపాడు.(వయా)సూళ్లూరుపేట,నెల్లూరుజి.
" " పాతాళం వీరరాఘవులు శ్రేష్ఠిగారు, అడ్వకేటు, ఆదియప్పనాయకన్‌వీధి, మదరాసు-1.
" " బోయిన శీతారామయ్యగారు, బేతవోలు, (వయా) గుడివాడ, కృష్ణాజిల్లా.
" " కలవగుంట శేషాచార్యులుగారు, తణుకు, పశ్చిమగోదావరిజిల్లా.
" " ఈయుణ్ణి రాఘవాచార్యులుగారు, శ్రీయతిరాజాశ్రమము, నరసాపురము,పశ్చిమగోదావరిజిల్లా.
" " కరాళపాటి రాధాకృష్ణయ్యగారు, 147, అణ్ణాపిళ్లెవీధి, మదరాసు 1.
" " తె కం వరహస్వామిగారు, కోరుకొండ, (వయా) రాజమహేంద్రవరం.

శ్రీ

# శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము యొక్క
# ఆర్టికల్సు ఆఫ్ అసోసియేషను.
## రూల్సు అండు రిగ్యులేషన్సు

1. ఈ సంఘము యొక్క పేరు:— ఈ సంఘము "శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము అని పిలువ బడును.

2. ఈ సంఘము యొక్క ఆదర్శము:— విశ్వమానవ కల్యాణము, విశ్వమానవ సౌభ్రాతృత్వము, ఐకమత్యము, అభ్యుదయము, నిస్స్వార్థసేవ, ఆధ్యాత్మికాభ్యున్నతి, ఆస్తిక్యత.

3. ఈ సంఘము యొక్క ఆచరణము:— సవినయనిస్స్వార్థసేవ, త్యాగము, జీవ కారుణ్యము, పవిత్రత, పూజ్యత, సర్వమతసహనము, సహకారము, సమన్వయము, స్వస్వవర్ణాశ్రమ ప్రయుక్త ధర్మ నిర్వహణము, రాజకీయ కార్యక్రమ రహిత ఆధ్యాత్మికాభివృద్ధికర కార్యాచరణము, మనోవాక్కాయ కర్మతః ఏకరూప ప్రవర్తనము.

4. ఈ సంఘము యొక్క విశ్వాసము:— ౧. చిదచిద్విశిష్టాద్వైతుడైన శ్రీమన్నారాయణుడే పరతత్త్వము.
   ౨. కర్మ-జ్ఞానాంగక భక్తి-ప్రపత్తులచే ప్రసన్నుడైన శ్రీమన్నారాయణుడే ఉపాయము.
   ౩. అప్రాకృతదేశవిశిష్టుడైన శ్రీమన్నారాయణుడే పరమప్రాప్యము.

5. ఈ సంఘమునకు ప్రమాణము:— సత్త్వగుణప్రధానమైన శ్రుతి-స్మృతి-సూత్ర-ఆగమ-ఇతిహాస-పురాణ-శిష్టాచార సాంప్రదాయములు.

6. ఈ సంఘము యొక్క సభ్యత్వము ఆర్థికము:—ఇందు సభ్యత్వము సాధారణమనియు, శాశ్వతమనియు, రెండు తరగతులుగ యుండును.

## సాధారణసభ్యత్వము

సంవత్సరము పక్కంటికి రూ 1-4-0 ను చెల్లించువారు సామాన్యసభ్యులు
సంవత్సరము పక్కంటికి రూ 3-4-0 ను చెల్లించువారు సహాయసభ్యులు
సంవత్సరము పక్కంటికి రూ 5-4-0 ను చెల్లించువారు నిర్వాహకసభ్యులు
సంవత్సరము పక్కంటికి రూ 10-0-0 ను చెల్లించువారు పోషకసభ్యులు
సంవత్సరము పక్కంటికి రూ 25-0-0 నుచెల్లించువారు మహాపోషకసభ్యులు
సంవత్సరము పక్కంటికి రూ 50-0-0 ను చెల్లించువారు రాజపోషకసభ్యులు
సంవత్సరము పక్కంటికి రూ 100-0-0 ను చెల్లించువారు మహారాజ పోషకసభ్యులు; అని ఎన్నబడుదురు.

వీరి సభ్యత్వము సంవత్సరములో ఎపుడు చేసినను కూడ ఆ సంవత్సర ఫాల్గుణ బ 30 నాటితో సమాప్తి యగును. సభ్యత్వము సమాప్తి అయినవారు తిర్గి సభ్యత్వచందాను చెల్లించి అందులకై నిర్ణయించబడిన రశీదును పొందు వరకు తిర్గి ఈ సంఘమున సభ్యులుగ పరిగణించబడరు.

## శాశ్వతసభ్యత్వము

ఒకే పర్యాయము రూ 250/ను చెల్లించువారు శాశ్వత సభ్యులుగను
ఒకే పర్యాయము రూ 500/ను చెల్లించువారు శాశ్వత సహాయకులుగను
ఒకే పర్యాయము రూ 1000/-ను చెల్లించువారు శాశ్వత నిర్వాహకులుగను
ఒకే పర్యాయము రూ 2500/-ను చెల్లించువారు శాశ్వత పోషకులుగను
ఒకే పర్యాయము రూ 5000/-ను చెల్లించువారు శాశ్వత మహారాజ పోషకులుగను
ఒకే పర్యాయము రూ 10000/-ను చెల్లించువారు శాశ్వత రాజపోషకులుగను
ఒకే పర్యాయము రూ 11116/-ను చెల్లించువారు శాశ్వత మహారాజ పోషకులుగను ఎన్నబడుదురు.

వీరి సభ్యత్వము వీరి జీవితాంతమువరకు యుండును. ('౮' నియమములోని "ఈ" శీర్షికగల నియమమునకు లోబడి )

6. ఆ. సభ్యుల విధులు:— ౧. ఇతరులను సభ్యులుగ చేర ప్రోత్సహించుట.

౨. తమ తమ ప్రాంతములలో ఈసంఘ వ్యాప్తికై పాటుబడుట; ఈ సంఘసభలలోను, ఉత్సవములలోను వేడుకలలోను యథావకాశము పాల్గొనుచుండుట.

౩. శుభా శుభకార్యములయందు ఈ సంఘమునకై ప్రత్యేక కట్నములు; బహుమతులు; సంభావనాదికములు ఈ మొసంగుచుండుట, యితరుల వల్ల వసూలు చేయుచుండుట.

౪. ఈ సంఘముద్వారా ప్రచురించబడు పత్రికలు పుస్తకములు, వగయిరాలకు తగినంత ప్రోత్సాహ మిచ్చుచుండుట.

౫. ఈ సంఘప్రాంతీయ పాఠశాలలకున్ను, ప్రచార సంస్థలకున్ను యథాశక్తి తోడ్పడుచుండుట.

౬. ఈ సంఘమునకు తమకు వీలగు ఆర్థికావకాశముల కల్పించుట.

౭. అధికార సంఘ నియమముల నాదరించి నిర్వహించుట.

౮. ఈ సంఘ ప్రచారార్థమై జరుపబడు కార్యక్రమము లన్నింటియందు యథాశక్తి పాల్గొని నిర్వహించుచుండుట.

౯. తమ తమ వర్ణాశ్రమ ధర్మముల ననుసరించి సంధ్యావందనము, దేవతార్చనము, అతిథి అభ్యాగతి సత్కార పూజలు, సత్కథాశ్రవణము, భగవద్భజనము, సత్సహవాసము, ఏకాదశి ఉపవాసము, పెద్దల సేవా శుశ్రూషాదులు, భగవద్భాగవతాచార్య జయంతులు, తిరునక్షత్రోత్సవములు యథాశక్తి సలుపుచుండుట.

౧౦. అన్ని విషయముల త్రికరణాత్మనా ఆదర్శమైనట్టియు, పవిత్రమైనట్టియు అహింస-నీతి-ధర్మయుతమైనట్టియు, జీవితమును గడుపుచుండుట.

6. ఇ. ఈ సంఘము యొక్క కార్యాలయము:— సంఘకార్యదర్శి యుండు స్థలమునగాని, వారి కనుకూలమగు స్థలమునగాని సంఘకార్యాలయ ముండును. ప్రస్తుత మీ సంఘకార్యాలయము "147, అణ్ణాపిళ్ళై వీధి, మదరాసు-1."

7. అ. ఆర్థికము:— చందాలు, విరాళములు, ప్రతిసభ్యునియింట జరుగు శుభాశుభముల సమయముల యందీయబడిన బహుమతులు, కట్నములు, సభల, సమావేశములు, ఉత్సవములు మున్నగు వాటియందీయబడిన ప్రత్యేక ఉమ్మడి విరాళములు, ఆయా ప్రత్యేక కార్యక్రమములకై ఏర్పడిన ఆహ్వానసంఘముల ఆయాకార్యముల పూర్తిజేసిన పిమ్మట మిగిలిన నిల్వధనములు కేంద్రసంఘమునకే చెందవలెను.

ఆ. ప్రత్యేక విధులకై నిర్దేశించి దాతలవలన నీయబడు సొమ్ములు ఎవ్వరి కీయబడినను అవి యన్నియు కేంద్ర సంఘముయొక్క అధికార పర్యవేక్షణ సలహా సూచనల ప్రకారము ఆయా ప్రత్యేక విధులకై మాత్రమే వినియోగింప బడవలయును.

ఇ. ఈ సంఘము యొక్క ధనము యావత్తు ప్రభుత్వముచే అంగీకరింపబడిన బ్యాంకులలో కోశాధికారి లేక కార్యదర్శులపేర నిల్వ చేయబడవలయును. అవసరమునకు మించిన ధనమును ఏవ్యక్తివద్దను నిల్వ యుంచరాదు.

ఈ. సంఘము యొక్క కార్యక్రమము:— ౧. సభలలోను, సాంఘికాది సమావేశములలోను, భగవత్-భాగవత-ఉత్సవాదులలోను, పాఠశాలలోను అవకాశ అవసరముల ననుసరించి పండితులగు శ్రీ-పురుషాదులచే వేదాంతోపన్యాసముల నిప్పించుట.

౨. శిష్యసంచారము గలవారు, మఠాధిపతులు, దేవాలయ సంబంధులు, ఉపాధ్యాయులు మున్నగు వారి ద్వారా వేదాంత ప్రచారము విరివిగా జరుగునటుల పోత్సహించుట, అట్టివారికి యథావకాశము తోడ్పడు చుండుట.

౩. స్థిరమైనట్టియు, తాత్కాలికమైనట్టియు, సంచారిక మైనట్టియు, ప్రాచ్యవిద్య-ఆధ్యాత్మిక వేదాంత పాఠశాలను, గ్రంథాలయములను నేర్పరచి నడుపుట, ఇదివరలో ఉన్నవాటికి తోడ్పడుట, జీర్ణమైన వాటిని పునరుద్ధరించుట.

౪. పండిత పరిషత్తులు, విద్యార్థి సన్నివేశములు సభలు, ప్రదర్శనములు జరుపుచుండుట, పరీక్షలు జరిపి బిరుదముల, ధృవపత్రముల, బహుమతుల నిచ్చుచుండుట.

౫. నూతన స్వతంత్ర - అనువాద గ్రంథములను - వ్యాఖ్యానములను - టీకలను-వ్రాయించుట - ప్రచురించుట, అవసరమైన పూర్వగ్రంథముల తిర్గి ముద్రింపించుట, అముద్రిత గ్రంథముల సేకరించి ప్రచురించుట, గ్రంథవిమర్శనాదుల చేయించి ప్రచురించుట.

౬. సాంప్రదాయ గ్రంథ కాలక్షేపములు, పురాణ పఠనములు, హరికథా కాలక్షేపములు, ఉత్సవములు, వేదుకలు, రేడియో ప్రసంగములు, గ్రామఫోనురికార్డులు, భజనలు, నాటకములు, సినీమా ప్రదర్శనములు మున్నగువాని ద్వారా జ్ఞాన-భక్తి-వైరాగ్యముల ప్రచారము చేయుట.

౭. వివిధములైన దైనిక, వార, పక్ష, మాసాది పత్రికలు, కరపత్రములు, నివేదికలు ప్రచురించుచుండుట.

౮. దేవాలయముల నిర్మించుట, ఉన్నవాటియొక్క సక్రమ నిర్వహణకై తోడ్పడుట, జీర్ణోద్ధారణ చేయుట.

౯. యతిరాజాశ్రయములు, రామానుజకూటములు, శఠకోపశిబిరములు, పరకాలమఠములు, కాలక్షేపకూటములు, శాంతికుటీరములు, విశ్రాంతిశాలలు, ఆశ్రమములు, మున్నగునవి స్థాపించుట, పాలించుట, ఇదివరలో యున్నవాటి సక్రమపరిపాలనకై తోడ్పడుట, జీర్ణోద్ధారణ చేయుట.

౧౦. ఈ సాంఘీయుల యొక్క పురోభివృద్ధికిన్ని, జీవనో పాధికిన్ని, ఆధ్యాత్మికాభివృద్ధికిన్ని ఉపయోగించునట్టి స్వరూపాను రూపములైన వృత్తులను,విద్యలను ఏర్పాటుచేసి పనిచేయుట.

8. సభ్యుల హక్కులు:— అ. ప్రతి సభ్యుడున్ను తమ గ్రామసంఘమును ఎన్నుకొనుటకున్ను,మహాజన, సభాసమావేశమున పాల్గొని అందలి తీర్మానముల విషయమై తమ యభిప్రాయముల తెలుపుటకున్ను, ఒక్కొక్క "సమ్మతి సూచన"ను (ఓటును) కలిగి యుండును.

ఆ (1) సంవత్సరములో ఎపుడు సభ్యులుగ చేరినను ఆ సంవత్సర ఫాల్గుణ బహుళ ౩౦ వరకు మాత్రమే సభ్యత్వాధికారమును కలిగియుండును.

(?) సంచాలక సమితి, పండిత పరిషత్తులోని సభ్యులు మాత్రము వానిలో సభ్యత్వము కలిగియున్నంత వరకు సాంవత్సరికచందా కట్టనవసరము లేకుండగనే ఈ సంఘ సభ్యత్వాధికారమును కలిగియుందురు.

ఇ. ఈ సంఘ కార్యకారిణీ సమితివారు ఎవరినైనను తగినంత కారణమున్నచో ఆకారణమును తెలుపకుండగనే ఈ సంఘమున సభ్యునిగ చేర్చుకొన నిరాకరించవచ్చును.

ఈ. తాను స్వయముగ గాని, పరోక్షముగ గాని ఈ సంఘమునకు ఏవిధముగ నష్టముగాని, కళంకముగాని కలిగించిన ఏతరగతి సభ్యునైనను వారి సభ్యత్వమును ఈ కార్యకారిణీ సమితి తొలగించవచ్చును.

9. కార్యనిర్వహణము:— ఈసంఘముయొక్క కార్యనిర్వహణము ఈ క్రింది విధముగ నిర్వహించబడును.

1. గ్రామ సంఘములు, 2. సంచాలక సమితి, 3. మహాసంఘ కార్యకారిణీ సమితి = కేంద్రసంఘము, = కార్యకారిణీ సమితి (సమానార్థములు), 4. మహాజనసభ = కేంద్రసభ = వార్షిక సమావేశము = విరాట్ సమావేశము, (సమానార్థము) 5 ఆహ్వానసంఘము, 6. ఉపసమితులు, 7. పండిత పరిషత్తు, 8. సంబద్ధ సంస్థలు, 9. శ్రీ యతిరాజ సేవా మహిళా మండలులు.

(1) పైన తెలిపిన వాటిలోని అధికారవర్గము వారందరు స్త్రీలు, పురుషులు కూడ అధికారవర్గములో యుండవచ్చును. తమయొక్క జీవితములో అత్యధిక కాలమును ఈ సంఘముయొక్క సత్క్రమాభివృద్ధికై వినియోగించి పాటుబడువారై యుండవలెను.

(2) శ్రీవిశిష్టాద్వైత సిద్ధాంతములను బాగుగా తెలిసిన వారై వాటిని తమశక్త్యానుసారముగ ఆచరణయందుంచువారై ఆచార్యప్రాయులై యుండవలెను.

(3) పంచ సంస్కారవరులై యుండవలెను, (పంచసంస్కారములు = శంఖచక్రతాపము-ఊర్ధ్వపుండ్రము-నామము-మంత్రము-యాగము.)

(4) దేశకాలానుగుణ్యముగ యీసంఘాభివృద్ధికి అనుకూలమగు వ్యవహార నిర్వహణ శక్తిసామర్థ్యములు గలవారై యుండవలెను.

(5) అంటువ్యాధులులేని ఆరోగ్యవంతులై యుండవలెను.

(6) ఈ సంఘమునందు వరుసగ కనీసము మూడు సంవత్సరములు సభ్యులై యుండవలెను. (ప్రత్యేక పరిస్థితులలో కార్యకారిణీ సమితి ఈకాలపరిమితిని మార్చవచ్చును)

(7) అ. ఈ సంఘమునకు సంబంధించిన ఎన్నికలన్నియు చేతులెత్తుట మూలమునగాని, చీటివిచ్చుట ద్వారా గాని లేక ప్రత్యేక పరిస్థితులలో తమప్రతినిధుల పంపుటద్వారాగాని, లిఖిత రూపముగగాని కార్యకారిణీ సమితి ఆదేశానుసారముగా జరుపబడవలెను.

ఆ. ఎన్నుకొనబడుట వలన వచ్చిన అధికారములుకూడ సంఘ సభ్యత్వముతోపాటు ఆ సంవత్సరఫాల్గుణ బ॥ అమావాస్య వరకు మాత్రమే యుండును.

ఇ. ప్రతిసమావేశమునందును హాజరైన వారిలో సగముకంటె అధికసంఖ్యాకుల సమ్మతుల ననుసరించి కార్యక్రమము నిర్ణయింపబడవలెను.

ఈ. ఇరుపక్షములయందు సమ్మతులు సమానముగ నుండునపుడు మాత్రమే ఆయా సమావేశాధ్యక్షుడు తన సమ్మతిని ఉపయోగించవలెను. ఇతర సమయముల యందెవుడును అధ్యక్షుడు తనసమ్మతి నుపయోగించకూడదు.

(8) ప్రతి సమావేశమునందును చర్చించబడు కార్యక్రమము ఆ యా సమావేశములకు సంబంధించిన సభ్యులకు తగినంత ముందుగ ఆయా కార్యదర్శులచే తెలియచేయబడవలెను.

(9) ప్రతి సమావేశమునకు సామాన్యముగ ఆసమావేశ సభ్యత్వ పర్ణీత సంఖ్యలలో అయిదవ వంతు కోరముగ నుండును.

(10) ప్రతి సమావేశమును అధ్యక్షుని సూచనపై కార్యదర్శియే తేదీ ప్రదేశాదుల నిర్ణయించి ప్రకటించుచుండవలెను.

(11) కార్యకారిణీ సమితివారు యనుమతిలేకుండగ ఈసంఘమందలి ఏతరగతి సభ్యులుకూడ ఈ సంఘమునకు సంబంధించిన ఏపనినికూడ చేయరాదు.

(12) అన్ని ఏర్పాటులయందును, అంత్యనిర్ణయము నందును కార్యకారిణి సమితివారు సంపూర్ణాధికారమును కలిగి యుందురు.

(13) ఈ సంఘముయొక్క ఏసమితిలో సభ్యులైననుసరియే ఆసమితియొక్కగాని, కార్యనిర్వాహక వర్గము యొక్కగాని నిర్ణీతసంఖ్యలో నాలింట మూడవవంతు సభ్యులచే విశ్వాస రాహిత్యతీర్మానము చేయబడినచో గాని, తామే రాజీనామానిచ్చి అది కార్యకారిణీసమితిచే అంగీకరించబడిన వెంటనేగాని, తమ యధికారమును, సంఘసభ్యత్వమును కోల్పోవును అట్టి యధికారము వెంటనే కార్యకారిణీ సమితికి సంక్రమించును కార్య కారిణీసమితిపై విశ్వాసరాహిత్య తీర్మానము చేయబడినచోగాని లేక అది రాజీనామా నిచ్చినపుడుగాని దాని యధికారములు సంచాలకసమితికి సంక్రమించును. ఈ రెండింటియొక్కయు ఖాళీసమయముల యందు ఈ సంఘ సాధారణసభ్యులే మహాజన సభను జరిపి ఖాళీస్థానముల కన్నిటికిని నూతన ఎన్నికలు జరుపుకొన వలెను.

10. గ్రామ సంఘము:— అ. సామాన్యముగా పదిమందికంటె తక్కువగాని సభ్యులుగల ప్రదేశమునందు గ్రామసంఘ మేర్పరచబడవలెను, ఈసంఖ్యా నిర్ణయ మార్పునకు కార్యకారిణీ సమితి యధికారము కలిగి యుండును.

ఆ. వీరిలో నొకయధ్యక్షుడు, ఒక కార్యదర్శియు, ముగ్గురు సభ్యులుగల గ్రామసంఘ కార్యనిర్వాహక వర్గమును ఆగ్రామ సభ్యులు ఎన్నుకొనవలెను. అవసరమున్నచో ఉపాధ్యక్షులను, సహాయ కార్యదర్శులను, కోశాధి కారిని ఎన్నుకొనవచ్చును.

ఇ. గ్రామకార్య-నిర్వాహకవర్గము అవసరమైనపుడెల్లను సమావేశమగుచు మహాజన సభయొక్కయు, కార్య కారిణీ సమితివారియొక్కయు సూచనలు, సలహాలు, ఆదేశముల ననుసరించి తమకార్యక్రమము నంతను జరుపుకొనుచు నెలవారి నివేదికలను, జమ ఖర్చులను తెలుపుచుండవలెను.

ఈ. ఈవర్గమువారు సంఘముచే ప్రచురింపబడు పత్రికను నియతముగ తెప్పించి సభ్యులనందర నొకచో సమా వేశపరచి ఆపత్రికను చదివి వినుపించుట, సంఘప్రచురణల నన్నిటిని తమ పుస్తకభాండాగారమునకు తెప్పించి వాటిప్రాముఖ్యతను సభ్యులకు బోధించి ప్రతి సభ్యుడును ఒకపుస్తకమును కొని దాని ఉపయోగ మును పొందునట్లుచేయవలెను. మరియు తమ గ్రామమందున్న పండితులచేగాని, గ్రామాంతరములనుండి విచ్చేసిన పండితులచేగాని వేదాంత విషయక ఉపన్యాసముల నిప్పించుచుండవలెను. శుభకార్యములలో యజమానుల ప్రోత్సహించి సంఘమునకు విరివిగా ఆర్థిక సహాయమును పెంపొందించవలెను; సంఘాదేశ ములను సర్వజన విదితముల గావించవలెను.

ఉ. మహాజనసభా సమావేశమునకు ఒక నెలకుముందుగానే సంచాలక సమితివారు సూచించిన వారిలో నొకరిని రాబోవు సంవత్సరమునకు మహాజన సభాధ్యక్షులుగ గ్రామ సంఘములే ఎన్నుకొనబడవలెను. గ్రామ సంఘ ములో హెచ్చువాటిచే సూచింప బడినవారే మహాజనసభాధ్యక్షులుగను తత్సమావేశానంతరము ఆ సంవ త్సరమంతయు ఈ సంఘమునకును, కార్యకారిణీ సమితికిన్నీ అధ్యక్షులుగ నుందురు.

11. సంచాలక సమితి:— అ. (1) ఈ సంఘసభ్యత్వమును మూడు సంవత్సరములకు తక్కువ గాకుండా వరుసగా కలిగియుండి సంచాలక సమితి ప్రథమ సభ్యులచే కనీసమొక సంవత్సరము క్రమశిక్షణపొంది తమయొక్క జీవితకాలమునంతను ఈ సంఘాభివృద్ధి కొరకై ఈ సంఘ నియమ నిబంధనల ననుసరించి పనిచేయ వాగ్దానమును జేసి యిట్లుల నాచరించు వారు మాత్రమే ఈ సమితిలో తమయావజ్జీవితము సభ్యు లుగ నుందురు.

(2) ఈ సమితిలోని సభ్యులెవరైనను ఈ సంఘనియమ నిబంధనలకు వ్యతిరేకముగ ప్రవర్తించి నపుడుగాని లేక సంఘమునకు వీరివలన ఏవిధముగానైన నష్టముకలిగినదని ఋజువైననుగాని (ఈ విషయములు కార్యకారిణీ సమితిలోని మూడింట రెండువంతులు సభ్యులచే తీర్మానింప బడవలెను) మహాజనసభలో హాజరైన సభ్యులలో నాల్గింట మూడు వంతుల మంది వీరిపై విశ్వాస రాహిత్య తీర్మానమును జేసినపుడుగాని వీరంతట వీరే స్వయముగా రాజీనామానిచ్చినపుడుగాని వీరుగైరుహాజరగుట తటస్థించి నపుడుగాని ఈ విషయమును కార్యకారిణీ సమితి వారిచే ప్రకటింపబడిన వెంటనే ఈ సమితిలో వీరి సభ్యత్వము రద్దయిపోవును.

(3) అవసరమైనపుడు ఈ సమితిలో సభ్యులకు ఈ సంఘాభివృద్ధికై తమకాలమును, శక్తిని, వినియోగించు చున్నందులకుగాను కార్యకారిణీ సమితివారు వీరికి తగు ధనసహాయము చేయవలయును.

(4) ఎవరినైనను నూతనముగా సభ్యుల నీసమితిలో జేర్చుకొనుటకు ఈ సమితిలోని సభ్యులలో సగముకంటె హెచ్చుమంది యంగీకరించవలెను.

(5) ఎవరి సభ్యత్వధరఖాస్తునైనను ఏకారణముచెప్పకయే అంగీకరించకపోవుటకీ సమితికి సంపూర్ణాధికారము కలదు.

(6) ఈ సమితిలో సభ్యులైయున్నంతకాలము అట్టి సభ్యులు ఈ సంఘమునకు యితర సభ్యులవలె వార్షిక సభ్యత్వచందా దేనిని కట్ట నవసంములేకుండగనే ఈ సంఘములో కూడ తమ యావజ్జీవితము సభ్యత్వమును కలిగియుందురు.

(7) ఈ సమితిలో సభ్యులందరు తమ జీవితములను అన్ని విషయములలోను ఆదర్శప్రాయముగ రాజకీయ విరహిత పవిత్రతతో గడుపవలయును.

(8) త్రికరణశుద్ధికలవారై ఐహికాముష్మికానందము నొసగూర్పగల శుద్ధసాత్విక జీవితము, కట్టుబాట్లు, నీతి, నియమములు కలవారై యుండవలయును.

ఆ. ఈ సమితి యీ సంఘముయొక్క యావత్తు కార్యక్రమముతోను సంబంధము కలదై ఈసంఘ లక్ష్యసిద్ధికిని నిర్వహణకును అనవరతము పాటుపడుచు ఈ సంఘాభివృద్ధికిని కీర్తిప్రతిష్టలకును, కార్యనిర్వహణకున్ను బాధ్యత కలదై యుండును.

ఇ. ఈ సమితి మహాజనసభ జరుగుటకు ముందుగ జరుగు విషయ నిర్ణయ సభలో పాల్గొని మహాజనసభలో చర్చింపబడవలసిన తీర్మానములను తయారు చేయవలెను.

ఈ. కార్యకారిణీసమితివారిచే తమకు ఒప్పగించబడిన పనులను నిర్వర్తించుచు కార్యకారిణీసమితివారికి నెలవారి నివేదికలను జమఖర్చులను పంపుచుండవలెను.

ఉ. మహాజనసభకు ఒక నెలరోజులు ముందుగ మహాజనసభకు అధ్యక్షులుగ యుండతగిన వారిపేర్లను రెండింటిని గాని అంతకంటె హెచ్చుగాని నూతనాధ్యక్ష యెన్నిక నిమిత్తమై ఈ సమితి సూచించవలెను.

ఊ. కార్యకారిణీ సమితికి నిర్ణీత సభ్యుల సంఖ్యలో సగముమంది సభ్యులను ఈసమితి తమలోనుండి ఎన్నుకొన వలయును (అంతమంది సభ్యులు సమితిలో లేనపుడు మిగతకావలసిన సభ్యులను ఈ సమితి వారే తమకిష్టమైన యితర యోగ్యులైన సభ్యుల కార్యకారిణీ సమితికి ఎన్నుకొనవచ్చును.)

ఋ. ఈ సమితిలో వ్యవహారదక్షులును ఆదర్శప్రాయులు ఆయినట్టి ఒకరిని ప్రథమ సభ్యులుగను మరియిద్దరిని ద్వితీయ, తృతీయ సభ్యులుగను ఎన్నుకొనవలెను. ఈ ప్రథమ సభ్యులే కార్యకారిణీ సమితికి కార్యదర్శిగ నిర్ణయింపబడవలెను. వీరి గైరు హాజరీలో క్రమముగా ద్వితీయ తృతీయ సభ్యులాస్థానమునాక్రమింతురు. వీరు ముగ్గురును హాజరుకానప్పుడు ఈ సమితిచే తమనుండి ఎన్నుకొనబడిన మరొకరు ఆస్థానమున నియమింప బడుదురు.

ఋ. వారంతట వారు రాజీనామా నిచ్చువరకుగాని, లేక వారిపై విశ్వాస రహిత్య తీర్మానముచేయబడువరకు గాని ఈ స్థానము ఇతర యే కారణముల చేతనైనను ఖాళీయగు వరకుగాని ఈ ప్రథమ సభ్యత్వ పదవియు దాని ననుసరించి కార్యకారిణి సమితి కార్యదర్శి పదవియు కూడ స్థిరముగనే యుండును.

ౠ. ఈ సమితియందలి సభ్యులకు భూములు మొదలగువాటివలన వచ్చు స్థిరమగు ఆదాయముగాక మరియే యితరమగు ఆదాయములోనైనను కార్యకారిణి సమితిచే నిర్ణయింపబడిన దానికంటె అదనపు ఆదాయము సంఘమునకే చెందజేయబడవలెను.

ఎ. ఈసంఘమునకు సంబంధించిన యావత్తు చరస్థిరాస్తులు ఈ సమితియొక్క ప్రథమ లేక ద్వితీయ సభ్యుల పేరున యుండి ఈ సమితియొక్క పరిపాలనలోను బాధ్యతలోను యుండవలెను.

12. కార్యకారిణీ సమితి:—ఇదియే మహాసంఘ కార్యకారిణీ సమితి యనియు కేంద్రసంఘము అనియు, కార్యకారిణీసమితి అనియుకూడ వ్యవహరింప బడును.

అ. 1 మహాజన సభా సమావేశమున నిర్ణీతమై తిరిగి మహాజనసభా సమావేశము జరుగువరకు ఈ సంఘము యొక్క యావత్తు కార్యక్రమమును బాధ్యతతో నిర్వహించుచు పనిచేయు నిమిత్తమై మహాజన సభాధ్యక్షునిచే ఈ సమితి యీ క్రిందివిధముగ నేర్పాటు చేయబడవలెను. అవసరమైనపుడెల్ల ఈ సమితి సమావేశమగుచు వలయు కార్యక్రమము నేర్పాటు చేసుకొనుచు పనిచేయుచుండవలెను.

2. ఈసమితి అధ్యక్షులు, గౌరవాధ్యక్షులు, ఉపాధ్యక్షులు, కార్యదర్శులు, కోశాధ్యక్షులు మొదలగువారితో కలసి 10 మంది మొదలు 30 మందివరకు అవకాశ అవసరములను బట్టి సభ్యులతో ఏర్పాటు చేయబడవలెను.

3. ఈ సమితికి మహాజన సభాధ్యక్షుడే అధ్యక్షుడుగా నుండును.

4. అ. యీ సమితిలో మొత్తము నిర్ణీత సంఖ్యలో సగముమంది సంచాలక సమితిచే వారినుండి ఎన్నుకొనబడిన సభ్యులున్ను నాలుగువ వంతు సభ్యులు పండిత పరిషత్సభ్యులున్ను ఎనిమిదవ వంతు సభ్యులు శాశ్వత సభ్యులున్ను మిగత ఎనిమిదవ వంతు సభ్యులు సమర్థులగు ఇతర సాధారణ సభ్యులున్ను అధ్యక్షులచే ఏర్పాటు చేయబడవలెను.

ఆ. వలయునంతమంది సభ్యులు సంచాలక సమితిలో లేనప్పుడు మాత్రమే సంచాలక సమితిచే సూచించబడిన ఇతర సభ్యుల నెవరినైనను వారికి బదులుగ కార్యకారిణీ సమితి సభ్యులుగా అధ్యక్షులే ఏర్పాటు చేయవలెను.

5. సాధారణ సభ్యులను మాత్రము అధ్యక్షులు తమ ఇష్టము వచ్చిన వారినందరిని ఏర్పాటు చేసుకొనవచ్చును. మిగిలిన వారినందరిని ఆయాసమితి సభ్యులే మహాజన సభ జరుగుచున్న కాలములో తమనుండి ఎన్నుకొని అధ్యక్షులకు తెలుపవలయును. వీరిని అధ్యక్షు లంగీకరించ వలెను.

6. ఈ సమితికి సంచాలక సమితి ప్రథమ ద్వితీయ సభ్యులు ప్రధాన సహాయ కార్యదర్శులుగ నుందురు. గౌరవాధ్యక్షులను ఉపాధ్యక్షులను ఎవరినైనను సరియే అధ్యక్షులు ఏర్పాటు చేయవచ్చును.

7. ఈ సంఘముయొక్క చరస్థిరాస్తులు యావత్తు ప్రధాన కార్యదర్శిపేర ఆయన స్వాధీనములోనే యుండవలయును.

8. అధ్యక్ష ఉపాధ్యక్ష స్థానములకు అన్ని విధములైన ఖాళీసమయములయందును సంచాలక సమితి ప్రథమ సభ్యులే అధ్యక్షాధికారములు నన్నిటిని కలిగియుందురు.

9. ఈ సమితి సమావేశములకు యీ సమితి సభ్యులు కాని వారినెవరినైనను అత్యవసర సమయములందు కేవల సలహాకు మాత్రమే అధ్యక్షులు ఆహ్వానించ వచ్చును. అట్లు ఆహ్వానింపబడిన వారు తమసలహాల నిచ్చుటమాత్రమేగాని సమితి సమావేశములలో ఓటింగు హక్కును కలిగియుండరు.

13. మహాజనసభ:—కేంద్రసభ, వార్షిక సమావేశము:— అ. ఈ సంఘమహాజన సభాసమావేశము ప్రతిసంవత్సరము సామాన్యముగ ఫాల్గుణ మాసములో కార్యకారిణీసమితివారు నిర్ణయించిన స్థలమున జరుగుచుండును.

ఆ. ఈ సంఘము ముందు సంవత్సరమున జరుపబడవలసిన యావత్తు కార్యవిధానమున్ను ఈ మహాజనసభ యందే నిర్ణయించుచుండవలెను.

ఇ. ఈ సభయందు ఈ సంఘముయొక్క అన్నివిధములగు సభ్యులున్ను పాల్గొనవచ్చును.

ఈ. మహాజనసభయందు హెచ్చుమందిచే అంగీకరింపబడిన గాని ఏతీర్మానమున్ను ఈ సంఘము అమలుజరుప రాదు.

ఉ. మహాజనసభ జరుగుటకుముందుగ సంచాలకసమితి వారున్ను, పండితపరిషత్తు వారున్ను, కార్యకారిణీ సమితివారున్ను, గ్రామసంఘ ప్రతినిధులున్ను సమావేశమై "విషయ నిర్ణయ సమితి" యనుపేరును వహించి, మహాజనసభలో చర్చించుటకై ఈ సంఘసభ్యులచే పంపబడిన తీర్మానములను చర్చించి అందంగీకరింపబడిన తీర్మానములను మహాజనసభలో చర్చకు ప్రవేశపెట్టవలెను.

ఊ. కార్యకారిణీ సమితివారిచే సమర్పించబడిన వార్షిక నివేదికను, జమ ఖర్చులను చర్చించవలెను.

ఋ. అత్యవసర సమయములయందు సంచాలక పండిత పరిషత్తు సమితి సభ్యులలో సగముకంటె హెచ్చుమంది కోరినపుడుగాని లేక కార్యకాకారిణి సమితి అవసరమని భావించినపుడుగాని అవసర మహాజనసభను సమావేశ పరచి అప్పటి సమస్యల చర్చించి తీర్మానించవచ్చును. ఇట్టితీర్మానములు సాధారణ మహాజనసభా సమావేశమునందు తీర్ణమైన తీర్మానముల వలెనే అమలు జరుపబడవలయును.

ౠ. మహాజనసభా సమావేశానంతరము తిరిగి మహాజన సభాసమావేశమగువరకు దీనియొక్క అధికారములు యావత్తు కార్యకారిణి సమితికి సంక్రమించును. ఈ నియమము అవసర మహాజనసభా సమావేశమునకు కూడ చెందును.

ఌ. నియమావళి మార్పునందు మహాజనసభకు మాత్రమే అధికారముండును.

14. ఆహ్వాన సంఘము:— అ. (1) మహాజనసభా సమావేశముల జరుపుటకున్ను, మధ్యమధ్య సభలు సమావేశములు ఉత్సవములు వగయిరా కార్యక్రమములు జరుపుటకున్ను, తాత్కాలిక సాంచారిక పాఠశాలలు జరుపుటకున్ను, పండితులను పెద్దలను సన్మానించుటకున్ను వలయు యావత్తు ఏర్పాటులను చేయుటకై ఆ యా నిర్ణీత ప్రాంతములందు "ఆహ్వాన సంఘములు" అను పేరుతో సంఘములు ఏర్పడు చుండవలెను.

2. ఆయా నిర్ణీతమైన పనులు నెరవేరిన వెంటనే ఇవి తాము జరిపించిన యావత్తు కార్యక్రమమును, జమ ఖర్చులను వివరముగ తెలుపుచు మిగిలిన ధనమును కార్యకారిణి సమితివారికి అందజేయవలెను. అంతటితో ఆ యాహ్వాన సంఘము రద్దగును.

ఆ. ఆహ్వాన సంఘములు ఏర్పడుట, పనిచేయుట వగయిరా అన్నియు మహాసభ కార్యకారిణి సమితివారి యనుమతిని పొంది వారి యొక్క సలహాలు సూచనలు ప్రకారము మాత్రమే పనిచేయుచుండవలెను.

15. ఉపసమితులు:— అ. ఈసంఘము యొక్క ఉద్దేశాను సారముగ ఆయావిధులను బాధ్యతతో చక్కగా నిర్వహించుటకై కార్యకారిణి సమితివారిచే అవసరమువెంబడిని ఉపసమితులు ఏర్పాటు చేయబడుచుండవలెను.

ఆ. అన్ని ఉపసమితులయందలి సభ్యులును ఈ సంఘములో ఏదో ఒక తరగతి సభ్యతను కలవారై యుండవలెను.

ఇ. ఈ ఉపసమితుల యొక్క కార్యక్రమము, నియమ - నిబంధనలును కార్యకారిణీ సమితివారే నిర్ణయించవలెను. అన్ని రకముల ఉపసమితులున్ను కార్యకారిణీ సమితి వారి సలహాసూచనల ననుసరించి మాత్రమే పనిచేయ వలెను.

ఈ. ఈ ఉపసమితులు తమకు ఒప్పగించబడిన పనిపూర్తియైన వెంటనే గాని లేక మహాజనసభా సమావేశము జరుప బడినవెంటనే గాని లేక అవసరములను బట్టి కార్యరిణీ సమితివారి తీర్మానమువల్లగాని రద్దగును.

ఉ. వీరికి నియమింపబడిన విధులను సక్రమముగ జరుపుకొనుటకై వీరిలో వీరు అధ్యక్ష - కార్యదర్శులను ఏర్పాటు చేసుకొనవలయును.

16. పండిత పరిషత్తు:— అ. ఈసంఘముయొక్క కార్యక్రమములో ధార్మికమైనట్టియు, సాంఘికమైనట్టియు, విద్యాసంబధమైనట్టియు, సాంప్రదాయ సంబంధమైనట్టియు యావత్తు విషయములయందును తోడ్పడుటకై కార్యకారిణీ సమితివారిచే "పండిత పరిషత్తు" అనునది ఏర్పాటు చేయబడవలెను.

ఆ. విద్యావంతులై పూర్వాచార్య సంప్రదాయానుగుణ అనుష్ఠానపరులై యీ సంఘనియమ నిబంధనలకు లోబడినవారై ఈసంఘ కార్యకారిణీసమితివారిచే సంప్రార్థితులైనవారు ఇందు సభ్యులుగా నుండనర్హులు.

ఇ. ఈపరిషత్తునందలి సభ్యులు మూడు తరగతులుగ నుందురు.

మొదటి తరగతి :— గురుముఖతః ఉపదేశమున పొందిన శ్రీభాష్య భగవద్విషయములందును, సంస్కృత నాటకాలంకారాది సాహిత్యమున్ను, తర్కవ్యాకరణ శాస్త్రముల రెండింటియందుగాని, పూర్వమీమాంస యందు గాని, ఏయొక్కదానియందుగాని పూర్ణపజ్ఞ గలవారై యుండవలెను.

రెండవతరగతి :— శ్రీభాష్యమునుగాని, భగవద్విషయమునుగాని సంస్కృత నాటకాలంకారాది సాహిత్య పరులైగురుముఖతః ఉపదేశమును పొందినవారై తర్కమునగాని లేక వ్యాకరణమునగాని ప్రజ్ఞగలవారై యుండవలెను.

మూడవతరగతి :— నాటకాలంకారాది సంస్కృత సాహిత్యము కలవారై సాంప్రదాయ గ్రంథకాలక్షేప ములయందు సామాన్యపరిజ్ఞానము గలవారుగాని, వేదపండితులుగాని ద్రావిడ ఆయిరాధ్యాపకులుగాని, ఆగమ పండితులుగాని ఈతరగతికి చెందుదురు.

ఈ. ఇందు మొదటితరగతి రెండవ తరగతి పండితులకు మాత్రమే పండిత పరిషత్తు సభలో చర్చించబడు ధర్మ నిర్ణయాది విషయములలో పాల్గొనుటకున్ను, సమ్మతుల నిచ్చుటకున్ను హక్కుయుండును.
మూడవ తరగతి పండితులకు కేవలము ప్రచారము నిమిత్తమైన సభలలో నుపన్యాసము లిచ్చుటకు మాత్రమే అధికారముండును. విద్యాయోగ్యతాదుల ననుసరించి క్రమముగా తరగతులు మారుటకు అవకాశ ముండును.

ఉ. ఈపరిషత్తువారు తమకు సంబంధించిన నియమ నిబంధనలను సంఘకార్యకారిణీ సమితివారి అంగీకారము నకు లోబడి నిర్ణయించుకొను చుండవలెను.

ఊ. ఈపరిషత్తువారు తమ కార్యక్రమమును సక్రమముగ నిర్వహించుకొనుటకై తమలో మొదటితరగతి పండిత వర్గమునుండి తగినపండితుల నొకరిని అధ్యక్షులుగను, అటులనే అవసరము ననుసరించి ఉపాధ్యక్షులను, కార్యదర్శులను ఏర్పాటు చేసుకొనవలెను.

ఋ. పండిత పరిషత్తులో అప్పటి కంగీకరింపబడి ఏర్పడియున్న మొదటి తరగతి రెండవతరగతి పండితుల సంఖ్యలో సగముమందికంటె హెచ్చుమంది అంగీకరించిన గాని, సాంఘికమైనట్టిగాని, ధార్మికమైనట్టిగాని, ఆచారవిషయములయందు ఎట్టి నిర్ణయము సంఘముచే చేయబడరాదు. ఈపండితులు తమ అభిప్రాయము లను వ్రాతమూలముగ తెలుపవచ్చును. వీరు తమ యభిప్రాయముల తెలుపుటకు యుక్తమగు రీతిని మూడు పర్యాయములు అవకాశ మియ్యవలయును. అప్పటికిన్ని కొందరు తమ యభిప్రాయములను తెలుపనిచో మిగత వారు తమలోని హెచ్చుమంది సమ్మతుల ననుసరించి నిర్ణయముల చెప్పవచ్చును.

ౠ. కార్యకారిణీ సమితిచేగాని మహాజన సభచేగాని, తమపై విశ్వాస రాహిత్యతీర్మానము చేయబడినపుడు గాని లేక తామే స్వయముగ రాజీనామా చేసినపుడుగాని లేక ఇతరవిధములైన గైరుహాజరుల వలనగాని వీరి సభ్యత్వము రద్దగును.

ఓ. ఈపరిషత్తువారి సంఘమువారిచే ఏర్పాటు చేయబడిన పాఠశాలాదికములలో విద్యావిధానమును నిర్ణయించుటయు అప్పుడప్పుడు విద్యార్థులయొక్కయు, నూతనముగ జేరు పండితులయొక్కయు యోగ్యతలను శక్తిసామర్థ్యములను పరీక్షించి నిర్ణయించుటయు, ఉపన్యాసాదుల నిచ్చుటయు, పత్రికలను పుస్తకములను ప్రచురించుటయు, దేవాలయ, రామానుజకూటాదుల నిమిత్తమై ప్రోత్సహించుటయు, వాటి సక్రమ పరిపాలనలో నుంచుట సంఘకార్యకారిణీసమితి వారిచే కోరబడిన శాస్త్రీయ విషయములలో తమసలహాల నిచ్చుట మున్నగు పనులు చేయవలెను.

ఔ. ప్రతి సంవత్సరమున్ను కార్యకారిణీ సమితికి తమ సమితి సభ్యులలో నుండి కార్యకారిణీ సమితియొక్క నిర్ణీత సంఖ్యలో నాలుగవ వంతు సభ్యులను ఎన్నుకొనవలెను.

17. సంబద్ధ సంస్థలు :— అ. ఈ సంఘము యొక్క ఆదర్శ-విశ్వాస-ప్రమాణాది-నియమ నిబంధనలకు వ్యతిరేకము గానట్టియు, అనుకూలమైనట్టి ఆదర్శ విశ్వాస-ప్రమాణాది నియమ, నిబంధనలను కలిగియున్నట్టియు వేదాంత - ఆధ్యాత్మిక విజ్ఞాన ప్రచారక సంస్థలను ఈసంఘమునకు సంబద్ధ సంస్థలుగ జేర్చుకొనవచ్చును.

ఆ. అట్టిసంబద్ధ సంస్థలు ఈసంఘమునకు విరుద్ధముగాకుండగ స్వతంత్రములుగా వ్యవహరించుకొనవచ్చును.

ఇ. ఈసంఘముచే నంగీకరింపబడిన ప్రతి సంబద్ధసంస్థయు ఈ సంఘమునకు సాలు 1 కి రు 3-0-0 చొ॥న చందాను చెల్లించవలెను. ఇట్లు చెల్లించనిచో తమ సభ్యత్వమును కోల్పోవును.

ఈ. ఏసంస్థనైనను, ఎప్పుడైనను సంబద్ధ సంస్థగా చేర్చుకొనుటకుగాని నిరాకరించుటకుగాని, అంగీకరించబడిన వాటితో సంబంధమును రద్దుపరచుటకుగాని ఈ సంఘకార్యకారిణిసమితి సంపూర్ణాధికారము కలిగి యుండును.

18. ఈనియమనిబంధనావళిలోని అవసరమగు మార్పులను ప్రతిసంవత్సరమునకొక పర్యాయము మాత్రమే వార్షికసభలో మాత్రమే మార్చబడవచ్చును; అవసరమహాజన సభలలోను కూడ అవసరమునుసరించి మార్చబడవచ్చును.

19. ఏవిధమైన అధికారపదవియందలి సభ్యులైనను సరియే ఆహ్వానింపబడిన మూడుసన్నివేశములకు వరుసగా హాజరుకానిచో ఈసంఘముయొక్క ఆ అధికారపదవియొక్క సభ్యత్వమును కోలుపోవుదురు. కాని గైరుహాజరునకు తగినంత కారణమున్నదని కార్యకారిణీ సమితివారు నిర్ణయించినచో సభ్యత్వము రద్దుపడదు. లేదా ఆపదవికి తిరిగివారే నియమింప బడవచ్చును.

20. ప్రత్యేకకార్య క్రమములకై దాతలచే నీయబడిన అన్ని విధములైన విరాళములు ఆ యాదాతలయుద్దేశాను సారముగ మాత్రమే వినియోగించబడవలయును. వాటి నిర్వహణకై ఆయాప్రాంతములందు ఉపసమితుల నేర్పాటు చేయవలయును. ఈ ఉపసమితులు సక్రమముగ పనిచేయుచున్నంతవరకు కేంద్రసంఘమువారు వాటి విషయమై కలుగజేసుకొన కూడదు. దాతల ఉద్దేశభంగము కలిగినపుడు మాత్రమే కేంద్రసంఘము వారు కలుగజేసుకొని వానిని సక్రమపరచవలెను.

21. శ్రీయతిరాజ సేవా మహిళామండలి:— అ. ఈ సంఘముయొక్క కార్యక్రమము స్త్రీలలో విరివిగా ప్రచారమై వ్యాప్తిచెంది వృద్ధియగుటకుగాను ప్రత్యేక స్త్రీశాఖగ ఈ సంఘముయొక్క యాజమాన్య పర్యవేక్షణల క్రింద పనిచేయునట్టియు ఈ సంఘమందలి స్త్రీ సభ్యురాండ్రతో మాత్రమే కూడుకున్నట్టియు "శ్రీయతిరాజ సేవా మహిళామండలి" అను పేరుతో అవకాశము, అవసరము గల స్థలముల యందెల్ల ఈ సంఘ స్త్రీ శాఖోపసమితులు ఏర్పాటు చేయబడవలెను.

ఆ. ఇందు ఈ సంఘముయొక్క స్త్రీ సభ్యురాండ్రు మాత్రమే సభ్యురాండ్రుగ నుందురు. పురుషసభ్యులిం దుండ రాదు.

(1) ఈమండలముయొక్క యావత్తు కార్యక్రమనిర్వహణమునకై ఈ ఉపసమితికై ఏర్పరచుకున్న సరిహద్దులలో గల, ఈ సంఘము యొక్క అన్ని తరగతుల స్త్రీసభ్యురాండ్రచేతను తమలోనుండి అయిదుగురికి తక్కువ గాకుండగను, ఇరువదిమందికి ఎక్కువగాకుండగను (అవసరానుసారముగ) కార్యనిర్వాహకసభ్యురాండ్రను; మరియు ఒక అధ్యక్షురాలను, నలుగురికి మించకుండగ ఉపాధ్యక్షురాండ్రను, ఇద్దరికి మించకుండగ కార్యదర్శిణులను (కార్యదర్శినులలో ఒకరిని కోశాధికారిణిగ కూడను) మూడుసంవత్సరములకొక పర్యాయము చొప్పున ఎన్నుకొనుచుండవలయును. వీరిలో అధ్యక్షురాలున్ను, ఉపాధ్యక్షురాండ్రలో యిద్దరున్ను, కార్యదర్శిణులలో ఒకరున్ను, మిగత సభ్యురాండ్రలో సగముమందియున్ను శాశ్వత సభ్యురాండ్రనుండి ఎన్నుకొనబడవలయును. ఇంతమంది శాశ్వత సభ్యురాండ్రులేని చోట్లయందు వారంగీకరించ నపుడుగాని యితర సాధారణ సభ్యురాండ్రచే ఆస్థానముల పూర్తిచేసుకొనవచ్చును.

(2) కొన్ని ప్రత్యేక పరిస్థితుల ననుసరించి కొన్నిస్థలములలో అధ్యక్షురాలిని, ఉపాధ్యక్షులలో యిద్దరిని, కార్యదర్శిణులలో ఒకరిని, సభ్యురాండ్రలో నలుగురికి మించకుండగను, ఈ మూడుసంవత్సరముల గడువుగల ఎన్నికలతో సంబంధము లేకుండగ వారివారి జీవితాంతము వరకు ఆ యా పదవులు శాశ్వతముగ వారువారు కలిగియుండు నటుల శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ కేంద్ర కార్యకారిణీ సమితివారు నిర్ణయించవచ్చును.

(3) అధ్యక్ష-ఉపాధ్యక్ష-కార్యదర్శి-కార్యనిర్వాహక సభ్యురాండ్రతో కూడుకున్న దానిని "శ్రీయతిరాజ సేవా మహిళా మండలి కార్యనిర్వాహక వర్గము అని వ్యవహరించ వలయును.

(4) ఈకార్యనిర్వాహక వర్గము నెలకొక పర్యాయమైన సమావేశమగుచు తమ కార్యక్రమమును నిర్ణయించు కొనుచుండవలయును.

(5) ఈ మండలికి సంబంధించిన యావత్తు కార్యక్రమ నిర్వాహణబాధ్యత, యాజమాన్యము శ్రీయతిరాజ సేవా మహిళామండలి కార్యనిర్వాహక వర్గమువారు కలిగియుందురు.
శ్రీయతిరాజ సేవామహిళామండలి కార్యనిర్వాహక వర్గముపై శ్రీవిశిష్టాద్వైత ప్రచారకసంఘ కేంద్ర కార్యకారిణీ సమితి వారు అన్ని అధికారములను కలిగియుందురు.

(6) శ్రీయతిరాజ సేవా మహిళామండలి కార్యనిర్వాహక వర్గమువారు వరుసగ మూడు పర్యాయములు తమ ప్రత్యేక ప్రత్యేక సమావేశములలో ఒకేమాదిరిగ తీర్మానించిన విషయములను శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ కేంద్ర కార్యకారిణీ సమితివారు నిరాకరించరాదు. ఇందు మూడవ పర్యాయములో కూడిన సమావేశములో మాత్రము శ్రీయతిరాజ సేవా మహిళామండలి కార్య నిర్వాహక వర్గము యొక్క నిర్దిష్టమైన సంఖ్యలో మూడింట రెండువంతుల మంది కి సభ్యురాండ్రచే ఆ తీర్మానము అంగీకరించబడవలెను లేనిచో ఆ తీర్మానము ఉత్తీర్ణమైనటుల ఎంచబడదు. ఇట్టి మూడు సమావేశములకున్ను కనీసమొకనెల వ్యవధాన ముండవలెను.

(7) సంవత్సరమున కొకపర్యాయము శ్రీయతిరాజ సేవా మహిళామండలి యొక్క సర్వ సభ్య సమావేశము జరుపవలెను. అందు ఆ సంవత్సరము జరిగిన కార్యక్రమము యొక్క సింహావలోకనము, ముందు సంవత్సరము జరుగవలసిన కార్యక్రమ నిర్ణయము, జమ ఖర్చులు, ముందు చేయవలసిన వాని అంచనాలు వగైరా యావత్తు విషయములు పరిశీలించబడి నిర్ణయించబడవలయును. ఈ సర్వసభ్య నిర్ణయానుసారముగ ఈ కార్యనిర్వాహక వర్గమువారు తరువాత కార్యక్రమమును నడిపించ వలయును.

౯. ఈమండలి స్త్రీలలో ఆధ్యాత్మిక జ్ఞాన-భక్తి-వైరాగ్యముల యభివృద్ధికి మాత్రమే అనుకూలమగు అన్ని విధముల కార్యక్రమముల నవలంబించి పనిచేయవలయును. ఇందులకై ఆశ్రమములు, పాఠశాలలు, గ్రంథాలయములు, ఉపన్యాసభవనములు, భజనమందిరములు, కాలక్షేపకూటములు, వేదపాఠశాలయములు మున్నగువానిని ఏర్పరచవలయును.

ఈ. ఈమండలిచే స్త్రీలకై మాత్రమే ఏర్పరచబడిన ఆశ్రమాదులలో పురుషులకు ప్రవేశముండరాదు గానీ ప్రత్యేక పరిస్థితులయందు మాత్రము జ్ఞాన-భక్తి-వైరాగ్య సంపన్నులైనట్టి యోగ్యులగు పురుషులచే ఈ మండలివారు కాలక్షేపములనుగాని, పఠనాదులనుగాని, ఉపన్యాసములనుగాని, పాఠప్రవచనాములనుగాని, తాత్కాలికముగ మాత్రము తమకార్యక్రమములో చేర్చి ఏర్పాటుచేయవచ్చును అట్టి ప్రత్యేక పరిస్థితులలో వీనిని వినుటకై తాత్కాలికముగ పురుషులకు కూడ అవకాశమును కల్పించవచ్చును.

ఏ పరిస్థితులయందును కూడ, యిటుల తాత్కాలికముగ అవకాశము కల్పించబడిన ఈ పురుషుల సంబంధముచే ఈ మండలియొక్క కార్యక్రమమునకు ఎట్టి ఆటంకములుగాని, కష్టనష్టములుగాని, అవాంతరములుగాని, కలుగకుండునటుల జాగ్రత్తగ యుండవలయును ఇట్టి ప్రత్యేక పరిస్థితులలో ఇటికార్యక్రమ నిర్ణయమునకు ముందుగాను. కార్యక్రమ నిర్వహణములోను కూడ స్థానికమైన శ్రీ విశిష్టాద్వైత ప్రచారకసంఘ శాఖవారి సలహాలను, సహాయమును తప్పకుండగ తీసుకొనుచుండవలయును.

ఉ. ఆశ్రమములు:— (1) శ్రీయతిరాజ సేవా మహిళామండలియొక్క కార్యక్రమ ప్రచారమునకై అనువగునట్టియు, ప్రశాంత ఆదర్శ పవిత్ర జీవితమునకు అనుకూలమైనట్టియు, ప్రమాదరహితమైనట్టియు ఆశ్రమములు స్థాపించబడవలయును. ఆశ్రమ వాతావరణమంతయు అతిప్రశాంతముగను, జ్ఞాన-భక్తి-వైరాగ్య ప్రబోధకరముగను, నిరాడంబరముగను, నిర్మలముగను, దేవద్విజగురు సన్నిధానమందును, మంచినీటి వసతిగల ప్రాంతమందును యుండవలయును.

(2) మద్యమాంసాది నిషిద్ధ ద్రవ్యములుగాని, జ్ఞాన-భక్తి-వైరాగ్యములకు విరుద్ధములగు వాఙ్మయముగానీ, వస్తువులుగాని ఆశ్రమములో ఉపయోగించబడకూడదు; ఆశ్రమ ఆవరణలోనికి తీసుకొని రాబడకూడదు.

(3) ఈ మండలి కార్యక్రమమున సంపూర్ణవిశ్వాసముండి, దీనిని ప్రచారము చేయుటకయ్యే తమ యావజ్జీవితమును వినియోగింప ప్రతిజ్ఞచేసి, ఈ మండలిలో మూడుసంవత్సరములకు తక్కువగాకుండగ సభ్యత్వము కలిగియుండి, తమ ఆదర్శ-సత్ప్రవర్తనలలో సంఘమునకు సంపూర్ణవిశ్వాసమును కలిగించగలిగి, ప్రచారమునకున్ను, ప్రశాంతజీవితమునకున్ను వలయు జ్ఞాన-భక్తి-వైరాగ్యములు గల స్త్రీలు మాత్రమే ఈఆశ్రమములలో స్థిరనివాసులుగ చేర్చుకొనబడుదురు.

(4) స్థిరనివాసులుగ అంగీకరించిన పిమ్మటకూడ వీరిప్రవర్తనవలన సంఘమునకు కష్ట-నష్టములు కలుగుచో అట్టివారిని శ్రీయతిరాజ సేవా మహిళామండలి కార్యనిర్వాహక వర్గమువారితో సంప్రతించి ఆశ్రమమునుండి తొలగించుటకు శ్రీ విశిష్టాద్వైత ప్రచారక కేంద్ర కార్యకారిణి సమితివారు అధికారమును కలిగియుందురు.

(5) ఆశ్రమములలో విలాసకరమైనట్టియు, భోగరూపమైనట్టియు జీవితమున కవకాశముండరాదు.

(6) ప్రతి ఆశ్రమములోను ప్రతిదినము ఉదయమునను, సాయంకాలమునను తప్పనిసరిగా ఆశ్రమవాసులందరు కలిసి సమిష్టిగా పాల్గొనుటకు వీలగునటుల భగవదారాధనము, భగవత్ప్రార్థన, స్వరూపగ్రంథపారాయణము, సాంప్రదాయ గ్రంథకాలక్షేపము, భజనయు, పఠనాదులు యుండవలయును.

(7) ఏదైన తగినంత కారణముండిననే తప్ప ఆశ్రమవాసులలో ఎవరుకూడ ఈ సమిష్టి కార్యక్రమములలో పాల్గొనకుండగ యుండరాదు.

(8) ఆశ్రమములలో జరుగు సమిష్టికార్యక్రమము లన్నింటిలోను ఆశ్రమవాసులు కానట్టియు, ఈ మండలియందు సానుభూతి, శ్రద్ధాసక్తులు కలిగినట్టియు, యితరస్త్రీలుకూడ పాల్గొనుటకు అవకాశ ముండవలయును.

(9) ప్రతి ఆశ్రమములోను స్వరూప సాంప్రదాయానుకూలమైనట్టి భగవంతుని జయంతులు, భగవత్-భాగవతాచార్య సుప్రసిద్ధ తిరునక్షత్రములు, శుక్రవారములు, ఏకాదశులు, యింకా యితర పవిత్ర పుణ్యపర్వదినములు జరుపబడుచు అందు సాంప్రదాయసిద్ధమైన ఉత్సవాది కార్యక్రమములు జరుపబడుచుండవలయును.

(10) వీలైనంతవరకు ప్రతి ఆశ్రమవాసియు తన జీవితమునకు వలయు తిండి బట్టలకు కావలసిన ధనమును తానే స్వయముగ కాయకష్టములచే సంపాదించుటకు అనువగునట్టి స్వరూపానుకూల కుటీరపరిశ్రమలు, ఆశ్రమము లోనే ఆశ్రమయాజమాన్యముననే స్థాపించబడవలయును. ఈ విషయములో స్థానికమైన శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘశాఖవారి సలహాలను, సహాయమును తప్పక తీసుకొనవలయును.

(11) ఆశ్రమవాసులు సంపాదనయంతయు ఆశ్రమాభివృద్ధికే వినియోగింప బడవలయును. వారి వారసులు వగైరాల కెట్టిహక్కులు, సంబంధము యుండరాదు.

(12) ఏ ఆశ్రమములోను ఎవరికి వ్యక్తిగతముగ ఏవిధమైన స్థిరమైన హక్కులు యుండరాదు.

(13) దీనికి సంబంధించిన చర-స్థిరాస్తులన్నియు శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ యాజమాన్య పర్యవేక్షణల క్రింద శ్రీయతిరాజ సేవా మహిళామండలి వారికి మాత్రమే సమిష్టిరూపముగా చెందినవై యుండును.

(14) ఆశ్రమములలోని వారందరు తమ తమ వర్ణాశ్రమానుకూల ఆచారవ్యవహారముల కనుగుణముగ నడుచు కొనుచుండవలయును.

(15) ఆశ్రమము లన్నింటియందును జ్ఞానానుష్ఠానములకే ప్రాధాన్య ముండవలయును.

(16) ఆశ్రమవాసులలో వరస్పరము నీచోచ్ఛ భావము లుండరాదు. "పరస్పరం బోధయన్తః" అను సూత్రము ననుసరించి సమానగౌరవ ప్రతిపత్తుల కలిగి యుండవలయును.

(17) ప్రతి ఆశ్రమముయొక్క దైనందిన సామాన్య కార్యక్రమ నిర్వాహణమునకున్ను, ఆశ్రమవాసులలో ఒకరు పర్యవేక్షకురాలుగ శ్రీ యతిరాజ సేవా మహిళామండలి కార్యనిర్వాహక వర్గమువారి సంప్రతింపులపై శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ కేంద్రకార్యకారిణీ సమితివారిచే ఏర్పాటు చేయబడవలయును

(18) అవకాశమున్నంత వరకు ప్రతి ఆశ్రమమునకు చేర్చి పాఠశాలలు, గ్రంథాలయములు, ఉపన్యాసభవనములు, భజనమందిరములు, కాలక్షేపకూటములు యుండవలయును.

అ. ఆశ్రమములో స్థిరనివాసులుగ చేర్చుకొనబడు స్త్రీల కుండవలసిన యోగ్యతలు:— i. శ్రీ యతిరాజ సేవా మహిళామండలిలో మూడుసంవత్సరములకు తక్కువగాకుండగ సభ్యురాలై యుండ వలయును.

ii. తప్తచక్రాంకనాది పంచసంస్కారపరులై యుండవలయును.

iii. తమప్రాకృత బంధువర్గముతో ఎట్టి లావాదేవీలుగాని, ప్రాకృతసంబంధముగాని యుండరాదు.

iv జాతి-ఆశ్రయ-నిమిత్తాదులచే దూషితములుగాని శాకాహారమును మాత్రమే నియమ నిష్ఠలతో భుజించు వారలై యుండవలయును.

v. జ్ఞాన-వైరాగ్య సూచకములగు నట్టియు, విలాస-భోగ రహితమైనట్టియు, నిరాడంబరము, నిర్మలము అయి నట్టి వస్త్రాలంకారణాదులను మాత్రమే ధరించవలయును.

ఆ. పాఠశాలలు:— బాలికలకున్ను, పెద్దవారలగు స్త్రీలకున్ను ఆధ్యాత్మికాభివృద్ధి కరములగు విద్యలున్ను (స్తోత్రపాఠములు, ప్రబంధములు, పురాణములు, సాంప్రదాయగ్రంథములు ఇత్యాదులు) వీనికి వ్యతిరేకముగాని, అడ్డంకము గాని కలుగనట్టి యితరవిద్యలున్ను నేర్పుటకు పాఠశాల లుండవలయును. ఈ పాఠశాలలలో స్త్రీలే అధ్యాపకురాండ్రుగ నియోగించబడవలయును.

ఇ. గ్రంథాలయములు:— స్త్రీలయభివృద్ధికి అనువగునట్టి జ్ఞాన-భక్తి-వైరాగ్యబోధకములైనట్టి పత్రికలు పుస్తకములు, పఠములు మున్నగు వాఙ్మయముతో కూడుకొనియున్న గ్రంథాలయములు స్థాపించబడవల యును. ఈ గ్రంథాలయములలో ప్రాకృతిక మైనట్టియు, మనోవికారముల కలిగించునట్టియు, జ్ఞాన

భక్తి-వైరాగ్యములకు అనుకూలముకానట్టియు పత్రికలుగాని, పుస్తకములుగాని, పటములుగాని ఎట్టి వాఙ్మయము యుండరాదు. గ్రంథాలయమునకు సంబంధించిన పరివారముగకూడ స్త్రీలే నియోగింపబడవలయును.

ఈ. ఉపన్యాసభవనములు:— జ్ఞాన-భక్తి-వైరాగ్య బోధకములగు ఉపన్యాసములనుగాని, కాలక్షేపాదులనుగాని, పఠనాదులనుగాని జరుపుటకు (చెప్పువారుస్త్రీలే, వినువారుస్త్రీలే అయియుండునట్టి) ఉపన్యాస భవనములను, కాలక్షేపకూటములను, పఠనాలయములను స్థాపించవలయును.

ఉ. శ్రీయతిరాజ సేవా మహిళామండలి యొక్క లౌకిక రాజకీయములకు సంబంధించిన పనులను నిర్వహించుటకుగాను స్థానికమైన శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘమువారి సలహా సహాయములపై ఆ సంఘములోని వారి నెవరినైనగాని లేక యోగ్యులగు యితరులనుగాని పురుషులను ఆ యా ప్రత్యేకపనులకై ఏర్పాటు చేసుకొనవచ్చును.



# CERTIFICATE OF REGISTRATION OF SOCIETIES

## ACT XXI OF 1860

S. No. 9 of 1951.

I hereby certify that "**Sri Visishtadvaitha Pracharaka Sangham**" has this day been registered under the Societies' Registration Act, XXI of 1860.

Given under my hand at Madras, this fourteenth day of March, One thousand nine hundred and fifty one.

*Additional Assistant Registrar of*
*Joint Stock Companies,*
*Chingleput District.*

# సవినయవినతి

"కలౌ సంఘే శక్తిః" కలియుగమున సంఘమునసే శక్తియుండును. సుసంఘటిత సంఘము ద్వారా మాత్రమే మన మీ కాలమున ఆధ్యాత్మాభివృద్ధిని, ఆత్మోన్నతిని, ఆనందమును పొంద కలుగుదుము. పరస్పరబోధకును, భక్తిబావ ప్రచారమునకును సంఘమే కదా సాధనము. సత్సంగమమునకును, సాదుసేవకును, సదనుష్ఠానమునకును శరణ్యము సంఘమే గాన దయయుంచి తాము ఈ సంఘమున సభ్యత వహించుట మాత్రమే గాకుండగ తమ యనుయాయుల నందరను ఇందు వెంటనే సభ్యులుగ జేర్పించి ఈ సంఘమును పటిష్ఠము, సుసంఘటితము, ఫలప్రదాయి అగునటుల జేయగోరుచున్నారము.

ప్రధాన కార్యాలయము:—

గీతామందిరము

107, వరదాముత్తియప్పన్ వీధి,

మదరాసు—1.

తమ,

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము

శ్రీ శ్రీ శ్రీ













"భక్తి"

# నివేదన




ఖర-ఆశ్వయుజమాసము

సంపుటి ౨ సంచిక ౭



శ్రీమతే రామానుజాయనమః

భక్తి

# నివేదన

## వేదాంత మాసపత్రిక


| సంపుటి ౩ | ఖర—ఆశ్వయుజమాసము | సంచిక ౭ |
| --- | --- | --- |


# యతిరాజ విజయ నాటకము

[ప్రియరఙ్గ రఙ్గప్రియుల వాక్చాతుర్యము]

## తత్పరిణామము—తృతీయాంకము

వేదవ్యాళికి మాయావాది దుర్నయ మసహ్యాకరమాయెను. రామానుజులను ప్రధానామాత్య పదవి నలంకరింపజేసిన బాంగుడునేడు సంకల్పము ప్రబలమాయెను. కానిమ్మాయావాదివారి ప్రవేశమును తీవ్రముగా ప్రతిఘటించెను. శ్రీయామునాచార్యులవారును శ్రీకాంచీపూర్ణులును యెట్లైనను రామానుజుల నాస్థానము నలంకరింపజేయవలెనని యత్నించుచుండిరి. ఇట్లుండగా వేదవ్యాళి శ్రీయామునులతోను మాత్రులతోను కొలువునందుండగా మాత్రులు తనమ్రోలనే పరస్పరము కలహించి యసభ్యముగా ప్రవర్తించుట యాతనికి దుస్సహమాయెను. సరిగ నిదే సమయమునకు శ్రీయతిరాజ శిష్యపుంగవులగు వాధూలగోత్రోద్భవులగు దాశరథులును వాత్స్యగోత్రోద్భవులగు సుదర్శనవరద విష్ణువులును వైతాళిక వేషములతో శ్రీకాంచీపూర్ణుల యాజ్ఞాపత్రమును శ్రీయామునుల కర్పింప సభామండపమున ప్రవేశింతురు.

రాజు:—(గౌరవముతో వైతాళికులను జూచుచు) మీరెవరు? ఏలవచ్చితిరి?

వైతా:—రాజా! ముందు పూజ్యులను పూజించినామే విన్నవింతుము.

రాజు:—(ఆలోచించి) ఐనను ఆలోచనవల ? ఇట్టి ఆత్మజ్ఞాన సంపన్నుల బుద్ధి గూఢని పనులలోనికి దిగదు. (పైకి) ఐనచో నట్లే జేయుడు. (వైతాళికులు వినయముతో దగ్గరకేగి యామును నాచార్యుల పాదములను శిరస్సుననిడుకొందురు)

యాము:—(భయముతో) మహారాజు ముందంత యాదరము తగదు. (అని [illegible] కాషాయవస్త్రాగ్రముతో కప్పికొందురు)

రాజు:—(గౌరవముగా చూచును)

వైతా:—మేము పూజ్యులగు రామానుజుల పాదదాసుల మని [illegible]

యాము:—(స్నేహగౌరవములతో) మహారాజానుగ్రహపాత్రులు [illegible]!

వైతా:—పూజ్యా! తమ యనుగ్రహముచే ధన్యులమగుచుంటిమి [illegible]!

రాజు:—పుణ్యమూర్తులారా! ప్రశ్నయట్లే యుండిపోయెను.

వైతా:—(భయముతో తిరిగిచూచి) దేవా! మేము శ్రీ[illegible] తునకలము.

రాజు:—గురువందనసమయముననే యావిషయము తెలిసినది. అందెవ్వరా యని [illegible] తెలియగోరుచున్నాను.

వైతా:—ఆయన మాకు విద్యకు సంబంధించిన తండ్రి తిరిగి పుట్టమంచ జేయు జనకుడును.

రాజు:—(ఆనందముతో) ఆయనయేనా మీకాచార్యుడు ? (ఆలోచించి) ఆయన మమ్మెన్నడైన తలంచునా ?

వైతా:—ఎప్పటికిని తలపెట్టరు.

రాజు:—(సందేహముతో నుండును)

వైతా:—కాని యోగమహిమచే నెల్లప్పుడును మిమ్మనుభవించుచునే యుందురు.

రాజు:—(చిరునవ్వునవ్వును)

వైతా:—తమరు రెండవప్రశ్నకు సన్నద్ధులు కండు.

రాజు:—(నవ్వి) పూజ్యులారా! ఒక్కక్షణకాలము క్షమింపుడు. (నిలిచియుండు [illegible]) యొద్ద సదూహుడని యెవ్వడైనా యున్నాడా ?

వైతా:—ఊరక యుండుటయేగాదు.

రాజు:—ఇంకేమి ?

వైతా:—మాయావాదిని పీకి పారవేయుటకు సన్నాగమును పన్నుచున్నాను.

రాజు:—(మాయావాదిని జూచి కోపముతో తనలో, దుర్మార్గుడా! ప్రభుభక్తిహీనుడవగు నీకేమి ఫలించునో తెమ్ము. (పైకి) పుణ్యులారా! మీరు వచ్చిన పనిని చెప్పుడు.

వైతా:—(ఒకరిముఖము నొకరు చూచుకొందురు)

రాజు:—(కుడికన్ను అదిరి నట్లభినయించి ఆనందోత్సాహములతో) ఆలోచన యేల ? విశ్వాసముతో జెప్పుడు.

వైతా:—అంతయు నిదియే చెప్పును (అని పట్టుబట్టచే చుట్టబడిన ఉత్తరమును విప్పియిత్తురు)

యాము:—(దానిని తీసుకొనును)

రాజు:—ఇది యెచ్చటినుండి వచ్చినది ?

వైతా:—అదియునాయుత్తరమే చెప్పును.

రాజు:—ఆర్యా ! చదువుడు. చదువగా వినగోరుచున్నాను.

యాము:—(ఉత్తరమును) విప్పి చదువుచు చిరునవ్వు నవ్వును)

రాజు:—దోషమేమైన గలదా !

యాము:—లేదు లేదు. నిర్దుష్టమే. కాని మీరు అందెదు శిరస్సున మోపజాలిరి.

రాజు:—అది యెట్లు ?

యాము:—నాకొఱకై వచ్చిన యీ యుత్తరము తమకు జూపబడెను.

రాజు:—తప్పేమి ? అదియును నాదే. చదువుడు.

యాము:—వినను చదువుటకు భయపడుచున్నాను.

రాజు:—(బలవంతముగ తీసుకొని తానేచదువును) స్వస్తి శ్రీ యామునమునుల పాదవందన మాచరించి కాంచీపూర్ణుడు గావించు విజ్ఞప్తి —

ఇప్పుడు శ్రీహస్తిశైలాభరణమగు శ్రియఃపతియైన శ్రీవరదరాజులు నాయెదుట సాక్షాత్కరించి రామానుజుల నీవిధముగ నాజ్ఞాపించెను.

"నాయాజ్ఞానువర్తియగు వేదమార్గి యుత్తరి వేదబాహ్యులును కుదృష్టులును నగు దుష్ట మంత్రివర్గముచే బీడింపబడుచు కలతజెందుచున్నాడు. కావున నీవాతనిని కాపాడవలె" నని అందుకనుకూలించు మతి నీతి, సత్యము, సముత్సాహము మొదలగు వారినితోడిచ్చి రామానుజుని బంపితిని, కావున నీవును రాత్రిం బవళ్ళు వేదమార్గిని గాపాడుచుండుమని' అని

యాము:—(ఆనందముతో) ఇది యొక గొప్ప యభ్యుదయమే.

మాయా:—దేవా ! వైతాళికుల అసత్యభాషణములకు పూర్తిగ మోసపోతివి.

(కోపముతో యామునుని జూచుచు)

రావణ సన్యాసీ ! నీయాలోచన యనెడు కపట తొండమూవి నీటియందీరాజుని ముంచి వేసితివి. రాముడువలె నే దురవస్థ నొందునో గదా !

ప్రియరంగుడు:— రామానుజుని బలముచే రామునివలెనే మా రామానుజుల బలముచే నీ రాజును ఏవిధమగు దురవస్థను చెందంబోడు. కాని యంతటను గెలుపునే పొందును. నీవుమాత్రము

మును పూర్తిగ విడిచిపెట్టి నాకంటె వేరొక్కడు లేడని జెప్పను నొక్క మాయనే [illegible] నమ్మియున్న నీవే నిజముగ రావణసన్యాసివి.

మాయా:—(కోపముతో) బాగు! బాగు! వైతాళికవటుడా! అబ్బా! ఎంత [illegible]? పరమహంసనగు నా యజ్ఞోపవీతత్యాగమును నీ వొక్కడవే కాబోలు [illegible].

ప్రియరంగుడు:—కాదు-కాదు. అందరు నెఱుంగుదురు. జందెమును నీడినది. కాకియో హంసయో మన కెందుకు గాని నేనిప్పుడు జెప్పిన దగుకాదు.

మాయా:—(ఆలోచించి) హు! మరేమి? శారీరసూత్రములను విడిచితి ననుచున్నావా [illegible] ఓరి యవివేకీ! శ్రీవేదమౌళిమహారాజును అద్వైతసామ్రాజ్యము నేలించు [illegible], ఎరుంగుదువా? ఇక నే నాసూత్రముల నెట్లు వీడుదును? చాలు చాలు. [illegible] కొను పిల్లవానికి నీ కీబ్రహ్మవిద్యాప్రసంగమేల?

ప్రియ:—ఔను నేను మూర్ఖుని గాన నేమియు నెఱుంగను. నీవు వివేకివి గదా [illegible]. సంగీతవిద్యయు బాల్యమును వేదాంతవిజ్ఞానవిరోధులా? (సనకసనందన సనత్కుమార) ప్రభృతు లను బ్రహ్మవేత్తల గోష్ఠిలో జేర్చవు కాబోలు. శుకనారద [illegible] శంఖమే. వారు బ్రహ్మవేత్తలే కాదు. వారికి [illegible]. [illegible] మేమందువు?

ఓరి! వ్యర్థపాండిత్యాభిమానీ! చూడుము. ఈ [illegible] శ్రియఃపతి చెంతజేరి పరబ్రహ్మవిద్యాబలము వలన సత్యలోకాది చతుర్దశ భువనముల యందును ఆయన ననుసరించి యనంతగరుడాదులతో గూడి స్వేచ్ఛగా సంచరించుచు తన సంకల్పమాత్రముననే కావలసిన యన్నమును కావలసినన్నిరూపములను [illegible] నత్యంతాశ్చర్యమయమైన గానమును జేయుచు పరబ్రహ్మ ప్రసాదించిన [illegible] ముతో గూడియుండు ననెడు బ్రహ్మజ్ఞుల కింపైన శ్రుతిని ఓ మాయావాదీ! [illegible] వకపోయినను విననైన లేదా!

ఇప్పుడది యట్లుండనిమ్ము, ఆకాశకుసుమ సదృశమైన నద్వైతమును [illegible] యదియే సత్యము దానికి విరుద్ధమగు నర్థముల బోధించుచున్న బ్రహ్మసూత్ర సముదాయ మంతయును, దాని యర్థమగు-బ్రహ్మ సకలచేతనా చేతన ప్రపంచమునకును [illegible] టను దానికి వలయు నిఖిలకల్యాణగుణములు కలిగియుండుటను [illegible] లగు వాటిని మిథ్యమిథ్య యని వదరు నీవు బ్రహ్మసూత్రముల బరిత్యజింపక [illegible] చేసితివి? ఐనను వాటిని స్వీకరించుట నిజముగ వైదికుల వంచించుటకే గదా! నిజమాలో చించిన వేదమౌళి యద్వైత విషయానుభావమున్న వంచనగాక మరియేమగును?

[తరువాయి 18 వ పేజీలో]



శ్రీమతే రామానుజాయ నమః

# భగవంతుడు—ఆయన ప్రేమ—ఉప్పుఘళ్లు.

"శ్రీమన్నారాయణ"

ఏమమ్మా అక్కా—ఇంకను స్వామి వేంచేయలేదేమి?

అదేనమ్మా, నేను ఆలోచించుచున్నాను. చెల్లెలందరు వచ్చినట్లేనా

ఆహా! అందరు వచ్చివేసినారు. ఇంక అసలాయన ఆవిర్భవించుటే ఆలస్యము

పూజా ద్రవ్యము లన్నియు సిద్ధముగా నున్నవా?

అవునవును ఏది ఏమాత్రము లోటువచ్చినా మనకు పొరపులు తప్పవు

అవాప్తసమస్తకామునికి ఈ అట్టహాసము లన్నియు మన తృప్తికొరకే గాని ఆయన కేమైన అపేక్షయున్నదా?

అవును గాని అక్కా! స్వామికి కావలసినది మానసిక జ్ఞానము, మానసిక సమర్పణము గాని పైపై యాడంబరములు కావందురే. మరి ఈ మడి-తడు లెందుకు? ఈబొట్లు జుట్లు ఎందుకు? ఈ సింగారింపులు-అలంకారములు ఎందుకు, ఈపూజా పునస్కారము లెందుకు?

నీవు చెప్పినది నిజమే. గాని ఆంతరంగిక భావములకు బాహ్యచిహ్నాలు గురుతులు కేవలము మానసిక భక్తిరహిత బాహ్యచిహ్నాలు వ్యర్థములు గాని మానసిక భక్తి యుండునపుడు బాహ్య చిహ్నాలు కూడ యుండవలయును. ఉండవలయునేమిటి? అవి కలిగియే తీరును.

నలుపుదనము లేకుండగ మేఘము వర్షించునా?

తెల్లనికాంతి లేకుండగనే సూర్యుడు ప్రకాశించునా?

ఎరుపుదనము లేకుండగనే అగ్ని దహించునా?

ధ్వని లేకుండగనే వాయువువీచునా?

ఆయా బాహ్యచిహ్నాలు కలుగుట వానివానిగొక్క లోలోపల యుండు విషయముల యొక్క సూచకత్వరూప స్వభావము.

అవునవును నిజమే. నాటకములలో కూడ రాజస-తామస ఆంతరంగిక గుణముల కల వాడని తెలియుటకు బోడిగుండో లేక జుట్టువిరబోసికొనో యుండునటుల జేసి, మొగమున యింత విభూతిని బూసెదరు. ఎరుపో-నలుపో బట్టలు ఏ గూడ కట్టుగనో గట్టెదరు.

సాత్త్విక ఆంతరంగిక గుణముల కలవాడని తెలియుటకు మంచి జుట్టు మొగమున మంచి తిరుమణి శ్రీ చూర్ణబొట్టునో లేక యిటువంటిమంచి ఊర్ధ్వపుండ్రమును బెట్టెదరు. తెల్లటిమంచి అంచుల బట్టను చక్కగ కట్టెదరు.

ఆంతరంగిక గుణములు లేకుండగ కేవలము గొప్పకో, గౌరవమునకో, డాబుకో దర్పమునకో, మోసమునకో- మాయకో మాత్రము పైకి వేషములు వేసినచో అది వ్యర్థము. అట్టివి గాడ బొమ్మలవల్ల ఎంత ప్రయోజనమో అంతే.

అవునమ్మా అవును

అదుగో వేణునాదము

అక్కల్లారా రండు నాథుడు శ్రీమన్నాథుడు జగన్నాథుడు అఖిల జగన్నాథుడు వేంచేయు చున్నాడు. ముందు కుంభహారతి నిత్తము ఆసనము సగుడు.

అర్ఘ్యపాద్యముల నాయత్త పఱచుడు

పండ్లు-పానీయములు సిద్ధముగా యున్నవి గదా

ఈవిధముగా మూర్తీభూతభక్తి స్వరూపులగు అష్టపట్టమహిషులు మున్నగు గోపికాబృందము వచ్చి విచ్చేసిన శ్రీకృష్ణపరమాత్మునికి హృదయపూర్వక స్వాగతమిచ్చి సపర్యల నొనరించిరి. శ్రీకృష్ణ పరమాత్ముడు మధ్యగ పసిడి సింహాసన మలంకరించగా చుట్టూ మిగత వారందరు గుమిగను గోష్ఠిగను కూర్చొని యుండిరి. పండ్లు అందించువారు కొందరు పానీయముల త్రాగించువారు కొందరు పూజల నొనర్చువారు కొందరు హారతుల సమర్పించువారు కొందరు పాటల పాడువారు కొందరు పాదము లొత్తువారు కొందరు ఇటుల అత్యుత్సాహము మిన్ను ముట్టుచుండెను.

ఇంతలో నారదమహర్షి విచ్చేసిరి. అందరూ లేచి ఆయనను స్వాగతమిచ్చి ఒక ఉన్నత సుఖాసనమున ఆయనను ఆసీనుని జేసిరి.

నారదుడు:- శ్రీకృష్ణా! ఏమి నేటి విశేషము, ఇంత మంది ప్రియురాండ్రతో ఇంత సావకాశముగా ఆనందించుచున్నావే ఆహా యిట్టి అపూర్వదృశ్యమును, అపూర్వ ప్రేమ గోష్ఠిని, దర్శించ గలిగిన నాభాగ్యమే భాగ్యము. నాజన్మయే జన్మ.

రుక్మిణి:- మహర్షీ నేడు నాథుని జన్మదినోత్సవము ఎన్ని దినముల నుండియో ఎంతో ప్రయాసజెంది ఉపాసించగా ఉపాసించగా ఈనాటికి నాథునికి అనుగ్రహము కలిగెను. ఉత్సవమున పాల్గొన నంగీకరించెను.

నారదుడు:- అమ్మలారా మీరు గదా ముక్తులు. మీరు గదా ధన్యులు. జన్మాంతర సహస్రములయందు తపో-జ్ఞాన-సమాధులచే భగవదనుభవ విరోధములగు పాపములు నశించగా గద శ్రీకృష్ణుని యందు ఇట్టి భక్తి జనించును.

యమేవైష వృణుతే తేన లభ్యః ।
తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వాం॥

మీరాయనను వరించిరి ఆయన మిమ్ముల వరించెను. మీకాయన ఈవిధముగా దర్శన మిచ్చెను.

శ్రీకృష్ణుడు:— "ప్రియో హి జ్ఞానినోఽత్యర్థం
అహం స చ మమ ప్రియః"

వారు నన్ను ప్రేమించిరి. నేను వారిని ప్రేమించితిని. ఇందు విశేషమేమున్నది నారదా!

నారదుడు:— స్వామీ! మీ పరస్పర ప్రేమ ఎట్టిదో నాకు తెలియునటుల బోధించరా.

శ్రీకృష్ణుడు:— ముందు వారినడగుము. తరువాత నేను తెలిపెద.

నారదుడు:— అమ్మా! మీకు శ్రీకృష్ణుని పైగల ప్రేమను నాకు ఉదాహరణ పూర్వకముగ తెలియునటుల బోధించరా.

గోపికలు పట్టమహిషులు అందరున్నూ:— నారదా నాథుని పైగల ప్రేమను మేమెట్లు తెలుప గలము. ఆయనే మాకాధారము, ఆయనే మా ప్రాణము, ఆయనే మా ఆత్మ, ఆయనే మా భోగము, ఆయనే యానందము, ఆయనే మా సౌఖ్యము, ఆయనే మా మోక్షము, ఆయనే మా సర్వస్వము. మహామునీ మేము దీనిని తెలుపశక్తులము గాము. మాకు భావమున్నది గాని భాష లేదు. మాకు హృదయమున్నది గాని శబ్దము లేదు. మాకు ప్రేమ యున్నదిగాని దానిని వివరించ గల సాధనము లేదు. వేయేల మేమే ఆయన-ఆయనే మేము-ఆయనే మా స్వరూపము. మేమే ఆయన స్వరూపము. ఆయన లేనిచో మేము లేము.

నారదుడు:— శ్రీకృష్ణా, సర్వజ్ఞా, సర్వశక్తీ ఆశ్రితవ్యామోహా, నీచేష్టితములు అప్రమేయములు, అనంతములు. అత్యాశ్చర్యకరములు. జగదేక సుందరుడవు, నవమన్మథ మన్మథుడవు. నీకటాక్షము కలిగినవో నిన్ను ప్రేమించని జీవియుండునా? అయితే నీవు వీరి నెటుల ప్రేమించుచున్నావో తెలుపవా? వీరు తెలిపినది నాకు బోధపడలేదు. నీవైన నాకు తెలియునటుల విశదీకరించుమా.

శ్రీకృష్ణుడు:— నారదా నేను మాత్రము చెప్పగలనా
"జ్ఞానీ త్వాత్మైవ మే మతం"

నాకు వీరు ఆత్మవంటివారు.

ఒకగోపిక:— అల్లాగున గాదు స్వామి. నీవు నిజముగా మమ్ముల నెట్లు ప్రేమించుచున్నావో చెప్పుమా.

శ్రీకృష్ణుడు:— నిన్నా. బెల్లమునువలె ప్రేమించుచున్నాను.
మరియొక గోపిక:— నన్నో?
శ్రీకృష్ణుడు:— తేనెనువలె ప్రేమించుచున్నాను.
మరియొక గోపిక:— మరి నన్నో?
శ్రీకృష్ణుడు:— నిన్ను కమ్మనైన ఆవు పాలనువలె ప్రేమించుచున్నాను.
మరొక గోపిక:— నన్నో

శ్రీకృష్ణుడు:- నిన్ను గట్టి మీగడ పెరుగునువలె ప్రేమించుచున్నాను.

మరివకగోపిక:- నన్నో

శ్రీకృష్ణుడు:- నిన్ను ఆనాడు చిలికి తీసిన తెల్లని వెన్నముద్దనువలె ప్రేమించుచున్నాను.

మరివకగోపిక:- నన్నో

శ్రీకృష్ణుడు:- నిన్ను అప్పుడు కాచిన ఆవునెయ్యినివలె ప్రేమించుచున్నాను.

మరివకగోపిక:- నన్నో?

శ్రీకృష్ణుడు:-నిన్ను పాయసమువలె, జిలేబివలె, మంచిపిండివంటలవలె ప్రేమించుచున్నాను.

జాంబవతి:- నన్నో

శ్రీకృష్ణుడు:- నిన్ను బాగా పండిన అంటుమామిడి పండునువలె ప్రేమించుచున్నాను, మిఠాయివలె ప్రేమించుచున్నాను.

సత్యభామ:- నన్నో

శ్రీకృష్ణుడు:- నిన్నా-అమృతమువలె ప్రేమించుచున్నాను.

రుక్మిణి:- స్వామీ-నావిషయమైకూడ

శ్రీకృష్ణుడు:- అడుగుటకు సందేహించెదవేల దేవీ. నిన్ను ఉప్పుఖల్లునువలె ప్రేమించుచున్నాను.

ఈమాట వినునప్పటికి రుక్మిణికి చాల లజ్జవొడమెను. అందరిని మంచిమంచి విలువగల ప్రేమాస్పదమైన వస్తువులువలె ప్రేమించుచుంటుల నన్ను పట్టమహిషిని, మహాభక్తురాలను తనను తప్ప అన్యమెరుంగని అనన్యార్హరాలను, కల్లకపటము ఎరుగని సర్వథా అనన్యభోగ్యభూతురాలనై యుండుదానిని, స్వస్వాతంత్ర్యమనది లేనంతగ అనన్యశేషభూతురాలనై యుండుదానిని ఎందుకు పనికిరాని చవట చవిటి ఉప్పుఖల్లుక్రింద త్రోసి వేసెనే అని రుక్మిణి చాల చిన్నపోయిన మోముతో మిగత సవతులను మొగమెత్తి చూడజాలక అచ్చట నిలువజాలక రోషావేశములతో లేచిపోయెను. మిగత గోపికలు దేవిమాటలు స్తంభించిపోయిరి. నారదుడు నిశ్చేష్టుడాయెను. శ్రీకృష్ణుడు మాత్రము మోమున చిరునగవు చిందులాడ నిమ్మళముగ లేచివెళ్ళిపోయెను నారదుడు తన వలననే ఈఉత్సవ ఉత్సాహమునకు భంగము వాటిల్లెనుకదాయని కిక్కురు మనకుండగ అంజలిగీలించి ఆకాశమున కెగసిపోయెను.

మరునాడు శ్రీకృష్ణుడు రుక్మిణీదేవి అంతఃపురమునకు విచ్చేసెను. మహాభక్తురాలగు రుక్మిణీదేవి నాథుని ఎదుర్కొని సకల సపర్యలకొనర్చి దివ్యాసనమున కూర్చుండబెట్టి శ్రీపాదముల నొత్తుచుండెను.

శ్రీకృష్ణుని రాకచే ఆమె హృదయసీమను గల నిన్నటి రోషతాపము చప్పున చల్లారెను. గాని ఏమియు పల్కుకరించ జాలకుండెను. శ్రీకృష్ణుడు కూడ తిరిగి నిన్నటి ప్రసంగమును ఎత్తజాలకుచుండెను.

శ్రీకృష్ణుడు:_ దేవి మనమొక వ్రతమాచరించవలశియున్నది.

రుక్మిణి:_ చిత్తము.

శ్రీకృష్ణుడు:_ అది కలుబది దినములు లాచరించవలశియున్నది. దానికి ఇతర ఏనియమములు లేవు గాని కొలదిగ ఆహారనియమము మాత్రము గలదు. ఉప్పులేకుండగ చప్పడి పదార్థములను మాత్రమే భుజించవలయును. ప్రతిదినము మూడు వేళలందును భగవంతుని ఆరాధించి ముగ్గురు ముత్తైదువులకు యిట్టి చప్పడి పదార్థములతో సాపాటు పెట్టుచుండవలెను.

రుక్మిణి:_ చిత్తము.

మర్నాటినుండి వ్రతదీక్ష ప్రారంభమాయెను. ఏరోజున కారోజు సాపాటుకై ముగ్గురు ముత్తైదువులు దొరకుట అతి దుర్లభమగుచుండెను. ఒకనాడు వచ్చిన వారలు మర్నాడు ఎంత బ్రతిమాలినను రాకుండిరి. తన సవతులు కూడ వచ్చుటకు నిరాకరించిరి. చివరకు తనకు కూడ ఈ ఉప్పులేని చప్పిడి కూడు సహించక ఆనాటి కానాడు చిక్కి శల్యమగుచుండెను. ఎన్నోరకముల తినుబండారములను చేయించుచుండిరి. ఎన్నోరకముల పండ్లు, పాలు వచ్చి పడుచుండెను. ఏమి లాభము ఉప్పు లేక పోవుటచే ఏదియు ఎవరికి సహించకుండెను. ఎటులనో అతికష్టముపై 31 రోజులు గడిచెను. శ్రీకృష్ణుడు ఆనాడు తిర్గి రుక్మిణీదేవి అంతఃపురమునకు విచ్చేసెను.

శ్రీకృష్ణుడు:- దేవి, ఏమి యింతలో యింత చిక్కిపోతివే. లేవలేకున్నావేమి? రేపు మన వ్రతసమాప్తి దినము. రేపు మన బంధు-మిత్రులందరిని పిలిచి తదీయారాధన జరుపవలయును. అందు నలుభై పిండివంటలు, నలుభై కూరలు, నలుభై పచ్చళ్ళు చేయించవలెను. దేనిలో కూడ ఒక్క ఉప్పురాయినైనను వేయకూడదు. చివరకు నేతిని, చివరకు పెరుగును నీవే స్వయముగ వడ్డించవలయును.

రుక్మిణి:_ చిత్తము.

శ్రీకృష్ణుడు:_ మర్నాటికి తన బంధుమిత్రులందరును, రాజాధిరాజులను అందరని సాపాటుకు ఆహ్వానించెను. అందరు విచ్చేసిరి. నారదుడు కూడ వచ్చెను. అన్ని పదార్థములు వడ్డించబడెను. అందరు భోజనమున కుపక్రమించిరి. రుక్మిణీదేవి నెయ్యివడ్డించ ప్రారంభించెను. ప్రతివారు ప్రతి పదార్థమును అతి ఆప్యాయముతో నోటిలో పెట్టుకొనుట, చప్పగ యుండుటచే ఛీ ఛీ అనుచు ఉమ్మి వేయుట జరుగుచుండెను. ప్రతి విస్తరి వద్దను రుక్మిణీదేవికి యిదేఅనుభవము కలుగుచుండెను, చివరవరకు యింతియే. ఎవరూ ఏపదార్థమును కొంచమైనను తినలేదు. ఛీ, ఛీ, థూ, థూ, అను శబ్దములు మిన్నుముట్టెను. రుక్మిణీదేవికి కళ్లు తిరిగెను. కన్నీటిదారకు మేరలేదు. మనస్సు శైథిల్యము చెందెను. ఒకమూల చతికిల బడెను. చివరకు మూర్ఛపొందెను. శ్రీకృష్ణుడు వచ్చి ఆమెను వడిలోనికి తీసుకొని ముఖమున పన్నీరు జల్లుచు శైత్యోపచారములు జేసెను. రుక్మిణికి తెలివి వచ్చెను.

రుక్మిణి:- నాథా! క్షమించరా, నీచేష్టలు అప్రమేయములు నీమాటలు అనివార్యములు. అజ్ఞానిని అపరాధిని క్షమించుమా. ఉప్పులో యింత మహాత్మ్యమున్నదని తెలుసుకొన లేకపోతిని. ఊరక మీపై అలిగితిని. అందులకు తగిన శాస్తి జరిగినది. ఇకనైనను నన్ను దయచూపవా?

నారదుడు:- ఆహా స్వామి, ఎంత విచిత్ర సంఘటనను కలిగించితివి.

అందుకనే నిన్ను ఉపనిషత్తులు యథా సైంధవఘనః — రసఘనః సః” అని వర్ణించినవి. లోకములో ఎన్నో అమూల్య అపురూప పదార్థము లుండగా నిన్ను ఉప్పుఘల్లుతో ఉపమించుటయేల?

ఉప్పుతో సాటియగు స్వచ్ఛమైన, బాహ్యాంతరములలో ఏకరూపమైన, అన్నిటిలోను అంతర్లీనముకాగల, అన్నింటికి అవసరమైన, ఎప్పటికి స్వస్వరూప విచ్ఛిత్తిలేని, బిక్షుకునికొనుగలు బ్రహ్మాండాధిపతివరకు అందుబాటులోయున్న అందరికి అత్యావశ్యకమైన, మిగతావానిని త్రాసు తన సత్తపై ఆధారపడి యుండునటుల చేయకలిగిన, స్వతః ప్రాప్తమైన, తను తానే కారణమైన ఏ రూపములో యున్నను తన స్వభావమును విడువకుండనట్టి, రుచు లన్నింటికి ఆధారభూతమైన తన స్వరూపమును మార్చుకుని యితరములకు అభేదాతిశయమును కలిగించు నట్టి ఇంకను యిట్టి అసంఖ్యేయములైన గుణగణములు గల వస్తువు మరొకటి లేదు కదా. ఉప్పునకు ఉప్పేసాటి నీకు నీవే సాటి. నీ ప్రేమకు నీ ప్రేమయే సాటి.

---

## రామానుజ వైభవము

కోగంటి సీతారామాచార్యులుగారు, [illegible]ల్లూరు.

శా. శ్రీమద్వైష్ణవ సంఘమెల్ల నినుసంసేవించి వైకుంఠ ల
క్ష్మీమార్గవ్రతనందు నైహికమునన్ శ్రీమంతమై సర్వ సౌ
ఖ్యామోదమ్ముల నందుచుండునని విద్యాసాగరుల్ బల్కు నో
స్వామీ దాసునిగూడ నట్టెగని విశ్వాసించు రామానుజా ॥

మ. జనముల్ మూర్ఖగతిన్ చరించునెడ విజ్ఞానమ్ము సంధింప భూ
మిని జన్మించి త్వదీయసన్మతము గంభీరమ్ముగా శాంత వృ
త్తిని క్షేమంకరమైన పద్ధతిని బోధింపంగ రాజ్యమ్ము లం
దున, రాజుల్ గనిమెచ్చ నీమతము గొల్తున్ భక్తి రామానుజా ॥

శా. "జీవాత్మే పరమాత్మ" యంచును మహాక్షేపమ్ముఖం జేయుచో
నావాదమ్ముల యుక్తి యుక్తముగ మిథ్యాభూతముల్ జేసి యా
శ్రీవైకుంఠ నివాసుడీగతిగ భూరిప్రౌఢ వాదార్భటిన్
నీవే నిక్కువుపూన్కి గెల్చితివి తండ్రీ స్వామి రామానుజా ॥ 3

మ. పరమామ్నాయపు సారమెల్ల నొక శ్రీభాష్య స్వరూపమ్ముగా
పరవాదుల్ సభలన్ జితాస్మ యనగా వాదించి శ్రీవైష్ణవ
స్థిరతన్ బాదుకొనంగజేసితివిగాదే యట్టి నీగొప్ప నీ
కరుణన్ నేనెటుసంస్మరింతు వినతక్ష్మాపాల రామానుజా ॥ 4

మ. పరమోత్కృష్టమునై శుభప్రదమునై వాత్సల్యభావమ్మునై
కరుణావాసమునై సమస్తరిపు రేఖాకాననజ్వాలయై
స్థిరమై బౌద్ధమతాగ్ని మేఘమయి యుక్షిపించునీమార్గ మి
ద్ధర నాచంద్రముగాగ నేనెపుడు నిర్ధారింతు రామానుజా ॥ 5

శా. కాలమ్మంతయు వమ్మజేసికొని దుష్కాంతాప్రధానాత్ములై
లోలత్వంబున నీభవాంబు నిధిఃగల్లోల వ్యథాచిత్తులై
కాలప్రేరితులై మునుంగ గని యుత్కంఠన్ మహాప్రేమతో
నాలోకించి విమంతమంపితివిగాదా నీవు రామానుజా ॥ 6

శా. నీ విద్యావిభవమ్ము నీప్రతిభ నీ నిర్వ్యాజమౌ ప్రేమయుఞ్
భావింపఞ్ మముబోంట్ల నెల్ల నిపుడే వైకుంఠముం జేర్పగా
నీవేదైవమటంచు సద్గురుడుగా నిత్యమ్ము నీధ్యానమే
గావంజాల సమర్థమంచెపుడు మ్రొక్కంజూతు రామానుజా ॥ 7

మ. హృదయమ్మందున శాంతిలేదు విధులే కృత్యమ్ములాలేవు నె
మ్మది విజ్ఞానములేదు కోవిదులు సంభావించు పాండిత్య మ
న్నది ప్రాజ్యమ్ము కవిత్వమిల్లియగు నెన్నన్ మూర్ఖత మాత్రమే
పదిలంబాయెను మోక్షమే విధిగ సంపాదింతు రామానుజా ॥ 8

మ. విలసద్భావ పరంపరల్ పరగనిన్వీక్షించి వర్ణింప మ్రొ
క్కులు బల్ మ్రొక్కితి నేటికయ్యదియె నాకున్ ప్రాప్తమౌరోయ్ కవీ
శులు విద్వాంసులు గూడ నెప్పుడు వచించుఞ్ నీమహాత్త్వంబు నే
కలముంబట్టి తదీయసూక్తులనెవక్కాణింతు రామానుజా ॥ 9

# యతిరాజవిజయ నాటకమునందలి కొన్ని చక్కని శ్లోకములు

శ్రీ ఉ. వే. శ్రీమాన్ తె. కం. గోపా[illegible]చార్యులుగారు

శ్లో. ధ్యాయన్ సత్య మనన్త మన్త రజడం బ్రహ్మ రవిన్దేక్షణం ।
నిష్క్రమ్యా శు సుషుమ్నయైవ కృపయా నిర్ధూతమాయానుషః ।
విష్ణో స్తత్పద మేత్య తత్ర పరమవ్యోమ్ని స్వయం చి త్స్వరాట్ ।
భుఙ్క్తే తేన విపశ్చితా సహ మహానన్దా ననన్తా న్స్వధః ॥

ప్రాజ్ఞుడు, సత్యమై, యపరిచ్ఛిన్నమై స్వయం ప్రకాశమై, పుండరీకములవంటి నేత్రములు గలిగియున్న పరబ్రహ్మను మనస్సునందు ధ్యానించుచు సుషుమ్న యనబడు నాడీమార్గమున వెంటనే బైలుదేరి భగవదనుగ్రహముచే ప్రకృతి బాధను ఛేదించుకొని యూ ప్రసిద్ధమైన శ్రీవైకుంఠపురమున జేరి యచ్చట జ్ఞానస్వరూపుడై, కర్మపరతంత్రుడు గాక సర్వజ్ఞుడగు సర్వేశ్వరునితో గూడి యసంఖ్యాకములగు మహానందముల ననుభవించుచున్నాడు.

శ్లో. యః ప్రత్యఞ్చ్చ సృజన్ పరాఞ్చ్చ చ మహాభూతాని రక్షన్ హరన్ ।
క్రీడ త్యద్భుత దివ్యమఙ్గళగుణః శ్రీమా ననాదిః పుమాన్ ।
సర్వం కర్తు మకర్తు మన్యథయితుం సమర్థోఽపి సన్ ।
వ్యాజం కిఞ్చి దపేక్ష్య రక్షతి జగ ద్విశ్వవ్యవస్థాపకః ॥

లక్ష్మీవిశిష్టుడును, అత్యద్భుత కల్యాణ గుణములు కలవాడును, సకు అనాది పురుషుడైన సర్వేశ్వరుడు, సకల చేతనులను అచేతనములను మహాభూతములను సృష్టించుచు హరించుచు క్రీడించును. ప్రపంచముల మర్యాదల నేర్పరచు నా పరమ పురుషుడు చేయుటకును, మానుటకును తారుమారు గావించుటకును సమర్థుడయ్యును నేదో యొక మిషను గల్పించియే ప్రపంచమును రక్షించును.

శ్లో. కర్మవ్యాజకృతాఖిలాత్మ నివహ క్లేశానబోధ స్స్ఫుర ।
త్పశ్చాత్తాప కృపావిమోచిత జగజ్జన్మాది లీలాదరం ।
భోగైకప్రవణం విధాస్యతి పరంబ్రహ్మాపి దత్తాభయో ।
భూతేభ్యో యతిరాజ ఏష ఇతి మే చేత స్యభూ న్నిశ్చయః ॥

ఈ మా యతిరాజులు, ప్రాణులందరకు నభయ మొసంగి పరమాత్మను — తాను జనుల కర్మలను మిషగా గొని నిఖిలాత్మవర్గమునకును కల్పించిన దుఃఖముల గాంచి పశ్చాత్తాప [illegible] పారవశ్యమున (ఛీ ఇకనెప్పుడు నిట్టి సృష్ట్యాది వ్యాపారముల చేయరాదని విరక్తితో) సృష్ట్యాది లీలావ్యాపారముల యందాదరమ్ము లేనివానినిగా జేసి, కేవల భోగలాలసునిగా జేసివేయునని నా మనమున నిశ్చయ ముదయించెను.

(యతిరాజులే యందరకును మోక్షమొసగుచున్నారని భావము)

(మెల్లమెల్లగా దగ్గరజేరి) ఓ మాయా-మరచితిని-యథార్థవాది! సన్యాసి చక్రవర్తీ! నానెత్తిని చేయిబెట్టి నీవే నిజమును జెప్పుము. స్వానుభవ సిద్ధమును స్వయంప్రకాశమును నగు మన యద్వైతబ్రహ్మ తాను సిద్ధించుటకు దేనినైన నొకప్రమాణమును నపేక్షించునా? అపేక్షించిన దానికి గోచరించును గాన మన బ్రహ్మ మిథ్యయే కావలసివచ్చును. (గట్టిగా నవ్వి)

దృశ్యమగు వస్తుజాతమంతయు జడమును మిథ్యయును గాన నాపరబ్రహ్మ దృశ్యమెన్నడును గాడను నీవు తీసికొనిన గోతిలో నీవేపడుదువు.

మరియు నదియేకాదు. నిజముగ జెప్పుము. నీకుముక్తి యెట్టిది ?

న సాధ్యా బ్రహ్మచేన్ముక్తిః తదన్యాచే న్మృషైవవా ।
ముక్తి శూన్యస్య వేదాన్త సంపదస్తే కపేస్సృజః ॥

బ్రహ్మయే మోక్షమందువా ఆ బ్రహ్మనిత్యము గాన ముక్తి సాధింపబడునదియేగాదు. అంతకంటె వేరందువా అదిమిథ్యయే యగును. బ్రహ్మకంటె వేరగునవన్నియు మిథ్యయని గదా నీ సిద్ధాంతము). అట్టితరి ముక్తియే మృగ్యమైన నీకు కోతికి పువ్వుమాలవలె వేదాంతసంపద లేటికి ?

మాయా:— (సిగ్గుతో తలవంచుకొనును)

రాజు:-(ఆనందముతో) ప్రియరంగడు నిజముపల్కెను.

మాయా:-(తనలో) ఈ దుర్మార్గుడు నన్నన్నివిధముల వంచించివేసెను.

రంగప్రియుడు :- (ఆనందముతో భుజమును కొట్టుకొని గర్జించుచు ఎగురును)

భాస్కరయాదవులు :—(ఆనందాశ్చర్యములచే నుదయించు నవ్వును లోలో నడచుకొనుచు)

ఓ! వందివటుడా! మహాప్రజ్ఞశాలివే! ఐనను ప్రధానమంత్రిశేఖరుని పరాభవించుటకు మేరలేకున్నదే ఏమనుకొనుచున్నావో—

ఈతనికి బృహస్పతి యొక్క గడ్డిపరకే వితండవాదముతో ముల్లోకములయందును సాటిలేని మేటి (వితండము = తనపక్షమును స్థాపించక పరపక్షమును మాత్రము నిరసించువాదము) కప్పలవలె వదరుచున్నను పశులను సరకుగొనడు. మత్తగజ కుంభస్థల ఫాలన లీలాపార వశ్యమున నిక్కబొడుచుకొనిన జూలుతో నలరారు సింహమేసుమా యితడు.

ప్రియ :-(నోరుమూసుకొనియుండి) ఏమైన ననుకొననిమ్ము.

రాజు :-పుణ్యులారా! మహాయతి నతిక్రమింపరాదు సుడీ!

ప్రియ :-దేవా! మేము సన్యాసులము, సన్యాసి అల్ప ఆయతిని గూడ నతిక్రమింపడు. (ఆయతి = ఉత్తరఫలము) మహాయతి నేల యతిక్రమించును ?

మాయా :-(కోపముతో) రాజా! వైతాళికుల మిథ్యాప్రసంగములకు మోసపోయి సన్యాసులమగు

మమ్మేల పరాభవింతువు ?

ప్రియ :—ఓ సర్వప్రపంచ మిథ్యావాదీ! నీకు సత్యప్రసంగములు కూడ కొన్నియున్నవా ?

మాయా :—(తనలో) వీరు సకల రాజ సభలయందును సంచరించుటలో దిట్టలు. వీరిని లాలన జేయుటకంటె నాకు వేరొక ప్రత్యుత్తరము తోపకయున్నది. (పైకి) బిడ్డలారా! మీమాటల నేర్పునకు మెచ్చితి. పాపము! మీరు పిల్లలును పాటకులును మిమ్ములనందరును గౌరవించవలెను. మీగురువగు రామానుజునకు నేను త్తరమిత్తును లెండు, మీరు పొండు.

ప్రియ :—(కోపముతో) నేనుండగా నీకు మా యాచార్యప్రసంగమేల? చెప్పుని గుచ్చుకొని పోయిగదా ముల్లు పాదమును గుచ్చుకొనవలెను.

రంగ :—(చిరునవ్వు నవ్వి) మిత్రమా! సొమ్మసిలిన వీనితో నీకేమిటిరా ? పరిమళ విహీనమగు పువ్వునెవ్వడైనను తలను దాల్చునా ?

రాజు :—(భాస్కరయాదవులతో) సరి, మీకనుష్ఠానవేళ యతిక్రమించుచున్నది. ప్రధానమంత్రిని పురస్కరించుకొని దయచేయుడు. మరియు- వందులు నిందించినను, స్తుతించినను రాజకులవాసులు-అందును విశేషించి విరాగులైన మీవంటివారు వారిమాటల పాటించరాదు.

మాయా :—తమరును నట్లే భావింపవలెను. (అని భాస్కరయాదవులతో నిష్క్రమించును).

రాజు :—(యామునులను లేచుచుండుట చూచి గౌరవముగా) పూజ్యా! ఒక్కక్షణము క్షమింపవలెను. కాంచీపూర్ణుల యాదేశము తమకు సంకేలమగుచున్నది. (ఆలోచించి) వైతాళికుల మాటను వినిన పిమ్మట నేనేమో మారినట్లున్నాను.

యాము :—(నవ్వి) నీ వెందులకు మారవు. రాహువు మ్రింగిన చంద్రునకు స్త్రీ యుండిపోవునా ?

రాజు ;—(ఆశ్చర్యముతో) బురదలోనుండి తీసి బాగుగా కడిగి నిర్మలమైన సన్నని బట్టతో తుడిచిన రత్నమువలె నేడు నన్ను నిర్మలముగా గాంచుచున్నాను.

యాము :—వైతాళికులను చేతితో పట్టుకొని) బిడ్డలారా! రామానుజుల మతి నీతుల ప్రభావమునంతను తెలిపితిరిగదా!

రాజు :—సందేహమేమి ? బింబము యొక్క సౌందర్యమునకు ప్రతిబింబమే ప్రమాణము. పూజ్యుడా! తమ విద్యావైపుణ్యముచే రామలక్ష్మణులవలె తమ గురువును ప్రకాశింపజేయుచున్న వీరలెవ్వరు ?

యాము :—బిడ్డలారా! బ్రహ్మవేత్తయగు శ్రీరాజునకు నమస్కరింపుడు.

రంగ :—వాధూలగోత్రజుడనగు దాశరథి నిదే నమస్కరించుచున్నాను.

ప్రియ :—వాత్స్యగోత్రోద్భవుడనగు సుదర్శన వరదవిష్ణు విదే నమస్కరించుచున్నాను.

రాజు :—(ప్రేమ కౌతూహలములతో) ఎవరు లేనిచో రామానుజులు సన్న్యాసియే కారందురో వారేనా వీరు ?

యాము :—ఉరగేమి ?

రాజు :—వత్సలారా ! యతిరాజానుగ్రహపాత్రులు కండు. (ఆలోచించి, మంత్రి కోపముతో నేగెనని కలతజెందుచున్నాను.

యాము :—దేవా ! అట్లు భయపడకుము. పాము గరుత్మంతునియొక్క రెక్కపాటువల్లనైన దెబ్బను సహించునా ? ఏనుగు సింహగర్జనమునైన వినజాలునా? అట్లే యీమంత్రి సహింపశక్యము గాని రామానుజుల లేశమాత్ర ప్రసంగముచేతనే క్షీణగర్వుడై మిక్కిలి భయపడి యెక్కడనో కనబడక దాగియున్నాడు.

రాజు :—(ఆనందముతో) ఇప్పటికి స్వస్థత జెందితిని.

యాము :—దేవ ! వైతాళికులయందనుగ్రహముంచుడు.

రాజు :—(ఆలోచించి) నా యాత్మను సమర్పించుటకంటె వీరి కర్హమైన దేదియు నాకు గోచరించుటలేదు.

వైతా :—(ఆనందముతో) ప్రభువు కింకరులకు సర్వస్వమే గదా ?

(అందరును నిష్క్రమింతురు.)

---

## యతిరాజ భజన కీర్తనలు.

కవితావతంస, గానకళానిపుణ, హరికథాచతురానన

కరి నారాయణాచార్య భాగవతార్.

శ్రీరంజని — రూపకము

1. శ్రీరామానుజమునీంద్ర ! శ్రితజనవాత్సల్యసాంద్ర !
   చారువక్త్రవిజితచంద్ర ! సకలవిబుధనుతసుధీంద్ర !

2. శ్రీశునాజ్ఞఁగైకొనియా, శేషుని యంశమున భువిని ।
   కేశవార్య సూరివరుని, గేహమున జనించితివో ॥ ॥శ్రీ॥

3. శ్రీభూతపురమున నీవుచెలఁగి యవతరించినపుడు ।
   శోభితగృహముల జనములు శోభనాత్ములై వెలసిరి ॥ ॥శ్రీ॥

4. అమితహర్షమంది కేశవార్యుఁడు పుత్రోత్సవమును ।
   సముచిత గతి భాగవతోత్తములకు నర్పించెనపుడు ॥ ॥శ్రీ॥

5. లోకహితముఁగోరి నీవు, లోకమున జనించినావు ।
   శ్రీకరినారాయణార్య, సేవిత చరణాంబుజాత ! ॥శ్రీ॥







## నా రీ వి భా గ ము

శ్రీమతే రామానుజాయ నమః

# తిరుక్కోళూర్ పెణ్ పిళ్లైరహస్యము

(రచయిత :-శ్రీమద్భాగవత శ్రీపాదరేణువు, మదరాసు.)

తిరుక్కోళూర్ పెణ్ పిళ్లై ఎంబెరుమానారులతో యిటుల యనెను.

## మొదటి వార్త

భాగవతము

అరవము ॥ అళైత్తు వరే నక్రూరనో, అక్రూరరై ప్పోలే ॥

తెలుగు ॥ తోడితెచ్చెద నన్నానా, అక్రూరుని వలె ॥

## వివరణము.

కంసుడు అక్రూరుని బిలచి యిటులనెను.

ఆ॥ సఖుల తోడ భూమిచక్ర మేలెద బొమ్ము ।
దెమ్ము నేగమొవసు దేవసుతుల ।
మఖము పేరు చెప్పి మంత్రభేదము సేయ ।
వలయు బెంపజనదు వైరిజనుల ॥ [భాగవతము]

అక్రూరులు. ఉ॥ పంపిన బోనివాడనె నృపాలక మానవులైన వమ్ముల్ నూ ।
హింపరు దైవయోగముల నించుక గానరు, కోచినట్లు ని ।
ష్కంప గతిన్ జరింతు రది గాదనవచ్చునె ఈశ్వరేచ్ఛ ద ।
ర్పింపగ రాము నీపగతు బిడ్డల దెచ్చెద బోయివచ్చెదన్ ॥

అనుచు శ్లో ॥ "అద్య మే సఫలం జన్మ సుప్రభాతా చ మేనిశా" ।

అ॥ కంసుని అన్నమును తిని జీవించిన నాకిప్పుడే తెల్లవారినది. అని కదా అక్రూరుడు ప్రాప్యములో రుచిగలవాడై శ్రీకృష్ణబలరాములను తోడితెచ్చుటకై వెళ్ళుచూ బృందావనమునకు పోవుచుండగా

చం॥ ఎట్టి తపంబు సేయబడె నెట్టి చరిత్రము లబ్ధమయ్యె నో ।
యెట్టి ధనంబు నర్థులకు నీబడెనో తొలిబాముననందు నా ।
యట్టి వివేకహీనునకు నాదిమునీంద్రులు యోగదృష్టులం ।
బట్టగ లేని ఈశ్వరుని బ్రహ్మమయుర్ హరి జూడ గల్గెడిన్॥

చం॥ మాపటివేళ నేను జని మాధవు పాద సమీపమందు దం ।
డాపతితుండనైన నత డాసుగ కాల భుజంగమే సం ।
తాపిత భక్తలోక[అ]భయదారుణమైన కరాబ్జమాదలన్ ।
మోపి హసించి నా కథయమున్ కృపతోడుత నీయకుండునే॥

అనుకొనుచు అక్రూరుడు రథముడిగ్గి భూమిపై పొరలుచు పోయెనే అటుల నేను నిర్భయముగా కృష్ణబలరాముల తోడుకొని వచ్చెదను అని అనగలిగితినా?

## రెండవ వార్త.

మహాభారతము

అ. అగమొళిత్తు విట్టేనో విదురరై ప్పోలే ।

తె. అహంకార-మమకారంబులను వర్జించినానా విదురుల వలె.

శ్రీకృష్ణపరమాత్మ దూతకార్యార్థమై హస్తినాపురికి పోయినప్పుడు భీష్మద్రోణాదులందరిని "ఇదెవరి ఇల్లు? ఇదెవరి ఇల్లు?"అని అడుగుతూపోయెనట అందఱు"అస్మద్గృహం" అంటూవచ్చిరట కపట విదురుని అడిగెనట కృష్ణా! "తవ గృహం" అనెనట అప్పుడు శ్రీకృష్ణపరమాత్మ "హస్తినాపురిలో నాకని ఒక ఇల్లు ఉన్నదా!" అనుచు విదురుని ఇంటిలో దూరగానే విదురుడు అత్యంత సంభ్రమముతో "ఆగతో-ఉపాగతో- గేహముపాగతో-మమ గేహ ముపాగతో" అనుచు

కం॥ నా యింటికి విచ్చేయుము నీ యంఘ్రిసరోజరేణు నికరము సోకన్ ।
నా యిల్లు పవిత్రంబగు శ్రీయుత నీ భటుని పెద్ద సేయం దగదే ॥

కం. నీ పాదకములసేవయు నీ పాదార్చకుల తోడి నెయ్యమును ।
నితాంతాపారభూతదయయును తాపస మందార నాకు దయసేయ గదే॥

అనుచు విదురుడు "సంభ్రమై స్తుష్య గోవింద ఏత న్మః పరమం ధనం" అనుచు భక్తిపరవశుడై కైంకర్యములను జేసెను.

శ్లో॥ భక్తవత్సు ద్విజాగ్రేషు నిమ్నః పరమాసనే ।
విదురాన్నాని బుభుజే శుచీని గుణవంతి చ ॥

తా! విదురునికి అహంకార మమకారములు ఏమాత్రము లేనందున అతడు పెట్టినఅన్నము

పరమపావనమై భక్త్యుపహృతమైనది. గనుక పరమభోగ్యముతోను అత్యాదరముతోను శ్రీకృష్ణ పరమాత్మ తృప్తిగ భుజించెనట.

శ్లో॥ భీష్మ ద్రోణా వతిక్రమ్య మాం చైవ మధుసూధన ।
కి మర్థం పుండరీకాక్ష భుక్తం వృషళ భోజనం ॥

ఉత్కృష్టవర్ణస్థులైన భీష్మద్రోణాదులు శ్రీకృష్ణుని రాకకై యెదురుచూచుచుండగా, వారింటికి వెళ్ళకుండగ హీనవర్ణస్థుడైన విదురుడు తనయింటికి కృష్ణపరమాత్మ వచ్చునను తలంపుకూడ లేనివాడై యుండగా పుండరీకాక్షుడైన శ్రీకృష్ణపరమాత్మ వెళ్ళి భుజించెను. ఇందెందుచేత? ఆ భగవద్భక్తుని నిరహంకారతను దెల్పుటకే అని తెలియుచున్నది.

ఓస్వామీ! నేను వీరివలె అహం-మమతలను సమూలముగా వదలినానా? అని తిరుక్కోళూర్ పెణ్ పిళ్ళై ఎంబెరుమానార్లతో అనెను.

శ్రీ ఎంబెరుమానార్లు తిరుక్కోళూ రను దివ్యదేశమునకు వేంచేయునప్పుడు ఆతిరుక్కోళూరు నుండి వచ్చు నొక స్త్రీరత్నము వీరి కెదురుగా వచ్చి నమస్కరించి నిలువ, అమ్మా! నీ వెచ్చట నుండి వస్తున్నావని ప్రశ్నింప ఆయమ్మయు నేను తిరుక్కోళూరును దర్శించి తిరిగి వస్తున్నానని విన్నవించెను.

తిరుక్కోళూరు వివరము.

తిరువాయ్ మొழி 6-7.

పా॥ ఉణ్ణుం శోఱు పరుగు నీర్ తిన్నుం వెత్తిలైయు మెల్లాం ।
కణ్ణన్ ఎంబెరుమా నెన్ఱెన్ఱే కణ్ణ్ నీర్మల్గి ।
మణ్ణినుళ్ అవన్ శీర్ వళమ్మిక్క వనూర్ వినవి ।
తిణ్ణమె న్నిళమాన్ పుగు మూర్ తిరుక్కోళూరే ॥

తా॥ భుజించు ప్రసాదమును త్రాగునట్టి జలమును నములునట్టి తాంబూలమును ఇవన్నియు శ్రీకృష్ణుడే యని పలుమారు చెప్పుచు దుఃఖాశ్రువులను విడుచుచు భూమియందు శ్రియఃపతి యొక్క కల్యాణ గుణములచేతను, సంపత్తుచేతను పరిపూర్ణమైన వానియొక్క దివ్యదేశము నడుగుచు నా చిన్నది ప్రవేశించెడి దివ్యదేశము తిరుక్కోళూరే ఇది నిశ్చయము అని శ్రీనమ్మాళ్వార్లు తల్లి అవస్థ ననుకరించిరి.

తిరుక్కోళూ రను దివ్యదేశము 108 దివ్య తిరుపతులలో నొకటి ఇది "నమ్మాళ్వార్లు మంగళాశాసనము చేసిన నవ తిరుపతులలో నొకటి. "ఆళ్వార్ తిరునగరికి" తూర్పుగా 1½ మైలుదూరమున నున్నది. నవనిధులు యిచ్చట దాగియుండునట్లు "అధర్మదేవత" కుబేరునకు కొంతెను

చెప్పిన చోటు గనుక దీనికి "కోళూరని" పేరు గలిగెను. కుబేరునకు ప్రత్యక్షమైన క్షేత్రము వైత్త మానిధి, లేక నిక్షేపవిత్తుడు, లేక లక్ష్మీపవిత్రుడని, పెరుమాళ్ళకు తిరునామములు. కోళూర్ వల్లినాచ్చియార్ లేక పుగుమూర్ విల్లిత్తాయార్లని తాయార్లకు తిరునామములు. ఇది శ్రీమధురకవి ఆళ్వార్ల అవతారస్థలము.

తిరుక్కోళూర్ దివ్యదేశమునకు శ్లోకము.

శ్లో॥ శ్రీతేజస్థాన నిలయం శేషశాయిన మచ్యుతం ।
నిక్షిప్తనిధి నామానం పక్షిరాజ ప్రియోదయం॥

నిక్షిప్తము-లేక-నవనిధుల వివరము.

1. పద్మం 2. మహాపద్మం 3. శంఖం 4. మకరం 5. కచ్ఛపం 6. ముకుందం 7. కుందం 8. నీలం, 9. వరం అని నవనిధుల పేర్లు.

స్త్రీరత్నము యొక్క మాటవిని ఎంబెరుమానార్లు చాల సంతసించి "అవిశ్మా నీవు చాల ధన్యురాలవు" అనిరి. గాని అందరు నిత్యనివాసముచేయు దివ్యదేశమును సేవించుకొని తిరిగి వచ్చి వేయుచున్నావే, అనిరి. ఆవార్తను విని ఆ భక్త శిరోమణి దిగువ వివరించు 81 మంది భక్త శ్రేష్ఠులను తెలుపుచు, "స్వామీ ఇట్టి మహాత్ముల యొక్క జ్ఞానములలో ఒక్కరి జ్ఞానమైనను దాసురాలికి ఉండినయెడల నేను తిరుక్కోళూరిలోనే వాసము చేయగలిగియుండును. అట్టి జ్ఞానము నాకు లేదు. నావలన ఆదివ్యస్థలమున కేమి కైంకర్యము కాగలదు స్వామీ. తనువంటి ఆచార్య సుధీమణులు వెళ్ళి మంగళాశాసన మొనర్చినట్లైన వైత్తమానిధికిన్ని మధురకవులకును నిత్యోత్సవ పక్షోత్సవ మాసోత్సవ అయనోత్సవ అబ్దోత్సవ పవిత్రోత్సవ పల్లవోత్సవ బ్రహ్మోత్స వాదులు జరుగునని ఆమె విన్నవింపగా ఎంబెరుమానార్లు ఆమెను కటాక్షించి ఆమె తిరుమాళిగను వేంచేసి తళిహాచేయుమని ఆమోదగించి తళిహాప్రసాదమును శ్రీపాదతీర్థమును సాయించి ఆమెకు తిరుక్కోళూరు పెణ్‌బిళ్ళై అని తిరునామముంచిరని తిరువాయ్‌మొళిప్పిళ్ళై వచించునట్లు పెద్దజీయర్ మామల జీయర్లు కటాక్షించిరి.

— జీయర్ తిరువడిగళే శరణం —



# పరమపదాధికార మెవ్వరిది?

మరింగంటి రంగనాయకమ్మగారు.

ఆకాలమున శ్రీవైష్ణవ సమృద్ధితో నలరారు మహానుభావులు నంబిళ్ళగారు వారు శ్రీరంగ మందొక చిన్న తిరుమాళికలో నివసించు చుండిరి. కాని వారికది బొత్తుగ నిరుకై యుండెను. దానికి ప్రక్కగనే యొక ముదుసలికి కొంత స్థలముండెను. ఆమెయు నంబిళ్ళ కంతరంగశిష్యురాలే యగుటచే నొక నంబిళ్ళ శిష్యుడే యగు శ్రీవైష్ణవుడామెను పరిపరి యాస్థలమును నంబిళ్ళకు సమర్పించమని నిర్బంధించుచుండెను. కాని యామె శ్రీరంగములో నీపాటిస్థలమైన నేరికి చిక్కును? గాన నేను బ్రతికి యున్నంతకాల మీస్థలము నెవ్వరికివ్వనని ఖండితముగా జెప్పివేసెను. ఆసంగతి నంబిళ్ళకు తెలిసి యామెను రప్పించి అమ్మా! నీ కొక్కదానికెంతచోటు కావలెను? పెద్దలు నివసించుటకు కొంచెము స్థలము నీయరాదా యనిరి. అదివిని యామె 'స్వామీ! అందుల కభ్యంతరమేమి? నాస్థలమంతయు మీరే గ్రహింపుడు. కాని నాకు మాత్రము పరమపదములో నొక గజము స్థలమును తమరు ప్రసాదించవలెన'ని విన్నవించెను. అంత నంబిళ్ళ 'ఓసీ యింతయేగదా నీ కోరిక అట్లే యిత్తుము తీసికొనుమ'ని పరిహాసముగా పల్కిరి. ఆమెయు 'నాతండ్రీ! నేనబలను చదువరాదు. గడసుకాయనుగాను గాన మాటమాత్రమే నాకు చాలదు. వ్రాత మూలముగా నుండవలెనని మనవిజేసుకొనెను. వారందులకు సంతసించి నొక కాగితమును తెప్పించి

ఫలానసంవత్సరము, ఫలానమాసము, ఫలాన తిథి, ఫలానవారమున పరమపదనాథునకు తిరుక్కలికన్ని దాసుడు వ్రాసుకొను విన్నపము

ప్రభూ! దాసుడీ నాడీమెకు పరమపదమున నొక గజము స్థలమును విక్రయించితిని. ఈక్రయమును చెల్లించి ఆస్థలమునిప్పించ గోరుచున్నాను

ఇట్లు మీపాదసేవకుడు—
తిరుక్కలి కన్నిదాసః

అని సంతకము చేసి యిచ్చిరి. ఆమె సంతోషముతో నాయుత్తరమును శిరసావహించి తన స్థలమునంతను వారికి స్వాధీనపరచి తీర్థప్రసాదముల పరిగ్రహించి రెండు దినములు నంబిళ్ళగారిని సేవించుచు సుఖముగ నుండి మూడవ దినమున పరమపదించెను.

కావున పరమపదాధికార మాచార్యులదే యని సిద్ధాంతము.



    

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ

ఆషాడమాస పండిత పరిషత్సభాహ్వాన సంఘము యొక్క అధ్యక్షులగు

శ్రీమాన్ కొప్పైండా శ్రీరామకృష్ణయ్య జమీందారుగారి

## స్వాగతోపన్యాసము



(తూర్పుగోదావరి జిల్లాలోని కాకినాడ పట్టణమున శ్రీ వేణుగోపాలస్వామివారి సన్నిధిలో స్వస్తిశ్రీ ఖరనామ సంవత్సర ఆషాడ బహుళ తదియ శనివారము (21-7-1951)న జరిగిన శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ ఆషాఢమాస పండిత పరిషత్సభాహ్వాన సంఘాధ్యక్షులగు శ్రీమాన్ పైండా శ్రీరామకృష్ణయ్య జమీందారు గారిచ్చిన స్వాగతోపన్యాసము.)

భక్త శిఖామణులారా! సోదరసోదరీమణులారా!

నేడు చాల సుదినము. వివిధప్రాంతములనుండి ఈ మహాసభకు భక్తాగ్రగణ్యులను ఆహ్వానింపగల అత్యుత్తమపదవికి నన్ను నియమించి నందులకు నేనెంతయు కృతజ్ఞుడను. వేదాంత విషయమున ఆరితేరిన ఈ సభ్యుల సమక్షమున వక్కాణింప సాహసించినందులకు నన్ను మన్నింతురు గాక.

## గీర్వాణవిద్యావశ్యకత

ప్రస్తుత పరిస్థితులనుబట్టి చూడగా మనదేశమునందు ఉత్తమవిద్యయే పూర్తిగా నశించినదని చెప్పవచ్చును. పూర్వము ఎన్నియో శతాబ్దముల నుండి రాజాధిరాజులు, చక్రవర్తులు మొదలైన వారెందరో తమ యొక్క ఆశ్రయమునందు పండితుల నుంచుకొని గీర్వాణవిద్యను సాధింపజేసి, అందులకు తగుమైన విధానము ననుసరించెడి పాఠశాలలను, మఠములను, ఇంకెన్నియో ఈ ఉద్దేశము విద్యకై ఏర్పరచి అభివృద్ధి పొందించుచుండిరి. యీకాలమున అన్నియు క్షీణించుచున్నందువే ఆఖరుకు ఈలోకములో కలుగు సుఖము లేదు సరిగదా, పరలోకములకు కూడ దూరమగుట తటస్థించుచున్నది. ఏలనందురా? ఆధ్యాత్మిక తరుణోపాయమైన విషయము లన్నియు గీర్వాణభాషయందే పూర్వులచే రచియింపబడియున్నవి.

వీనిని తెలుసుకొనుటకు, నేర్చుకొనుటకు, అనుష్ఠించుటకు తగు ప్రోత్సాహము లేక చాలా వరకు క్షీణదశకు వచ్చినదనుటకు సందేహము లేదు. అయినను మన భారతదేశమున ఆధ్యాత్మికాభ్యున్నతి గొడ్డుతనమును బొందలేదు, ఆధ్యాత్మిక విద్యావిధానమునకు అన్నివిధముల అత్యావశ్యకమైన గీర్వాణభాషకు ప్రతి ఆస్తికుడు తన శక్తికొలది అన్నివిధముల పాటుపడుగాక.

## కర్తవ్యము

ఇప్పటి మనయొక్క పరిస్థితి పూర్వులకంటె నీచాతినీచమైన మార్గముల నవలంభించుచు మనము కొంతవరకైనా తుదకు ఏఒక్కక్షణమైనా భగవంతుని స్మరించి తరింపమని తలచక ఇహలోకసౌఖ్యమే పరమపురుషార్థమని నమ్మి అనేకవిధములైన చెడుమార్గములను ప్రవేశపెట్టుచున్నాము. సోదర సోదరీమణులారా! కాలము మహావిలువ గల్గినదియగుటచే, ఒకక్షణమును గోల్పోవ న్యాయము రాజాలదు. మనము ఏకార్యము చేసిననూ ఈలోకములోనే, ఈశరీరముతోనే చేయవలసి యున్నది. పరలోకసాధనమైన కార్యము ఈలోకముననే చేయవలసియున్నది.

శ్లో. వర్షార్థ మష్టౌ ప్రయతేత మాసాన్ । నిశార్థ మర్థం దివసం యతేత ।
వార్థక్య హేతో ర్వయసా నవేన । పరత్రహేతో రిహ జన్మనా చ ॥

మనకు దేహములు శాశ్వతము గావుగదా, గనుక అందరము మోక్షోపాయమును తెలిసుకొని ఈదేహావసానమున సుఖించ ప్రయత్నింతుము గాక.

(వర్షాకాలము నాలుగు మాసములు సుఖించ దలచినవాడు అందులకు వలయువస్తు సామగ్రి నంతను మిగత ఎనిమిది మాసములు కష్టపడి సంపాదించుకొన ప్రయత్నించవలయును రాత్రిసుఖించ

దలచినవాడు అందులకు వలయు వస్తు సామాగ్రినంతను పగలు కష్టపడి సంపాదించకొన ప్రయ త్నించవలయును.

ముసలితనమున సుఖించదలచినవాడు అందులకు వలయు వస్తుసామగ్రినంతను యౌవ్వన కాలముననే కష్టపడి సంపాదించుకొన ప్రయత్నించవలయును. ఆవిధముగానే ఈదేహావసానమున పరలోకమున సుఖించదలచినవాడు అందులకు వలయు దానినంతను ఈలోకముననే ఈజన్మముననే కష్టపడి సంపాదించుకొన ప్రయత్నించవలయును.

లోకములో పురుషార్థములు నాల్గుగదా. ఈలోకములోనున్నంతవరకు ధర్మము, అర్థము కామములనెడి మూడుపురుషార్థములను యించుమించు అనుభవించుచునే యున్నాము గాని చతుర్థ పురుషార్థమైన మోక్షమునందు మాత్రము చాలా అశ్రద్ధ చేయుచున్నాము. ఎంతవరకు మనము ఆనాల్గవపురుషార్థముకుపొందలేమో అంతవరకు స్వర్గనరకాదిలోకములలోగల వాటివాటిఫలముల ననుభవించుచూ శ్లో. పునరపి జననం పునరపిమరణం పునరపి మాతు జ్ఞఠరే శయనం॥ అన్నరీతిగ చచ్చుచూ, పుట్టుచూ, అన్నివిధములైన భాధల ననుభవించుచుండ వలసినదే. అందుచే నాల్గవ పురుషార్థమును పొందదలంచిననూ ఆధ్యాత్మికవిద్యఅత్యావసరము. ఆధ్యాత్మికాభ్యున్నతికి వేదాంత విషయమే ముఖ్యమైనది. కాబట్టి మనకు ఈనాల్గవ పురుషార్థమును కృపచేయగలవాడు ఒక్క సర్వే శ్వరుడే. వాటిని తెలుపగలవారు జ్ఞాన-భక్తి-వైరాగ్యసంపన్నులగు భక్తులే. కాబట్టి 'పరమాత్మని యోరక్తః విరక్తో అపరమాత్మని' పరమాత్మా తిరిక్తమైన ప్రాకృతిక విషయములయందు విరక్తి యున్నగాని పరమాత్మునియందు అనురాగము కలుగజాలదు. సదరు మూడు పురుషార్థములను సాధ్యమైనంతవరకు తగ్గించుచూ ఆధ్యాత్మికాభివృద్ధిని పొందగల్గుటకు సాధనములైన అనేక విధా నములను ఈపండితోత్తములవలన గ్రహించి ఆచరించి, యిందుమూలముగా తరించెదము గాత,

జీవుడు పాషాణములలో, చెట్లు చేమలలో, క్రిమికీటక జంతువులలో అనేక అనుభవముల పొంది చైతన్యము వికశించగా అన్నిటికంటెను శ్రేష్టమైన జ్ఞానసాధనమగు మానవశరీరము ధరిం చును. అందుచేతనే అన్నిటికంటెను మానవజన్మము ఉత్తమమైనది, ఈజన్మమందు జీవునకు స్వాతంత్రశక్తికల్గి, నిన్న-నేడు-రేపు అను జ్ఞానమును, తానుచేయుపనులు అందులకు తగిన అనుభవ ములు తనకు గల్గించునవియనియు తెలిసికొనుటకు అవకాశము కలుగుచున్నదిగాన యిపుడే మనము పరిపూర్ణ జ్ఞానమును సంపాదింపవలెను. ఇదియే మన కర్తవ్యము. ఈప్రపంచము ఒకపాఠశాల వంటిది. ఒక్కొక్కనికి తన ఒక్కొక్క జీవితకాలము కొన్నిపాఠములు, (ఈయనుభవములు) వలన జీవుడు పరిపూర్ణపరిణామముపొందుటకై అనేక జన్మములు పొందును. జీవుడు ఈస్థూలశరీరధారి యగుటయే జన్మము. ఈజన్మలలో కొందరిని మేధావంతులుగాను, తెలివిహీనులుగను, సోమరులు గను, విద్యావంతులుగను, కుంటి, గుడ్డివారుగను, ధనవంతులుగను, బీదవారుగను అనేకవిధము లైన వారినిగ మనము గాంచుచున్నాము. ఇదంతయు వెనుకటి జన్మములయొక్క మానస, వాచక, క్రియారూపములైన కర్మల ఫలములై యున్నవి. మనము మంచితలంపులుగలిగి

మంచికార్యములనుచేయు పరోపకారులమై మనజ్ఞానమునుయితరులకు బోధించుచు సత్ప్రవర్తనులమై ఉత్తమజన్మములను పొంది మోక్షమునకు అర్హులమై యుందుముగాక. కాబట్టి బుద్ధిమంతుడైన ప్రతి జీవుడు శ్రమయని యెంచక సర్వదా ప్రయత్నముల జేయుచు, క్రొత్త ఋణముల జేయక సర్వకర్మలను కృష్ణార్పణము గావించుచు,

యత్కరోషియదశ్నాసి యజ్జుహోషి దదాసియత్ ।
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణం ॥

పాతఋణముల తీర్చుకొనుచు "జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతే సదా॥ సత్ప్రవర్తనులై, లోకహితము కొరకై యే జీవించుచు తాము యజ్ఞాన సముద్రమును దాటుచు, యితరులను దాటించుచు, స్వార్థపరత్వమును కామ-క్రోధముల జయించుచు, భగవంతుని పుత్రులకు శ్రేయః పురోభివృద్ధికై సదా పాటుపడుచు, శాంతి-సామరస్యముల సాధించుచు మనము తరించుచు యితరుల తరణోపాయములకై పాటుపడుదుము గాక.

గీత. 18-62 తమేవ శరణం గచ్ఛ । సర్వభావేన భారత ।
తత్ప్రసాదా త్పరాం శాంతిం । స్థానం ప్రాప్స్యసి శాశ్వతం ॥

సర్వవిధములచేతను ఆసర్వేశ్వరునే శరణజొచ్చుమా! ఆయన యనుగ్రహముచే నిత్యమగు మోక్షమును పొందగలవు. అని గీతాచార్యుడే తెలిపెనుగదా, జగత్ప్రభువై, మానవకల్యాణమునకై పెక్కురూపములతో అవతరించిన ఆపరాత్పరుడు మనలను శక్తివంతులగను సుస్థిరచిత్తులగను, పవిత్రులగను, నిర్భయులగను, స్వార్థరహితులగను, భగవద్భాగవతాచార్య ప్రేమికుల వారినిగను మనల నొనర్చి తరింపజేయుగాక.

అందులకు వలయు మార్గముల నీ పండిత ప్రకాండులు మనకు తెలుపుదురుగాక. పత్ర ప్రచారము దశదిక్కుల వ్యాపించి విశ్వకల్యాణ మొనర్చుగాక యని సర్వేశ్వరుని ప్రార్థించుచున్నాను.

ఓం శాంతిః శాంతిః శాంతిః.

ఇట్లు
సుజన విధేయుడు,
పైండా శ్రీరామకృష్ణయ్య.

కాకినాడ
21-7-51

శ్రీమాన్ ప్రెస్, కాకినాడ.



గయయందుంచి పండితులు సప్రమాణముగా ఈక్రింది ప్రశ్నలకు జవాబులు పత్రికా ముఖమున ప్రచురించ ప్రార్థించుచున్నాము.

1. ప్రపన్నులైన శ్రీవైష్ణవులకు గయలోను, బ్రహ్మకపాలములోను పిండ ప్రదానము చేయవలయునా? అవసరములేదా?

2. చేయవలశియున్నచో మామూలు పితృకర్మ (మృతాది 13 దివసములు) పూర్తియైన తరువాత ఎంతకాలములో చేయవలయును.

3. సంవత్సర సూతకములో చేయవచ్చునా? ఈశ్రాద్ధముల జరిగించుటలో ఏఏ కాలము మంచిని, ఏఏ కాలములు కూడవు?

4. ఈ శ్రాద్ధము జరిగించుటలో భార్య బహిష్టు భార్య గర్భిణి యింటిలో శుభకర్మలు జరిగించియుండుట, యిత్యాదులవల్ల ఆటంకములున్నవా?

5. గయాశ్రాద్ధము, బ్రహ్మకపాలశ్రాద్ధము ఈరెండింటిలోవ ది ముందు చేయవలయును, ఏది వెనుక చేయవలయును? ఈక్రమమును తప్పుటలో ప్రత్యవాయ మేమైన యున్నదా?

6. ఈపిండప్రధానముల ఒక పర్యాయమే చేయవలయునా? లేకఅవకాశము చిక్కినప్పుడెల్ల అనేక పర్యాయములు చేయుచుండవచ్చునా?

7. ఒక పర్యాయము చేయుటలోను అనేక పర్యాయములు చేయుటలోను ఫల భేదమున్నదా?

8. గయాశ్రాద్ధమును మాత్రము చేయకలిగి, బ్రహ్మకపాలశ్రాద్ధమునుచేయ జాలకున్నప్పుడు ఏమైన ప్రత్యవాయ మున్నదా?

9. గయాశ్రాద్ధము ఎన్నిదినములు చేయవలయును? ఒకరోజు మొదలు మూడు పక్షములు వరకు చేయు యాచారమున్నటుల మాహాత్మ్యములో యున్నది. ఇందులో ఏపక్షము శ్రేష్ఠము.

10. త్రిగయాశ్రాద్ధము, అష్టగయాశ్రాద్ధము అనువీనిలో ఏది యాచరించుట యుక్తము.

11. గయాశ్రాద్ధభోజనము గయావళులకు మాత్రమే పెట్టవలెనను నియమ మున్నదికదా? వారిభోజనానంతరమున తిర్గి శ్రీవైష్ణవస్వాములకు సాపాటు జరిగించ వలెనా? అవసరము లేదా?

12. గయావళుల భుక్తశేషమును శ్రాద్ధకర్తలు స్వీకరించవచ్చునా?

13. గయా బ్రహ్మకపాలముల శ్రాద్ధానంతరమున జరిగించుప్రత్యాబ్దికములను పార్వణవిధానమున జరిగించవలెనా? లేక సంకల్ప విధానమున జరిగించవలెనా?

14. మహాలయపక్షములో గయయందు ఏమేమి యాచరించవలయును.

# శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ శ్రావణమాస పండితసభ.

## (పాదుకాక్షేత్రం — నడిగడ్డపాలెం — కృష్ణాజిల్లా.)

ది 14-8-1951 మొదలు 3దినములు వరంగల్ వాస్తవ్యులగు ఉపన్యాసకేసరి, సుబోధక సుధీమణి శ్రీ ఉ. వే. శ్రీమాన్ కో. కం. రంగాచార్యులగారి అధ్యక్షతక్రింద జగద్విఖ్యాతిని గాంచి పూర్వాచార్యుల సంస్మరింప జేసిన శ్రీ శ్రీ శ్రీ వాసుదాసుగారి ప్రశాంతాశ్రమమున పై సభ జరుపబడెను. ప్రస్తుత ఆశ్రమనిర్వాహకులుగా నుండి 16 సంవత్సరములనుంచియు అఖండ "హరేరామ" భజనను నిర్వహించుచున్న శాంతమూర్తి శ్రీయుత కో. వెంకటప్పదాసుగారి ఆతిథ్య మానాటి శబరిని జ్ఞాపకము జేసెను.

'శబర్యా పూజిత స్సమ్యక్' ను వాల్మీకిభగవానునినుడి మ... ...సెనది. ప్రముఖులగు పండితులు నానాప్రాంతములనుండియు 15మంది విచ్చేసి తను విశిష్ట సిద్ధాంతోప న్యాసములతో భక్తులనానందాబ్ధినోలలాడించిరి. గుడివాడనుండి విచ్చేసిన శ్రీయుత బోయున సీతారామదాసుగారి భజనపార్టీ వారు సహజముగ భక్తితో తాము తన్మయముచెంది ప్రేక్షకుల నందరను తన్మయులగావించుట ఆశ్చర్యావహము.

ఈఆశ్రమ రామణీయకము, సాత్వికవాతావరణము నిజముగ ప్రాచీనమతంగాది మహర్షుల ఆశ్రమములకు ఉదాహరణమై అందరకు నందు నిత్యనివాసాభిలాషనంకురింపజేసెను.

ప్రముఖులగు హరిదాసులు భక్తిరస భరితములగు కథలతో భక్తులచెవులకు విందొసంగిరి.

ఈమాఘమాసములో జరుపబడు శ్రీశ్రీ వాసుదాసుగారి జయంతీ మహోత్సవ సందర్భములో యీ నిరంతర "హరేరామ" భజనకు శాంత్యర్థమై గొప్పవైదిక ఉత్సవ విశేషమును మనసంఘ యాజమాన్యమున జరుపదలంచినట్లును అదే సమయమున ఆగ్రామములో నేరుగా వేంచేసియున్న శ్రీసీతాలక్ష్మణ సహిత శ్రీ కోదండరామస్వామివారి కోవెలను దివ్యదేశముగావించ దలంచినట్లును శ్రీవెంకటప్పదాసుగారు సెలవిచ్చుట ముదావహము.

ఇంకను వారు తమ ఆశ్రమ నిర్వహణ భారమంతయు మనసంఘమునకే సమర్పించ నిశ్చయించియున్నారు.

అచ్చటకు విచ్చేసిన శ్రీవాసుదాసుగారి భక్తులందరును అమూడు దినములును అచ్చట శ్రీవాసుదాసుగారు వేంచేసియున్నట్లే మిక్కిలి భక్తితో ప్రవర్తించుట ఆశ్చర్యమును గొల్పినది.

ఇట్లు,

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘం.

# పరమార్థిక వైష్ణవ విశ్వవిద్యాలయం, బృందావనం.

# (Vaishnava Theological University Vrindaban, Mathura)

ఇంతవరకు నిర్మింపబడిన తాత్విక అన్వేషణాలయము (Research Institute) కార్యాలయము (Senate House) గాక శ్రీచైతన్య కళాశాల సంపూర్తిచేయబడెను. ది 12-8-1951 తేదీని హాన్ శ్రీ కన్యాలాల్ మాణిక్యలాల్ మున్షీ జీవల్ల గృహప్రవేశము జరిగినది. వనమహోత్సవము గూడ మున్షీ దంపతులచే ప్రారంభింపబడెను. భేదాభేదమార్గముగుండ భక్తివీధి వెంబడిని మహోత్సాహముతో అనేక సాధుజనులు తత్వవేత్తలు ఈశుభ ప్రశాళికను దర్శించియుండిరి. పలు తావులనుండి ఆశీస్సులు చేరియుండెను.

ఈసంస్థలో నొకటిగా ప్రముఖపాత్రవహించవలసియుండిన ప్రపన్న కళాశాలయను శ్రీమద్రామానుజీయ సాంప్రదాయక భవనమున కైస్థల నిర్దేశ్యము చేయబడినది. ఈయావరణలో నన్నిమత సౌలభ్యములకంటెను బ్రిధమస్థానము నలంకరించవలసినది విశిష్టాద్వైత ప్రచారమని పలువిధముల జ్ఞాపకముచేయదగినది ఇందుకై కేటాయించిన ప్రదేశమున సత్వరము రామానుజ కళాశాల నిర్మితమగునని యాశించబడుచున్నది.

బృందావనమునగల 12 వనములును 24 వుపవనములును, శ్రీకృష్ణభగవానుని చర్యలతో సంబంధించిన 84 క్రోసముల విస్తీర్ణముగల వ్రజమండల పరిక్రమా ప్రశాళిక శ్రీ పరమార్థిక విశ్వవిద్యాలయాధికారులు నిర్వహించబూనిరి. అక్టోబరు 17 తేది మొదలు ఒకనెలవరకు యీ పరిక్రమాకార్యక్రమము జరుగును. ఇందు పాల్గొనదలచిన భక్తిపరులు ముందుగ శ్రీ డాక్టర్ చి. గంగులి M. B. Bs. రిజిష్ట్రార్ (V. T. University Vrindaban) అని వ్రాసినచో వివరములు తెలియగలరు.

యాత్రికుల వసతిగృహములకును సాపాటునకును ప్రదేశములో చూడతగిన క్షేత్రములకు ప్రయాణసౌకర్యములకును అవుసరమన్న ఔషధసదుపాయముతోను ఏర్పాట్లు చేయబడినవి. పరిక్రమా కాలము ఒక మాసమునకు రు 200 లేక 300 ఖర్చుపడును. కృష్ణచర్య క్షేత్రములు దర్శించుటకే గాక తన్మహాత్మ్యములు ప్రసంగములు, తత్వవిమర్శనాది కాలక్షేపములు, భజనలు, సంకీర్తనములు, రాధాకృష్ణ విగ్రహాతియనాల్గు ఇత్యనేక భక్తిపూరిత కార్యక్రమములుండును. ప్రతిదినము వొక్కొక్క చోటునుంచి మరియొక తావును మార్చుచు వ్రజభూమియాత్రయు వొక నెలలో సంపూర్ణ సమాప్తిమగును.

శా కి నా స. }
30 8-1951 }

ఎం. వి. వి. కె. రంగాచార్యులు

## శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ ఆషాఢమాస పండిత సభ,

# శ్రీవేణుగోపాలస్వామివారి ఆలయము, కాకినాడ.



ఖరనామ సం॥ర ఆషాఢ బహుళ 3 శనివారం (21-7-51) తేదీ మొదలు 3 దినములు కాకినాడలోనున్న శ్రీవేణుగోపాలస్వామివారి దేవాలయమున న్యాయవేదాన్త విద్వాన్ శ్రీ ఉ. వే. శ్రీమాన్ గొడవర్తి శఠకోపాచార్య స్వామివారి అధ్యక్షతక్రింద పై సభ జరుపబడినది. శ్రీయుత బచ్చు రామేశంగారి ధర్మసత్రం పండితుల విడిది గృహముగా ఏర్పరచబడెను. ఆసత్రమునకు ప్రస్తుతం ధర్మాధికారిగానున్న శ్రీయుత పైండా కాంతారావుగారు కీ॥ శే॥ పైండా వెంకటచలపతిరావుగారి ధర్మపండు నుంచి తీసి పండితులకును దేశాంతరులగు శ్రోతృబృందమునకును షడ్రసోపేతమగు సాపాటు వసతులను కడుంగడు శ్రద్ధతో గావించిరి. దేవాలయ ధర్మకర్తలగు శ్రీయుత పైండా వెంకటచలపతిగారు కూడా ఉపన్యాసవేదిక శ్రోతలవసతులు లైట్లు వగైరా ఉపన్యాసములకు వలయు ఏర్పాటుల నన్నిటిని స్వయముగా దగ్గరనుండి మిక్కిలి శ్రద్ధాభక్తులతో నిర్వహించిరి. కార్యక్రమమున నిర్ణయించిన విధముననే సక్రమముగ పండితులందరి ఉపన్యాసములును జరిగినవి పెక్కుమంది స్త్రీలును పురుషులును సభలో పాల్గొని ఆనందించిరి. శ్రీ ఉ. వే. శ్రీమాన్ కరి నారాయణాచార్య భాగవతారుగారు పండిత పామర రంజకముగా "శ్రీ గోదాకల్యాణమును" హరికథా కాలక్షేపము గావించి శ్రోతల ప్రశంసకు పాత్రులైరి. శ్రీ ఆహ్వాన సంఘాధ్యక్షుల స్వాగతోపన్యాసము ముద్రింపబడి సభలో పంచిపెట్టబడెను. శ్రీమతి వింజమూరి [illegible] గారను విదుషీమణి తమ సహజ మృదుమధుర పాండితీ ధోరణితో స్త్రీల సభలో నుపన్యసించిరి. ఆమె "అర్థపంచకమును" సాంధ్రానువాదముగా అచ్చువేయుంచు నిమిత్తమై రు 116లు సంఘమునకు సమర్పించుటకు వాగ్దానము గావించిరి. ఇతర విదుషీమణులు కూడ పెక్కురు ప్రతిదినము మధ్యాహ్నము గం 2-0ల నుంచి గం 4-0ల వరకు ప్రత్యేక స్త్రీల సభలో నుపన్యసించిరి. అనూన వైభవముతో నాల్గవదినము సభలు విరమింపబడెను.

ఇట్లు,

శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘము.



శ్రీమతే రామానుజాయ నమః

# యతిరాజసేవా మహిళామండలి శకవారోత్సవ వార్షికసభలు

## బందరు, : : గొడుగుపేట.

ఈనెల 9-8-51 నుండి 11-8-51 తారీఖు వరకు బందరు గొడుగుపేట పాతచల్లరస్తా వేణుగోపాలస్వామి కోవెలలో మహావైభవముగా జరిగినవి కేవలము స్త్రీలే యీసమావేశములను అతినిపుణతతో జయప్రదముగా నిర్వహించిరి. 9 వ తారీఖు సాయంత్రం గం. 4 నుంచి రాజుపేటలో వృద్ధ సంఘాధ్యక్షురాలగు శ్రీపతి శీతమ్మగారి యింటివద్దనుంచి చినముత్తేవి (సూర్యనారాయణ బృందము) సన్నాయి మంగళవాద్యముతో, బ్యాండుమేళములతోను యతిరాజులవారి పటమును చలవ చప్పరములో వేంచేపుచేసి ఛత్రచామరలాంచన లాంఛితులై రామానుజులవారు బయలుదేరగా భాగవతబృందమంతయు ప్రబంధాధ్యయనాదులు భజనలు సల్పుచూ ముందునడువ వెనుక యతిరాజసేవామహిళా భక్తబృందము భజయతిరాజం భజనచేయుచు సుమారు 1 ఫర్లాంగు దూరంగోష్టివ్యాపించి నడుచుచు గం 7 లు అగుసరికి గొడుగుపేట కన్యకాపరమేశ్వరీ సత్రమునకు వచ్చి రామానుజులపటము అక్కడ వేంచేపుచేసిరి. ప్రతిదినము ఉదయంతిరువారాధన సేవాకాలం తీర్థప్రసాదాలు 3 దినములు జరిగినవి. యిందు శ్రీమాన్ జగ్గయ్యాపేట మరంగంటి రాఘవాచార్యులుగారు వారికుమార్లు నరశింహాచార్యులుగారు శ్రీనివాసాచార్యులుగారు తిరువారాధన సేవాకాలం తీర్థప్రసాద వినియోగాదులుచేసి భక్తులను సంతోషపర్చిరి.

ప్రతిరోజు యీగోష్టియొక్క పురప్పాట్లు యిటులనేజరిగినది. మధ్యాహ్నం గం 3 లకు శ్రీవేణుగోపాలస్వామివారి కోవెలలో దూరశ్రవణయంత్రములతో అలంకరింపబడిన మంటపమున శ్రీనందూరి ఆనందమ్మగార్కి అధ్యక్షతను ఉ. వే. ప్ర. గొడవర్తి జగన్నాథాచార్యులవారి అధ్యక్షతను పలువురు స్త్రీపురుషప్రముఖులచే వేదాంతోపన్యాసములీయబడెను. రెండవరోజు శ్రీమాన్ కొదమశింహం తిరువేంకటాచార్యులవారిచే అతి మనోహరముగా తిరునామసంకీర్తన గానసభ జరిగెను. ఇంకను ఉపన్యసించినవారు శ్రీమాన్ ఉ. ప్ర. శ్రీ చ. వెం. నరశింహాచార్యులుగారు కొమాండూరి ఇళైవిల్లి రామానుజాచార్యులుగారు, మరింగంటి నరశింహాచార్యులుగారు గుడివాడవాస్తవ్యులు ఘంటసాల శ్రీనివాసులుగార్లున్ను, శ్రీముడుంబై రామానుజమ్మగారు (రాజమండ్రి) నల్లందిఘళ్ లక్ష్మీనరసమ్మగారు (బందరు) మరంగంటి రంగనాయకమ్మగారు (కోరుకొండ) మరంగంటి భిరాటమ్మగారు (బందరు) నల్లాని చక్రవర్తుల తాయారమ్మగారు (రాజమండ్రి) దొడ్డపట్ల నరసమ్మగారు శ్రీపతి శీతమ్మగారు మరంగంటి శీతమ్మగారు కంతేటి తాయారమ్మగారు (బందరు) ఉపన్యసించిరి.

శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ శీతారామయతీంద్రులవారి ఉపన్యాసము భజనలు నాలుగురోజులు సభను తన్మయుల చేసినవి. మరంగంటి విద్యుల్లత మరంగంటి కాంచనసం యం. మురళి పి. మురళి ఈబాలబాలికలు భగవద్గీత 11 వ అధ్యాయం, 15 వ అధ్యాయం శ్రీకృష్ణార్జున సంవాదమును, ఆళ్వార్ నాయకీ నాటిక నందూరు ఆనందమ్మగారు వ్రాసినది నాటకమును చక్కని వేషములతో ప్రదర్శించి ఆనందపర్చిరి. ప్రతిదినము నందూరి ఆనందమ్మగారి ఉపన్యాసములు అమృతప్రవాహమువలె సభనంతా ముగ్ధులుచేసినవి. మొదటిరోజు కార్యదర్శినివేదిక చదివిరి.

చివర రోజు పోతురెడ్డి సుబ్బారావుగారు స్వాములకు ఖద్దరు శాల్వాలనిచ్చి సత్కరించిరి తదుపర వచ్చిన ఉపన్యాసకులకు సంఘమువారు సత్కారముల చేసిరి. నాటకము వేసిన పిల్లలను ఆశీర్వదించుచూ కోరుకొండ రంగనాయకమ్మగారు ప్రైజుల నిచ్చిరి. ఈ సంఘమువారును కూడా పిల్లలకు ప్రైజుల నిచ్చిరి. ఈ సభలు చక్కగా జరుగుచున్నవని విని శ్రీమతి వుయ్యూరు [illegible] గారు నేను వర్షము వలన రాలేకపోతిననియు సభలు బాగా జరిగి నందుకు తమ సంతోషమును తెలియపర్చుచూ నాటకము వేసిన పిల్లలకు ప్రైజు పంపెదనని నూజివీడునుండి వుత్తరము వ్రాసిన వారి ప్రైజులు వచ్చిన తర్వాత యిచ్చెదము, ఈ సభలు కావలయునని యెంతయో అభిలాషతో ధన సహాయం చేసిన బందరు నారీమణులకు వందనములు.

కార్యదర్శిని,

యం. సీతమ్మ.

## శుక్రవారపూజలు

### అర్తమూరు

| | |
|---|---|
| లంక సూరన్న భార్య వీరమ్మ | 0-4-3 |
| వుండమాటి రావన్న భార్య అమ్మన్న | 0-4-3 |
| పేపర్తి నారయ్య భార్య మంగయ్యమ్మ | 0-4-3 |
| కర్రి సత్తిరెడ్డి భార్య మంగయ్య | 0-4-3 |
| మహాశివభట్లురాజన్ శ్రీరాజుగారి భార్య చెల్లమ్మ | 0-4-3 |
| లంక వీరన్న భార్య మహాలక్ష్మి | 0-4-3 |
| నల్లమిల్లి బసివిరెడ్డిభార్య సూరమ్మ | 0-4-3 |
| నల్లమిల్లి సత్యం భార్య అచ్చయ్యమ్మ | 0-4-3 |
| పోతంశెట్టి వెంకన్న భార్య మాణిక్యం | 0-4-3 |
| నల్లమిల్లి అప్పారావు భార్య బుల్లెమ్మాయి | |
| మల్లిడి వెంకటరెడ్డి భార్య గంగయ్యమ్మ | |
| సత్తి కృష్ణయ్య భార్య సుబ్బయ్యమ్మ | |
| వాడి వెంకన్న భార్య మహాలక్ష్మి | |
| చిన్నం రామన్న భార్య వెంకయ్యమ్మ | |
| కర్రి వీరిరెడ్డి భార్య వెంకమ్మ | |

---

### బందరు శ్రీ య. సే. మహిళా మండలి యొక్క జమా—ఖర్చులు

| | |
|---|---|
| చందాల మూలముగా | రు-అ-పై |
| వసూలైన మొత్తము | 583-8-0 |
| పండిత సన్మానములు, ప్రసాదములు, సాపాట్లు భజనలు, మైకు, అచ్చు ఊరేగింపు వగైరాలకు అయిన ఖర్చు | 564-0-0 |
| నిల్వ | 19-8-0 |

కార్యదర్శిని

## ఏకాదశిపూజలు

### అర్తమూరు

| | |
|---|---|
| దాసరి రామన్న భార్య సుబ్బయ్యమ్మ | 0-4-3 |
| కోమాల వెంకయ్య భార్య బుల్లిఅమ్మాయి | 0-4-3 |
| సత్తి సూరయ్య భార్య సూరమ్మ | 0-4-3 |
| సత్తి వీరిరెడ్డి భార్య అచ్చయ్య | 0-4-3 |

శ్రీకృష్ణజయంతి

| | |
|---|---|
| చిన్ని బాలిక లక్ష్మి నారాయణ [illegible] | 0-4-3 |

---

### కట్నములు

విజయవాడ యతిరాజ సేవా మహిళా సంఘమునకు శుక్రవారం పూజలో యిచ్చినది 1-0-0

శ్రీ. ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి శ్రీనివాసాచార్యులుగారు శ్రీ పారేపల్లి వారింటియందు జరిపిన భగవద్విషయ చాతుర్మాస్య సందర్భమున మన సంఘమునకు సమర్పించినది 5-0-0

### వంగోలు

సముద్రి సుబ్రహ్మణ్యంగారు తమ మనుమడు భారసాల సందర్భమున మన సంఘమునకు కట్నముగా సమర్పించినవి 2-0-0 లు వీరికి శ్రియఃపతి ఆయురారోగ్య ఐశ్వర్యములు నిచ్చి రక్షించుగాక.

### విశాఖపట్నం

విశాఖపట్నం కాపురస్తులు శ్రీమతి దాసరి ఆండాళ్ళమ్మగారు తమ కుమార్తె చి॥ సౌ॥ పద్మావతికి కుమార్తె కలిగిన సందర్భములో సంఘమునకు రు5-0-0లు కట్నముగా సమర్పించినారు వీరికి ఆయురారోగ్య ఐశ్వర్యములు నిచ్చి రక్షించుగాక.

చీరాల వాస్తవ్యులు మ. రా. శ్రీ. మువ్వల వెంకటేశ్వర్లుగారి జ్యేష్ట కుమారుడు చి॥ వెంకట సుబ్బారావు వివాహ సందర్భమున విశిష్టాద్వైత ప్రచారక సంఘమునకు కట్నంగా 5-0-0 సమర్పించిరి.

రిజిస్టరు నెం. 5049.

# భక్తి "నివేదన"

(వేదాంత మాసపత్రిక)

ఇందు వేదాంత విషయ రాజసులున్ను; భక్తిప్రచార విషయమైన వార్తలున్ను; వేదాంత సాంప్రదాయ విషయకమైన ప్రశ్నోత్తరములున్ను ప్రచురించబడును.

చందాలు;

సాధారణ చందా సం. రం 1కి రు. 5-0-0

సహాయ చందా ,, రు. 10-0-0

To

Book-Post





## విషయసూచిక





Edited printed &published by A. ...nacharya at Sriman press, Kakinada, E.G.Dt.



శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ ఆశ్వీజమాస పండిత సభాహ్వానము

స్వస్తిశ్రీ ఖరనామ సం॥ర ఆశ్వీజ శు ౧౩ శి శనివారం (13-10-51 తేదీ) మొదలు [illegible] దినములు విజయవాడలోని కొత్తగుళ్ళలో బాపట్ల వాస్తవ్యులైన శ్రీ ఉ. వే. శ్రీమాన్ [illegible] డూరి యిళ్ళైవిల్లి శ్రీనివాస రామానుజాచార్యులవారి అధ్యక్షత క్రింద శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ అశ్వీజమాస పండిత మహాసభలు జరుపబడి యీ క్రింది పండితులచే యీ దిగువ విషయములు ఉపన్యసింపబడును గాన భక్తులెల్లరు యిందు పాల్గొని ఆనందించ గోరుచున్నాము.

ప్రతిదినము పండితుల విడిదిలో మధ్యాహ్నం గం 2 లు మొదలు గం 4 ల [illegible] సంస్కృతోపన్యాసములున్ను

అదే సమయమున కోవెలలో స్త్రీలకు ప్రత్యేక సభలు జరుపబడును.

ఇట్లు,

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ విజయవాడ శాఖా [illegible].

| పండితులు | విషయములు |
|---|---|
| శ్రీ అధ్యక్షులు | [illegible] |
| శ్రీ తిరుమల పల్లీకమారి రామానుజస్వామిగారు | [illegible] |
| శ్రీ మొలుగు రామానుజాచార్యులుగారు | [illegible] |
| శ్రీ నడాధూరి గోపాలకృష్ణమాచార్యులుగారు | [illegible] |
| శ్రీ బెల్లంకొండ రాఘవాచార్యులుగారు | తత్త్వత్రయము |
| శ్రీ కొ. యి. వెంకటాచార్యులుగారు | [illegible] |
| శ్రీ పరాశర సుదర్శనభట్టర్ అయ్యవార్లంగారు | శ్రీవరాహచరమము |
| శ్రీ తె. ఒం. గోపాలాచార్యులుగారు | సంసారము |
| శ్రీ గుదిమెళ్ళ రామానుజాచార్యులుగారు | గీతా సందేశము |
| శ్రీ కో. కం. రంగాచార్యులుగారు | విదురనీతి |
| శ్రీ త. పు. వెంకటాచార్యులుగారు | [illegible] |
| శ్రీ కో. భ. కృష్ణమాచార్యులుగారు | సంధ్యావందనము |
| శ్రీ గోవర్దనం నరసింహాచార్యులుగారు | గోవర్ధనోద్ధరణము |
| శ్రీ ఈయుణ్ణి రాఘవాచార్యులుగారు | శ్రీవిష్ణుచిత్తులు |
| శ్రీ మహాభాష్యం వరదాచార్యులుగారు | సీతాకళ్యాణం |



శ్రీమతే రామానుజాయనమః

భక్తి

నివేదన

వేదాంత మాస పత్రిక

| సంపుటి 3 | ఖర—ఆశ్వయుజమాసము | సంచిక 2 |
| --- | --- | --- |

# యతిరాజ విజయ నాటకము

[ప్రియరఙ్గ రఙ్గప్రియుల వాక్చాతుర్యము]

## తత్పరిణామము—తృతీయాంకము

వేదమౌళికి మాయావాది దుర్నయ మసహ్యాకరమాయెను. రామానుజులను ప్రధానామాత్య పదవి నలంకరింపజేసిన బాగుండుననెడు సంకల్పము ప్రబలమాయెను. కాని మాయావాది నారి ప్రవేశమును తీవ్రముగా ప్రతిఘటించెను. శ్రీయామునాచార్యులవారును శ్రీ కాంచీపూర్ణులును ఎట్లైనను రామానుజుల నాస్థానము నలంకరింపజేయవలెనని యత్నించుచుండిరి. ఇట్లుండగా వేదమౌళి శ్రీయామునులతోను మంత్రులతోను కొలువునందుండగా మంత్రులు తనమ్రోలనే పరస్పరము కలహించి యసభ్యముగా ప్రవర్తించుట యాతనికి దుస్సహమాయెను. సరిగ నిదే సమయమునకు శ్రీయతిరాజ శిష్యపుంగవులగు వాధూలగోత్రోద్భవులగు దాశరథులును వాత్స్యగోత్రోద్భవులగు సుదర్శనవరద విష్ణువులును వైతాళిక వేషములతో శ్రీకాంచీపూర్ణుల యాజ్ఞాపత్రమును శ్రీయామునుల కర్పింప సభామంటపమున ప్రవేశింతురు.

రాజు:—(గౌరవముతో వైతాళికులను జూచుచు) మీరెవరు? ఏలవచ్చితిరి?

వైతా:—రాజా! ముందు పూజ్యులను పూజించియే విన్నవింతుము.

రాజు:—(ఆలోచించి) ఐనను ఆలోచనవల? ఇట్టి ఆత్మజ్ఞాన సంపన్నుల బుద్ధి గూడని పనులలోనికి దిగదు. (పైకి) ఐనచో నట్లే జేయుడు. (వైతాళికులు వినయముతో దగ్గర కేగి యామునాచార్యుల పాదములను శిరస్సునని డుకొందురు)

యాము:—(భయముతో) మహారాజు ముందంత యాదరము తగదు. (అని తమ పాదములను కాషాయవస్త్రాగ్రముతో కప్పికొందురు)

రాజు:—(గౌరవముగా చూచును)

వైతా:—మేము పూజ్యులగు రామానుజుల పాదదాసుల మని తమరు మమ్మనుగ్రహింప వలెను.

యాము:—(స్నేహగౌరవములతో) మహారాజానుగ్రహపాత్రులు కండు!

వైతా:—పూజ్యా! తమ యనుగ్రహముచే ధన్యులమగుదుము గదా!

రాజు:— పుణ్యమూర్తులారా! ప్రశ్నయట్లే యుండిపోయెను.

వైతా:— (భయముతో తిరిగిచూచి) దేవా! మేము శ్రీరామానుజుల పాదపద్మపరాగ తునకలము.

రాజు:—గురువందనసమయముననే యావిషయము తెలిసినది. అందెవ్వారో యని వివరముగనే తెలియగోరుచున్నాను.

వైతా:—ఆయన మాకు విద్యకు సంబంధించిన తండ్రి తిరిగి పుట్టపుంక జేయు జనకుడు.

రాజు:—(ఆనందముతో) ఆయనయేనా మీకాచార్యుడు? (ఆలోచించి) ఆయన మమ్మెన్నడైన తలంచెనో?

వైతా:—ఎప్పటికిని తలపెట్టరు.

రాజు:—(సందేహముతో నుండును)

వైతా:—కాని యోగమహిమచే నెల్లప్పుడును మిమ్మనుభవించుచునే యుందురు.

రాజు:—(చిరునవ్వునవ్వును)

వైతా:—తమరు రెండవప్రశ్నకు సన్నద్ధులు కండు.

రాజు:—(నవ్వి) పూజ్యులారా! ఒక్కక్షణ కాలము క్షమింపుడు. (ఇతరులకు వినబడకుండ) వారి యొద్ద సదూహుడని యెవ్వడైనా యున్నాడా?

వైతా:—ఊరక యుండుటయేగాదు.

రాజు:—ఇంకేమి?

వైతా:—మాయావాదిని పీకి పారవేయుటకు సన్నాగమును పన్నుచున్నాడు.

రాజు:—(మాయావాదిని జూచి కోపముతో తనలో; దుర్మార్గుడా! ప్రభుభక్తివిహీనుడవగు నీకేమి ఫలించునో లెమ్ము. (పైకి) పుణ్యులారా! మీరు వచ్చిన పనిని జెప్పుడు.

వైతా:—(ఒకరిముఖము నొకరు చూచుకొందురు)

రాజు:—(కుడికన్ను అదిరి నట్లభిన యించి ఆనందోత్సాహములతో) ఆలోచన యేల ? విశ్వాస ముతో జెప్పుడు.

వైతా:—అంతయు నిదియే చెప్పును (అని పట్టుబట్టచే చుట్టబడిన ఉత్తరమును విప్పియిత్తురు)

యామ:—(దానిని తీసుకొనును)

రాజు:—ఇది యెచ్చటనుండి వచ్చినది ?

వైతా:—అదియునాయుత్తరమే చెప్పును.

రాజు:—ఆర్యా ! చదువుడు. చదువగా వినగోరుచున్నాను.

యామ:—(ఉత్తరమును) విప్పి చదువుచు చిరునవ్వు నవ్వును)

రాజు:—దోషమేమైన గలదా !

యామ:— లేదు లేదు. నిర్దుష్టమే. కాని వీరు అందెకు శిరస్సున మోపజూచిరి.

రాజు:— అది యెట్లు ?

యామ:—నాకొఱకై వచ్చిన యీ యుత్తరము తమకు జూపబడెను.

రాజు:—తప్పేమి ? అదియును నాదే. చదువుడు.

యామ:—ఐనను చదువుటకు భయపడుచున్నాను.

రాజు:—(బలవంతముగ తీసుకొని తానేచదువును) స్వస్తిశ్రీ యామునమునుల పాదవందన మాచరించి కాంచీపూర్ణుడు గావించు విజ్ఞప్తి—

ఇప్పుడు శ్రీహస్తిశైలాభరణమగు శ్రియఃపతియైన శ్రీవరదరాజులు నాయెదుట సాక్షాత్కరించి రామానుజుల నీవిధముగ నాజ్ఞాపించెను.

"నాయాజ్ఞానువర్తియగు వేదమార్గ యిత్తరి వేదబాహ్యులును కుదృష్టులును నగు దుష్ట మంత్రివర్గముచే బీడింపబడుచు కలతజెందుచున్నాడు. కావున నీతాతనిని కాపాడవలె" నని అందుల కనుకూలించు మతి నీతి, సత్వము, సముత్సాహము మొదలగు వారినితోడిచ్చి రామానుజుని బంపితిని, కావున నీవును రాత్రిం బవళ్ళు వేదమార్గిని గాపాడుచుండుము' అని

యామ:—(ఆనందముతో) ఇది యొక గొప్ప యభ్యుదయమే.

మాయా:—దేవా ! వైతాళికుల అసత్యభాషణములకు పూర్తిగ మోసపోతివి.

(కోపముతో యామునుని జూచుచు)

రావణ సన్యాసీ ! నీయాలోచన యనెడు కపట తొండమూవి నీటియందీరాజుని ముంచి వేసితివి. రాముకువలె నే దురవస్థ నొందునో గదా !

ప్రియరంగుడు:— రామానుజుని బలముచే రామునివలెనే మా రామానుజుల బలముచే నీ రాజును ఏవిధమగు దురవస్థను చెందంబోడు. కాని యంతటను గెలుపునే పొందును. నీవుమాత్రము పెద్దల నధిక్షేపించితివి కాన నన్ని దురవస్థలను పొందియే తీరుదువు. (నవ్వి) బ్రహ్మసూత్రి

మును పూర్తిగ విడిచిపెట్టి నాకంటె వేరొక్కడులేడని జెప్పుచు నొక్క మాయనే దిక్కని నమ్మియున్న నీవే నిజముగ రావణసన్యాసివి.

మాయా:—(కోపముతో) బాగు! బాగు! వైతాళికవటుడా! అబ్బా! ఎంతచతురుడవైతివి? పరమహంసనగు నా యజ్ఞోపవీతత్యాగమును నీ వొక్కడవే కాబోలు తెలిసికొంటివి.

ప్రియరంగుడు:—కాదు-కాదు. అందరు నెఱుంగుదురు. జందెమును వీడినది. కాకియో హంసయో మనకెందుకు గాని నేనిప్పుడు జెప్పన దగినకాదు.

మాయా:—(ఆలోచించి) హుం! మరేమి? శారీరసూత్రములను విడిచితి ననుచున్నావా యేమి? ఓరి యవివేకీ! శ్రీవేదవాళిమహారాజును అద్వైతసామ్రాజ్యము నేలించుచున్నాను, ఎరుంగుదువా? ఇక నే నాసూత్రముల నెట్లు వీడుదును? చాలు చాలు. పొమ్ము. పాడుకొను పిల్లవానికి నీ కీబ్రహ్మవిద్యాప్రసంగమేల?

ప్రియ:—ఔను నేను మూర్ఖుని గాన నేమియు నెఱుంగను. నీవు వివేకివి గదా చెప్పుము. సంగీతవిద్యయు బాల్యమును వేదాంతవిజ్ఞానవిరోధులా? (పకపక నవ్వి) ప్రహ్లాదనారదులను బ్రహ్మవేత్తల గోష్ఠిలో జేర్చవు కాబోలు. శుకనారద వృత్తాంతము నీకు తెలిసినచో శంఖమే. వారు బ్రహ్మవేత్తలే కాదు. వారికి యాచార్యులు కూడను. ఆనివయ మేమందువు?

ఓరి! వ్యర్థపాండిత్యాభిమానీ! చూడుము. ఈ ముక్తపురుషు డపరిమితానంద భోగియగు శ్రియఃపతి చెంతజేరి పరబ్రహ్మవిద్యాబలము వలన సత్యలోకాది చతుర్దశ భువనములయందును ఆయన ననుసరించి యనంతగరుడాదులతో గూడి స్వేచ్ఛగా సంచరించుచును తన సంకల్పమాత్రముననే కావలసిన యన్నమును కావలసినన్నిరూపములను పొందుచు సత్యంతాశ్చర్యమయమైన గానమును జేయుచు పరబ్రహ్మ ప్రసాదించిన బ్రహ్మానందముతో గూడియుండు ననెడు బ్రహ్మజ్ఞులకింపైన శ్రుతిని ఓ మాయావాదీ! నీవు చదువకపోయినను విననైనలేదా!

ఇప్పుడది యట్లుండనిమ్ము. ఆకాశకుసుమ సదృశమైన నద్వైతమని యేదో యంగీకరించి యదియే సత్యము దానికి విరుద్ధమగు నర్థముల బోధించుచుగాన బ్రహ్మసూత్ర సముదాయమంతయును, దాని యర్థమగు-బ్రహ్మ సకలచేతనా చేతన ప్రపంచమునకును కారణమగుటను దానికి వలయు నిఖిలకల్యాణగుణములు కలిగియుండుటను మోక్షమొసంగుట మొదలగు వాటిని మిథ్యమిథ్య యని వదరు నీవు బ్రహ్మసూత్రముల బరిత్యజింపక మరియేమి చేసితివి? ఐనను వాటిని స్వీకరించుట నిజముగ వైదికుల వంచించుటకే గదా! నిజమాలోచించిన వేదవాళి యద్వైత విషయాభిభావమున్ను వంచనగాక మరియేమగును?

[తరువాయి 18 వ పేజీలో]

శ్రీమతే రామానుజాయ నమః



# భగవంతుడు–ఆయన ప్రేమ–ఉప్పుఘళ్లు.

"శ్రీమన్నారాయణ"

ఏమమ్మా అక్కా–ఇంకను స్వామి వేంచేయలేదేమి?

అదేనమ్మా, నేను ఆలోచించుచున్నాను. చెల్లెళ్ళందరు వచ్చినట్లేనా

ఆహా! అందరు వచ్చివేసినారు. ఇంక అసలాయన ఆవిర్భవించుటే ఆలస్యము

పూజా ద్రవ్యము లన్నియు సిద్ధముగా నున్నవా?

అవునవును ఏది ఏమాత్రము లోటువచ్చినా మనకు పొడుపులు తప్పవు

అవాప్తసమస్తకామునికి ఈ అట్టహాసము లన్నియు మన తృప్తికొరకే గాని ఆయన కేమైన అపేక్షయున్నదా?

అవును గాని అక్కా! స్వామికి కావలసినది మానసిక జ్ఞానము, మానసిక సమర్పణము గాని పైపై యాడంబరములు కావందురే. మరిఈ మడి–తడు లెందుకు? ఈబొట్లు జుట్లు ఎందుకు? ఈ సింగారింపులు–అలంకారములు ఎందుకు, ఈపూజా పునస్కారము లెందుకు?

నీవు చెప్పినది నిజమే. గాని ఆంతరంగిక భావములకు బాహ్యచిహ్నాలు గురుతులు కేవలము మానసిక భక్తిరహిత బాహ్యచిహ్నాలు వ్యర్థములు గాని మానసిక భక్తి యుండునపుడు బాహ్య చిహ్నాలు కూడ యుండవలయును. ఉండవలయుటేమిటి? అవి కలిగియే తీరును.

నలుపుదనము లేకుండగ మేఘము వర్షించునా?

తెల్లనికాంతి లేకుండగనే సూర్యుడు ప్రకాశించునా?

ఎరుపుదనము లేకుండగనే అగ్ని దహించునా?

ధ్వని లేకుండగనే వాయువువీచునా?

ఆయా బాహ్యచిహ్నాలు కలుగుట వానివానియొక్క లోలోపల యుండు విషయముల యొక్క సూచకత్వరూప స్వభావము.

అవునవును నిజమే. నాటకములలో కూడ రాజస–తామస ఆంతరంగిక గుణముల కల వాడని తెలియుటకు బోడిగుండో లేక జుట్టువిరబోతయో యుండునటుల జేసి, మొగమున యింత విభూతిని బూసెదరు. ఎరుపో–నలుపో బట్టలు ఏ గూడ కట్టుగనో కట్టెదరు.

సాత్త్విక ఆంతరంగిక గుణముల కలవాడని తెలియుటకు మంచి జుట్టు మొగమున మంచి తిరుమణి శ్రీ చూర్ణబొట్టునో లేక యిటువంటిమంచి ఊర్ధ్వపుండ్రమును పెట్టెదరు. తెల్లటిమంచి అంచుల బట్టను చక్కగ కట్టెదరు.

ఆంతరంగిక గుణములు లేకుండగ కేవలము గొప్పకో, గౌరవమునకో, డాబుకో దర్పమునకో, మోసమునకో- మాయకో మాత్రము పైకి వేషములు వేసినచో అది వ్యర్థము. అట్టివంటి బొమ్మలవల్ల ఎంత ప్రయోజనమో అంతే.

అవునమ్మా అవును

అదిగో వేణునాదము

అక్కల్లారా రండు నాథుడు మన్నాథుడు జగన్నాథుడు అఖిల జగన్నాథుడు వేంచేయుచున్నాడు. ముందు కుంభహారతి నిత్తము ఆసనము సర్దుడు.

అర్ఘ్యపాద్యముల నాయత్త పఱచుడు

పండ్లు-పానీయములు సిద్ధముగా యున్నవి గదా

ఈవిధముగా మూర్తీభూతభక్తి స్వరూపులగు అష్టపట్టమహిషులున్ను గోపికాబృందమున్ను విచ్చేసిన శ్రీకృష్ణపరమాత్మునికి హృదయపూర్వక స్వాగతమిచ్చి సపర్యల నొనరించిరి. శ్రీకృష్ణ పరమాత్ముడు మధ్యగ పసిడి సింహాసన మలంకరించగా చుట్టూ మిగత వారందరు సుముగిన గోష్ఠిగను కూర్చొని యుండిరి. పండ్లు అందించువారు కొందరు పానీయముల త్రాగించువారు కొందరు పూజల నొనర్చువారు కొందరు హారతుల సమర్పించువారు కొందరు పాటల బాడువారు కొందరు పాదము లొత్తువారు కొందరు ఇటుల అత్యుత్సాహము మిన్ను ముట్టుచుండెను.

ఇంతలో నారదమహర్షి విచ్చేసిరి. అందరూ లేచి ఆయనకు స్వాగతమిచ్చి ఒక ఉన్నత సుఖాసనమున ఆయనను ఆసీనుని జేసిరి.

నారదుడు:- శ్రీకృష్ణా! ఏమి నేటి విశేషము, ఇంత మంది ప్రియురాండ్రతో ఇంత సాహకాశముగా ఆనందించుచున్నావే ఆహా ఇట్టి అపూర్వదృశ్యమును, అన్యోన్యప్రేమ గోష్ఠిని, దర్శించ గలిగిన నాభాగ్యమే భాగ్యము, నాజన్మయే జన్మ.

రుక్మిణి:- మహర్షీ నేడు నాథుని జన్మదినోత్సవము ఎన్ని దినములనుండియో ఎంతో ప్రియాసజెంది ఉపాసించగా ఉపాసించగా ఈనాటికి నాథునికి అనుగ్రహము కలిగెను. ఉత్సవమును ప్రాణ్గాన నంగీకరించెను.

నారదుడు:- అమ్మలారా మీరు గదా ముక్తులు. మీరు గదా ధన్యులు. జన్మాంతర సహస్రములయందు తపో-జ్ఞాన-సమాధులచే భగవదనుభవ విరోధములగు పాపములు నశించగా గద శ్రీకృష్ణుని యందు ఇట్టి భక్తి జనించును.

యమేవైష వృణుతే తేన లభ్యః ।
తస్య ఏష ఆత్మా వివృణుతే తనూం స్వాం॥

మీరాయనను వరించిరి. ఆయన మిమ్ముల వరించెను. మీకాయన ఈవిధముగ దర్శనమిచ్చెను.

శ్రీకృష్ణుడు:_ "ప్రియో హి జ్ఞానినోత్యర్థం
అహం స చ మమ ప్రియః"

వారు నన్ను ప్రేమించిరి. నేను వారిని ప్రేమించితిని. ఇందు విశేషమేమున్నది నారదా!

నారదుడు:_ స్వామీ! మీ పరస్పర ప్రేమ ఎట్టిదో నాకు తెలియునటుల బోధించరా.

శ్రీకృష్ణుడు:- ముందు వారినడగుము. తరువాత నేను తెలిపెద.

నారదుడు:- అమ్మా మీకు శ్రీకృష్ణునిపైగల ప్రేమను నాకు ఉదాహరణ పూర్వకముగ తెలియునటుల బోధించరా.

గోపికలు పట్టమహిషులు అందరున్ను:_ నారదా నాధునిపైగల ప్రేమను మేమెట్లు తెలుప గలము. ఆయనే మాకాధారము, ఆయనే మా ప్రాణము, ఆయనే మా ఆత్మ, ఆయనే మా భోగము, ఆయనే యానందము, ఆయనే మా సౌఖ్యము, ఆయనే మా మోక్షము, ఆయనే మా సర్వస్వము. మహామునీ మేము దీనిని తెలుపశక్తులము గాము. మాకు భావమున్నది గాని భాష లేదు. మాకు హృదయమున్నది గాని శబ్దము లేదు. మాకు ప్రేమ యున్నదిగాని దానిని వివరించ గల సాధనము లేదు. వేయేల మేమే ఆయన-ఆయనే మేము-ఆయనే మా స్వరూపము. మేమే ఆయన స్వరూపము. ఆయన లేనిచో మేము లేము.

నారదుడు:_ శ్రీకృష్ణా, సర్వజ్ఞా, సర్వశక్తీ ఆశ్రితవ్యామోహా, నీచేష్టితములు అప్రమేయములు. అనంతములు. అత్యాశ్చర్యకరములు. జగదేక సుందరుడవు, నవమన్మధ మన్మధుడవు. నీకటాక్షము కలిగినచో నిన్ను ప్రేమించని జీవియుండునా? అయితే నీవు వీరి నెటుల ప్రేమించుచున్నావో తెలుపవా? వీరు తెలిపినది నాకు బోధపడలేదు. నీవైన నాకు తెలియునటుల విశదీకరించుమా.

శ్రీకృష్ణుడు:_ నారదా నేను మాత్రము చెప్పగలనా
"జ్ఞానీ త్వాత్మైవ మే మతం"

నాకు వీరు ఆత్మవంటివారు.

ఒకగోపిక:- అలాగున గాదు స్వామి. నీవు నిజముగా మమ్ముల నెట్లు ప్రేమించుచున్నావో చెప్పుమా.

శ్రీకృష్ణుడు:- నిన్నా. వెల్లమునువలె ప్రేమించుచున్నాను.

మరియొక గోపిక:- నన్నో?

శ్రీకృష్ణుడు:- తేనెనువలె ప్రేమించుచున్నాను.

మరియొక గోపిక:- మరి నన్నో?

శ్రీకృష్ణుడు:_ నిన్ను కమ్మెనైన కమ్మని పాలనువలె ప్రేమించుచున్నాను.

మరియొక గోపిక:_ నన్నో

శ్రీకృష్ణుడు:- నిన్ను గట్టి మీగడ పెరుగునువలె ప్రేమించుచున్నాను.

మరియొక గోపిక:- నన్నో

శ్రీకృష్ణుడు:- నిన్ను ఆనాడు చిలికి తీసిన తెల్లని వెన్నముద్దనువలె ప్రేమించుచున్నాను.

మరియొక గోపిక:- నన్నో

శ్రీకృష్ణుడు:- నిన్ను అప్పుడు కాచిన ఆవునెయ్యినివలె ప్రేమించుచున్నాను.

మరియొక గోపిక:- నన్నో?

శ్రీకృష్ణుడు:-నిన్ను పాయసమువలె, జిలేబివలె, మంచిపిండివంటలవలె ప్రేమించుచున్నాను.

జాంబవతి:- నన్నో

శ్రీకృష్ణుడు:- నిన్ను బాగా పండిన అంటు-మామిడి పండునువలె ప్రేమించుచున్నాను, మిఠాయివలె ప్రేమించుచున్నాను.

సత్యభామ:- నన్నో

శ్రీకృష్ణుడు:- నిన్నా-అమృతమువలె ప్రేమించుచున్నాను.

రుక్మిణి:- స్వామీ-నావిషయమైకూడ

శ్రీకృష్ణుడు:- అడుగుటకు సందేహించెదవేల దేవీ. నిన్ను ఉప్పుఘల్లునువలె ప్రేమించు చున్నాను.

ఈమాట వినునప్పటికి రుక్మిణికి చాల లజ్జవొడమెను. అందరిని మంచిమంచి విలువగల ప్రేమాస్పదమైన వస్తువులువలె ప్రేమించుచునటుల చెప్పి నన్ను పట్టమహిషిని, మహాభక్తురాలను తనను తప్ప అన్యమెరుంగని అనన్యాభక్తురాలను, కల్లకపటము ఎరుగని సర్వథా అనన్యభోగ భ్యాతురాలనై యుండుదానిని, స్వప్నమునందు లేకుండగ అనన్య శేషభూతురాలనై యుండు దానిని ఎందుకు పనికిరాని చవట చవిటి ఉప్పుఘల్లుక్రింద త్రోసి వేసెనే అని రుక్మిణి చాల చిన్న పోయిన మోముతో మిగత సవతులను మొగమెత్తి చూడజాలక అచ్చట నిలువజాలక రోషా వేశములతో లేచిపోయెను. మిగత గోపికలు దేవిమారులు స్తంభించిపోయిరి. నారదుడు నిశ్చేష్టుం డాయెను. శ్రీకృష్ణుడు మాత్రము మోమున చిరునగవు చిందులాడ నిమ్మళముగ లేచి వెళ్ళిపోయెను నారదుడు తన వలననే ఈఉత్సవ ఉత్సాహమునకు భంగము వాటిల్లెనుకదాబోలునని కిక్కురు మన కుండగ అంజలిగీలించి ఆకాశమున కెగసిపోయెను.

మరునాడు శ్రీకృష్ణుడు రుక్మిణీదేవి అంతఃపురమునకు విచ్చేసెను. మహాభక్తురాలగు రుక్మిణీ దేవి నాథుని ఎదుర్కొని సకల సపర్యలొనర్చి దివ్యాసనమున కూర్చుండబెట్టి శ్రీపాదముల నొత్తు చుండెను.

శ్రీకృష్ణుని రాకచే ఆమె హృదయసీమను గల నిన్నటి రోషతాపము తప్పక చల్లారెను. గాని ఏమియు పల్కుకరించ జాలకుండెను. శ్రీకృష్ణుడు గూడ తిరిగి నిన్నటి ప్రసంగమును ఎత్తకుండ చుండెను.

శ్రీకృష్ణుడు:— దేవి నీవొక వ్రతమాచరించవలసియున్నది.

రుక్మిణి:— చిత్తము.

శ్రీకృష్ణుడు:— అది నలుబది దినములు ఆచరించవలసియున్నది. దానికి ఇతర ఏనియమములు లేవు గాని కొలదిగ ఆహారనియమము మాత్రము గలదు. ఉప్పులేకుండగ చప్పడి పదార్థములను మాత్రమే భుజించవలయును. ప్రతిదినము మూడు వేళలందును భగవంతుని ఆరాధించి ముగ్గురు ముత్తైదువులకు యిట్టి చప్పడి పదార్థములతో సాపాటు పెట్టుచుండవలెను.

రుక్మిణి:— చిత్తము.

మర్నాటినుండి వ్రతదీక్ష ప్రారంభమాయెను. ఏరోజున కారోజు సాపాటుకై ముగ్గురు ముత్తైదువులు దొరకుట అతి దుర్లభమగుచుండెను. ఒకనాడు వచ్చిన వారలు మర్నాడు ఎంత బ్రతిమాలినను రాకుండిరి. తన సవతులు కూడ వచ్చుటకు నిరాకరించిరి. చివరకు తనకు కూడ ఈ ఉప్పులేని చప్పిడి కూడు సహించక ఆనాటి కానాడు చిక్కి శల్యమగుచుండెను. ఎన్నోరకముల తినుబండారములను చేయించుచుండిరి. ఎన్నోరకముల పండ్లు, పాలు వచ్చి పడుచుండెను. ఏమి లాభము ఉప్పులేక పోవుటచే ఏదియు ఎవరికి సహించకుండెను. ఎటులనో అతికష్టముపై 39 రోజులు గడిచెను. శ్రీకృష్ణుడు ఆనాడు తిర్గి రుక్మిణీదేవి అంతఃపురమునకు విచ్చేసెను.

శ్రీకృష్ణుడు:— దేవి, ఏమి యింతలో యింత చిక్కిపోతివే. లేవలేకున్నావేమి? రేపు మన వ్రతసమాప్తి దినము. రేపు మన బంధు-మిత్రులందరిని పిలిచి తదీయారాధన జరుపవలయును. అందు నలుభై పిండివంటలు, నలుభై కూరలు, నలుభై పచ్చళ్ళు చేయించవలెను. దేనిలో కూడ ఒక్క ఉప్పురాయినైనను వేయకూడదు. చివరకు నేతిని, చివరకు పెరుగును నీవే స్వయముగ వడ్డించవలయును.

రుక్మిణి:— చిత్తము.

శ్రీకృష్ణుడు:— మర్నాటికి తన బంధుమిత్రులందరును, రాజాధిరాజులను అందరిని సాపాటుకు ఆహ్వానించెను. అందరు విచ్చేసిరి. నారదుడు కూడ వచ్చెను. అన్ని పదార్థములు వడ్డించబడెను. అందరు భోజనమున కుపక్రమించిరి. రుక్మిణీదేవి నెయ్యినివడ్డించ ప్రారంభించెను. ప్రతివారు ప్రతి పదార్థమును అతి ఆప్యాయముతో నోటిలో పెట్టుకొనుట, చప్పగ యుండుటచే ఛీ ఛీ అనుచు ఉమ్మివేయుట జరుగుచుండెను. ప్రతి విస్తరి వద్దను రుక్మిణీదేవికి యిదేఅనుభవము కలుగుచుండెను, చివరవరకు యింతియే. ఎవరూ ఏపదార్థమును కొంచమైనను తినలేదు. ఛీ, ఛీ, థూ, థూ, అను శబ్దములు మిన్నుముట్టెను. రుక్మిణీదేవికి కళ్లు తిరిగెను. కన్నీటిధారకు మేర లేదు. మనస్సు శైథిల్యము చెందెను. ఒకమూల చతికిల బడెను. చివరకు మూర్ఛపొందెను. శ్రీకృష్ణుడు వచ్చి ఆమెను వడిలోనికి తీసుకొని ముఖమున పన్నీరు జల్లుచు శైత్యోపచారములు జేసెను. రుక్మిణికి తెలివి వచ్చెను.

రుక్మిణి:- నాథా! క్షమించరా, నీచేష్టలు అపరిమేయములు నీమాటలు అనాహ్యాములు. అజ్ఞానిని అపరాధిని క్షమించుమా. ఉప్పులో యింత మహాత్మ్యమున్నదని తెలుసుకొనలేకపోతిని. ఊరక మీపై అలిగితిని. అందులకు తగిన శాస్తి జరిగినది. ఇకనైనను నన్ను దయనేలుమా

నారదుడు:- ఆహా స్వామి, ఎంత విచిత్ర సంఘటనను కలిగించితివి.

అందుకనే నిన్ను ఉపనిషత్తులు యథా సైంధవఘనః — రసఘనః ఏవ” అని వర్ణించినవి. లోకములో ఎన్నో అమూల్య అపురూప పదార్థము లుండగా నిన్ను ఉప్పుఘల్లుతో ఉపమించుటయేల?

ఉప్పుతో సాటియగు స్వచ్ఛమైన, బాహ్యాంతరములలో ఏకరూపమైన, అన్నిటిలోను అంతర్లీనముకాగల, అన్నింటికి అవసరమైన, ఎప్పటికి స్వస్వరూప విచ్ఛిత్తిలేని, భిక్షకునికిమొదలు బ్రహ్మాండాధిపతివరకు అందుబాటులోయున్న అందరికి అత్యావశ్యకమైన, మిగతవానికి తనసత్తపై ఆధారపడి యుండునటుల చేయకలిగిన, స్వతః ప్రాప్తమైన, తనకు తానే కారణమై, ఏ రూపములో యున్నను తన స్వభావమును విడువకుండనట్టి, రుచు లన్నింటికి ఆధారభూతమైన తన స్వరూపమును మార్చుకొని యితరములకు అభేదాతిశయమును కలిగించు నట్టి ఇట్టి అసంఖ్యేయములైన గుణగణములు గల వస్తువు మరొకటి లేదు కదా. ఉప్పునకు ఉప్పేసాటి నీకు నీవే సాటి. నీ ప్రేమకు నీ ప్రేమయే సాటి.

---

## రామానుజవైభవము

కోగంటి సీతారామాచార్యులుగారు, అల్లూరు.

శా. శ్రీమద్వైష్ణవ సంఘమెల్ల నినుసంసేవించి వైకుంఠ ల
క్ష్మీమాహాత్మ్యతనందు నైహికమునన్ శ్రీమంతమై సర్వ సౌ
ఖ్యామోదమ్ముల నందుచుండునని విద్యాసాగరుల్ బల్కు నో
స్వామీ దాసునిగూడ నట్లెగని విశ్వాసించు రామానుజా ॥ 1

మ. జనముల్ మూర్ఖగతిన్ చరించునెడ విజ్ఞానమ్ము సంధింప భూ
మిని జన్మించి త్వదీయసన్మతము గంభీరమ్ముగా శాంత వృ
త్తిని క్షేమంకరమైన పద్ధతిని బోధింపంగ రాజ్యమ్ము లం
దున, రాజుల్ గనిమెచ్చ నీమతము గొల్చున్ భక్తి రామానుజా॥

శా. “జీవాత్మే పరమాత్మ” యంచును మహాక్షేపమ్ములం జేయుచో
నానావాదమ్ముల యుక్తి యుక్తముగ మిథ్యాభూతముల్ జేసి యా
శ్రీవైకుంఠ నివాసుడీగతిగ భూరిప్రౌఢ వాదార్భటిన్
నీవే నిక్కపుపూన్కి గెల్చితివి తండ్రీ స్వామి రామానుజా ॥ 3

మ. పరమామ్నాయపు సారమెల్ల నొక శ్రీభాష్య స్వరూపమ్ముగా
పరవాదుల్ సభలన్ జితాస్మ యనగా వాదించి శ్రీవైష్ణవ
స్థిరతన్ బాదుకొనంగజేసితివిగాదే యట్టి నీగొప్ప నీ
కరుణన్ నేనెటుసంస్మరింతు వినతత్మోపాల రామానుజా ॥ 4

మ. పరమోత్కృష్టమునై శుభప్రదమునై వాత్సల్యభావమ్మునై
కరుణావాసమునై సహస్రరిపురేఖాకాననజ్వాలయై
స్థిరమై బౌద్ధమతాగ్ని మేఘమయి యుద్దీపించునీమార్గ మి
ద్ధర నాచంద్రముగాగ నేనెపుడు నిర్ధారింతు రామానుజా ॥ 5

శా. కాలమ్మంతయు వమ్ముజేసికొని దుష్కాంతాప్రధానాత్ములై
లోలత్వంబున నీభవాంబు నిధికల్లోల వ్యథాచిత్తులై
కాలప్రేరితులై మునుంగ గని యుత్కంఠన్ మహాప్రేమతో
నాలోకించి వికుంఠమంపితివిగాదా నీవు రామానుజా ॥ 6

శా. నీ విద్యావిభవమ్ము నీప్రతిభ నీ నిర్వ్యాజమౌ ప్రేమయున్
భావింపన్ మముబోంట్ల నెల్ల నిపుడే వైకుంఠమున్ జేర్పగా
నీవేదైవమటంచు సద్గురుడుగా నిత్యమ్ము నీధ్యానమే
గావింజాల సమర్థమంచెపుడు మ్రొక్కంజాలు రామానుజా ॥ 7

మ. హృదయమ్మందున శాంతిలేదు విధులేకృత్యమ్ములాలేవు నె
మ్మది విజ్ఞానములేదు కోవిదులు సంభావించు పాండిత్య మ
న్నది పూజ్యమ్ము కవిత్వమిల్లియగు నెన్నన్ మూర్ఖత మాత్రమే
పదిలంబాయెను మోక్షమే విధిగ సంపాదింతు రామానుజా ॥

మ. విలసద్భావ పరంపరల్ పరగనిర్వీక్షించి వర్ణింప మ్రొ
క్కులు బల్ మ్రొక్కితి నేటికయ్యదియెట్లోనాకున్ ప్రాప్తమాయెన్ కవీ
శులు విద్వాంసులు గూడ నెప్పుడు వచించన్ నీమహాత్త్వంబు నే
కలముంబట్టి తదీయసూక్తులనె వక్కాణింతు రామానుజా ॥

# యతిరాజవిజయ నాటకమునందలి కొన్ని చక్కని శ్లోకములు

శ్రీ ఉ. వే. శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులుగారు



శ్లో. ధ్యాయన్ సత్య మనన్త మస్త రజడం బ్రహ్మ రవిన్దేక్షణం ।
నిష్క్రమ్యాశు సుషుమ్నయైవ కృపయా నిర్ధూతమాయాతమః ।
విష్ణో స్తత్పద మేత్య తత్ర పరమవ్యోమ్ని స్వయం చి త్స్వరాట్ ।
భుఙ్క్తే తేన విపశ్చితా సహ మహానన్దా ననన్తా న్బుధః ॥

ప్రాజ్ఞుడు, సత్యమై, యపరిచ్ఛిన్నమై స్వయం ప్రకాశమై, పుండరీకములవంటి నేత్రములు గలిగియున్న పరబ్రహ్మను మనస్సునందు ధ్యానించుచు సుషుమ్న యనబడు నాడీమార్గమున వెంటనే బైలుదేర భగవ దనుగ్రహముచే ప్రకృతి బాధను ఛేదించుకొని యా ప్రసిద్ధమైన శ్రీవైకుంఠపురమున జేరి యచ్చట జ్ఞానస్వరూపుడై, కర్మపరతంత్రుడు గాక స్వతంత్రుడగు సర్వేశ్వరునితో గూడి యసంఖ్యాకములగు మహానందముల ననుభవించు చున్నాడు.

శ్లో. యః ప్రత్యక్చ సృజన్ పరాఞ్చ చ మహాభూతాని రక్షన్ హరన్ ।
క్రీడ త్యద్భుతదివ్యమఙ్గళగుణః శ్రీమా ననాదిః పుమాన్ ।
సర్వం కర్తు మకర్తు మప్యపరథాకర్తుం సమర్థోఽపి సన్ ।
వ్యాజం కిఞ్చి దపేక్ష్య రక్షతి జగ ద్విశ్వవ్యవస్థాపకః ॥

లక్ష్మీవిశిష్టుడును, అత్యద్భుత కల్యాణ గుణములు కలవాడును, సకల అనాది పురుషుడైన సర్వేశ్వరుడు, సకల చేతనులను అచేతనములను మహాభూతములను సృష్టించును హరించుచు క్రీడించును. ప్రపంచముల మర్యాదల నేర్పరచు నా పరమ పురుషుడు చేయుటకును, మానుటకును తారుమారు గావించుటకును సమర్థుడయ్యును నేదో యొక మిషను గల్పించి ప్రపంచమును రక్షించును.

శ్లో. కర్మవ్యాజకృతాఖిలాత్మ నివహ క్లేశావబోధ స్ఫుర ।
త్పశ్చాత్తాప కృపావిమోచిత జగజ్జన్మాది లీలాదరం ॥
భోగైకప్రవణం విధాస్యతి పరంబ్రహ్మాపి దత్తాభయో ।
భూతేభ్యో యతిరాజ ఏష ఇతి మే చేత స్సభూ న్నిశ్చయః ॥

ఈ మాయతిరాజులు, ప్రాణులందరకు నభయ మొసంగి పరమాత్మను—తాను జనుల కర్మలను మిషగా గొని నిఖిలాత్మవర్గమునకును కల్పించిన దుఃఖముల గాంచి పశ్చాత్తప్తుడై దయా పారవశ్యమున (ఛీ ఇక నెప్పుడు నిట్టి సృష్ట్యాది వ్యాపారముల చేయరాదని విరక్తితో) సృష్ట్యాది లీలావ్యాపారముల యందాదరము లేని వానినిగా జేసి, కేవల భోగలాలసునిగా జేసివేయునని నామనమున నిశ్చయ ముదయించెను.

(యతిరాజులే యాదరకును మోక్ష మొసగుదురని భావము)

(4 వ పేజీ తరువాయి)

(మెల్లమెల్లగా దగ్గరజేరి) ఓ మాయా-మరచితిని-యథార్థవాదీ! సన్యాసి చక్రవర్తి నానెత్తిని చేయిబెట్టి నీవే నిజమును జెప్పుము. స్వానుభవ సిద్ధమును స్వయంప్రకాశమును నగు మన యద్వైతబ్రహ్మ తాను సిద్ధించుటకు హేనినైన నొకప్రమాణమును నపేక్షించునా? అపేక్షించిన దానికి గోచరించును గాన మన బ్రహ్మ మిథ్యయే కావలసివచ్చును. (గట్టిగా నవ్వి)

దృశ్యమగు వస్తుజాతమంతయు జడమును మిథ్యయును గాన నాపరబ్రహ్మ దృశ్యమెన్న డును గాడను నీవు తీసికొనిన గోతిలో నీవేపడుదువు.

మరియు నదియేకాదు. నిజముగ జెప్పుము. నీకుముక్తి యెట్టిది?

న సాధ్యా బ్రహ్మచేన్ముక్తిః తదన్యాచే న్మృషైవవా ।

ముక్తి శూన్యస్య వేదాన్త సంపదస్తే కవేస్స్రజః ॥

బ్రహ్మయే మోక్షమందువా ఆ బ్రహ్మనిత్యము గాన ముక్తి సాధింపబడునదియేగాదు. అంతకంటె వేరందువా అదిమిథ్యయే యగును. బ్రహ్మకంటె వేరగునవన్నియు మిథ్యయని గదా నీ సిద్ధాంతము). అట్టితరి ముక్తియే మృగ్యమైన నీకు కోతికి పుష్పమాలవలె వేదాంతసంపద లేటికి?

మాయా:— (సిగ్గుతో తలవంచుకొనును)

రాజు:—(ఆనందముతో) ప్రియరంగడు నిజముపల్కెను.

మాయా:—(తనలో) ఈ దుర్మార్గుడు నన్నన్నివిధముల వంచించివేసెను.

రంగప్రియుడు :— (ఆనందముతో భుజమును కొట్టుకొని గర్జించుచు ఎగురును)

భాస్కరయాదవులు :—(ఆనందాశ్చర్యములచే నుదయించు నవ్వును లోలో నడచుకొనుచు)

ఓ! వందివటుడా! మహాప్రోడవైతివే! ఐనను ప్రధానమంత్రిశేఖరుని పరాభవించుటకు మేరలేకున్నదే ఏమనుకొనుచున్నావో—

ఈతనికి బృహస్పతి యొక్క గడ్డిపరకే వితండవాదములో ముల్లోకములయందును సాటిలేని పేటి (వితండము = తనపక్షమును స్థాపించక పరపక్షమును మాత్రము నిరసించువాదము) కప్పలవలె వదరుచున్నను పరులను సరకుగొనడు. మత్తగజ కుంభస్థల ఫాలన లీలాపార వశ్యమున నిక్కబొడుచుకొనిన జూలుతో నలరారు సింహమేసుమా యితడు.

ప్రియ :—(నోరుమూసుకొనియుండి) ఏమైన ననుకొననిమ్ము.

రాజు :—పుణ్యులారా! మహాయతి నతిక్రమింపరాదు సుడీ!

ప్రియ :—దేవా! మేము సన్న్యాసులము, సన్యాసి అల్ప ఆయతిని గూడ నతిక్రమింపడు. (ఆయతి = ఉత్తరఫలము) మహాయతి నేల యతిక్రమించును?

మాయా :—(కోపముతో) రాజా! వైతాళికుల మిథ్యాప్రసంగములకు మోసపోయి సన్యాసులమగ

మమ్మేల పరాభవింతువు ?

ప్రియ :—ఓ సర్వప్రపంచ మిథ్యావాదీ! నీకు సత్యప్రసంగములు కూడ కొన్నియున్నవా ?

మాయా :—(తనలో) వీరు సకల రాజ సభలయందును సంచరించుటలో దిట్టలు. వీరిని లాలనజేయుటకంటె నాకు వేరొక ప్రత్యుత్తరము తోపకయున్నది. (పైకి) బిడ్డలారా! మీమాటల నేర్పునకు మెచ్చితి. పాపము! మీరు పిల్లలును పాటకులును మిమ్ములనందరును గౌరవించవలెను. మీగురువగు రామానుజునకు నేను త్తరమిత్తును లెండు, మీరు పొండు.

ప్రియ :—(కోపముతో) నేనుండగా నీకు మా యాచార్యప్రసంగమేల ? చెప్పుని గుచ్చుకొని పోయుగదా ముల్లు పాదమును గుచ్చుకొనవలెను.

రంగ :—(చిరునవ్వు నవ్వి) మిత్రమా! సొమ్మసిలిన వీనితో నీకేమిటిరా ? పరిమళ విహీనమగు పువ్వునెవ్వడైనను తలను దాల్చునా ?

రాజు :—(భాస్కరయాదవులతో) సరి, మీకనుష్ఠానవేళ యతిక్రమించుచున్నది. ప్రధానమంత్రిని పురస్కరించుకొని దయచేయుడు. మరియు– వందులు నిందించినను, స్తుతించినను రాజకుల వాసులు–అందును విశేషించి విరాగులైన మీవంటివారు వారిమాటల పాటించరాదు.

మాయా :—తమరును నట్లే భావింపవలెను. (అని భాస్కరయాదవులతో నిష్క్రమించును).

రాజు :—(యామునులను లేచుచుండుట చూచి గౌరవముగా) పూజ్యా! ఒక్కక్షణము క్షమింపవలెను. కాంచీపూర్ణుల యాదేశము తమకు సంకెలయగుచున్నది. (ఆలోచించి) వైతాళికుల మాటను వినిన పిమ్మట నేనేమో మారినట్లున్నాను.

యాము :—(నవ్వి) నీ వెన్నడును మారవు. రాహువు మ్రింగిన చంద్రుడట్లే యుండిపోవునా ?

రాజు :—(ఆశ్చర్యముతో) బురదలోనుండి తీసి బాగుగా కడిగి నిర్మలమైన సన్నని బట్టతో తుడచిన రత్నమువలె నేడు నన్ను నిర్మలముగా గాంచుచున్నాను.

యాము :—(వైతాళికులను చేతితో పట్టుకొని) బిడ్డలారా! రామానుజుల మతి నీతుల ప్రభావము నంతను తెలిపితిరిగదా!

రాజు :— సందేహమేమి ? బింబము యొక్క సౌందర్యమునకు ప్రతిబింబమే ప్రమాణము. పూజ్యుడా! తమ విద్యావైపుణ్యముచే రామలక్ష్మణులవలె తమ గురువును ప్రకాశింపజేయుచున్న వీరలెవ్వరు ?

యాము :—బిడ్డలారా! బ్రహ్మవేత్తయగు నీరాజునకు నమస్కరింపుడు.

రంగ :—వాధూలగోత్రజుడనగు దాశరథి నిదే నమస్కరించుచున్నాను.

ప్రియ :—వాత్స్యగోత్రోద్భవుడనగు సుదర్శన వరదవిష్ణు విదే నమస్కరించుచున్నాను.

రాజు :—(ప్రేమ కౌతూహలములతో) ఎవరులేనిచో రామానుజులు సన్న్యాసియే కారందురో వారేనా వీరు ?

యాము :—మరేమి ?

రాజు (—వత్సలారా! యతిరాజానుగ్రహపాత్రులు కండు. (ఆలోచించి, మంత్రి కోపముతో నేగెనని కలతజెందుచున్నాను.

యాము :—దేవా! అట్లు భయపడకుము. పాము గరుత్మంతునియొక్క రెక్కపాటువల్లనైన దెబ్బను సహించునా ? ఏనుగు సింహగర్జనమునైన వినజాలునా? అట్లే యీమంత్రి సహింపశక్యము గాని రామానుజుల లేశమాత్ర ప్రసంగముచేతనే క్షీణగర్వుడై మిక్కిలి భయపడి యెక్కడకో కనబడక దాగియున్నాడు.

రాజు :—(ఆనందముతో) ఇప్పటికి స్వస్థత జెందితిని.

యాము :—దేవా ! వైతాళికులయం దనుగ్రహముంచుడు.

రాజు :—(ఆలోచించి) నా యాత్మను సమర్పించుటకంటె వీరి కర్హమైన దేదియు నాకు గోచరించుట లేదు.

వైతా :—(ఆనందముతో) ప్రభువు కింకరులకు సర్వస్వమే గదా ?

(అందరును నిష్క్రమింతురు.)

---

## యతిరాజ భజన కీర్తనలు.

కవితావతంస, గానకళానిపుణ, హరికథాచతురానన

కరి నారాయణాచార్య భాగవతార్.

శ్రీరంజని — రూపకము

1. శ్రీరామానుజమునీంద్ర ! శ్రితజనవాత్సల్యసాంద్ర !
చారువక్త్రవిజితచంద్ర ! సకలవిబుధనుతసుధీంద్ర !

2. శ్రీశునాజ్ఞఁగైకొనియా, శేషుని యంశమున భువిని ।
కేశవార్య సూరివరుని, గేహమున జనించితివో ॥

3. శ్రీభూతపురమున నీవుచెలఁగి యవతరించినపుడు ।
శోభితగృహముల జనములు శోభనాత్ములై వెలసిరి ॥

4. అమితహర్షమంది కేశవార్యుఁడు పుత్రోత్సవమును ।
సముచిత గతి భాగవతోత్తములకు నర్పించెనపుడు ॥

5. లోకహితముఁగోరి నీవు, లోకమున జనించినావు ।
శ్రీకరినారాయణార్య, సేవిత చరణాంబుజాత !





## నారీ విభాగము

శ్రీమతే రామానుజాయ నమః

# తిరుక్కోళూర్ పెణ్ పిళ్ళైరహస్యము

(రచయిత :-శ్రీమద్భాగవత శ్రీపాదరేణువు, మదరాసు.)

తిరుక్కోళూర్ పెణ్ పిళ్ళై ఎంబెరుమానారులతో యిటుల యనెను.

## మొదటివార్త

### భాగవతము

అరవము॥ అళైత్తు వతే నెన్నేనో, అక్రూరరై ప్పోలే ॥

తెలుగు॥ తోడితెచ్చెద నన్నానా, అక్రూరుని వలె ॥

### వివరణము.

కంసుడు అక్రూరుని బిలచి యిటులనెను.

ఆ॥ సఖుల తోడ భూమిచక్రి మేలెద బొమ్ము ।
తెమ్ము నేగమ్మె వసుదేవసుతుల ।
మఖము పేరు జెప్పి మంత్రిభేదము సేయు ।
వలయు బెంపజనపు వైరిజనుల ॥ [భాగవతము]

అక్రూరులు. ఉ॥ పంపిన బోనివాడనె నృపాలక మానవుడైన తమ్ము నరా ।
హింపరు దైవయోగముల నించుక గానరు. శోచిస్తు ని ।
ష్కంప గతిఁ జరింతు రది గాదనవచ్చునె ఈశ్వరేచ్ఛ న ।
ప్పింపగ రాను నీపగతు బిడ్డల దెచ్చెద బోయివచ్చెదన్ ॥

అనుచు శ్లో॥ "అద్య మే సఫలం జన్మ సుప్రభాతా చ మేనిశా" ।

అ॥ కంసుని అన్నమును తిని జీవించిన నాకిప్పుడే తెల్లవారినది. అని కదా అక్రూరుడు ప్రాప్యములో రుచిగలవాడై శ్రీకృష్ణబలరాములను తోడితెచ్చుటకై వెళ్ళుచూ బృందావనము కడకు పోవుచుండగా

చం॥ ఎట్టి తపంబు సేయబడె నెట్టి చరిత్రము లబ్ధమయ్యె నో।
యెట్టి ధనంబు నర్థులకు నీబడెనో తొలిబామునందు నా।
యట్టి వివేకహీనునకు నాదిమునీంద్రులు యోగదృష్టులం।
బట్టగ లేని ఈశ్వరుని బ్రహ్మమయుర్ హరి జూడ గల్గెడిన్॥

చం॥ మాపటివేళ నేను జని మాధవు పాద సమీపమందు దం।
డాపతితుండనైన నత డాఘగ కాల భుజంగవేగ సం।
తాపిత భక్తలోక[అ]భయదారుణమైన కరాబ్జమాదలర్।
మోపి హసించి నా కభయమున్ గృపతోడుత నీయకుండునే॥

అనుకొనుచు అక్రూరుడు రథముడిగ్గి భూమిపై పొరలుచు పోయెనే అటుల నేను నిర్భయముగా కృష్ణబలరాముల తోడుకొని వచ్చెదను అని అనగలిగితినా?

## రెండవ వార్త.

మహాభారతము

అ. అగమొళిత్తు విట్టెనో విదురరై ప్పోలే।

తె. అహంకార-మమకారంబులను వర్జించినానా విదురుల వలె.

శ్రీకృష్ణపరమాత్మ దూతకార్యార్థమై హస్తినాపురికి పోయినప్పుడు భీష్మద్రోణాదులందరిని "ఇదెవరి ఇల్లు? ఇదెవరి ఇల్లు?" అని అడుగుతూపోయెనట అందఱు "అస్మద్గృహం" అంటూవచ్చిరట కడపట విదురుని అడిగెనట కృష్ణా! "తవ గృహం" అనెనట అప్పుడు శ్రీకృష్ణపరమాత్మ "హస్తినా పురిలో నాకని ఒక ఇల్లు ఉన్నదా?" అనుచు విదురుని ఇంటిలో దూరగానే విదురుడు అత్యంత సంభ్రమముతో "ఆగతో-ఉపాగతో- గేహముపాగతో-మమ గేహ ముపాగతో" అనుచు

కం॥ నా యింటికి విచ్చేయుము నీ యంఘ్రిసరోజరేణు నికరము సోకన్।
నా యిల్లు పవిత్రింబగు శ్రీయుత నీ భటుని పెద్ద సేయుం దగదే॥

కం. నీ పాదకములసేవయు నీ పాదార్చకుల తోడి నెయ్యమును!
నితాంతాపారభూతదయయును దాపస మందార నాకు దయసేయ గదే॥

అనుచు విదురుడు "సంభ్రమై స్తుష్య గోవింద ఏత న్నః పరమం ధనం" అనుచు భక్తిపరవశుడై కైంకర్యములను జేసెను.

శ్లో॥ భుక్తవత్సు ద్విజాగ్రేషు నిషణ్ణః పరమాసనే।
విదురాన్నాని బుభుజే శుచీని గుణవంతి చ॥

తా! విదురునికి అహంకార మమకారములు ఏమాత్రము లేనందున అతడు పెట్టినఅన్నము

పరమపావనమై భక్తుపహృతమైనది. గనుక పరమభోగ్యములోను అత్యాదరముతోను శ్రీకృష్ణ పరమాత్మ తృప్తిగ భుజించెనట.

శ్లో॥ భీష్మ ద్రోణా వతిక్రమ్య మాం చైవ మధుసూధన ।
కి మర్థం పుండరీకాక్ష భుక్తం వృషళ భోజనం ॥

ఉత్కృష్టవర్ణస్థులైన భీష్మద్రోణాదులు శ్రీకృష్ణుని రాకకై యెదురుచూచుచుండగా, వారింటికి వెళ్ళకుండగ హీనవర్ణస్థుడైన విదురుడు తనయింటికి కృష్ణపరమాత్మ వచ్చునను తలంపునూ లేనివాడై యుండగా పుండరీకాక్షుడైన శ్రీకృష్ణపరమాత్మ వెళ్ళి భుజించెను. ఇందేమిచేత? ఆ భగవద్భక్తుని నిరహంకారతను దెల్పుటకే అని తెలియుచున్నది.

ఓస్వామీ! నేను వీరివలె అహం-మమతలను సమూలముగా వదలినానా? అని తిరుక్కోళూర్ పెణ్‌బిళ్ళై ఎంబెరుమానార్లతో అనెను.

శ్రీఎంబెరుమానార్లు తిరుక్కోళూ రను దివ్యదేశమునకు వేంచేయునప్పుడు ఆతిరుక్కోళూరు నుండి వచ్చు నొక స్త్రీరత్నము వీరి కెదురుగా వచ్చి నమస్కరించి నిలువ, అమ్మా! నీ వెచ్చట నుండి వస్తున్నావని ప్రశ్నింప ఆయమ్మయు నేను తిరుక్కోళూరును దర్శించి తిరిగి వస్తున్నానని విన్నవించెను.

తిరుక్కోళూరు వివరము.

తిరువాయ్‌మొళి 6-7.

పా॥ ఉణ్ణుం శోరు పరుగు నీర్ తిన్నుం వెత్తిలైయు మెల్లాం ।
కణ్ణన్ ఎంబెరుమా నెన్రెన్రే కణ్గళ్ నీర్మల్గి ।
మణ్ణినుళ్ అవన్ శీర్ వళమ్మిక్క వనూర్ వినవి ।
తిణ్ణమె న్నిళమాన్ పుగు మూర్ తిరుక్కోళూరే ॥

తా॥ భుజించు ప్రసాదమును త్రాగునట్టి జలమును నములునట్టి తాంబూలమును ఇవన్నియు శ్రీకృష్ణుడే యని పలుమారు చెప్పుచు దుఃఖాశ్రువులను విడుచుచు భూమియందు శ్రియఃపతి యొక్క కల్యాణ గుణములచేతను, సంపత్తుచేతను పరిపూర్ణమైన వానియొక్క దివ్యదేశము నడుగుచు నా చిన్నది ప్రవేశించెడి దివ్యదేశము తిరుక్కోళూరే ఇది నిశ్చయము అని శ్రీనమ్మాళ్వారు తల్లి అవస్థ ననుకరించిరి.

తిరుక్కోళూ రను దివ్యదేశము 108 దివ్య తిరుపతులలో నొకటి ఇది "నమ్మాళ్వారు మంగళాశాసనము చేసిన నవ తిరుపతులలో నొకటి "ఆళ్వార్ తిరునగరికి" తూర్పుగా 1½ మైలు దూరమున నున్నది. నవనిధులు యిచ్చట దాగియుండునట్లు "అధర్మ దేవత" కుబేరునకు శాపము



శ్రీమతే రామానుజాయ నమః

# యతిరాజసేవా మహిళామండలి శుక్రవారోత్సవ వార్షికసభలు

**బందరు, : : గొడుగుపేట.**

ఈనెల 9-8-51 నుండి 11-8-51 తారీఖు వరకు బందరు గొడుగుపేట పాతచల్లరస్తా వేణుగోపాలస్వామి కోవెలలో మహావైభవముగా జరిగినవి కేవలము స్త్రీలే యీసమావేశములను అతినిపుణతతో జయప్రదముగా నిర్వహించిరి. 9 వ తారీఖు సాయంత్రం గం. 4 నుంచి రాజుపేటలో వృద్ధ సంఘాధ్యక్షురాలగు శ్రీపతి శీతమ్మగారి యింటివద్దనుంచి చినముత్తేవి (సూర్యనారాయణ బృందము) సన్నాయి మంగళవాద్యముతో, బ్యాండుమేళములతోను యతిరాజులవారి పటమును చలవ చప్పరములో వేంచేపుచేసి ఛత్రచామరలాంచన లాంఛితులై రామానుజులవారు బయలుదేరగా భాగవతబృందమంతయు ప్రబంధాధ్యయనాదులు భజనలు సల్పుచూ ముందునడువ వెనుక యతిరాజసేవామహిళా భక్తబృందము భజయతిరాజం భజనచేయుచు సుమారు 1 ఫర్లాంగు దూరంగోష్టివ్యాపించి నడుచుచు గం 7 లు అగుసరికి గొడుగుపేట కన్యకాపరమేశ్వరీ సత్రమునకు వచ్చి రామానుజులపటము అక్కడ వేంచేపుచేసిరి. ప్రతిదినము ఉదయంతిరువారాధన సేవాకాలం తీర్థప్రసాదాలు 3 దినములు జరిగినవి. యిందు శ్రీమాన్ జగ్గయ్యపేట మరంగంటి రాఘవాచార్యులుగారు వారికుమార్లు నరశింహాచార్యులుగారు శ్రీనివాసాచార్యులుగారు తిరువారాధన సేవాకాలం తీర్థప్రసాద వినియోగాదులుచేసి భక్తులను సంతోషపర్చిరి.

చెప్పిన చోటు గనుక దీనికి "కోళూరని" పేరు గలిగెను. కుబేరునకు ప్రత్యక్షమైన క్షేత్రము వైత్తమానిధి, లేక నిక్షేపవిత్తుడు, లేక లక్ష్మీకువిశ్వఢని, పెరుమాళ్ళకు తిరునామములు. కోళూర్ వల్లి నాచ్చియార్ లేక ప్రగుమూర్ పల్లిత్తాయార్లని తాయార్లకు తిరునామములు. ఇది శ్రీమధురకవి ఆళ్వార్ల అవతారస్థలము.

తిరుక్కోళూర్ దివ్యదేశమునకు శ్లోకము.

శ్లో॥ శ్రీతేజస్థాన నిలయం శేషశాయిన మచ్యుతం ।
నిక్షిప్తనిధి నామానం పక్షిరాజ ప్రియోదయం॥

నిక్షిప్తము-లేక-నవనిధుల వివరము.

1. పద్మం 2. మహాపద్మం 3. శంఖం 4. మకరం 5. కచ్ఛపం 6. ముకుందం 7. కుందం 8. నీలం, 9. వరం అని నవనిధుల పేర్లు.

స్త్రీరత్నము యొక్క మాటవిని ఎంబెరుమానార్లు చాల సంతసించి "అమ్మా నీవు చాల ధన్యురాలవు" అనిరి. గాని అందరు నిత్యనివాసముచేయు దివ్యదేశమును సేవించుకొని తిరిగి వచ్చి వేయుచున్నావే, అనిరి. ఆవార్తను విని ఆ భక్త శిరోమణి దిగువ వివరించు 81 మంది భక్త శ్రేష్ఠులను తెలుపుచు, "స్వామీ ఇట్టి మహాత్ములయొక్క జ్ఞానములలో ఒక్కరి జ్ఞానమైనను దాసురాలికి ఉండినయెడల నేను తిరుక్కోళూరిలోనే వాసము చేయగలిగియుండును. అట్టి జ్ఞానము నాకు లేదు. నావలన ఆదివ్యస్థలమున కేమి కైంకర్యము కాగలదు స్వామీ. తమవంటి ఆచార్య సుధీమణులు వెళ్ళి మంగళాశాసన మొనర్చినట్లైన వైత్తమానిధికిన్ని మధురకవులకును నిత్యోత్సవ పక్షోత్సవ మాసోత్సవ అయనోత్సవ అబ్దోత్సవ పవిత్రోత్సవ పల్లవోత్సవ బ్రహ్మోత్సవాదులు జరుగునని ఆమె విన్నవింపగా ఎంబెరుమానార్లు ఆమెను కటాక్షించి ఆమె తిరుమాళిగెను వేంచేశి తళిహచేయమని తామారగించి తళిహప్రసాదమును శ్రీపాదతీర్థమును సాయించి ఆమెకు తిరుక్కోళూరు పెణ్ బిళ్ళై అని తిరునామముంచిరని తిరువాయ్ మొళ్రిప్పిళ్ళై వచించునట్లు పెద్దవానమామల జియ్యర్లు కటాక్షించిరి.

– జీయర్ తిరువడిగళే శరణం –



# పరమపదాధికారమెవ్వరిది?

మరింగంటి రంగనాయకమ్మగారు.

ఆకాలమున శ్రీవైష్ణవ సమృద్ధితో నలరారు మహానుభావులు నంబిళ్ళగారు వారు శ్రీరంగమందొక చిన్న తిరుమాళిగలో నివసించు చుండిరి. కాని వారికది బొత్తుగ నిరుకై యుండెను. దానికి ప్రక్కగనే యొక ముదుసలికి కొంత స్థలముండెను. ఆమెయు నంబిళ్ళ కంతరంగశిష్యురాలే యగుటచే నొక నంబిళ్ళ శిష్యుడే యగు శ్రీవైష్ణవుడామెను పరిపరి యాస్థలమును నంబిళ్ళకు సమర్పించమని నిర్బంధించుచుండెను. కాని యామె శ్రీరంగములో నీపాటిస్థలమైన నెరికి చిక్కును? గాన నేను బ్రతికి యున్నంత కాల మీస్థలము నెవ్వరికివ్వనని ఖండితముగా జెప్పివేసెను. ఆసంగతి నంబిళ్ళకు తెలిసి యామెను రప్పించి అమ్మా! నీ కొక్కదాని కెంతచోటు కావలెను? పెద్దలు నివసించుటకు కొంచెము స్థలము నీయరాదా? యనిరి. అదివిని యామె 'స్వామీ! అందుల కభ్యంతరమేమి? నాస్థలమంతయు మీరే గ్రహింపుడు. కాని నాకు మాత్రము పరమపదములో నొక గజము స్థలమును తమరు ప్రసాదించవలెన'ని విన్నవించెను. అంత నంబిళ్ళ 'ఓసీ యింతయేగదా నీ కోరిక అట్లే యిత్తుము తీసికొనుమ'ని పరిహాసముగా పల్కిరి. ఆమెయు 'నాతండ్రీ! నేనబలను చదువురాదు. గడసుకాయనుగాను గాన మాట మాత్రమే నాకు చాలదు. వ్రాత మూలముగా నుండవలెనని మనవిజేసుకొనెను. వారందులకు సంతసించి నొకకాగితమును తెప్పించి

ఫలానసంవత్సరము, ఫలానమాసము, ఫలాన తిథి, ఫలానవారమున పరమపదనాథునకు తిరుక్కలికన్ని దాసుడు వ్రాసుకొను విన్నపము

ప్రభూ! దాసుడీ నాటితోను పరమపదమున నొక గజము స్థలమును విక్రయించితిని. ఈ క్రయమును చెల్లించి ఆస్థలమునిప్పింప గోరుచున్నాను

ఇట్లు మీపాదసేవకుడు-

తిరుక్కలి కన్నిదాసర్

అని సంతకము చేసి ఇచ్చిరి. ఆమె సంతోషముతో నాయుత్తరమును శిరసావహించి తన స్థలమునంతను వారికి స్వాధీనపరచి తీర్థప్రసాదముల పరిగ్రహించి రెండు దినములు నంబిళ్ళగారిని సేవించుచు సుఖముగ నుండి మూడవ దినమున పరమపదించెను.

కావున పరమపదాధికార మాచార్యులదే యని సిద్ధాంతము.



    

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ

ఆషాడమాస పండిత పరిషత్సభాహ్వాన సంఘము యొక్క అధ్యక్షులగు

శ్రీమాన్ పైండా శ్రీరామకృష్ణయ్య జమీందారుగారి

# స్వాగతోపన్యాసము



(తూర్పుగోదావరి జిల్లాలోని కాకినాడ పట్టణమున శ్రీ వేణుగోపాలస్వామివారి సన్నిధిలో స్వస్తిశ్రీ ఖరనామ సంవత్సర ఆషాడ బహుళ తదియ శనివారము (21-7-1951)న జరిగిన శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ ఆషాఢమాస పండిత పరిషత్సభాహ్వాన సంఘాధ్యక్షులగు శ్రీమాన్ పైండా శ్రీరామకృష్ణయ్య జమీందారు గారిచ్చిన స్వాగతోపన్యాసము.)

భక్తశిఖామణులారా! సోదరసోదరీమణులారా!

నేడు చాల సుదినము. వివిధప్రాంతములనుండి ఈ మహాసభకు భక్తాగ్రగణ్యులను ఆహ్వానింపగల అత్యుత్తమపదవికి నన్ను నియమించినందులకు నేనెంతయు కృతజ్ఞుడను. వేదాంతవిషయమున ఆరితేరిన ఈ సభ్యుల సమక్షమున వక్కాణింప సాహసించినందులకు నన్ను మన్నించెదరు గాక.

## గీర్వాణవిద్యావశ్యకత

ప్రస్తుత పరిస్థితులనుబట్టి చూడగా మనదేశమునందు ఉత్తమవిద్యయే పూర్తిగా నశించినదని చెప్పవచ్చును. పూర్వము ఎన్నియో శతాబ్దముల నుండి రాజాధిరాజులు, చక్రవర్తులు మొదలైనవారెందరో తమ యొక్క ఆశ్రయమునందు పండితుల నుంచుకొని గీర్వాణవిద్యను సాధించిరి, అందులకు తగుమైన విధానము ననుసరించెడి పాఠశాలలను, మఠములను, ఇంకెన్నియో సంస్థలను విద్యకై ఏర్పరచి అభివృద్ధి పొందించుచుండిరి. యీకాలమున అన్నియు [illegible] ఆఖరుకు ఈలోకములో కలుగు సుఖములేదు సరిగదా, పరలోకమునకు [illegible] దూరమగుటకు తటస్థించుచున్నది. ఏలనందురా? ఆధ్యాత్మిక తరుణోపాయమైన విషయములన్నియు గీర్వాణభాషయందే పూర్వులచే రచియింపబడియున్నవి.

వీనిని తెలుసుకొనుటకు, నేర్చుకొనుటకు, అనుష్ఠించుటకు తగు ప్రోత్సాహము లేక [illegible] వరకు క్షీణదశకు వచ్చినదనుటకు సందేహములేదు. అయినను మన భారతదేశమున ఆధ్యాత్మికాభ్యున్నతి గొప్పతనమును బొందలేదు, ఆధ్యాత్మిక విద్యావిధానమునకు అన్నివిధముల అత్యావశ్యకమైన గీర్వాణభాషకు ప్రతి ఆస్తికుడు తన శక్తికొలది అన్నివిధముల పాటుపడవలెను.

## కర్తవ్యము

ఇప్పటి మనయొక్క పరిస్థితి పూర్వులకంటె నీచాతినీచమైన మార్గములు [illegible] మనము కొంతవరకైనా తుదకు ఏఒక్కక్షణమైనా భగవంతుని స్మరించి [illegible] ఇహలోకసౌఖ్యమే పరమపురుషార్థమని నమ్మి అనేకవిధములైన చెడుమార్గములందు [illegible] చున్నాము. సోదర సోదరీమణులారా! కాలము మహావిలువ గలిగినదియునుగాక, ఒకక్షణమును [illegible] తిర్గి రాజాలదు. మనము ఏకార్యము చేసిననూ ఈలోకములోనే, ఈశరీరముతోనే చేయవలసియున్నది. పరలోకసాధనమైన కార్యము ఈలోకముననే చేయవలసియున్నది.

శ్లో. వర్షార్థ మష్టౌ ప్రయతేత మాసాన్ । నిశార్థ మర్థం దివసం యతేత ।
వార్ధక్య హేతో ర్వయసా నవేన । పరత్రహేతో రిహ జన్మనా చ ॥

మనకు దేహములు శాశ్వతము గావుగదా, గనుక అందరము మోక్షోపాయమును తెలిసుకొని ఈదేహావసానమున సుఖించ ప్రయత్నింతుము గాక.

(వర్షాకాలము నాలుగు మాసములు సుఖించ దలచినవాడు అందులకు వలయువస్తు సామగ్రి [illegible]ంతను మిగత ఎనిమిది మాసములు కష్టపడి సంపాదించుకొన ప్రయత్నించవలయును రాత్రిసుఖించ

తలచినవాడు అందులకు వలయు వస్తు సామాగ్రినంతను పగలు కష్టపడి సంపాదించుకొన ప్రయత్నించవలయును.

ముసలితనమున సుఖించదలచినవాడు అందులకు వలయు వస్తుసామగ్రినంతను యౌవ్వన కాలముననే కష్టపడి సంపాదించుకొన ప్రయత్నించవలయును. ఆవిధముగానే ఈదేహావసానమున పరలోకమున సుఖించదలచినవాడు అందులకు వలయు దానినంతను ఈలోకముననే ఈజన్మముననే కష్టపడి సంపాదించుకొన ప్రయత్నించవలయును.

లోకములో పురుషార్థములు నాల్గుగదా. ఈలోకములోనున్నంతవరకు ధర్మము, అర్థము, కామములనెడి మూడుపురుషార్థములను యించుమించు అనుభవించుచునే యున్నాము గాని చతుర్థ పురుషార్థమైన మోక్షమునందు మాత్రము చాలా అశ్రద్ధ చేయుచున్నాము. ఎంతవరకు మనము ఆనాల్గవపురుషార్థముకుపొందలేమో అంతవరకు స్వర్గనరకాదిలోకములనోగల వాటివాటిఫలముల ననుభవించుచూ శ్లో. పునరపి జననం పునరపిమరణం పునరపి మాతు ర్జఠరే శయనం॥ అన్నరీతిగ చచ్చుచూ, పుట్టుచూ, అన్నివిధములైన భాధల ననుభవించుచుండ వలసినదే. అందుచే నాల్గవ పురుషార్థమును పొందదలంచిననూ ఆధ్యాత్మికవిద్యఅత్యావసరము. ఆధ్యాత్మికాభ్యున్నతికి వేదాంత విషయమే ముఖ్యమైనది. కాబట్టి మనకు ఈనాల్గవ పురుషార్థమును కృపచేయుగలవాడు ఒక్క సర్వేశ్వరుడే. వాటిని తెలుపగలవారు జ్ఞాన-భక్తి-వైరాగ్యసంపన్నులగు భక్తులే. కాబట్టి 'పరమాత్మని ఘోరక్తః విరక్తో అపరమాత్మని' పరమాత్మా తిరిక్తమైన పాకృతిక విషయములయందు విరక్తి యున్నగాని పరమాత్మనియందు అనురాగము కలుగజాలదు. సదరు మూడు పురుషార్థములను సాధ్యమైనంతవరకు తగ్గించుచూ ఆధ్యాత్మికాభివృద్ధిని పొందగల్గుటకు సాధనములైన అనేక విధానములను ఈపండితోత్తములవలన గ్రహించి ఆచరించి, యిందుమూలముగా తరించెదము గాత,

జీవుడు పాషాణములలో, చెట్లు చేమలలో, క్రిమికీటక జంతువులలో అనేక అనుభవముల పొంది చైతన్యము వికశించగా అన్నిటికంటెను శ్రేష్టమైన జ్ఞానసాధనమగు మానవశరీరము ధరించును. అందుచేతనే అన్నిటికంటెను మానవజన్మము ఉత్తమమైనది, ఈజన్మమందు జీవునకు స్వతంత్రశక్తికల్గి, నిన్న-నేడు-రేపు అను జ్ఞానమును, తానుచేయుపనులు అందులకు తగిన అనుభవములు తనకు గల్గించునవియనియు తెలిసికొనుటకు అవకాశము కలుగుచున్నదిగాన యిపుడే మనము పరిపూర్ణ జ్ఞానమును సంపాదింపవలెను. ఇదియే మన కర్తవ్యము. ఈప్రపంచము ఒకపాఠశాల వంటిది. ఒక్కొక్కరికి తన ఒక్కొక్క జీవితకాలము కొన్నిపాఠములు, (ఈయనుభవములు) వలన జీవుడు పరిపూర్ణపరిణామముపొందుటకై అనేక జన్మములు పొందును. జీవుడు ఈస్థూలశరీరధారి యగుటయే జన్మము. ఈజన్మలలో కొందరిని మేధావంతులుగాను, తెలివిహీనులుగను, సోమరులు గను, విద్యావంతులుగను, కుంటి, గుడ్డివారుగను, ధనవంతులుగను, బీదవారుగను అనేకవిధములైన వారినిగ మనము గాంచుచున్నాము. ఇదంతయు వెనుకటి జన్మములయొక్క మానస, వాచక, క్రియారూపములైన కర్మల ఫలములై యున్నవి. మనము మంచితలంపులుగలిగి

మంచికార్యములనుచేయు పరోపకారులమై మనజ్ఞానమునుయితరులకు బోధించుచు సత్ప్రవర్తనులమై ఉత్తమజన్మములను పొంది మోక్షమునకు అర్హులమై యుందుముగాక. కాబట్టి బుద్ధిమంతుడైన ప్రతి జీవుడు శ్రమయని యెంచక సర్వదా ప్రయత్నముల జేయుచు, క్రొత్త ఋణములను జేయక సర్వకర్మలను కృష్ణార్పణము గావించుచు,

యత్కరోషియదశ్నాసి యజ్జుహోషి దదాసియత్ ।
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణం ॥

పాతఋణముల తీర్చుకొనుచు "జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతే సదా॥ సత్ప్రవర్తనులై, లోకహితము కొరకైయ్యే జీవించుచు తాము యజ్ఞాన సముద్రమును దాటుచు, యితరులను దాటించుచు, స్వార్థపరత్వమును కామ-క్రోధముల జయించుచు, భగవంతుని పుత్రులగుజీవుల పురోభివృద్ధికై సదా పాటుపడుచు, శాంతి-సామరస్యముల సాధించుచు మనము తరించుచు యితరుల తరుణోపాయములకై పాటుపడుదుము గాక.

గీత. 18-62 తమేవ శరణం గచ్ఛ । సర్వభావేన భారత ।
తత్ప్రసాదా త్పరాం శాంతిం । స్థానం ప్రాప్స్యసి శాశ్వతం ॥

సర్వవిధములచేతను ఆపరమేశ్వరునే శరణజొచ్చుమా! ఆయన యనుగ్రహముచే నిత్యమైన మోక్షమును పొందగలవు. అని గీతాచార్యుడే తెలిపెనుగదా, జగత్ప్రభుడై, మానవకల్యాణమునకై పెక్కురూపములతో అవతరించిన ఆపరాత్పరుడు మనలను శక్తివంతులగను సుస్థిరచిత్తులగను, పవిత్రులగను, నిర్భయులగను, స్వార్థరహితులగను, భగవద్భాగవతాచార్య ప్రేమికులగను మనల నొనర్చి తరింపజేయుగాక.

అందులకు వలయు మార్గముల నీ పండిత ప్రకాండులు మనకు తెలుపుదురుగాక. వారి ప్రచారము దశదిక్కుల వ్యాపించి విశ్వకల్యాణ మొనర్చుగాక యని సర్వేశ్వరుని ప్రార్థించుచున్నాను.

ఓం శాంతిః శాంతిః శాంతిః. ఇట్లు

కాకినాడ
21-7-51

సుజన విధేయుడు,
పైండా శ్రీరామకృష్ణయ్య.

శ్రీమాన్ ప్రెస్, కాకినాడ.



దయయుంచి పండితులు సప్రమాణముగా ఈక్రింది ప్రశ్నలకు జవాబులు

పత్రికా ముఖమున ప్రచురించ ప్రార్థించుచున్నాము.

1. ప్రపన్నులైన శ్రీవైష్ణవులకు గయలోను, బ్రహ్మకపాలములోను పిండ ప్రదానము చేయవలయునా? అవసరము లేదా?

2. చేయవలశియున్నచో మామూలు పితృకర్మ (మృతాది 13 దివసములు) పూర్తియైన తరువాత ఎంతకాలములో చేయవలయును.

3. సంవత్సర సూతకములో చేయవచ్చునా? ఈశ్రాద్ధముల జరిగించుటలో ఏఏ కాలము మంచిది, ఏఏ కాలములు కూడవు?

4. ఈ శ్రాద్ధము జరిగించుటలో భార్య బహిష్టు భార్య గర్భిణి యింటిలో శుభకర్మలు జరిగించియుండుట, యిత్యాదులవల్ల ఆటంకములున్నవా?

5. గయాశ్రాద్ధము, బ్రహ్మకపాలశ్రాద్ధము ఈరెండింటిలోఏది ముందు చేయవలయును, ఏది వెనుక చేయవలయును? ఈక్రమమును తప్పుటలో ప్రత్యవాయ మేమైన యున్నదా?

6. ఈపిండప్రధానముల ఒక పర్యాయమే చేయవలయునా? లేకఅవకాశము చిక్కినప్పుడెల్ల అనేక పర్యాయములు చేయుచుండవచ్చునా?

7. ఒక పర్యాయము చేయుటలోను అనేక పర్యాయములు చేయుటలోను ఫల భేదమున్నదా?

8. గయాశ్రాద్ధమును మాత్రము చేయకలిగి, బ్రహ్మకపాలశ్రాద్ధమునుచేయ జాలకున్నప్పుడు ఏమైన ప్రత్యవాయ మున్నదా?

9. గయాశ్రాద్ధము ఎన్నిదినములు చేయవలయును? ఒకరోజు మొదలు మూడు పక్షములు వరకు చేయు యాచారమున్నటుల మాహాత్మ్యములో యున్నది. ఇందులో ఏపక్షము శ్రేష్ఠము.

10. త్రిగయాశ్రాద్ధము, అష్టగయాశ్రాద్ధము అనువీనిలో ఏది యాచరించుట యుక్తము.

11. గయాశ్రాద్ధభోజనము గయావళులకు మాత్రమే పెట్టవలెనను నియమ మున్నదిగదా? వారిభోజనానంతరమున తిర్గి శ్రీవైష్ణవస్వాములకు సాపాటు జరిగించ వలెనా? అవసరము లేదా?

12. గయావళుల భుక్తశేషమును శ్రాద్ధకర్తలు స్వీకరించవచ్చునా?

13. గయా బ్రహ్మకపాలముల శ్రాద్ధానంతరమున జరిగించుప్రత్యాబ్దికములను పారణవిధానమున జరిగించవలెనా? లేక సంకల్ప విధానమున జరిగించవలెనా?

14. మహాలయపక్షములో గయయందు ఏమేమి యాచరించవలయును.

# శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ శ్రావణమాస పండితసభ.

## (పాదుకాక్షేత్రం — నడిగడ్డపాలెం — కృష్ణాజిల్లా.)



ది 14-8-1951 మొదలు 3దినములు వరంగల్ వాస్తవ్యులగు ఉపన్యాసకేసరి, సుబోధక సుధీమణి శ్రీ ఉ. వే. శ్రీమాన్ కో. కం. రంగాచార్యులగారి అధ్యక్షతక్రింద జగద్విఖ్యాతిని గాంచి పూర్వాచార్యుల సంస్మరింప జేసిన శ్రీశ్రీశ్రీ వాసుదాసుగారి ప్రశాంతాశ్రమమున పై సభ జరుపబడెను. ప్రస్తుత ఆశ్రమనిర్వాహకులుగా నుండి 16 సంవత్సరములనుంచియు అఖండ "హరేరామ" భజనను నిర్వహించుచున్న శాంతమూర్తి శ్రీయుత కో. వెంకటప్పదాసుగారి ఆతిథ్య మానాటి శబరిని జ్ఞాపకము జేసెను.

'శబర్యా పూజిత స్సమ్యక్' ను వాల్మీకిభగవానునినుడి మాకనుభవైక వేద్యమైనది. ప్రముఖులగు పండితులు నానాప్రాంతములనుండియు 15మంది విచ్చేసి తమ వివిధ వేదాంతోప న్యాసములతో భక్తులనానందాబ్ధినోలలాడించిరి. గుడివాడనుండి విచ్చేసిన శ్రీయుత బోయన సీతారామదాసుగారి భజనపార్టీవారు సహజముగ భక్తితో తాము తన్మయముచెంది ప్రేక్షకుల నందరను తన్మయులుగావించుట ఆశ్చర్యావహము.

ఈఆశ్రమ ప్రరామణీయకము, సాత్త్వికవాతావరణము నిజముగ ప్రాచీనమతంగాది మహర్షుల ఆశ్రమములకు ఉదాహరణమై అందరకు నందు నిత్యనివాసాభిలాషసంకు రింపజేసెను.

ప్రముఖులగు హరిదాసులు భక్తిరస భరితములగు కథలతో భక్తులచెవులకు విందొసంగిరి.

ఈమాఘమాసములో జరుపబడు శ్రీశ్రీ వాసుదాసుగారి జయంతీ మహోత్సవ సందర్భమున యీ నిరంతర "హరేరామ" భజనకు శాంత్యర్థమై గొప్పవైదిక ఉత్సవ విశేషమును మనసంఘ యాజమాన్యమును జరుపదలంచినట్లును అదే సమయమున ఆగ్రామములో వేరుగా వేంచేసియున్న శ్రీసీతాలక్ష్మణ సహిత శ్రీ కోదండరామస్వామివారి కోవెలను దివ్యదేశముగావించ దలంచినట్లును శ్రీవెంకటప్పదాసుగారు సెలవిచ్చుట ముదావహము.

ఇంకను వారు తమ ఆశ్రమ నిర్వహణ భారమంతయు మనసంఘమునకే సమర్పించ నిశ్చయించియున్నారు.

అచ్చటకు విచ్చేసిన శ్రీవాసుదాసుగారి భక్తులందరును ఆనూరి జనములును అచ్చట శ్రీవాసుదాసుగారు వేంచేసియున్నట్లే మిక్కిలి భక్తితో ప్రవర్తించుట ఆశ్చర్యమును గొల్పినది.

ఇట్లు,

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘం.

# పరమార్థిక వైష్ణవ విశ్వవిద్యాలయం, బృందావనం.

# (Vaishnava Theological University Vrindaban, Mathura)



ఇంతవరకు నిర్మింపబడిన తాత్త్విక అన్వేషణాలయము (Reseamch Institute) కార్యాలయము (Senate House) గాక శ్రీచైతన్య కళాశాల సంపూర్తిచేయబడెను. ది 12-8-1951 తేదిని హాన్ శ్రీ కన్యాలాల్ మాణిక్యలాల్ మున్షీజీవల్ల గృహప్రవేశము జరిగినది. వనమహోత్సవము గూడ మున్షీ దంపతులచే ప్రారంభింపబడెను. భేదాభేదమార్గముగుండ భక్తివీధి వెంబడిని మహోత్సాహముతో అనేక సాధుజనులు తత్త్వవేత్తలు ఈశుభ ప్రణాళికను దర్శించియుండిరి. పలు తావులనుండి ఆశీస్సులు చేరియుండెను.

ఈసంస్థలో నొకటిగా ప్రముఖపాత్రవహించవలసియుండిన ప్రపన్న కళాశాలయను శ్రీమద్రామానుజీయ సాంప్రదాయక భవనమున కైస్థల నిర్దేశ్యము చేయబడినది. ఈయావరణలో నన్నిమత సౌలభ్యములకంటెను బ్రథమస్థానము నలంకరించవలసినది విశిష్టాద్వైత ప్రచారమని పలువిధములు జ్ఞాపకముచేయదగినది ఇందుకై కేటాయించిన ప్రదేశమున సత్వరము రామానుజ కళాశాల నిర్మితమగునని యాశించబడుచున్నది.

బృందావనమునగల 12 వనములును 24 వుపవనములును, శ్రీకృష్ణభగవానుని చర్యలతో సంబంధించిన 84 క్రోసముల విస్తీర్ణముగల వ్రజమండల పరిక్రమా ప్రణాళిక శ్రీ పరమార్థిక విశ్వవిద్యాలయాధికారులు నిర్వహించబూనిరి. అక్టోబరు 17 తేది మొదలు ఒకనెలవరకు, యీ పరిక్రమాకార్యక్రమము జరుగును. ఇందు పాల్గొనదలచిన భక్తిపరులు ముందుగ శ్రీ డాక్టర్ చి. గంగులి M. B. Bs. రిజిష్ట్రార్ (V. T, University Vrindaban) అని వ్రాసినచో వివరములు తెలియగలరు.

యాత్రికుల వసతిగృహములకును సాపాటునకును ప్రదేశములో చూడతగిన క్షేత్రములకు ప్రయాణసౌకర్యములకును అవుసరమన్న ఔషధసదుపాయముతోను ఏర్పాట్లు చేయబడినవి. పరిక్రమాకాలము ఒక మాసమునకు రు 200 లేక 300 ఖర్చుపడును. కృష్ణచర్యా క్షేత్రములు దర్శించుటకే గాక తన్మహాత్మ్యములు ప్రసంగములు, తత్వవిమర్శనాది కాలక్షేపములు, భజనలు, సంకీర్తనములు, రాధాకృష్ణ విగ్రహతిరునాళ్లు ఇత్యనేక భక్తిపూరిత కార్యక్రమములుండును. ప్రతిదినము నొక్కొక్కచోటునుంచి మరియొక తావుకు మార్చుచు వ్రజభూమియంతయు నొక నెలలో సంపూర్ణ దర్శితమగును.

కాకినాడ.
30-8-1951

ఎం. వి. వి. కె. రంగాచార్యులు

# శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ ఆషాఢమాస పండిత సభ,

# శ్రీవేణుగోపాలస్వామివారి ఆలయము, కాకినాడ.



ఖరనామ సం॥ర ఆషాఢ బహుళ 3 శనివారం (21-7-51) తేదీ మొదలు 3 దినములు కాకినాడలోనున్న శ్రీవేణుగోపాలస్వామివారి దేవాలయమున న్యాయవేదాన్త విద్వాన్ శ్రీ ఉ. వే. శ్రీమాన్ గొడవర్తి శఠకోపాచార్య స్వామివారి అధ్యక్షతక్రింద పై సభ జరుపబడినది. శ్రీయుత బచ్చురామేశంగారి ధర్మసత్రం పండితుల విడిది గృహముగా ఏర్పరచబడెను. ఆసత్రమునకు ప్రస్తుతం ధర్మాధికారిగానున్న శ్రీయుత పైండా కాంతారావుగారు కీ॥ శే॥ పైండా వెంకటచలపతిరావుగారి ధర్మపండునుంచి తీసి పండితులకును దేశాంతరులగు శ్రోతృబృందమునకును షడ్రసోపేతమగు సాపాటు వసతులను కడుంగడు శ్రద్ధతో గావించిరి. దేవాలయ ధర్మకర్తలగు శ్రీయుత పైండా వెంకటచలపతిగారు కూడా ఉపన్యాసవేదిక శ్రోతలవసతులు లైట్లు వగైరా ఉపన్యాసములకు వలయు ఏర్పాటుల నన్నిటిని స్వయముగా దగ్గరనుండి మిక్కిలి శ్రద్ధాభక్తులతో నిర్వహించిరి. కార్యక్రమములో నిర్ణయించిన విధముననే సక్రమముగ పండితులందరి ఉపన్యాసములును జరిగినవి పెక్కుమంది స్త్రీలును పురుషులును సభలో పాల్గొని ఆనందించిరి. శ్రీ ఉ. వే. శ్రీమాన్ కరి నారాయణాచార్య భాగవతారుగారు పండిత పామర రంజకముగా "శ్రీ గోదాకల్యాణమును" హరికథా కాలక్షేపము గావించి శ్రోతల ప్రశంసకు పాత్రులైరి. శ్రీ ఆహ్వాన సంఘాధ్యక్షుల స్వాగతోపన్యాసము ముద్రింపబడి సభలో పంచిపెట్టబడెను. శ్రీమతి వింజమూరి తాయారమ్మగారను విదుషీమణి తమ సహజ మృదుమధుర పాండితీ ధోరణితో స్త్రీల సభలో నుపన్యసించిరి. ఆమె "అర్థపంచకమును" సాంధ్రానువాదముగా అచ్చువేయించు నిమిత్తమై రు 116లు సంఘమునకు సమర్పించుటకు వాగ్దానము గావించిరి. ఇతర విదుషీమణులు కూడ పెక్కురు ప్రతిదినము మధ్యాహ్నము గం 2-0ల నుంచి గం 4-0ల వరకు ప్రత్యేక స్త్రీల సభలో నుపన్యసించిరి. అనూన వైభవముతో నాల్గవదినము సభలు విరమింపబడెను.

ఇట్లు,

శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘము.



శ్రీమతే రామానుజాయ నమః



# భక్తి నివేదన

వేదాంతమాసపత్రిక

| సంపుటి 3 | ఖర — కార్తీకమాసము | సంచిక ౮ |
| --- | --- | --- |

## పాయసవిభాగము

### గీత.

"జన్మ కర్మచ మే దివ్యం ।
ఏవం యో వేత్తి తత్త్వతః ।
త్యక్త్వా దేహం పునర్జన్మ ।
నైతి మామేతి సోర్జున ॥"

తనయొక్క అప్రాకృతమైనజన్మను గూర్చియు కర్మను గురించియు ఎవడైతే సంపూర్ణముగా చక్కగా తెలుసుకొనగలుగునో అట్టివాడు ఈ ప్రాకృతిక దేహమును విడిచి తిరిగి ఈ ప్రాకృతిక జన్మను పొందడు. అప్రాకృత దివ్యమంగళ విగ్రహుడనను, సమస్త కల్యాణ గుణాకరుడనను నైన నన్ను పొందును అని శ్రీకృష్ణపరమాత్మ ఉపదేశించి యున్నాడు.

గాన మనయొక్క జన్మరాహిత్యమునకై శ్రీరామచంద్రునియొక్క జన్మమును గూర్చి స్మరింతము.

"శ్రీమన్నారాయణ"

శ్రీరామావతారము సంపూర్ణావతారము. ఏలననగా లోకములో ధర్మము లుప్తమగుచున్నదనియు, అధర్మము విజృంభించుచున్నదనియు, సాధువుల పరిత్రాణము అవసరమనియు, ధర్మసంస్థాపనము కర్తవ్యమనియు దేవతలందరు శ్రీమహావిష్ణువును ప్రార్థించగా, తాను శ్రీరాముడుగా సపరివారముగా అవతరించెదనని శ్రీమహావిష్ణువు దేవతలకు అభయమొసంగెను.

వెంటనే సప్తఋషులున్ను కామధేనువు యొక్క పాలను పితికి దానిని పాయసముగ తయారు చేసి అందు శ్రీమహావిష్ణువుయొక్క షోడశకళలను ఆహ్వానించి ప్రవేశపెట్టిరి. దానిని ఒక దివ్య పురుషుని చేతికిచ్చి దశరథుని పుత్రకామేష్టి యాగాగ్ని ద్వారా దశరథునికి అందజేసిరి.

దశరథునికి ౩౫౦మంది భార్యలున్నను అందు వేదోక్తముగ వివాహమాడిన పట్టమహిషులు ముగ్గురు మాత్రమే. దశరథుడు ధర్మచింత గల

వాడు. అందుచే ఈ పట్టమహిషులు ముగ్గురికి మాత్రమే ఆదివ్యపురుషదత్తమైన పాయసమును దశరథుడు యథాన్యాయముగ పంచిపెట్టెను.

ఈ విభాగమును శ్రీవాల్మీకి మహర్షి యిట్లు తెలుపుచున్నారు.

బాలకాండ ౧౩–౨౭.

శ్లో. కౌసల్యాయై నరపతిః ।
పాయసార్థం దదౌ తదా ।
అర్ధాదర్ధం దదౌ చాపి ।
సుమిత్రాయై నరాధిపః ॥

శ్లో. కైకేయ్యై చావశిష్టార్ధం ।
దదౌ పుత్రార్థ కారణాత్ ।
ప్రదదౌ చావశిష్టార్ధం ।
పాయసస్యామృతోపమం ॥

శ్లో. అనుచింత్య సుమిత్రాయై ।
పున రేవ మహీపతిః ।
ఏవం తాసాం దదౌ రాజా ।
భార్యాణాం పాయసంపృథక్ ॥

(పాయసస్య అర్ధం పాయసార్ధం అర్ధశబ్ద మిచ్చట సగముభాగము అని అర్థము "అర్ధం సమేంశకే" అని అమరనిఘంటువు.)

దివ్యపురుషుడిచ్చిన దివ్యపాయసమును సరిగా రెండు భాగములుగ జేసి ఒక భాగమును పెద్ద భార్యయైన కౌసల్యాదేవికిచ్చెను. (అర్ధాత్–పృథక్కృత్ అర్ధం–అర్ధాదర్ధం–చతుర్థాంశం) మిగిలిన సగముభాగమును రెండు సమభాగములుగ జేసి అందలి ఒక భాగమును (అనగా మొత్తములో నాలుగవవంతును) దశరథుడు సుమిత్రాదేవి కిచ్చెను. ఇక మొత్తములో నాలుగవవంతు మాత్రము మిగిలియుండెను. (అవశిష్టస్య అర్ధం–అవశిష్టార్ధం–అష్టమాంశం) ఆ మిగిలిన పాయసమును రెండు భాగములుగ జేసి అందలి ఒక భాగమును (అనగా మొత్తములో ఎనిమిదవ వంతును పుత్రుని నిమిత్తమై దశరథుడు కైకేయి కిచ్చెను. ఇక మొత్తములో ఎనిమిదవ వంతు పాయసము మిగిలి యుండెను. నీతిశాస్త్ర విశారదుడగు దశరథుడు చక్కగా ఆలోచించి ఆ మిగిలిన అమృతతుల్యమైన ఎనిమిదవ వంతు పాయసమును సుమిత్రాదేవికి తిరిగి యిచ్చెను. ఈ విధముగా రాజైన దశరథుడు ఆ ముగ్గురు భార్యలకు పాయసమును ప్రత్యేక ప్రత్యేకముగా పంచి యిచ్చెను. అనగా మొత్తము పాయసములో కౌసల్యాదేవికి సగమువంతును (½)–0–8–0 వంతు) ముట్టెను. సుమిత్రాదేవికి పాదార్ధ వంతును (3/8– 0–6–0 వంతు) ముట్టెను. కైకేయికి ఎనిమిదవ వంతును 1/8– 0–2–0 వంతు) ముట్టెను.

అయినచో ౧౮ వ సర్గలోని శ్లోకముల సమన్వయమును కూడ ఆలోచింతము.

కౌసల్యా జనయ ద్రామం ।
దివ్య లక్షణ లక్షితం ।
విష్ణో రర్ధం మహాభాగం ।
పుత్ర మిక్ష్వాకునందనం ॥

భరతో నామ కైకేయ్యాం ।
జజ్ఞే సత్యపరాక్రమః ।
సాక్షా ద్విష్ణో శ్చతుర్భాగః ।
సర్వైః స్సముదితో గుణైః ॥

దివ్యమైన లక్షణములతో గూడుకున్నట్టియు విష్ణువుయొక్క అర్ధాంశభూతుడై నట్టియు, రాము డను పుత్రుని గనెను.

పాదోత్తు విష్ణువైన శ్రీరాముని యొక్క నాలుగవఅంశభూతుడై సమస్త కల్యాణ గుణము లతో గూడుకొని, సత్యపరాక్రముడైన భరతుడు కైకేయి యందు జనించెను. శ్రీరాముడు విష్ణువుయొక్క అర్ధాంశభూతుడు. గాన అట్టి శ్రీరామునిలో నాల్గవవంతు అనగా మొత్త ములో ఎనిమిదవవంతు యగును గాన ఇంతకు ముందు తెలిపిన వానితో ఎట్టి విరోధమున్న లేదు. లేక చతుర్థస్య భాగః–అంశం–చతుర్భాగః అనగా నాలుగవ వంతు యొక్క సమ భాగము అనగా మొత్తములో ఎనిమిదవవంతు అని అర్థమగును. గాన పాదాత్ శబ్దమునకు ప్రత్యేక సార్థక్యమును చెప్పకొనక పోయినను సరిపోవును.

అథ లక్ష్మణ-శత్రుఘ్నౌ ।
సుమిత్రా జనయ త్సుతౌ ।
వీరౌ సర్వాస్త్రకుశలౌ ।
విష్ణో రర్థసమన్వితౌ ॥

అటుపిమ్మట వీరులైనట్టియు,సర్వాస్త్ర కుశ లురైనట్టియు, విష్ణువుయొక్క అంశస్వరూపులై నట్టియు, లక్ష్మణ–శత్రుఘ్నులనెడు పుత్రులను కనెను. (ఈ శ్లోకమందలి అర్థ శబ్దమునకు 'ఇంత భాగము'ని అర్థముగాదు. 'కొంత భాగము' అని మాత్రమే అర్థము–గాన పూర్వశ్లోక విరోధ మేమియు లేదు.

ఇచ్చట ఒక సంశయము మాత్రము కలుగు చున్నది. దశరథుడు పాయసమును మొదట కౌసల్యకిచ్చెను. పిమ్మట సుమిత్రకిచ్చెను. తరు వాత కైకేయి కిచ్చెను. అటుపిమ్మట తిరిగి సుమిత్రకిచ్చెను.

పుత్రులు జనించిన క్రమము మాత్రము దీనికి అనువుగ లేదు.

మొదట కౌసల్యయందు శ్రీరాముడు జనిం చెను. పిమ్మట కైకేయియందు భరతుడు జనిం చెను. తరువాత సుమిత్రయందు లక్ష్మణ–శత్రు ఘ్నులు జనించిరి. కౌసల్యకు దశరథుడు మొదట పాయసము నిచ్చెను. గాన ఆమెయందు మొదట శ్రీరాముడు జనించుట న్యాయమే. తరువాత పాయసము ముట్టిన సుమిత్రకు లక్ష్మ ణుడు జనించవలసియుండగా అటులగాకుండగ కైకేయికి భరతుడు జనించెను. అటుపిమ్మట లక్ష్మణ – శత్రుఘ్నులు సుమిత్రకు జనించిరి. అందుచే పాయస విభాగక్రమము ననుసరించి వీరి జన్మలు కలుగలేదేల యని సంశయము కలుగుచున్నది.

ఇందులకు సమాధానమేమనిన – పాయస విభాగము ననుసరించిగాక పాయస ప్రాశన నను సరించి వీరి జన్మలు కలిగినవి.

ఎట్లన దశరథుడు కౌసల్యకు మొదట సగము భాగము పాయసమును ఇచ్చిన వెంటనే ఆమె దానిని త్రాగివేసెను.

పిమ్మట నాలుగవ వంతు పాయసమును దశ రథుడు సుమిత్రకిచ్చిన వెంటనే ఆమె దానిని త్రాగలేదు. దశరథుడు ధర్మమును తెలిసి పాలించువాడు. కౌసల్య పెద్దభార్య గనుక ఆమెకు సగము భాగము నిచ్చుటయు, నేను రెం డవ భార్యనుగాన నాకు ఆమె కంటె తక్కువగ

నాలుగవ భాగమును మాత్రమే యిచ్చుటయు న్యాయమే–ఇంకను నాలుగవ భాగము మిగిలి యున్నది–యిచ్చుటకు కైకేయి ఒకర్తె మాత్రమే మిగిలియున్నది. అందు మూడవభార్యగాన నా కంటె ఆమెకు తక్కువ భాగము నీయవలెను. ఆమెకు ఈనాలుగవ భాగమునంతను యిచ్చి వేసినచో ఆమెను నన్నును సమానముగ జూచి నటుల అగునే. ధర్మాత్ముడైన దశరథుడీ విషయమున ధర్మమును పాటించునా లేక వాల్లభ్యమునకు వశుడగునా అని సుమిత్రాదేవి తనకు దశరథుడిచ్చిన పాయసమును వెంటనే త్రాగక చేతిలో యుంచుకొని జూచుచుండెను. ఇంగితజ్ఞుడగు దశరథుడు దానిని గ్రహించెను. ఎనిమిదవ వంతు పాయసమును మాత్రమే కైకేయి తన కిచ్చినదానితో తృప్తిపడి, దశరథుడు తనకు పాయసమిచ్చిన వెంటనే త్రాగివేసెను. అందుచే రామునికి తరువాత భరతుడు జనించెను. కైకేయికిచ్చిన పిమ్మట దశరథుడు తిర్గి మిగిలిన పాయసమును సుమిత్రకివ్వబోయెను. సుమిత్ర అప్పుడు తనచేతిలోనున్న పాయసమును త్రాగి వేసి, రెండవపర్యాయము [illegible] చున్న పాయసమును అందుకొని దానిని తిర్గి రెండవమారు త్రాగెను. మొదట త్రాగిన పాయసాంశమున లక్ష్మణుడును, అనుపిమ్మట రెండవమారు త్రాగిన పాయసాంశమున శత్రుఘ్నుడును జన్మించిరి.

గాన పాయస ప్రాశనానుసారముగ మాత్రమే పుత్రులు జన్మించిరి. కౌసల్యకిచ్చిన తరువాత సుమిత్రకిచ్చిన పాయసము వలన లక్ష్మణుడు జనించెను. గనుక లక్ష్మణుడు శ్రీరామునికి అనుచరుడాయెను. కైకేయికిచ్చిన తరువాత సుమిత్రకిచ్చిన పాయసము వలన శత్రుఘ్నుడు జనించెను. గనుక భరతునికి శత్రుఘ్నుడు అనుచరుడాయెను.

దీని ననుసరించియే లోకమున రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులని క్రమ సంకీర్తనము ప్రసిద్ధియాయెను.

## భౌతిక పరత్వము

శ్రీమాన్ యం. వి. వి. కె. రంగాచార్యులుగారు,
అడ్వకేటు, కాకినాడ.

తస్యోదితి నామ స ఏష సర్వేభ్యః పాప్మభ్యః ఉదితః ।
ఉదేతి హవా సర్వేభ్యః పాప్మభ్యో య ఏవం వేద ॥" (ఛాందోగ్యోపనిషత్ I. 6. viii.)

పాపములన్నింటికిని అతీతమగు పరతత్త్వము "ఉత్" అను పేరుగలదు. ఉదకమగు గంగ వలె భూతములన్నింటిని పావనముజేయగలిగినది ఒక్కటే. ఇది గ్రహించి ఉపాసన చేసినచో అన్ని కల్మషములు తొలగును. సత్యాన్వేషణ పాశ్చాత్య విధానమున పృథక్కరణ పద్ధతి నవలంబించినది. సూక్ష్మబిందువును అణుపరమాణువులుగ విశ్లేషించి [illegible] పరిశోధన జరిగినది. ఇటీవల ఈ [illegible] వ్యాప్తియై పరితత్త్వమువలననే కనుగొనబడినది. ఇందుచే జీవనాశనముచేయు బాంబులు (Atom Bamb) తయారగుచున్నవి. హిరోషిమా, నాగసాకే ప్రాంత

ముల ప్రయోగించిన విశేషములు చదివినప్పుడు "స్ఫురత్సహస్రశిఖాతితీవ్రం" "ప్రాణినినాశచక్రం" జ్ఞాపకము వచ్చును. గొడుగువలె గుండ్రముగ మంటవాయువు భూమినుండి అంతరిక్షమున కెగసి ఆవరణమంతయు మైళ్ళకొలది ప్రదేశము భస్మీపటల మగుటయేగాక చాలకాలము వరకును అటు కాలుబెట్టినవారందరికిని జ్వలన సంచలన రుగ్మత బాధించగలదు. (Radio activity) "అథయ ఏషోంతరాదిత్యే హిరణ్మయః పురుషోదృశ్యతే" అన్నట్లు సూర్యమండల మధ్య వర్తియు, హిరణ్మయుడును ప్రత్యక్షమైనాడు, గాని ఉగ్రతపఃపర్యవసానము వీరరాజ ధ్వంసకృత్యమగును.

శాస్త్రపరిశ్రమ సాగినపిదప ఉజ్జనక గోళశాస్త్రము నిర్మించబడినది. ఉదజని (Hydrogen రసమూలకము, నారాయణసంబంధి, పృథక్కరణకు వ్యతిరేకముగ సంధాన మార్గము నవలంబించినది. పరిశోధనానుక్రమముగ కొంతకాలమున కుపయోగించక తీరదు. ప్రస్తుత వాతావరణములో రాజ్యాంగ వైవిధ్యములతో నీయాయుధములు మారణక్రియల కుపయోగపడునని జీవకోటి భీతిల్లుచున్నది. లోకమంతటను యుద్ధ ప్రసంగము లెక్కువగుచున్నవి. ఎచ్చటచూచినను "సేనయోః ఉభయోర్మధ్యే" "లోకక్షయకృత్ ప్రవృద్ధో లోకాన్ సమాహర్తుమిహ ప్రవృత్తః" ఇట్టి సూచన లుదయించుచున్నవి. "ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్" అనునట్లు స్వచ్ఛమగు (ఉత్ = అయం) ఉదయమెన్నడో యూహించవలసి వున్నది. ఆటంబాంబులు హైడ్రోజన్ బాంబులు మానవకోటిని పెను చీకటిలో ముగ్గించివేయునా? పాపములను పావకునివలె దహించి స్వచ్ఛన్న ద్రవ్యమును రక్షించునా? ఇది నేటి ప్రపంచ సమస్య. భారత జాతిసమస్యయు నిందుపై నాధారపడినదే. బయట అమెరికా-రష్యా వైరుధ్యమున్నది. అంతరంగికముగ హైందవ-పాకీస్తానీ కలవరమున్నది. లోకతంత్రమునకు విశిష్టాద్వైతసిద్ధాంత మిప్పుడెట్లుపయోగించవలెనో దానిపై మన భావిజీవిత మాధారపడియుండును. "ఉత్" వేగముగ ప్రసరించుచున్నది. కాని నీయుద్వేగమునరికట్టగలిగినది సార్వజనిక సత్యప్రవృత్తియే. "పరమసత్వ సమాశ్రయః కః" యని పరమ సాత్వికస్థానమగు పురుషోత్తముడే పుండరీకనయనుడను రెట్టించుటచే "తస్యయథాకప్యాసం పుండరీకమేవమక్షిణీ" యను సామవేదీయ వాక్యము ప్రతిధ్వనించుచున్నది. "చిదచిత్ప్రవిభాగవృత్తం" "విశ్వం" అగుటచే చేతనాచేతన విభాగము నైసర్గికము. చైతన్యములోను వివిధ విచిత్ర కళాంశ భేదములుండుటయు అనుభవ వేద్యమే. భేదములున్నంత మాత్రమున జీవభూతములు నిందితములనగూడదు. సత్వరజోస్తమో పేరితములగుటచే వ్యాపార వైరుధ్యములును సహజమే. ఇందువల్లనే పాపపుణ్య నిరూపణకు తావుగలిగినది. హింసాయుతము పాపము; కరుణపూరితము పుణ్యము, ఋజువర్తనము పావనము, కుటిలప్రవృత్తి దోషము; సత్యసంభాషణ ఉచితము, అనృతము సంఘద్రోహము.

సాంఘిక, ఆర్థిక, రాజకీయ రంగములలో మానవచరిత్రము సహస్రాబ్దముల నుండియు "అహింసాసత్యమక్రోధస్త్యాగశ్శాన్తిరపైశునమ్"

"దయాభూతేష్వలోలుప్త్వం" ఇట్టి చిహ్నము అనే పోషించుచు వచ్చినది. దేహమునకు రుగ్మతవలె సాంఘిక చైతన్యమున కవధకశక్తులు ప్రజ్వరిల్లుటయు ఒకపండుగలదు. దైవాసుర ద్వంద్వమనంతప్రాయము. కాగా పర్యవసానమందు సాత్త్విక ప్రవృత్తియే జయించునను విశ్వాసముతో జీవితము గడపవలయును. మత కర్తలందరు ఇందేకీభవింతురు. "అభయం సత్త్వ సంశుద్ధిర్జ్ఞానయోగస్య నస్థితిః" యనునదియును మతనిర్మాతలందరికిని సామాన్యకర్తవ్యమేయని అంగీకరించబడినను భయవిమోచన కొఱకు సాధించబడిన యుపాయములయందు మాత్రము భేదముండును. మొదట బండ్లను ఎద్దులతోను, గుఱ్ఱములతోను సాగించి ఆవిరియంత్రము, చమురుయంత్రము, పెట్రోలుయంత్రము, ప్రకృతము జెటుయంత్రము (Jet propulsim) వరకు పరిణమించినట్లే ఉగ్రవిగ్రహోపాసనద్వారా భయముపై నాధారపడిన మంత్రతంత్రములు క్రమశః భక్తి విశ్వప్రేమ ప్రపత్తిమార్గముల మార్పులవలంబించబడినవి.

గడియారమునందలి భాగములన్నియు చక్రములే, చిన్న పెద్ద స్ప్రింగులు (Springr) శంఖావళుల ననువాదమునే, ఏయంత్రముచూచినను చక్రశంఖవలయములలో నిండియుండును. విశ్వమండలి నక్షత్ర గ్రహచారములును చక్రశంఖ గతుల ననువదించుచున్నవి. ఊహాప్రపంచ మంతయు భౌతికానుభవమున స్పష్టమగుచుండ మున మానవజాతి జ్ఞానసంపన్నతను కొనుగొన వలెనా? ప్రత్యక్షశక్తుల పెంచుకొని సంహార మారణకార్యములందు మగ్నముగావలెనా?

ఇదియే నేటి నాగరికత యందలి ప్రధాన సమస్య. ఇందు విశిష్టాద్వైత పరమగు సమాధానమునకే ముఖ్యస్థానముగలదని నాయూహ. ప్రకృతి కల్లగాదు. తత్త్వములపై నాధారపడు యంత్రములన్నియు అబద్ధములుకావు. జెటు(Jet) విధానమున శబ్దవేగము నతిక్రమించు గాలివిమానములు నిర్మితములగుచున్నవి. ఖండాంతరములు నుండి గాక చంద్రలోకమునుండియు సూర్య బింబములోనివియు నక్షత్రమండలము దాటియు ధ్వనిప్రసారములు (Radio) ఆకస్మిక చిహ్నములు (Redor) మున్నగు సూక్ష్మతరగ విశేషములు గ్రాహ్యములగుచున్నవి. "అణోరణీయాన్ మహతోమహీయాన్" అని సర్వని యంత్రములు సాక్ష్యమిచ్చి ప్రత్యక్షనిరూపణ చేయుచున్నవి. భౌతికశాస్త్ర ప్రసంగములన్నియు జీవిత విధానమున నలవరుచుకొన్నయెడల విశ్వమందు భక్తియు మానవప్రజ్ఞయు విశ్వాసమును సార్థక ప్రయోజనములు ప్రసన్నతయు పెంపొందును. ఇది మన ప్రస్తుత కర్తవ్యము.



# తత్త్వత్రయ సత్యత్వ వివరణము

శ్రీ ఉ. వే. శ్రీమాన్ గోడవర్తి అనన్త అళఘరాచార్యులుగారు - ఉండి

శ్లో॥ వన్దే లక్ష్మణయోగీన్ద్రం విశిష్టాద్వైతబోధకమ్ ।
యస్త్రిదణ్డపదా తత్త్వత్రితయం సూచయన్నివ॥

మోక్షేచ్ఛ గల పురుషునకు తత్త్వత్రయమును దెలిసికొనుట యావశ్యకమై యున్నది. తత్త్వత్రయమనఁగా మూఁడు తత్త్వములని యర్థము, అవి 1. చిత్తు (జీవుఁడు) 2. అచిత్తు (ప్రకృతి) 3. ఈశ్వరుఁడును ఈ మూఁడింటి స్వరూపమును దెలియక జీవుఁడు తానెట్లు నడచుకొనవలెనో తెలిసికొనలేఁడు. అందుచేతనే ముక్తిని నొందలేఁడు. కావున నీతత్త్వత్రయజ్ఞాన మావశ్యకము.

ఈ మూఁడు తత్త్వములును సత్యములే యని మన బుద్ధిచేతనే యూహించుకొనవచ్చును. అదెట్లనఁగా:—

అచిదాత్మకమగు ప్రపంచము ప్రత్యక్షము గాఁ గానవచ్చుటం జేసి "అచిత్తు" లేదని యెవ్వఁడును జెప్పఁజాలఁడు. అందుచే "అచిత్తు" సిద్ధించినది కదా!

ఇఁక అచిద్రూపంబగు దేహముకన్న వేఱగు "జీవుఁడు" అను పదార్థమున్నదా? లేదా? అనగా ఉన్నది—అదెట్లన:—

"ఇది నాదేహము" అన్నప్పుడు "నేను" అనునది వేరుగాను దేహము వేరుగాను తోఁచుచున్నది. ఆ "నేను" అనునదియే "జీవుఁడు" ఈ విధముగా "చిత్తు" సిద్ధించుచున్నది.

ఇట్టి జీవుఁడుండెను నుండనిండు. ఈశ్వరుఁ డున్నాఁడనుటకు నిదర్శన మేమనఁగా:—

ఈ ప్రపంచమును నడిపెడి స్వతంత్రుఁడును సర్వశక్తుఁడును నగు నీశ్వరుఁడు వేరుగా లేక జీవుఁడే స్వతంత్రుఁడు శక్తుఁడును నైనచో, జీవుఁడెప్పుడును సుఖమునే యనుభవింపవలయును గాని దుఃఖము,ననుభవింపరాదు. దుఃఖమనుభవించుట యెవ్వనికినిష్టముకాదుకదా! కనుక వీరి కర్మానుగుణముగ నీ జీవులచే సుఖదుఃఖముల ననుభవింపఁ జేయువాఁడొకఁడుండి తీరవలయును అతఁడే యీశ్వరుఁడు. ఈ విధముగా యుక్తిచే మూఁడు తత్త్వములును సిద్ధించినవి.

ఇఁక నిందులకు శ్రుత్యాది ప్రమాణములును బెక్కులు గలవు. ఈమూఁడు తత్త్వములును సత్యములే కాని కొందరు చెప్పునట్లు "బ్రహ్మ" (ఈశ్వరుఁడు) మాత్రము సత్యముయి శేషించిన జీవప్రకృతులు రెండును నసత్యములు కావు. ఈ ఈ విషయము నీక్రింది ప్రమాణములు ఋజువు చేయుచున్నవి. శ్రు, అనేనజీవేనాత్మనాను ప్రవిశ్యానామ రూపే వ్యాకరవాణి" నేనేజీవాత్మతో బాటు ప్రకృతిలో బ్రవేశించి నామరూపాత్మకమగు ప్రపంచ మగుచున్నాను. అనియు

"అజామేకాంలోహితశుక్ల కృష్ణాం బహ్వీం ప్రజాం సృజమానాం స్వరూపామ్। అజోహ్యేకో జుషమాణోను శేతేజహాత్యేనాం భుక్తభోగా మజోన్యః" సత్త్వరజస్తమోగుణాత్మికమై ప్రపంచమును సృజించుచున్న యనాదియగు ప్రకృతిని జన్మలేని యొకఁడు [జీవుడు] అనుభవించుచున్నాడు. పుట్టువులేని మరియొకఁడు జ్ఞాజ్ఞౌ ద్వావజా వీశనీశౌ "అజాహ్యేకా భోక్తృ భోగార్థయుక్తా" జీవేశ్వరు లిరువురును పుట్టువు లేనివారు అందీశ్వరుఁడు సమర్థుఁడు జీవుఁడసమర్థుఁడు." "అనాదియగు ప్రకృతి యొకటి జీవుని భోగార్థమైయున్నది" అనియు శ్రు, "ద్వాసుపర్ణా సుయుజౌ సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే" జీవేశ్వరులను రెండు పక్షులు ప్రకృతి యను నొక వృక్షము నంటియుండును అనియు శ్రు, "భోక్తాభోగ్యం ప్రేరితారఞ్చమత్వా" అనుభవించు జీవుఁడు అనుభవింపఁబడు ప్రకృతిని అనుభవింపఁజేయు నీశ్వరునిఁదెలిసి అనియు శ్రు "నిత్యోనిత్యానాం చేతనశ్చేతనానామేకో బహూనాం యోవిదధాతికామాన్" నిత్యమైన బహుచేతనులకు (జీవులకు) నిత్యమైన యొక చేతనుఁడు (ఈశ్వరుఁడు) భోగముల నిచ్చుచున్నాఁడో అనియు శ్రు "క్షరాత్మానావీశతే దేవఏకః" ప్రకృతిని ఆత్మను ఒక్క దేవుఁడు నియమించుచున్నాఁడు అనియు శ్రు 'య ఆత్మనోంతరోయమయతి' 'యస్యాత్మాశరీరమ్' ఎవఁడాత్మలోపలనుండి నియమించుచున్నాఁడో; ఎవని కాత్మ శరీరముగా నున్నదో అనియు 'ప్రకృతిం పురుషఞ్చైవ విద్ధ్యనాదీ ఉభావపి' ప్రకృతి, జీవుఁడు ఈ రెంటిను ననాదులు అనియు 'కార్య కారణ కర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే పురుషః సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతు రుచ్యతే' శరీరేంద్రియ కర్తృత్వముల యందు ఆత్మాధిష్ఠితమగు ప్రకృతి కారణము, సుఖదుఃఖముల ననుభవించుటలో జీవుఁడు కారణమనియు 'సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతి సమ్భవాః నిబధ్నన్తి మహాబాహో దేహే దేహిన మవ్యయమ్॥' సర్వభూతాని కౌన్తేయ ప్రకృతింయాన్తి మామికామ్। కల్పక్షయే పునస్తాని కల్పాదౌవిసృజామ్యహమ్॥ సత్త్వరజస్తమస్సు లనెడి ప్రకృతి గుణములు జీవుని దేహమున బంధించుచున్నవి. కల్పాంతమున ఆత్మ ఒకప్పుడుండి మఱొకప్పుడుండకపోఁడు. సర్వ భూతములు మదీయ ప్రకృతిని బొందుచున్నవి. కల్పారంభమున మరలి వానిని సృజించుచున్నాను. అనియు 'నజాయతే మ్రియతే వాకదాచి న్నాయం భూత్వా భవితా వానభూయః।అజోనిత్యః శాశ్వతోయం పురాణో నహన్యతే హన్యమానే శరీరే॥' "వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోపరాణి।తథాశరీరాణి విహాయ జీర్ణా న్యన్యాని సంయాతి నవాని దేహీ॥' జీవుఁడు పుట్టువాఁడును గాఁడు మరణించువాఁడును గాఁడు జన్మలేనివాఁడు; నిత్యుఁడు;శాశ్వతుఁడు; పురాతనుఁడు నరుఁడు చినిగిన వస్త్రములను విడిచి క్రొత్త వస్త్రములను ధరించునట్లు జీవుఁడు జీర్ణించిన శరీరముల విడిచి క్రొత్త శరీరములను దాల్చుచున్నాఁడు, అనియు అచేతనా పరార్థాచనిత్యా సతత విక్రియా' 'వికారజననీ మజ్ఞామష్టరూపా మజాంధ్రువమ్॥' ప్రకృతి అచేతనము; ఇతరులకు శేషము; నిత్యము; ఎల్లప్పుడు వికారము

నొందునది; అనియు ప్రకృతి వికారమును గలిగించునది; జ్ఞానశూన్యము; ఎనిమిది రూపములు కలది; అనాది; స్థిరమైనది; అనియు "దైవీహ్యేషా గుణమయీ మమమాయా దురత్యయా, త్రిగుణాత్మికయగు నామాయ యతిక్రమింపరానిదనియు "ద్వావిమౌ పురుషౌ లోకే" ఉత్తమః పురుష స్త్వన్యః" జీవుడు బద్ధుడు ముక్తుడు అని రెండు విధముల పురుషోత్తముడు జీవుని కన్న వేఱనియు ఇత్యాది శ్రుత్యాద్యనేక ప్రమాణంబులచే జీవేశ్వర ప్రకృతులనెడి మూడు తత్త్వములును దేనికది వేఱనియు సత్యము లనియు స్పష్టమగుచున్నది.

## మూత్రపురీషోత్సర్జన సమయములలో యజ్ఞోపవీతమును దక్షిణ కర్ణమందుంచు టెందులకు ?

శ్రీ ఉ. వే. శ్రీమాన్
మొలుగు వెంకటాచార్యులుగారు
ముగ్గుళ్ళ అగ్రహారం.

"యుక్తి ప్రమాణాభ్యాం వస్తుసిద్ధిః" అను సిద్ధాంతానుసారము ఏమాటను గాని ప్రమాణితమును చేయుటకు ప్రమాణయుక్తు లావశ్యకములు. ఇందువలన పై ప్రశ్నకు కూడ సమాధానము ప్రమాణములు యుక్తులు అనెడు రెండిటిద్వారా ఇవ్వవలసి యుండును.

"దివాసన్ధ్యాసు కర్ణస్థబ్రహ్మసూత్ర ఉదఙ్ముఖః
కుర్యాత్ మూత్రపురీషే చ రాత్రౌచేద్దక్షిణాముఖః"
యాజ్ఞవల్క్య- అ. 1- శ్లో. 16.

"పవిత్రం దక్షిణే కర్ణేకృత్వావిణ్మూత్రముత్సృజేత్॥" (మితాక్షరా) మూత్రపురీషోత్సర్జన సమయములయందు యజ్ఞోపవీతమును దక్షిణ కర్ణమందుంచుకొనవలెను. ఆసమయమున మౌనముగా కూడ వుండవలెను. ఉమ్మివేయుట మాటలాడుట మొదలగు పనులను చేయరాదు. దక్షిణకర్ణమున యజ్ఞోపవీతముంచియే మూత్రపురీషోత్సర్జనము చేయవలెను. ఈవిషయములో చాలమంది స్మృతికారుల వచనములు కనబడుచున్నవి. కాని ఇట్లు యెందుకుచేయవలెనని ప్రశ్న ? ఇందులకు దార్శనికయుక్తులుద్వారా జవాబు ఇవ్వవలసి యుండును.

"యజ్ఞోపవీతం పరమం పవిత్రం ప్రజాపతేర్యత్ సహజం పురస్తాత్" ఇత్యాది శృతులు యజ్ఞోపవీతము భగవంతునితో సమానముగానే పరమపవిత్రమైనదని చెప్పుచున్నవి. భగవంతునికూడ "పవిత్రాణాం పవిత్రంయో మంగళానాంచ మంగళం" పవిత్రములకు పవిత్రము మంగళములకు మంగళము" అని చెప్పెడి వాక్యములనుకూడ చూచుచున్నాము. అయిన నిప్పుడు తేలినదేమి ? యజ్ఞోపవీతముకూడ భగవంతునితో సమానముగనే పరమపవిత్రమనియే. కాని యొక భేదముకలదు. భగవంతుడన్ని విధములుగా నెల్లప్పుడును అన్నిస్థలములందును పవిత్ర

ముగనే యుండును. కాని ఏకదేశీయమైన యజ్ఞోపవీతము అపవిత్రావస్థలో దాని సంసర్గవలన పుట్టునట్టి వైద్యుతిక ప్రవాహముయొక్క సంపర్కము వలన అపవిత్రమగును. ఇంకొక్కవిషయము, భగవంతుడు చేతనము, యజ్ఞోపవీతము జడము. చేతనము యెల్లప్పుడు పవిత్రము, మరియు ప్రాకృతికవస్తువు దేశకాలపాత్రానుసారముగా పవిత్రాపవిత్రతలను పొందుచున్నది. యజ్ఞోపవీతము మిక్కిలి పవిత్రవస్తువనుటలో అణుమాత్రముకూడ సందేహములేదు. దీనిపవిత్రత అన్నివిధములచేత రక్షింపబడివనే బ్రహ్మసూత్రము, అనగా బ్రహ్మతోగూడ సంబంధము కలుగజేయు సూత్రము (కారణము). అట్లుకానియెడల నూలుదారమే.

మూత్రపురీషోత్సర్జన సమయములో సమస్త శరీరముయొక్క వైద్యుతికశక్తి దూషితమై అపవిత్రమైపోవును. ఇట్టి పరిస్థితిలో ఏమాగిరిగా కల్లుకుండలో నుండుటవలన గంగాజలముయొక్క పవిత్రతయు, అస్పృశ్యులయొక్క స్పర్శవలన దేవతాపీఠముయొక్క పవిత్రశక్తి మొదలగునవి నష్టమైపోవునో అప్రకారముగానే అపవిత్ర పరిస్థితిలో పరమ పవిత్రమైన యజ్ఞోపవీతముయొక్క రక్షణసేయనియెడల అది బ్రహ్మసూత్రముగాక కేవలము సూత్రమే (దారమే) అయిపోవును. తిరిగిగాయత్రితో అభిమంత్రితమగు మరియొక యజ్ఞోపవీతమును ధరించువరకు బ్రహ్మతో కాని, సంధ్యావందనము వేదాధ్యయనము మొదలగువైదికకర్మలతో కాని సంబంధము కలుగదు. అధికారములేదు. కనుక అశుచి కర్మలు చేయునప్పుడు దూషితమయిన శారీర వైద్యుత ప్రవాహమువల్ల దూషితము కాకుండునట్లు యజ్ఞోపవీతముయొక్క వైద్యుత శక్తిని రక్షించుటకు మనమేమి చేయవలయును ?

కుడిచెవికి జందెము చుట్టవలెను. అందుచేనది అపవిత్రము కాకుండునని శ్రౌతసిద్ధాంతానుకూలముగా మహర్షులు చెప్పి తత్వములో (అనగా దేనియొక్క విద్యుత్ ఎప్పుడును దూషితముకాని అపవిత్రముకాని కాదో దానితో) సంబంధముండు వస్తువులో పవిత్రమగు విద్యుత్ ధార ప్రవహించుటవలన అది అపవిత్ర అవస్థలో కూడ పవిత్రముగ నుండగలదు. ఏతత్వము ఎల్లప్పుడు అపవిత్రముకాదో, దేనితో సంబంధముండుటవలన యజ్ఞోపవీతముయొక్క పవిత్రత మరుజని అపవిత్రావస్థలోకూడ త్రికాలపావన తత్వముయొక్క పవిత్రమయిన వైద్యుతిక ప్రవాహముతో సంసర్గ ఉండుటవలన నష్టముకాదో ఆ తత్వమేదియో విచారించుదము.

ప్రకృతిమాత తన సృష్టియొక్క అనిర్వచనీయ సౌందర్యమునకు ప్రధానముగా పంచతత్వములతో అలంకరించినది. సమస్త విశ్వమండలముయొక్క అన్నిపదార్థములలో ఈపంచతత్వములే ఓతప్రోతములగుచున్నవి. ఆముఖ్య పంచతత్వములు ఆకాశము, వాయువు, అగ్ని, జలము పృథివి అనునవి యని శ్రుతికూడ చెప్పుచున్నది. "తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశస్సమ్భూతః, ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః అగ్నేరాపః అద్భ్యఃపృథివీ" ఆత్మవలన ఆకాశము, ఆకాశమువలన వాయువు, వాయువువలన అగ్ని, అగ్నివలన జలము, జలమువలన పృథివి ఉత్పన్నమైనవి. ఇవియేప్రధానముగా పంచతత్వములు. వీటిలో ఏతత్వము ఎప్పుడును అపవిత్రముకాదో చూతము. పృథివి దేశకాలానుసార

ముగా అపవిత్రమయిపోవును. శ్మశానభూమి, గోతకట్టిన ప్రదేశము, మూత్రపురీషోత్సర్జన స్థానము, కళ్యావికేత్రత పాదములు పడిన ప్రదేశము అపవిత్రమగుచున్నది. ఈలాగుననే జలము కూడ స్థానభేద అవస్థాభేదములచే అపవిత్రము లయిపోవుచున్నది. గంగాజలమే మ్లేచ్ఛస్పర్శ చేత మద్యభాండములో వుంచుటవలన కూపోదకవి మిశ్రణము వలన అపవిత్రమగుచూ తదితర జలముల విషయము ఏమి చెప్పవలెను. "మ్లేచ్ఛస్పర్శేసురా భాండేకూపోదక విమిశ్రణే" ఇత్యాదికములైన వచనములు కనబడుచున్నవి. సాధారణోదకము కూడ మలమూత్రాదికము యొక్క సంసర్గమువలన చితి మొదలయిన వాటి సంపర్కమువల్ల అశుద్ధమయి పోవుచున్నది. ఈలాగుననే స్మశానాగ్ని (చితాగ్ని) నోటితో ఊదబడిన అగ్ని ధూమాయితమయిన అగ్ని అపవిత్రముగా అంగీకరింప బడినవి. ఇక మిగిలినది వాయు విషయము. అదికూడ వేశ్యాలయము, మదిరాలయము, శౌచాలయము దుర్గంధయుక్తమయిన స్థానముయొక్క వాయువు చాల అపవిత్రమయినది. ఇందువలననే అపవిత్రమయిన లేక దూషితమయిన వాయు మండలములో ఉండుటవలన అనేకమంది వ్యక్తులు రోగాక్రాంతమగుచున్నారు.

ఇందువల్ల పృథివి, జలము, అగ్ని, వాయువు యీ నాల్గుగు తత్వములు ఎల్లప్పుడును పవిత్రముగా నుండవు.

అపవిత్రమైన దేశకాలములలో వీటి పవిత్రత నష్టమగునని నిశ్చయమయినది. మిగిలినది ఆకాశ తత్త్వము ఈఆకాశతత్వముమిక్కిలిఅపవిత్రమయిన అవస్థలో ఉండినను అపవిత్రముకాదు. ఇది అన్ని విధముల చేత పవిత్ర తత్త్వము. అనగా ఆకాశ తత్త్వము యొక్క వైద్యుతికధార (ఎలక్ట్రిక్ కరెంట్) ఎప్పుడును దూషితము కాదు.

ఫలానిస్థానముయొక్క ఆకాశము అపవిత్రమగునని మనకు శాస్త్రములలో ఎక్కడను ప్రమాణము దొరకదు. ఇందువలన పరమ పవిత్రమయిన యజ్ఞోపవీతముయొక్క పవిత్రత మూత్రపురుషోత్సర్గ మొదలయిన అశౌచావస్థలలో నష్టమవకుండు నటుల దానిని ఎల్లప్పుడు పవిత్రముగా నుండు ఆకాశ తత్వముతో సంబంధింప చేయవలెను. అన్నివిధములచే పవిత్రముగా నుండెడి విద్యుత్ ప్రవాహము యజ్ఞోపవీతము యొక్క సర్వాంశములో వ్యాప్తమయి పవర్ హౌస్ తో సంబంధము కలుగజేయుటవలన అన్ని ప్రక్కలకు విద్యుత్ యొక్క కరెంట్ యెట్లు ప్రచలితమగుచున్నదో ఆమాదిరిగానే అపవిత్రావస్థలో కూడ యజ్ఞోపవీతముయొక్క పరమ పవిత్రతను నష్టము కానీయదు. అందుచేతనే అది బ్రహ్మ సూత్రమగుచున్నది.

జందెమును బాహ్యాకాశములో వ్రేలాడ గట్టుట సంభవము. శరీరమునుండి తీసివైచిన పిమ్మట యజ్ఞోపవీత మపవిత్రమగును. కాబట్టి మూత్రపురుషోత్సర్గ సమయములలో యజ్ఞోపవీత సంబంధము ఆకాశతత్వముతో తయారయిన ఇంద్రియములో గాని అంగములో గాని చేయవలెను. పూర్వోక్తములయిన అకాశాది పంచ తత్వములు రెండువిధములుగా ఉండుచున్నవి. పంచీకృతము, అపంచీకృతమనియు, కాని యిది

వేదాంతముయొక్క విస్తృత వివేచన విషయాంతర మగుట వలన విడుచుచుదుము. అపంచీకృతము పంచతత్వముల యొక్క సాత్వికాంశల వలన అయిదుజ్ఞానేంద్రియములు తయారయినవి. ఎట్లన పృథివి తత్వముయొక్క సాత్వికాంశవల్ల ఘ్రాణేంద్రియము (ముక్కు) జలమునుండిజిహ్వా(నాలుక) అగ్నినుండి చక్షు, వాయువు వలన, త్వచా, ఆకాశము యొక్క సాత్వికాంశమున కర్ణేంద్రియము (చెవి) తయారయినవి. ఇందువలననే ఏ తత్వమునుండి ఏ ఇంద్రియము తయారయినదో ఆ ఇంద్రియము ఆ తత్వగుణముననే గ్రహించగలదు ఇంకొక దానిని గ్రహింపజాలదు. ఆకాశము, వాయువు, అగ్ని, జలము పృథివి ఈ అయిదు తత్వములకు క్రమముగా శబ్ద, స్పర్శ, రూప, రస గంధాదులు తమ తమ గుణములయి వున్నవి. ఇందువలన ఆకాశమునలన ఉత్పన్నమయిన కర్ణేంద్రియము (చెవి) ఆకాశగుణమగు శబ్దమును గ్రహించుచున్నది. రెండవ దానిని గ్రహించుటలేదు. ఈ ప్రకారముగనే వాయు తత్వము వలన ఉత్పన్నమయిన త్వచా స్పర్శ గుణమును, అగ్నితత్వమువలన ఉత్పన్నమయిన చక్షువు (నేత్రము) దాని గుణరూపమును జలము వలన పుట్టిన జిహ్వా (నాలుక) దాని గుణమయిన రసమును పృథివి తత్వమువలన పుట్టిన నాసిక (ముక్కు) దాని గుణమయిన గంధమును గ్రహించు చున్నది. రెండవ ఇంద్రియము గ్రహించుట లేదు, ఇందులో ఇప్పుడు సందేహము లేదు. శబ్దగ్రహణము వలన కర్ణేంద్రియము ఆకాశ తత్త్వమువలన ఉత్పన్నమయినదని అందుచేతనే శ్రోత్రేంద్రియము అన్ని పరిస్థితులలో పరమ పవిత్రమయినది. దానితో సంబంధింపజేయుటవలన శౌచాదికములైన అపవిత్రావస్థలలో కూడ యజ్ఞోపవీతము యొక్క పవిత్రత సురక్షితమగుచున్నది. ఇందువలన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు లఘు శంకాలేక దీర్ఘ శంకా (మూత్రముల విసర్జన) సమయములలో యజ్ఞోపవీతమును చెవికి చుట్టుచున్నారు, అయిన యజ్ఞోపవీతమును కుడిచెవికే ఎందుకు చుట్టవలెను?

వామాంగముకంటె దక్షిణాంగము అన్ని విధముల చేత పవిత్రమని తలుచబడినది. ఏలనన శరీరముయొక్క వామాంగములో స్త్రీ శక్తి (Neqative Power) దక్షిణాంగములో పురుషశక్తి (Positive Power) తలచబడినది. ఏ స్త్రీ జాతికి వేదాధ్యయనము యజ్ఞోపవీతము యొక్క అధికారమేలేదో ఆ స్త్రీ శక్తితో సమావిష్టమయిన వామాంగము మీద యజ్ఞోపవీత ముంచుటకు అధికారము మాత్ర మెవరికి గలదు? ఇంకను స్త్రీశక్తిలో అశుచిత్వముండుట నైసర్గికము, దానితో సంయోగము చేయుటవలన పవిత్ర వస్తువుయొక్క పవిత్రత ఎట్లు రక్షింపబడగలదు? కనుకనే ఋషులు దక్షిణకరణమున యజ్ఞోపవీతముంచియే మూత్ర పురషోత్సర్గము మొదలయిన అశౌచక క్రియలు చేయుటకు ఆజ్ఞయిచ్చియున్నారు.



శ్రీమతే రామానుజాయ నమః

# యజ్ఞాది క్రతువుల యొక్క అనుష్ఠాన విధానము

శ్రీ ఉ. వే. శ్రీమాన్ మొలుగు రామానుజాచార్యులుగారు, మన్గళ్ళ.

---

ధర్మార్థ కామమోక్షములను చతుర్విధ పురుషార్థములలో పరమపురుషార్థమగు మోక్షమునకు కర్మ జ్ఞాన యోగాంగక భక్తియోగ ముపాయమని వేదాన్త సిద్ధాన్తానుసారి మార్గము. వర్ణాశ్రమ విహితకర్మల నాచరించనిచో భక్తి కలుగదు. అందులకై కర్మాచరణ మావశ్యకము. "నాముత్రహి సహాయార్థం పితా మాతా చతిష్ఠతః । నపుత్ర దారా న జ్ఞాతిర్ధర్మ స్తిష్ఠతి కేవలః॥ తస్మాద్ధర్మం సహాయార్థం నిత్యం సంచినుయాచ్ఛనైః। ధర్మేణహి సహాయేన తమస్తరతి దుస్తరమ్" తల్లి, తండ్రి, భార్య, సంతానము, జ్ఞాతులు, మొదలగువారు ఆముష్మికమునకై సహాయపడువారుకారు. ధర్మమొకటియే సహాయపడును ధర్మసహాయమున దుస్తరమగు తమస్సు దాట శక్యమగును. అనగా అజ్ఞానము నశించి జ్ఞానోదయమగును. (పరమపురుష విషయకమగు) జ్ఞానము వలన మోక్షము సంభవించును కాన ఆముష్మిక సహాయమునకై ధర్మసంపాదన చేయవలయును. ధర్మమను శ్రేయస్సాధనమగు యజ్ఞాదికము, యజ్ఞాదికము వలన భక్తియోగము సిద్ధించును. సన్న్యాసులకు కూడ తమ యాశ్రమ విహితకర్మముల నాచరించుటవలననే భక్తియోగ ముసిద్ధించును యజ్ఞాదికర్మములందు అధికారముగల గృహస్థులు మాత్రము ఆయాకర్మల నాచరించవలయును గాని విరసవరాదు. "తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి యజ్ఞేన దానేన తపసానాశకేన" ఇవి మొదలగు శ్రుతులు యజ్ఞాదులవలననే బ్రహ్మజ్ఞానోత్పత్తిని చెప్పుచున్నవి. ఇచ్చట యజ్ఞములచే తెలిసికొన నిచ్ఛయించుచుండిరి అనుటచే "అసినాతి ఘాంసన్తి" కత్తివే హింసింపవలచుచున్నారు అను స్థలమున ఇచ్ఛకు హింసాసాధనమైననే ఇట్టి ప్రయోగము సంభవించును గాన ఖడ్గము హింసాసాధనమని యెటుల తెలియుచున్నదో అటులనే యజ్ఞాదులు జ్ఞానసాధనములైననే వివిదిషన్తి (తెలిసికొనుచున్నారు అను వ్యవహారము) సంభవించును గాన యజ్ఞాదులు జ్ఞానసాధనములని చెప్పదగి యున్నది. అందువలన గమనసాధనమగు అశ్వమునకు యెటుల కళ్ళెము మొదలగు పరికరముల యపేక్షయో అటులనే మోక్షసాధనమగు భక్తికి యజ్ఞాది కర్మాపేక్షకలదు. గీతల యందు "యజ్ఞోదానంతపః కర్మ నత్యాజ్యం కార్యమేవతత్, యజ్ఞోదానంతపశ్చైవ పావనాని మనీషిణామ్" యజ్ఞము, దానము, తపస్సు మొదలగు వర్ణాశ్రమోచిత కర్మజాతము "సతత్త్వేవం వర్తయన్యావ దాయుషం బ్రహ్మలోకమభిసంపద్యతే" అని యావజ్జీవము బ్రహ్మోపాసన విహితమగుటచే అట్టి బ్రహ్మోపాసకులకు "కషాయపక్తిః కర్మాణి జ్ఞానంతు పరమాగతిః । కషాయేకర్మభిః పక్వేతతోజ్ఞానంప్రవర్తతే" వర్ణాశ్రమవిహిత కర్మలు జ్ఞానోత్పత్తి ప్రతిబంధక పాపనాశకములు జ్ఞానము పరమగతిసాధనముగనుక కర్మలచే పాపము నశించిన తరువాత జ్ఞానము కలుగును అని చెప్పిన రీతిగా ఉపాసన నిష్పత్తి విరోధియగు ప్రాచీనకర్మజాతమును నశింపచేయును గనుక విడవదగినదిగాదు, ప్రాణముపోవువరకును ప్రతిదినమును జేయనేవలయును. అనిచెప్పబడినది, మరియు భక్తి చిత్తసమాధానసాధ్యమగుటచే అన్తరింద్రియనియమనము నిషిద్ధకామ్యాదికర్మవర్జనము, క్షమమొదలగునవికూడ అపేక్షితములు. ఇంద్రియనిగ్రహములేక నిషిద్ధకామ్యాదికర్మల యందు ప్రవర్తించినయెడల అందువలన గలుగు పాపములచేత భక్తికి ప్రతిబంధకము కలుగును మోక్షేచ్ఛలేనివారైనను విహితమగుటచే యజ్ఞాదికర్మ ఆచరించవలసియే యున్నది. అగ్నిహోత్రకర్మ యొకటియే యావజ్జీవాచరణీయమున్నా, స్వర్గఫలసాధనముగా ఆచరణీయమున్నా అగుచున్నటుల యజ్ఞాదికము ఆశ్రమాఙ్గముగానున్నా విద్యాఙ్గముగానున్నా విహితమగుటచే ఆచరణీయమేయగుచున్నది. మరియు "ధర్మేణ పాపమపనుదతి, ఇత్యాది శ్రుతులచే, యజ్ఞాదుల నాచరించినచో పూర్వకృతములైన పాపములవలన భక్త్యుత్పత్తి ప్రతిబంధకములు గాదని చెప్పబడినది. ప్రతినిత్యమును ఆచరించబడు యజ్ఞాది కర్మలవలన అన్తఃకరణశుద్ధిగలిగి ఉత్కృష్ట మగుభక్తి ఉత్పన్నమగును. ఆశ్రమబాహ్యులగు విధురాదులు (విధురులనగా భార్యలేనివారు) యజ్ఞాది కర్మలయందధికారము లేకపోయినను బ్రహ్మవిద్యయందధికారము గల్గుదురు. జపోపవాస దేవతారాధనాదులువారి భక్తికి అఙ్గమే కావచ్చును. ఆశ్రమబాహ్యులగు రైక్వాదులకు జపాదికమువలన బ్రహ్మ విద్య ఉత్పన్నమైనటుల ఉపనిషత్తులలో గన్పట్టుచున్నది. "జపేనాపిచ సంసిద్ధ్యేద్బ్రాహ్మణో నాత్ర సంశయః। కుర్యాదన్యన్న వాకుర్యాన్మైత్రో బ్రాహ్మణ ఉచ్యతే" అని జపాదికముచే బ్రహ్మవిద్యోత్పత్తి చెప్పబడినది. అయినను అనాశ్రమినతిష్ఠేద్దినమేకమపిద్విజః" ఒకదినమైనను ఆశ్రమబాహ్యుడై యుండకూడదని చెప్పుటచే వీలగునంతలో ఆశ్రమసహితుడ

ద్యేయుండవలెను. గార్హస్థ్యధర్మములయందు శ్రద్ధయున్ననూ కన్యదొరకకపోవుటచే వివాహముకాని యాపన్నునకు జపాదికము వలననే ప్రతిబంధకములు నశించి బ్రహ్మవిద్య ఉత్పన్నముకావలసియున్నది. ఆశ్రమమునన్నచో అనేకధర్మముల నాచరించుటకు వీలగుటచే భక్తిప్రతిబంధకపాపములు శీఘ్రమున నశించి అచిరకాలముననే భక్త్యుదయమగును. గనుక భక్తుడగువాడు ఆశ్రమరహితుడైయుండుటకంటె ఆశ్రమసహితుడైయుండుటయే శ్రేష్ఠము. నైష్ఠిక, వైఖానస, పరివ్రాజకాశ్రమ భ్రష్టులకు పతితులగుటవలన బ్రహ్మవిద్యాధికారములేదు. వీరికిప్రాయశ్చిత్తముగూడ శాస్త్రములందు చెప్పబడియుండలేదు. నైష్ఠికాదులకు బ్రహ్మచర్యాదిచ్యుతి మహాపాతకములలో చెప్పబడనిదై ఉపపాతకములలో చేరగుటచే ప్రాయశ్చిత్తమువలన పరిశుద్ధులగు వీరికి బ్రహ్మవిద్యాధికారము గలదని తలంపరాదు. వీరికి పాపనివృత్తికై కొన్ని శాస్త్రముల వలన ప్రాయశ్చిత్తాధికారము సిద్ధించిననూ "ప్రాయశ్చిత్తం నపశ్యామియేనశుద్ధ్యేత్స ఆత్మహా" అనుస్మృతి వచనమువలన వైదికకర్మాధికారమునకు తగినశుద్ధికి హేతువగు ప్రాయశ్చిత్తము లేదని చెప్పబడుటచే ప్రాయశ్చిత్తమువలన నరకానుభవములేకపోయిననూ బ్రహ్మవిద్యాధికారములేదనియే సిద్ధాంతము. భక్తుడు తనమహిమను ప్రకటనచేయక డంభాదిశూన్యుడై విహితకర్మల నాచరించుచుండవలెను. ఐహికఫల సాధనమగు ఉపాసనకై సాధనములగు పుణ్యకర్మల నాచరించినచో ఉపాసనోత్పత్తి ప్రతిబంధక ప్రబల కర్మ యున్నయెడల ఈ కర్మానంతరమున్నా లేనిచో శీఘ్రముగానున్నా సిద్ధించును. ఇటులనే ముక్తి ఫలసాధనమగు ఉపాసనము గూడ ప్రతిబంధకములేనిచో శీఘ్రముగానున్న, ఉన్నచో విలమ్బముగానున్నా ఉత్పన్నమగును. ముక్తిఫలమగు ఉపాసనకు గూడ బ్రహ్మజ్ఞానియెడల జేయు అపచారము ప్రతిబంధకమగును. ప్రతిదినము ఆచరించబడు నిత్యనైమిత్తికాది కర్మలవలన భక్త్యుత్పత్తి ప్రతిబంధక పాపములు నశించి భక్తిఉత్పన్నమగును జనకచక్రవర్తి బ్రహ్మజ్ఞానముగలవాడై అనేక యజ్ఞముల నాచరించియుండెను. శ్రీకృష్ణభగవానుడుగూడ అవాప్త సమస్త కాముడనగునాకు చేయదగినదేదియులేదు. పూర్వము లభింపక కర్మలముందర పొందదగినదేదియును లేదు. అయిననూ లోక సంగ్రహార్థము కర్మయందు ప్రవర్తించుచునే యున్నవాడను. శిష్టజనాగ్రేసరుడగు వసుదేవుని గృహమున బుట్టి అపుట్టిన కులమునకు తగిన కర్మయందు ఎప్పుడునూ ప్రాలుమాలికలేక వర్తించువాడనుగా నైతినేని శిష్టజనులెల్లరునూ నన్నుజూచి నాయాచారమును బట్టి యదియే ధర్మమని నిశ్చయించుకొనినవారై తాము చేయవలసిన కర్మను జేయనందున ప్రత్యవాయము గలవారై నరకమును పొందుదురు. శాస్త్రీయాచారములను పాలింపనందున శిష్టకులములు దుస్స్థితికిని సంకరమును కలిగించుటకు నేనే కర్త నగుదును. ఇటువాత గూడ కర్మానర్హులగునట్లు చెయుచువాడనగుదును అందువలన కర్మల నాచరించుచుంటిని. శిష్టుడని వ్యవహరించబడువాడు ఏకర్మను ఏ అభిప్రాయములతోడ నాచరించునో స్వల్పజ్ఞానులగు తక్కిన లోకులును దానినటులనే ఆచరింతురు. అతడాచరింపడేని అతనిని జూచి లోకులు గూడ కర్మల నాచరింపక నశింతురు లోకనాశనమువలన గలుగు పాపము వానిని జ్ఞానభ్రష్టునిచేయును. కనుక నిటపర్యాశ్రమోచిత సకల కర్మలను ఎప్పుడు నాచరించవలయును అని చెప్పియుండెను. కర్మ ఫలములో గూడినదైనచో బంధరూపమగును. ఫలమునపేక్షించక, భగవంతుడే నాచే ఈకర్మలను చేయించుచున్నాడు నేను కర్మలకు కర్తను గాను అని తలచి యాచరించబడు కర్మలు భగవదారాధన రూపములై మోక్షహేతువులగును. ఫలాపేక్షారహితుడై కర్మనాచరించిననూ అగ్ని బుద్ధిపూర్వకముగనో అబుద్ధిపూర్వకముగనో స్పృశించగా మనము మొలచేసిననూ తనంతతానే పడిననూ యెటుల మొలచునో అటులనే కర్మలు గూడ ఫలజనకములగును

అందుచే నీజీవునకు కర్మబంధ మధికమై ఈలోకముననే ఆకర్మఫల మనుభవించవలసి వచ్చును. ఇక మోక్షమెట్లు లభించును. అని భయపడవలదు. కర్మజాలము అగ్న్యాది స్వభావము కలది కాదు. ఫలసంగముతో నాచరింపబడినదే బంధహేతువుగాని ఫలసంగములేక యాచరించబడునది బంధకముగాదు. "త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః। కర్మణ్యభి ప్రవృత్తోఽపి నైవకించిత్ కరోతి సః" ఎవడు కర్మానుష్ఠానమును చేయుచు కర్మఫలమునందాసక్తిని వదలి నిత్యుడగు ఆత్మయందే తృప్తుడగుచు అస్థిరములగు ప్రకృతి తన కాశ్రయమగుననెడి యధ్యవసాయము లేనివాడగునో వాడు కర్మలయందాటు ముఖ్యముతో వర్తించినను ఒక కర్మనైననూ చేయనివాడేయగును. అనియు "నిరాశీర్యతచిత్తాత్మా త్యక్త సర్వపరిగ్రహః శారీరం కేవలం కర్మకుర్వన్నాప్నోతికిల్బిషమ్" ఫలాభిసంధిలేనివాడై విషయాంతర చింతా లేని మనస్సు గలవాడగుచు ఆత్మయే ముఖ్య ప్రయోజనముగా గలవాడగుటచే మిగిలిన ప్రాకృత వస్తువులయందు మమత లేనివాడై శరీరమాత్రముచే సాధింపదగిన కర్మమాత్రమునాచరించువాడు సంసారబంధరూప పాపము నొందడు. అనియూ శ్రీకృష్ణభగవానునిచే చెప్పబడినది. బ్రహ్మోపాసనా మాత్రనిష్ఠులై నిత్యనైమిత్తిక కర్మలను విడుచువారు "నియతస్యతు సన్న్యాసః కర్మణోనోపపద్యతే మోహాత్తస్య పరిత్యాగః

...మనః పరికీర్తితః" నిత్యనైమిత్తిక కర్మలను విడువరాదు. ...విడిచినచో శరీరయాత్రాపిచ తే నప్రసిద్ధ్యేదకర్మ ..." అనునటుల శరీరయాత్రయే సిద్ధింపదు. మరియును శరీర యాత్ర యజ్ఞశిష్టాశనముచే జరుపబడునేని మంచి జ్ఞానము కలుగుచున్నది లేనిచో "తేత్వఘంభుఞ్జతే పాపాయే పచన్త్యాత్మకారణాత్" అనునటుల పాపముగా పరిణమించిన యన్నమునే భుజించుచుందురు. ఇట్టి పాపాశనము వలన మనస్సునకు ఆప్యాయనము కలిగించినచో విపరీత జ్ఞానము కలుగును. అన్నముచే మనస్సు ఆప్యాయితమగునని "అన్నమయం హిసోమ్యమనః" అను ఛాన్దోగ్య శ్రుతి చెప్పుచున్నది. యజ్ఞశిష్టమైననే యాహారము శుద్ధమై రజస్తమస్సుల నశింపజేసి సత్త్వోద్రేకమును గలిగించి బ్రహ్మజ్ఞానమునకును సాధనమగును. కావున నిత్యనైమిత్తిక కర్మలను యావజ్జీవ మాచరించుచునే యుండవలయును గాని విడుచుట యొప్పదు. ఇటుల జ్ఞానోత్పాదకములగు కర్మలను బంధకములనెడి అజ్ఞానము వలన విడుచుట తమఃకార్యమగు అజ్ఞానము వలన గలుగునది గాన తామసము (తమోమూలము) అని చెప్పబడినది అని చెప్పిన రీతిగ తామస త్యాగము గలవారగుటచే విద్యాఫలము నొందక సంసార పతితులగుచున్నారు. కర్మ సన్న్యాసులకు భక్తియోగము దుర్లభము. వారికి మోక్షమున్నూ దుర్లభమే. పుణ్య పాప రూప కర్మ సఞ్చితము ప్రారబ్ధము, ఆగామి అని త్రివిధముగా నున్నది. బ్రహ్మ జ్ఞానమునకు పూర్వ మాచరించబడినదై ప్రబల కర్మాన్తర ప్రతిబన్ధము వలన ఫలోన్ముఖము గాని కర్మ సఞ్చితమనబడును. ఫలము నిచ్చుటకు అభిముఖమగు కర్మ ప్రారబ్ధము. ఇవి పూర్వాఘమని చెప్పబడును. బ్రహ్మజ్ఞానము కలిగిన పిమ్మట చేయబడిన కర్మ ఆగామి ఇది ఉత్తరాఘమని చెప్పబడును. ఇది ప్రామాదికమనియు బుద్ధిపూర్వకమనియు రెండు విధములుగా నున్నది. బ్రహ్మవిద్యా నిష్ఠుడగు ముముక్షువునకు ప్రారబ్ధ కర్మయున్నూ ప్రాయశ్చిత్తము చేయబడని బుద్ధి పూర్వోత్తరాఘమున్నూ అనుభవించ దగినదైయై యున్నది. ప్రాయశ్చిత్తము చేయబడినచో బుద్ధిపూర్వోత్త రాఘమున ఉంచును. బ్రహ్మవిద్యా మాహాత్మ్యము వలన సఞ్చితము నశించును. ప్రామాదికోత్తరాఘము వీనినంటదు. బ్రహ్మజ్ఞాని యొక్క పుణ్య పాప కర్మలు నశించుట అంటకపోవుట అనగా వీనికి ఫలజనకములు కాకపోవుటయే. ఆ కర్మల వలన కలిగిన అదృష్టమే మగును: ఉకరక నశించునా: యనిన వాని పుణ్యమును వాని మిత్రులకున్నూ పాపములను శత్రువులకున్నూ భగవంతుడు పంచిపెట్టి వానిని నిర్మలుని చేసి ముక్తినిచ్చును ఒక పుణ్యపాపములు మరియొకనికి సంక్రమించుట యనగా బ్రహ్మజ్ఞాని చేసిన పుణ్యమునకై వాని ననుగ్రహించ వలసియున్నది. పాపమునకై వానిని నిగ్రహించ వలసియున్నది. వాడు బ్రహ్మజ్ఞానియై మరణించుచున్నందున వానిని నిగ్రహించుటకు గాని అనుగ్రహించుటకు గాని వీలులేనందున వానియందు మైత్రి గలవానికి మైత్రికి ఫలమగు అనుగ్రహమును భగవంతుడీయ వలసియున్నది గాన దానితో పాటు దీనిని జేర్చి వీనిని విశేషముగ అనుగ్రహించును. భాగవతుడగువానిని ద్వేషించిన వానిని నిగ్రహించవలసియున్నది. కావున వీని నిగ్రహముతో పాటు భాగవతుని నిగ్రహమును జేర్చి విశేషముగ నిగ్రహించును. ఇటుల సర్వబంధ విర్ముక్తుడై బ్రహ్మజ్ఞాని మోక్షము నొందును. గనుక మోక్షము నభిలషించు ప్రతి మనుజుడును మోక్షకారణ భూత బ్రహ్మజ్ఞాన (భక్తి) నిష్పత్త్యర్థమై ఫలసంగ కర్తృత్వ త్యాగ పూర్వకముగ స్వవర్ణాశ్రమ విహిత కర్మలనాచరించుచునే యుండవలయును. అని వేదాన్త సిద్ధ మార్గము.

---

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ మద్భాగవత పారాయణము

శ్రీమాన్ కిడాంబి రంగాచార్యులుగారు, విజయవాడ.

శ్లో॥ శ్రీమద్భాగవతం శాస్త్రం యత్ర భాగవతైర్యదా ।
కీర్త్యతే శ్రూయతే చాపి శ్రీకృష్ణస్తత్ర నిశ్చితమ్ ॥౧॥
శ్రీ మద్భాగవతం యత్ర శ్లోకం శ్లోకార్థమేవ చ ।
తత్రాపి భగవాన్ కృష్ణో వల్లవీభి ర్విరాజతే ॥౨॥
భారతే మానవం జన్మ ప్రాప్య భాగవతం నయైః ।

ప్రోక్తం పాపపరాధీ నైరాత్మ ఘాతస్తుతైః కృతః ॥3॥
శ్రీమద్భాగవతం శాస్త్రం నిత్యం యైః పరిసేవితమ్ ।
పితుర్మాతుశ్చ భార్యాయాః కులపంక్తిః సుతారితాః ॥4॥
విద్యాప్రకాశో విప్రాణాం రాజ్ఞాం శత్రుజయోవిశామ్।
ధనం స్వాస్థ్యంచ శూద్రాణాం శ్రీమద్భాగవతాద్ భవేత్ ॥5॥
యోషితా మపరేషాంచ సర్వవాంఛిత పూరణమ్ ।
అతోభాగవతం నిత్యం కోనసేవేత భాగ్యవాన్ ॥6॥

శ్రీ మద్భాగవతము శాస్త్రమనియు యెచ్చట నయ్యది పఠింపబడునో వినుచుండబడునో యచ్చట శ్రీకృష్ణపరమాత్మ నిశ్చయముగా నుండుననియు శ్రీ భాగవతము తీరు మంత్రోపబృంహణమనియు భక్తి జ్ఞాన వైరాగ్య జనకమనియు ఇహపరసాధన భూతమనియు విశేషముగా పురాణములందు ప్రశంసింపబడియున్నది. సప్తద్వీపములు సప్త సముద్రములు సప్త కుల పర్వతములు, సప్తఊర్ధ్వ లోకములు, సప్త అధోలోకములు, సప్తమహా ఋషులు, సప్త స్వరములు, సప్తపురములు యీవిధముగా సప్త సంఖ్యగా పేర్కొనబడినవి. "కలౌ వేంకటనాయకః" అను రీతి శ్రీ వెంకటనాధుడు సప్తగిరుల మధ్య వేంచేసియున్నవాడు, యీ భౌతిక సంబంధము వలననే యే మన దేహము కూడా సప్తప్రాకారములు (అనగా చర్మము లగాయతు శల్యము వరకు ఏడు అంతస్థులు (layers)) కలియున్నది. తన్మధ్యమందు జీవపరమాత్మ నివశించి యున్నాడు. దేహమునను యే అస్వస్థత కలిగినను చర్మగతమైనచో వైద్యులు ఔషధములచే నివారింపగలుగుదురు గాని అంతకు మించిన అనగా శల్యగతమైన యెవరితరమును గాదు. అంతయేల రక్తనాళముకు సంబంధించినను చికిత్సచేయజాలరు. ఉదాహరణకు గాను రక్తనాళములో రక్తము గడ్డకట్టిన (clotting of blood) చికిత్స చేయజాలరు, "శ్రీకృష్ణరసాయనంపిబ" అను పూర్వాచార్యుల సూక్తి ప్రకారములకు అనుబంధముగా నున్న సప్తగిరి మధ్యస్థ శ్రీ వెంకటనాధుని సేవ, సప్తప్రాకార మధ్యస్థ శ్రీరంగనాధుని సేవయే పరమౌషధము ఇయ్యది వైద్యశాస్త్రరీత్యా (Scientific) గా ఒప్పింపదగును పరీక్షిత్ సప్త దినములలో శ్రీ భాగవత పురాణ శ్రవణము చేసి ముక్తి నొందెను. ధుంధుకారి మహాపాపములు చేశి పిశాచ జన్మనొంది శ్రీ మద్భాగవతమును గోకర్ణునిచే సప్త దినములలో విని ప్రేతత్వ విముక్తి నొంది విష్ణులోకము నొందెను.

శ్లో॥ భిద్యతే హృదయగ్రంథిః ఛిద్యన్తే సర్వసంశయాః ।
క్షీయంతే చాస్య కర్మాణి సప్తాహ శ్రవణే కృతే ॥

సృష్టి నిర్వహణార్థము బ్రహ్మ సహితము శ్రీ మద్భాగవత సప్తాహ పారాయణ చేయుచున్నారు.

శ్లో॥ బ్రహ్మతు పరమప్రీత స్తేన కృష్ణాప్తయేఽనిశమ్ ।
సప్తావరణ భంగాయ సప్తాహం సమవర్తయత్ ॥౧॥

శ్లో॥ శ్రీ భాగవత సప్తాహ సేవ నాప్తమనోరథః ।
సృష్టిం వితనుతే నిత్యం ససప్తాహః పునః పునః ॥౨॥

స్వసామర్థ్య వృద్ధికై రుద్రుడు సహితము సప్తాహపారాయణ మాచరించుట విశదము.

అర్థమును గ్రహించి పారాయణ మొనరించుట సర్వోత్తమము. అర్థము తెలిసికొన్న భక్తి జ్ఞానవైరాగ్యములు వృద్ధి పొందగలవు. శ్రీమద్భాగవతగ్రంథము విష్ణుసంబంధమున్న వేదాంత ఘట్టములతో కూడి యుండుటను బట్టియు సరియైన వ్యాఖ్యానములు గానరావు, వీరరాఘవీయ వ్యాఖ్యాన పుస్తకములు పురాతనముగా ముద్రింపబడియుండుటచే ప్రతులు ప్రస్తుతము లభ్యమగుట కష్టము ఇంతకు సంస్కృత జ్ఞానములేని వారికి మరింత కష్టము గనుక ఇట్టి మహత్తరమైన గ్రంథమును పండితులయిన భాగవతోత్తములు సకల చేతనోజ్జీవనార్థము యెల్లరకు సుబోధకముగా నుండునటుల ప్రతి శ్లోకమునకు తెనుగు తాత్పర్యమును రచించి తమతమ జన్మముల పావనచేశికొనుట ఉత్తమమని నాయొక్క ఆశయము. యిందువలన శ్లోకార్థము తెలిసికొన్న పిమ్మటను పారాయణ అతిసులభము కాగలదు. పండితవర్యులు సంకల్పించిన యిది యొక దుర్ఘటకార్యము యెన్నటికిని కాజాలదు. సాలగ్రామ దానము ఉభయతారకము. అటులనే యీ కార్యము కూడ ఉభయతారకము.

శ్రీమద్భాగవతమును సప్తదినములలో పారాయణ చేయనగును. యిందుకున్నూ శక్తి లేని వారు మాసద్వయ పారాయణ చేయవచ్చును. శ్రీమద్భాగవత పారాయణ విధానమును గురించి వ్యాసము "పారాయణ సంపుట పారాయణ" అను శీర్షిక క్రింద "శ్రీ వైష్ణవ పత్రిక లో ప్రచురించబడుచున్నది.

విరాటపర్వము "వర్షప్రదమని" యెల్లరకు విశదమే. అట్టి విరాటపర్వమును విధివిధానముగా కంఠదఘ్నమున ఉదకమునందు పారాయణ మొనరించిన సువృష్టికలుగుట నిస్సందేహము. అట్టి విరాటపర్వమును కూడ సామాన్య జనులకు అనగా సంస్కృతజ్ఞానము లేనివారికికూడ అందుబాటులో నుండునటుల తెనుగు తాత్పర్యము సహా ముద్రించుట యుచితము.

లోకకళ్యాణార్థము క్షామనివృత్త్యర్థము యీ మహాపుణ్యకార్యమును భాగవతోత్తములైన పండితవర్యులు ఒనరించి ఉభయతారక మొనగూర్తురని భగవత్ప్రార్థన మొనరించుచున్నాడను.

"సర్వేజనాః సుఖినో భవంతు !!



శ్రీ బదరీనాథుని సన్నిధానమున శ్రీమదష్టా
క్షరీ మహామంత్రమును, అకుంఠితదీక్షతో
జపముగావించుచున్న శ్రీవిశిష్టాద్వైతప్రచా
రకసంఘ కార్యదర్శిగారైన శ్రీ ఉ. వే.
శ్రీమాన్ అ. చి. శ్రీమన్నారాయణాచా
ర్యులుగారు.



"వారే దీక్షానంతరం హృషీకేశమునకు
బయలుదేరబోవుచున్న దృశ్యము"

శ్రీరస్తు

# ఋషికేశము ఆంధ్రాశ్రమము

అ. చి. శ్రీ మన్నారాయణ.

నాఉత్తరదేశ యాత్రలో నేను సేవించిన పుణ్యస్థలములలో ఋషీకేశము నందలి ఆంధ్రాశ్రమ మొక పవిత్రస్థలము, ఇదిఉత్తరభారతదేశమున హిమవత్పర్వతశ్రేణి ప్రారంభములో హిమగిరివలె ధవళమై, గంభీరమై, యున్నతమై, యుదాత్తమై, సువిశాలమై, పవిత్రపుణ్యోదకములతో నలరారు గంగానదీ తీరసమీపమున, ఆంధ్రకీర్తి శరచ్చంద్రికలను దశదిశల వెదజల్లుచు విరాజిల్లుచున్నది. ఇదిఆంధ్రులమనోభావనవలెనే నిర్మలమై, ఆంధ్రుల వలెనే సర్వజన సోదరత్వముగో, ఆంధ్రులసహజస్వభావమైన, సర్వజన సుస్వాగత దృక్పథముతో, ఆంధ్రనాగరికతను చాటుచున్నది.

ఈఆంధ్రాశ్రమమును శ్రీ శ్రీ శ్రీయోగి సచ్చిదానంద సరస్వతిస్వాములవారు నిర్మించిరి. వీరు తూర్పుగోదావరిజిల్లా, రాజోలుతాలూకా, అవిడియను గ్రామమందు యుత్తమ క్షత్రియులగు కళారివారి వంశమునందు జన్మించిరి. బాల్యముననే, జ్ఞానవైరాగ్య సంపన్నులై, భద్రాచలము వద్దనున్న పాపికొండలలో, కొంతకాలము నిరాహార దీక్షతో తపస్సుచేసిరి. పిమ్మట విశాఖపట్నంజిల్లా, పెనుమాళ్ళ గ్రామంలో ఆశ్రమమును స్థాపించుకొని తపస్సుచేసిరి. ఆటుపిమ్మట శ్రీవిజయనగరం మహారాజుగారి అడవిషికారు గందిలో కొంతకాలమున్నా, పూరిజగన్నాథ దేవాలయములో కొంతకాలము, కలకత్తా కాళీదేవాలయములో కొంతకాలము, కాశీ. అయోధ్య. నైమిశారణ్యములలో కొంతకాలమున్నా గడపి చివరకు ఋషీకేశమునకు యాత్రకైవచ్చు యాత్రికులగు ఆంధ్రులకు బసవగైరా సౌకర్యములు లభింపకపోవుటయు, భాషరాని తనముచ పడుఇబ్బందులనుజూచి, 1939 వ సంవత్సరములో యీ తంధ్రాశ్రమస్థాపనకు పూనుకొనిరి. ఈరాజర్షి అతినిరాడంబరజీవి, మృదుమధురమితభాషి., సువిశాల గంభీర, మనోభావనచే విరాజిల్లు మహాతపస్వి. అప్పుడు మంత్రిపుంగవులై విరాజిల్లుచుండు శ్రీ. టి. ప్రకాశంపంతులుగారు 1-0-0 శ్రీబులుసు సాంబమూర్తిగారు. రు 1-0-0, వి. వి. గిరిగారు రు 1-0-0, శ్రీబెజవాడ గోపాలరెడ్డిగారు రు 5-0-0, శ్రీపప్పు సోమసుందరంగారు. రు 15-0-0, శ్రీ గంటు లక్ష్మన్నగారు రు 3-0-0 శ్రీఅల్లాడి కృష్ణస్వామయ్యగారు. రు 10-0-0, శ్రీకొంతి రామమూర్తిగారు రు 10-0-0 చందాలుయిచ్చి, యీఆశ్రమస్థాపనకు యీస్వామిజీగారిని మిక్కిలి ప్రోత్సహించిరి. ఆవిధముగానే ప్రారంభములో రెండువేల రూపాయల చందాలు సంపాదించి, ఆధనముతో చక్కని ప్రదేశములో 1200 గజములస్థలమునుకొని, ఆశ్రమ కట్టడము పనినిప్రారంభించిరి.

క్రమముగా మనఆంధ్రదాతలు దీని ఆవశ్యకతను గుర్తించి, మిక్కిలి సహాయ మొనర్చు చుండిరి.

ఇప్పటికి సిమెంటుతో, దృఢతరమైన సువిశాలసు సౌఖ్యముతో అలరారు, 64 గదులు, 10 వరండాలతోను, మూడంతస్థుల దివ్యభవనమునుసుమారు 2 లక్షల 15 వేలరూప్యముల వ్యయముతో శ్రీస్వామీజీ నిర్మించిరి. ఈఅపరిచిత ప్రదేశములో, శ్రీస్వామీజీ యొక్క గే వారి స్వశక్తితో యింత అద్భుతమైన నిర్మాణమును చేయగలుగుట, మన ఆంధ్రదేశమున కెంతయో ముదావహము మరియు యిది శ్రీస్వామీజీయొక్క ఆత్మశక్తికిచిహ్నము.

ఇప్పుడింకను సుమారు యెనిమిదివేల గజముల స్థలమును, శ్రీడాక్టరు పట్టాభిసీతారామయ్య, శ్రీ అనంతశయనంగార్ల సహాయముతో సంపాదించిరి. ఇందులో యెకరమైనన శ్రీలక్ష్మీనారాయణ మందిరము, శ్రీఅనంతపద్మనాభస్వామి మందిరము, శ్రీలక్ష్మీమందిరమున్ను, రెండు గోపురములు, రెండు పెద్ద మండపములున్ను 20 గదులు స్థిరనివాసులకున్ను, 30 గదులు తపశ్శాలలకున్ను, 20 వంటగదులున్ను 3 బావులున్ను. మొత్తం మంతటికి ఎలక్ట్రిసిటీయు, రెండవ వైపున శ్రీ చంద్రమహేశ్వర మందిరము, నవగ్రహ మందిరము, ధ్వజస్థంభము యిత్యాది, దక్షిణదేశపుశిల్పత్వముతో దక్షిణదేశపు సాంప్రదాయముతో, నిత్యధూప దీప భోగాలంకారములతో విలసిల్లుచు ముందు ముందు తిరుపతి, రామేశ్వరము మొదలైన దివ్యక్షేత్రములరీతి, యిదియు దివ్యక్షేత్రమై యలరారునట్లు నిర్మాణ మొనర్ప మిక్కిలి కుతూహలముతో శ్రీస్వామీజీ సంకల్పించినారు. ఇందుకు సుమారు 5 లక్షల ధనము అవసరమగునని అంచనా వేయబడినది. ఈపనికై మైసూరుజిల్లాలోని, శివాజు పట్టణమందలి శిల్పి చిన్నస్వామాచారిగారికి, 44 విగ్రహములు మిక్కిలి అధునాతన శిల్పత్వముచే నిర్మించుటకు 10 వేల రూపాయలకు కంట్రాక్టుయివ్వబడినది. పునాదికై రాయి కంకర, సిమ్మెంటు వగైరాలు సంపాదించబడినది పునాది, త్వరలో పనిప్రారంభముకానున్నది. శ్రీస్వామీజీయొక్క యీసంకల్పమునకు ఆంధ్రులందరు విరివిగవిరాళములిచ్చి తోడ్పడవలసియున్నది ఇట్టిమహత్తరమైనపని యీఉత్తర ప్రాంతమందెచ్చటను లేదనవచ్చును.

శ్రీస్వామీజీ యీసంస్థకు యీక్రింది మహాశయులను ట్రస్టీలుగ నేర్పాటుచేసి దీనిని పబ్లికు సంస్థగ రిజిస్టరుచేయించి, జమ ఖర్చులకు వోచర్లతోసహా ఆడిట్ చేయించి ప్రచురించుచున్నారు.

ట్రస్టీలు. సర్. కొంతి వెంకటరామమూర్తిగారు, G. C. S, E ఆక్టింగు గవర్నరుబొంబాయి.
శ్రీమాడభూషి అనంతశయన అయ్యంగారు. పార్లమెంటు డిప్యూటీస్పీకర్ న్యూఢిల్లీ
శ్రీరాజా ఆఫ్ మునగాల
శ్రీమంత్రిప్రగడ నరశింహ పంతులుగారు (E.X డిస్ట్రిక్టకలెక్టర్)
శ్రీశ్యామ శెట్టిపార్థసారథి నాయుడుగారు. (ఆంధ్రయిన్సూరెన్సు కంపెనీ డైరెక్టరు)

శ్రీ పైడా శ్రీరామకృష్ణయ్యగారు. జమీందారు. కాకినాడ.

శ్రీ గోనేని వెంకటసుబ్బయ్యనాయుడుగారు. గూడూరుజిల్లా నెల్లూరు

ఇప్పుడు చేయవలసిన యీ అయిదు లక్షలరూప్యముల పనిని యీ యుదాత్తులైన స్వామి ముఖ్యగ్రహించ సంసిద్ధులైయున్న యెడల యీ సంస్థ పేరు, అదర్శము మార్పుకుండగ యుండుటకై, తాము స్వయముగ మానేజిమెంటు చేసుకొనుటలో, ఆ దాతలకు శ్రీస్వామివారు సహాయించగలమనుచున్నారు. కూడా. ఈ రాజర్షి యొక్క పవిత్రభావము లెంతయున్ గణనీయములు,

వీరి సంకల్పము శీఘ్రకాలములో ఆశ్రితపతి సఫలమొనర్చుగాక. దాతలందరు యుదారహృదయముతో యీ సంస్థకు విరాళములనొసంగి, మిక్కిలి ప్రోత్సాహముతో తమ ధనమును,

జన్మమును సార్థక పరచుకొందురు గాక.

పైనుదహరించిన నిర్మాణకార్యక్రమము అచిరకాలములో పరిపూర్తియై హిమవన్నగరశిఖరముపై అఖండ జ్యోతివలె, అలరారుచు ఆంధ్రత్వమును ప్రకాశింప జేయుచుండుగాక.

---

శ్రీ.ఉ.వే. శ్రీమాన్ పంగల పార్థసారథిఆచార్యులుగారు
ఏలూరు.

## ★ నివేదన ★

శా॥ శ్రీమచ్ఛేష ఖగేశ్వరప్రముఖ సూరిస్తోమమానాద్యలీలా
మానుష్య మహాగుణానుభవ సంలగ్నాన్యయామోదచేతో
ముక్తాత్మ సమర్చితాంఘ్రిసరసముద్భూత ప్రకామానుకం
పామందస్మిత చంద్రికాయత ముఖప్రాగల్భ్య మీ దేహరిం.

శా। నీపిల్పున్ విని వచ్చి నిల్చితిని తండ్రీ ! శూన్యహస్తాలతో
నీపాదమ్ముల కర్పణం బొనరుపన్ దేలేదు నేనే మియున్ !
నాప్రాణమ్మొకటున్న: దద్దత్త్వదధీనంబె ! కృపాదృష్టినీ
వ పాత్రమ్మటకించిపో ప్రపు మనుచుం బ్రార్థింతు నారాయణా !

మ। నిను సంకీర్తన మాచరించుటకుఁగానీ భావహార్మ్యంబులో
నిను బంధించి స్వరూపముం దెలియఁగానీ శక్తి యే లేమ నే
ననభిజ్ఞుండను; మందబుద్ధిని; మదీయంబౌ మనః పుష్పమున్
వినయంబొప్ప భవత్పదాబ్జములకర్పింతుం గ్రహింపంగదే !

సీ॥ చూడు ! మింతకు మించి మెచ్చుకొనఁ దగిన
కానుకేమున్నదో ప్రభూ ! జ్ఞానదీప్తి
సుప్రకాశిత మొనరించి శూన్యహృదయ
మక్షయంబుగ జ్యోతిర్మయంబొనర్పు ! ... 4





# నారీవిభాగము

శ్రీమతే రామానుజాయ నమః



## తిరుక్కోళూర్ పెణ్పిళ్లైరహస్యము

(రచయిత :—శ్రీమన్నారాయణ శ్రీపాదరేణువు వదరాను)

## —— భాగవతము ——

అ॥ దేహత్తై విట్టేనో ఋషిపత్నియై పోలే ॥

తా॥ స్థూలదేహబంధమును వదలితినా ఋషిపత్ని వలె ॥

వి

యమునాతీర మందొకనాడు గో—గోవత్స గోపబాలురతో
శ్రీకృష్ణబలరాములు విహరించుచుండ, గోపబాలురు "కృష్ణా!
ఆకలిగొంటి" మనిరి అందులకు శ్రీకృష్ణుడు వారలను అచ్చట
యాగము చేయుచున్న ఋషుల వద్దకు వెళ్ళి అన్నమడుగ మనెను.

సీ॥ వల్లవులార యీ వనమున విప్రులు బ్రహ్మవాదులు దేవభవనమునకు ।
నరుగుట కాంగిరసాహ్వయ సత్రంబు సలుపుచున్నారదు సనుడు మీరు ।
మా నామములు సెప్పి మైత్రితో నడిగిన నన్నంబు బెట్టెదరనుచు బలుక ।
వారలు చని విప్రవరుల కెల్లను మ్రొక్కి పసులమేపుచు బలభద్రకృష్ణు ।

తే॥ లలసి పుత్తెంచి రిట మమ్ము నన్న మడుగ ధర్మవిదులార, యర్థిప్రదాతలార ।
పెట్టుడన్నంబు శాంతుల బిలిచి తెచ్చి పెట్టుదురు గాదె మిము బోటి పెద్ద లెల్ల!

వ॥ బ్రహ్మవాదులు అన్నము వేడగా గోపకులు నిరాశులై రాగా ।
శ్రీకృష్ణుడు వారల మునిపత్నుల నడిగి రమ్మనిరి ॥

కం॥ గోవుల మేపుచు నాకొని గోవిందుం డన్న మడిగి కొనిరండని
మమ్మిమ్మ వేళం బుత్తెంచెను ధీవిలసితలార రండు తెం డన్నంబుల్ ।
అని. గోపాలురు తెలిపిన వెంటనే మునిపత్నులు

వ॥ గోవింద సందర్శన కుతూహలులై ధరణీసుందరులు సంభ్రమానం
దంబులు డెందంబుల సందడింప భక్ష్యభోజ్య లేహ్య చోష్య పానీయ
భేదంబులం గలిగి సంస్కార సంపన్నంబులైన యన్నంబుల కుంభముల
యందు నిడికొని సంరంభంబుల సముద్రంబునకు నడచు నదుల తెఱంగున.॥

క ॥ భిక్షలు మగలును భార్యలు నష్టము చని వలదనంగ నంబగలడని మా ।
　　ర్గించుచు జగదీశ్వరునకు జక్షన నన్నంబు గొనుచు జనిరా సుదతుల్ ॥
తే ॥ రాజితోత్పలకర్ణపూరములవాని, మహితపల్లవపుష్పధామములవాని ।
　　భువనమోహననటవేషభూతివాని, గనిరి కాంతలు కన్నుల కఱవు దీఱ ॥
క ॥ కని లోచన రంధ్రంబుల మునుమిడి, హరిలలితరూపమును లోగొని, నె ।
　　మ్మనమున బరిరంభించిరి తనుమధ్యలు, హృదయజనిత తాపమువాయన్ ॥
క ॥ పరమేశ్వరార్పణముగ బరజనులకు భిక్షయిడిన బరమపదము నం ।
　　బర గెదరట తుది, సాక్షా త్పరమేశుకు భిక్షసేయ ఫలమెట్టిదియో ? ॥
అని మునిపత్నులు శ్రీకృష్ణునికి అన్నమును తీసుకొని వెళ్ళి నివేదించిరి.
వ ॥ ఇట్లు కృష్ణబలరాములు గోపబాలురతో షడ్రసోపేతంబైన యన్నంబు భుజించి
　　మునిపత్నులారా మీరు యజ్ఞవాటంబులకు వెళ్ళి మీభర్తలతోగూడి ।
　　యజ్ఞమును సాగింపుడు శ్రవణమననధ్యానమ్ములనను కీర్తనంబునను కలుగుప్రీతి,
　　సామీప్యంబున గల్గదు, శీఘ్రంబుననే మీకుమత్ప్రాప్తి కల్గునని ।
　　దీవించి బంపెను. అందులో నొక్క మునిపత్నిమాత్రము భర్తచేత వారింప
　　బడినదై శ్రీకృష్ణుని ధ్యానించుచు గర్మానుబంధంబైన దేహంబును సంత్యక్తంబు ।
　　గావించెనే. స్వామి ! అటుల భక్తిజేసి నా శరీరత్యాగంబు జేసినానా ,
　　　　　　　　శ్రీ రా మా య ణ ము
అ ॥ దశముకన్నె చ్చెటిసినో పిరాట్టియోప్పోలే ॥
తె ॥ దశకంఠరావణుని హతముగావించినానా సీతమ్మవలె ॥
రావణుడు॥　మత్తకోకిల ॥ ఇంచుబోణిరో పుష్పకాఖ్య సమిద్ధమైన విమాన మ ।
　　　　భ్యంచదర్కవిభా విభాసము యక్షునగ్రజు బోర ని ।
　　　　ర్జించి తెచ్చితి హృద్య మయ్యెడ జేరి యిద్దఱ మెంతయున్ ।
　　　　జంచదిష్టసుఖోపభోగము జానపొందుచు నుందమా ? ॥
అని రావణుడు సీతతో మదనోద్దీపితమగు దుర్వాక్యము లాడగా సీతయు,
సీత। శ్లో॥ తృణ మంతరతః కృత్వా ప్రత్యువాచ శుచిస్మితా ।
　　నివర్తయ మనో మత్తః స్వజనే క్రియతాం మనః ॥
అనగా నామాటవినక సీతా నామహిమ వినుము॥
శ్లో ॥ పంచాంగం పాతక శ్చాయం పశ్య బ్రహ్మా కృతో మయా
　　ప్రతీహార స్స్వయం సూర్య శ్శశీ ఛత్రధరః కృతః
　　వరుణో యం జలగ్రాహీ । మార్జకః పవన స్త్విహ
　　అగ్నిః కృతో యం రజకః మాలాకార శ్చ శచీపతిః

దండపాణి ర్యమ శ్చాత్రి దాస్య శ్చాత్రి సురస్త్రియః ।
మార్తాండో నాపిత శ్చాయం గణపః ఖిరరక్షకః ।
మంగళాద్యా గ్రహాః స్సప్త సోపానానామే, ఇవా సనే
ఆందోళికశ్చ కైలాసః ! కుబేరో పివిఃర్ధికః
॥ రావణుని ప్రగల్భములను విని నిర్లక్ష్యముగా ॥

సీత—సీ॥ కూకటిముడికినై కురులు గూడనినాడె జెదరక తాటక పీచమడచె ।
గాధేయు డొనరించు క్రతురక్షణము సేయ బెక్కండ్రు దైత్యులనుక్కణంచె
నవనిపైవిలసిల్లు నఖిలరాజన్యులు వేరెడెత్తగలేని విల్లువిఱిచె।
ఘోరాటవులలోన గృహ్మనుసమయాన ఖరదూషణాది రాక్షసుల జంపె ॥
తే॥ పాదరజమున నొకరాయి బడతి జేసె, లీల మాయామృగంబును గూల నేసె।
రాజమాత్రుండె మేదినీ రక్షకుండు రామభూపాలుడాది నారాయణుండు ॥
గీ॥ అట్టిరాముని కీయబ్ధియనగ నెంత, లంకయన నెంత దనుజుల పొంక మెంత ।
నీవనగ నెంత నీలావు చేవయెంత చెప్ప నేటికి నీ వెఱచెదవుగాక ॥
మ॥ వీరాలాపము లాడనేల వినుమీ విశ్వప్రకాశంబుగా ।
శరా వారము గట్టి రాఘవుడు కోపస్ఫూర్తి దీపింపగా ।
ఘోరాజిన్ నిను డాసిలావుకలిమిన్ గోటీరయుక్తంబుగా ।
గూరాస్త్రంబుల మస్తముల్ దునిమి భుక్తుల్ పెట్టు భూతాళికిన్ ॥
ఆ॥ ధర్మనిత్యుడైన దశరథసుతవక్ష్య ధర్మపత్ని సాధ్వి దరమెనీకు ।
రాక్షసాధముండ రూక్షచరిత్రుండ పాపి నన్ను దాక బాలిశుండ ॥

ఇటుల సీతమ్మవలె రావణుని దూషించి, శ్రీరాములచేత సంహారింపజేసినానా—

పద్మపురాణము

ఆ। పిణ మెటిప్పవిట్టినో తొండమాన్ని హ్మాతే ।
తే। నిర్గత జీవులను బ్రతికించినానా తొండమాన్ చక్రవర్తి వలె ॥

౨

తొండమాన్ చక్రవర్తి రాజ్యపాలన చేయుకాలమున కూర్మ డను బ్రాహ్మణుడు కాశీయాత్ర పోవసమకట్టి రాజువద్ద నేడుమాసములు గర్భవతియైన తనభార్యనున్ను విదేశ్ల ప్రియముగల తనసుతుని ఒప్పగించి తా నారు మాసములలో మరలివచ్చెదనని వెళ్ళెను రాజువారలను ఊరికి దూరముగా నొకగృహమందుంచి ఆరు మాసములకు వలయు భోజన వస్తువులను సమకూర్చియుంచెను. ఆబ్రాహ్మణికి నెలలు నిండి ప్రసవబాధకలిగెను. ఆమె వీధితలుపు తెఱచి ఇల్లువెలుపలకురాను ప్రయత్నింపగా సాధ్యముకాకపోయెను ఎవరో విధివశాత్తుగా గుమ్మము తలుపును చిలుకవేసి పోయిరి. ఆమె ఎంత అఱచినను తెఱువరులకు వినబడనందున

ఆమె నిస్సహాయముగా ప్రసవించి నానాబాధలు పడవలసివచ్చెను. నానాటికి ఆహారసామగ్రిలు తఱుగుచురాగా కూటికు లేక కృశించి ముప్పురును నేలంబడి ప్రాణముల బాసిరి. తొమ్మిదిమాసములైన తర్వాత కూర్ముడు గంగాస్నానము తీరి రాజువద్దకువచ్చి తన భార్యా బిడ్డలను పంపమనెను రాజంత వఱకు ఈవిషయమును బొత్తిగా మఱచెను గనుక దిగ్భ్రమనొంది భటులనంపగావారు పోయిచూచి మూడు శల్యము లున్నవని చెప్పిరి. రాజు దిగులొంది తన యిష్టదైవమైన శ్రీనివాసుని ప్రార్థింప నిశ్చయించుకొని కూర్మునితో వాండ్లు చక్రవర్తితో స్వామిదర్శనార్థమై కొండకు వెళ్ళిరని చెప్పిపంపి రాత్రికానే నరసింహ గుహామార్గముగా మామూలుగనే వెళ్ళి సన్నిధిజేరి శ్రీనివాసునితో తన మహాపరాధమును చెప్పి దుఃఖించి. వారలను బ్రతికించితేసరి లేకుండిన ఈకరవాలముతో నాఅసువుల బాసెదనని వేడుకొనెను. శ్రీవారికి తొండమానుపై అనుగ్రహము గల్గి ఆ మూడస్థులను దెచ్చి నాస్వర్ణపుష్కరిణి పూర్వదిగ్భాగమునందున్న నొకతీర్థములో ముంచ మని ఆజ్ఞజేసెను. అట్లే మూడు శల్యములను దెచ్చి ముంచగా వారలు కరణకళేబరములతో నీటి పైకి వచ్చిరి. రాజుమహాసంతోషముతో కూర్ముడికి అతని భార్యా బిడ్డల నొప్పజెప్పెను. కూర్ము డిన్నాళ్ళెక్కడికి పోయినారని భార్యనడుగగా నామె విష్ణుమాయ చేత బ్రహ్మలోక మును చూచివచ్చినాననెను. సుతుడు సప్తద్వీపములను కైలాసమును శంకరునిదర్శించి వచ్చినా ననెను. "శిశువు" నేను దేవగణములను పర్వతవనములను చూచి వచ్చినాననెను అందఱును సంతోషముగా వెళ్ళిరి. ఇప్పటికిని ఆతీర్థమునకు శల్యతీర్థము అని పేరు బరగుచున్నది.

(తి. అ) తొండమాన్‌వలె అతిమానుష కృత్యమును చేసినానా ?

---

తిరువాయ్ మొళితోని 10 వ పదిలోని మొదటి తిరువాయ్ మొళిలోని పాశురము శ్రీమతి నండూరి ఆనందమ్మగారు. ఏలూరు——

---

1. తాళ తామరై త్తడమణివయల్ తిరుమోగూర్ ॥
నాళు మేవి నన్గమరందనిన్న అశురర్రై త్త గర్క్కమ్ ॥
తోళు నాన్గుడైక్కురుక్కళిల్ కమలక్కణ్ కనివాయ్
కాళమేగత్తెయన్ని మత్తొన్నిలమ్ కదియే ॥

---

మొదటి నించీ కూడా మన ఆచార్లు అర్చావతారమందు విశేష మీదుపాదు పొందియుండిరి వారు తిరుమోగూరిలో వేంచేసియున్న అర్చావతార వైభవమును గురించి పాడినపాశురమిది మనమంతా కూడా దివ్యదేశములలో అర్చాస్వరూపిగావున్న సర్వేశ్వరుని శేవించడము అచ్చట సేవప్రపత్తి చేయడము చేయుటలో ఆశ్చర్యమేమీలేదు ఎందువలననగా పరమపదనాథుని సేవ మనకు దేశాంతరగతజలము మాదిరి వుపయోగము లేదుగదా దేశము కాలము వేరగుటచేత

ఆ రామకృష్ణాద్యవతారముల సేవించుకొందామని సమకాలికులైన నంద దశరథ వాసుదేవాదులకే గాని కాలాం తరులమగుటచేత మనకుపయోగములేదు సరి జన్మాంతరసహస్రేషు తపో జ్ఞాన ముకులవారికే గాని మనబోటి అజ్ఞానులకు అంతర్యామి స్వరూపము గోచరించదుగదా అందువలన మనకు అర్చావతార అనుభవము తప్ప వేరు ఉపాయము లేదు గాని సర్వేశ్వరుని కరుణవలన మయర్వఱ మతినలమ్ అన్నట్లు కొంచెమైనా అజ్ఞానము కలదని భక్తి లభించినవారు ఆళ్వారవుటచేత పరవ్యూహవిభవ అంతర్యామి స్వరూపములను కరతలామలకములుగా అనుభవించుటేగాక! శ్రీకృష్ణపరమాత్మ అనుభవము దగ్గరకు వచ్చేసరికి పత్తుడైయుడియవన్- అనే రకములో వానిగుణ చేష్టితముల యశోదమ్మవలె అనుభవించు గాక కృష్ణా నీకు ఆకలా అందులో దొంగతనమూ దొరికి పోవడమూ అమ్మతాటితో రోలుకి కట్టివేస్తే గట్టిగా నీవు ఏడుస్తువుంటావ్ ఆమె నోరుమూయి అని భయపెట్టితే వెక్కి వెక్కి ఏడ్చితి నాయనా ఏమిటి ఈసౌలభ్యముతండ్రీ అనిఎత్తిరం అని 6 మాసములలా నీబాల్యగుణాను సంధానము తలచుకొని మూర్ఛపొందినారుగదా తిరిగి పిరందవారుంఅన్న పాశురములో శ్రీకృష్ణా నీవు చెఱసాలలో పుట్టడమా పుట్టుతూనే తల్లిదండ్రిల సంకెళ్ళు విడగొట్టుతూ పుట్టావా నీ నవతరించినపుడు పురుటి గదిలో మంగళదీపమైనా లేదుగదా ఒక మంగళవాయిద్యమైనా లేదే మాకొరకు ఎన్నికష్టాలు తండ్రీ అని అచ్చట ఒక 6 మాసాలు మూర్ఛనొందారు గదా, తిరిగి బాలగోపాలుని రాక ఆలస్యమై పోయినదని ప్రణయ రోషము కలిగి మిన్నిడై అని పాశురముల యను సంధానంబులో నాఅంతి గచ్చకాయలు ఇచ్చి పోవయ్యా అని వానితో ప్రణయ కలహము కూడ ఆడిన ఆళ్వార్లు వేయ్ మరు తోళినై మెలియుమాలో అనేపాశురములో బాలగోపాలుడుతనఒడిలో నేవున్నాడు ప్రభాతమైంది పక్షుల కలకలారావమువిని బాలగోపాలుడికి లేగదూడలను మేపడమంటేచాలఇష్టము గనుక. తప్పక తెల్లవారితే వెళ్ళి పోతాడు. వెళ్ళక మానడని వాని సన్నిధిలోనే కృష్ణాచూడుము నీవియోగ దుఃఖముచేత నాశరీరమెలా పాలిపోయినదో అనిదుఃఖించిరి. రామావతారము దగ్గరకొచ్చేసరికి, కర్పార్ ఇరామపిరానై యల్లాల్ మత్తుం కర్పరో అని చదువుకొన్నారు. శ్రీరామచంద్రులను తప్ప మరెవ్వరి నైనను కొనియాడెదరా అని ఈవిధముగా అవతారములను కరతలామలకముగా అనుభవించిన ఆళ్వార్లు అర్చావతారము దగ్గరికొచ్చేసరికి ఒజివిల్ కాలమెల్లా ముడనాయ్ మన్నివళువిలా అడిమై శెయ్యవేండుం నామ్ అని ఎల్లకాలమున్ను ఆపడుకొండలవాని పాదపద్మము లతోనే అన్నికైంకర్యములు చేయవలెను. ఆవెంకటా చలపతే నాకు ప్రాప్యము, అని పాడి అగల గిల్లే నిరయమెన్ను అలర్ మేల్ మంగై యుఱైమార్బా అన్న పాశురములో పిరాట్టితోరిన నాపతు కొండలవాని పాదపద్మములేనాకు శరణము, వేంకటాద్రిమీద వేంచేసివున్న, నాతిరువేంగడ ముడయాను పాదపద్మములే, నాకు శరణ్యము, అని ఉపాయో పేయములు నాకు

అర్చావతార ఎంబెరు మానార్గ తిరువడిఘళ్ళే అని నిరూపించుటయేగాక, నాయికావస్థ పొందినా తాయిమారవస్థపొందినా, దూతలనుపంపినా, అర్చావతారమందే అత్యంత పారవశ్యమును కలిగి యుండిరి. ఆళ్వార్లు నాయకావస్థనుపొందినది అర్చావతారమందే సంగ కోలత్తిరుక్కుఱుం గుడి నంబియైనాన్ కండపిన్, అన్న పాశురములో తిరుక్కుఱుం గుడినంబిని సేవించినపిమ్మట, వాని శంఖ చక్రములతో పీతాంబరముతో నామనస్సు వెళ్ళిపోయినది. అమ్మలారా, మరెందులకు నన్ను కోప ముచేయుదురు. తల్లిగారవస్థ పొందినప్పుడు కంగులుం పగలుం అన్న పాశురములో శ్రీరంగనాథా నాకు మరేనీవిషయములో ఏమితలంచుకున్నావు. అని పాడిరి.

ఆఖరుకు తిరువనంత పురిందగ్గరికి వచ్చుసరికి, పరమ పదమెందులకు ఆపరమపదనాథుడే ఈతిరు వనంతపురములో వేంచేసియున్నాడు. రండి రండి.

కెడుమిడరాయ వెల్లాంకేశవావెన్న, అని వాసని తలుచుకొనుసరికి. ప్రతిబంధకాలన్నీ పోవునురండి. అని పాడిరి ॥సరి॥ ఈతాళతామరై పాశురములోని విశేషమేమి. యనగ ఆళ్వార్ల తిరువాయ్ మొళిపాడి అయిపోయినది. సర్వేశ్వరుడు పరమపదమునకు రమ్మనమని తొందర చేయు చుండెను. వెళ్ళకతప్పదు. వెళ్ళిపోవాలి ॥గాని॥ విరజానదీ స్నాన పర్యంతము ఈజీవాత్మకు వాసనా రేణువులు పోవుగదా అంతపర్యంతము, అర్చిరాది మార్గములో నాకు సహాయ భూతులెవ్వరు, అలవాటైన శరీరమూకూడా రాదు ॥ పెత్తాక్, పెత్తు జజిందార్, అన్నట్లు దేహబంధువులు రారు ఇక దొరికిన సహాయభూతులెవరు. ఈఆత్మ నిక్షేపమును ఎవరి నెత్తిన బెట్టుదును అని ఆలోచించి అందరి ఆత్మల భారము మోసేవాడు ఆసర్వేశ్వరుడే, శబరిమూట. సుగ్రీవునిమూట రాక్షసుడైన విభీషణుని మూట. గుహుని మూట, ధర్మపుత్రాదులమూట, ద్రౌపతిమూట, కాకాసురునిమూట విదురునిమూట, పేరు వారననేల అందరుమూటలు మోయువాడు వాడే. వాడినెత్తినే మన ఆత్మ భారము వేదాము, అని నిర్ణయించుకొనిరి. అటుల నిర్ణయించుకొని ఆళ్వార్లు, అలా భారము వేసేటప్పుడు పరమ పదనాథునినో లేక రామకృష్ణావతారములనోగదా, సహాయంగా తీసుకో వాలి అలా కాకుండా తిరుమోగూరులో వేంచేసియున్న అర్చావతారమునే సహాయంగా తీసు కొని పాడారంటే ఏమనుకోవాలి.

ఆళ్వార్లు ఈప్రకృతిలో ఉన్నారుగన్క ఈప్రకృతి యందలి అర్చావతారములనేక భావన లతో అనుభవించినారనినచో అర్థమున్నది. గాని, ఈతిరుమోగూరుపాసురములగాదే ఈప్రకృ తిలోనా తమరులేరు. ఈశరీర సంబంధము విడచి సూర్యమండలము భేధించుకొని అర్చా మార్గ ముగా వెళ్ళిపోతూన్న ఆళ్వార్లు ఈప్రకృతిలో వేంచేసియుండే అర్చా స్వరూపమునే వారి సహాయ భూతులుగా వరించారంటే ఈ అర్చావతారములో వారు రామకృష్ణాద్యవతారముల నెలాగ సేవిం చినది తెలియపరుస్తున్న పాశురము, ఈ తాళతామరైఅనే పాశురము — "తాళతామరై తడ

మడివయల్ తిరుమోగూర్" విశాలమైన జలసమృద్ధిచేత నిండిన వరిపైరులలో వికసించిన తామర పుష్పములచేత నిండిన అందమైన తిరుమోగూరు సర్వేశ్వరుడు త్రివిక్రముడై మూడులోకములు గొలచినప్పుడే, దేవేంద్రాదులు నమస్కరించితే వారి శిరస్సున ధరించిన మణులకాంతి తామర పుష్పములాంటి పాదములమీద బడి, మణులచే పాదములు పాదములచే మణులు, ఎంతో ప్రకాశించినవి. యిచ్చట తిరుమోగూరులో పండిన వరిపైరులమధ్యను, తామరపుష్పములున్న ప్రకాశించుచున్నవి. అంత అందమైన తిరుమోగూరులో నాళుమేవి ననగమునంయునన్ను, అనగ సుప్రభాతాచమే నిశా" అని ఏదినానికాదినమే అవ్వారి అందము అచ్చట భాగవతుల సంపర్కము చేత కలిగిన ఆనందముతో "అప్పొళుదైక్కప్పొళుదు ఎన్నారావముధములాగ దివ్యదేశము మీద ఆశతో పరమ పదమునుగూడ మఱచిపోయి "తోళునాన్గుడై చ్చురికుళల్ కమలక్కణ్ కనివాయ్" చతుర్భుజములు, నల్లని వెంట్రుకలుగల ఎర్రని చిరునవ్వులతోగూడిన, తామరేకుల వంటి నేత్రాలతో నన్ను కటాక్షించుచు "పాథేయం పుండరీకాక్ష నామసంకీర్తనముగానున్న నాకాలమేఘము, నానీరు నిండిన చల్లని మేఘముతప్ప నాకువేరు సహాయ మెవ్వరులేరు అని కాలమేఘత్తై యన్ని మత్తొన్నిలం కతియే అని పాడినారుగదా ! ఈపాశురమున మనకు తేలినది ఏమనగా ఈప్రకృతియందున్నప్పుడేగాక ఈప్రకృతి కనంతరము రామకృష్ణాద్యవతారముల ను కరతలామలకముగా అనుభవించినఆళ్వార్లు ఈఅర్చావ తారమునే దారి సహాయముగా తీసుకొన్నారు. అంటే ఆళ్వార్లకు అర్చావతారమునం దెటువంటి ప్రపత్తిని కల్గియున్నదీ మనకు తెలియుచున్నది. — వారే అర్చావతారమందు అంత ప్రావణ్యాము, కలిగియుంటే మనచోటి అజ్ఞులకు దివ్యదేశములు తప్ప వేరు ప్రాప్యప్రాపకములు లేవని చెప్పవలెనా ? యిందువలననే పిళ్లైలోకాచార్యులువారు కూడా ఉగందరుళిననిలంగళిలే ప్రవణనాయ్ ఇరుక్కవేణుం అని దివ్యదేశములయందు ప్రావణ్యము కలవారే ద్వయ మంత్రమునకు అధికారి. అందువలన ఎంబెరుమాన్ పూర్వము సౌబరి అను ఋషీశ్వరుడు 60 మంది భార్యలను తృప్తిపరచుటకొరకు 60 మంది సౌబరి రూపములను పొంది తృప్తిపరచినటుల మనకొరకు 108- దివ్యదేశములయందు వేంచేసియున్నాడు. ఆదివ్యదేశములే మనకు ప్రాప్యప్రాపకము అని మన పూర్వాచార్యులు ఏకవిధముగా సాధించిరి గాన అర్చావతారమునందు ప్రావణ్యమే మనకు శరణ్యము

ఈపాశురముసంగతి మనస్సులో నుంచుకొనే॥కుజల్, ఆచ్చియర్. మత్తినాలోశై ప్పడుత్త తయిరరవం కేట్టిలయో" "అని తిరుప్పావైలో" ఆండాళ్ తల్లిపాడినారు. సూర్యోదయము కావలెను నేను లేవనని లోపలవున్న గోపిక చెప్పితే ఇంకా సూర్యోదయము కాలేదంటారేమి మహానుభావులైన నమ్మాళ్వారనే కవ్వముతో శిష్యులశరీరము అనే దధిఘటములను మథనము చేస్తే ఒకఘోష పుట్టినది తిరువాయ్ మొళిప్రబంధము అని పరమ పదమువరకు వెళ్ళినది శ్రవణములను పాలన చేయుచు

న్న టుల వున్నది, కంట్రోల్ పోయిన తరువాతకూడా కొరతగా తినేవారిమాదిరి, — నమ్మాళ్వార వతరించి అపూర్వ రసభావములు కలిగించిన తిరువాయ్ మొళిని, పరమ పదమున కూడా అర్చావతార ఆధిక్యమును, కలిగించిన తిరువాయ్ మొళిని, పాడుతూవుంటె ఇంకా హావు హావు అహామన్న అహామన్న మంటూ కూర్చున్నారే అని హేళన చేయుచున్నట్లున్నది. ఆదివ్య ప్రబంధఘోష యింకా తెల్లవారలేదంటూ వేనుమ్మా ఆనిసదా శ్రీఆండాళ్ తల్లిభావము. యింకా ఎన్నో భావములు కలవు.

## తులసి మహిమ

శ్రీమతి ముడుంబై రామానుజమ్మగారు.
రాజమండ్రి.

తులసి ఒకమహా భక్తురాలు. ఆమెభగవంతుని గురించి తపస్సుచేసెను. సర్వేశ్వరుడామెకు ప్రత్యక్షమై నీకేమికావలయునో కోరుమని చెప్పగా, కులశేఖరాళ్వార్లు తిరువేంగడముడయాన్ సన్నిధిలో పడియాయ్ కిడందున్ పవళవాయ్ కాణ్బేనే, అనగా మెట్టునై పడియుండిమీ అధరామృతము సేవించుచుండడమేనాకు ముఖ్యమైనదియని కోరినట్లుగా నాకుగూడ మీాదృఢమైన తిరువడిఘళ్ పొందియుండడమే నాకోరికయని భక్తురాలుచెప్పెను, అంతట పెరుమాళ్ళు నిన్ను భూలోకమందు, మొక్కగ యవతరింపచేసి నిన్ను తరింపచేయుదుననిరి. ఆమె భగవత్కటాక్షముచేత శ్రీవిల్లి పుత్తూరనెడి దివ్యదేశంలో భాగవతోత్తముల యింట్ల యందు తులసి మొక్కగ నవతరించినది, అప్పుడు పెరుమాళ్ళుభాగవతోత్తము లందరికి స్వప్నముగ సాక్షాత్కరించి మీాపెరటియందు తులసిమొక్కలున్నవి, అవిమీాకు గుర్తుగ చూచుకొనుటకు చల్లదనము మార్దవము, పరిమెళ మనెడిగుణముతో కలిసి యొప్పారు చుండును. అది ప్రతిదినము వాటి దళములు కోసి నా పాదపూజ చేయవలయునని అజ్ఞ అయినది. అప్పుడు భాగవతోత్తము లందరు. శ్రీ విల్లి పుత్తూరు నందు ఈస్వప్న వృత్తాంత మొకరుచెప్పగ, అందరునదే మాదిరిగ తమస్వప్న వృత్తాంతములను ఒకే రీతిగ చెప్పుకొనిరి వారు పెరటిలో చూడగ పెరుమాళ్ళు అజ్ఞ ఇచ్చిన విధముగ, చల్లదనము మార్దవము, పరిమళము అనెడి మూడుగుణములతో నొప్పారుచున్న తులసినిచూచి, ఆశ్చర్యచకితులై, దళములను కోసి భగవదాజ్ఞాను సారముగ వారి తిరువడిఘళ్ళమీాద సమర్పించిరి.

అప్పుడు భక్తురాలు కోరిక నెరవేరినందులకు యామెచాలయానందముతో నిత్యయవ్వనముతో పెరుమాళ్ళ తిరువడిని ఆశ్రయించియున్నది. ఇట్లు కొంతకాలము గడచిన పిమ్మట సర్వేశ్వరుని వక్షస్థలమందున్న లక్ష్మిదేవి తులసినిపరిహాసించెను, అప్పుడు తులసివాడిపోయి. మనస్సు క్లేశపడిపోయి, నిత్యయవ్వనముపోయి ఎండి సురుగైపోయి యుండుటంచూచి పరాత్పరుడైన సర్వేశ్వరుడు ఏమికారణమాయని విచారించగా, లక్ష్మివలన వచ్చిన పరాభవమని గ్రహించిరి.

ఈభక్తురాలైన తులసియందుండెడి వాత్సల్యముచేత వారికి మరల తనప్రియ భాగవతోత్తములందరికి తమ తిరువడియందు తిరుత్తుళాయిని సమర్పింపవలదని మాలలుగ కట్టితమయొడలుకును. కిరీటమునకును అలంకరించ వలసినదని యాజ్ఞ యిచ్చిరి. వారందరును పెరుమాళ్ళ యాజ్ఞను సారముగచేసిరి. అప్పుడు కొంచెము కాలముకాగా ఈతులసి అనే భక్తురాలు లక్ష్మితో ఓలక్ష్మి నీవు నాకంటె దిగువైతివే! నేను నీకంటె అధికురాలనైతిని. నీవు వక్షస్థలమునందుంటె నేను శిరో భాగమారోహించితిని గాన నేను నీకన్న ఘనురాలను అని పరిహాసించెను. అందుకు లక్ష్మి సిగ్గుపడి సర్వేశ్వరుడేకాంతముగ రత్నసింహాసనముపై గూర్చుండి యుండగ లక్ష్మి ఆయనను "సీకు ఎట్టి కైంకర్యము చేసినదాసురాండ్రియందు ప్రేమకలుగునో ఆకైంకర్యము దాసురాలికి కటాక్షించ వలయునని ప్రార్థించగా. పెరుమాళ్ళుమందహాసము చేయుచు, భూలోకమందు పుష్ప కైంకర్యము చేయుచున్న నాప్రియ భక్తులైన విష్ణు చిత్తులతో గూడ నీవు పుష్పకైంకర్యము చేసిన నాకుచాల ప్రియమని పెరుమాళ్ళు ఆనతిచ్చిరి. అప్పుడు ఈతులనే దాసురాలిని కటాక్షించమని లక్ష్మి వేడు కొనెను. పెరుమాళ్ళు ఈమెయందు ప్రేమ కలిగి భూలోకమందు తులసి వనములో చిన్న పసిపాపగ నవతరింపచేసెను. విష్ణుచిత్తులు తులసిని కోయుటకు వనమునకేగెంచగ, ఈపసిపాపను చూచినటపత్రశాయి సన్నిధికి తీసుకొనిపోయి ఈసంగతివారితో విన్నవించగ. నట పత్రశాయి ఆమెకు గోదా దేవియని నామకరణముచేసి మీరు పెంచు కొనుడని ఆజ్ఞ ఇచ్చెను. వారామెను పెంచి వారితో కూడ కైంకర్యము చేయించుచునుండిరి. చూచితిరా ! ఏతులసినీను పరిహాసించెనో ఆతులసినే చేతులార పెరుమాళ్ళకు సమర్పించ వలసి వచ్చినదే! లక్ష్మిగర్వము పూర్తిగపోయినది. ఈతులసివల్లనే గదా. సత్యభామ గర్వభంగము కూడఅయినది ఈ తులసీ దళమహిమ అద్భుతమైనది,






## శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ పండితసభలు.

### మైలవరం

ఈ ఖరనామ సంవత్సర ఆశ్వీజ బహుళ విదియా మంగళవారం (16-10-51) మొదలు 3 రోజులు మైలవరం గ్రామములో శ్రీ వెంకటేశ్వర స్వామివారి దేవాలయమున శ్రీ ఉ. వే. శ్రీమాన్ శ్రీ పరాశర సుదర్శనభట్టరు అయ్యవార్లంగారి అధ్యక్షత క్రింద శ్రీమతి శ్రీ శ్రీ శ్రీ రాజా సూరానేని శ్రీ వర మంగయ్యమ్మ అనే చెల్లాయమ్మ రావుబహుద్దరు జమీందారిణి వారి ప్రోత్సాహము వలన శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ పండిత సభలు అతి వైభవముతో జరుపబడినవి.

ప్రతిదినము ఉదయము గం 8-0 లకు కోవెలలో పెక్కుమంది భాగవతోత్తముల సేవాకాల గోష్ఠితో బాల భోగమున్ను అటుపిమ్మట 11 గంటలవరకు వివిధ వేదాంతోపన్యాసములున్ను గావింపబడినవి.

మరల మధ్యాహ్నం గం 4-0 లు మొదలు గం 9-0 ల వరకును ఉపన్యాసములు గావింపబడినవి.

గ్రామస్థులగు స్త్రీలును, పురుషులును శ్రద్ధాభక్తులతో రెండువేళల వచ్చి మిక్కిలి ఆదరముతో నిశ్శబ్దముగా ఉపన్యాసములను విని యానందించిరి. ఇంకను గ్రామాంతరములనుండి పెక్కుమంది యీ సభల నిమిత్తమై వచ్చిరి.

శ్రీ శ్రీ రాణీవారు పండితులకును, గ్రామస్థులగు శ్రీవైష్ణవులకును గ్రామాంతరములనుండి వచ్చిన వారి కందరకును కోవెలలోనే బ్రహ్మాండముగు తదీయారాధనను జరిపించిరి.

రాత్రి ప్రతిదినమును పండితులందరును కలసి శ్రీస్వామివారి సన్నిధిలో నతి శ్రావ్యముగా శ్రీ సహస్రనామ పారాయణమును గావించిరి. పిమ్మట తీర్థ ప్రసాద గోష్ఠితో ఆనాటి కార్యక్రమము ముగియు చుండెను.

రెండవదినము ఉదయము శ్రీస్వామివారికి శాస్త్రోక్త విధానముగా పండితుల ఉపనిషత్పారాయణతో శతకలశాభిషేకము గావింపబడెను. అపరిమితముగ భోగము శ్రీస్వామికి నివేదింపబడి పెక్కుమంది భక్తులకు వినియోగింపబడెను.

ఈ సభకు శ్రీ శ్రీ శ్రీ రాణీవారును వారి పరివారమును ఇంకను గ్రామస్థులును ఆహ్వాన సంఘాధ్యక్షులును కార్యదర్శులు సభ్యులును గావించినసేవ నిరుపమానము ఇందు శ్రీమాన్ మనికొండ వెంకటలక్ష్మయ్య శ్రేష్టిగారి శ్రద్ధాభక్తులు ప్రశంసనీయములు.

వీరందరికిని శ్రియఃపతియగు శ్రీనివాసుడు సమస్త సౌభాగ్యములకు భగవద్భాగవతభక్తిని ఉత్తరోత్తర పెంపొందించి రక్షించుగాత!

ఇచ్చట ఇదే ప్రథమ సభయైనను ఇంతి వైభవముగా జరుగుట ఆశ్చర్యావహమును ముదావహమును అగుచున్నది.

ఈ సభకు శ్రీ కో. యి. శ్రీనివాస రామానుజాచార్యులుగారు కో, కం. రంగాచార్యులుగారు, న. చ. సం. జగన్నాథతిరువెంగళాచార్యులుగారు, శ్రీ తి. కు. రామానుజస్వామిగారు, కవిరత్నగుదిమెళ్ళ రామానుజాచార్యులుగారు, శ్రీరంగం న. చ. రఘునాథాచార్యులుగారు, మొలుగు రామానుజాచార్యులుగారు, మహాభాష్యం వరదాచార్యులుగారు ప్రభృతులు విచ్చేసిరి. శ్రీ శ్రీ సీతారామ యతీంద్రుల వారి భజన రెండవ దినం రాత్రి జరుపబడెను. వారు భగవద్భక్తిలో తన్మయులై సభ్యుల నందర తన్మయులు గావించుచు రెండుగంటలకాలము భజన గావించిరి. శ్రీ శ్రీ రాణీవారే [illegible] యీసభకగు ఖర్చునంతను భరించి పండితులకు సంతృప్తిగ సన్మానించిరి.

ఇట్లు,
శ్రీ వి. ప్ర. సంఘకార్యదర్శి.

## సంభావన

గవర్నరుపేట విజయవాడ శాఖ రు 58 లు సమర్పించిరి.

| | |
|---|---|
| మోటమఱ్ఱి చూడామణెమ్మగారు [illegible] మొ (సంఘము తరపున) [illegible] దున ఆచార్య సంభావన | 5-0-0 |

[illegible]

| | |
|---|---|
| నూనె మహాలక్ష్మమ్మగారు | 5-0-0 |
| మాంబళ్ళ రంగనాయకమ్మగారు | 5-0-0 |

కట్నములు

| | |
|---|---|
| శివకోటి రాజలక్ష్మమ్మగారు | 1-0-0 |
| చింతలపూడి సామ్రాజ్యం | 1-0-0 |
| మాపుగంట లక్ష్మీనరసమ్మ | 1-0-0 |

ఇట్లు,
తమ విధేయురాలు
దాసానుదాసురాలు
కె. ధనమ్మ.

## నెల్లూరు

ఈ రాబోవు కార్తీక మాస సభలు నెల్లూరులో జరుపబడుటకు ప్రయత్నములు గావింపబడుచున్నవి. తప్పక జరుగుననియే ఆశించుచున్నాము.

# శ్రీ గీతామందిర ప్రారంభోత్సవము

(107 వరదాముత్తియప్పన్ వీధి మద్రాసు 1)

గత సంవత్సరము కార్తీక మాసములో ప్రారంభింపబడి బ్రహ్మాండ వైభవముతో మదరాసు నగరమున శ్రీ ఉప్పుటూరు వారి రామానుజ కూటములో మన సంఘముచే నిర్వహింపబడిన శ్రీ గీతాసందేశోత్సవ ఫలితంగా నచ్చట ఆదర్శముగ పని చేయుచున్న శ్రీ యతిరాజసేవా మహిళా సంఘము వారిచే సుమారు నలుబది వేల రూపాయల ఖర్చుతో కొనబడిన దివ్యమందిర ప్రారంభోత్సవము శ్రీ గీతావతార దివసమగు పరమపవిత్రమైన యీ మార్గశిరశుద్ధఏకాదశి ఆదివారం (9-12-51) ఉదయం గం 10-1లకు గావింపబడును.

ఉత్సవము ఈక్రింది విధముగా వారము దినములు మన సంఘ యాజమాన్యమున నిర్వహింపబడును.

9—12—51 ఆదివారం

ఉదయం: తిరువీధి (గీతాపఠనముతో)

| | |
|---|---|
| గం 10-1 లకు | గృహాప్రవేశం |
| | శ్రీ శ్రీ శ్రీ మైలవరం రాణీ వారిచే మన సంఘమునకు సమర్పింపబడిన శ్రీ శ్రీ శ్రీ అరంగ నగరప్పన్‌స్వామి వారు వారి పరివార తిరువారాధన ప్రారంభోత్సవము |
| | శ్రీ గీతాజయంతి అంకురార్పణము |
| | శ్రీ గీతా అఖండ పారాయణ ప్రారంభము |
| | కేంద్ర కార్యాలయ ప్రారంభోత్సవము |
| మధ్యాహ్నం: | శ్రీ యతిరాజ సేవా మహిళామండలి కార్యాలయ ప్రారంభము |
| | గీతోపన్యాస ప్రారంభము |
| రాత్రి : | మన సంఘముచే ప్రకటింపబడిన శ్రీ కృష్ణార్జున సంవాద మనెడు గీతా నాటక ప్రదర్శనము. |

10—12—51 సోమవారం

| | |
|---|---|
| ఉదయం : | తిరువారాధన |
| | తిరువీధి |
| | గీతామందిరమున గీతా సమష్టి పారాయణము |
| | గీతాఅర్థవివరణము |
| | ఉభయ వేదాంత పాఠశాల ప్రారంభోత్సవము |

మధ్యా: విదుషీమణులచే గీతోపన్యాసములు

పండిత గీతోపన్యాసములు

రాత్రి : శ్రీ "కవిరత్న" గుదిమెళ్ళ రామానుజాచార్యులగారిచే అపూర్వముగా రచింపబడిన "శ్రీ యతిరాజవిజయ"మను బుఱ్ఱకథా ప్రదర్శనము.

విశేషోత్సవములు

11-12-51 మంగళవారం బాలికా పాఠశాల ప్రారంభోత్సవము

12-12-51 బుధవారం శ్రీ శ్రీ శ్రీ మైలసరం రాణీగారు మొదలగువారు సంఘమునకు సమర్పించిన శ్రీ కోశములతో సంప్రదాయ గ్రంథాలయ ప్రారంభోత్సవము

13-12-51 గురువారం సంప్రదాయ గ్రంథ విక్రయశాల ప్రారంభోత్సవము

14-12-51 శుక్రవారం స్త్రీల కాలక్షేప ప్రారంభోత్సవము

15-12-51 శనివారం ద్రావిడ వేదాంత విభాగ ప్రారంభోత్సవము

ఆనాటి రాత్రి తిరుప్పావై వినోదము

కార్యక్రమము వివరముగా యథావకాశమందరకు ముందు అందజేయబడ వచ్చును,

ఇట్లు,

శ్రీవిశిష్టాద్వైత ప్రచారక మదరాసు నగర శాఖాసంఘము

శ్రీయతిరాజసేవా మహిళా సంఘము (మదరాసు శాఖ)

కేంద్ర సంఘ కార్యదర్శులు:- తే. కం. గోపాలాచార్యులు

ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులు

# శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ ఉత్తరదేశ ప్రచారము

గార్వాలా బదరి క్షేత్రములో ఈ సంఘ శాఖ ఏర్పాటు చేయబడినది దీనికి అధ్యక్షులు శ్రీ శ్రీ శ్రీ సుదర్శనాచార్య స్వామి (శ్రీ రామానుజ కూట మహంతు ప్రతినిధి)

కార్యదర్శులు:- శ్రీ శ్రీ శ్రీ కృష్ణప్రపన్నాచార్యస్వామి (కిచడీస్వామి)

దేవ ప్రయాగలో ఈ సంఘ శాఖ ఏర్పాటు చేయబడినది.

అధ్యక్షులు:- శ్రీ శ్రీ శ్రీ నరహరిశాస్త్రీజీ

కార్యదర్శులు:- శ్రీ శ్రీ శ్రీ మురళీధరాచార్యజీ

## హెచ్చరిక

"శ్రీ గీతామందిర శ్రీ మదుభయ వేదాన్త

పాఠశాలా ప్రారంభోత్సవములు

[107 వరదా ముత్తియప్పన్ వీధి. మద్రాసు 1]

స్వస్తిశ్రీ ఖరనామ సం॥ర మార్గశిర శు ౧౧ శ్రీ ఆదివారం [9-12-51] ఉదయం గం 10-0 లకు శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘముచే మద్రాసు నందలి వరదాముత్తియప్పన్ వీధిలోని 107వ నంబరు గల శ్రీ గీతామందిర ప్రారంభోత్సవముతో పాటు ఉభయవేదాంత పాఠశాలయు ప్రారంభింపబడును. అందు రెండు సంవత్సరము లవిచ్ఛిన్నముగా శిక్షను పొందగోరు అధికారులు తమ యోగ్యతలను తెలుపుచు నవంబరు నెలాఖరులోగా కార్యాలయమునకు దరఖాస్తులను పంపుకొనవలెను. ప్రస్తుతము కొద్దిమంది విద్యార్థులకే యవకాశ మొసంగబడును గాన యోగ్యతలను బట్టియే చేర్చుకొనబడుదురు.

ఇట్లు,

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ కార్యదర్శి.

దరఖాస్తులు పంపవలసిన అడ్రసు

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ కార్యదర్శి, కోరుకొండ

(వయా) రాజమహేంద్రవరం, తూర్పు గోదావరి జిల్లా.

## రాజమహేంద్రవరం

### శ్రీ యతిరాజ సేవా మహిళా సంఘము

ఈ సంఘమునకు అధ్యక్షులగు శ్రీమతి రామినీడి రాయలమ్మగారు శ్రీమతి ముడుంబై రంగనాయకమ్మగారు కార్యదర్శిని యగు ముడుంబై రామానుజమ్మ గారున్ను శ్రీ. వి. ప్రచారక సంఘ ఆదేశాను సారముగా యీ క్రింది సభ్యురాండ్ర సంపూర్ణ సహాయముతో శ్రీ వేణుగోపాలస్వామివారి ఆలయమున ప్రతి ఏకాదశికిని శ్రీ భగవద్గీతా సమిష్టి పారాయణ ఉపన్యాసములు జరిపించుచు యీ సంవత్సరమంతయు గడిపి యీ నెల 10వ తేదీ ద్వాదశీ శనివారంనాడు సదరు ఆలయములో విశేష భోగ రాగాదులు జరిపించి సహస్రనామార్చనము గీతోపన్యాసములతో శాత్తుమర మహోత్సవమును నెరపిరి.

ఆసందర్భమున మన సంఘమునకు రు 5-0-0లను విశాలముగా సమర్పించిరి.

ఇందు విశేషించి శ్రద్ధాభక్తులతో పాల్గొన్న ఇతర సభ్యురాండ్రు—

శ్రీమతి నున్న లక్ష్మీతాయారమ్మగారు శ్రీమతి చిట్టూరి సుభద్రమ్మగారు

,, కుమ్మరగుంట పుల్లమ్మగారు ,, ఈయుణ్ణి రంగనాయకమ్మగారు

,, నున్న మాణిక్యాంబగారు ,, పాలకోడేటి మంగమ్మగారు

,, శ్రీ కమలాభాయమ్మగారు మొదలగువారు

మైలవరంలో శ్రీ శ్రీ శ్రీ రాణీవారిచే జరిపింపబడిన సభయే కార్తీకమాస సభగా పరిగణింపబడినది.

మార్గశిర మాస సభ — మదరాసు చీరాలలలోను

పుష్యమాస సభ—పంగోలులోను, మాఘమాస సభ—నడిగడ్డపాలెములోను

జరుపబడవచ్చును.

కార్యదర్శి.

---

    

శ్రీమతే రామానుజాయనమః

# శ్రీ కోదండరామక్రతువు

ఇది శ్రీవాల్మీకియొక్క అపరావతారమన దగు శ్రీ శ్రీ వాసుదాసు గారికభిమానాస్పదమగు దివ్యక్షేత్రము ఇందే శ్రీవారు తమ ఆంధ్రవాల్మీకి రామాయణమును దానికి మందర వ్యాఖ్యానమును రచించిరి ఇచ్చట వారిచే నేర్పాటు గావింపబడిన ఒకఆశ్రమముగలదు అందు శ్రీవారిహస్తాక్షరీ రామాయణము (మందరముతోను)న్ను శ్రీవారితిరువారాధనయు వారిపుస్తక భాండాగారమున్ను సురక్షితమై నిత్యము పూజింపబడుచున్నవి, ఇట్టిపరమపవిత్రమును ప్రశాంతమును నగు-ఈయాశ్రమమున శ్రీకోదండరామసేవక సమాజమను పేరుతో శ్రీమాన్ కూనంనేని వెంకటప్పదాసుగారనెడు శ్రీవారిఆంతరంగిక ప్రియశిష్యులును పరమసాత్వికులునగు నొకవ్యక్తి సుమారుపదహారుసంవత్సరములనుండి అఖండ రామసంకీర్తనమును గావించుచున్నారు. వీరికి తోడుగాబంగారునకు పరిమళమువలె విద్వాన్ సాహిత్యవిద్యా ప్రవీణ శ్రీమాన్ కోడూరి వెంకటాచార్యులుగారు పనిచేయుచున్నారు ఈమధ్య శ్రావణమాసములో నిచ్చటజరిగిన మనసంఘ పండితసభకు విచ్చేసిన భాగవతోత్తములీప్రశాంతిని యీరామణీయకమును గ్రోలి పరమానందముతో దీనియభివృద్ధికిగాంచిన మంగళాశాసనమునకు ఫలితముగా నీమాఘమాసములో శ్రీవారి జన్మదినోత్సవ సంరంభమున సుమారు నూరుగురు మహాపండితులతో నీయాశ్రమమున శ్రీ వి. ప్రచారకసంఘమూజ మాన్యమున "శ్రీకోదండరామక్రతువు"

6 దినములు ప్రతిదినం ఉదయం చతుర్వింశతి రామాయణ పారాయణలున్ను దానికంగముగా యజుర్వేదము, నాలాయిరదివ్య ప్రబంధములు, శ్రీవిష్ణుపురాణం,శ్రీభాష్యం, గీతాభాష్యం,

మొదలగుపారాయణలున్ను లక్ష అష్టాక్షరీ మహామంత్ర ఆహుతులును తదంగతర్పణములును మధ్యాహ్నము మనసంఘ పండితపరికాండులచే శ్రీమద్రామాయణ విషయములను గూర్చి పండితపామర రంజకమగు ఉపన్యాసములున్ను గావింపబడును .

ఈ ఉత్సవములు పుష్యంగర శుక్రవారం (25-1-1952) నర్రాత్రి అంకురార్పణతో ప్రారంభింపబడి చతుర్థి బుధవారం 30-1-52 పూర్ణాహుతి 31-1-52 అవభృదములతోను సమాప్తిగావింపబడును .

ఇందు నిమిత్తమై వేంచేయు భాగవతోత్తముల కందరకును తదీయారాధన బస వగైరా ఏర్పాట్లు గావింపబడును కావున సంఘాభిమానులు శ్రీవాసుదాసుగారి శిష్య బృందము యావత్తుందియు ఇందుపాల్గొని దీనిని వైభవోపేతముగా జరిపించ గోరుచున్నాము.

ఆ తరుణమునకు ఎవరికి లభించినన్ని తులసీదళములు వారు తెచ్చి సమర్పింపవలెను .

ఇట్లు .

శ్రీకోదండరామసేవకసమాజం నడిగడ్డపాలెం .

చుండూరు పోస్టు (వయా) తెనాలి గుంటూరుజిల్లా .

## వంగోలు

ఈ నగర సంఘమువారు గడుంగడు శ్రద్ధాభక్తులతో అతి వైభవముగా మూడు సంవత్సరములనుండి మన సంఘ పండితులచే నిరంతర కాలక్షేప గోష్టిని సాగించుచునే యున్నారు.

శ్రీమద్రామాయణ, శ్రీవిష్ణుపురాణ, అష్టాదశరహస్య, ఆచార్యహృదయ తిరుప్పావై, గీతాది ప్రబంధములు ॥శ్రీ ఉ. వే. శ్రీమాన్ కో. కం. రంగాచార్యులుగారు 2 సంవత్సరములు సాయించిరి.

ప్రస్తుతం శ్రీ ఉ. వే. శ్రీమాన్ కో. ఋ. శ్రీనివాస రామానుజాచార్యులుగారు సంస్కృత భారతము నుండి శ్రీకృష్ణరాయభారం సాయించుచున్నారు.

వీరు సుమారొక సంవత్సరమునుండియు బృహద్బ్రహ్మ సంహిత ఉత్తరరామాయణాది గ్రంథములను సాయించిరి. ఇట్లే అంతటను జరుగవలెనని ఆశించుచున్నాము.



ఖరనామ సం॥ర ఆశ్వీజ శు ౧౩శి శనివారం (13-10-51) తేదీ మొదలు 3 దినములు నిజయవాడలోని క్రొత్తగుళ్ళలో బాపట్ల వాస్తవ్యులైన శ్రీ ఉ. వే. శ్రీమాన్ కొమాండూరి యిళైవిల్లి శ్రీనివాస రామానుజాచార్యులుగారి అధ్యక్షత క్రింద శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ ఆశ్వీజమాస పండితసభ అతి వైభవముగ గావింపబడెను.

శ్రీ పారేపల్లి వారి రామానుజకూటము పండితులకు విడిదిగా నొసంగబడెను. ఆ రామానుజకూట ట్రస్టీలు ఉదారాశయముతో సభలు 3 రోజులును ఆసనులకై వేంచేసిన పండితులు శ్రోతలు మొదలగువారి కందరకును షడ్రసోపేతమగు తదీయారాధన నేర్పాటు గావించి రామానుజ కూట నిర్మాతల ఉద్దేశములను సఫలపరచిరి. ఆ ట్రస్టీలలో ముఖ్యులును, రామానుజకూట స్థాపకుల వంశీయులునగు శ్రీమాన్ పారేపల్లి సీతారామయ్య శ్రేష్టిగారు రాత్రిం బవళ్లు అచ్చటనే వేదికయుండి ఏలోటును లేకుండా అపరిమిత శ్రద్ధాభక్తులతో యీ ముఖ్యతమ తదీయారాధన కార్యక్రమమును నిర్వహించి పండితుల శుభాశీస్సులకు పాత్రులైరి. పండితులపట్ల వారి గౌరవ ప్రపత్తులు వర్ణనాతీతము.

ఉదయము ఆ రామానుజ కూటమున తీర్థప్రసాద గోష్ఠికి పెక్కురు భక్తులు విచ్చేయుచుండిరి. రెండుపేళలయందును పెక్కుశ్రోతృజన మతిశ్రద్ధాభక్తులతో సభ నలంకరించి ఉపన్యాసములను విని ఆనందించు చుండిరి. శ్రీ ఉ. వే. శ్రీమాన్ పరాశర సుదర్శన భట్టర్ అయ్యవార్లంగారు శ్రీ ఉ. వే. శ్రీమాన్ తి. వ. రామానుజస్వామిగారు, శ్రీమాన్ మహాభాష్యం వరదాచార్యులుగారు, తి.పు. వెంకటాచార్యులుగారు, శ్రీమాన్ కో. యి. వెంకటాచార్యులుగారు, శ్రీ ఉ. వే. శ్రీమాన్ మొలుగు రామానుజాచార్యులుగారు, శ్రీ ఉ. వే. శ్రీమాన్ కో. కం. రంగాచార్యులుగారు శ్రీ ఉ. వే. శ్రీమాన్ శ్రీ సీతారామ యతీంద్రులవారు మొదలగు పెక్కురు పండితులు విచ్చేసి వివిధ వేదాంత విషయము లుపన్యసించిరి.

ప్రతిదినము మధ్యాహ్నము శ్రీయతిరాజ సేవా మహిళా సంఘము వారి యాజమాన్యమున నరసాపురము నందలి శ్రీయతిరాజాశ్రమ స్థాపకురాలగు శ్రీమతి 'కరా' తాయారమ్మగారు శ్రీమతి కె. ధనమ్మగారు, కవితిలక, కవితావిశారద బిరుదాంకితులగు శ్రీమతి కాంచన పల్లి కనకమ్మగారు, ఉపన్యాస విశారద శ్రీమతి గునుపూడి ఇందుమతీ దేవిగారున్నూ స్త్రీలహితోపదేశము, దివ్యప్రబంధములు, ఆముక్తమాల్యద విభీషణశరణాగతి మొదలగు విషయములు శ్రోతృహృదయ రంజకముగా నుపన్యసించిరి. ఈ కార్యనిర్వహణ భారమునంతను శ్రీమతి కరా తాయారమ్మగారు తమ శరీరారోగ్యము సరిలేకున్నను సంఘాభిమానముతో బహునేర్పుగ నిర్వహించిరి. వారికి శ్రియఃపతి సంపూర్ణారోగ్యమును చేకూర్చి నిరాడంబర భగవద్భాగవతారాధనను పెంపొందింప జేయుగాక.

శ్రీ నందిపాటి సోదరులున్నూ, శ్రీ ఉదయగిరి కృష్ణారావుగారు, శ్రీ శివకోటి లక్ష్మీనరసింహంగారు, శ్రీమాన్ మా. సీతారామయ్యగారు శ్రీ కూరపాటిరామారావుగారు మొదలగు అచ్చటి సంఘ కార్యకర్తలు యీ సభకు కావలసిన ఆర్థికలోపమేమియు రాకుండ సక్రమముగ జరుగుటకు చేసిన సేవ ప్రశంసనీయము.



శ్రీమతేరామానుజాయ నమః


భక్తి

# నివేదన

వేదాంతమాసపత్రిక

| సంపుటి 3 | ఖర — కార్తీకమాసము | సంచిక ౮ |
|---|---|---|


## పాయస విభాగము

"శ్రీమద్రామాయణ"

గీత ౪.

"జన్మ కర్మచ మే దివ్యం ।
ఏవం యో వేత్తి తత్త్వతః ।
త్యక్త్వా దేహం పునర్జన్మ ।
నైతి మామేతి సోర్జున ॥"

తనయొక్క అప్రాకృతమైనజన్మను గూర్చియు కర్మను గురించియు ఎవ్వడైతే సంపూర్ణముగా చక్కగా తెలుసుకొనగలుగునో అట్టివాడు ఈ ప్రాకృతిక దేహమును విడిచి తిరిగి ఈ ప్రాకృతిక జన్మను పొందడు. అప్రాకృత దివ్యమంగళ విగ్రహుడను, సమస్త కల్యాణ గుణాకరుడను నైన నన్ను పొందును అని శ్రీకృష్ణపరమాత్మ ఉపదేశించి యున్నాడు.

గాన మనయొక్క జన్మరాహిత్యమునకై శ్రీరామచంద్రునియొక్క జన్మమును గూర్చి స్మరింతము.

శ్రీరామావతారము సంపూర్ణావతారము. ఏలననగా లోకములో ధర్మము లుప్తమగుచున్నదనియు, అధర్మము విజృంభించుచున్నదనియు, సాధువుల పరిత్రాణము అవసరమనియు, ధర్మసంస్థాపనము కర్తవ్యమనియు దేవతలందరు శ్రీమహావిష్ణువును ప్రార్థించగా, తాను శ్రీరాముడుగా సపరికరముగా అవతరించెదనని శ్రీమహావిష్ణువు దేవతలకు అభయమొసంగెను.

వెంటనే సప్తర్షులున్ను కామధేనువుయొక్క పాలను పితికి దానిని పాయసముగ తయారు జేసి అందు శ్రీమహావిష్ణువుయొక్క షోడశకళలను ఆహ్వానించి ప్రవేశపెట్టిరి. దానిని ఒక దివ్య పురుషుని చేతికిచ్చి దశరథుని పుత్రకామేష్టి యాగాగ్ని ద్వారా దశరథునికి అందజేసిరి.

దశరథునికి 350మంది భార్యలున్నను అందు వేదోక్తముగ వివాహమాడిన పట్టమహిషులు ముగ్గురు మాత్రమె దశరథుడు ధర్మచింత గల

ఎాడు. అందుచే ఈ పట్టమహిషిలు ముగ్గురికి మాత్రమే ఆదివ్యపురుషుడ త్తమైన పాయసమును దశరథుడు యథాన్యాయముగ పంచిపెట్టెను.

ఈ విభాగమును శ్రీవాల్మీకి మహర్షి యిటుల తెలుపుచున్నారు.

భాలకాండ ౧౩-౨౭.

శ్లో. కౌసల్యాయై నరపతిః ।
పాయసార్థం దదౌ తదా ।
అర్థాదర్థం దదౌ చాపి ।
సుమిత్రాయై నరాధిపః ॥

శ్లో. కైకేయ్యై చావశిష్టార్ధం ।
దదౌ పుత్రార్థ కారణాత్ ।
ప్రదదౌ చావశిష్టార్ధం ।
పాయసస్యామృతోపమం॥

శ్లో. అనుచింత్య సుమిత్రాయై ।
పున రేవ మహీపతిః ।
ఏవం తాసాం దదౌ రాజా ।
భార్యాణాం పాయసంపృథక్॥

(పాయసస్య అర్థం పాయసార్థం అర్థశబ్ద మిచ్చట సగముభాగము అని అర్థము "అర్థం సమేంశకే" అని అమరనిఘంటువు.)

దివ్యపురుషుడిచ్చిన దివ్యపాయసమును సరిగా రెండు భాగములుగ జేసి ఒక భాగమును పెద్ద భార్యయైన కౌసల్యాదేవికిచ్చెను. (అర్థాత్-పృథక్కృత్ అర్థం-అర్థాదర్థం-చతుర్థాంశం) మిగిలిన సగముభాగమును రెండు సమభాగములుగ జేసి అందలి ఒక భాగమును (అనగా మొత్తములో నాలుగవవంతును) దశరథుడు సుమిత్రాదేవి కిచ్చెను. ఇక మొత్తములో నాలుగవవంతు మాత్రమే [illegible] యుండెను. (అవశిష్టస్య అర్థం-అవశిష్టార్థం-అష్టమాంశం) ఆ మిగిలిన పాయసమును రెండు భాగములుగ జేసి అందలి ఒక భాగమును (అనగా మొత్తములో ఎనిమిదవ వంతును) పుత్రుని నిమిత్తమై దశరథుడు కైకేయి కిచ్చెను. ఇక మొత్తములో ఎనిమిదవ వంతు పాయసము మిగిలి యుండెను. సీతిశాస్త్ర విశారదుడగు దశరథుడు చక్కగా ఆలోచించి ఆ మిగిలిన అమృతతుల్యమైన ఎనిమిదవ వంతు పాయసమును సుమిత్రాదేవికి తిరిగి యిచ్చెను. ఈ విధముగా రాజైన దశరథుడు ఆ ముగ్గురు భార్యలకు పాయసమును ప్రత్యేక ప్రత్యేకముగా పంచి యిచ్చెను. అనగా మొత్తము పాయసములో కౌసల్యాదేవికి సగమువంతును ($\frac{1}{2}$)-0-8-0 వంతు) ముట్టెను. సుమిత్రాదేవికి [illegible]దార్థ వంతును (3/8- 0-6-0 వంతు) ముట్టెను. కైకేయికి ఎనిమిదవ వంతును 1/8- 0-2-0 వంతు) ముట్టెను.

ఆ[illegible]చో ౧౮ సర్గలోని శ్లోకముల సమన్వయ[illegible] కూడ ఆలోచింతము.

శ్లో. కౌసల్యా జనయ ద్రామం ।
దివ్య లక్షణ లక్షితం ।
విష్ణో రర్థం మహాభాగం ।
పుత్ర మిక్ష్వాకునందనం ॥

భరతో నామ కైకేయ్యాం ।
జజ్ఞే సత్యపరాక్రమః ।
సాక్షా ద్విష్ణో శ్చతుర్భాగః ।
సర్వైః సముదితో గుణైః ॥

దివ్యమైన లక్షణములతో గూడుకున్నట్టియు విష్ణువుయొక్క అర్ధాంశభూతుడైనట్టియు, రాముడను పుత్రుని గనెను.

సాక్షాత్తు విష్ణువైన శ్రీరాముని యొక్క నాలుగవఅంశభూతుడై సమస్త కల్యాణ గుణములతో గూడుకొని, సత్యపరాక్రముడైన భరతుడు కైకేయి యందు జనించెను. (శ్రీరాముడు విష్ణువుయొక్క అర్ధాంశభూతుడు. గాన అట్టి శ్రీరామునిలో నాల్గవవంతు అనగా మొత్తములో ఎనిమిదవవంతు యగును గాన ఇంతకు ముందు తెలిపిన వానితో ఎట్టి విరోధమున్ను లేదు. లేక చతుర్థస్య భాగః=అంశం-చతుర్భాగః అనగా నాలుగవ వంతు యొక్క సమభాగము అనగా మొత్తములో ఎనిమిదవవంతు అని అర్థమగును. గాన సాక్షాత్ శబ్దమునకు ప్రత్యేక సార్థక్యమును చెప్పకొనక పోయినను సరిపోవును.

అథ లక్ష్మణ-శత్రుఘ్నౌ ।
సుమిత్రా జనయ త్సుతౌ ।
వీరౌ సర్వాస్త్రకుశలౌ ।
విష్ణో రర్థసమన్వితౌ ॥

అటుపిమ్మట వీరులైనట్టియు,సర్వాస్త్ర కుశలులైనట్టియు, విష్ణువుయొక్క అంశస్వరూపులైనట్టియు, లక్ష్మణ-శత్రుఘ్నులనెడు పుత్రులను కనెను. (ఈ శ్లోకమందలి అర్థ శబ్దమునకు 'ఇంత భాగము'ని అర్థముగాదు. 'కొంత భాగము' అని మాత్రమే అర్థము-గాన పూర్వశ్లోక విరోధమేమియు లేదు.

ఇచ్చట ఒక సంశయము మాత్రము కలుగుచున్నది. దశరథుడు పాయసమును మొదట కౌసల్యకిచ్చెను. పిమ్మట సుమిత్రకిచ్చెను. తరువాత కైకేయి కిచ్చెను. అటుపిమ్మట తిరిగి సుమిత్రకిచ్చెను.

పుత్రులు జనించిన క్రమము మాత్రము దీనికి అనువుగ లేదు.

మొదట కౌసల్యయందు శ్రీరాముడు జనించెను. పిమ్మట కైకేయియందు భరతుడు జనించెను. తరువాత సుమిత్రయందు లక్ష్మణ-శత్రుఘ్నులు జనించిరి. కౌసల్యకు దశరథుడు మొదట పాయసము నిచ్చెను. గాన ఆమెయందు మొదట శ్రీరాముడు జనించుట న్యాయమే. తరువాత పాయసము ముట్టిన సుమిత్రకు లక్ష్మణుడు జనించవలసియుండగా అట్లుగాకుండగ కైకేయికి భరతుడు జనించెను. అటుపిమ్మట లక్ష్మణ-శత్రుఘ్నులు సుమిత్రకు జనించిరి. అందుచే పాయస విభాగక్రమము ననుసరించి వీరి జన్మలు కలుగలేదేల యని సంశయము కలుగుచున్నది.

ఇందులకు సమాధానమేమనిన - పాయస విభాగము ననుసరించిగాక పాయస ప్రాశన ననుసరించి వీరి జన్మలు కలిగినవి.

ఎట్లనిన దశరథుడు కౌసల్యకు మొదట సగము భాగము పాయసమును యిచ్చిన వెంటనే ఆమె దానిని త్రాగివేసెను.

పిమ్మట నాలుగవ వంతు పాయసమును దశరథుడు సుమిత్రకిచ్చిన వెంటనే ఆమె దానిని త్రాగలేదు. దశరథుడు ధర్మమును తెలిసి పాలించువాడు. కౌసల్య జ్యేష్ఠభార్య గనుక ఆమెకు సగము భాగము నిచ్చుటయు, నేను రెండవ భార్యనుగాన నాకు ఆమె కంటె తక్కువ వగ

నాలుగవ భాగమును మాత్రమె యిచ్చుటయు న్యాయమే-ఇంకను నాలుగవ భాగము మిగిలి యున్నది-యిచ్చుటకు కైకేయి ఒకర్తె మాత్రమే మిగిలియున్నది. ఆమె మూడవభార్యగాన నా కంటె ఆమెకు తక్కువ భాగము నీయవలెను. ఆమెకు ఈనాలుగవ భాగమునంతను ఇచ్చి వేసినచో ఆమెను నన్నును సమానముగ జూచి నటుల అగునే. ధర్మాత్ముడైన దశరథుడీ విషయమున ధర్మమును పాటించునా లేక వాల్లభ్యమునకు వశుడగునా అని సుమిత్రాదేవి తనకు దశరథుడిచ్చిన పాయసమును వెంటనే త్రాగక చేతిలో యుంచుకొని జూచుచుండెను. ఇంగితజ్ఞుడగు దశరథుడు దానిని గ్రహించెను. ఎనిమిదవ వంతు పాయసమును మాత్రమే కైకేయి తన కిచ్చినదానితో తృప్తిపడి, దశరథుడు తనకు పాయసమిచ్చిన వెంటనే త్రాగివేసెను. అందుచే రామునికి తరువాత భరతుడు జనించెను. కైకేయికిచ్చిన పిమ్మట దశరథుడు తిర్గి మిగిలిన పాయసమును సుమిత్రకివ్వబోయెను. సుమిత్ర అప్పటికి తనచేతిలోనున్న పాయసమును త్రాగి వేసి, రెండవపర్యాయము దశరథుడు తనకిచ్చు చున్న పాయసమును అందుకొని దానిని తిర్గి రెండవమారు త్రాగెను. మొదట త్రాగిన పాయసాంశమున లక్ష్మణుడును, అటుపిమ్మట రెండవమారు త్రాగిన పాయసాంశమున శత్రుఘ్ను[illegible]ంచిరి.

గాన పాయస ప్రాశనాను సారముగ మాత్రమే పుత్రులు జన్మించిరి. కౌశల్యకిచ్చిన తరువాత సుమిత్రకిచ్చిన పాయసము వలన లక్ష్మణుడు జని[illegible]క లక్ష్మణుడు శ్రీరామునికి అనుచరుడాయెను. కైకేయికిచ్చిన తరువాత సుమిత్రకిచ్చిన పాయసము వలన శత్రుఘ్నుడు జనించెను. గనుక భరతునికి శత్రుఘ్నుడు అనుచరుడాయెను.

దీని ననుసరించియే లోకమున కూడ రామ లక్ష్మణభరతశత్రుఘ్నులను క్రమ సంకీర్తనము ప్రసిద్ధియాయెను.

## భౌతికపరత్వము

శ్రీమాన్ యం. వి. వి. కె. రంగాచార్యులుగారు
అడ్వొకేటు, కాకినాడ.

తస్యోదితినామ స ఏష సర్వేభ్యః పాప్మభ్యః ఉదితః ।
ఉదేతి హవా సర్వేభ్యః పాప్మభ్యో య ఏవం వేద ॥" (ఛాందోగ్యోపనిషత్తు I. 5 viii.)

పాపములన్నింటికిని అతీతమగు పరతత్వము "ఉత్" అనుపేరుగలదు. ఉదకమగు గంగవలె భూతములన్నింటిని పావనముజేయగలిగినది ఒక్కటే. ఇదిగ్రహించి ఉపాసనచేసినచో అన్ని కల్మషములు తొలగును. సత్యాన్వేషణ శాస్త్రవిధానమువ పృథక్కరణ పద్ధతి నవలంబించి నది. సూక్ష్మబిందువులను అణుప్రమాణకము లుగ విచ్ఛేదించి కొంతవరకు పరిశోధన జరిగినది. ఇటీవల అణుశక్తియు వ్యాకృతి పై పరిశోధనమువలననే కనుగొనబడినది. ఇందుచే జీవనాశనముచేయు బాంబులు (Atom Bamb) తయారగుచున్నవి. హిరోషిమా, నాగసకీ ప్రాంత

ముల ప్రయోగించిన విశేషములు చదివినప్పుడు "స్ఫురత్సహస్రశిఖాతితీవ్రం" "ప్రాణనినాశి చక్రం" జ్ఞాపకము వచ్చును. గొడుగువలె గుండ్రముగ మంటవాయువు భూమినుండి అంతరిక్షమున కెగసి ఆవరణమంతయు మైళ్ళకొలది ప్రదేశము భస్మీపటల మగుటయేగాక చాలకాలము వరకును అటు కాలుబెట్టినవారందరికిని జ్వలన సంచలన రుగ్మత బాధించగలదు. (Radio activity) "అథయ ఏషోంతరాదిత్యే హిరణ్మయః పురుషోదృశ్యతే" అన్నట్లు సూర్యమండల మధ్య వర్తియు, హిరణ్మయుడును ప్రత్యక్షమైనాడు, గాని ఉగ్రతపఃపర్యవసానము వీరకాద్రి ధ్వంసకృత్యమగును.

శాస్త్రపరిశ్రమ సాగినపిదప ఉజ్జనక గోళకాశాస్త్రము నిర్మించబడినది. ఉదజని (Hydrogen రసమూలకము, నారాయణసంబంధి, పుష్కరణకు వ్యతిరేకముగ సంధాన మార్గము నవలంబించినది. పరిశోధనానుక్రమముగ కొంతకాలమున కుపయోగించక తీరదు. ప్రస్తుత వాతావరణములో రాజ్యాంగ వైవిధ్యములచే నీయాయుధములు మారణక్రియల కుపయోగపడునని జీవకోటి భీతిల్లుచున్నది. లోకమంతటను యుద్ధ ప్రసంగము లెక్కువగుచున్నవి. ఎచ్చటచూచినను "సేనయోః ఉభయోర్మధ్యే" "లోకక్షయకృత్ ప్రవృద్ధో లోకాన్ సమాహర్తుమిహప్రవృత్తః" ఇట్టి సూచన లుదయించుచున్నవి. "ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్" అనునట్లు స్వచ్ఛమగు (ఉత్ = అయం) ఉదయమెన్నడో యూహించవలసి వున్నది. ఆటంబాంబులు హైడ్రోజన్ బాంబులు మానవకోటిని పెను చీకటిలో మ్రింగించివేయునా? పాపములను పావకునివలె దహించి స్వచ్ఛన్న ద్రవ్యమును రక్షించునా? ఇది నేటి ప్రపంచ సమస్య. భారత జాతిసమస్యయు నిందుపై నాధారపడిన దే. బయట అమెరికా-రష్యా వైరుధ్యమున్నది. అంతరంగికముగ హైందవ-పాకిస్తానీ కలవరమున్నది. లోకతంత్రమునకు విశిష్టాద్వైతశిద్ధాంత మిప్పుడెట్లుపయోగించవలెనో దానిపై మన భావిజీవిత మాధారపడియుండును. "ఉత్" వేగముగ ప్రసరించుచున్నది. కాని నీయుద్యోగమునరికట్టగలిగినది సార్వజనిక సత్యప్రవృత్తియే. "పరమసత్వ సమాశ్రయః కః" యని పరమ సాత్వికస్థానమగు పురుషోత్తముడే పుండరీకనయనుడును రెట్టించుటచే "తస్యయథాకప్యాసం పుండరీకమేవమక్షిణీ॥" యను సామవేదీయ వాక్యము ప్రతిధ్వనించుచున్నది. "చిదచిత్ప్రవిభాగవృత్తం" "విశ్వం" అగుటచే చేతనాచేతన విభాగము నైసర్గికము. చైతన్యములోను వివిధ విచిత్ర కళాంశ భేదములుండుటయు అనుభవ వేద్యమే. భేదములున్నంత మాత్రమున జీవభూతములు నిందితములనగూడదు. సత్వరజోస్తమో ప్రేరితములగుటచే వ్యాపార వైరుధ్యములును సహజమే. ఇందువల్లనే పాపపుణ్య నిరూపణకు తావుగలిగినది. హింసాయుతము పాపము; కరుణాపూరితము పుణ్యము, రుజువర్తనము పావనము, కుటిలప్రవృత్తి దోషము; సత్యసంభాషణ ఉచితము, అనృతము సంఘద్రోహము.

సాంఘిక, ఆర్థిక, రాజకీయ రంగములలో మానవచరిత్రము సహస్రాబ్దముల నుండియు "అహింసాసత్యమక్రోధస్త్యాగశ్శాన్తిరపైశునమ్"

"దయాభూతేష్వలోలుప్త్వం" ఇట్టి చిహ్నములనే పోషించుచు వచ్చినది. దేహమునకు రుగ్మతవలె సాంఘిక చైతన్యమున కవధకశక్తులు ప్రజ్వరిల్లుటయు ఒకపండుగలదు. దైవాసుర ద్వంద్వమనంతప్రాయము. కాగా పర్యవసానమందు సాత్త్విక ప్రవృత్తియే జయించునను విశ్వాసముతో జీవితము గడపవలయును. మతకర్తలందరు ఇందేకీభవింతురు. "అభయం సత్త్వసంశుద్ధిర్జ్ఞానయోగస్య నస్థితిః" యనునదియును మతనిర్మాతలందరికిని సామాన్యకర్తవ్యమేయని అంగీకరించబడినను భయవిమోచన కొఱకు సాధించబడిన యుపాయములయందు మాత్రము భేదముండును. మొదట బండ్లను ఎద్దులతోను, గుఱ్ఱములతోను సాగించి ఆవిరియంత్రము, చమురుయంత్రము, పెట్రోలుయంత్రము, ప్రకృతము జెటుయంత్రము (Jet propulsim) వరకు పరిణమించినట్లే ఉగ్రవిగ్రహోపాసనద్వారా భయముపై నాధారపడిన మంత్రతంత్రములు క్రమశః భక్తి విశ్వప్రేమ ప్రపత్తిమార్గముల మార్పులనవలంబించబడినవి.

గడియారమునందలి భాగములన్నియు చక్రముచే, చిన్నపెద్ద స్ప్రింగులు (Springr) శంఖావళుల ననువాదమునే, ఏయంత్రముచూచినను చక్రశంఖవలయములతో నిండియుండును. విశ్వమందలి నక్షత్ర గ్రహాదాగములును చక్రశంఖగతుల ననువదించుచున్నవి. ఊహాప్రపంచమంతయు భౌతికానుభవమున స్ఫుటమగుకాలమున మానవజాతి జ్ఞానప్రేరితమై బాగుపడవలెనా? ప్రత్యేకతల పెంచుకుని పరస్పరమారణకార్యములందు మగ్నముకావలెనా?

ఇదియే నేటి నాగరికత యందలి ప్రధాన సమస్య. ఇందు విశిష్టాద్వైత పరమగు సమాధానమునకే ముఖ్యస్థానముగలదని నాయూహ. ప్రకృతి కల్లగాదు. తత్సృష్టులపై నాధారపడు యంత్రములన్నియు అబద్ధములుకావు. జెటు(Jet) విధానమున శబ్దవేగము నతిక్రమించు గాలివిమానములు నిర్మితములగుచున్నవి. ఖండాంతరముల నుండి గాక చంద్రలోకమునుండియు సూర్యబింబములోనివియు నక్షత్రమండలము దాటియు ధ్వనిప్రసారములు (Radio) ఆకర్షకచిహ్నములు (Redor) మున్నగు సూక్ష్మతర విభేదములు గ్రాహ్యము లగుచున్నవి. "అణోరణీయాన్ మహతోమహీయాన్" అని దర్శని యంత్రములు సాక్ష్యమిచ్చి ప్రత్యక్షనిరూపణ చేయుచున్నవి. భౌతికశాస్త్ర ప్రసంగములన్నియు జీవిత విధానమున నలవరుచుకున్నందున విశ్వమందు భక్తియు మానవప్రజ్ఞయడ విశ్వాసమును సార్థక ప్రయోజనముపట్ల ప్రసన్నతయు పెంపొందును. ఇది మన ప్రస్తుత కర్తవ్యము.



# తత్త్వత్రయ సత్యత్వ వివరణము

శ్రీ ఉ. వే. శ్రీమాన్ గొడవర్తి అనన్త అళఘురాచార్యులుగారు - ఉండి



శ్లో॥ వన్దే లక్ష్మణయోగీన్ద్రం విశిష్టాద్వైతబోధకమ్ ।
యస్త్రిదణ్డపదా తత్త్వత్రితయం సూచయన్నివ॥

మోక్షేచ్ఛ గల పురుషునకు తత్త్వత్రయమును దెలిసికొనుట యావశ్యకమై యున్నది. తత్త్వత్రయమనగా మూడు తత్త్వములని యర్థము, అవి 1. చిత్తు (జీవుడు) 2. అచిత్తు (ప్రకృతి) 3. ఈశ్వరుడును ఈ మూడింటి స్వరూపమును దెలియక జీవుడు తానెట్లు నడచుకొనవలెనో తెలిసికొనలేడు. అందుచేతనే ముక్తిని నొందలేడు. కావున నీతత్త్వత్రయ జ్ఞాన మావశ్యకము.

ఈ మూడు తత్త్వములును సత్యములే యని మన బుద్ధిచేతనే యూహించుకొనవచ్చును. అదెట్లనగా:—

అచిదాత్మకమగు ప్రపంచము ప్రత్యక్షము గా గానవచ్చుటం జేసి "అచిత్తు" లేదని యెవ్వడును జెప్పజాలడు. అందుచే "అచిత్తు" సిద్ధించినది కదా!

ఇక అచిద్రూపంబగు దేహముకన్న వేఱగు "జీవుడు" అను పదార్థమున్నదా? లేదా? అనగా ఉన్నది—అదెట్లన:—

"ఇది నాదేహము" అన్నప్పుడు "నేను" అనునది వేరుగాను దేహము వేరుగాను తోచుచున్నది. ఆ "నేను" అనునదియే "జీవుడు" ఈ విధముగా "చిత్తు" సిద్ధించుచున్నది.

ఇట్టి జీవుడుండిన నుండనిండు. ఈశ్వరుడున్నాడనుటకు నిదర్శన మేమనగా:—

ఈ ప్రపంచమును నడిపెడి స్వతంత్రుడును సర్వశక్తుడును నగు నీశ్వరుడు వేరుగా లేక జీవుడే స్వతంత్రుడు శక్తుడును నైనచో, జీవుడెప్పుడును సుఖమునే యనుభవింపవలయును గాని దుఃఖము ననుభవింపరాదు. దుఃఖమనుభవించుట యెవ్వనికినిష్టముకాదుకదా! కనుక వీరి కర్మానుగుణముగ నీ జీవులచే సుఖదుఃఖముల ననుభవింపజేయువాడొకడుండి తీరవలయును అతడే యీశ్వరుడు ఈ విధముగా యుక్తిచే మూడు తత్త్వములును సిద్ధించినవి.

ఇక నిందులకు శ్రుత్యాది ప్రమాణములును బెక్కులు గలవు. ఈమూడు తత్త్వములును సత్యములే కాని కొందరు చెప్పినట్లు "బ్రహ్మ" (ఈశ్వరుడు) మాత్రము సత్యమయి శేషించిన జీవప్రకృతులు రెండును నసత్యములు కావు. ఈ ఈ విషయము నీక్రింది ప్రమాణములు ఋజువు చేయుచున్నవి. శ్రు, అనేనజీవేనాత్మనాను ప్రవిశ్యనామ రూపే వ్యాకరవాణి" నేనేజీవాత్మతో బాటు ప్రకృతిలో బ్రవేశించి నామరూపాత్మకమగు ప్రపంచ మగుచున్నాను. అనియు

"అజామేకాంలోహితశుక్ల కృష్ణాం బహ్వీం ప్రజాం సృజమానాం స్వరూపామ్। అజోహ్యేకో జుషమాణోను శేతేజహాత్యేనాం భుక్తభోగా మజోన్యః" సత్త్వరజస్తమోగుణాత్మికయై ప్రపంచమును సృజించుచున్న యనాదియగు ప్రకృతిని జన్మలేని యొకఁడు [జీవుడు] అనుభవించుచున్నాడు. పుట్టువులేని మరియొకఁడు జ్ఞాజ్ఞౌ ద్వావజా వీశనీశౌ "అజాహ్యేకా భోక్తృభోగార్థయుక్తా" జీవేశ్వరు లిరువురును పుట్టువు లేనివారు అందీశ్వరుఁడు సమర్థుఁడు జీవుఁడసమర్థుఁడు." "అనాదియగు ప్రకృతి యొకటి జీవుని భోగార్థమైయున్నది" అనియు శృ, "ద్వాసుపర్ణా సుయుజౌ సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే" జీవేశ్వరులను రెండు పక్షులు ప్రకృతి యను నొక వృక్షము నంటియుండును అనియు శ్రు, "భోక్తాభోగ్యం ప్రేరితార ఞ్చమత్వా" అనుభవించు జీవుఁడు అనుభవింపఁబడు ప్రకృతిని అనుభవింపఁజేయు నీశ్వరునిఁదెలిసి అనియు శ్రు "నిత్యోనిత్యానాం చేతనశ్చేత నానామేకో బహూనాం యోవిదధాతికామాన్" నిత్యమైన బహుచేతనులకు (జీవులకు) నిత్యమైన యొక చేతనుఁడు (ఈశ్వరుఁడు) భోగముల నిచ్చుచున్నాఁడో అనియు శ్రు "క్షరాత్మానావీశతే దేవఏకః" ప్రకృతిని ఆత్మను ఒక్క దేవుఁడు నియమించుచున్నాఁడు అనియు శ్రు 'య ఆత్మనోంతరోయమయతి' 'యస్యాత్మాశరీరమ్' ఎవఁడాత్మ లోపలనుండి నియమించు చున్నాఁడో; ఎవని కాత్మ శరీరముగా నున్నదో అనియు 'ప్రకృతిం పురుషఞ్చైవ విద్ధ్యనాదీ ఉభావపి' ప్రకృతి, జీవుడు ఈ రెండును ననాదులు అనియు 'కార్యకారణ కర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే పురుషః సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతు రుచ్యతే' శరీరేంద్రియ కర్తృత్వముల యందు ఆత్మాధిష్ఠితమగు ప్రకృతి కారణము, సుఖదుఃఖముల ననుభవించుటలో జీవుఁడు కారణమనియు 'సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతి సమ్భవాః నిబధ్నన్తి మహాబాహో దేహే దేహిన మవ్యయమ్॥' సర్వభూతాని కౌన్తేయ ప్రకృతింయాన్తి మామికామ్। కల్పక్షయే పునస్తాని కల్పాదౌవిసృజామ్యహమ్॥ సత్త్వరజస్తమస్సు లనెడి ప్రకృతి గుణములు జీవుని దేహమున బంధించుచున్నవి. కల్పాంతమున ఆత్మం ఒకప్పుడుండి మఱొకప్పుడుండకపోఁడు. సర్వ భూతములు మదీయ ప్రకృతిని బొందుచున్నవి. కల్పారంభమున మరలి వానిని సృజంచుచున్నాను. అనియు 'నజాయతే మ్రియతేవాకదాచి న్నాయం భూత్వా భవితావానభూయః।అజోనిత్యః శాశ్వతోయం పురాణో నహన్యతే హన్యమానేశరీరే॥' "వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోపరాణి।తథాశరీరాణి విహాయ జీర్ణాన్యన్యాని సంయాతి నవానిదేహీ॥' జీవుఁడు పుట్టువాఁడును గాడు మరణించువాఁడును గాఁడు జన్మలేనివాఁడు; నిత్యుఁడు;శాశ్వతుఁడు; పురాతనుఁడు నరుఁడు చినిగిన వస్త్రములను విడిచి క్రొత్త వస్త్రములను ధరించునట్లు జీవుఁడు జీర్ణించిన శరీరముల విడిచి క్రొత్త శరీరములను దాల్చుచున్నాడు, అనియు అచేతనా పరార్థాచనిత్యా సతత విక్రియా' 'వికారజననీ మజ్ఞామష్టరూపా మజాం ధ్రువమ్॥' ప్రకృతి అచేతనము; ఇతరులకు శేషము; నిత్యము; ఎల్లప్పుడు వికారము

నొందునది; అనియు ప్రకృతి వికారమును గలిగించునది; జ్ఞానశూన్యము; ఎనిమిది రూపములు కలది; అనాది; స్థిరమైనది; అనియు "దైవీహ్యేషా గుణమయీ మమమాయా దురత్యయా", త్రిగుణాత్మికయగు నామాయ యతిక్రమింపరానిదనియు "ద్వావిమౌ పురుషౌ లోకే" ఉత్తమః పురుషస్త్వన్యః" జీవుడు బద్ధుడు ముక్తుడు అని రెండు విధముల పురుషోత్తముడు జీవుని కన్న వేఱనియు ఇత్యాది శ్రుత్యాద్యనేక ప్రమాణంబులచే జీవేశ్వర ప్రకృతులనెడి మూడు తత్త్వములును దేనికది వేఱనియు సత్యములనియు స్పష్టమగుచున్నది.

## మూత్రపురీషోత్సర్జన సమయములలో యజ్ఞోపవీతమును దక్షిణ కర్ణమందుంచు టెందులకు ?

శ్రీ ఉ. వే. శ్రీమాన్
ములుగు వెంకటాచార్యులుగారు
ముగ్గుళ్ళ అగ్రహారం.

"యుక్తి ప్రమాణాభ్యాం వస్తుసిద్ధి" ఈసిద్ధాంతానుసారము ఏమాటను గాని ప్రమాణితమును చేయుటకు ప్రమాణయుక్తు లావశ్యకములు. ఇందువలన పై ప్రశ్నకు కూడ సమాధానము ప్రమాణములు యుక్తులు అనెడు రెండిటిద్వారా ఇవ్వవలసి యుండును.

"దివాసన్ధ్యాసు కర్ణస్థబ్రహ్మసూత్రఉదఙ్ముఖః
కుర్యాత్ మూత్రపురీషే చ రాత్రౌచేద్దక్షిణాముఖః"
యాజ్ఞవల్క్య- అ. 1- శ్లో. 16.

"పవిత్రం దక్షిణే కర్ణేకృత్వావిణ్మూత్రముత్సృజేత్॥" (మితాక్షరా) మూత్రపురీషోత్సర్జన సమయములయందు యజ్ఞోపవీతమును దక్షిణ కర్ణమందుంచుకొనవలెను. ఆసమయమున మౌనముగా కూడ వుండవలెను. ఉమ్మివేయుట మాటలాడుట మొదలగు పనులను చేయరాదు. దక్షిణకర్ణమున యజ్ఞోపవీతముంచియే మూత్రపురీషోత్సర్జనము చేయవలెను. ఈవిషయములో చాలమంది స్మృతికార్తుల వచనములు కనబడుచున్నవి. కాని ఇట్లు యెందుకుచేయవలెనని ప్రశ్న ? ఇందులకు దార్శనికయుక్తులుద్వారా జవాబు ఇవ్వవలసి యుండును.

"యజ్ఞోపవీతం పరమం పవిత్రం ప్రజాపతేర్యత్ సహజం పురస్తాత్" ఇత్యాది శ్రుతులు యజ్ఞోపవీతము భగవంతునితో సమానముగానే పరమపవిత్రమైనదని చెప్పుచున్నవి. భగవంతునికూడ "పవిత్రాణాం పవిత్రంయో మంగళానాంచ మంగళం" పవిత్రములకు పవిత్రము మంగళములకు మంగళము" అని చెప్పెడి వాక్యములనుకూడ చూచుచున్నాము. అయిన నిప్పుడు తేలినదేమి ? యజ్ఞోపవీతముకూడ భగవంతునితో సమానముగనే పరమపవిత్రమనియే. కాని యొకభేదముకలదు. భగవంతుడన్నివిధములుగా నెల్లప్పుడును అన్నిస్థలములందును పవిత్ర

ముగనే యుండును. కాని ఏకదేశీయమైన యజ్ఞోపవీతము అపవిత్రావస్థలో దాని సంసర్గవలన పుట్టునట్టి వైద్యుతిక ప్రవాహముయొక్క సంపర్కము వలన అపవిత్రమగును. ఇంకొక్కవిషయము, భగవంతుడు చేతనము, యజ్ఞోపవీతము జడము. చేతనము యెల్లప్పుడు పవిత్రము, మరియు ప్రాకృతికవస్తువు దేశకాలపాత్రాను సారముగా పవిత్రాపవిత్రతలను పొందుచున్నది. యజ్ఞోపవీతము మిక్కిలి పవిత్రవస్తువనుటలో అణుమాత్రముకూడ సందేహములేదు. దీనిపవిత్రత అన్నివిధములచేత రక్షింపబడిననే బ్రహ్మసూత్రము, అనగా బ్రహ్మతోకూడ సంబంధము కలుగజేయు సూత్రము (కారణము). అట్లుకానియెడల నూలుదారమే.

మూత్రపురీషోత్సర్జన సమయములో సమస్త శరీరముయొక్క వైద్యుతికశక్తి దూషితమై అపవిత్రమైపోవును. ఇట్టి పరిస్థితిలో ఏమాదిరిగా కల్లుకుండలో నుండుటవలన గంగాజలముయొక్క పవిత్రతయు, అస్పృశ్యులయొక్క స్పర్శవలన దేవతాపీఠముయొక్క పవిత్రశక్తి మొదలయినవి నష్టమైపోవునో ఆప్రకారముగానే అపవిత్ర పరిస్థితిలో పరమ పవిత్రమయిన యజ్ఞోపవీతముయొక్క రక్షణసేయనియెడల అది బ్రహ్మసూత్రముగాక కేవలము సూత్రమే (దారమే) అయిపోవును. త్రిసంగాయత్రితో అభిమంత్రితమగు మరియొక యజ్ఞోపవీతమును ధరించువరకు బ్రహ్మతో కాని, సంధ్యావందనము వేదాధ్యయనము మొదలగు వైదికకర్మలతో కాని సంబంధము కలుగదు. అధికారములేదు. కనుక అశుచి కర్మలు చేయునప్పుడు దూషితమయిన శారీర వైద్యుత ప్రవాహమువల్ల దూషితము కాకుండునట్లు యజ్ఞోపవీతముయొక్క వైద్యుత శక్తిని రక్షించుటకు మనమేమి చేయవలయును?

కుడిచెవికి జందెము చుట్టవలెను. అందుచే నది అపవిత్రము కాకుండునని శ్రౌతసిద్ధాంతాను కూలముగా మహాత్ములు చెప్పి తత్వముతో (అనగా దేనియొక్క విద్యుత్ ఎప్పుడును దూషితముకాని అపవిత్రముకాని కాదో దానితో) సంబంధముండు వస్తువులో పవిత్రమగు విద్యుత్ ధార ప్రవహించుటవలన అది అపవిత్ర అవస్థలో కూడ పవిత్రముగ నుండగలదు. ఏతత్వము ఎల్లప్పుడు అపవిత్రముకాదో, దేనితో సంబంధముండుటవలన యజ్ఞోపవీతముయొక్క పవిత్రత పనుజని అపవిత్రావస్థలోకూడ త్రికాలపావన తత్వముయొక్క పవిత్రమయిన వైద్యుతిక ప్రవాహముతో సంసర్గ ఉండుటవలన నష్టముకాదో ఆ తత్వమేదియో విచారించుదము.

ప్రకృతిమాత తన సృష్టియొక్క అనిర్వాచనీయ సౌందర్యమునకు ప్రధానముగా పంచతత్వములతో అలంకరించినది. సమస్తవిశ్వమండలముయొక్క అన్నిపదార్థములలో ఈపంచతత్వములే ఓతప్రోతములగుచున్నవి. ఆముఖ్య పంచతత్వములు ఆకాశము, వాయువు, అగ్ని, జలము పృథివి అనునవి యని శ్రుతికూడ చెప్పుచున్నది. "తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశస్సమ్భూతః, ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః అగ్నేరాపః అద్భ్యఃపృథివీ" ఆత్మవలన ఆకాశము, ఆకాశమువలన వాయువు, వాయువువలన అగ్ని, అగ్నివలన జలము, జలమువలన పృథివి ఉత్పన్నమైనవి. ఇవియేప్రధానముగా పంచతత్వములు. వీటిలో ఏతత్వము నెప్పుడును అపవిత్రముకాదో చూతము. పృథివి దేశకాలానుసార

మగా అపవిత్రమయిపోవును. శ్మశానభూమి, గోతకట్టిన ప్రదేశము. మూత్రపురీషోత్సర్జన స్థానము, కన్యావిక్రీత పాదములు పడిన ప్రదేశము అపవిత్రమగుచున్నది. ఈలాగుననే జలము కూడ స్థానభేద అవస్థాభేదములచే అపవిత్రములయిపోవుచున్నది. గంగాజలమే మ్లేచ్ఛస్పర్శ చేత మధ్యభాండములో వుంచుటవలన కూపోదకవి మిశ్రణము వలన అపవిత్రమగుచూ తదితర జలముల విషయము ఏమి చెప్పవలెను. "మ్లేచ్ఛస్పర్శేసురా భాండేకూపోదక విమిశ్రణే" ఇత్యాదికములైన వచనములు కనబడుచున్నవి. సాధారణోదకము కూడ మలమూత్రాదికము యొక్క సంసర్గమువలన చితి మొదలయిన వాటి సంపర్కమువల్ల అశుద్ధమయి పోవుచున్నది. ఈలాగుననే స్మశానాగ్ని (చితాగ్ని) నోటితో ఊదబడిన అగ్ని ధూమాయితమయిన అగ్ని అపవిత్రముగా అంగీకరింప బడినవి. ఇక మిగిలినది వాయు విషయము. అదికూడ వేశ్యాలయము, మదిరాలయము, శౌచాలయము దుర్గంధయుక్తమయిన స్థానముయొక్క వాయువు చాల అపవిత్రమయినది. ఇందువలననే అపవిత్రమయిన లేక దూషితమయిన వాయు మండలములో ఉండుటవలన అనేకమంది వ్యక్తులు రోగాక్రాంతమగుచున్నారు.

ఇందువల్ల పృథివి, జలము, అగ్ని, వాయువు యీ నాలుగు తత్త్వములు ఎల్లప్పుడును పవిత్రముగా నుండవు.

అపవిత్రమైన దేశకాలములలో వీటి పవిత్రత నష్టమగునని నిశ్చయమయినది. మిగిలినది ఆకాశ తత్త్వము ఈఆకాశతత్త్వముమిక్కిలిఅపవిత్రమయిన అవస్థలో ఉండినను అపవిత్రముకాదు, ఇది అన్ని విధముల చేత పవిత్ర తత్త్వము. అనగా ఆకాశ తత్త్వము యొక్క వైద్యుతికధార (ఎలక్ట్రిక్ కరెంట్) ఎప్పుడును దూషితము కాదు.

ఫలానిస్థానముయొక్క ఆకాశము అపవిత్రమగునని మనకు శాస్త్రములలో ఎక్కడను ప్రమాణము దొరకదు. ఇందువలన పరమపవిత్రమయిన యజ్ఞోపవీతముయొక్క పవిత్రత మూత్రపురుషోత్సర్గ మొదలయిన అశౌచావస్థలో నష్టమవకుండు నటుల దానిని ఎల్లప్పుడు పవిత్రముగా నుండు ఆకాశ తత్త్వముతో సంబంధింప చేయవలెను. అన్ని విధములచే పవిత్రముగా నుండెడి విద్యుత్ ప్రవాహము యజ్ఞోపవీతము యొక్క సర్వాంశములో వ్యాప్తమయి పవర్ హౌస్‌తో సంబంధము కలుగ జేయుటవలన అన్ని ప్రక్కలకు విద్యుత్ యొక్క కరెంట్ యెట్లు ప్రచలితమగుచున్నదో ఆమాదిరిగానే అపవిత్రావస్థలో కూడ యజ్ఞోపవీతముయొక్క పరమ పవిత్రతను నష్టము కానీయదు. అందుచేతనే అది బ్రహ్మ సూత్రమగుచున్నది.

జందెమును బాహ్యాకాశములో వ్రేలాడ గట్టుట సంభవము. శరీరమునుండి తీసివైచిన క్షిమ్మట యజ్ఞోపవీత మపవిత్రమగును. కాబట్టి మూత్రపురీషోత్సర్గ సమయములలో యజ్ఞోపవీత సంబంధము ఆకాశతత్త్వముతో తయారయిన ఇంద్రియములో గాని అంగములోగాని చేయవలెను. పూర్వోక్తములయిన ఆకాశాది పంచ తత్త్వములు రెండువిధములుగా ఉండుచున్నవి. పంచీకృతము, అపంచీకృతమనియు, కాని యిది

వేదాంతముయొక్క విస్తృత వివేచన విషయాంతర మగుట వలన విడుచుచుదుము. అపంచీకృతము పంచతత్వముల యొక్క సాత్వికాంశల వలన అయిదుజ్ఞానేంద్రియములు తయారయినవి. ఎట్లన పృథివి తత్వముయొక్క సాత్వికాంశవల్ల ఘ్రాణేంద్రియము (ముక్కు) జలమునుండిజిహ్వా(నాలుక) అగ్నినుండి చక్షు, వాయువు వలన, త్వాచా, ఆకాశము యొక్క సాత్వికాంశమున కర్ణేంద్రియము (చెవి) తయారయినవి. ఇందువలననే ఏ తత్వమునుండి ఏ ఇంద్రియము తయారయినదో ఆ ఇంద్రియము ఆ తత్వగుణముననే గ్రహించ గలదు ఇంకొక దానిని గ్రహింపజాలదు. ఆకాశము, వాయువు, అగ్ని, జలము పృథివి ఈ అయిదు తత్వములకు క్రమముగా శబ్ద, స్పర్శ, రూప, రస గంధాదులు తమ తమ గుణములయి వున్నవి. ఇందువలన ఆకాశమునలన ఉత్పన్నమయిన కర్ణేంద్రియము (చెవి) ఆకాశగుణమగు శబ్దమును గ్రహించుచున్నది. రెండవ దానిని గ్రహించుటలేదు. ఈ ప్రకారముగనే వాయు తత్వము వలన ఉత్పన్నమయిన త్వాచా స్పర్శ గుణమును, అగ్నితత్వమువలన ఉత్పన్నమయిన చక్షువు (నేత్రము) దాని గుణరూపమును జలము వలన పుట్టిన జిహ్వా (నాలుక) దాని గుణమయిన రసమును పృథివి తత్వమువలన పుట్టిన నాసిక (ముక్కు) దాని గుణమయిన గంధమును గ్రహించు చున్నది. రెండవ ఇంద్రియము గ్రహించుట లేదు, ఇందులో ఇప్పుడు సందేహము లేదు. శబ్దగ్రహణము వలన కర్ణేంద్రియము ఆకాశ తత్వమువలన ఉత్పన్నమయినదని అందు చేతనే శ్రోత్రేంద్రియము అన్ని పరిస్థితులలో పరమ పవిత్రమయినది. దానితో సంబంధింప జేయుటవలన శౌచాదికములైన అపవిత్రావస్థలలో కూడ యజ్ఞోపవీతము యొక్క పవిత్రత సురక్షితమగుచున్నది. ఇందువలన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు లఘు శంకాలేక దీర్ఘ శంకా (మూత్రముల విసర్జన) సమయములలో యజ్ఞోపవీతమును చెవికి చుట్టుచున్నారు. అయిన యజ్ఞోపవీతమును కుడిచెవికే ఎందుకు చుట్టవలెను?

వామాంగముకంటె దక్షిణాంగము అన్ని విధముల చేత పవిత్రమని తెలుచబడినది. ఏలనన శరీరముయొక్క వామాంగములో స్త్రీ శక్తి (Neqative Power) దక్షిణాంగములో పురుషశక్తి (Positive Power) తలచబడినది. ఏ స్త్రీ జాతికి వేదాధ్యయనము యజ్ఞోపవీతము యొక్క అధికారమే లేదో ఆ స్త్రీ శక్తితో సమావిష్టమయిన వామాంగము మీద యజ్ఞోపవీత ముంచుటకు అధికారము మాత్ర మెవరికి గలదు? యింకను స్త్రీశక్తిలో అసుచిత్వముంచుట నైసర్గికము, దానితో సంయోగము చేయుటవలన పవిత్ర వస్తువుయొక్క పవిత్రత ఎట్లు రక్షింపబడగలదు? కనుకనే ఋషులు దక్షిణకర్ణమున యజ్ఞోపవీతముంచియే మూత్ర పురషోత్సర్గము మొదలయిన అశౌచక్రియలు చేయుటకు ఆజ్ఞయిచ్చి యున్నారు.



శ్రీమతే రామానుజాయ నమః

# యజ్ఞాది క్రతువుల యొక్క అనుష్ఠాన విధానము

శ్రీ ఉ. వే. శ్రీమాన్ మొలుగు రామానుజాచార్యులుగారు, ముగ్గళ్ళ.

ధర్మార్థ కామ మోక్షములను చతుర్విధ పురుషార్థములలో పరమపురుషార్థమగు మోక్షమునకు కర్మ జ్ఞాన యోగాంగక భక్తియోగ ముపాయమని వేదాన్త సిద్ధాన్తానుసారి మార్గము. వర్ణాశ్రమ విహితకర్మల నాచరించనిచో భక్తి కలుగదు. అందుచేత కర్మాచరణ మావశ్యకము. "నాముత్ర హి సహాయార్థం పితా మాతా చ తిష్ఠతః । న పుత్ర దారా న జ్ఞాతిర్ధర్మ స్తిష్ఠతి కేవలః॥ తస్మాద్ధర్మం సహాయార్థం నిత్యం సంచినుయాచ్ఛనైః। ధర్మేణ హి సహాయేన తమస్తరతి దుస్తరమ్" తల్లి, తండ్రి, భార్య, సంతానము, జ్ఞాతులు, మొదలగువారు ఆముష్మికము నకై సహాయపడువారుకారు. ధర్మమొకటియే సహాయపడును ధర్మసహాయమున దుస్తరమగు తమస్సు దాట శక్యమగును. అనగా అజ్ఞానము నశించి జ్ఞానోదయమగును. (పరమపురుష విషయకమగు) జ్ఞానము వలన మోక్షము సంభవించును కాన ఆముష్మిక సహాయమునకై ధర్మసంపాదన చేయవలయును. ధర్మమన శ్రేయస్సాధనమగు యజ్ఞాదికము, యజ్ఞాదికము వలన భక్తియోగము సిద్ధించును. సన్న్యాసులకు కూడ తమ యాశ్రమ విహితకర్మముల నాచరించుటవలననే భక్తి యోగ మునిద్ధించును యజ్ఞాదికర్మములందు అధికారముగల గృహస్థులు మాత్రము ఆయాకర్మల నాచరించవలయును గాని వితర వరాదు. "తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి యజ్ఞేన దానేన తపసానాశకేన" ఇవి మొదలగు శ్రుతులు యజ్ఞాదికములవలననే బ్రహ్మజ్ఞానోత్పత్తిని జెప్పుచున్నవి. ఇచ్చట యజ్ఞములచే తెలిసికొన నిచ్ఛయించుచుండిరి అనుటచే "అసినా ఘ్నన్తి" కత్తిచే హింసింపదలచుచున్నారు అను స్థలమునఖడ్గము హింసాసాధనమైననే ఇట్టి ప్రయోగము సంభవించును గాని ఖడ్గము హింసాసాధనమని యెటుల తెలియుచున్నదో అటులనే యజ్ఞములు జ్ఞానసాధనములైననే వివిదిషన్తి (తెలుసుకొనుచున్నారు అను వ్యవహారముతో సంభవించును గాని యజ్ఞాదులు జ్ఞానసాధనములని చెప్పదగి యున్నది. అందువలన గమనసాధనమగు అశ్వమునకు యెటుల కళ్ళెము మొదలగు పరికరముల యపేక్షయో అటులనే మోక్షసాధనమగు భక్తికి యజ్ఞాది కర్మాపేక్షకలదు. గీతల యందు "యజ్ఞోదానంతపః కర్మ నత్యాజ్యం కార్యమేవతత్, యజ్ఞోదానంతపశ్చైవ పావనాని మనీషిణామ్" యజ్ఞము, దానము, తపస్సు మొదలగు వర్ణాశ్రమోచిత కర్మజాతము "స ఖల్వేవం వర్తయన్యావ దాయుషం బ్రహ్మలోక మభిసంపద్యతే" అని యావజ్జీవము బ్రహ్మోపాసన విహితమగుటచే అట్టి బ్రహ్మోపాసకులకు "కషాయపక్తిః కర్మాణి జ్ఞానంతు పరమాగతిః । కషాయే కర్మభిః పక్వేతతోజ్ఞానంప్రవర్తతే" వర్ణాశ్రమవిహిత కర్మలు జ్ఞానోత్పత్తిప్రతిబంధక పాపనాశకములు జ్ఞానము పరమగతిసాధనముగనుక కర్మలచే పాపము నశించిన తరువాత జ్ఞానము కలుగును అని చెప్పిన రీతిగా ఉపాసన నిష్పత్తి విరోధియగు ప్రాచీనకర్మజాతమును నశింపజేయును గనుక విడవదగినదిగాదు, ప్రాణముపోవువరకును ప్రతిదినమును జేయనేవలయును. అనిచెప్పబడినది, మరియు భక్తి చిత్తసమాధానసాధ్యమగుటచే అన్తరింద్రియనియమనము నిషిద్ధకామ్యాదికర్మవర్జనము, క్షమమొదలగునవికూడ అపేక్షితములు. ఇన్ద్రియనిగ్రహములేక నిషిద్ధకామ్యాదికర్మల యందు ప్రవర్తించినయెడల అందువలన గలుగు పాపముల చేత భక్తికి ప్రతిబంధకము కలుగును మోక్షేచ్ఛలేనివాడైనను విహితమగుటచే యజ్ఞాదికర్మ ఆచరించవలసియే యున్నది. అగ్నిహోత్రకర్మ యొకటియే యావజ్జీవాచరణీయమున్నా, స్వర్గఫలసాధనముగా ఆచరణీయమున్నా ఆగుచున్నటుల యజ్ఞాదికము ఆశ్రమాఙ్గముగానున్నా విద్యాఙ్గముగానున్నా విహితమగుటచే ఆచరణీయమేయగుచున్నది. మరియు "ధర్మేణ పాపమపనుదతి, ఇత్యాది శ్రుతులచే యజ్ఞాదుల నాచరించినచో పూరితము చేయబడిన పాపములవలన భక్త్యుత్పత్తి ప్రతిబంధకములు గావని చెప్పబడినది. ప్రతినిత్యమును ఆచరించబడుయజ్ఞాది కర్మలవలన అన్తఃకరణశుద్ధిగలిగి ఉత్కృష్టమగుభక్తి ఉత్పన్నమగును. ఆశ్రమశూన్యులగు విధురాదులకు (విధురుడనగా భార్యలేనివాడు) యజ్ఞాది కర్మలయందధికారము లేకపోయిననూ బ్రహ్మవిద్యయందధికారము గలదు. జపోపవాసదేవతారాధనాదులచేవారి భక్తికి అఙ్గమేకావచ్చును. ఆశ్రమశూన్యులగు రైక్వాదులకు జపాదికమువలన బ్రహ్మవిద్య ఉత్పన్నమైనటుల ఉపనిషత్తులలోగన్పట్టుచున్నవి. "జప్యేనాపి చ సంసిద్ధ్యేద్బ్రాహ్మణో నాత్రసంశయః, కుర్యాదన్యన్నవాకుర్యాన్మైత్రో బ్రాహ్మణ ఉచ్యతే" అని జపాదికముచే బ్రహ్మవిద్యోత్పత్తి చెప్పబడినది. అయిననూ అనాశ్రమీనతిష్ఠేత్తుదినమేకమపిద్విజ" ఒకదినమైననూ ఆశ్రమశూన్యుడై యుండకూడదని చెప్పుటచే వలగునంతలో ఆశ్రమసహితుడ

య్యేయుండవలెను. గార్హస్థ్యధర్మములయందు శ్రద్ధయున్ననూ కన్యాపారకకపోవుటచే వివాహముకాని యాపన్ననకు జపాదికము వలననే ప్రతిబంధకములు నశించి బ్రహ్మవిద్య ఉత్పన్నముకావలసియున్నది, ఆశ్రమమునన్నచో అనేకధర్మముల నాచరించుటకు వీలగుటచే భక్తిప్రతిబంధకపాపములు శీఘ్రముగ నశించి అచిరకాలముననే భక్త్యుదయమగును. గనుక విరక్తుడగువాడు ఆశ్రమరహితుడైయుండుటకంటె ఆశ్రమసహితుడైయుండుటయే శ్రేష్ఠము. నైష్ఠిక, వైఖానస, పరివ్రాజకాశ్రమ భ్రష్టులకు పతితులగుటవలన బ్రహ్మవిద్యాధికారములేదు, వీరికిప్రాయశ్చిత్తముగూడ శాస్త్రములందు చెప్పబడియుండలేదు. నైష్ఠికాదులకు బ్రహ్మచర్యాదిచ్యుతి మహాపాతకములలో చెప్పబడనిదై ఉపపాతములలోనిదగుటచే ప్రాయశ్చిత్తమువలన పరిశుద్ధులగు వీరికి బ్రహ్మవిద్యాధికారము గలదని దలంపరాదు. వీరికి పాపనివృత్తికై కొన్ని శాస్త్రముల వలన ప్రాయశ్చిత్తాధికారము సిద్ధించిననూ "ప్రాయశ్చిత్తం నపశ్యామియేనశుద్ధ్యేత్స ఆత్మహా" అనుస్మృతి వచనమువలన వైదికకర్మాధికారమునకు తగినశుద్ధికి హేతువగు ప్రాయశ్చిత్తము లేదని చెప్పబడుటచే ప్రాయశ్చిత్తమువలన నరకానుభవములేకపోయిననూ బ్రహ్మవిద్యాధికారములేదనియే సిద్ధాంతము. భక్తుడు తనమహిమను ప్రకటవచేయక దంభాదిశూన్యుడై విహితకర్మల నాచరించుచుండవలెను. ఐహికఫల సాధనమగు ఉపాసనకై సాధనములగు పుణ్యకర్మల నాచరించినచో ఉపాసనోత్పత్తి ప్రతిబంధక ప్రబల కర్మ యున్నయెడల ఈ కర్మానంతరమున్నూ లేనిచో శీఘ్రముగానున్నూ సిద్ధించును. ఇటులనే ముక్తి ఫలసాధనమగు ఉపాసనము గూడ ప్రతిబంధకములేనిచో శీఘ్రముగానున్ను, ఉన్నచో విలమ్బముగానున్నూ ఉత్పన్నమగును. ముక్తిఫలమగు ఉపాసనకు గూడ బ్రహ్మజ్ఞానియెడల జేయు అపచారము ప్రతిబంధకమగును. ప్రతిదినమును ఆచరింపబడు నిత్యనైమిత్తికాది కర్మలవలన భక్త్యుత్పత్తి ప్రతిబంధక పాపములు నశించి భక్తిఉత్పన్నమగును. జనకచక్రవర్తి బ్రహ్మజ్ఞానముకలై అనేక యజ్ఞముల నాచరించియుండెను. శ్రీకృష్ణభగవానుడుగూడ అవాప్తసమస్త కాముడునగునాకు చేయదగినదేదియులేదు. పూర్వము లభింపక కర్మలముందర పొందదగినదేదియును లేదు. అయిననూ లోక సంగ్రహార్థము కర్మయందు ప్రవర్తించుచునే యున్నవాడను. శిష్టజనాగ్రేసరుడగు వసుదేవుని గృహమున బుట్టి ఆపుట్టిన కులమునకు దగిన కర్మయందు ఎప్పుడునూ ప్రాలుమాలికలేక వర్తించువాడనుగా నైతినేని శిష్టజనులెల్లరునూ నన్నుజూచి నాయాచారమును బట్టి యదియే ధర్మమని నిశ్చయించుకొనినవారై తాము చేయువలసిన కర్మను జేయనందున ప్రత్యవాయము గలవారై నరకమును పొందుదురు. శాస్త్రీయాచారములను పాలింపనందున శిష్టకులములు చెడ్డటికిని సంకరమును కలిగించుటకు నేనే కర్త నగుదును. విద్వాంసుడు గూడ కర్మానర్హులగునట్లు చెయుచువాడనగుదును అందువలన కర్మల నాచరించుచుండిన శిష్టుడని వ్యవహరింపబడెడివాడు ఏకర్మను ఏ విధములతోడ నాచరించునో స్వల్పజ్ఞానులగు తక్కిన లోకులును దాని నటులనే ఆచరింతురు. అతడాచరింపదేని అతనిని జూచి లోకులు గూడ కర్మల నాచరింపక నశింతురు లోకనాశనమునకు గలుగు పాపము వానిని జ్ఞానభ్రష్టుని జేయును. కనుక సటపర్తాక్రమోచిత సకల కర్మలను ఎప్పుడు నాచరింపవలయును అని చెప్పియుండెను. కర్మ ఫలముతో గూడినదైనచో బంధరూపమగును, ఫలమునపేక్షింపక, భగవంతుడే నాచే ఈకర్మలను చేయించుచున్నాడు నేను కర్మలకు కర్తను గాను అని తలచి యాచరింపబడు కర్మలు భగవరాధన రూపములై మోక్షహేతువులగును, ఫలాపేక్షరహితుడై కర్మ నాచరించిననూ అగ్ని బుద్ధిపూర్వకముగనో అబుద్ధిపూర్వకముగనో స్పృశించగా మనము మొలచేసిననూ తనంతతానే వడిననూ యెటుల మొలచునో అటులనే కర్మలు గూడ ఫలజనకములగును

అందుచే నిటీపునకు కర్మబంధ మధికమై ఈలోకముననే ఆకర్మఫల మనుభవించవలసి వచ్చును. ఇక మోక్షమెట్లు లభించును. అని భయపడవలదు. కర్మజాలము అగ్న్యాది స్వభావము కలది కాదు. ఫలసంగముతో నాచరింపబడినదే బంధహేతువుగాని ఫలసంగములేక యాచరింపబడునది బంధకముగాదు. "త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః। కర్మణ్యభి ప్రవృత్తోఽపి నైవకించి త్కరోతి సః" ఎవడి కర్మానుష్ఠానమును చేయుచు కర్మఫలమునందాసక్తిని వదలి నిత్యుడగు ఆత్మయందే తృప్తుడగుచు అస్థిరమగు ప్రకృతి తన కాశ్రయమగుననెడి యధ్యవసాయము లేనివాడగునో వాడు కర్మలయందాధి ముఖ్యముతో ప్రవర్తించిననూ ఒక కర్మనైననూ చేయనివాడేయగును. అనియు "నిరాశీర్యతచిత్తాత్మా త్యక్త సర్వపరిగ్రహః శారీరం కేవలం కర్మకుర్వన్నాప్నోతికిల్బిషమ్" ఫలాభిసంధిలేనివాడై విషయాసక్త చిత్తములేని మనస్సు గలవాడగుచు ఆత్మయే ముఖ్య ప్రయోజనముగా గలవాడగుటచే మిగిలిన ప్రాకృత వస్తువులయందు మమతలేనివాడై శరీరమాత్రముచే సాధింపతగిన కర్మమాత్రమునాచరించువాడు సంసారబంధరూప పాపము నొందడు. అనియూ శ్రీకృష్ణభగవానునిచే చెప్పబడినది. బ్రహ్మోపాసనా మాత్రనిష్ఠులై నిత్యనైమిత్తిక కర్మలను విడుచువారు "నియతస్యతు సన్న్యాసః కర్మణో నోపపద్యతే మోహాత్తస్య పరిత్యాగః

తామసః పరికీర్తితః" నిత్యనైమిత్తిక కర్మలను విడువరాదు. ఏలనన వానిని విడిచినచో శరీరయాత్రాపి చతే నప్రసిద్ధే కర్మణః" అనునటుల శరీరయాత్రయే సిద్ధింపదు. మరియును శరీర యాత్ర యజ్ఞశిష్టాశనముచే జరుపబడునేని మంచి జ్ఞానము కలుగు చున్నది. లేనియెడల "తేత్వఘంభుజ్జతే పాపాయేప చన్త్యాత్మ కారణాత్" అనునటుల పాపముగా పరిణమించిన యన్నమునే భుజించుచుందురు. ఇట్టి పాపాశనము వలన మనస్సునకు ఆప్యాయనము కలిగించినచో విపరీత జ్ఞానము కలుగును. అన్నముచే మనస్సు ఆప్యాయితమగునని "అన్నమయం హిసోమ్యమనః" అను ఛాన్దోగ్య శ్రుతి దెల్పు చున్నది. యజ్ఞశిష్టమైననే యాహారము శుద్ధమై రజస్తమస్సుల నశింపజేసి సత్త్వోద్రేకమును గలిగించి బ్రహ్మజ్ఞానమునకును సాధనమగును. కావున నిత్యనైమిత్తిక కర్మలను యావజ్జీవ మాచరించుచునే యుండవలయును గాని విడుచుట యొప్పదు. ఇటుల జ్ఞానోత్పాదకములగు కర్మలను బంధకములనెడి అజ్ఞానము వలన విడుచుట తమఃకార్యమగు అజ్ఞానము వలన గలుగునది గాన తామసము (తమోమూలము) అని చెప్పబడి నది అని చెప్పిన రీతిగ తామస త్యాగము గలవారగుటచే విద్యాఫలము నొందక సంసార పతితులగు చున్నారు. కర్మ సన్యాసులకు భక్తియోగము దుర్లభము. వారికి మోక్షమున్నూ దుర్లభమే. పుణ్య పాప రూప కర్మ సఞ్చితము ప్రారబ్ధము, ఆగామి అని త్రివిధముగా నున్నది. బ్రహ్మ జ్ఞానమునకు పూర్వము మాచరించబడినదై ప్రబల కర్మాన్తర ప్రతిబన్ధము వలన ఫలోన్ముఖము గాని కర్మ సఞ్చితమనబడును. ఫలము నిచ్చుటకు అభిముఖమగు కర్మ ప్రారబ్ధము. ఇవి పూర్వాఘ మని చెప్పబడును. బ్రహ్మజ్ఞానము కలిగిన పిమ్మట చేయబడిన కర్మ ఆగామి ఇది ఉత్తరాఘమని చెప్పబడును. ఇది ప్రామాదికమనియు బుద్ధిపూర్వకమనియు రెండు విధములుగా నున్నది. బ్రహ్మవిద్యా నిష్ఠుడగు ముముక్షువునకు ప్రారబ్ధ కర్మయున్నూ ప్రాయశ్చిత్తము చేయబడని బుద్ధి పూర్వోత్తరాఘమున్నూ అనుభవించ దగినదేయై యున్నది. ప్రాయశ్చిత్తము చేయబడినచో బుద్ధిపూర్వోత్తరాఘమున ఉంచును. బ్రహ్మవిద్యా మాహాత్మ్యము వలన సఞ్చితము నశించును. ప్రామాదికోత్తరాఘము వీనినంటదు. బ్రహ్మజ్ఞాని యొక్క పుణ్య పాప కర్మలు నశించుట అంటకపోవుట అనగా వీనికి ఫలజనకములు కాకపోవుటయే. ఆ కర్మల వలన కలిగిన అదృష్టమే మగును: ఊరక నశించునా! యనిన హాని పుణ్యమును వాని మిత్రులకున్ను పాపములను శత్రువులకున్నూ భగవంతుడు పంచిపెట్టి వానిని నిర్మలుని చేసి ముక్తినిచ్చును ఒక పుణ్యపాపములు మరియొకనికి సంక్రమించుట యనగా బ్రహ్మజ్ఞాని చేసిన పుణ్యమునకై వాని ననుగ్రహించ వలసి యున్నది. పాపమునకై వానిని నిగ్రహించ వలసియున్నది. వాడు బ్రహ్మజ్ఞానియై మరణించు చున్నందున వానిని నిగ్రహించుటకు గాని అనుగ్రహించుటకు గాని వీలులేనందున వానియందు మైత్రి గలవానికి మైత్రికి ఫలమగు అనుగ్రహమును భగవంతుడీయ వలసియున్నది గాన దానితో పాటు దీనిని జేర్చి వీనిని విశేషముగ అనుగ్రహించును. భాగవతుడగువానిని ద్వేషించిన వానిని నిగ్రహించవలసియున్నది. కావున వీని నిగ్రహముతో పాటు భాగవతుని నిగ్రహమును జేర్చి విశేషముగ నిగ్రహించును. ఇటుల సర్వబంధ వినిర్ముక్తుడై బ్రహ్మజ్ఞాని మోక్షము నొందును, గనుక మోక్షము నభిలషించు ప్రతి మనుజుడును మోక్షకారణ భూత బ్రహ్మజ్ఞాన (భక్తి) నిష్పత్తికై ఫలసంగ కర్తృత్వ త్యాగ పూర్వకముగ స్వవర్ణాశ్రమ విహిత కర్మలనాచరించుచునే యుండవలయును. అని వేదాన్త సిద్ధ మార్గము.

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ మద్భాగవత పారాయణము

శ్రీమాన్ కిళాంబి రంగాచార్యులుగారు, విజయవాడ.

శ్లో॥ శ్రీమద్భాగవతం శాస్త్రం యత్ర భాగవతైర్యదా ।
కీర్త్యతే శ్రూయతే చాపి శ్రీకృష్ణ స్తత్ర నిశ్చితమ్ ॥౧॥
శ్రీ మద్భాగవతం యత్ర శ్లోకం శ్లోకార్థమేవచ ।
తత్రాపి భగవాన్ కృష్ణో వల్లవీభి ర్విరాజతే ॥౨॥
భారతే మానవం జన్మ ప్రాప్య భాగవతం నయైః ।

తస్మితం పాపపరాధీ నైరాత్మ్య ఘాతస్తు ... కృతః ॥3॥
శ్రీమద్భాగవతం శాస్త్రం నిత్యం యైః పరిసేవితమ్ ।
పితుర్మాతుశ్చ భార్యాయాః కులపంక్తిః సుతారితాః ॥4॥
విద్యాప్రకాశో విప్రాణాం రాజ్ఞాం శత్రుజయోవిశామ్।
ధనం స్వాస్థ్యంచ శూద్రాణాం శ్రీమద్భాగవతాద్ భవేత్ ॥5॥
యోషితా మపరేషాంచ సర్వవాంఛిత పూరణమ్ ।
అతోభాగవతం నిత్యం కో నసేవేత భాగ్యవాన్ ॥6॥

శ్రీ మద్భాగవతము శాస్త్రమనియు యెచ్చట నయ్యది పఠింపబడునో వినుచుండబడునో యచ్చట శ్రీకృష్ణపరమాత్మ నిశ్చయముగా నుండుననియు శ్రీ భాగవతము వేదమంత్రోపబృంహణమనియు భక్తి జ్ఞాన వైరాగ్య జనకమనియు ఇహపరసాధన భూతమనియు విశేషముగా పురాణములందు ప్రశంసింపబడియున్నది. సప్తద్వీపములు సప్త సముద్రములు సప్త కుల పర్వతములు, సప్తఊర్ధ్వ లోకములు, సప్త అధోలోకములు, సప్తమహాఋషులు, సప్తనదులు సప్తపురములు యీవిధముగా సప్త సంఖ్యగా పేర్కొనబడినవి. "కలౌ వేంకటనాయకః" అను రీతి శ్రీ వెంకటనాథుడు సప్తగిరుల మధ్య వేంచేసియున్నవాడు, యీ భౌతిక సంబంధమును నను రించి యే మనదేహము కూడా సప్తప్రాకారములు (అనగా చర్మము లగాయతు శల్యము వరకు యేడు అంతస్థులు (layers)) కలియున్నది. తన్మధ్యమందు జీవపరమాత్మ నివశించి యున్నవాడు ఇట్టి దేహమునను యే అస్వస్థత కలిగినను చర్మగతమైనచో వైద్యులు ఔషధములచే నివారింప గలుగు దురు గాని అంతకు మించిన అనగా శల్యగతమైన యెవరితరమును గాదు. అంతయేల రక్తనాళము కు సంబాధించినను చికిత్సచేయజాలరు. ఉదాహరణకు గాను రక్తనాళములో రక్తము ఘనీభవించిన (clotting of blood) చికిత్స చేయజాలరు, "శ్రీకృష్ణరసాయనంపిబ" అను పూర్వాచార్యుల సూక్తి ప్రకారములకు అను బంధముగా నున్న సప్తగిరి మధ్యస్థ శ్రీ వెంకటనాథుని సేవ, సప్తప్రాకార మధ్యస్థ శ్రీరంగనాథునిసేవయే పరమౌషధము ఇయ్యది వైద్యశాస్త్రరీత్యా (Scientific) గా ఒప్పింపదగును పరీక్షిత్ సప్త దినములలో శ్రీ భాగవత పురాణ శ్రవణము చేసి ముక్తి నొందెను. ధుంధుకారి మహాపాపములు చేసి పిశాచ జన్మనొంది శ్రీ మద్భాగవతమును గోకర్ణునిచే సప్త దినములలో విని ప్రేతత్వ విముక్తి నొంది విష్ణులోకము నొందెను.

శ్లో॥ భిద్యతే హృదయగ్రన్థిః ఛిద్యన్తే సర్వసంశయాః ।
క్షీయంతే చాస్య కర్మాణి సప్తాహ శ్రవణే కృతే ॥

సృష్టి నిర్వహణార్థము బ్రహ్మ సహితము శ్రీ మద్భాగవత సప్తాహ పారాయణ చేయు చున్నారు.

శ్లో॥ బ్రహ్మతు పరమప్రీతస్తేన కృష్ణాప్తయేఽనిశమ్ ।
సప్తావరణ భంగాయసప్తాహం సమవర్తయత్ ॥౧॥

శ్లో॥ శ్రీ భాగవత సప్తాహ సేవ నాప్తమనోరథః ।
సృష్టింవితనుతే నిత్యం ససప్తాహః పునః పునః ॥౨॥

స్వసామర్థ్య వృద్ధికై రుద్రుడు సహితము సప్తాహపారాయణ మాచరించుట విశదము.

అర్థమును గ్రహించి పారాయణ మొనరించుట సర్వోత్తమము. అర్థము తెలిసికొన్న భక్తి జ్ఞానవైరాగ్యములు వృద్ధి పొందగలవు. శ్రీమద్భాగవతగ్రంధము విష్ణుసంబంధమున్న వేదాంత ఘట్టములతో కూడి యుండుటను బట్టియు సరియైన వ్యాఖ్యానములు గానరావు, వీరరాఘవీయ వ్యాఖ్యాన పుస్తకములు పురాతనముగా ముద్రింపబడియుండుటచే ప్రతులు ప్రస్తుతము లభ్య మగుట కష్టము ఇంతకు సంస్కృత జ్ఞానములేని వారికి మరింత కష్టము గనుక ఇట్టి మహత్తరమైన గ్రంథమును పండితులయిన భాగవతోత్తములు సకల చేతనోజ్జీవనార్థము యెల్లరకు సుబోధకముగా నుండునటుల ప్రతి శ్లోకమునకు తెనుగు తాత్పర్యమును రచించి తమతమ జన్మముల పావనచేసి కొనుట ఉత్తమమని నాయొక్క ఆశయము. యిందువలన శ్లోకార్థము తెలిసికొన్న పిమ్మటను పారాయణ అతిసులభము కాగలదు. పండితవర్యులు సంకల్పించిన యిది యొక దుర్ఘటకార్యము యెన్నటికిని కాజాలదు. సాలగ్రామ దానము ఉభయతారకము. అటులనే యీ కార్యము కూడ ఉభయతారకము.

శ్రీమద్భాగవతమును సప్తదినములలో పారాయణ చేయనగును. యిందుకునూ శక్తిలేని వారలు మాసద్వయ పారాయణ చేయవచ్చును. శ్రీమద్భాగవత పారాయణ విధానమును గురించి వ్యాసము "పారాయణ సంపుట పారాయణ" అను శీర్షిక క్రింద "శ్రీ వైష్ణవ పత్రిక లో ప్రచు రించబడు చున్నది.

విరాటపర్వము "వర్షప్రదమని" యెల్లరకు విశదమే. అట్టి విరాటపర్వమును విధివిధాన ముగా కంఠదఘ్నమున ఉదకమునందు పారాయణ మొనరించిన సువృష్టికలుగుట నిస్సందేహము. అట్టి విరాటపర్వమును కూడ సామాన్య జనులకు అనగా సంస్కృతజ్ఞానము లేనివారికికూడ అందు బాటులో నుండునటుల తెనుగు తాత్పర్యము సహా ముద్రించుట యుచితము.

లోకకళ్యాణార్థము తాపనివృత్త్యర్థము యీ మహాపుణ్యకార్యమును భాగవతోత్తములైన పండితవర్యులు ఒనరించి ఉభయతారక మొనగూర్తురని భగవత్ప్రార్థన మొనరించుచున్నాడను.

"సర్వేజనాః స్సుఖినో భవంతు !!



శ్రీబదరీనాథుని సన్నిధానమున శ్రీ అష్టాక్షరీ మహామంత్రమును, అష్టలక్షవేష్టో జపముగావించుచున్న శ్రీవిశిష్టాద్వైతప్రచారకసంఘ కార్యదర్శిగారైన శ్రీ ఉ. వే. శ్రీమాన్ అ. చి. శ్రీమన్నారాయణాచార్యులుగారు.

"వారే దీక్షానంతరం హృషీకేశమునకు బయలుదేరబోవుచున్న దృశ్యము"



శ్రీరస్తు

# ఋషీకేశము ఆంధ్ర ఆశ్రమము

అ. చి. శ్రీమన్నారాయణ.

నా ఉత్తరదేశ యాత్రలో నేను సేవించిన పుణ్యస్థలములలో ఋషీకేశము నందలి ఆంధ్రాశ్రమ మొక పవిత్రస్థలము, ఇది ఉత్తరభారత దేశమున హిమవత్పర్వత శ్రేణి ప్రారంభములో హిమగిరివలె ధవళమై, గంభీరమై, యున్నతమై, యుదాత్తమై, సువిశాలమై, పవిత్రపుణ్యోదకములతో నలరారు గంగానదీ తీరసమీపమున, ఆంధ్రకీర్తి శరచ్చంద్రికలను దశదిశల వెదజల్లుచు విరాజిల్లుచున్నది. ఇది ఆంధ్రులమనోభావనవలెనే నిర్మలమై, ఆంధ్రుల వలెనే సర్వజన సోదరత్వముతో, ఆంధ్రులసహజస్వభావమైన, సర్వజన సుస్వాగత దృక్పథముతో, ఆంధ్రనాగరికతను చాటుచున్నది.

ఈ ఆంధ్రాశ్రమమును శ్రీ శ్రీ శ్రీ యోగి సచ్చిదానంద సరస్వతిస్వాములవారు నిర్మించిరి. వీరు తూర్పుగోదావరిజిల్లా, రాజోలుతాలూకా, అవిడియను గ్రామమందు యుత్తమ క్షత్రియులగు కలారివారి వంశమునందు జన్మించిరి. బాల్యముననే, జ్ఞానవైరాగ్య సంపన్నులై, భద్రాచలము వద్దనున్న పాపికొండలలో, కొంతకాలము నిరాహార దీక్షతో తపస్సుచేసిరి. పిమ్మట విశాఖపట్నంజిల్లా, పెనుమాళ్ళ గ్రామంలో ఆశ్రమమును స్థాపించుకొని తపస్సుచేసిరి. అటుపిమ్మట శ్రీవిజయనగరం మహారాజుగారి అడవిమీకాను గందిలో కొంతకాలమున్నా, పూరిజగన్నాధ దేవాలయములో కొంతకాలము, కలకత్తా కాళీదేవాలయములో కొంతకాలము, కాశీ. అయోధ్య, నైమిశారణ్యములలో కొంతకాలమున్నా గడపి చివరకు ఋషీకేశమునకు యాత్రకై వచ్చు యాత్రికులగు ఆంధ్రులకు బసవగైరా సౌకర్యములు లభింపకపోవుటయు, భాషరాని తనముచే పడుయిబ్బందులనుజూచి, 1939 వ సంవత్సరములో యీ ఆంధ్రాశ్రమస్థాపనకు పూనుకొనిరి. ఈ రాజర్షి అతినిరాడంబరజీవి, మృదుమధురమితభాషి, సువిశాల.గంభీర, మనోభావనచే విరాజిల్లు మహాతపస్వి. అప్పుడు మంత్రిపుంగవులై విరాజిల్లుచుండు శ్రీ. టి. ప్రకాశంపంతులుగారు 1-0-0 శ్రీ బులుసు సాంబమూర్తిగారు. రు 1-0-0, వి వి. గిరిగారు రు 1-0-0, శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు రు 5-0-0, శ్రీ పప్పు సోమసుందరంగారు. రు 15-0-0, శ్రీ గంటు లక్ష్మన్నగారు రు 3-0-0 శ్రీ అల్లాడి కృష్ణస్వామయ్యగారు. రు 10-0-0, శ్రీ కొంతి రామమూర్తిగారు రు 10-0-0 చందాలుయిచ్చి, యీ ఆశ్రమస్థాపనకు యీ స్వామిజీగారిని మిక్కిలి ప్రోత్సహించిరి. ఆవిధముగానే ప్రారంభములో రెండువేల రూపాయల చందాలు సంపాదించి, ఆధనముతో చక్కని ప్రదేశములో 1200 గజములస్థలమునుకొని, ఆశ్రమ కట్టడము పనిని ప్రారంభించిరి.

క్రమముగా మనఆంధ్రదాతలు దీని ఆవశ్యకతను గుర్తించి. మిక్కిలి సహాయ మొనర్పుచుండిరి.

ఇప్పటికి సిమెంటుతో, దృఢతరమైన సువిశాలసుసౌఖ్యముతో అలరారు, 64 గదులు, 10 వరండాలతోను, మూడంతస్థుల దివ్యభవనమునుసుమారు 2 లక్షల 15 వేలరూప్యముల వ్యయముతో శ్రీస్వామీజీ నిర్మించిరి. ఈఅపరిచి ప్రదేశములో, శ్రీస్వామీజీ యొక్క రే వారి స్వశక్తితో యింత అద్భుతమైన నిర్మాణమును చేయగలుగుట, మన అంధ్రదేశమున కెంతయోముహానహము మరియుయిది శ్రీస్వామీజీయొక్క ఆత్మశక్తికిచిహ్నము.

ఇపుడింకను సుమారు యెనిమిదివేల గజముల స్థలమును, శ్రీడాక్టరు పట్టాభిసీతా రామయ్య, శ్రీ అనంతశయనంగార్ల సహాయముతో సంపాదించిరి. ఇందులో యొకవైపున శ్రీలక్ష్మీనారాయణ మందిరము, శ్రీఅనంతపద్మనాభస్వామి మందిరము, శ్రీలక్ష్మీమందిరమున్ను, రెండు గోపురములు, రెండు పీఠాల మండపములున్నూ 20 గదులు స్థిర నివాసులకున్నూ, 30 గదులు తపశ్శాలు లకున్నూ, 20 వంట గదున్నూ 3 బావులున్నూ, మొత్తం మంతటికి ఎలక్ట్రిసిటీయు, రెండవ వైపున శ్రీ చంద్రమహాశ్వేర మందిరము, నవగ్రహ మందిరము, ధ్వజస్తంభము యిత్యాది, దక్షిన దేశపుశిల్పత్వముతో దక్షిణదేశపు సాంప్రదాయముతో, నిత్య ధూప దీప భోగాలంకారములతో విలసిల్లుచు ముందు ముందు తిరుపతి, రామేశ్వరము మొదలైన దివ్యక్షేత్రములరీతి, యీయు దివ్యక్షేత్రమై యలలారునట్లు నిర్మాణ మొనర్ప మిక్కిలి కుతూహలముతో శ్రీస్వామీజీ సంకల్పించునార్నూ. ఇందుకు సుమారు 5 లక్షల ధనము అవసరమగునని అంచనా వేయబడినది. ఈపనుకై మైసూరుజిల్లాలోని, శివారు పట్టణమందలి శిల్పి చిన్న స్వాచారిగారికి, 44 విగ్రహములు మిక్కిలి అధునాతన శిల్పత్వముచే నిర్మించుటకు 10 వేల రూపాయలకు కంట్రాక్టుయివ్వబడినది. పునాదికై రాయి కంకర, సిమ్మెంటు వగైరాలు సంపాదించబడినవి పునాది, త్వరలో పనిప్రారంభముకానున్నది. శ్రీస్వామీజీయొక్క యీసంకల్పమునకు ఆంధ్రులందరు విరివిగవిరాళములిచ్చి తోడ్పడవలసియున్నది. ఇట్టిమహత్తరమైనపని యీఉత్తర ప్రాంతమందెచ్చటను లేదనవచ్చును.

శ్రీస్వామీజీ యీసంస్థకు యీక్రింది మహాశయులను ట్రస్టీలుగ నేర్పాటుచేసి దీనిని పబ్లికు సంస్థగ రిజిస్టరుచేయించి, జమ ఖర్చులకు వోచర్లతోసహా ఆడిట్ చేయించి ప్రచురించుచున్నారు.

ట్రస్టీలు. సర్. శ్రీరంతి వెంకటరామమూర్తిగారు, G. C. S, E అక్టింగు గవర్నరు బొంబాయి.

శ్రీమాడభూషి అనంతశయన అయ్యంగారు. పార్లమెంటు డిప్యూటీస్పీకర్ న్యూడిల్లీ

శ్రీరాజా ఆఫ్ మునగాల

శ్రీమంత్రిప్రగడ నరశింహా పంతులుగారు (E.X డిస్ట్రిక్ట్ కలెక్టర్)

శ్రీపళ్ళాకి శెట్టిపార్థసారథి నాయుడుగారు. (ఆంధ్రయిన్సూరెన్సు కంపెనీ డైరెక్టరు)

శ్రీ పైడా శ్రీరామకృష్ణయ్యగారు. జమీందారు. కాకినాడ.

శ్రీ గోగినేని వెంకటసుబ్బయ్యనాయుడుగారు. గూడూరుజిల్లా నెల్లూరు

ఇప్పుడు చేయవలసిన యీ అయిదు లక్షలరూప్యముల పనిని యే దాతలైన స్వయముగ నిర్మించ సంసిద్ధులై యున్న యెడల యీ సంస్థ సేవ, ఆదర్శము మార్చకుండగ యుండు షరతుపై, తాము స్వయముగ మానేజ్ మెంటు చేసుకొనుటలో, ఆ దాతలకు శ్రీస్వామిజీ వారు వప్పగించగలమనుచున్నారు. కూడా. ఈ రాజర్షి యొక్క పవిత్రభావము లెంతయు స్తవనీయములు,

వీరి సంకల్పము శీఘ్రకాలములో ఆశ్రియః పతి సఫల మొనర్చుగాక. దాతలందరు యుదారహృదయముతో యీ సంస్థకు విరాళములనొసంగి, మిక్కిలి ప్రోత్సాహముతో తమ ధనమును,
జన్మమును సార్థక పరచు కొందురు గాక.

పైనుదహరించిన నిర్మాణకార్యక్రమము అచిరకాలములో పరిపూర్తియై హిమవన్నగరశిఖరముపై అఖండ జ్యోతివలె. అలరారుచు. ఆంధ్రత్వమును ప్రకాశింప జేయుచుండుగాక.

---

శ్రీ.ఉ.వే.శ్రీమాన్ సంగల పార్థసారథిఆచార్యులుగారు
ఏలూరు.

# ★ నివేదన ★

శా॥ శ్రీమచ్ఛేష ఖగేశ్వర ప్రముఖ సూరిస్తూయమా నాద్యలీలా
మానుష్య మహాగుణానుభవ సంలబ్ధావ్యయామోదచేతో
ముక్తాత్మా సమర్పితార్చనసముద్భూత ప్రకామానుకం
పామందస్మిత చంద్రికాయత ముఖప్రాగల్భ్య మీ దేహరిం.

శా॥ నీపిల్పున్ విని వచ్చి నిల్చితిని తండ్రీ ! శూన్యహస్తాలతో
నీపాదమ్ముల కర్పణం బొనరుపన్ దేలేదు నేనే మియున్ !
నాప్రాణమ్మొకటున్న; దద్దిత్వదధీనంబే ! కృపాదృష్టినీ
వే పాత్రమ్మ బరికించి ప్రోవు మనుచుం బ్రార్థింతు నారాయణా !

మ॥ నిను సంకీర్తన మాచరించుటకుఁగానీ భావహార్మ్యంబులో
నిను బంధించి స్వరూపముం దెలియఁగానీ శక్తియే లేదు–నే
ననభిజ్ఞుండను; మందబుద్ధిని; మదీయంబౌ మనః పుష్పమున్
వినయంబొప్ప భవత్పదాబ్జముల కర్పింతుం గ్రహింపం గదే !

గీ॥ చూడు ! మింతకు మించి మెచ్చుకొనఁ దగిన
కానుకేమున్నదో ప్రభూ ! జ్ఞానదీప్తి
సుప్రకాశిత మొనరించి సూన్యహృదయ
మక్షయంబుగ జ్యోతిర్మయంబొనర్పు ! ... 4



# నారీవిభాగము

శ్రీమతే రామానుజాయ నమః



# తిరుక్కోళూర్ పెణ్పిళ్ళైరహస్యము

(రచయిత :—శ్రీమన్నాథ శ్రీపాదరేణువు దాసు)

## —— భాగవతము ——

అ॥ దేహత్తై విట్టేనో ఋషిపత్నియై ప్పోలే ॥

తె॥ స్థూలదేహబంధమును వదలితినా ఋషిపత్ని వలె ॥

౭

యమునాతీర మందారకవనమున గోగోవత్స గోపబాలురతో
శ్రీకృష్ణబలరాములు విహరించుచుండ, గోపబాలురు "కృష్ణా!
ఆకలిగొంటి"మనిరి అందులకు శ్రీకృష్ణుడు వారలను అచ్చట
యాగము చేయుచున్న ఋషుల వద్దకు వెళ్ళి అన్నమడుగ మనెను.

సీ॥ వల్లవులార యీ వనమున విప్రులు బ్రహ్మవాదులు దేవభవనమునకు ।
నరుగుట కాంగిరసాహ్వయ సత్రంబు సలుపుచున్నారు చనుడు మీరు ।
మా నామములు సెప్పి మైత్రితో నడిగిన నన్నంబు బెట్టెద రనుచు బలుక ॥
వారలు చని విప్రవరుల కెల్లను మ్రొక్కి పసులమేపుచు బలభద్రకృష్ణు॥

తే॥ లలసి పుత్తెంచి రిట మమ్ము నన్న మడుగ ధర్మవిదులార, యర్థిప్రదాతలార ।
పెట్టు డన్నంబు శాంతుల బిలిచి తెచ్చి పెట్టుదురు గాదె మిము బోటి పెద్ద లెల్ల!

వ॥ బ్రహ్మవాదులు అన్నము లేదనగా గోపకులు నిరాశులై రాగా ।
శ్రీకృష్ణుడు వారల మునిపత్నుల నడగి రమ్మనిరి ॥

కం॥ గోవుల మేపుచు నాకొని గోవిందుం డన్న మడిగి కొనిరండని
మమ్మీ వేళం బుత్తెంచెను ధీవిలసితలార రండు తెండన్నంబుల్ ।
అని. గోపాలురు తెలిపిన వెంటనే మునిపత్నులు

వ॥ గోవింద సందర్శన కుతూహలులై ధరణీ సుందరులు సంభ్రమానం
దంబులు డెందంబుల సందడింప భక్ష్యభోజ్య లేహ్య చోష్య పానీయ
భేదంబులం గలిగి సంస్కార సంపన్నంబులైన యన్నంబుల కుంభముల
యందు నిడికొని సంరంభంబుల సముద్రంబునకు నడచు నదుల తెఱంగున ॥

క ॥ భిక్షలు మగలును భార్యలు నష్టము చని నలదనంగ నెఱుగలడని మా ।
నాక్షించు జగదీశ్వరునకు జక్షన నన్నంబు గొనుచు జనిరా సుదతుల్ ॥

తే ॥ రాజీవోత్పలకర్ణపూరములవాని, మహితపల్లవపుష్పధామములవాని ।
భువనమోహననటవేషభూషివాని, గనిరి కాంతలు కన్నుల కఱవు దీఱ ॥

క ॥ కని లోచన రంధ్రంబుల మునుమిడి, హరిలలితరూపమును లోగొని, నె ।
మ్మనమున బరిరంభించిరి తనుమధ్యలు, హృదయజనిత తాపము వాయన్ ॥

క ॥ పరమేశ్వరార్పణముగ బరజనులకు భిక్షయిడిన బరమపదము నం ।
బర గెదరట తుది, సాక్షా త్పరమేశుడు భిక్షసేయ ఫలమెట్టిదియో ? ॥

అని మునిపత్నులు శ్రీకృష్ణునికి అన్నమును తీసుకొని వెళ్ళి నివేదించిరి.

వ ॥ ఇట్లు కృష్ణబలరాములు గోపబాలురతో షడ్రసోపేతంబైన యన్నంబు భుజించి
మునిపత్నులారా మీరు యజ్ఞవాటంబులకు వెళ్ళి మీభర్తలతో గూడి ।
యజ్ఞమును సాగింపుడు శ్రవణమననధ్యానంబునను కీర్తనంబునను కలుగుప్రీతి।
సామీప్యంబున గల్గదు। శీఘ్రంబుననే మీకుమత్ప్రాప్తి కల్గునని ।
దీవించి బంపెను. అందులో నొక్క మునిపత్ని మాత్రము భర్తచేత వారింప
బడినదై శ్రీకృష్ణుని ధ్యానించుచు గర్మానుబంధంబైన దేహంబును సంత్యక్తంబు ।
గావించెనే. స్వామి ! అటుల భక్తి జేసి నా శరీరత్యాగంబు జేసినానా ।

శ్రీ రా మా య ణ ము

అ ॥ దశముకన్నెచ్చెలో పిరాట్టియైపోలే ॥

తె ॥ దశకంఠరావణుని హతముగావించినానా సీతమ్మవలె ॥

రావణుడు॥ మత్తకోకిల ॥ ఇంచుబోణిరో పుష్పకాఖ్య సమిద్ధమైన విమాన మ ।
భ్యంచదర్కవిభా విభాసము యక్షునగ్రజు బోర ని ।
ర్జించి తెచ్చితి హృద్య మయ్యెడ జేరి యిద్దఱ మెంతయున్ ।
వంచదిష్టసుఖోపభోగము జానపొందుచు నుందమా ? ।

అని రావణుడు సీతతో మదనోద్దీపితమగు దుర్వాక్యము లాడగా సీతయు ।

సీత। శ్లో॥ తృణ మంతరతః కృత్వా ప్రత్యువాచ శుచిస్మితా ।
నివర్తయ మనో మత్తః స్వజనే క్రియతాం మనః ॥

అనగా నామాటవినక సీతా నామహిమ వినుము॥

శ్లో ॥ పంచాంగం పాఠక శ్చాయం పశ్య బ్రహ్మ కృతో మయా
ప్రతీహార స్స్వయం సూర్య శ్శశీ చ్ఛత్రధరః కృతః
వరుణో యం జలగ్రాహీ । మార్జకః పవన స్స్వహా
అగ్నిః కృతో యం రజకః మాలాకార శ్చ దీపకః

దండపాణి ర్యమ శ్చైత్ర దాస్య శ్చైత్ర సురస్త్రియః ।
మార్తాండో నాపిత శ్చాయం గణపః ఛిరరక్షకః ।
మంగళాద్యా గ్రహాః స్సర్వే సోపానానామే, ఇవా సనే
ఆందోళికశ్చ కైలాసః !కః జేనో పివిః ద్విజః
। రావణుని ప్రగల్భములను విని నిర్లక్ష్యముగ ॥

సీత–సీ॥ కాకటిముడికి నై కురులు గూడనినాడె జెదరక తాటక పీచమడచె ।
గాధేయు ధ్వనరించు క్రతురక్షణము సేయ బెక్కండ్రు దైత్యులనుక్కణంచె
వనని పైవిలసిల్లు నఖిలరాజన్యులు వేరెఱుగ లేని విల్లువిఱిచె
ఘోరాటవులలోన గృమ్మరుసమయాన ఖరదూషణాది రాక్షసుల జంపె ॥

గీ॥ పాదరజమున నొకరాయి బడతి జేసె, లీల మాయామృగంబును గూల నేసె ।
రాజమార్తండు మేదినీ రక్షకుండు రామభూపాలుడాది నారాయణుండు ॥

గీ॥ అట్టి రాముని కీయబ్ధి యనగ నెంత, లంకయన నెంత దనుజుల పొంకమెంత ।
నీవనగ నెంత నీలావు చేవయెంత చెప్ప నేటికి నీవె జూచెదవుగాక ॥

మ॥ పీరాలాపము లాడనేల వినుమీ విశ్వప్రకాశంబుగా ।
బారావారము గట్టి రాఘవుడు కోపస్ఫూర్తి దీపింపగా ।
ఘోరాజిన్ నిను జాసిలావుకలిమిన్ గోటీరయుక్తంబుగా ।
ఘోరాస్త్రంబుల మస్తముల్ దునిమి భుక్తుల్ పెట్టు భూతాళికిన్ ॥

ఆ॥ ధర్మనిత్యుడైన దశరథసుతవర్యు ధర్మపత్ని సాధ్వి దరమె నీకు ।
రాక్షసాధముండ రూక్షచరిత్రుండ పాపి నన్ను దాక బాలిశుండ ॥

ఇటుల సీతమ్మవలె రావణుని దూషించి, శ్రీరాములచేత సంహరింప జేసినానా—

పద్మపురాణము

అ॥ పిణ మెళుప్పివిట్టినో తొండమానై ప్పోలే ॥
తె॥ నిర్గత జీవులను బ్రతికించినానా తొండమాన్ చక్రవర్తి వలె ॥

౨

తొండమాన్ చక్రవర్తి రాజ్యపాలనచేయుకాలమున కూర్మదను బ్రాహ్మణుడు కాశియాత్ర పోవసమకట్టి రాజువద్ద నేడుమాసములు గర్భవతియైన తనభార్యనున్ను ఖదేష్ట ప్రాయముగల తనసుతుని ఒప్పగించి తానారు మాసములలో మరలివచ్చెదనని వెళ్ళెను రాజువారలను ఊరికి దూరముగా నొకగృహమందుంచి ఆరు మాసములకు వలయు భోజన వస్తువులను సమకూర్చియుంచెను. ఆబ్రాహ్మణికి నెలలు నిండి ప్రసవబాధకలిగెను. ఆమె వీధితలుపు తెఱచి ఇల్లువెలుపలకు రాను ప్రయత్నింపగా సాధ్యముకాకపోయెను. ఎవరో విధివశాత్తుగా గుమ్మము తలుపును చిలుకవేసి పోయిరి. ఆమె ఎంత అఱచినను తెలుపరులకు వినబడనందున

ఆమె నిస్సహాయముగా ప్రసవించి నానాబాధలు పడవలసివచ్చెను. నానాటికి ఆహారసామగ్రిలు తఱుగుచురాగా కూడులేక కృశించి మువ్వురును నేలంబడి ప్రాణముల బాసిరి. తొమ్మిదిమాసములైన తర్వాత కూర్ముడు గంగాస్నానము తీరి రాజువద్దకువచ్చి తన భార్యా బిడ్డలను పంపమనెను రాజింత వఱకు ఈవిషయమును బొత్తిగా మఱచెను గనుక దిగ్గున విభ్రమమొంది భటులనంపగా వారు పోయిచూచి మూడు శల్యము లున్నవని చెప్పిరి. రాజు దిగులొంది తన యిష్టదైవమైన శ్రీనివాసుని ప్రార్థింప నిశ్చయించుకొని కూర్మునితో వారిప్పు చక్రవర్తినితో స్వామిదర్శనార్థమై కొండకు వెళ్ళిరనిచెప్పిపంపి రాత్రికాగానే నరసింహ గుహామార్గముగా మామూలుగనే వెళ్ళి సన్నిధిజేరి శ్రీనివాసునితో తన మహాపరాధమును జెప్పి దుఃఖించి, వారలను బ్రతికించితేసరి లేకుండిన ఈకరవాలముతో నాఅసువుల బాసెదనని వేడుకొనెను. శ్రీవారికి తొండమానుపై అనుగ్రహము గల్గి ఆ మూడస్థులను దెచ్చి నాస్వామిపుష్కరణి పూర్వదిగ్భాగమునందున్న నొకతీర్థములో ముంచమని ఆజ్ఞజేసెను. అట్లే మూడు శల్యములను దెచ్చి ముంచగా వారలు కరణకళేబరములతో నీటి పైకి వచ్చిరి. రాజుమహాసంతోషముతో కూర్మునికి అతని భార్యా బిడ్డల నొప్పజెప్పెను. కూర్ముడిన్నాళ్ళెక్కడికి పోయినారని భార్యనడుగగా నామె విష్ణుమాయచేత బ్రహ్మలోకమును చూచివచ్చినాననెను. సుతుడు సప్తద్వీపములను కైలాసమును శంకరునిదర్శించి వచ్చినాననెను. "శిశువు" నేను దేవస్థానములను పర్వతవనములను చూచి వచ్చినాననెను అందఱును సంతోషముగా వెళ్ళిరి. ఇప్పటికిని ఆతీర్థమునకు శల్యతీర్థము అని పేరు బరగుచున్నది.

(తి. అ) తొండమాన్ వలె అతిమానుష కృత్యమును చేసినానా ?

---

తిరువాయ్ మొళిలోని 10 వ పదిలోని మొదటి తిరువాయ్ మొళిలోని పాశురము శ్రీమతి నండూరి ఆనందమ్మగారు. ఏలూరు—

---

1. తాళ తామరైత్తడమణివయల్ తిరుమోగూర్ ॥
నాళు మేవి నన్మరందనన్న అశురర్త్ తగర్క్కుమ్ ।
తోళు నాన్గుడైచ్చుర్కుళిల్ కమలక్కణ్ కనివాయ్
కాళమేగత్తైయన్ని మత్తైన్నిలమ్ కదియే ।

---

మొదటి నించీ కూడా మన ఆచార్లు ఆర్చావతారమందు విశేష మీడుపాటు పొందియుండిరి వారు తిరుమోగూరిలో వేంచేసియున్న అర్చావతార వైభవమును గురించి పాడినపాశురమిది మనమంతా కూడా దివ్యదేశములలో అర్చాస్వరూపిగావున్న సర్వేశ్వరుని శేవించడము అచ్చట సేవప్రపత్తి చేయడము చేయుటలో ఆశ్చర్యమేమీలేదు ఎందు వలననగా పరమపదనాథుని సేవ మనకు దేశాంతరగతజలము మాదిరి వుపయోగము లేదుగదా దేశము కాలము వేరగుటచేత

ఆ రామకృష్ణాద్యవతారముల సేవించుకొందామని సమకాలికులైన నంద దశరథ వాసుదేవాదులకే గాని కాలాంతరులమగుటచేత మనకుపయోగములేదు సరి జన్మాంతరసహస్రైః తపోజ్ఞానము కలవారికేగాని మనబోటి అజ్ఞానులకు అంతర్యామి స్వరూపము గోచరించదుగదా అందువలన మనకు అర్చావతార అనుభవము తప్పవేరు ఉపాయము లేదు గాని సర్వేశ్వరుని కరుణవలన మయర్వాఱ మతినలమ్ అన్నట్లు కొంచెమైనా అజ్ఞానము కలదని భక్తి లభించినవారు ఆళ్వారవుటచేత పరవ్యూహవిభవ అంతర్యామి స్వరూపములను కరతలామలకముఃగా అనుభవించు లేగాక! శ్రీకృష్ణపరమాత్మ అనుభవము దగ్గరకు వచ్చేసరికి పత్తు దైవము సెయువన్మ అనే రకములో వానిగుణచేష్టితముల యశోదమ్మవలె అనుభవించు గాక కృష్ణా నీవు ఆకలా అందులో దొంగతనమూ దొరికి పోవడమూ అమ్మ తాటితో రోలుకి కట్టివేస్తే గట్టిగా నీవు ఏడుస్తువుంటావ్ ఆమె నోరుమూయి అని భయపెట్టితే వెక్కి వెక్కి ఏడ్చితి నాయనా ఏమిటి ఈసౌలభ్యముతండ్రీ అనిఎత్తిరం అని 6 మాసములలా నీవాల్యగుణాను సంధానము తలచుకొని మూర్ఛపొందినారుగదా తిరిగి పిరందవా రుంఅన్న పాశురములో శ్రీకృష్ణా నీవు చెఱసాలలో పుట్టడమూ పుట్టుతూనే తల్లిదండ్రుల సంకెళ్ళు విడగొట్టుతూ పుట్టావా నీ వ వ త రిం చి న ప్పు డు పురుటి గదిలో మంగళదీపమైనా లేదుగదా ఒక మంగళవాయిద్యమైనాలేదే మాకొరకు ఎన్నికష్టాలు తండ్రీ అని అచ్చట ఒక 6 మాసాలు మూర్ఛనొందారు గదా, తిరిగి బాలగోపాలుని రాక ఆలస్యమై పోయినదని ప్రణయ రోషము కలిగి మిన్నిడై అని పాశురముల యను సంధానంబులో నా బంతి గచ్చకాయలు ఇచ్చి పోవయ్యా అని వానితో ప్రణయ కలహము కూడ ఆడిన ఆళ్వార్లు వేయ్ మరు తోళిణై మెలియుమాలో అనేపాశురములో బాలగోపాలుడుతనఒడిలో నేవున్నా డు ప్రభాతమైనవిపక్షుల కలకలా రావమువిని బాలగోపాలుడికి లేగదూడలను మేపడమంటేచాలఇష్టము గనుక తప్పక తెల్లవారితే వెళ్ళి పోతాడు. వెళ్ళక మానడని వాని సన్నిధిలోనే కృష్ణాచూడుము నీవియోగ దుఃఖముచేత నాశరీరమెలా పాలిపోయినదో అనిదుఃఖించిరి. రామావతారము దగ్గరకొచ్చేసరికి, కరావర్ ఇరామని శాగై యల్లాల్ మత్తుం కర్పరో అని చదువుకొన్నారు. శ్రీరామచంద్రులను తప్ప మరెవ్వరినైనను కొనియాడెదరా అని ఈవిధముగా అవతారములను కరతలామలకముగా అనుభవించిన ఆళ్వార్లు అర్చావతారము దగ్గరికొచ్చేసరికి ఒజివిల్ కాలమెల్లా ముడనాయ్ మన్ని వఱివిలా అడిమై శెయ్యవేండు నామ్ అని ఎల్లకాలమున్ను ఆ ఏడుకొండలవాని పాదపద్మము లలోనే అన్ని కైంకర్యములు చేయవలెను. ఆ వెంకటాచలపతే నాకు ప్రాప్యము, అని పాడి అగల గిల్లేన్ ఇరయుమెన్ను అలర్ మేల్ మంగై యుఱైమార్బా అన్న పాశురములో పిరాంటియుతోరిన నా ఏడు కొండలవాని పాదపద్మములేనాకు శరణము, వేంకటాద్రిమీద వేంచేసివున్న, నాతిరువేంగడ ముడయాను పాదపద్మములే, నాకు శరణ్యము, అని ఉపాయో పేయములు నాకు

అర్చావతార ఎంబెరు మానార్ల తిరువడిఘళ్ళే అని నిరూపించుటయేగాక, నాయికావస్థ పొందినా తాయిమారవస్థపొందినా, దూతలనుపంపినా, అర్చావతారమందే అత్యంత ప్రావణ్యమును కలిగి యుండిరి. ఆళ్వార్లు నాయకావస్థనుపొందినది అర్చావతారమందే నంగళ్ కోలత్తిరుక్కుఱుం గుడి నంబియైనాన్ కండపిన్, అన్న పాశురములో తిరుక్కుఱుం గుడినంబిని సేవించినపిమ్మట, వాని శంఖ చక్రములతో ఎఱ్ఱని అధరముతో నామనస్సు వెళ్ళిపోయినది. అమ్మలారా, మరెందులకు నన్ను కోప ము చేయుదురు. తల్లిగారవస్థ పొందినప్పుడు కంగులుం పగలుం అన్న పాశురములో శ్రీరంగనాథా నాకు మరినీవిషయములో ఏమితలంచుకున్నావు. అని పాడిరి.

ఆఖరుకు తిరువనంత పురందగ్గరికి వచ్చుసరికి, పరమ పదమెందులకు ఆపరమపదనాథుడే ఈతిరు వనంతపురములో వేంచేసియున్నాడు. రండి రండి.

కెడుమిడరాయ వెల్లాం కేశవా వెన్న, అని వానిని తలుచుకొనుసరికి. ప్రతిబంధకాలన్నీ పోవునురండి. అని పాడిరి ॥సరి॥ ఈతాళతామరై పాశురములోని విశేషమేమి. యనగ ఆళ్వార్లు తిరువాయ్ మొళిపాడి అయిపోయినది. సర్వేశ్వరుడు పరమపదమునకు రమ్మనమని తొందర చేయు చుండెను. వెళ్ళకతప్పదు. వెళ్ళిపోవాలి ॥గాని॥ విరజానదీ స్నాన పర్యంతము ఈజీవాత్మకు వాసనా రేణువలు పోవుగదా అంతపర్యంతము, అర్చిరాది మార్గములో నాకు సహాయ భూతులెవ్వరు, అలవాటైన శరీరమాకూడా రాదు ॥ పెత్తార్, పెత్తు జజిందార్, అన్నట్లు దేహబంధువులు రారు ఇక దొరికిన సహాయభూతులెవరు. ఈఆత్మ నిక్షేపమును ఎవరి నెత్తిన బెట్టుదును అని ఆలోచించి అందరి ఆత్మల భారము మోసేవాడు ఆసర్వేశ్వరుడే, శబరిమూట. సుగ్రీవునిమూట రాక్షసుడైన విభీషణుని మూట. గుహుని మూట, ధర్మపుత్రాదులమూట, ద్రౌపతిమూట, కాకాసురునిమూట విదురునిమూట, వీరు వారననేల అందరుమూటలు మోయువాడు వాడే. వాడినెత్తినే మన ఆత్మ భారము వేదాము. అని నిర్ణయించుకొనిరి. అటుల నిర్ణయించుకొని ఆళ్వార్లు, అలా భారము వేసేటప్పుడు పరమ పదనాథునినో లేక రామకృష్ణావతారములనోగదా, సహాయంగా తీసుకో వాలి అలా కాకుండా తిరుమోగూరులో వేంచేసియున్న అర్చావతారమునే సహాయంగా తీసు కొని పాడారంటే ఏమనుకోవాలి.

ఆళ్వార్లు ఈప్రకృతిలో ఉన్నారుగన్క ఈప్రకృతి యందలి అర్చావతారములనేక భావన లతో అనుభవించినారనినచో అర్థమున్నది. గాని, ఈతిరుమోగూరుపాశురమటులగాదే ఈప్రకృ తిలోనా తమరులేరు. ఈశరీర సంబంధము విడచి సూర్యమండలము భేధించుకొని అర్చా మార్గ ముగా వెళ్ళిపోతూన్న ఆళ్వార్లు ఈప్రకృతిలో వేంచేసియుండే అర్చా స్వరూపమునే వారి సహాయ భూతులుగా వరించారంటే ఈ అర్చావతారములో వారు రామకృష్ణాద్యవతారముల నెలాగ సేవిం చినది తెలియపరుస్తున్న పాశురము. ఈ తాళతామరైఅనే పాశురము —— "తాళతామరై తడ

మ జీనయల్ తిరుమోగూర్" విశాలమైన జలసమృద్ధిచేత నిండిన వరిపైరులలో వికసించిన తామర పుష్పములచేత నిండిన అందమైన తిరుమోగూరు సర్వేశ్వరుడు త్రివిక్రముడై మూడులోకములు గొలచినప్పుడే, దేవేంద్రాదులు నమస్కరించితే వారి శిరస్సున ధరించిన మణులకాంతి తామర పుష్పములాంటి పాదములమీద బడి, మణులచే పాదములు పాదములచే మణులు, ఎంతో ప్రకాశించినవి. యిచ్చట తిరుమోగూరులో పండిన వరిపైరులమధ్యను, తామరపుష్పములున్ను ప్రకాశించుచున్నవి. అంత అందమైన తిరుమోగూరులో నాళుమేవి నన్గమురందానన్ను, అనగ సుప్రభాతాచమే నిశా" అని ఏదినానికాదినమే ఆవూరి అందము అచ్చట భాగవతుల సంసర్గము చేత కలిగిన ఆనందముతో "అప్పాళుడైక్క ప్పాళుదు ఎన్నా రావముధముతాగ దివ్యదేశము మీద ఆశతో పరమ పదమునుగూడ మఱచిపోయి "తోళునాన్గుడై చ్చురికుళల్ కమలక్కణ్ కనివాయ్" చతుర్భుజములు, నల్లని వెంట్రుకలుగల ఎర్రని చిరునవ్వులతోగూడిన, తామరేకుల వంటి నేత్రాలతో నన్ను కటాక్షించుచు "పాథేయం పుండరీకాక్ష నామసంకీర్తనముగానున్న నాకాలమేఘము, నానీరు నిండిన చల్లని మేఘముతప్ప నాకువేరు సహాయ మెవ్వరులేరు అని కాలమేఘమై యన్ని మత్తొన్నిలం కత్తియే అని పాడినారుగదా ! ఈపాశురమున మనకు తేలినది ఏమనగా ఈప్రకృతియందున్నప్పుడేగాక ఈప్రకృతి కనంతరము రామకృష్ణాద్యవతారముల ను కరతలామలకముగా అనుభవించినఆళ్వార్లు ఈఅర్చావ తారమునే దారి సహాయముగా తీసుకొన్నారు. అంటే ఆళ్వార్లకు అర్చావతారమునం దెటువంటి ప్రపత్తిని కల్గియున్నదీ మనకు తెలియుచున్నది. — వారే అర్చావతారమందు అంత ప్రావణ్యము కలిగియుంటే మన చోటి అజ్ఞులకు దివ్యదేశములు తప్ప వేరు ప్రాప్యప్రాపకములు లేవని చెప్పవలెనా ? యిందు వలననే పిళ్లై లోకాచార్యులువారు కూడా ఉగందరుళినసిళంగళిలే ప్రవణనాయ్ ఇరుక్కవేణుం అని దివ్యదేశములయందు ప్రావణ్యము కలవారే ద్వయ మంత్రమునకు అధికారి. అందు వలన ఎంబెరుమాన్ పూర్వము సౌబరి అను ఋషీశ్వరుడు 60 మంది భార్యలను తృప్తిపరచుటకొరకు 60 మంది సౌబరి రూపములను పొంది తృప్తిపరచినటుల మనకొరకు 108- దివ్యదేశము లయందు వేంచేసియున్నాడు. ఆదివ్యదేశములే మనకు ప్రాప్యప్రాపకము అని మన పూర్వాచార్యులు ఏకవిధముగా సాయించిరి గాన అర్చావతారమునందు ప్రావణ్యమే మనకు శరణ్యము

ఈపాశురముసంగతి మనస్సులో నుంచుకొనే॥కుజల్, ఆచ్చియర్. మత్తినాలోశై ప్పడుత్తయిరరవం కేట్టిలయో" "అని తిరుప్పావైలో" ఆండాళ్ తల్లిపాడినారు. సూర్యోదయము కావలెను నేను లేవనని లోపలవున్న గోపిక చెప్పితే ఇంకా సూర్యోదయముకాదంటారేమి మహాను భావులైన నమ్మాళ్వారనే కవ్వముతో శిష్యులశరీరము అనే దధిఘటములను మథనముచేస్తే ఒకఘోషపుట్టినది తిరువాయ్ మొళిప్రబంధము అని పరమ పదమువరకు వెళ్ళిన త్యసూరులను పాలన చేయుచు

న్న టుల వున్నది, కంటోల్ పోయిన తరువాతకూడా కొరతగా తినేవారిమాదిరి, — నమ్మాళ్వా రవతరించి అపూర్వ రసభావములు కలిగించిన తిరువాయ్ మొళిని, పరమ పదమున కూడా అర్చావతార ఆధిక్యమును, కలిగించిన తిరువాయ్ మొళిని, పాడుతూవుంటె ఇంకా పాపు పాపు అహామన్న అహామన్న మంటూ కూర్చున్నారే అని పేంకప చేయుచున్నట్లున్నది. ఆదివ్య ప్రిబంధఘోష యింకా తెల్లవార లేదంటూ వేమమ్మా ఆనగదా శ్రీఆండాళ్ తల్లిభావము. యింకా ఎన్నో భావములు కలవు.

---

## తు ల సి మ హి మ

శ్రీమతి ముకుంద్దై రామానుజమ్మగారు,
రా జ మ ం డ్రి.

తులసి ఒకమహా భక్తురాలు. ఆమెభగవంతుని గురించి తపస్సుచేసెను. సర్వేశ్వరుడామెకు ప్రత్యక్షమై నీకేమికావలయునో కోరుమని చెప్పగా, కులశేఖరాళ్వార్లు తిరువేంగడముడయాన్ సన్నిధిలో పడియాయ్ కిడందున్ పవళవాయ్ కాణ్బేనే, అనగా మెట్టునై పడియుండిమీ అధరామృతము సేవించుచుండడమేనాకు ముఖ్యమైనదియని కోరినట్లుగా నాకుగూడ మీదృఢమైన తిరువడిఘళ్ పొందియుండడమే నాకోరికయని భక్తురాలుదెల్పెను, అంతట పెరుమాళ్ళు నిన్ను భూలోకమందు, మొక్కగ యవతరింపచేసి నిన్ను తరింపచేయుదుననిరి. ఆమె భగవత్కటాక్షముచేత శ్రీవిల్లి పుత్తూరనెడి దివ్యదేశంలో భాగవతోత్తముల యిండ్ల యందు తులసి మొక్కగ నవతరించినది, అప్పుడు పెరుమాళ్ళుభాగవతోత్తము లందరికి స్వప్నముగ సాక్షాత్కరించి మీపెరటియందు తులసిమొక్కలున్నవి, అవిమీకు గుర్తుగ చూచుకొనుటకు చల్లదనము మార్ధవము, పరిమళ ఘనెడిగుణములతో కలిసి యొప్పారు చుండును. అది ప్రతిదినము వాటి దళములు కోసి నా పాదపూజ చేయవలయునని ఆజ్ఞ అయినది. అప్పుడు భాగవతోత్తము లందరు. శ్రీ విల్లి పుత్తూరు నందు ఈస్వప్న వృత్తాంత మొకరుచెప్పగ, అందరునదే మాదిరిగ తమస్వప్న వృత్తాంతములను ఒకే రీతిగ చెప్పుకొనిరి వారు పెరటిలో చూడగ పెరుమాళ్ళు ఆజ్ఞ ఇచ్చిన విధముగ, చల్లదనము మార్ధవము, పరిమళము అనెడి మూడుగుణములతో నొప్పారుచున్న తులసినిచూచి, ఆశ్చర్యచకితులై, దళములను కోసి భగవదాజ్ఞాను సారముగ వారి తిరువడిఘళ్ళమీద సమర్పించిరి.

అప్పుడు భక్తురాలు కోరిక నెర వేరినందులకు యామెచాలయానందముతో నిత్యయవ్వనముతో పెరుమాళ్ళ తిరువడిని ఆశ్రియించియున్నది. ఇట్లు కొంతకాలము గడచిన పిమ్మట సర్వేశ్వరుని వక్షస్థలమందున్న లక్ష్మీదేవి తులసినిపరిహాసించెను, అప్పుడు తులసివాడిపోయి. మనస్సు క్లేశపడిపోయి, నిత్యయవ్వనముపోయి ఎండి సురుగైపోయి యుండుటంచూచి పరాత్పరుడైన సర్వేశ్వరుడు ఏమికారణమాయని విచారించగా, లక్ష్మీవలన వచ్చిన పరాభవమని గ్రహించిరి.

ఈభక్తురాలైన తులసియందుండెడి వాత్సల్యముచేత వారికి మరల తనప్రియ భాగవతోత్తములందరికి తమ తిరువడియందు తిరుత్తుళాయిని సమర్పింపవలదని మాలలుగ కట్టితమయొడలుకును. కిరీటమునకును అలంకరించ వలసినదని యాజ్ఞ యిచ్చిరి. వారందరును పెరుమాళ్ళ యాజ్ఞాను సారముగచేసిరి. అప్పుడు కొంచెము కాలముకాగా ఈతులసి అనే భక్తురాలు లక్ష్మితో ఓలక్ష్మి నీవు నాకంటె దిగువైతివే! నేను నీకంటె అధికురాలనైతిని. నీవు వక్షస్థలమునందుండ నేను శిరోభాగమారోహించితిని గాన నేను నీకన్న ఘనురాలను అని పరిహసించెను. అందుకు లక్ష్మి సిగ్గుపడి సర్వేశ్వరుడేకాంతముగ రత్నసింహాసనముపై కూర్చుండి యుండగ లక్ష్మి ఆయనను "నీకు ఎట్టి కైంకర్యము చేసినదాసురాండ్రియందు ప్రేమకలుగునో ఆకైంకర్యము దాసురాలికి కటాక్షించవలయునని ప్రార్థించగా. పెరుమాళ్ళుమందహాసము చేయుచు, భూలోకమందు పుష్ప కైంకర్యము చేయుచున్న నాప్రియ భక్తులైన విష్ణు చిత్తులతో కూడ నీవు పుష్పకైంకర్యము చేసిన నాకుచాల ప్రియమని పెరుమాళ్ళు ఆనతిచ్చిరి. అప్పుడు అటులనే దాసురాలిని కటాక్షించమని లక్ష్మివేడు కొనెను. పెరుమాళ్ళు ఈమెయందు ప్రేమ కలిగి భూలోకమందు తులసి వనములో చిన్న పసిపాపగ నవతరింపచేసెను. విష్ణుచిత్తులు తులసిని కోయుటకు వనమునకేతెంచగ, ఈపసిపాపను చూచినటపత్రశాయి సన్నిధికి తీసుకొనిపోయి ఈసంగతివారితో విన్నవించగ. నట పత్ర శాయి ఆమెకు గోదా దేవియని నామకరణముచేసి మీరు పెంచు కొనుడని ఆజ్ఞ ఇచ్చెను. వారామెను పెంచి వారితో కూడ కైంకర్యము చేయించుచునుండిరి. చూచితిరా ! ఏతులసినీమె పరిహసించెనో ఆతులసినే చేతులార పెరుమాళ్ళకు సమర్పించ వలసి వచ్చినదే! లక్ష్మిగర్వము పూర్తిగపోయినది. ఈతులసివల్లనే గదా. సత్యభామ గర్వభంగము కూడఅయినది ఈ తులసీ దళమహిమ అద్భుతమైనది,



భక్తి "నివేదన" అనుబంధము



## శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము పండితసభలు.

### మైలవరం

ఈ ఖరనామ సంవత్సర ఆశ్వీజ బహుళ విదియా మంగళవారం (16-10-51) మొదలు 3 రోజులు మైలవరం గ్రామంలో శ్రీ వేంకటేశ్వర స్వామివారి దేవాలయమున శ్రీ ఉ. వే. శ్రీమాన్ శ్రీ పరాశర సుదర్శనభట్టరు అయ్యవార్లంగారి అధ్యక్షత క్రింద శ్రీమతి శ్రీ శ్రీ శ్రీ రాజా సూరానేని శ్రీ వర మంగయ్యమ్మ అనే చెల్లాయమ్మ రావుబహద్దరు జమీందారిణి వారి ప్రోత్సాహము వలన శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ పండిత సభలు అతి వైభవముతో జరిపించబడినవి.

ప్రతిదినము ఉదయము గం 8-0 లకు కోవెలలో పెక్కుమంది భాగవతోత్తముల సేవాకాల గోష్ఠితో కాల భోగమున్ను అటుపిమ్మట 11 గంటలవరకు వివిధ వేదాంతోపన్యాసములున్ను గావింపబడినవి.

మరల మధ్యాహ్నం గం 4-0 లు మొదలు గం 9-0 ల వరకును ఉపన్యాసములు గావింపబడినవి.

గ్రామస్థులగు స్త్రీలును, పురుషులును శ్రద్ధా భక్తులతో రెండువేళల వచ్చి మిక్కిలి ఆదరముతో నిశ్శబ్దముగా ఉపన్యాసములను విని యానందించిరి. ఇంకను గ్రామాంతరములనుండి పెక్కుమంది యీ సభల నిమిత్తమై వచ్చిరి.

శ్రీ శ్రీ రాణీవారు పండితులకును, గ్రామస్థులగు శ్రీవైష్ణవులకును గ్రామాంతరములనుండి వచ్చిన వారి కందరకును కోవెలలోనే బ్రహ్మాండమగు తదీయారాధనను జరిపించిరి.

రాత్రి ప్రతిదినమును పండితులందరును కలసి శ్రీస్వామివారి సన్నిధిలో నతి శ్రావ్యముగా శ్రీ సహస్రనామపారాయణమును గావించిరి. పిమ్మట తీర్థప్రసాద గోష్ఠితో ఆనాటి కార్యక్రమము ముగియుచుండెను.

రెండవదినము ఉదయము శ్రీస్వామివారికి శాస్త్రోక్త విధానముగా పండితుల ఉపనిషత్పారాయణతో శతకలశాభిషేకము గావింపబడెను. అపరిమితముగ భోగము శ్రీస్వామికి నివేదింపబడి పెక్కుమంది భక్తులకు వినియోగింపబడెను.

ఈ సభకు శ్రీ శ్రీ శ్రీ రాణీవారును వారి పరివారమును ఇంకను గ్రామస్థులును ఆహ్వాన సంఘాధ్యక్షులును కార్యదర్శులు సభ్యులును గావించినసేవ నిరుపమానము ఇందు శ్రీమాన్ మనికొండ వెంకటలక్ష్మయ్య శ్రేష్ఠిగారి శ్రద్ధాభక్తులు ప్రశంసనీయములు.

వీరందరకిని శ్రియఃపతియగు శ్రీనివాసుడు సమస్త సౌభాగ్యములను భగవద్భాగవతభక్తిని ఉత్తరోత్తర ప్రసాదించి రక్షించుగాత!

ఇచ్చట ఇదే ప్రథమ సభయైనను ఇంత వైభవముగా జరుగుట ఆశ్చర్యావహమును ముదావహమును అగుచున్నది.

ఈ సభకు శ్రీ కో. యి. శ్రీనివాస రామానుజాచార్యులుగారు కో, కం. రంగాచార్యులుగారు, న. చ. సం. జగన్నాథతిరువెంగళాచార్యులుగారు, శ్రీ తి. ప. రామానుజస్వామిగారు, కవిరత్న గుదిమెళ్ళ రామానుజాచార్యులుగారు, శ్రీరంగం .న. చ. రఘునాథాచార్యులుగారు, మొలుగు రామానుజాచార్యులుగారు మహాభాష్యం వరదాచార్యులుగారు ప్రభృతులు విచ్చేసిరి. శ్రీ శ్రీ సీతారామ యతీంద్రుల వారి భజన రెండవ దినం రాత్రి జరుపబడెను. వారు భగవద్భక్తిలో తన్మయులై సభ్యులనందర తన్మయులు గావించుచు రెండుగంటలకాలము భజన గావించిరి. శ్రీ శ్రీ రాణీవారే ఉంచుమించు యీసభకైన ఖర్చునంతను భరించి పండితులను సంతృప్తిగ సన్మానించిరి.

ఇట్లు,

శ్రీ వి. ప్ర. సంఘకార్యదర్శి.

## సంభావన

గవర్నరుపేట, విజయవాడ శాఖ రు 58 లు సమర్పించిరి.

| | |
|---|---|
| మోటమర్తి చూడామణెమ్మగారు తిరువాయ్మొ (సంఘమునకు తరుపున) సంతర్పణకున్ను మరి ఆచార్య సంభావన | 5-0-0 |

భాగవతాల కట్నములు

| | |
|---|---|
| నూనె మహాలక్ష్మమ్మగారు | 5-0-0 |
| మాంబళ్ళ రంగనాయకమ్మగారు | 5-0-0 |

కట్నములు

| | |
|---|---|
| శివకోటి రాజలక్ష్మమ్మగారు | 1-0-0 |
| చింతలపూడి సామ్రాజ్యం | 1-0-0 |
| దూపుగంట లక్ష్మీనరసమ్మ | 1-0-0 |

ఇట్లు,

తమ విధేయురాలు

దాసానుదాసురాలు

కె. ధనమ్మ.

## నెల్లూరు

ఈ రాబోవు కార్తీక మాస సభలు నెల్లూరులో జరుపబడుటకు ప్రయత్నములు గావింపబడుచున్నవి. తప్పక జరుగుసనియే ఆశించుచున్నాము.

# శ్రీ గీతామందిర ప్రారంభోత్సవము

(107 వరదాము త్తియప్పన్ వీధి మదరాసు 1)

గత సంవత్సరము కార్తీక మాసములో ప్రారంభించబడి బ్రహ్మాండ వైభవముతో మదరాసు నగరమున శ్రీ ఉప్పుటూరు వారి రామానుజ కూటములో మన సంఘముచే నిర్వహింపబడిన శ్రీ గీతాసందేశోత్సవ ఫలితంగా నచ్చట ఆదర్శముగ పని చేయుచున్న శ్రీ యతిరాజసేవా మహిళా సంఘము వారిచే సుమారు నలుబది వేల రూపాయల ఖర్చుతో కొనబడిన దివ్యమందిర ప్రారంభోత్సవము శ్రీ గీతావతార దివసమగు పరమపవిత్రమైన యీ మార్గశిరశుద్ధ ఏకాదశి ఆదివారం (9-12-51) ఉదయం గం 10-1లకు గావింపబడును.

ఉత్సవము ఈక్రింది విధముగా వారము దినములు మన సంఘ యాజమాన్యమున నిర్వహింపబడును.

9—12—51 ఆదివారం

ఉదయం: తిరువీధి (గీతాపఠనముతో)

గం 10-1 లకు గృహప్రవేశం
శ్రీ శ్రీ శ్రీ మైలవరం రాణీ వారిచే మన సంఘమునకు సమర్పింపబడిన శ్రీ శ్రీ శ్రీ అరంగ నగరప్పన్‌స్వామి వారు వారి పరివార తిరువారాధన ప్రారంభోత్సవము
శ్రీ గీతాజయంతి అంకురార్పణము
శ్రీ గీతా అఖండ పారాయణ ప్రారంభము
కేంద్ర కార్యాలయ ప్రారంభోత్సవము

మధ్యాహ్నం: శ్రీ యతిరాజ సేవా మహిళామండలి కార్యాలయ ప్రారంభము
గీతోపన్యాస ప్రారంభము

రాత్రి: మన సంఘముచే ప్రకటింపబడిన శ్రీ కృష్ణార్జున సంవాద మనెడు గీతా నాటక ప్రదర్శనము.

10—12—51 సోమవారం

ఉదయం: తిరువారాధన
తిరువీధి
గీతామందిరమున గీతా సమష్టి పారాయణము
గీతార్థవివరణము
ఉభయ వేదాంత పాఠశాల ప్రారంభోత్సవము

మధ్యా: విదుషీమణులచే గీతోపన్యాసములు.
పండిత గీతోపన్యాసములు
రాత్రి : శ్రీ "కవిరత్న" గుదిమెళ్ళ రామానుజాచార్యులగారిచే అపూర్వముగా రచింపబడిన "శ్రీ యతిరాజవిజయ"మను బుర్రకథా ప్రదర్శనము.

విశేషోత్సవములు

11-12-51 మంగళవారం బాలికా పాఠశాల ప్రారంభోత్సవము
12-12-51 బుధవారం శ్రీ శ్రీ శ్రీ మైలవరం రాణీగారు మూనన సంఘమునకు సమర్పించిన శ్రీ కోశముల సంప్రదాయ గ్రంథాలయ ప్రారంభోత్సవము
13-12-51 గురువారం సంప్రదాయ గ్రంథ విక్రయశాల ప్రారంభోత్సవము
14-12-51 శుక్రవారం స్త్రీల కాలక్షేప ప్రారంభోత్సవము
15-12-51 శనివారం ద్రావిడ వేదాంత విభాగ ప్రారంభోత్సవము
ఆనాటి రాత్రి తిరుప్పావై వినోదము
కార్యక్రమము వివరముగా యథావకాశమందరకు ముందు అందజేయబడ వచ్చును,

ఇట్లు,
శ్రీవిశిష్టాద్వైత ప్రచారక మదరాసు నగర శాఖాసంఘము
శ్రీయతిరాజసేవా మహిళా సంఘము (మదరాసు శాఖ)

కేంద్ర సంఘ కార్యదర్శులు:- తె. కం. గోపాలాచార్యులు
ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులు

## శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ ఉత్తరదేశ ప్రచారము

గార్వాలా బదరి క్షేత్రములో ఈ సంఘ శాఖ ఏర్పాటు చేయబడినది దీనికి అధ్యక్షులు శ్రీ శ్రీ శ్రీ సుదర్శనాచార్య స్వామి (శ్రీ రామానుజ కూట మహంతు ప్రతినిధి)

కార్యదర్శులు:- శ్రీ శ్రీ శ్రీ కృష్ణప్రపన్నాచార్యస్వామి (కిడదీస్వామి)
దేవ ప్రయాగలో ఈ సంఘ శాఖ ఏర్పాటు చేయబడినది.
అధ్యక్షులు:- శ్రీ శ్రీ శ్రీ నరహరిశాస్త్రిజీ
కార్యదర్శులు:- శ్రీ శ్రీ శ్రీ మురళీధరాచార్యజీ

ప్రకటన

శ్రీ సీతారామచం[illegible] దేవాలయ [illegible]

[illegible] ప్రారంభోత్సవములు

[illegible] వరదా ముద్రియమ్మగారి [illegible]

[illegible] ఆదివారం [illegible] శ్రీ విశిష్టాద్వైత [illegible] సంఘమువారే [illegible] త్రిదండి [illegible] శ్రీ సీతారామచంద్ర ప్రారంభోత్సవముతో పాటు శ్రీభాష్య వేదాంత పాఠశాలయు ప్రారంభింపబడును. అందు రెండు సంవత్సరము లవిచ్ఛిన్నముగా శిక్షణ [illegible] అధికారులు తమ యోగ్యతలను తెలుపుచు నవంబరు నెలాఖరులోగా కార్యాలయమునకు దరఖాస్తులను పంప్పకొనవలెను. ప్రస్తుతము కొద్దిమంది విద్యార్థులకే యవకాశ మొసంగబడును గాన యోగ్యతలను బట్టియే చేర్చుకొనబడుదురు.

ఇట్లు,
శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ కార్యదర్శి.

దరఖాస్తులు పంపవలసిన అడ్రసు
శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ కార్యదర్శి, కోరుకొండ
(వయా) రాజమహేంద్రవరం, తూర్పు గోదావరి జిల్లా.

# రాజమహేంద్రవరం

## శ్రీ యతిరాజ సేవా మహిళా సంఘము

ఈ సంఘమునకు అధ్యక్షులగు శ్రీమతి రామినీడి రాయలమ్మగారు శ్రీమతి రంగనాయకమ్మగారు కార్యదర్శిని యగు ముదుంబై. రామానుజమ్మ గారున్ను శ్రీ. వి. ప్రచారక సంఘ ఆదేశాను సారముగా యీ క్రింది సభ్యురాండ్ర సహాయముతో శ్రీ. వేణుగోపాలస్వామివారి ఆలయమున ప్రతి ఏకాదశికిని శ్రీ భగవద్గీతా సమిష్టి పారాయణ ఉపన్యాసములు జరిపించుచు యీ సంవత్సరమంతయు గడిపి యీ నెల 10వ తేదీ ద్వాదశీ. శనివారంనాడు సదరు ఆలయములో విశేష భోగ రాగాదులు జరిపించి సహస్రనామార్చనము గీతోపన్యాసములతో శాత్తుమర మహోత్సవమును నెరపిరి.

ఆసందర్భమున మన సంఘమునకు రు 5–0–0లను విరాళముగా సమర్పించిరి.

ఇందు విశేషించి శ్రద్ధాభక్తులతో పాల్గొన్న ఇతర సభ్యురాండ్రు—

శ్రీమతి నున్న లక్ష్మీతాయారమ్మగారు

శ్రీమతి చిట్టూరి సుభద్రమ్మగారు

,, కుమ్మరగుంట పుల్లమ్మగారు ,, ఈయుణ్ణి రంగనాయకమ్మగారు
,, నున్న మాణిక్యాంబగారు ,, పాలకోడేటి మంగమ్మగారు
,, శ్రీ కమలాభాయమ్మగారు మొదలగువారు

మైలవరంలో శ్రీ శ్రీ శ్రీ రాణీవారిచే జరిపింపబడిన సభయే కార్తీకమాస సభగా పరిగణింపబడినది.

మార్గశిర మాస సభ — మదరాసు చీరాలలలోను
పుష్యమాస సభ—పంగోలులోను, మాఘమాస సభ—నడిగడ్డపాలెములలోను
జరుపబడవచ్చును.

కార్యదర్శి.

---

    

శ్రీమతే రామానుజాయనమః

# శ్రీకోదండరామక్రతువు

ఇది శ్రీవాల్మీకియొక్క అపరావతారమన దగు శ్రీ శ్రీ వాసుదాసు గారికభిమానాస్పదమగు దివ్యక్షేత్రము ఇందే శ్రీవారు తమ ఆంధ్రవాల్మీకి రామాయణమును దానికి మందర వ్యాఖ్యానమును రచించిరి ఇచ్చట వారిచే నేర్పాటు గావింపబడిన ఒకఆశ్రమముగలదు అందు శ్రీవారిహస్తాక్షరీ రామాయణము (మందరముతోను)న్ను శ్రీవారితిరువారాధనయు వారిపుస్తక బాండాగారమున్ను సురక్షితమై నిత్యము పూజింపబడుచున్నవి, ఇట్టిపరమపవిత్రమును ప్రశాంతమును నగు ఈయాశ్రమమున శ్రీకోదండరామసేవక సమాజమను పేరుతో శ్రీమాన్ కూనంనేని వెంకటప్పదాసుగారనెడు శ్రీవారిఆంతరంగిక ప్రియశిష్యులును పరమసాత్వికులునగు నొకవ్యక్తి సుమారుపదహారుసంవత్సరములనుండి అఖండ రామసంకీర్తనమును గావించుచున్నారు. వీరికి తోడుగాబంగారునకు పరిమళమువలె విద్వాన్ సాహిత్యవిద్యా ప్రవీణ శ్రీమాన్ కోడూరివెంకటాచార్యులుగారు పనిచేయుచున్నారు ఈమధ్య శ్రావణమాసములో నిచ్చటజరిగిన మనసంఘ పండితసభకు విచ్చేసిన భాగవతోత్తములీప్రశాంతిని యీరామణీయకమును గోరి పరమానందముతో దీనియభివృద్ధికిగానించిన మంగళాశాసనమునకు ఫలితముగా నీమాఘమాసములో శ్రీవారి జన్మదినోత్సవ సందర్భమున సుమారు నూరుగురు మహాపండితులతో నీయాశ్రమమున శ్రీ వి. ప్రచారకసంఘయాజమాన్యమున "శ్రీకోదండరామక్రతువు"

6 దినములు ప్రతిదినం ఉదయం చతుర్వింశతి రామాయణ పారాయణలున్ను దానికంగముగా యజుర్వేదము, నాలాయిరదివ్య ప్రబంధములు, శ్రీవిష్ణుపురాణం, శ్రీభాష్యం, గీతాభాష్యం,

మొదలగువారాయణలున్ను లక్ష్మీ అష్టాక్షరీ మహామంత్ర ఆహుతులును తద్దంగతర్పణములును ... భ్యాహ్నము మనసంఘ పండితప్రకాండులచే శ్రీమద్రామాయణ విషయములను గూర్చి ... మర రంజకముగు ఉపన్యాసములున్ను గావింపబడును.

ఈ ఉత్సవములు పుష్య ... శుక్రవారం (25-1-1952) రాత్రి అంకురార్పణతో ప్రారంభించ బడి చతుర్థి బుధవారం 30-1-52 పూర్ణాహుతి 31-1-52 అవభృదములతోను సమాప్తి గావింప బడును.

ఇందు నిమిత్తమై వేంచేయు భాగవతోత్తములందరకును తదీయారాధన ... ఏర్పాట్లు గావింపబడును కావున సంఘాభిమానులు శ్రీవాసుదాసుగారి శిష్య బృందము ... యు ఇందుపాల్గొని దీనిని వైభవోపేతముగా జరిపించ గోరుచున్నాము.

ఆ తరుణమునకు ఎవరికి లభించినన్ని తులసీదళములు వారు తెచ్చి సమర్పించవలెను.

ఇట్లు.

శ్రీకోదండరామసేవకసమాజం నడిగడ్డపాలెం.

చుండూరు పోస్టు (వయా) తెనాలి గుంటూరుజిల్లా.

## వంగోలు

ఈ నగర సంఘమువారు గడుంగడు శ్రద్ధాభక్తులతో అతి వైభవముగా మూడు సంవత్సరములనుండి మన సంఘ పండితులచే నిరంతర కాలక్షేప గోష్ఠిని సాగించుచునే యున్నారు.

శ్రీమద్రామాయణ, శ్రీవిష్ణుపురాణ, అష్టాదశరహస్య, ఆచార్యహృదయ తిరుప్పావై. గీతాది ప్రబంధములు శ్రీ ఉ. వే. శ్రీమాన్ కో. కం. రంగాచార్యులుగారు 2 సంవత్సరములు సాగించిరి.

ప్రస్తుతం శ్రీ ఉ. వే. శ్రీమాన్ కో. ఋ. శ్రీనివాస రామానుజాచార్యులుగారు సంస్కృత భారతము నుండి శ్రీకృష్ణరాయభారం సాయించుచున్నారు.

వీరు సుమారొక సంవత్సరమునుండియు బృహద్బ్రహ్మ సంహిత ఉత్తరరామాయణాది గ్రంథములను సాగించిరి. ఇట్లే అంతటను జరుగవలెనని ఆశించుచున్నాము.



ఖరనామ సంవత్సర ఆశ్వీజ శు ౧౩కి శనివారం (13-10-51) తేదీ మొదలు 3 దినములు విజయవాడలోని కొత్తపేటలో జాపట్ల వాస్తవ్యులైన శ్రీ ఉ. వే. శ్రీమాన్ కొమాండూరి ఇళైవిల్లి శ్రీనివాస రామానుజాచార్యులుగారి అధ్యక్షత క్రింద శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ ఆశ్వీజమాస పండితసభ అతి వైభవముగ గావింపబడెను.

శ్రీ పారేపల్లి వారి రామానుజకూటము పండితులకు విడిదిగా నొసంగబడెను. ఆ రామానుజ కూట ట్రస్టీలు ఉదారాశయముతో సభలు 3 రోజులును ఆసనలకై వచ్చేసిన పండితులు శ్రోతలు మొదలగువారి కందరకును షడ్రసోపేతమగు తదీయారాధన నేర్పాటు గావించి రామానుజ కూట నిర్మాతల ఉద్దేశములను సఫలపరచిరి. ఆ ట్రస్టీలలో ముఖ్యులును, రామానుజ కూట స్థాపకుల వంశీయులునగు శ్రీమాన్ పారేపల్లి సీతారామయ్య శ్రేష్టిగారు రాత్రింబవళ్లు అచ్చటనే వేచియుండి ఏలోటును లేకుండా అపరిమిత శ్రద్ధాభక్తులతో యీ ముఖ్యతమ తదీయారాధన కార్యక్రమమును నిర్వహించి పండితుల శుభాశీస్సులకు పాత్రులైరి. పండితులపట్ల వారి గౌరవ ప్రపత్తులు వర్ణనాతీతము.

ఉదయము ఆ రామానుజ కూటమున తీర్థ ప్రసాద గోష్టికి పెక్కురు భక్తులు విచ్చేయుచుండిరి. రెండువేళలయందును పెక్కు శ్రోతృజన మతిశ్రద్ధాభక్తులతో సభ నలంకరించి ఉపన్యాసములను విని ఆనందించుచుండిరి. శ్రీ ఉ. వే. శ్రీమాన్ పరాశర సుదర్శన భట్టర్ అయ్యావార్లంగారు శ్రీ ఉ. వే. శ్రీమాన్ తి. ప. రామానుజస్వామిగారు, శ్రీమాన్ మహాభాష్యం వరదాచార్యులుగారు, తి.పు. వెంకటాచార్యులుగారు, శ్రీమాన్ కో. యి. వెంకటాచార్యులుగారు, శ్రీ ఉ. వే. శ్రీమాన్ మొలుగు రామానుజాచార్యులుగారు, శ్రీ ఉ. వే. శ్రీమాన్ కో. కం. రంగాచార్యులుగారు శ్రీ ఉ.వే. శ్రీమాన్ శ్రీ సీతారామ యతీంద్రులవారు మొదలగు పెక్కురు పండితులు విచ్చేసి వివిధ వేదాంత విషయము లుపన్యసించిరి.

ప్రతిదినము మధ్యాహ్నము శ్రీయతిరాజ సేవా మహిళా సంఘము వారి యాజమాన్యమున నరసాపురము నందలి శ్రీయతిరాజాశ్రమ స్థాపకురాలగు శ్రీమతి క.రా. తాయారమ్మగారు శ్రీమతి కె. ధనమ్మగారు, కవితిలక, కవితావిశారద బిరుదాంకితులగు శ్రీమతి కాంచనపల్లి కనకమ్మగారు, ఉపన్యాస విశారద శ్రీమతి గునుపూడి ఇందుమతీదేవిగారున్నూ స్త్రీలహితోపదేశము, దివ్యప్రబంధములు, ఆముక్తమాల్యద విభీషణశరణాగతి మొదలగు విషయములు శ్రోతృహృదయ రంజకముగా నుపన్యసించిరి. ఈ కార్యనిర్వహణ భారమునంతను శ్రీమతి క.రా. తాయారమ్మగారు తమ శరీరారోగ్యము సరిలేకున్నను సంఘాభిమానముతో బహునేర్పుగ నిర్వహించిరి. వారికి శ్రీయఃపతి సంపూర్ణారోగ్యమును చేకూర్చి నిరాడంబర భగవద్భాగవతారాధనను పెంపొందింప జేయుగాక.

శ్రీ నందిపాటి సోదరులున్నూ, శ్రీ ఉదయగిరి కృష్ణారావుగారు, శ్రీ శివకోటి లక్ష్మీనరసింహంగారు, శ్రీమాన్ మా. సీతారామయ్యగారు శ్రీ కూరపాటిరామారావుగారు మొదలగు అచ్చటి సంఘ కార్యకర్తలు యీ సభకు కావలసిన ఆర్థికలోపమేమియు రాకుండ సక్రమముగ జరుగుటకు చేసిన సేవ ప్రశంసనీయము.

## -: శుభోదంతము :-

మన సంఘ కార్యదర్శులును నిరంతర సంఘ సేవా తత్పరులును నగు శ్రీ ఉ. వే. శ్రీమాన్ ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులువారు సంఘ శ్రేయస్సునకై తిరుమంత్ర మవతరించిన స్థలమగు బదరికాశ్రమమునందు శ్రీ బదరీనారాయణ స్వామివారి సాన్నిధ్యమున తిరుఅష్టాక్షరీ మహామంత్ర పురశ్చరణమును శాస్త్రోక్తరీతిగ అక్షరలక్షలు నలుబది దినములు నిరంతర దీక్షతో నిర్విఘ్నముగా నెరవేర్చి సంపూర్ణారోగ్యముతో శ్రీ స్వామి వద్ద సెలవు గైకొని ఋషీకేశము వేంచేసి అచ్చట ఆంధ్రాశ్రమమున విశ్రాంతిని గొను చున్నారు. త్వరలో వారి సేవాభాగ్యము మనకు లభించునని ఆశించుచున్నాము.

---

రిజిష్టరు నెం. 5049

# భక్తినివేదన

(వేదాంత మాసపత్రిక)

ఇందు వేదాంత విషయ వ్యాసములున్ను; భక్తిప్రచార విషయమైన వార్తలున్ను వేదాంత సాంప్రదాయ విషయకమైన ప్రశ్నోత్తరములున్ను ప్రచురించబడును.

చందాలు;

| | | |
|---|---|---|
| సాధారణ చందా | సం. రం 1కి | రు. 5-0-0 |
| సహాయ చందా | ,, | రు. 10-0-0 |

To

**Book-Post**

1. శ్రీమన్నారాయణుడే సృష్టి - స్థితి - లయ కారకుడు.
2. ఆయనే మోక్షప్రదాత.
3. ఆయనే పరతత్త్వము-పరమాత్మ.
4. ఆయన అఖిలహేయ ప్రత్యనీక కల్యాణ గుణాకరుడు.
5. ఆయనకు జీవుడు శరీరభూతుడు; శేషభూతుడు, పరతంత్రుడు, నియామ్యుడు; అనుభావ్యుడు.
6. జీవులు జ్ఞానైకాకారులు.
7. జీవులు అనంతములు.
8. జీవులు పరమాత్మకంటె భిన్నులు; ఈ భేదము సత్యమైనది; నిత్యమైనది.
9. జీవ-పరమాత్ములకు ప్రకృతి శరీరభూతమైనది; శేషభూతమైనది; పరతంత్రమైనది; నియామ్యమైనది; అనుభావ్యమైనది.
10. ప్రకృతి వికారాస్పదమైనది. జీవపరమాత్మలకంటె భిన్నమైనది. ఈ భేదము సత్యమైనది; నిత్యమైనది.
11. జీవుడు ప్రకృతి వియుక్తుడై పునరావృత్తి రహితమైన పరమాత్మ సాన్నిధ్యముగు పరమపదమును పొందుటయే మోక్షము.
12. భక్తి ఒక్కటియే మోక్షసాధనము.
13. భక్తి యన తైలధారవలె అవిచ్ఛిన్నమైన స్మృతి పరంపర.
14. వివేక-విమోక-అభ్యాస-క్రియా-కల్యాణ అనవసాద-అనుద్ధర్షలు భక్త్యంగములు.
15. ఇవి సదాచార్య-సమాశ్రయణ-లభ్యములు
16. జగద్గురువగు శ్రీరామానుజాచార్యులు వారును; వారి యనుయాయులున్ను సదాచార్యులు.

"నాస్తి గురుర్వైష్ణవాత్ పరః" భా. శైవం.



Edited printed &published by A. Ch. srimannarayanacharya at Sriman press, Kakinada, E.G.Dt.

    

శ్రీమతే రామానుజాయ నమః

శ్రీః

# నివేదన

వేదాంత మాసపత్రిక

| సంపుటి 3 | ఖర మార్గశిరమాసము | సంచిక - |
|---|---|---|

## తిరుమంత్రార్థ విశేషములు

శ్రీమాన్ శ్రీమత్తిరుమలై నల్లాన్ చక్రవర్తి సంపత్కుమార
జగన్నాథ తిరువేంకటాచార్యులవారు
గోవిందరాజులపేట, విజయవాడ.

శ్రియఃపతి లోకానుగ్రహ కాంక్షచే బదరి కాశ్రమమున 'తానే శిష్యనుమాయ్' ఇత్యాద్యుక్తి ప్రకారముగా శిష్యాచార్యరూపములతో నర నారాయణులై యవతరించి 'నరనారణనాయు లగత్తరై నూల్ శింగాన్మై విరిత్తవన్' అను నట్లు వేదశాస్త్రముల చిక్కులు విడదీసెను అనగా నేమనిన సకలవేద శాస్త్రార్థ సారాంశమగు 'ధ్యేయో నారాయణస్సదా' ఇత్యాది రీతుల ప్రతిపాదితమగు నర్థమును ప్రకాశింప జేయుట యనియర్థము. అదియెట్లు జేసెననినః తిరుమంత్రైనెళి ఉట్టరుళినాన్ అని సాధించి నారు అనగా తిరు మంత్రమును వెల్లడించెననిభావము దానియందలి మూడు పదములును శేషత్వము పారతంత్ర్యము కైంకర్యమునను మూడు కారణములను ప్రతిపాదించు చున్నవి. ఈమూడర్థములకును అనుష్ఠాతలను వరుసగా ముగ్గురిని పరమ పద మందేర్పరచెను. వారే అనంతగరుడ విష్వక్సేనులు తాను ప్రాప్య స్వరూపుడు శ్రీదేవిపురుష కార స్వరూపురాలు శేషుడనగా ననంతుడు శేషత్వరూపుడు ఇందులకు "నివాసశయ్యాసనే" త్యాది శ్లోకము ప్రమాణము గరుడు డుపార తంత్ర్యస్వరూపుడు. కనుకనే 'త్వదంఘ్రి సంమర్ద కిరణాంకశోభినా' యని చెప్పబడి నది ఇక విష్వక్సేనుడు కైంకర్య స్వరూపుడు శ్రీరంగ చంద్రమ స మిత్యాది శ్లోకము దీనిని వివరించు చున్నది విశ్వాచిదచిన్నయనాధికారము నితడు తనయంగుళి ముద్రచే నిర్వహించుచున్నాడు కనుక శ్రియః పతి శ్రీదేవితో విహరించుట కవకాశము కలిగినది ఇదయే కైంకర్యమని భావము.

# వైకుంఠేతు అనే శ్లోక వ్యాఖ్యానము

శ్రీమాన్ శ్రీమద్విపమళ్లై నల్లాన్ చక్రవర్తి సంపత్కుమార జగన్నాథ తిరువేంకటాచార్యులవారు
గోవిందరాజుపేట, విజయవాడ.

శ్లో॥ వైకుంఠే తు పరే లోకే శ్రియాసార్ధం జగత్పతిః
ఆస్తే విష్ణు రచింత్యాత్మా భక్తై ర్భాగవతై స్సహ

**అ**నేక గ్రామములకు ప్రభువగువాడు తన గ్రామములలో నొక గ్రామమున వసించు లాగున నేక లోకములకు ప్రభువగు శ్రీమన్నారాయణుడును అన్ని లోకములలో నొకటగు వైకుంఠమున వసించు చున్నాడు "పరేలోకే" అన్ని గ్రామములలోను గొప్పదగు గ్రామమున ప్రభువగువాడు వసించున ట్లీశుడును అన్ని లోకములలోను గొప్పదగు వైకుంఠలోకముననున్నాడని భావము ప్రధాననగరియందు నివసించు ప్రభువున కన్యత్ర వ్యాప్తి లేదు గాని యితడట్లు గాదు 'విష్ణుః' అంతటను వ్యాపించి యుండువాడని భావము. అంతటను వ్యాపించి యుండువాడనిన నిర్లక్ష్యము జేయుదురే మోయని 'అచింత్యాత్మ' యన్నారు అనగా అంతను వ్యాపించి యున్నను ఇతని స్వరూపము చింతించుటకు గూడ శక్యమయినది గాదని భావము ॥'సర్వత్రాసౌ' 'తత్రతిష్ఠామి' ఇత్యాది వచనముల చే నితనికి నివాస స్థానము లెన్నియో గలవు దీనిపై లక్ష్మ్యా! మేమనిన 'శ్రియాసార్ధం' ఇక్కడ సకుటుంబముగ నున్నాడని భావము యద్వా శ్రీమంతుడై యున్నాడని భావము 'సపత్నీ సరమేత' గనుక శ్రీదేవిని గూడియున్నాడని భావము. 'శ్రియా' అనునవిదే వ్యంతరముల కును ఉపలక్షణము. ఇందుపై శ్రీశ్రియః పతులిట్లు వేంచేసియుండగా నాగోష్ఠిని సేవించి యానందించు వారెవరైనగలరా? యని శంకగలిగెను. అందుపై 'భక్తైర్భాగవతైస్సహా' యన్నారు. సేవించువారు గూడ నొక రిద్దరుగారు ఒక రకము వారుగారనియు పలువురు పలురకముల వారనియు భావము ఇంకు భక్తులెవరు? భక్తులనగా 'భజసేవయాం' అనుటచే సేవార్థకమైన భజధాతువు నుండి యీశబ్దము నిష్పన్నమగుటచే 'భజంతీతిభక్తాః' అనగా సేవించు వారనియర్థము. సేవింపబడు వస్తువు నిందు చెప్పలేదు గావున నది యొకటే యనియు నదిభగవద్వస్తువే యనియు భావము. దీనివలన వస్త్వంతరమిక్కడ లేదని భావము. దీనివలన నస్పృష్టసంసార గంధులగు నిత్య సూరులు గ్రహింపబడుచున్నారు. ఇకభాగవతులనగా 'భగవతిభక్తః భాగవతః' అనువ్యుత్పత్తిని బట్టి యనేక విషయములు గలిగి యున్నను వానిని సేవింపక భగవద్విషయమును మాత్రమే సేవించు వారనుటచె ముక్తపురుషులు గ్రహింప బడుచున్నారు. 'భగవతిభక్తాః' భక్తియనగా పూజ్యేష్వనురాగో భక్తిరిత్యుచ్యతే యనుటచే పూజ్యుల యందలి యనురాగము. అదివీరికి భగవంతుని యందేగలదనుటచే విషయాంతర వైరాగ్యము సూచితము కనుక భాగవతు లనగా ముక్త పురుషులేయని భావము. ఇట్లువిషయ విభాగము జేయకున్నచో పునరుక్తి దోషమనివార్యము ఏవంచ సకల జగత్పతియు. సర్వ వ్యాపకుడును అవాఙ్మానస గోచరుడును అగు శ్రీమన్నారాయణుడు సర్వోత్కృష్టమగు శ్రీవైకుంఠ లోకమున శ్రీదేవీ సహితుడై నిత్యముక్త సమన్వితుడై వేంచేసి యున్నాడని భావము,

# శ్రీ భాష్యమునందు ప్రపత్తి ప్రసంగము

శ్రీ ఉ. వే. శ్రీ మాన్ విలుకూరు మా. వెంకటరాఘవాచార్య శిరోమణి
గద్వాల సంస్థానధర్మాధికారి, కార్యకర్త మరియు ఏజంటు:- హైదరాబాదు శ్రీ అహో[illegible]మఠం.

శ్రీ భాష్యములో ప్రపత్తి ప్రసంగము నానాశబ్దాది భేదాత్ 3-3-51) వికల్పోవి శిష్ట ఫలత్వాత్ 3-3-57) యీ అధికరణములలో శ్రీ భాష్యకారులచేత శ్రీ సూత్రకారులచేత నున్ను సూచింపబడినది తథాహి పూర్వాధికరణ మైన భూమజ్యాయస్త్వాధికరణములో వైశ్వానరవిద్యలో స్వర్లోకము వాయువు ఆదిత్యుడు మొదలైన వాట్లను అవయవముగా గలిగినటువంటి వైశ్వానరాత్మ ఉపాస్యమని చెప్పబడియున్నది ఇచ్చట ఆదిత్యాదిత్వేన రూపణము చేయబడిన చక్షురాది వ్యస్తావయవము ఉపాస్యమా లేక వ్యస్తము సమస్తము రెండున్ను ఉపాస్యమా అని శంకించి రెంటికిని ఉపాస్యత్వం కలదని పూర్వపక్షము చేసి సమస్తమునకే ఉపాస్యత్వ మని సిద్ధాన్తము చేయబడినది యీ అధికరణములో విద్యావిశేష చిన్త చేయబడినది ప్రకృతమైన నానాశబ్దాదిభేదాత్ అను శబ్దాది భేదాధికరణములో సర్వ విద్యావిషయమైన విచారము చేయబడినది అని ఉభయాధికరణసంగతి నానాశబ్దాదిభేదాత్ యీసూత్రము రెండు పదములు గలది సద్విద్యా భూమవిద్య మొదలైన విద్యలు పరస్పరము భిన్నములైనవి శబ్దాదిభేదాత్-ఉపాసీత-విద్యాత్, అనురీతిగా విధివాక్య భేదముచేతను రూపభేదముల చేతనున్ను అని సూత్రార్థము బ్రహ్మప్రాప్తిని ఫలముగా గలిగినటువంటి బ్రహ్మోపాసన రూపములైన సద్విద్య దహరవిద్య ఇత్యాదివిద్యలు ఒకేవిద్యయా లేక నానాభూతములా అని సంశయము ఫలము ఒక్కటే గనుక సామాన్య విశేష రూపములైన వేద, ఉపాసీత, ఇత్యాదులు అనర్థాన్తరములగుటచేత ఇవి ఒకటేవిద్య యని పూర్వపక్షము.

బ్రహ్మము ఒక్కటైనను ఆయా విద్యాప్రకరణములలో ఉపాస్యముగా ఘటించ బడినటువంటి ఆనందమయత్వాది గుణములయొక్క భేదము చేత ధాత్వర్థభేదము అవశ్యాపేక్షితము గనుక యజతి,దదాతి,జుహోతి, ఇత్యాది విధి వాక్యములచేత విధింపబడిన యాగ దాన హోమ రూప కర్మలకు భేదమున్నట్లు బ్రహ్మ విద్యల కున్ను విధివాక్య భేదముచేత అపహతపాప్మత్వాది గుణ భేదముచేతనున్ను విద్యలకు భేదము కలదని రాద్ధాన్తము ॥నానాశబ్దాదిభేదాత్॥అను సూత్రములో చెప్పబడిన శబ్దాదిభేదాత్ అను పదము ప్రపత్తి యనే న్యాసవిద్యను ప్రసంగించుచున్నది తదాహ ఇచ్చట చెప్పబడిన ధ్యాయీత, ఉపాసీత, మొదలైన విధివాక్యభేదము రూపభేద ప్రయుక్తము గనుక రూపభేదముతోనే ఇందుకు పర్యవసానం సిద్ధించగా సూత్రములో శబ్దభేద గ్రహణము వ్యర్థమై బ్రహ్మ విద్యాన్తర్గతమైన న్యాసవిద్యకున్ను వేరైన బ్రహ్మవిద్యలకంటె భేదము అవశ్యము చెప్పవలయును గనుక దీనిని విధించే టటువంటి శబ్దము న్యాసరూప మైన అర్థ విశేషవాచి యగుటవల్ల ధ్యాయీత మొదలైన శబ్దములకంటె దీనికి శబ్దాన్తరత్వము ముఖ్యమనే యభిప్రాయముతో యీపదము న్యాసవిద్యను బోధించుచున్నది బ్రహ్మవిద్యా

స్వతంత్రమైన న్యాసవిద్య అన్ని తపస్సుల కంటె అతిరిక్తమైన దనే విషయము తైత్తిరీయోపనిషత్తులో "తస్మాన్న్యాస మేషాం తపసా మతిరిక్త మాహుః" అని చెప్పబడి యున్నది యీ సూత్రములో శబ్దభేదోక్తికి న్యాసాది శబ్దమున్ను ఉపాసనాది శబ్దమున్ను తప్ప వేరు విషయము స్వరసముగా లభించదు గనుక యీ అధికరణములో శబ్దభేదముచేత చెప్పబడు విద్యాభేదము దీనికి సంబంధించినదే యని పూర్వాచార్యులున్ను అభిప్రాయ పడుచున్నారు యీ సూత్రములో ప్రపత్తి ప్రసంగించ బడినదనే విషయమును శ్రీ శ్రుత ప్రకాశికాచార్యులు ఆదిశబ్దేన న్యాసో వివక్షితః అని స్పష్టముగా వ్యాఖ్యానించి యున్నారు. ఏత దన్తరాధికరణమై వికల్పో విశిష్ట ఫలత్వాత్। అను వికల్పాధికరణములో శ్రీ శ్రుత ప్రకాశికాచార్యులు అస్మిన్నధికరణే న్యాసవిద్యా అభిప్రేతా యీ అధికరణలో న్యాసవిద్య అభిప్రేతము, అని స్పష్టముగా సాయించి యున్నారు ఫలము ఏకరూపముగా నుండినచో విద్యలకు సముచ్చయమని భావము యోగ దాన హోమ ముల యందు ప్రత్యవాయ క్షేపము సమానమైనను దేవతోద్దేశము దేశవిశేషప్రాప్తి పరస్యత్యాగ పాదనం మొదలైన వాట్లచేత కర్మలు పరస్పరము భిన్నములకు గుణభేదము చేతనే విద్యలు పరస్పరం భిన్నము లని ఏర్పడుటచేత న్యాసమని ప్రసంగింప బడిన సూత్రోపాత్త శబ్దము న్యాస విద్యనే ప్రసంగించున్నదని భావము.

విశిష్టఫలత్వాత్ విశేషాభావవత్ ఫలా యాసాం తాసాం భావః తత్త్వాత్ ఫలములో విశేషము లేదని తాత్పర్యము ఇచ్చట న్యాస విద్య అంగాంగి భావముతో స్పష్టముగా చెప్పబడక (యుంజీత) అని కేవలం యోగ రూపముగా చెప్పియుండుట మాత్రము చేత దీని పౌష్కల్యము ఇచ్చట చెప్పబడ లేదు.

శాఖాన్తరములో చెప్పబడిన పౌష్కల్యమును ఇచ్చట అతిదేశము, చేసినచో శాఖాభేదమువల్ల కర్మ భేదము ప్రసంగించదా అని ఆక్షేపము చేయుట యుక్తముకాదు ప్రకరణాన్తర ముండినను శాఖాభేదాదులలో చెప్పబడిన న్యాసములన్నియు సర్వవేదాన్త ప్రత్యయ న్యాయము చేత ఒకటే కర్మకాని భిన్న కర్మలు కావు గుణోపసంహార న్యాయముచేత న్యాస విద్య పుష్కలముగా విధించ బడినదని భావము ఉపాసనమునకున్ను ఒకటే శాఖలో పౌష్కల్యం లభించదని కూడా భావము యీ న్యాసవిద్యయే "న్యాసః పంచాంగ ఈరితః అని ప్రాప్యస్య బ్రహ్మణో రూపం ప్రాప్తుశ్చ ప్రత్యగాత్మనః ప్రాప్త్యుపాయ ఫలంచైవ తథా ప్రాప్తి విరోధి చ అని పంచాంగ విశిష్టముగా శాస్త్రములలో చెప్పబడి యున్నది.

యీ న్యాసవిద్యయే ప్రపత్తి శరణాగతి ఉపాయం సాధ్యోపాయం మొదలైన శబ్దముల చేత వ్యవహరింప బడుచున్నది.

ఇట్టి ప్రపత్తియొక్క అనుష్ఠానము ద్వయాఖ్యమన్త్రముచేతనే ఆచార్యులచే చేయబడును.

యీ మన్త్రముయొక్క నిష్కృష్టార్థము

సర్వస్వామియై సర్వప్రకార నిరతిశయభోగ్యుడై శ్రీ పెరియపిరాట్టిగారితో కూడుకున్న శ్రీ మన్నారాయణునియొక్క తిరువడికళలో

స్వరూపప్రాప్తమైన సర్వదేశ సర్వకాల సర్వావస్థోచిత సర్వవిధ కైంకర్యమునకున్ను విరోధియైన సర్వమున్ను నశించి పరిపూర్ణ కైంకర్యమును పొందుటకు అకించనుడైన దాసుని స్వరక్షణ భరాదులు యందు దాసుని కర్తవ్యం తెగినట్లు శ్రీ విశిష్టుడైన నారాయణునియొక్క తిరువడికళిలో అంగపంచక సంపన్నమైన ఆత్మరక్షా భరసమర్పణం చేయుచున్నాను అని ద్వయముయొక్క విస్తృతార్థము.

# రామానుజ అవతార రహస్యములు

శ్రీమాన్ శ్రీమత్తిరుమలై నల్లాన్ చక్రవర్తి సంపత్కుమార
జగన్నాథ తిరువేంకటాచార్యులవారు
గోవిందరాజులపేట, విజయవాడ.

పెరుమాళ్లు తాను పురుషస్వరూపుడు ఇందులకు 'న తేరూపం న చాకారః' ఇత్యాది వచనము ప్రమాణము. శ్రీదేవి స్త్రీ స్వరూపురాలు భూనీళాది దేవీవర్గమంతయు శ్రీదేవి సారూప్యముగలవారై యుండవచ్చును శేషుడు సర్ప స్వరూపుడు గరుడుడు పక్షిస్వరూపుడు విష్వక్సేనుడు మొదలుకొని తక్కిన వారి కందరికిని భగవత్సారూప్యముగలదు ఇందు శేషుడు భగవంతునితో ననన్యుడే. 'సహస్ర శిరసం సాక్షాద్య మనంతం ప్రచక్షతే' 'విష్ణోర్యా తామసీతనుః' ఇత్యాదివచనము లిందుకు ప్రమాణములు. శ్రీభాగవతమున సప్తమో వైష్ణవంధామయమనంతం ప్రచక్షతే గర్భోబభూవ దేవక్యా హర్ష శోకవివర్ధనః॥' దేవక్యా జఠరే గర్భం శేషాఖ్యం ధామమామకం' అని యున్నందున నిది నిర్వివాదాంశము.

శేషుడు భగవదవతారమను విషయమున శేషాంశావతీర్ణుడగు లక్ష్మణుడు రావణుని శక్తిచే మూర్ఛిల్లినపుడు వాడతని గొంపోవయత్నింపగా సాధ్యము గాకుండునట్లు తనవైష్ణవ తేజమును తనయందు నిలుపుకొని లక్ష్మణుడున్నాడను గాథ సహాయమగును. ఇకబలరామావతారమును గురించిన పై శ్లోకములును ఇతనిని దశావతారములలో జేర్చిన 'రామో రామశ్చ రామశ్చ' యనునవియును ఇంకను నిశ్చయమునకు సహాయములే. 'సహస్రశిరసం' ఇత్యాది అనునవి శేషుని పాతాళలోక వాసునిగ జెప్పుచున్నవిగదా యనిన నతనికి పరమపద వాసియగు శేషునితో భేదములేనట్లు నిశ్చితమైయేయున్నది. గాని వీరిద్దరును భిన్నులని యెందును లేదు ఋషిమాత్రులగు సౌభర్యాదులకే యేక కాలమునందనేక శరీర పరిగ్రహమునకు యోగ్యత యుండగా నిట్టివారి కుండదన జెల్లదుగదా! కనుక నిది నిర్వివాదాంశము ఇట్టి శేషుడు ప్రథమమందు 'అనంతః ప్రథమం రూపం' అనట్లు పరమపదము నందేర్పడి యెను తరువాత నవసరముబట్టి పాతాళమందు గూడనుండెను ఇట్లు శేషుడు భగవ దవతారమే గాని వేరుగాదని స్పష్టమయినది గదా. అతడు దన యవతార ప్రయోజనమును నిర్వహింప భగవత్సన్నిధిని సకలవిధములను 'యథోచితం శేషఇతీర్యతే జనైః' అనునట్లు తనకుగల శేషుడను తిరునామము సార్థక మగునట్లు ప్రవర్తించెను అంతట భగవంతుడు పరమ పదవాసుల కనుభవింపజేసిన తన శేష శేషి భావసంబంధమును తన

శేషస్వరూపమున వారి కలవరచిన శేషత్వమును భూలోక వాసులకు గూడ నందజేయనిచో తృప్తిలేదుగనుక నాకొరంతను దీర్చ శ్రీ రామావతారముగా భూలోకమునకు వేంచేసెను. శేషి శ్రీరాముడై యవతరింపగానే శేషుడు లక్ష్మణుడై యంతరించెను. వారిరువురి వలన భూలోకవాసులు శేష శేషి భావమును గుర్తెరింగిరి. కానియిందొక సందేహ ముదయించెను. శ్రీరామలక్ష్మణు లన్నదమ్ము లగుటచే వీరికిట్లు శేష శేషి భావమేర్పడిన దని జనులు గ్రహించిరేమోనని ఈసందేహ నివృత్తికై శేషి తమ్ముడుగను శేషభూతు డన్నగను మారి శ్రీకృష్ణ బలరాములుగా నవతరించిరి. ఈఘట్టమున శ్రీకృష్ణుడు చిన్నవాడైనను అన్నగారిచేతనే యనుసరింప బడియెను. కొన్నిచోటుల బలరాముని గృష్ణు డనుసరించి నట్లు కను పడినను అదియతని విలాసముగ నెంచదగును.

విశేషముగ బరికించి చూచిన బలరాముని యందు కృష్ణానువర్తనమే కనపడును. దీనివలన శేష శేషి భావము వయః ప్రయుక్తముగాదని స్పష్టమయినది. ఈ యవతారమున గీతోపదేశాదులచే తాత్కాలిక చేతన సంరక్షణము కొంత వరకు జరిగినది. ఆ యవతారము నిర్యాణమైనది. కలియుగ మారంభ మయినది. దుర్మతములు ప్రబలినవి. జనుల నజ్ఞాన మావరించినది. 'యదాయదాహి' యన్నట్లు భగవదవతార కారణ మేర్పడినది. అప్పటికి భగవంతున కనేకావతారములు జరిగినవి. అందువలన నతనికి విసుగెత్తినదో లేక తన యవతారముల వలన సంపూర్ణ ప్రయోజనము లభించలేదని తలచెనో లేక తానర్చావతారమును ధరించియుంటిననుకొనియెనో గాని దుర్మత నిర్మూలన పూర్వకముగా స్వమతమును స్థాపించుటకు శేషుని నియమించెను. లోకమున గూడ యజమాను లొకప్పుడు తాము జేయదగిన కృత్యముల యందు తాము విసుగొంది నప్పుడు తమ పుత్రాదులనో భృత్యులనో నియమించుట గలదు గదా, అట్లు నియమింప శేషు డుత్సాహముతో బయలుదేరి ప్రభుకార్యమును నిర్వహింప వచ్చి భగవద్రామానుజ రూపేణ యవతరించెను. ఈ యర్థమునే "అనంతః ప్రథమం రూపం" అనియు "ఆద్యా జగదాధార శ్శేషః" అనియు పెద్దలుప్రసాదించిరి. నీతడుసకలకైంకర్యములకు మాత్రము వెనుకదీయునా? అతనికి సాధ్యము గాని కైంకర్యమున్నదా? భగవంతునిపై భారమును వేసి తదాజ్ఞను సారముగా దుర్మతముల నిర్మూలించి విష్ణుమతమును స్థాపించి పరిపంథుల నోడించి దివ్యదేశముల నుద్ధరించి స్వశిష్యులకు శేషశేషి భావమును వెల్లడించి పరమపదమును గరతలామలకముగ జేసి దిగ్విజయము బొంది భగవదాజ్ఞను నిరవశేషముగ నిర్వర్తించెను. అమ్మహాత్ముని ప్రభావమున కీడుపడి యర్చావతార సమాధి నున్న పెరుమాళ్ళతనికి శిష్యుడై కొమరుడై యల్లుడై యనేక విధముల గౌరవించియు నుభయ విభూతి నాథుకత్వాద్యతిశయముల గలిగించియు నతని యొక ఋణవిముక్తుడయ్యెను. అంతట రామానుజావతారము సమాప్తినందెను.

# మణవాళమహామునుల ప్రభావము

శ్రీమాన్ శ్రీమత్తిరుమత్తె నల్లాన్ చక్రవర్తి సంపత్కుమార
జగన్నాథ తిరువేంకటాచార్యులవారు.
గోవిందరాజులపేట :: విజయవాడ.

ఆ. వె. మద్గురుండు శాస్త్ర సంపన్నుఁడున్నిక । మాగమాంగవేది యైనవాని ।
జ్ఞాననిష్ఠురమ్య జామాతృమునిఁగూర్చి । ప్రీణతులాచరింతు భక్తియుక్తి ॥

ఒకానొకప్పుడు భగవంతుని కిట్లు విచారము గల్గెను, అవతారముల యందు నాకు గూడ సాధ్యము గాని యద్భుతకృత్యము లెన్నింటినో యీ మహాత్ముఁడు నిర్వహించెను. ఇతని ప్రభావము నాప్రభావమును గూడ మించినది. నా యవతారమున లంకాపురిని ముట్టడించితిని గాని రావణాదులను సంహరింపక కార్యసిద్ధినందలేను, ఇతఁడు ఢిల్లీ పట్టణమును ముట్టడించి రావణ ప్రతిరూపుఁడగు పాదుషాను వాఙ్మాత్రమున వశపఱచుకొనియెను. నేనింద్రజిత్తు నాగపాశములకుఁజిక్కి గరుడుని సాయంబున వదలించుకొంటి గాని యితఁడు రాజభటులు దన్నాక్రమింప వచ్చుచుండ మంత్రబలమున నిసుకను గొండలుగ జేసి తప్పించుకొనియెను. నేను ఖరదూషణాదుల బాణ ప్రయోగమున గాని జయింపలేనైతిని. ఇతఁడు దశసహస్ర బౌద్ధులను వాఙ్మాత్రమున నోడించి పలాయితుల జేసెను. ఇంక నిట్టివెన్నియో గలవు. ఇట్టి మహనీయుని ప్రభావమున కోడుపడి నేనితనికి శిష్యుఁడనై కొడుకనై యల్లుఁడనై సేవించితిని. కాని కేవలము శిష్యుఁడనై సేవింపనైతిని. ఇతని వలన మంత్రరత్నమును గ్రహించితిని గాని దాని యర్థమును విని తరింపనైతిని, మదంశ సంభూతులగు కూరత్తాళ్వారులీతని విషయమునందు తనియను విన్నవించె గాని యట్టి మహాభాగ్యము నాకు లభింపలేదేయని యత్యంత వ్యాకుల చిత్తుఁడై యతనికి పునరవతారమును సంకల్పించెను. అతని సంకల్పాను సారముగా శేషుఁడు "భూత్వా భూయో వర వర ముని ర్భోగినాం సార్వభౌమ" అన్నట్లవతరింపవలసివచ్చెను. అట్లవతరించిన వారే శ్రీ మణవాళ మహామునులు. వీరిని ప్రత్యక్ష పరమపదమగు శ్రీరంగధామమున జేర్చుకొని శ్రీరంగరాజస్వామి మంత్రరత్నార్థ వ్యాఖ్యానమగు నాలాయిర భగవద్విషయమును వీరి వలన సేవించి దాని శాత్తుమురై కాలమున "శ్రీశైలేశ దయాపాత్రం" అను తనియను సభా మధ్యమున విన్నవించెను. ఈ యవతారమున దాను కేవలము శిష్యత్వమునే ప్రకటించెను. ఇంకే వావియు గ్రహింపలేదు. ఈ యవతారమున శేషశేషిభావము పరిపూర్ణముగ ప్రకాశింప జేయబడినది. ఇందును గురించియే వీరు ద్రావిడామ్నాయోద్ధరణ దీక్షను వహించిరి. సంస్కృతామ్నాయమును రామానుజావతారమున నుద్ధరించిరి. సరళ దానియందే ప్రవేశించి వీరు చర్విత చర్వణమును జేయరైరి. శేషశేషిభావము సంస్కృతామ్నాయమున వలె గాక ద్రావిడామ్నాయమున పరిపూర్తిగ జెప్పబడినది. కనుకనే దానిని వీరు వెల్లడించిరి, మరియు రామానుజావతారమున "శేషోవా సైన్యనాథో వా శ్రీపతిర్వా" అని సంశయించి, యనేకులు నిర్ణయింపలేరైరి.

గాని యీయవతారమం దెవరికిని అట్టిసంశ

యము గలుగనే లేదు. అందరికిని శేషాంశాభా
త్తుని నమ్మికకలిగినది కనుకనే 'శేషాంశాయా
స్తుమంగళం' అనిపాడుచినారు. లక్ష్మణ స్వామి
యందైనను ఒకటి రెండుపుట్టుకల యందువి
ష్వంశము ప్రతిపాదింప బడినదిగాని యా యవ
తారమునందెన్నడునుఅట్టి ప్రసాదము లేదు.కనుక
శేషస్వామీ యవతారమందు పరిపూర్ణ మని
భావము.రామానుజుల వారి విషయమున శేషు
డాయను వితర్కము గలుగుటకు దశ సహస్ర బౌ
ద్ధవిజయమునందు ధరించిన సర్పరాజ రూపము
కారణమై యున్నది. వేత్రసార సమానమగు
త్రిదండమును జూచిన విష్వక్సేనులాయని విత
ర్కగల్గుచున్నది. ఉభయ విభూతి నాయకత్వ
మును జూచిన శ్రియఃపతియా యని శంకింప
వీలగుచున్నది. అట్టిసంశయకారణము లేవియు వీరి
యందు లేవని భావము. మరియు వైరీతిగా
తర్కించినవారు మహా ప్రాజులగు సాత్వికులే
యనుటచే కొందరేయని తేలుచున్నది. అంతే
గాక 'వితర్క్యాయ' అనుటచే తర్కింప దగియు
న్నారని యున్నది గాని తర్కించి నట్లులేదు. వీరి
విషయ మందు 'తోషితాఖిలసూరయే' అను
టచే.సూరిజనులందరును సంతోషించిరని చెప్ప
ననువుగా నున్నది వారట్లు సంతోషించుటకు
కారణము 'తులామూలావతీర్ణాయ' యనుటచే
అవతారమే కారణమని తోచుచున్నది. అయితే
శేషుడా విష్వక్సేనుడా శ్రియఃపతియా యిత
డని తర్కింపదగిన లక్షణములు రామానుజుల
కుండెను. వీరికొక శేషలక్షణములు మాత్రమే
యుండెను. కనుక వీరికన్న వారధికులు గారా
యని సంశయింప వచ్చును. కాని ముఖ్యముగా
ప్రతిపాద్యమైన లక్షణము శేషత్వమే యగుటచే
నదిలుప్తము గాకుండవీరియందు పూర్ణముగ నుం
డుటయను నతిశయము వీరి కేయని భావము.
మరియు 'భాష్యకారాయ' యనుట చే రామాను
జులవారు పరమత ఖండన తత్పరు లగుటచేసత్వ
గుణ ప్రధానులును మహాప్రాజ్ఞులును అగు కొం
దరు పండితులే వారియందు దీపపడి శేషుడా
సైన్యనాధుడా శ్రియఃపతియా యని తర్కించిరి
మణవాళ మహామును లట్టివారు గాక స్వసాంప్ర
దాయ విశేషములను మాత్రమే ప్రధానముగ
సరస వచన రచనలచే నుపన్యసించు వారగ
గుటచే సమస్త సూరిజనులును సంతోషించి
రని తెలియ వచ్చు చున్నది. మరియు పరమత
పండితులగు యాదవుడు యజ్ఞమూర్తి మున్నగు
వారు తేవప్పెరుమాళ్ల శాసనమున గాని
రామానుజ సిద్ధాంతమునకునశపడలేదు. తిరువేం
గడముడయానను పండితుడు మనవాళ మహా
మునుల సన్నిధి యందనేక ప్రశ్నముల వేసి
వారిచ్చిన సమాధానముల వలన తనంతట దానే
తృప్తిపడి యంగీకరించెను. కించ రామానుజుల
వారు శ్రియఃపతికి మంత్రరత్నము నుపదేశించిరి
వీరు తదర్థ వ్యాఖ్యానమును ప్రసాదించిరి. దీని
వలన 'గరీయానర్థదో గురుః' అను వచనమును
బట్టి వీరి యతిశయము వెల్లడి యగుచున్నది.
మరియు 'శఠగోపమునింవందే' 'నాథాయమును
నయే' 'సహివిజయతేయామునమునిః' రామాను
జమునిర్జీయాత్' 'పరకాలమునిః ప్రీణమేమమ
హితః' ఇత్యాది వచనములచే మనసాంప్రదా
యమున వీరందరును మునులని చెప్పబడిరి. వీరు
మునులు మాత్రమే, మణవాళమహామునులను
టచే వీరియతిశయ మింకొకరికి లేదని స్పష్టమై
నది ఈమణ వాళ మహామునులను పదమునకు

భాషాంతరీ [illegible]ముకు పెరియ జీయరను తిరునామము వీరికేగలదు రామానుజుల వారును ఆళవందారులును మున్నగు వారు జీయరులుగారా? వారందరును వీరికి ముందటి వారైనను పెరియ జియ్యరను తిరునామము వీరికే కలిగినది. దీని వైలక్షణ్యమేమనిన రామానుజ పదాంభోజ సమా[illegible] [illegible] తృణీకృత విరించాది [illegible] కుశ విభూతులని చెప్పబడెను. తృణీకరించిరనిన సంతికను నెక్కువగు విభూతి వీరికిగలదనియా? లేక [illegible] విభూతుల [illegible] లేకనియా? యనిన నిస్సంశయముగ లేదు. గాని అపగత [illegible] దమూ[illegible] [illegible] చో[illegible] నిస్సంశయముగ గలుగు [illegible] [illegible] నపేక్షైః, అనుటచే వీరిదా[illegible] [illegible]ర్థ కాము పేక్ష లేదని స్పష్టమయినది. అందులకు కారణముగ నధిగత పరమార్థత్వ మొకటి జెప్పబడినది, తృణీకృత, ఇత్యాదిశ్లోకమున కార ణము చెప్పబడ నందున పయిరెండర్థములలో నేది నిశ్చయమో తేలలేదు. ఒకవేళ పరమార్థ [illegible]ధిగతముగాకయు దానియందే యపేక్షగలిగి విరించాది విభూతులను తృణీకరించి రేమో? ఇంకొలి లక్షణము లన్నియు వైరాగ్య లక్షణములు. ఇవి వీరిశిష్యులకే యున్నపుడు వీరి కున్నవా లేవాయను శంక కవకాశ మే లేదు గదా? ఇట్టి లక్షణములు పై వారికున్నవా లేవాయనిన నున్నవనుటకు నిదర్శనమేమియు లేదు, విమర్శింపగా వీనికి వ్యతిరేక లక్షణమున్నట్లు గనబడు చున్నది ఎట్లనిన ధనుర్దాసుల విషయమున రామానుజులవారు జూపిన యాదరాతిశయము లకు వారి [illegible]ములు [illegible] యపచారమును ద[illegible]శించిన వీరికి నాదమానములు [illegible] లేదని స్పష్టము

భక్తి ప్రపత్తులను మాత్రమే సమానముగ నెం[illegible] [illegible]యవలెని శ్రీభాష్యకారులు సాగించుట చే వడుగ [illegible] [illegible] వారే యొకరిద్దరో దప్ప దక్కిన రామానుజ దాసులంచరును అం[illegible] పాయ నిష్ఠగలవారు గారనుటకు సందేహము లేదు. వీరి శిష్యులలో ముఖ్యులగు [illegible] రఘు[illegible] యుకరై యన్, అ[illegible] [illegible] మో[illegible] [illegible]ష్టయే పరమార్థ చరమావధి [illegible] కనువానిని పొన్నాచ్చియారు తెలిపినను వీరికి గోచరముగాలేదు. గనుకను వీరికి పరమార్థ ధిగతముదగాలేదని స్పష్టము. వస్త్రఖండములను గురించి వీరుపొందిన వివాదను గమనించిన వీరి కర్థకామాన పేక్షత్వమున్నదన వీల్లేదుగదా? ఇక వారిలో వారికే పడనిస్థితిలో వీరికి నిఖిల జనసుహృత్త్వమెట్లు సిద్ధించును. వీరు క్రోధ లోభముల[illegible] [illegible] లేదని [illegible]కథలే చెప్పుచున్నవి. ఇట్టి విలక్షణ లక్షణములు [illegible]మన వాళ మహాముసుల శిష్యులకు [illegible] శ్లోకమున జెప్పబడి[illegible] వీరు పెరియజీయరను తిరునామమున ధ[illegible] నర్హులని తెలియవచ్చుచున్నవి, రామానుజులు యతిరాజులైనను యతులలో పెద్దరికము వీ కే యీయబడినది, రాచరికము జేయువారికన్న వయస్సునగాని వైభవమునగాని [illegible]పెద్ద [illegible] [illegible] రుండవచ్చును గదా! [illegible] యామునాచార్యులు యతులు. అనగా జీయరులు. రామానుజులు యతిరాజులు. మణవాళ మహాముసులు పెరియ జీయరు. అనగా యతులలో పెద్దలు ఇది: యు[illegible] ప్రియుక్తముగాదు. కాలప్రియుక్తము కాదు అధ్యవసాయమును బట్టి వచ్చినది. ఇట్లని పై శ్లోకమున నిరూపితము. వీరి పెద్దతనమున కిం[illegible]

కారణముకూడ గలదు. తాము వరియజీయ యుండియును యతీంద్రుల యందు ప్రావణ్యము గలవారై యుండిరి. కనుకనే వీరికి యతీంద్ర ప్రవణులను తిరునామము ... విమర్శించు కొలదిని వీరి ప్రభావము గోచరమగును.

---

# జీవాత్మ స్వరూపము

శ్రీ ఉ. వే. శ్రీమాన్ శ్రీ. ఆ. తి. స. ల. తి. తాతదేశికాచార్యులు

శ్లో॥ ఆకారత్రయసంపన్న మధ్యానన్దామృతోదధి ।
మగ్నంజయతి తత్ప్రాజ్ఞం మంగలైకాస్పదమ్మహః॥

భూరితిఋగ్వేదాదజాయత । భువఇతియజుర్వేదాత్ । సువరితిసామవేదాత్ । తానిశుక్రాణ్యభ్యతపత్ । తేభ్యోభితప్తేభ్యస్త్రయోవర్ణాఅజాయన్త । అకార ఉకార మకారఇతి । తానేకధాసమభరత్తదేతదోమితి" । "అకారం చాప్యుకారం చ మకారం చప్రజాపతిః । వేదత్రయాన్నిరబృహద్భూర్భువస్స్వరితీతిచ" ఋగ్యజుస్సామవేదములనుండి గలిగిన వ్యాహృతి త్రయవర్ణమును స్వసంకల్ప తేజోతప్త మొనర్చి వాటినుండి అకార ఉకార మకారము లేర్పఱ సర్వేశ్వరుడు ఆమూటిని ఒకటిగ నొనర్చ "ఓం" అను ప్రణవ మేర్పడినది. అనిభగవదాజ్ఞారూపములయిన శ్రుతిస్మృతు లు జెప్పుచున్నవి "యద్వై కించ మను రవదత్తద్భేషజం" అనిశ్రుతి ప్రసాదిత ప్రామాణ్యమగుమనుస్మృతి యందలి" ఆద్యంయత్త్ర్యక్షరం బ్రహ్మత్రయీయస్మిన్ ప్రతిష్ఠితా । సగుహ్యోన్యస్త్రివృద్వేదో యస్తం వేద సవేదవిత్" ॥ అనియెడిశ్లోకము.

సకల వేదములకు సారమై యెయ్యది వేదసారమై అకార ఉకార మకార రూపాక్షర త్రయాత్మకమై యున్నదో యెద్దాని యందు మూడువేదములు ఇమిడియున్నవో. అయ్యది విలక్షణమైన ప్రణవాఖ్య వేదమును. పరమార్థమైన భగవదలక్ష్యధారణ ఆపాదించే మోక్షప్రదమైనదిగాన అర్థాని స్వరూపమును అర్థమును ఎవడెఱుంగునో. అవ్వాడు సకలవేద సారార వేత్త అనుటచే అప్రణవ రూపవేదము ప్రమాణశ్రేష్ఠమైనదిగా స్పష్టము ...న్నది. ఈప్రణవ మందలి మొదటి అక్షరమగు అకారము, ప్రకృతి ధాతు ప్రత్యయములచే. సమస్త కళ్యాణ గుణాత్మకుడై. ఉభయ విభూతినాథుడై శ్రియఃపతియై, సర్వస్వామిత్వపదుడై. ఉపాస్యుడై, శరణ్యుడై, ఉపాయో పేయస్వరూపుడై. విలక్షణ విగ్రహ విశిష్టుడైన, నారాయణునిచెప్పుచున్నది. ఈఅకారార్థవాచ్యుడగు నారాయణునకిని. మకారవాచ్యుడగు జీవాత్మకును. మధ్య మాక్షరమగు ఉకారము అనన్యార్హ సంబంధ నియామకముగా నున్నది.

తృతీయాక్షరమగు మకారము జీవాత్మ ... మును నిర్ణయించునదగుటచే తదర్థమును విమర్శింతము. పఞ్చవింగశోయం పురుషః పఞ్చవింశఆత్మభవతి" ... వింశకః, అని శ్రుతులు భూతానిచ ... జీచ. టవర్గేణ తవర్గేణ జ్ఞాన గన్ధాద యస్తథా । పునః ... జైవాత్మం ఫకారేణ త్వహఙ్కృతిః బకారేణ ...కారేణ మహాన్ప్రకృతిరుచ్యతే। ఆత్మాతు సమకారేణ పఞ్చవింశః ప్రకీర్తితః" అని స్మృతియు. కాదిభాస్తములగు ఇరువదిన లు గతకములచే పృథివ్యాది ప్రకృత్యంతములగు ... త్త్వములను జెప్పి ఇరు వదియైదవ దగు మకారము. ఇరువదియైదవ దగు జీవాత్మ తత్త్వమును జెప్పుటచే మకారమునకు జీవాత్మ అర్థము.

మన- జ్ఞానే. మను అవ బోధనే ... నుండి ఉణాదయో బహులం అని భావేద ప్రత్యయముజేసి. బహులం ఛన్దసి. అని ప్రత్యయ లోపముకాగా. హల్ఙ్యాదినా ... ముచేసు లోపమురాగా "మ్" అనివ్యఞ్జన మాత్రము ప్రథమాన్తముగ నేర్పడుచున్నది. దీని చేత జీవాత్మ జ్ఞాన స్వరూపుడు జ్ఞానగుణకుడు. అని నిరూపితమయినది. మాఙ్ మాన్ అను ధాతువు నుండి గాని మపి పరిమాణే అను ధాతువు నుండిగాని పూర్వ ప్రక్రియచే సిద్ధమైన మకారముచే జీవాత్మ అణు పరిమాణుడని యేర్పడు చున్నది.

మది- హర్షే- అను ధాతువునుండి వ్యుత్పన్నమైన మకారమువలనని జీవాత్మ ఆనన్ద స్వరూపుడని స్పష్టమగు చున్నది.

మన- జ్ఞానే- మది- హర్షే అను ధాతువు... మగు మకారమునకు విజ్ఞానం యజ్ఞంతనుతే జ్యోతిరహమస్మి. విజ్ఞానఘనఏవ అనియెడు శ్రుతులు. అహం అని ... సిద్ధమైన జ్ఞాన స్వరూపమును జెప్పుచు అదియే ...

శుభకర మైనదియుగాను నుండును అట్టిసుదర్శనము చేతప్తుల యినవారలు పాతకమను సముద్రమును దాటుదురు గొప్పతేజస్సుతో గూడినదియు నాశనము లేనిదియున్నగు చక్రము మహనీయుండగు పరమాత్మయొక్క చక్రస్వరూపము కాన ఆ చక్రము దేహమునందు ధరించిన వారలు సర్వోత్కృష్టమగు పరమపదము నొందుచున్నారు.

శ్లో॥ యే కంఠ లగ్నతులసీ నళినాక్ష మాలాః
యేబాహుమూల పరిచిహ్నిత శంఖచక్రాః
యేవాలలాట ఫలకే లసదూర్ధ్వ పుండ్రాః
తేవైష్ణవాః భువన మాశు పవిత్ర యన్తి॥

అనినట్లు కంఠమునందు వ్రేలెడి తులసీ నళినాక్ష మాలలు గలవారును బాహుమూలములయందంకితములగు శంఖ చక్రములు గలవారును ఫాలమున ప్రకాశించెడి యూర్ధ్వపుండ్రము గలవారగు వైష్ణవులు లోకమును పవిత్రము జేయుచున్నారు.

శ్లో॥ తస్మాత్ శ్చక్రాది హేతినా మంకనం వైష్ణవం స్మృతమ్,
చక్రాది చిహ్నహీనస్య వైష్ణవత్వం నలభ్యతే॥

అనుటచే శంఖచక్రాద్యాయుధాంకనము వైష్ణవ లక్షణము కాన చక్రాది చిహ్నములచే శూన్యులయ్యేనేని వారికి వైష్ణవత్వము లభింపదు కాన బ్రాహ్మణులు [illegible] వాటిని ధరింపవలయును ఇతరులగు విష్ణుభక్తులునుముఖ్యముగ [illegible] వలయును.



## నారీ విభాగము

# తిరుక్కోళూర్ పెణ్ బిళ్ళై రహస్యము

(రచయిత: శ్రీమద్భాగవత శ్రీపాద రేణువు మదరాసు)

ఆ॥ పిణవరుందిట్టినో! గంటాకర్ణనెప్పాలే॥ దిరుగుచు శ్రీకృష్ణుని గాంచి.

తె॥ శివసంతర్పణజేసి నానా! ఘంటాకర్ణునివలె'

ఘంటాకర్ణుడు పరమ శివభక్తుడుగనుక 'హరి॥' యనునామము చెవిలో పడకుండు నటుల తన చెవికి ఘంటలు కట్టుకుని శివునిగూర్చి తపమొనరించుచు ప్రతిరోజును మిట్టమధ్యాహ్న మునకు ఒక్క ఋషిని తనశూలముతో గ్రుచ్చి జంపి ఆమాంసబు హరునికి నైవేద్య మొసగునట ఒక్కనాడు ఘంటాకర్ణుడును స్త్రీవానితమ్ముడైన కాలాంతకుడును బదరికాశ్రమ ప్రాంత్యంబుల,

ఉ॥ ఎక్కడివాడవన కడునీరవ్రు[illegible]రవవి[illegible]రం[illegible]
చక్కనిమేను నీ గదువచందము నెంతును గాన
మక్కటా!
నిక్కము మాకు చిత్తములు నీగుచున్నవి
కూర్ఁరసత్వా లో!
ఒక్కలిగొన్న బొక్కిపడదే మదిలో నినుగన్న
తల్లియన్॥

అని వారలకు శ్రీకృష్ణపరమాత్మ [illegible]నియె

గీత॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం।
సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే॥
భూజనములు యదువంశము।
రాజనగా బరగు దున్నింతరమునుస।
పూజయును దుష్టశిక్షయు।
సమ్మతము లఖిలనాథుక నగుటన్॥

అనిచెప్పి అంత ర్థానమయ్యెను. ఘంటాకర్ణ డీటుల ఘోరమైన తపము చేయగా కొన్నిదినములకు శివసాక్షాత్కార మాయెను శివుడు నీకేమి కావలనని యడుగగా మోక్షము కావలెనని కోరెను. అంత శివుడు విష్ణువే మోక్షప్రదాత గనుక అతనిగూర్చి తపమొనరింప మని వెళ్ళెను ఘంటాకర్ణుడు శివుని దూషించి కృష్ణధ్యానము చేయసాగెను.

కం॥ తలపున జూచిన రూపును।
వెల జూచినరూపు నొక్కవిధమై యున్నన్।
నెలకుని ఘంటాకర్ణుడు।
నలినాక్షుని నామకీర్తనం బొనరించెన్॥

అంత కృష్ణుడు ప్రత్యక్షమై తనభక్తు ననుగ్రహించి తన హస్తమున ఘంటాకర్ణుని మేను నిమురటయు.

కం॥ తామర రేకులు గన్నులు।
సామజహస్తములు తొడలు శశిమండలమున్।
మోమును మెరపును నొడలును।
సోమింపగ దివ్యస్వరూపసుందరుడ య్యెన్॥

॥ అతనికి బ్రీతి నిట్లను మురారి బలారిపదంబు నీకు।
నిచ్చితి నతనిం దొలంగ విధిచేసితి నేడమరావతీపురీ।
పతిగని నేనునీ నుదుట బట్టముగట్టితి గా కాలమిట్లు
తిరయభోగమంది పరమాత్ముని సౌఖ్యత రమ్యము పిమ్మటన్॥

ఘంటాకర్ణుడు సంతసించి తనతమ్ముడైన కాలాంతకుని కటాక్షింపమని వేడ.

కం॥ సీతమ్ముడు నీరూపున।
నీతోడన కూడవచ్చి నిర్జరరాజ్య।
స్వాతంత్ర్యముగని పిమ్మట।
నాతత్వము గూడవచ్చు నాకాధిపతీ॥

అని వరంబిచ్చి వెళ్ళెను. బదరీనారాయణమందే ఘంటాకర్ణుడే క్షేత్రపాలకుడై యున్నాడు. (తి.అ) ఘంటాకర్ణునివలె అసాధ్య వ్రతమేమైనన జేసినానా?

అ॥ తాయ్క్కాలం శెయ్దేనో అనసూయమైప్పోలే॥
తె॥ మాతృసేవ జేసినానా అనసూయవలె
అనసూయ అక్కటా అన త్యలగువా
మొకజన్మమా?

సీ॥ నవమాసములు మోసి భువిగాంచి
డోలికనుంచి యూచిలాలించు నప్పు
గజ్జెలందెలు మోయ గాళ్ళకడ్డ ము
దొత్తుకొమ్మని చేతులెత్తినపుడు
దోరిగింట నిరుగింటదిరిగి తిండికిరాక వేసారు
మాతాము పెట్టునప్పుడు
వెరపింప మదిలోన భీతిల్లి మొగమెత్తి
యమ్మా! యనుచు జాలి వరయునపుడే॥

గీ॥ క్షితిని మాతాపితలకాత్మ సుతుల పైన।
గలుగు వాత్సల్యమున కెంత విలువగలదొ।
తలప దనువెల్ల బులకలు గలిగె నకట।
సమయమే సంతతులులేని జన్మలకట॥

దుఃఖించునట్లు, ఒకానొక సమయమున నారదుడు త్రిదేవుల వద్దకు వెళ్ళి ఇనుప గుగ్గిళ్ళనిచ్చి వేచి ఇయ్యమనగా వారలు ప్రయత్నించి అసాధ్యము కాదని పలికిరి అంతే నారదుడు అనసూయ వద్దకు వెళ్ళి వేచి ఇయ్యమనగా భర్తపాదములు స్మరించుచు వేచి ఇచ్చెనట ఆ వేచిన సెనగలను తినుచూ నారదుడు త్రిదేవులారా పతివ్రతయన ఒక్క అనసూయకే తగునని ఆమెను మెచ్చుకొనగా వీరలు ఈర్ష్య జనించి విధిలేక తమ భర్తలతో ఆమె నవమానించి రమ్మని నిర్బంధించిరి త్రిమూర్తులు ముని వేషములతో అత్రిలేని కాలమున వారి ఇంటికతిథులై వచ్చిరి ఆమునులు నగ్నగా మాకు అన్నము వడ్డింపవలెనని కోరిరి, అనసూయ ఇదేమి భగవంతుని మాయ యనుచు,

గీ॥ ఈశ్వరా ధర్మపాలకా విశ్వనాథ!
పరమ పావనులగు వీరి బాలకులుగ
సలిపి మచ్చిలను నా నాడు నిలుపుమయ్య!
నీవుగా కన్యగతులింక లేవు నాకు.

అనగానే త్రిమూర్తులు బాలురైరి మూడు ఉయ్యెలలో నుంచి అనసూయ ఊపుతుండుటను జూచి త్రిదేవులతో నారదుడు.

సీ॥ నిర్నిద్ర మహిమా పునీతు లౌ మూర్తులు!
నిదురించుచుండి రేకొమ్మ వలెక
గర్భాంతరముల జగంబుల గన్నవా!
కౌశ సాధ్వి యొడిలోన నున్నవారు!
యోనిసంభవము లేని వారే నేడు!
అనసూయ కొడుకుల గుమారులైరి!
భువనంబులకు నాదిపూరుషులగు వారు!
ప్రకృతి కంతకు చిన్నవారలైరి!
గీ॥ అహాహా! నేడు త్రిమూర్తుల యంటి వార!
నీ సతీబలమున బలహీనులైరి!
వసుధ పతిపూజనము కన్న వ్రతముగలదె!
సాధ్వులను మీరు ఘనులు విశ్వమునగలరె!

యనగా త్రిదేవులు తోడనే అనసూయ కడకు పారివచ్చి,

గీ॥ మా పతులు భవత్కుమారులైరి!
మా కనయ మీరు పూజ్యులై తివమ్మ!
పరమ కృపను మాకు పతిభిక్ష నొసగి!
మాంగల్య రక్షణం బొసగుమమ్మ!

యనుచు వేడగా అనసూయ పతియాజ్ఞపై వారలను త్రిమూర్తులను జేయ వారు సంతోషించి ముమ్మూర్తి రూపమున దత్తాత్రేయుడై పుట్టిరే ఇటుల నేను జేసినానా?



అనుబంధము.



శ్రీమతే రామానుజాయ నమః

# చతుర్వింశతి శ్రీరామకల్యాణ పట్టాభిషేక మహోత్సవ

## ఆహ్వాన పత్రిక.

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ [illegible] తెనాలి తాలూకా నన్నగడ్డపాలెము శ్రీవాసుదాసా శ్రమమున స్వస్తిశ్రీ ఖర సం॥రం. పుష్య బ॥ మీా సోమవారము (31—1—1952 తేది) అంకురార్పణతోను, అమావాస్య దశమీా మంగళవారము 22–1–52 తేది ఉదయమునుండి చతుర్వింశతి శ్రీరామాయణ పారాయణములు వాటి అంగముగ జపహోమాదులు [illegible] బుధవారమునాడు పారాయణాది పరిసమాప్తియు. పూర్ణాహుతియు

శ్రీ శ్రీ శ్రీ వాసుదాసుగారి జయంత్యుత్సవము జరుగును. అమావాస్య అనగా 31–1–1952 తేదిని అవభృథోత్సవము జరుపుటకున్ను ఈపది దినములు ప్రతిదినము శ్రీరామాయణమును గురించి ఉపన్యాసములు పండితుల [illegible] జరుపబడును. — అభిమానులందరు విచ్చేసి యిందు పాల్గొన ప్రార్థన.

శ్రీవిశిష్టాద్వైత ప్రచారసంఘ కార్యదర్శులు.

ఆహ్వాన సంఘాధ్యక్షులు సూచన:-గతనెల పత్రికలో ప్రచురించిన తేదీలుమార్చబడినవి.

కూనపనేని వెంకటప్పదాసు.

## శ్రీ విశిష్టాద్వైతప్రచారక సంఘ కార్యకారిణీసమితి తీర్మానములు

శ్రీమతే రామానుజాయ నమః

ది. 12—12—51 వ సంవత్సరం తేదీని మదరాసు పట్టణమున 107 వరదా ముత్తియప్పన్ వీధిలో నూతనముగ స్థాపించబడిన శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ కార్యాలయమున సాయంకాలము గం 4–30 లకు శ్రీ ఉ. వే శ్రీమాన్ శ్రీపరాశర సుదర్శన భట్టర్ అయ్యావార్లంగారి అధ్యక్షతక్రింద సమావేశమైన శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ కేంద్రకార్యకారిణి సమితి తీర్మానించిన తీర్మానములు. 12–12–51

ఇంకను పాల్గొనిన సభ్యులు

శ్రీ పరాశర సుదర్శనభట్టర్ అయ్యవార్లు గారు.

ఆ. వి. శ్రీమన్నారాయణాచార్యులు

శ్రీ మస్తిరుపాల పుదిపుళ్ళ వెంకటాచార్యులు.

గోయిన సీతారామయ్య.

...హారి గోపాల కృష్ణమాచార్యులు

పదిమెళ్ళ రామానుజాచార్యులు.

సి. రాధాకృష్ణయ్య.

యం. రంగనాథయ్య.

సి. వీరరాఘవులు

పండిత చక్రవర్తి శ్రీనివాసరంగాచార్యులు.

## - తీర్మానములు -

1. విశ్వ కల్యాణార్థమై శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘముద్వారా సం॥రం 1953 లోగా విలేక 1954 వ సం॥రం॥ లోగాని బదరీ నారాయణములో "అష్టాక్షరీకోటి హవన క్రతువు" అను పేరుతో ఒక శాస్త్ర యజ్ఞమును జరుపుటకున్నూ అదే సందర్భమున "అష్టాక్షరీ మందిరము" అను పేరుతో భగవద్రామానుజ విగ్రహప్రతిష్ఠతో బదరీ నారాయణములోను, దానికి వెళ్ళు త్రోవలో మరియేడు స్థలములలోను సత్రములను స్థాపించుటకున్నూ తీర్మానించడమైనది.

ఈ మహత్కార్య నిర్వాహణమునకు అష్టాక్షరమంత్ర దీక్షితులున్నూ, స్వార్థత్యాగులై మంత్ర పునశ్చరణలో ఉత్సాహము శక్తి గలవారునై యీక్రతువు నందన్వయించి దీనిని నిర్వహించ గలవారలు, 40 దినములు బదరీనారాయణములోనే యుండి, అష్టాక్షరీ జపము చేయునట్టి స్వాములు 150 మందియు 10 రోజులు మాత్రము ఉండి హోమాదులలో పాల్గొనునట్టి స్వాములు 100 మంది యు కావలసి యున్నారు.

అందుకు యజ్ఞ సంభారాదికములు గాక దాదాపు రెండు లక్షల రూపాయలఖర్చు అగును

ఈ క్రతువునకు ఆర్థిక సహాయము చేయుటకు అందరకున్నూ అవకాశ ముండునటుల చేయవలెను ఒక ఆహుతికి ఒక అణా సమర్పించువారి యొక్క గోత్రనామము భగవత్సన్నిధియందు విన్నవించు విధానము నవలంబించుటకు తీర్మానించడమైనది.

ఒక దఫా వెయ్యి యాబదియెనిమిది రూపాయలు సమర్పించువారి గోత్రనామములు ప్రత్యేకముగా చేయవలెను. భగవత్సన్నిధియందు విన్నవించుచు ఒక వెయ్యి ఆహుతులు జరుపుటకు

| | |
|---|---|
| జరుగవలసిన జపము పదికోట్లు 10,00,00,000. | జరుగవలసిన రోజులు (10) పదిరోజులు. |
| జరుగవలసిన దినములు 40 | జరుప వలసినవారు. 100 |
| జపముచేయువారు. 125 | రోజునకు ఒకరుచేయవలసిన హోమము 10,000 |
| 1 రోజుకు 1 మనిషికి 20,000 | 1 రోజునకు 1 మనిషికి 10,000 |
| 40 రోజులకు 1 మనిషికి 8,00000. | 10 రోజులకు 1 మనిషికి 10,000 |
| 40 రోజులకు 125 మందికి 10,00,00000. పదికోట్లు | 10 రోజులకు 100 మందికి 100,00,00,0 |
| జరుగవలసిన హోమము 1,00,00,000 (కోటి) | |

నెయ్యి డబ్బాలు నెయ్యి. కొనవలసిన ముఖ్యవస్తువులు

250 రజాయిలు

250 శాలువలు.

500 సిల్కు వస్త్రములు. ఇంకా సరకులు.

2 వ తీర్మానము —.

శ్రీ నందననామ సంవత్సరమున శ్రీరంగములో ఉత్సవము తరవున శ్రీభగవద్విషయ వైభవోత్సవమును 12 రోజులు జరుపుటకు తీర్మానించడమైనది.

(మొదటి దినము అంకురార్పణము, చివరదినము అవభృథోత్సవము)

ఈఉత్సవములో భారతవర్షమునందలి భగవద్విషయ వేత్తలు నందరిని ఆహ్వానించి సన్మానించుటకున్ను అవకాశము ననుసరించి భగవద్విషయమునందు పరీక్షల నేర్పరచి అందుత్తీర్ణులగు వారలకు వారి జీవితాంతమువరకు శాశ్వత సన్మానము చేయుచుంటకు తీర్మానించడమైనది.

— పరీక్షా నియమములు.

తాత్కాలికము అచటికి సమావేశమైన పండితులనుండి 3 గురు లేక 5 గురు పండితులను పరీక్షాధికారులుగ ఎన్నుకొనవలెను. వారు తిరువాయ్మొళి పుస్తకమునుండి హఠాత్తుగ ఏదో ఒక పేజీని తెరచి ఆపేజీలోయున్న తిరువాయ్మొళినంతను ఒప్పగించుకొనవలయును.

ఇట్లు మూడుపర్యాయములుచేసి 3 తిరువాయ్ మొళులను పూర్తిగా తప్పులు లేకుండా ఒప్పగించుకొనవలయును.

మరియు మొదటి ఒప్పగించిన తిరువాయ్ మొళిలోని ఒకపాశురమునకును. రెండవపర్యాయము ఒప్పగించిన తిరువాయ్ మొళిలోని ఒకపాశురమునకును. నంబిళ్ళగారు సాయించిన ఈడును చదివి అనుబంధములోనివిశేషములతో సరళముగ తమ మాతృభాషలో అర్థమును చెప్పవలెను.

మూడవ పర్యాయము వప్పగించిన తిరువాయ్మొళిలోని ఒక పాశురమునకు నంబిళ్ళగారు

అఖిల భారత శ్రీ విశిష్టాద్వైత విరాట్ సమావేశము ఆనుకూలముగు కాలమున అనుకూలమగు ప్రదేశమందు జరుపుటకు తీర్మానించడ మైనది. ఇకి సంబంధ ఏర్పాట్లు అన్నియు చేయుటకు అధ్యక్ష- కార్యదర్శులకు అధికార మివ్వడ మైనది.

౪. నాల్గవ తీర్మానము:-

శ్రీ విశిష్టాద్వైత సిద్ధాన్త ప్రచారము విరివిగా జరుగుటకు స్థిరమగు ఆర్థిక కాధారము కల్పించుట అత్యావశ్యకము.

ప్రచారమున కవలంబించ వలసిన విధానములు:-

1. ముఖ్యముగ విద్యా ప్రచారము జరుగవలసి యున్నది. ఇది శ్రీ భాష్య- భగవ- ద్విషయ వేద స్మార్తములలో పండిత పరీక్షల నేర్పరచి అందుత్తీర్ణులైన యోగ్యులకు పండితు లందరకు జీవితాంత సన్మానము చేయుచుండుట.

2. ప్రచారకుల తయారు చేయు శిక్షణాలయములను నడుపుచుండుట,

3. వేదాన్త విద్య నభ్యసించు విద్యార్థులకున్ను అభ్యసింప జేయు పండితులకున్ను. తగు ఆర్థిక సహాయమును చేయుచుండుట.

4. పత్రికా ప్రచురణ, పుస్తక ప్రచురణ, విరివిగా జరుపుట మొదలగునవి ఇందులకై " శ్రీ విశిష్టాద్వైత ప్రచార శాశ్వత నిధి అనిపేర- ఒక శాశ్వత నిధిని ప్రారంభించ వలెననియు. వానికై ప్రతి శ్రీ విశిష్టాద్వైత సిద్ధాన్తాభిమానియు తన నికర ఆదాయములో సంవత్సరమునకు రూపాయకు ఒక్క దమ్మిడీచొప్పున ఈనిధికి శాశ్వతముగ విరాళమును సమర్పించు చుండ వలసినదిగ కోరుచు తీర్మానించడ మయినది.

## ప్రకటన

శ్రీ విశిష్టాద్వైత శ్రీవైష్ణవ సాంప్రదాయములకు సంబంధించిన అన్ని గ్రంథములు అందరికి అందుబాటులో యుండుటకై మదరాసులో 107 నరదా ముత్తయప్పన్ వీధిలో శ్రీ విశిష్టాద్వైత ప్రచారకసంఘ గ్రంథ విక్రయశాల" వకటి స్థాపించబడినది. ఇందు తెలుగు, అరవ సాంప్రదాయ గ్రంథములన్నియు క్రొత్తవి - పాతవి కూడ విక్రయించబడును.

గ్రంథకర్తలు - ప్రచురణ కర్తలు తమతమ గ్రంథములను విక్రయమునకై పంపినచో వాటిని విక్రయించి వాటి మూల్యమును వారి వారికి పంపుచుండుటకు ఏర్పాట్లు చేయబడినవి,

గ్రంథములు కావలసినవారు తమకు కావలసిన గ్రంథములు తెలిపినచో వారికి వి. పి. మూలముగగాని లేక మరొక విధముగగాని గ్రంథములు పంపబడగలవు.

మదరాసులో 107 వరదా ముత్తియప్పన్ వీధిలో "గీతామందిర" మను పేరుతో మదరాసు శ్రీ యతిరాజసేవా మహిళా సమితి కొన్న స్వంత భవనమున శ్రీ యతిరాజ సేవా మహిళాసమితి యొక్క కార్యాలయము ది 9-12-51వ తేదీని అతిథి భవముగ స్థాపింప బడెను.

ఇందు స్త్రీలకు మాత్రము ప్రత్యేకము రెండు పాఠశాలలు ప్రారంభించ బడుచున్నవి.

ఒకదాని యందు ప్రభుత్వపు మెట్రిక్యులేషను పరీక్షకు గూడ ప్రైవేటుగ వెళ్లుటకు శిక్షణ నిచ్చుచు ప్రధానముగా సంస్కృతము ఎంట్రెన్సువరకు తెలుగు విద్వాన్ వరకు హిందీ విశారద పరీక్షవరకు ద్రావిడ ప్రబంధము స్తోత్రపాఠములు నేర్పబడును.

రెండవ పాఠశాల యందు కేవలము, ఆధ్యాత్మిక వేదాంత విద్యమాత్రము, స్వానుభవమునకున్ను ప్రచారమునకున్ను గూడ ఉపయోగ పడుపటుల నేర్పబడును. మరియు స్వరూపానురూపమైన చిన్న చిన్న చేతిపనులు గూడ నేర్పబడును,

ఈరెండు పాఠశాలలోకూడ ఏవయస్సులో నున్న స్త్రీలైనను చేరవచ్చును.

గ్రామాంతరము నుండి వచ్చు యోగ్యులగు బీదస్త్రీలకు బసఉచితముగ నీయ ప్రయత్నించబడును. స్త్రీలే ఉపాధ్యాయులుగ నేర్పరచబడుటకు ప్రయత్నములు జరుగు చున్నవి తగిన విదుషీమణులు దొరకువరకు కొన్నివిషయముల నేర్పుటకు కొంతమంది ఉపాధ్యాయినులు దొరికిరి, ఇంకా మిగతవానికి ఈసంఘ కార్యదర్శిగారు ఉ. వే. శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులుగారు, పాఠ్యక్రమమును జరుపుచుందురు.

మరియు

స్వార్థత్యాగ బుద్ధితో ఆధ్యాత్మిక ప్రశాంతతో తమ జీవితమును ఆదర్శవంతముగ నడుప దలచిన యోగ్యులగు విరాగినులైన స్త్రీలకు ఇచ్చట ఆశ్రయ మివ్వబడును, వివరములు కోరువారు రిప్లైకార్డును వ్రాయవలసినది,

107 వరదా ముత్తియప్పన్‌వీధి.
మదరాసు 1

ఇట్లు.
శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘము
స్త్రీశాఖ, శ్రీయతిరాజసేవా మహిళా సమితి.

శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘము యొక్క కేంద్ర కార్యాలయము మదరాసులో 107 వరదా ముత్తియప్పన్ వీధిలో ఏర్పాటు చేయబడినది. గాన ఇకమీద నుండి ఈచిరునామాకే ఉత్తర ప్రత్యుత్తరములు జరుప గోరుచున్నాము.

గీతామందిరము
107 వరదాముత్తియప్పన్ వీధి
మదరాసు

కార్యదర్శి
శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘము

రిజిష్టరు నెం. 5049

# భక్తినివేదన

(వేదాంత మాసపత్రిక)

ఇందు వేదాంత విషయ వ్యాసములున్ను; భక్తిప్రచార విషయమైన వార్తలున్ను వేదాంత సాంప్రదాయ విషయకమైన ప్రశ్నోత్తరములున్ను ప్రచురించబడును.

చందాలు;

| | | |
|---|---|---|
| సాధారణ చందా సం. ఒం 1కి | | రు. 5–0–0 |
| సహా | ,, | రు. 10–0–0 |

**Book-Post**

To

శ్రీ శ్రీ శ్రీ ... [illegible]

B. 95 Sri Venkateswara Oriental Library.
TIRUPATHI. Chittur Dt.



[illegible]

1. శ్రీమన్నారాయణుడే సృష్టి–స్థితి–లయ కారకుడు.
2. ఆయనే మోక్షప్రదాత.
3. ఆయనే పరతత్త్వము–పరమాత్మ.
4. ఆయన అఖిలహేయ ప్రత్యనీక కల్యాణ గుణాకరుడు.
5. ఆయనకు [illegible] ; [illegible] తుడు, [illegible] ; అనుభావ్యుడు.
6. జీవులు జ్ఞానైకాకారులు.
7. జీవులు అనంతములు.
8. జీవులు పరమాత్మకంటె భిన్నులు; ఈ భేదము సత్యమైనది; నిత్యమైనది.
9. జీవ–పరమాత్మలకు ప్రకృతి శరీరభూతమైనది; శేషభూతమైనది; పరతంత్రమైనది; నియామ్యమైనది; అనుభావ్యమైనది.
10. ప్రకృతి వికారాస్పదమైనది. జీవపరమాత్మలకంటె భిన్నమైనది. ఈ భేదము సత్యమైనది; నిత్యమైనది.
11. జీవుడు ప్రకృతి వియుక్తుడై పునరావృత్తిరహితమైన పరమాత్మ సాన్నిధ్యమగు పరమపదమును పొందుటయే మోక్షము.
12. భక్తి ఒక్కటియే మోక్షసాధనము.
13. భక్తి యనగా తైలధారవలె అవిచ్ఛిన్నమైన స్మృతి పరంపర.
14. వివేక–విమోక–అభ్యాస–క్రియా–కల్యాణ అనవసాద–అనుద్ధర్షలు భక్తికంగములు.
15. ఇవి సదాచార్య–సమాశ్రయణ–లభ్యములు
16. జగద్గురువగు శ్రీరామానుజాచార్యులు వారును; వారి యనుయాయులున్ను సదాచార్యులు.

"వసుధైవ వైష్ణవాత్ పరః" బ్రా. నం.

Edited printed & published by A. Ch. srimannarayanacharya at Sriman press, Kakinada, E.G.Dt.

    

శ్రీమతే రామానుజాయ నమః


భక్తి

# నివేదన

వేదాంత మాసపత్రిక

| సంపుటి 3 | ఖర మార్గశిరమాసము | సంచిక ౯ |
|---|---|---|


## తిరుమంత్రార్థ విశేషములు


శ్రీమాన్ శ్రీమత్తిరుమలై నల్లాన్ చక్రవర్తి సంపత్కుమార
జగన్నాథ తిరువేంకటాచార్యులవారు
గోవిందరాజులపేట, విజయవాడ.


శ్రియఃపతి లోకానుగ్రహకాంక్షచే బదరికాశ్రమమున 'తానే శిష్యనుమాన్' ఇత్యాద్యుక్తప్రకారముగా శిష్యాచార్యరూపములతో నరనారాయణులై యవతరించి 'నరనారణనాయులగత్తైరి శొల్ శింగాన్మై విరిత్తవన్' అను నట్లు వేదశాస్త్రముల చిక్కులు విడదీసెను అనగా నేమనిన సకలవేద శాస్త్రార్థ సారాంశమగు 'ధ్యేయో నారాయణస్సదా' ఇత్యాది రీతుల బ్రతిపాదితమగు నర్థమును ప్రకాశింప జేయుట యనియర్థము. అదియెట్లు జేసెననిన: తిరుమంత్రత్తైన్ని ఉట్టరుళినాన్ అని సాదించి నారు అనగా తిరు మంత్రమును వెల్లడించెననిభావము దానియందలి మూడు పదములును శేషత్వము పారతంత్ర్యము కైంకర్యమునను మూడుకారణములను ప్రతిపాదించు చున్నవి. ఈమూడర్థములకును అనుష్ఠాతలను వరుసగా ముగ్గురిని పరమ పద మందేర్పరచెను. వారే అనంతగరుడ విష్వక్సేనులు తాను ప్రాప్య స్వరూపుడు శ్రీదేవిపురుష కార స్వరూపురాలు శేషుడనగా ననంతుడు శేషత్వరూపుడు ఇందులకు "నివాసశయ్యాసనే" త్యాది శ్లోకము ప్రమాణము గరుడుడు పారతంత్ర్యస్వరూపుడు. కనుకనే 'త్వదంఘ్రి సంమర్ద కిరణాంకశోభినా' యని చెప్పబడెనది. ఇక విష్వక్సేనుడు కైంకర్య స్వరూపుడు శ్రీరంగ చంద్రమ స మిత్యాది శ్లోకము దీని వివరించు చున్నది విశ్వాచిదచిన్నయనాధికారము నితడు తనయంగుళి ముద్రచే నిర్వహించుచున్నాడు కనుక శ్రియఃపతి శ్రీదేవితో విహరించుటకవకాశము కలిగినది ఇదియే కైంకర్యమని భావము.

# వైకుంఠేతు అనే శ్లోక వ్యాఖ్యానము

శ్రీమాన్ శ్రీపెరుమాళ్ నల్లాన్ చక్రవర్తి సంపత్కుమార జగన్నాథ తిరువేంకటాచార్యులవారు
గోవిందరాజుపేట, విజయవాడ.

శ్లో॥ వైకుంఠే తు పరే లోకే శ్రియాసార్థం జగత్పతిః
ఆస్తే విష్ణురచింత్యాత్మా భక్తైర్భాగవతైస్సహ

అనేక గ్రామములకు ప్రభువగువాడు తన గ్రామములలో నొక గ్రామమున వసించు లాగున నేక లోకములకు ప్రభువగు శ్రీమన్నారాయణుడును అన్ని లోకములలో నొకటగు వైకుంఠమున వసించుచున్నాడు "పరేలోకే" అన్ని గ్రామములలోను గొప్పదగు గ్రామమున ప్రభువగువాడు వసించునట్లీతడును అన్ని లోకములలోను గొప్పదగు వైకుంఠలోకమునను న్నాడని భావము ప్రధాననగరియందు నివసించు ప్రభువున కన్యత్ర వ్యాప్తి లేదు గాని యితడట్లు గాదు 'విష్ణుః' అంతటను వ్యాపించి యుండువాడని భావము. అంతటను వ్యాపించి యుండువాడనిన నిర్లక్ష్యము జేయుదురేమోయని 'అచింత్యాత్మా' యన్నారు అనగా అంతను వ్యాపించి యున్నను ఇతని స్వరూపము చింతించుటకు గూడ శక్యమయినది గాదని భావము ।'సర్వత్రాసౌ' 'తత్రతిష్ఠామి' ఇత్యాది వచనముల చే నితనికి నివాస స్థానము లెన్నియో గలవు దీనిపై లక్ష్మ్యా! మేమనిన 'శ్రియాసార్థం' ఇక్కడ సకుటుంబముగ నున్నాడని భావము యద్వా శ్రీమంతుడై యున్నాడని భావము 'సవకాకి నరమేత' గనుక శ్రీదేవిని గూడియున్నాడని భావము. 'శ్రియా' అనునది దేవ్యంతరములకును ఉపలక్షణము. ఇందుపై శ్రీశ్రియః పతులిట్లు వేంచేసియుండగా నాగోష్ఠిని సేవించి యానందించు వారెవరైనగలరా? యని శంకగలిగెను. అందుపై 'భక్తైర్భాగవతైస్సహ' యన్నారు. సేవించువారు గూడ నొక రిద్దరుగారు ఒకరకము వారుగారనియు పలువురు పలురకముల వారనియు భావము ఇందు భక్తులెవరు? భక్తులనగా 'భజసేవాయాం' అనుటచే సేవార్థకమైన భజధాతువు నుండి యీశబ్దము నిష్పన్నమగుటచే 'భజంతీతిభక్తాః' అనగా సేవించువారనియర్థము. సేవింపబడు వస్తువు నిందు చెప్పలేదు గావున నది యొకటే యనియు నదిభగవద్వస్తువే యనియు భావము. దీనివలన వస్త్వంతరమిక్కడ లేదని భావము. దీనివలన నస్పృష్ట సంసార గంధులగు నిత్యసూరులు గ్రహింపబడుచున్నారు. ఇకభాగవతులనగా 'భగవతిభక్తః భాగవతః' అనువ్యుత్పత్తిని బట్టి యనేక విషయములు గలిగి యున్నను వానిని సేవింపక భగవద్విషయమును మాత్రమే సేవించు వారనుటచే ముక్తపురుషులు గ్రహింపబడుచున్నారు. 'భగతిభక్తాః' భక్తియనగా పూజ్యేష్వనురాగో భక్తిరిత్యుచ్యతే యనుటచే పూజ్యుల యందలి యనురాగము. అదివీరికి భగవంతుని యందే గలదనుటచే విషయాంతర వైరాగ్యము సూచితము కనుక భాగవతులనగా ముక్తపురుషులేయని భావము. ఇట్లువిషయ విభాగము జేయకున్నచో పునరుక్తి దోషమనివార్యము ఏవంచ సకల జగత్పతియు సర్వవ్యాపకుడును అవాఙ్మనసగోచరుడును అగు శ్రీమన్నారాయణుడు సర్వోత్కృష్టమగు శ్రీవైకుంఠ లోకమున శ్రీదేవీసహితుడై నిత్యముక్త సమన్వితుడై వేంచేసి యున్నాడని భావము.

# శ్రీ భాష్యమునందు ప్రపత్తి ప్రసంగము

శ్రీ ఉ. వే. శ్రీ మాన్ చిలుకూరు మా. వెంకటరాఘవాచార్య శిరోమణి
విద్వాంస సంస్థానధర్మాధికారి, కార్యకర్త మరియు ఏజంటు:- హైదరాబాదు శ్రీ అహోబిలమఠం.

శ్రీ భాష్యములో ప్రపత్తి ప్రసంగము నానాశబ్దాది భేదాత్ (3-3-51) వికల్పోవి శిష్ట ఫలత్వాత్ (3-3-57) యీ అధికరణములలో శ్రీ భాష్యకారులచేత శ్రీ సూత్రకారులచేత నున్ను సూచింపబడినది తథాహి పూర్వాధికరణమైన భూమజ్యాయస్త్వాధికరణములో వైశ్వానరవిద్యలో స్వర్లోకము వాయువు ఆదిత్యుడు మొదలైన వాట్లను అవయవముగా గలిగినటువంటి వైశ్వానరాత్మ ఉపాస్యమని చెప్పబడియున్నది ఇచ్చట ఆదిత్యాదిత్వేన రూపణము చేయబడిన చక్షురాది వ్యస్తావయవము ఉపాస్యమా లేక వ్యస్తము సమస్తము రెండున్ను ఉపాస్యమా అని శంకించి రెండుటికిని ఉపాస్యత్వం కలదని పూర్వపక్షము చేసి సమస్తమునకే ఉపాస్యత్వ మని సిద్ధాన్తము చేయబడినది యీ అధికరణములో విద్యావిశేష చిన్త చేయబడినది ప్రకృతమైన నానాశబ్దాదిభేదాత్ అను శబ్దాది భేదాధికరణములో సర్వ విద్యావిషయమైన విచారము చేయబడినది అని ఉభయాధికరణసంగతి నానాశబ్దాదిభేదాత్ యీసూత్రము రెండు పదములు గలది సద్విద్యా భూమవిద్య మొదలైన విద్యలు పరస్పరము భిన్నములైనవి శబ్దాదిభేదాత్-ఉపాసీత-విద్యాత్, ఇతురీతిగా విధివాక్య భేదముచేతను రూపభేదముల చేతనున్ను అని సూత్రార్థము బ్రహ్మప్రాప్తిని ఫలముగా గలిగినటువంటి బ్రహ్మోపాసన రూపములైన సద్విద్య దహరవిద్య ఇత్యాదివిద్యలు ఒకేవిద్యయా లేక నానాభూతములా అని సంశయము ఫలము ఒక్కటే గనుక సామాన్య విశేష రూపములైన వేద, ఉపాసీత, ఇత్యాదులు అనర్థాన్తరములగుటచేత ఇవి ఒక విద్య యని పూర్వపక్షము.

బ్రహ్మము ఒక్కటైనను ఆయా విద్యాప్రకరణములో ఉపాస్యముగా ఘటించ బడినటువంటి ఆనందమయత్వాది గుణములయొక్క భేదముచేత ధాత్వర్థభేదము అవశ్యాపేక్షితము గనుక యజతి,దదాతి,జుహోతి, ఇత్యాది విధి వాక్యములచేత విధింపబడిన యాగ దాన హోమ రూప కర్మలకు భేదమున్నట్లు బ్రహ్మ విద్యల కున్ను విధివాక్య భేదముచేత అపహతపాప్మత్వాది గుణభేదముచేతనున్ను విద్యలకు భేదము కలదని రాద్ధాన్తము ॥నానాశబ్దాదిభేదాత్॥అను సూత్రములో చెప్పబడిన శబ్దాదిభేదాత్ అను పదము ప్రపత్తి యనే న్యాసవిద్యను ప్రసంగించుచున్నది తదాహ ఇచ్చట చెప్పబడిన ధ్యాయీత, ఉపాసీత, మొదలైన విధివాక్యభేదము రూపభేద ప్రయుక్తము గనుక రూపభేదములోనే ఇందుకు పర్యవసానం సిద్ధించగా సూత్రములో శబ్దభేద గ్రహణము వ్యర్థమై బ్రహ్మ విద్యాన్తర్గతమైన న్యాసవిద్యకున్ను వేరైన బ్రహ్మవిద్యలకంటె భేదము అవశ్యము చెప్పవలయును గనుక దీనిని విధించే టటువంటి శబ్దము న్యాసరూపమైన అర్థ విశేషవాచి యగుటవల్ల ధ్యాయీత మొదలైన శబ్దములకంటె దీనికి శబ్దాన్తరత్వము ముఖ్యమనే యభిప్రాయముతో యీపదము న్యాసవిద్యను బోధించుచున్నది బ్రహ్మవిద్యా

స్వర్గతమైన న్యాసవిద్య అన్ని తపస్సుల కంటే, అతిరిక్తమైన దనే విషయము తైత్తరీయోపని షత్తులో "తస్మాత్ న్యాస మేషాం తపసా మతి రిక్త మాహుః" అని చెప్పబడి యున్నది యీ సూత్రములో శబ్దభేదోక్తికి న్యాసాది శబ్దమున్ను ఉపాసనాది శబ్దమున్ను తప్ప వేరు విషయము స్వరసముగా లభించదు గనుక యీ అధికర ణములో శబ్దభేదముచేత చెప్పబడు విద్యాభే దము దీనికి సంబంధించినదే యని పూర్వాచా ర్యులున్ను అభిప్రాయ పడుచున్నారు యీ సూత్రములో ప్రపత్తి ప్రసంగించ పడినదనే విషయమును శ్రీ శ్రుత ప్రకాశికాచార్యులు ఆదిశబ్దేన న్యాసో వివక్షితా అని స్పష్టముగా వక్కాణించి యున్నారు. ఏత దన్తరా ధిక రణమై వికల్పో విశిష్ట ఫలత్వాత్। అను వికల్పాధికరణములో శ్రీ శ్రుత ప్రకాశికాచా ర్యులు అస్మి న్నధికరణే న్యాసవిద్యా అభిప్రేతా యీ అధికరణలో న్యాసవిద్య అభిప్రేతము, అని స్పష్టముగా సాయించి యున్నారు ఫలము ఏక రూపముగా నుండినచో విద్యలకు సముచ్చయ మని భావము యాగ దాన హోమము ముల యందు ద్రవ్యప్రక్షేపము సమానమైనను దేవ తోద్దేశము దేశవిశేషప్రాప్తి పరస్యత్యాపాదనం మొదలైన వాట్లచేత కర్మలు పరస్పరము భిన్న ములగునట్లు గుణభేదము చేతనే విద్యలు పర స్పరం భిన్నము లని ఏర్పడుట చేత న్యాసమని ప్రసంగింప బడిన సూత్రోపాత్త శబ్దము న్యాస విద్యనే ప్రసంగించున్నదని భావము.

విశిష్టఫలత్వాత్ విశేషాభావవత్ ఫలం యేషాం తేషాం భావః తత్త్వాత్ ఫలములో విశేషము లేదని తాత్పర్యము ఇచ్చట న్యాస విద్య అంగాంగి భావముతో స్పష్టముగా చెప్ప బడక (యుంజీత) అని కేవలం యోగ రూప ముగా చెప్పియుండుట మాత్రము చేత దీని ప్రాముఖ్యము ఇచ్చట చెప్పబడ లేదు.

శాఖాన్తరములలో చెప్పబడిన ప్రాముఖ్య మును ఇచ్చట అతిదేశము, చేసినచో శాఖా భేదమువల్ల కర్మ భేదము ప్రసంగించదా అని ఆక్షేపము చేయుట యుక్తముకాదు ప్రకర ణాన్తర ముండినను శాఖాభేదాదులలో చెప్ప బడిన న్యాసములన్నియు సర్వవేదాన్త ప్రత్యయ న్యాయము చేత ఒకటే కర్మకాని భిన్న కర్మలు కావు గుణోపసంహార న్యాయముచేత న్యాస విద్య పుష్కలముగా విధించ బడినదని భావము ఉపాసనమునకున్ను ఒకటే శాఖలో ప్రాముఖ్యం లభించదని కూడా భావము యీ న్యాసవి ద్యయే "న్యాసః పంచాంగ ఈరితః అని ప్రాప్యస్య బ్రహ్మణో రూపం ప్రాప్తుశ్చ ప్రత్యగాత్మనః ప్రాప్త్యుపాయం ఫలంచైవ తథా ప్రాప్తి విరోధి చ అని పంచాంగ విశిష్టముగా సూత్రములలో చెప్పబడి యున్నది.

యీ న్యాసవిద్యయే ప్రపత్తి శరణాగతి ఉపా యం సాధ్యోపాయం మొదలైన శబ్దములచేత వ్యవహరింప బడుచున్నది.

ఇట్టి ప్రపత్తియొక్క అనుష్ఠానము ద్వయా ఖ్యమన్త్రముచేతనే ఆచార్యులచే చేయబడును.

యీ మన్త్రముయొక్క నిష్కృష్టార్థము

• సర్వస్వామియై సర్వప్రకార నిరతిశయభో గ్యుడై శ్రీ పెరియపిరాట్టిగారితో కూడుకున్న శ్రీ మన్నారాయణునియొక్క తిరువడికళిలో

స్వరూపప్రాప్తమైన సర్వదేశ సర్వకాల సర్వా వస్థోచిత సర్వవిధ కైంకర్యములకున్న విరోధిత్వం [illegible] ములన్ని నశించి పరిపూర్ణ కైం కర్యము [illegible] నటకు అర్హుడైన దాసుడు స్వరక్షణ భారములు యందు దాసున కన్యాయం తెలిసినట్లు శ్రీ విశిష్టుడైన నారాయణునియొక్క [illegible] అంగపంచక సంపన్నమైన ఆత్మ [illegible] భరసమర్పణం చేయుచున్నాను అని ద్వయముయొక్క విస్పష్టార్థము.

# రామానుజ అవతార రహస్యములు

శ్రీమాన్ శ్రీమత్తిరుమలై నల్లాన్ చక్రవర్తి స. పద్మనాభ
జగన్నాథ తిరువేంకటాచార్యులవారు
గోవిందరాజులపేట, విజయవాడ.

పెరుమాళ్లు తాను పురుషస్వరూపుడు ఇందులకు 'న తేరూపం నచాకారః' ఇత్యాది వచనము ప్రమాణము శ్రీదేవి స్త్రీ స్వరూపురాలు భూనీళాది దేవీవర్గమంతయు శ్రీదేవీ సారూప్యముగలవారై యుండవచ్చును శేషుడు సర్ప స్వరూపుడు గరుడుడు పక్షిస్వరూపుడు విష్వక్సేనుడు మొదలుకొని తక్కిన వారి కందరికిని భగవత్సారూప్యముగలదు ఇందు శేషుడు భగవంతునితో ననన్యుడే. 'సహస్ర శిరసంసాక్షా ద్య మనంతంప్రచక్షతే' 'విష్ణోర్యా తామసీతనుః' ఇత్యాదివచనము లిందుకు ప్రమాణములు. శ్రీభాగవతమున సప్తమో వైష్ణవంధామయమనంతం ప్రచక్షతే గర్భోబభూవ దేవక్యా హర్ష శోకవివర్ధనః॥'దేవక్యా జఠరే గర్భం శేషాఖ్యం ధామమామకం' అని యున్నందున నిది నిర్వివాదాంశము.

శేషుడు భగవదవతారమను విషయమున శేషాంశావ [illegible] లక్ష్మణుడు రావణుని శక్తిచే మూర్ఛిల్లినపుడు వాడతని గొంపోవయత్నింపగా సాధ్యము గాకుండునట్లు తనవైష్ణ తేజమును తనయందు నిలుపుకొని లక్ష్మణుడున్నాడను గాథ సహాయమగును. ఇకబలరామావతారమును గురించిన పైశ్లోకములును ఇతనిని దశావతారములలో జేర్చిన 'రామో రామశ్చ రామశ్చ' యనునదియును ఇంకను నిట్టివన్నియును సహాయములే. 'సహస్రశిరసం' విష్ణోర్యా, అనునవి శేషుని పాతాళలోక వాసునిగ జెప్పచున్నవిగదా యనిన నతనికి పరమపద వాసియగు శేషునితో భేదములేనట్లు నిశ్చితమైయున్నది. గాని వీరిద్దరును భిన్నులని యెందును లేదు ఋషిమాత్రులగు సౌభర్యాదులకే యేక కాలమునందనేక శరీర పరిగ్రహమునకు యోగ్యత యుండగా నిట్టివారి కుండదన జెల్లదుగదా? కనుక నిది నిర్వివాదాంశము ఇట్టి శేషుడు ప్రథమమందు 'అనంతః ప్రథమం రూపం' అనట్లు పరమపదము నందేర్పడి యెను తరువాత నవసరముబట్టి పాతాళమందు గూడనుండెను ఇట్లు శేషుడు భగవ దవతారమే. గాని వేరుగాదని స్పష్టమయినది గదా. అతడు దన యవతార ప్రయోజనమును నిర్వహింప భగవత్సన్నిధిని సకలవిధములను 'యథోచితం శేషఇతీర్యతే జనైః' అనునట్లు తనకుగల శేషుడను తిరునామము సార్థక మగునట్లు ప్రవర్తించెను అంతట భగవంతుడు పరమ పదవాసుల కనుభవింప జేసిన తన శేష శేషి భావసంబంధమును తన

శేషస్వరూపమున వారి కలవరించిన శేషత్వమును భూలోక వాసులకు గూడ నంద జేయనిచ్చోత్ర ప్తిలేదుగనుక నాకొరంతను దీర్ప శ్రీ రామావ తారముగా భూలోకమునకు వేంచేసెను. శేషి శ్రీరాముడై యవతరింపగానే శేషుడు లక్ష్మ ణుడై యంతరించెను. వారిరువురి వలన భూలో కవాసులు శేష శేషి భావమును గుర్తెరింగిరి. కానియిందొక సందేహ ముదయించెను. శ్రీరా మలక్ష్మణు లన్నదమ్ము లగుటచే వీరికిట్లు శేష శేషి భావమేర్పడిన దని జనులు గ్రహించిరే మోనని ఈసందేహ నివృత్త్యర్థమై శేషి తమ్ముడు గను శేషభూతు డన్నగను మారి శ్రీకృష్ణ బల రాములుగా నవతరించిరి. ఈఘట్టమున శ్రీకృ ష్ణుడు చిన్నవాడైనను అన్నగారిచేతనే యను సరింప బడియెను. కొన్నిచోటుల బలరాముని గృష్ణు డనుసరించి నట్లు కనుపడినను అదియ తని విలాసముగ నెంచదగును.

విశేషముగ బరికించి చూచిన బలరాముని యందు కృష్ణానువర్తనమే కనపడును. దీనివలన శేష శేషి భావము వయః ప్రయుక్తముగాదని స్పష్ట మయినది. ఈ యవతారమున గీతోపదేశా దులచే తాత్కాలిక చేతన సంరక్షణము కొంత వరకు జరిగినది. ఆ యవతారము నిర్యాణమై నది. కలియుగ మారంభ మయినది. దుర్మత ములు ప్రబలినవి, జనుల కజ్ఞాన మావరించినది. 'యదాయదాహి' యన్నట్లు భగవదవతార కారణ మేర్పడినది. అప్పటికే భగవంతున కనే కావతారములు జరిగినవి. అందువలన నతనికి విసుగెత్తినదో లేక తన యవతారముల వలన సంపూర్ణ ప్రయోజనము లభించలేదని తల చెనో లేక తానర్చావతారమును ధరించియుం టినను కొనియెనో గాని దుర్మత నిర్మూలన పూర్వకముగా స్వమతమును స్థాపించుటకు శేషుని నియమించెను. లోకమున గూడ యజ మాను లొకప్పుడు తాము జేయదగిన కృత్య ముల యందు తాము విసుగొంది నప్పుడు తమ పుత్రాదులనో భృత్యులనో నియమించుట గలదు గదా, అట్లే నియమింప శేషు డుత్సా హముతో బయలుదేరి ప్రభుకార్యమును నిర్వ హింప వచ్చి భగవద్రామానుజ రూపేణ యవ తరించెను. ఈ యర్థమునే "అనంతః ప్రథమం రూపం" అనియు "ఆదౌ జగదాధార శ్శేషః" అనియు పెద్దలుప్రసాదించిరి. నీతడుసకలకైంకర్య ములకు మాత్రము వెనుకదీయునా? అతనికి సాధ్యము గాని కైంకర్యమున్నదా? భగవంతు నిపై భారమును వేసి తదాజ్ఞను సారముగా దుర్మతముల నిర్మూలించి విష్ణుమతమును స్థా పించి పరిపంథుల నోడించి దివ్యదేశముల నుద్ధ రించి స్వశిష్యులకు శేష శేషి భావమును వెల్ల డించి పరమపదమును గరతలామలకముగ జేసి దిగ్విజయము బొంది భగవదాజ్ఞను నిరవ శేషముగ నిర్వర్తించెను. అమ్మహాత్ముని ప్రభా వమున కీడుపడి యర్చావతార సమాధి నున్న పెరుమాళ్ళతనికి శిష్యుడై కొమరుడై యల్లుడై యనేక విధముల గౌరవించియు నుభయ విభూతి నాయకత్వాద్యతిశయముల గల్గించియు నతని యెడ ఋణవిముక్తుడయ్యెను. అంతట రామా నుజావతారము సమాప్తి నందెను.

# మణవాళమహామునుల ప్రభావము

శ్రీమాన్ శ్రీమత్తిరుమల నల్లాన్ చక్రవర్తి సంపత్కుమార
జగన్నాథ తిరువేంకటాచార్యులవారు,
గోవిందరాజులపేట :: విజయవాడ.

ఆ. వె. సద్గురుండు శాస్త్ర సంపన్నుడు నిగమ । మార్గమార్గవేది మైనవాని ।
జ్ఞాననిష్ఠరమ్య జామాతృమునిగూర్చి । ప్రణతులాచరింతు భక్తియుక్తి ॥

ఒకానొకప్పుడు భగవంతున కిట్లు విచారము గల్గెను, అవతారముల యందు నాకు గూడ సాధ్యము గాని యద్భుతకృత్యము లెన్నింటినో యీ మహాత్ముడు నిర్వహించెను. ఇతని ప్రభావము నాప్రభావమును గూడ మించినది. నా యవతారమున లంకాపురిని ముట్టడించితిని గాని రావణాదులను సంహరింపక కార్యసిద్ధి నందలేదు, ఇతడు ఢిల్లీ పట్టణమును ముట్టడించి రావణ ప్రతిమానుడగు పాదుషాను వాఙ్మాత్రమున వశపరచుకొనియెను. నేనింద్రజిత్తు నాగపాశములకుజిక్కి గరుడునిసాయంబున వదలించుకొంటి గాని యితడు రాజభటులు దన్నాక్రమింప వచ్చుచుండ మంత్రబలమున నిసుకను గొంకలుగ జేసి తప్పించుకొనియెను. నేను ఖరదూషణాదుల బాణ ప్రయోగమున గాని జయింపలేనైతిని. ఇతడు దశసహస్ర బౌద్ధులను వాఙ్మాత్రమున నోడించి పలాయితుల జేసెను. ఇంక నిట్టి వెన్నియో గలవు. ఇట్టి మహనీయుని ప్రభావమున కీడుపడి నేనితనికి శిష్యుడనై కొడుకనై యల్లుడనై సేవించితిని. కాని కేవలము శిష్యుడనై సేవింపనైతిని. ఇతని వలన మంత్రరత్నమును గ్రహించితిని గాని దాని యర్థమును విని తరింపనైతిని, మదంశ సంభూతులగు కూరత్తాళ్వారులీతని విషయమునందు తనియను విన్నపించె గాని యట్టి మహాభాగ్యము నాకు లభింపలేదేయని యత్యంత వ్యాకుల చిత్తుడై యతనికి పునరవతారమును సంకల్పించెను. అతని సంకల్పానుసారముగా శేషుడు "భూత్వాభూయో వర వర ముని ర్భోగినాం సార్వభౌమ" అన్నట్లవతరింపవలసివచ్చెను. అట్లవతరించిన వారే శ్రీ మణవాళ మహామునులు. వీరిని ప్రత్యక్ష పరమపదమగు శ్రీరంగధామమున జేర్చుకొని శ్రీరంగరాజస్వామి మంత్ర రత్నార్థ వ్యాఖ్యానమగు నాలాయిర భగవద్విషయమును వీరి వలన సేవించి దాని శాత్తుముఱై కాలమున "శ్రీశైలేశ దయాపాత్రం" అను తనియను సభా మధ్యమున విన్నవించెను. ఈ యవతారమున దాను కేవలము శిష్యత్వమునే ప్రకటించెను. ఇంకే వావియు గ్రహింపలేదు. ఈ యవతారమున శేష శేషిభావము పరిపూర్ణముగ ప్రకాశింప జేయబడినది. ఇందును గురించియే వీరు ద్రావిడామ్నాయోద్ధరణ దీక్షను వహించిరి. సంస్కృతామ్నాయమును రామానుజావతారమున నుద్ధరించిరి. మరల దానియందే ప్రవేశించి వీరు చర్విత చర్వణమును జేయరైరి. శేష శేషిభావము సంస్కృతామ్నాయమున వలె గాక ద్రావిడామ్నాయమున పరిపూర్తిగ జెప్పబడినది. కనుకనే దానిని వీరు వెల్లడించిరి, మరియు రామానుజావతారమున "శేషో వా సైన్య నాథో వా శ్రీపతిర్వా" అని సంశయించి యనేకులు నిర్ణయింపలేరైరి.

గాని యీయవతారమం దెవరికిని అట్టిసంశ

యము గలుగనే లేదు. అందరికిని శేషాంశసంభూతులని నమ్మికకలిగినది కనుకనే 'శేషాంశాయాస్తుమంగళం' అనిపాడియుంచినారు. లక్ష్మణ స్వామియందైనను ఒకటి రెండుఘట్టముల యందువిష్వ్వంశము ప్రతిపాదింప బడినదిగాని వీరి యవతారమునందెన్నడును అట్టిప్రమాదము లేదు. కనుక శేషస్వామి యవతారమందు పరిపూర్ణ మని భావము. రామానుజుల వారి విషయమున శేషుడాయను వితర్కము గల్గుటకు దశ సహస్ర బౌద్ధవిజయమునందు ధరించిన సర్పరాజ రూపము కారణమై యున్నది. వేత్రసార సమానమగు త్రిదండమును జూచిన విష్వక్సేనులాయని వితర్కగల్గుచున్నది. ఉభయ విభూతి నాయకత్వమును జూచిన శ్రియః పతియా యని శంకింపవీలగుచున్నది. అట్టిసంశయకారణము లేవియు వీరియందు లేవని భావము. మరియు హైరీతిగా తర్కించినవారు మహా ప్రాజ్ఞులగు సాత్వికులేయనుటచే కొందరేయని తేలుచున్నది. అంతేగాక 'వితర్క్యాయ' అనుటచే తర్కింప దగియున్నారని యున్నది గాని తర్కించి నట్లులేదు. వీరివిషయ మందు 'తోషితాఖిలసూరయే' అనుటచే సూరిజనులందరును సంతోషించిరని చెప్పనవుగా నున్నది వారట్లు సంతోషించుట కు కారణము 'తులామూలావతీర్ణాయ' యనుటచే అవతారమే కారణమని తోచుచున్నది. అయితే శేషుడా విష్వక్సేనుడా శ్రియఃపతియా యితడని తర్కింపదగిన లక్షణములు రామానుజుల కుండెను. వీరికొక శేషలక్షణములు మాత్రమే యుండెను. కనుక వీరికన్న వారధికులు గారా యని సంశయింప వచ్చును. కాని ముఖ్యముగా ప్రతిపాద్యమైన లక్షణము శేషత్వమే యగుటచే నదిలుప్తము గాకుండవీరియందు పూర్ణముగ నుండుటయను నతిశయము వీరికేగలదని భావము మరియు 'భాష్యకారాయ' యనుటచే రామానుజులవారు పరమత ఖండన తత్పరు లగుటచేసత్వగుణ ప్రధానులును మహాప్రాజ్ఞులును అగు కొందరు పండితులే వారియందు దీపడి శేషుడా సైన్యనాథుడా శ్రియఃపతియా యని తర్కించిరి మణవాళ మహామునులట్టివారు గాక స్వసాంప్రదాయ విశేషములను మాత్రమే ప్రధానముగ సరస వచన రచనలచే నుపన్యసించు వారలగుటచే సమస్త సూరిజనులును సంతోషించిరని తెలియ వచ్చుచున్నది. మరియు పరమత పండితులగు యాదవుగు యజ్ఞమూర్తి మున్నగువారు తేవప్పెరుమాళ్ల శాసనమున గాని రామానుజ సిద్ధాంతమునకు నశపడలేదు. తిరువేంగడముడయానను పండితుడు మణవాళ మహామునుల సన్నిధి యందనేక ప్రశ్నముల వేసి వారిచ్చిన సమాధానముల వలన తనంతట దానే తృప్తిపడి యంగీకరించెను. కించ రామానుజుల వారు శ్రియఃపతికి మంత్రరత్నము నుపదేశించిరి వీరు తదర్థ వ్యాఖ్యానమును ప్రసాదించిరి. దీని వలన 'గరీయాన్ధ్వో గురుః' అను వచనమును బట్టి వీరి యతిశయము వెల్లడి యగుచున్నది. మరియు 'శఠగోపమునిం వందే' 'నాథాయమునయే' 'సహివిజయతేయాముననుని:' రామానుజమునిర్జియాత్' 'పరకాలమునిః ప్రణామేము హితః' ఇత్యాది వచనములచే మనసాంప్రదాయమున వీరందరును మునులని చెప్పబడిరి. వీరు మునులు మాత్రమే, మణవాళమహామునులనుటచే వీరియతిశయ మింకొకరికి లేదని స్పష్టమైనది ఈమణ వాళ మహామునులను పదమునకు

దుఃఖించుచుండ, ఒకానొక సమయమున నారదుడు త్రిదేవుల వద్దకు వెళ్ళి ఇనుప గుగ్గిళ్ళని చ్చివేచి ఇయ్యుమనగా వారలు ప్రయత్నించి సాధ్యము కాదని నిశ్చయించిరి అంతే నారదుడు అనసూయ వద్దకు వెళ్ళి వేచి ఇయ్యుమనగా పతివ్రతా ధర్మము స్మరించుచు వేచి ఇచ్చెనట ఆ వేచిన సెనగలను తినుచూ నారదుడు త్రిదేవులారా పతివ్రతయన ఒక్క అనసూయకే తగునని ఆమెను మెచ్చుకొనగా వీరలకు ఈర్ష్య జనించి విధిలేక తమ భర్తలతో ఆమె నవమానించి రమ్మని నిర్బంధించిరి త్రిమూర్తులు ముని వేషములతో అత్రిలేని కాలమున నారి ఇంటికతిథులై వచ్చిరి ఆమునులు నగ్నగా మాకు అన్నము వడ్డింపవలెనని కోరిరి, అనసూయ ఇదే మోహభగవంతుని మాయ యనుచు,

గీ॥ ఈశ్వరా ధర్మపాలకా విశ్వనాథ!
పరమ పావనులగు వీరిబాలకులుగ
సలిపి మచ్చిల్ల మానాడు నిలుపుమయ్య!
నీవుగా కన్యగతులింక లేవునాకు।

అనగానే త్రిమూర్తులు బాలురైరి మూడు ఉయ్యేలలో నుంచి అనసూయ ఊపు తుండుటను జూచి త్రిదేవులతో నారదుడు.

సీ॥ నిర్నిద్ర మహిమా పునీతు లామూర్తులు।
నిదురించు చుండి రేకొమవలేక।
గర్భాంతరముల జగంబుల గల్గ వా!
కొక సాక్షియొడిలోన నున్నవారు।
యోనిసంభవము లేకున్నవారే నేడు।
అనసూయ కొకట గుమారులైరి।
భువనంబులకు నాదిపూరుషులగ వారు।
ప్రకృతి కంతకు చిన్నవారలైరి॥

గీ॥ అహహా! నేడు త్రిమూర్తుల యంతవార।
నీసతీబలమున బలహీనులైరి।
వసుధ పతిపూజనముకన్న వ్రతముగలదె।
సాధ్వులను మీరుఘనులు విశ్వమునగలరె।

యనగా త్రిదేవులు తోడనే అనసూయ కడకు పారివచ్చి,

గీ॥ మాపతులు భవత్కుమారులైరి।
మా కనయ మీవు పూజ్యవైతివమ్మ।
పరమ కృపను మాకుపతి భిక్ష మొసగి।
మాంగల్య రక్షణా బావర్పుమమ్మ।

యనుచు వేడగా అనసూయ పతియాజ్ఞపై వారలను త్రిమూర్తులను జేయువార సంతోషించి ముమూర్తి రూపమున దత్తాత్రేయుడై పుట్టిరే ఇటుల నేను జేసినానా?



అఖిల భారత శ్రీ విశిష్టాద్వైత వి...ట్ స... ...కమును ...నుకూలముగు కాలమున అనుకూల మగు ప్రదేశములలో జరుపుటకు తీర్మానించడ మైనది ...కి వలయు ఏర్పాటు లన్నియు చేయుటకు అధ్యక్ష- కార్యదర్శులకు అధికార మివ్వడ మైనది.

4. నాల్గవతీర్మానము:-

శ్రీ విశిష్టాద్వై- సిద్ధాన్త ప్రచారము విరివిగా జరుగుటకు స్థిరముగు ఆర్థికా...న ...కమును కల్పించుట అత్యంతా...కము.

ప్రచారమున కవలంబించ వలసిన విధానములు:-

1. ముఖ్యముగ విద్యా ప్రచారము జరుగవలసి యున్నది. ఇది శ్రీ భాష్య- భగవ- ద్విషయ వేద స్మార్తములలో పండిత పరీక్షల నేర్పరచి అందుత్తీర్ణులైన యోగ్యులగు పండితు లందరకు జీవితాంత సన్మానము చేయుచుండుట.

2. ప్రచారకుల తయారు చేయు శిక్షణాలయములను నడుపుచుండుట,

3. వేదాన్త విద్య నభ్యసించు విద్యార్థులకున్ను అభ్యసింప జేయు పండితులకున్ను. తగు ఆర్థిక సహాయమును చేయుచుండుట.

4. పత్రికా ప్రచురణ, పుస్తక ప్రచురణ, విరివిగా జరుపుట మొదలగునవి ఇందులకై " శ్రీ విశిష్టాద్వైత ప్రచార శాశ్వత నిధి అనిపేర- ఒక శాశ్వత నిధిని ప్రారంభించ వలెనని ... నికై ప్రతి శ్రీ విశిష్టాద్వైత సిద్ధాన్తాభి మానియు తన నికర ఆదాయములో సంవత్సరమునకు రూపాయకు ఒక్క దమ్మిడీచొప్పున ఈనిధికి శాశ్వతముగ విరాళమును సమర్పించు చుండ వలసినదిగ కోరుచు తీర్మానించడ మయినది.

## ప్రకటన

శ్రీ విశిష్టాద్వైత శ్రీవైష్ణవ సాంప్రదాయములకు సంబంధించిన అన్ని గ్రంథములు అందరికి అందుబాటులో యుండుటకై మదరాసులో 107 నరదా ముత్తయప్పన్ వీధిలో శ్రీ విశిష్టాద్వైత ప్రచారకసంఘ గ్రంథ విక్రయశాల" వకటి స్థాపించబడినది. ఇందు తెలుగు, అరవ సాంప్రదాయ గ్రంథములన్నియు క్రొత్తవి - పాతవి కూడ విక్రయించబడును.

గ్రంథకర్తలు - ప్రచురణ కర్తలు తమతమ గ్రంథములను విక్రయమునకై పంపినచో వాటిని విక్రయించి వాటి మూల్యమును వారి వారికి పంపుచుండుటకు ఏర్పాట్లు చేయబడినవి,

గ్రంథములు కావలసినవారు తమకు కావలసిన గ్రంథములు తెలిపినచో వారికి వి. పి. మూలముగగాని లేక మరొక విధముగగాని గ్రంథములు పంపబడగలవు.

మదరాసులో 107 వరదా ముత్తియప్పన్ వీధిలో "గీతామందిర" మను పేరుతో మదరాసు శ్రీ యతిరాజసేవా మహిళా సమితి కొన్న స్వంత భవనమున శ్రీ యతిరాజ సేవా మహిళాసమితి యొక్క కార్యాలయము ది 9-12-51వ తేదీని అతివైభవముగ స్థాపింప బడెను.

ఇందు స్త్రీలకు మాత్రము ప్రత్యేకము రెండు పాఠశాలలు ప్రారంభించ బడుచున్నవి.

ఒకదాని యందు ప్రభుత్వపు మెట్రిక్యులేషను పరీక్షకు గాని ప్రయివేటుగ వెళ్లుటకు శిక్షణ నిచ్చుచు ప్రధానముగా సంస్కృతము ఎంట్రెన్సువరకు తెలుగు విద్వాన్ వరకు హిందీ విశారద పరీక్షవరకు ద్రావిడ ప్రబంధము స్తోత్రపాఠములు నేర్పబడును.

రెండవ పాఠశాల యందు కేవలము, ఆధ్యాత్మిక వేదాంత విద్యమాత్రము, స్వానుభవమునకున్ను ప్రచారమునకున్ను కూడ ఉపయోగ పడుపట్టుల నేర్పబడును. మరియు స్వరూపానురూపమైన చిన్న చిన్న చేతిపనులు కూడ నేర్పబడును,

ఈ రెండు పాఠశాలలోకూడ ఏవయస్సులో నున్న స్త్రీలైనను చేరవచ్చును.

గ్రామాంతరము నుండి వచ్చు యోగ్యులగు బీదస్త్రీలకు బసఉచితముగ నీయ ప్రయత్నించబడును. స్త్రీలే ఉపాధ్యాయులుగ నేర్పరచబడుటకు ప్రయత్నములు జరుగు చున్నవి తగిన విదుషీమణులు దొరకువరకు కొన్నివిషయముల నేర్పుటకు కొంతమంది ఉపాధ్యాయులు దొరికిరి, ఇంకా మిగతవానికి ఈసంఘ కార్యదర్శిగారు ఉ. వే. శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులుగారు, పాఠ్యక్రమమును జరుపుచుందురు.

మరియు

స్వార్థత్యాగ బుద్ధితో అధ్యాత్మిక ప్రశాంతతో తమ జీవితమును ఆదర్శవంతముగ నడుప దలచిన యోగ్యులగు విరాగినులైన స్త్రీలకు ఇచ్చట ఆశ్రయ మివ్వబడును, వివరములు కోరువారు క్రిప్లైకార్డును వ్రాయవలసినది,

107 వరదా ముత్తియప్పన్‌వీధి.
మదరాసు 1

ఇట్లు.
శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘము
స్త్రీశాఖ, శ్రీయతిరాజసేవా మహిళా సమితి.

శ్రీవిశిష్టాద్వైతప్రచారక సంఘము యొక్క కేంద్ర కార్యాలయము మదరాసులో 107 వరదా ముత్తియప్పన్ వీధిలో ఏర్పాటు చేయబడినది. గాన ఇకమీద నుండి ఈబిరుదనామాకే ఉత్తర ప్రత్యుత్తరములు జరుప గోరుచున్నాము.

గీతామందిరము
107 వరదాముత్తియప్పన్‌వీధి
మదరాసు

కార్యదర్శి
శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘము



శ్రీమతే రామానుజాయ నమః

భక్తి

# నివేదన

వేదాంత మాసపత్రిక


సంపుటి 3 || ఖర పుష్యం || సంచిక ౧౦


## రామాయణంలో భ్రాతృ ప్రేమ

వాల్మీకి రామాయణము ఆదికావ్యమే గాక గొప్ప ఇతిహాసమున్ను, ఆధ్యాత్మికగ్రంథమున్ను. ఇందలిపాత్రలజీవిత, ప్రవృత్తులు ఆదర్శ రూపములు. సీతాదేవి ఆదర్శ పతివ్రత. శ్రీరాముడు ఆదర్శ పురుషుడేగాక, ప్రజానురంజనకై అద్భుత త్యాగ మొనర్చెను. ఇట్లే రామాయణములో భాతృప్రేమయు, ఆదర్శరూపముగ చిత్రింపబడినది. రామలక్ష్మణ భరత శత్రుఘ్నుల అన్యోన్యత, ప్రేమభావమున్ను, ఎల్లరకు ఆదర్శ రూపములు, అన్నదమ్ముల మధ్య మైత్రియు. ప్రేమయు బలీయముగనుండుట సహజముగదా! ఇందాధిక్యతకు తావెక్కడ, అని అందురేమో!

జ్ఞాతివైరము సోదరులలోను పొడసూపి పరస్పర విధ్వంసమునకు కారణము కావచ్చు. వాలి సుగ్రీవుల విరోధమువల్లనే వాలిని వధించునట్లు సుగ్రీవుడు శ్రీరాముని ప్రేరేపించెను. ఇట్లే రావణుడు తన్ను దూషించి వెడలగొట్టినందుననే విభీషణుడు, శ్రీరాముని ఆశ్రయించెను. ఇంటిగుట్టు లంకకు చేటు యనది, లంకాయుద్ధములో శ్రీరామపక్షపు విజయమునకు విభీషణుని సలహా ఒక్కటి తోడ్పడెను. తరువాతను మన చరిత్రలో రాజకుటుంబములలో సోదరుల మధ్య కలహముల వలన చాల హత్యలు, యుద్ధములు జరిగి అనర్థములు కలుగుచు వచ్చినట్లు చరిత్రకారులువలన విదితము. కనుక రామలక్ష్మణాదుల భ్రాతృప్రేమనుండి నేర్చుకొనవలసిన అంశములనేకములు.

రామలక్ష్మణుల అన్యోన్యత విశిష్టము. భిన్నోదరులైనను లక్ష్మణుడు బాల్యమునుండియు, పిమ్మట 14 యేండ్లను రామునితో కలసి వనవాసము చేయుటయేగాక నిద్రాహారములనుగూడ వదలి సదా సీతారాముల సేవచేసెను. రామానుజ పదము ఆయనకే రూఢమైనది! కైకేయి వరమందు చేరకున్నను లక్ష్మణుడు రామ సాన్నిధ్యముకై తనంతట వనవాస కష్టమనుభవించెను. రామునికి లక్ష్మణునిపై నుండిన ప్రేమయు అప్రతిమానము. లక్ష్మణునివంటి సోదరవానములగల భ్రాత లభింపదని శ్రీరాముడు ను రామాయణములో పలుమారులు చెప్పెను. రామ లక్ష్మణులవలె భరత శత్రుఘ్నుల మధ్యను అవినాభావపు సోదరప్రేమ యుండెను. భరతునికి రామునిపైగల భ్రాతృప్రేమ అసాధారణము. రామలక్ష్మణుల ప్రేమ అతిశయమే కాని వ్యక్తమైనది తమ్ము. నిరంతర సహవాస ఫలితముగ వ్యక్తమైనది. భరతుడు అట్లుకాక తరుచు కేకయ రాజ్యమున మేనమామ యింట వసించెను, దూరముగా నుండినందున సహవాస గమనము కానరాదు. తనకై రాజ్యకిరీటము, సింహాసనము వేచియుండెను. దశరథ వరములతో నదియు చేరినదే గదా! కాని ఆయన తల్లిని నిరసించి రాజ్యము శ్రీరామునికే కట్టబెట్టుటకు గురు, బంధుజనులతోను సేనతోను వెళ్ళి శ్రీరాముని ప్రార్థించి అందుకై ప్రాయోపవేశమును జేయబూనెను. మరియు తండ్రి యాజ్ఞపై ఒక పుత్రుడడవికి వెళ్లవలెను గదా యనిన తానే అడవికిపోయి 14 యేండ్లు గడపెదననియు భరతుడు కోరెను. ఇందునను భరతుని అపారప్రేమ స్పష్టము. కాని అది కైకేయీ వరములకును పితృవాక్య పాలనమునకు విరుద్ధములు. కనుక తుదకు రామాజ్ఞ ననుసరించి భరతుడే రాజ్యభారము వహించెను. అయినను దానినొక "సన్యాసము"గ అనగా మహాన్యాసపు ధర్మకర్తృత్వముగా నెంచి శ్రీరామ పాదుకలు శిరసావహించి నందిగ్రామములో మునివేషధారిగ నుండుచునే పాలన సాగించుచు తనవు కృశింపజేసెను. రాముని రాజ్యపాలనము చేసెను. వాస్తవమునకు రాజ్యపాలనమొక మహాభారము. ప్రజలందరి క్షేమపు బాధ్యతను రాజు వహించవలెను. వనవాసమునన్నో తనయొక్కని దేహమునే, యొక్కడు భారమువహించి కైకేయి తనయెడ పక్షపాతమును చూపెనని రాముడు భావించెనట.

యనార్థమునకు రాముడు సామాన్యప్రభ్రాతృప్రేమతో తృప్తినొందక దక్షిణపు దండకాది మహారణ్యములందు దుష్టరాక్షసుల దౌర్జన్యము నణచి ఆ ప్రాంతమునను వాసయోగ్యంగా చేసి శాంతజీవనులగు ఋష్యాదులపై నపార ప్రేమ జూపెను. నిషాదుడైనను గుహుని తన ఆత్మ సఖునిగ జేసుకొని భ్రాతృభావము జూపెను, అంతట నాగరక కుటుంబములు వేలకొలదిగ దక్షిణ ప్రాంతమును వ్యాపించెను. భారతీయ నాగరికత ఉన్నత స్థాయిని జెందెను, జనులందరకు సౌఖ్య సంపదలు హెచ్చినవి, ఆర్య, వానర, రాక్షస జాతులు మూడును రామ సుగ్రీవ విభీషణుల మైత్రిద్వారా భ్రాతృప్రేమ నలవరచుకొన్నవి. భ్రాతృప్రేమ సోదరుల మధ్యనే నిల్చిపోక పౌరులందరిపైనను రాజుకు భ్రాతృప్రేమ యుండవలెనని శ్రీమద్రామాయణంలో నివాసితమైన సీతాదేవి శ్రీరామునికిచ్చినఅమూల్యమైన దేశమువంద హృదయంగా చేయబడినది. పౌరులందరియందును భ్రాతృభావము వహించుటే రాజుయొక్క పరమ ధర్మం దానివల్ల నేమంచికీర్తియు కలుగుననిశ్రీరామునికి సీతావచనపుమిషతో వాల్మీకిమహర్షి రాజవంశములన్నియు అనుసరించునట్లు లోకక్షేమము నిచ్చు మహోత్తమమైన సందేశము నిచ్చెనని మనము భావింపవచ్చును. ఆ యుపదేశము యీనాటి ప్రజాస్వామికపువిధానముకును వర్తించును.

శ్రీమతే రామానుజాయ నమః

# ఢిల్లీ నుంచి సంపత్కుమారుని తెచ్చిన విషయము

విద్యారణ్య పంచానన, విద్యా వాచస్పతి. శ్రీమాన్ వికాల రామచంద్రాచార్యులుగారు

ఢిల్లీనుంచి సంపత్కుమారుని తెచ్చిన విషయములో గ్రంథభేదములు

1. దివ్యసూరి చరితములో (సంస్కృతము) కల్యాణ సరస్సీరమున పుట్టించినారు
2. గురుపరంపరా ప్రభావములో మూలవర్ ప్రతిష్ట చేసి వుత్సవర్ లేదనుచింతతో, నున్న రామానుజులకు స్వప్నములో నావుత్సవ బేరము ఢిల్లీలో తురకరాజు యింట వున్నదని చెప్పగా ఢిల్లీకి పోయి తెచ్చినట్లున్నది. బీబీనాంచారు వచ్చినట్లులేదు,
3. ప్రపన్నామృతములో (సంస్కృతము) తిరునారాయణుని వుత్సవబేరమును ఢిల్లీలో రాజు తన కూతురుతో కూడ పల్లకీలో కూర్చుండబెట్టి రామానుజున కిచ్చెను. అంతట దోవలో ఆమె విష్ణువులో అంతర్ధానము నొందెను. ఢిల్లీశపుత్రుడు కబీరు వచ్చి జ్ఞాని అయ్యెను అని యున్నది.
4. పెరియతిరుముడి యడవులో సుల్తాను గృహము నుండి సెల్వప్పిళ్ళను తెచ్చిరి.

5. పరమ యోగి విలాసములో తిరునారాయణుని సేవించి వుత్సవబేరమును ప్రతిష్ఠించి రనివున్నది.

6. ఆచార్యసూక్తి ముక్తావళిలో ఢిల్లీలో రామానుజులకు రామప్రియుని ఢిల్లీశు డిచ్చి కూతుర్ని యిచ్చి వివాహము చేసి కుమారుని కూడ నిచ్చి పల్లకీతో పంపెను.

తండ్రి కుమార్తె సంవాద మెక్కువగ గలదు.

తదితర గ్రంథములు

1. ఆంధ్ర పూర్ణ విరచిత యతిరాజ వైభవమున (సంస్కృతము)
ఢిల్లీ రాజు కూతురి యింటనున్న రామప్రియుని తీసుకుని వచ్చెను,
ఢిల్లీ రాజు కూతురు అంతర్ధానము నొందెను.అని వున్నది.

ఆలయ చండాల ప్రవేశము చెప్పలేదు.

2. తృతీయ బ్రహ్మతంత్ర స్వతంత్ర స్వామిరచిత మువ్వాయిరప్పడి గురుపరంపరలో ఢిల్లీరాజు కూతురువద్దనున్న రామప్రియుని తీసుకుని వస్తూవుండగా విగ్రహమును కుమార్తె కొరకు తెమ్మని భటులను పంపగా వారి యుపద్రవమును తప్పించుకొనుటకు అచటవున్న చండాలుల సహాయమును కోరగా వారికి బహుమానముగ ఆలయప్రవేశము నిచ్చిరని గలదు.



## కృష్ణార్జున సంవాదము.

శ్రీ ఉ. వే. శ్రీమాన్
తె. కం. గోపాలాచార్యులుగారు.

శ్లో॥ శాన్తాకారం భుజగశయనం పద్మనాభం సురేశం।
విశ్వాకారం గగన సదృశం మేఘవర్ణం శుభాంగం।
లక్ష్మీకాంతం కమలనయనం యోగిహృద్ధ్యాన గమ్యం।
వందే విష్ణుం భవభయహరం సర్వలోకైకనాథమ్॥

(అని చదువబడి తెరఎత్తబడును)

క్షీరసముద్రమున శ్రీ భూ దేవులు పాదసంవాహనము గావించు చుండ శ్రీమన్నారాయణుడు శేషతల్పమునందు శయనించి లక్ష్మీదేవితో మాట్లాడు చుండును.

లక్ష్మీ:- నాథా! మీరనేక యవతారము లెత్తి భూమండలమున పుట్టు చుందురుగదా! ఆపుట్టుక అసత్యమా? జీవులకు వలె సత్యమా?

నారా:- సత్యమే! అందుకు సందేహమేల? నాకితరజీవులకు వలె అనేక జన్మలు గడచినవి. అవి యన్నియు సత్యములేగాని యసత్యములు గావు. వాటినన్నిటిని నేనెఱుంగుదును. ఇతరులు గతించిన తమ జన్మల నెఱుంగరు. అదియే నాకుగలవిశేషము.

లక్ష్మీ:- సత్యమైనచో చేతనులవలె మీ పారమేశ్వర స్వభావమును విడిచి పుట్టుదురా? లేక దానితోనే పుట్టుదురా?

నారా:- నా పారమేశ్వరమగు నజత్వ అవ్యయత్వ సర్వేశ్వరత్వాది సమస్త స్వభావములను విడువకయే పుట్టుదును.

లక్ష్మీ:- అయిన నా జన్మమున మీశరీరము జీవులశరీరము వలె ప్రాకృతమా? అప్రాకృతమా?

నారా:- పద్మపుత్రీ! ఏమియెఱుంగనట్లడుగుచున్నావు? నేను నా యసాధారణమగు అప్రాకృతదివ్యమంగళ విగ్రహమును ఆయాదేవమనుష్యాది జాతులకు సజాతీయమైన అవయవములు కలదానినిగా జేసుకొని దానియందు ప్రవేశింతును,

లక్ష్మీ:- నాథా! జీవులకు వలె మీరును ఆజన్మకు కారణముగా పుణ్యపాపములను కట్టించుకొందురా? లేకమీసంకల్ప మాత్రము చేతనే పుట్టుదురా?

నారా:- పద్మా! నాయవతారమునకు నాసంకల్పము తప్ప వేరొక కారణమును నేనపేక్షించను తెలిసినదా?

లక్ష్మీ:- స్వామీ! మీరట్లవతరించుట సామాన్య చేతనులవలె మీపుణ్యపాపములు పక్వములగు కాలమునందా? లేక ధర్మమునకు గ్లానికలుగు కాలమునందా?

నారా:- (నవ్వుచు) లక్ష్మీ! నాకు కొన్నిపుణ్యపాపములను కూడ తెచ్చిపెట్టకుము

యదా యదాహి ధర్మస్యగ్లానిర్భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య తదాఽత్మానం సృజామ్యహం॥

నాజన్మమునకు కాలనియమము లేదు. ఎప్పుడువర్ణాశ్రమ ధర్మములకు హానియు అధర్మమునకు వృద్ధియు గలుగునో అప్పుడెల్లను నాసంకల్పముచే నవతరింతును.

లక్ష్మీ:- నాథా! మీ యవతార మితర జీవులకువలె సుఖ దుఃఖాదు లనుభవించుటకా? లేక సాధు పరిత్రాణమునకా?

నారా:- (గట్టిగా నవ్వుచు) ఓసీ పిచ్చిదానా! సుఖ దుఃఖములకు నిమిత్తము పుణ్య పాపములే, అవి నాకు లేవని చెప్పియుంటిని గదా! ఇక నీ ప్రశ్న కర్థమేమి? నాయవతార వాస్తవ ప్రయోజనమును చెప్పెద వినుము.

స్వామీ ! నీవెఱుంగని దేమున్నది ! నీవు శ్రీరామావతారమున గావించిన ప్రతిజ్ఞను సఫలపరతువను నాశతో ఋషీశ్వరు లందరును వ్రేపల్లెలో గోపికలై జన్మించి నీ యవతారమునకై తహ తహ లాడుచున్నారు.

మ॥ ఇదిగో నాకుచను భూమిదేవి ! యిదిగో
　　యీ మాత గోమాతగా :
　ఎదిరెన్ నీకడ ! కేస్పురుచున్నదిదిగో !
　　కన్నీరు మున్నీరుగా !
　హృదయం బెంత తపించుచున్నదో గదా !
　　యీ దుష్టులన్ మోయలే !
　కదిరా ! మాధవ ! వీడుమింక ఫణి !
　　పర్యంకంబు క్షీరాంబుధిన్ ॥

సాధుజనులు తమయజ్ఞయాగాది క్రియలకు స్వస్తి జెప్పి ప్రచ్ఛన్నముగా నీ యవతారమునకై తపంబాచరించుచున్నారు. ధర్మము గ్లానియు మంట గలసినవి. ఇక నీవుపేక్షింపగదని మనవి చేసుకొనుటకై యీ దేవబృందముతో నీ దర్శనమునకేతెంచితిని. పిమ్మట నీ చిత్తము.

కృ— చతుర్ముఖా ! నాపనికై నీవింతగా చెప్పవలెనా ? దేవకీ వసుదేవులును నందయశోదలును నన్ను బిడ్డగా గోరియు నా లీలారసము నాశించియు తపంబాచరించి నానుండి వరంబుల బొంది యున్నారు, కావున నేను మునుముందు నా శేషతల్పమును నా సహోదరుడై బలరాముడిగా నవతరింపజేసి నేను కృష్ణుడను పేరుతో నాతనికి తమ్ముడనై యవతరింతును.

సీ॥ ఎల్లపాయ మందున గులసతిన్ విడనాడి
　　నాతో నరణ్యంబు నడచినాడు !
　పదునాలుగేడులు పలుకష్టముల కోర్చి
　　కనురెప్పరీతిగన్ గాచినాడు !
　యావ రాజ్యమొసంగ నంగీకరింపక
　　నాసేవకత దాస జేసినాడు !
　వనిలోన సీతను వదలిపెట్టుమటన్న
　　వెనుకాడ కట్టుగావించినాడు ॥

గీ॥ ఈతడు రామావతార మేనెత్తినపుడు
　తమ్ముడై నాకు జేసిన దాస్యమునకు !
　ఋణ పడితిగాదె మిగుల లక్ష్మణునికెంతో
　దాన జేసిన సేవ నవ్వాని కిపుడు ॥

దాన భాగవత సేవా ధర్మమొకటి నా యనుష్ఠానము ద్వారా స్థాపించి నట్లగును. విధాతా! గుడు సేనా ప్రయత్నములలో నే యున్నాను.

బ్రహ్మ:- (నమస్కరించి) చిత్తము. సెలవొసంగుము మేము పోయి వత్తుము. (... అందరు నిష్క్రమింతురు)

నారా:- రమా! నేనే యవతారమెత్తినను దానికనుగుణముగ నీవును అవతరించుటచేతనే నాయవతార కార్యమంతయు సుకరమగుచుండెను. చూడుము.

ఉ॥ ఏ యవతారమేను । ధరి
యించిన నందుకు నర్ధాంగి । నా
తో యవతారమెల్ల । ముదమార ।
వహించుట బట్టిగాదె । ప
ద్మాయతనేత్ర । నాదు నవతార
విధంబు సలక్షణంబుగా ।
హాయుగ సాగుచున్నది హ మంతున
సర్వ జనాభిరామమై ॥

కావున నీ యవతారంబునందును నీవు నేనవతరించిన కొంతకాలమునకు భూమియందు భీష్మకుని పుత్రికయై రుక్మిణిగా నవతరింపుము. ఈ భూదేవి సత్రాజిత్తునింట సత్యభామగా జన్మించును. నేనప్పుడు మిమ్ముల నిరువురను పాణిగ్రహణము గావించి నాయవతార లీలారసము ననుభవింపజేతును.

ఇద్దరును-చిత్తము. (తెర వాలును)

(ధృతరాష్ట్రుడు సింహాసనాసీనుడై యుండును. ఆచెంతనే నీచాసనముపై సంజయుడు కూర్చొని యుండును)

ధృత:- (విచారముతో) సంజయా! రజోగుణ మెన్ని యనర్థములకు కారణమాయెను, కామ క్రోధము లుదయించినను, పెంపొందినను దీనివల్లనేగదా! ఆహా! నేను శ్రీ వ్యాస మహర్షి కాశ్రయించి ఆర్జించిన విజ్ఞానము నంతను దీనిపాలనే పెట్టుకున్నదిసుమా! పెద్దల సేవచేసి గడించిన జ్ఞానమ నంతను ఇదియే దిగమింగి వేసినది. కానిచో నాకు ఒక్కరా యిద్దరా! నూరుగురు బిడ్డలేమి. వీరియెడల నాకీప్రేమాంధ్యమేమి? ఎవరెన్ని చెప్పినను వినక బిడ్డని మనస్సేమి క్షోభిల్లునో యని వాడన్నదానికంతకు తందానతానయని ముప్పుతెచ్చుకొంటిని. ముక్కలై వంగనిది మ్రానైన వంగునా? ఇక నేమనుకొనిన ఏమిలాభము పాపమా ధార్మికులై దుర్గ్రహము తీయమని ప్రార్థేయపడిరి, సర్వశక్తిగల సర్వజ్ఞ శిరోమణి యగు శ్రీ కృష్ణుని రాయబార మంపిరి. అయ్యో! దౌర్భాగ్యులాయననే యవమానపరచి

కల్పించుకొంటిని. ఇంతకంటె నికచేసేదేమి కలదు? ఆనాటి ద్రౌపది పరిభవము తలంచుకొనిన హృదయము తల్లడిల్లుచున్నది. మహాపతివ్రత! సంజయా! నిజముగా ఆభీముని పలికిన నాచెవులలో నహోరాత్రములు ప్రతిధ్వనించుచు నన్నుచికాకు పరచుచున్నది. నాకాహార నిద్రలుదూరమైపోయినవి సుమా! నాకేమిదిక్కు? నాకేమిదారి? అయ్యో! సంజయా ఈయుద్ధవిరమణోపాయమేమియు లేదుకదా! నాబిడ్డలకు యుద్ధము చేయకయే రాజ్యలాభమునకేదైన ఉపాయము జెప్పుము నాయనా!

సంజ:- ధృతరాష్ట్రా! నీకేమైన వెర్రియా! పిచ్చియా! నీవింకను వెరటిదారినే యున్నావా

యతోధర్మస్తతోకృష్ణః। యతోకృష్ణస్తతోజయః॥

నీబిడ్డలకు స్వారాజ్యము సిద్ధముగనే యున్నది. ఇది నిశ్చయము, తప్పదు, సర్పదష్టునకు ఖండశర్కర విషతుల్యము. వినాశోన్ముఖునకు విజ్ఞోపదేశము విషప్రాయము. "వినాశకాలే విపరీతబుద్ధిః" నీవికవెరతలంపుల బోవిడిచి కానున్నది కాక మానదని ప్రశాంత చిత్తుడవై భగవంతుని ధ్యానింపుము. ఇదిగో గురుపుంగవులగు వ్యాసభగవానులు ఇట్లేయరుదెంచుచున్నారు.

(లేచి ఎదురేగి సాష్టాంగనమస్కార మాచరించి)

దేవా! ఇటువిజయముచేయుడు, ధృతరాష్ట్రుడిచ్చట ఉద్విగ్న మనస్కుడై సాంత్వనోపాయము నారయుచున్నాడు.

వ్యా:- సంజయా! ధర్మప్రవణోభవ! నేను వచ్చినదిందులకే, ధృతరాష్ట్రునికడకు పోవుదము ముందునడువుము.

సం:— చిత్తము (ధృతరాష్ట్రునికడకేగి) రాజా! ఇదిగో! వ్యాసమహర్షి తగిన సమయమునకు హితకాములై విచ్చేసిరి.

ధృత:- గురుపుంగవా! ఇదేధృతరాష్ట్రుడు నమస్కరించుచున్నాడు, ఈయాసనము నలంకరింపుడు.

వ్యా:- ధర్మోజయతు। ధృతరాష్ట్రా! అనుకున్నంతయు నైనది. చూచితివా! ఎవరెన్నిజెప్పినను నీజ్యేష్ఠపుత్రుడు వినడయ్యె ఇకచింతించిన నేమిలాభము,

కం॥ కాలంబగుటయు నృపులకు।
కాలము సమకూరె దీనికడలకు మదినీ।
వాలోచింపగ వలసిన।
నేలోనికి దివ్యదృష్టి నిచ్చెద పుత్రా।

ధృత:— అయ్యో! తండ్రీ, నేను పుట్టు గ్రుడ్డిని. పరిత్క[illegible] శుభపరంపరలు నా ముందు [illegible]. నేనొక్క[illegible] [illegible] పెండ్లాడితిరి, బిడ్డలగనిరి. నే[illegible] శుభ మానైనను [illegible] చించితి[illegible]! అయ్యో! నాయనా! [illegible]కిపుడీ కులనాశము [illegible] యటకా [illegible] నీ యనుగ్రహామున్నచో వినునట్లు అను[illegible]హింపుము అం[illegible].

వ్యా—అయినచో ధృతరాష్ట్రా! [illegible] నీ సంజయునకు దివ్యదృష్టిని దివ్యశ్రోత్రము ను ప్రసాదించు[illegible] [illegible] యుద్ధమగు [illegible]వరకు చూడకయే భూతభవిష్య ద్వర్తమానము[illegible] [illegible] భాసించును. చెప్పకయే దేశకాల విప్రకృష్టములు [illegible] [illegible]. ఈతని నట్టి యాయుధములైనను బాధిం పనేరవు. ఇట్టి దివ్యశక్తితో [illegible] నీ [illegible] తనుండి సమస్త సంగ్రామ వార్తలను యథా ర్థముగ చెప్పటి [illegible]. అట్లువినుచు సకల యుద్ధవార్తలను విను చుండుము. భగవత్సంకల్ప [illegible] ప్రళయవేగము నడ్డుట కేరితరము?

సంజయా! (అని పిలచి ఆతనిని అభిమంత్రించును)

(సంజయుడు నూతన తేజముతో విరాజల్లును)

సంజయా! నీ కప్రతిహతశక్తి [illegible] నను గ్రహించితిని, నీవు ధృతరాష్ట్రునకీ యుద్ధవార్తల నన్నిటిని యథార్థముగ నెరుక పరచు చుండుము.

సం—మహా ప్రసాదము.

వ్యా—ధృతరాష్ట్రా! స్వస్థచిత్తుడవగుము. నేనిక పోయి వత్తును.

ధృ—చిత్తము.

(వ్యాసుడు నిష్క్రమించును)

సం—ప్రభూ! మన వారందరును కురుక్షేత్రమున సమావేశమై వ్యూహముల పన్ని యుద్ధో ఖులై యున్నారు. నేనొక్కసారి రణరంగమునకేగి వారివారి ప్రవృత్తుల నారసి ములో నీ సన్నిధికే తెంచి,

కం॥ వినినదియును నెయ్యెడనే
గనినదియును మునికృపం ప్రకాశంబైతో
చినదియును విశదంబుగ
వినిపింపెద మొదలుకొని సవిస్తారముగన్ ॥

ధృ—సరియే! పోయి త్వరగారమ్ము [illegible]లాకకై వేచియుందును.

సం—చిత్తము సెలవొసంగుడు.

(నిష్క్రమించును)

# రామానుజ అష్టాక్షరీ భూరి ప్రదానము

ఉ. వే. శ్రీమాన్ కవిప్రియమిత్ర, విమర్శక శిరోమణి, విద్యారత్న గో. రమాకాంతాచార్యులు గారు బి. ఏ.

అపౌరుషేయమగు వేద చతుష్టయమునకును వ్యాఖ్యానప్రాయమగు శ్రీ మహాభారతమున, వేదాంతపరమగు శాంతిపర్వమునను జగము వాక్యముగా, నిబంధింపబడిన 'నారాయణీయ ధర్మము'లకు శ్రీ పాంచరాత్రమని పేరు (శాంతి 340-111, 112). సృష్ట్యాదిని శ్రీమన్నారాయణుడు తన నాభికమలమున బుట్టిన చతుర్ముఖబ్రహ్మకు వేదము లొసంగి, వానికి వ్యాఖ్యానముగా నుండుటకుగాను ఈ పాంచరాత్ర శాస్త్రము నిర్మించి, దానిని ఆయనకు పరమరహస్యముగా సస్సంగ్రహముగా నుపదేశించెను (శాంతి 351-67) ముముక్షువులందరికిని-తప్త చక్రాంకనము, ఊర్ధ్వపుండ్రకము భగవన్నామధారణము (పేరుపెట్టుకొనుట) అష్టాక్షరీమంత్రోపదేశము, భగవదర్చాపూజ- అను పంచసంస్కారములను శ్రీ పాంచరాత్ర శాస్త్రము విధించుచున్నది-తన పితృపాదులగు శ్రీమన్నారాయణునుండి, ఈ పంచసంస్కారములను బొందిన చతుర్ముఖుడు, ఇంద్రునకు దాను దానిని కృప చేసి, స్వర్గలోకమునేల బంపెను. (అవ్యక్తోపనిషత్తు-వావిళ్ల ప్రతి చూడుము). భగవచ్ఛబ్దమునకు నారాయణునియందే ముఖ్యవృత్తిగ నున్నందునను పరాశర మునివరుల శాసనముండుటచే (విష్ణుపురాణము 6-5-79 ఈ నారాయణీయ ధర్మమునకే, భగవద్ (భాగవత) ధర్మమని భాగవత మతమని పేరు,-బ్రహ్మమానస పుత్రుడగు నారదమహర్షి శ్రీపాంచరాత్ర శాస్త్ర ప్రవర్తకుడు (శ్రీభాగవతము 1-3-8 శ్రీధరవ్యాఖ్య). శ్రీ పాంచరాత్రోక్తమగు ఈ భాగవత మత సాంప్రదాయము మూడు పరంపరలుగా త్రిలోకములయందును వ్యాపించెను. మొదటి పరంపర, దేవర్షి యగు (భాగ 10-20) నారదునది. రెండవ పరంపర బ్రహ్మర్షి పరంపర. ఇది పురుషోత్తమాఖ్య పాంచరాత్రసంహితా ప్రవర్తకుడగు వసిష్ఠ మహర్షి పరంపర. రాజర్షి పరంపర,-ఇది వేదార్థ ప్రకాశకుడగు మను మహామునిది. రాజర్షి పరంపర మనువు ద్వారా ఇక్ష్వాకువు వరకు వచ్చి జగద్వ్యాపకమాయెను (శాంతి 336-45,47,348-35 టు టీక). శ్రీ పాంచ రాత్రమునకు సాత్వత మని వ్యపదేశము (శాంతి 348-49). ఇక్ష్వాకువు సాత్వత వంశీయుడు ఆ వంశములోనే భగవానులు శ్రీరామచంద్రమూర్తిగ నవతరించెను. శ్రీరామచంద్రమూర్తి వలెనె, శ్రీకృష్ణ భగవానుండును సాత్వత వంశీయుడే. త్రేతాయుగమున, శ్రీ రామచంద్రుని వంశగురువగు వసిష్ఠ మహర్షి చేతను, ద్వాపర యుగమున శ్రీ కృష్ణ భగవానుని, అంతరంగ భక్తులగు శ్రీ పరాశర, వ్యాస, శుక బ్రహ్మర్షుల చేతను భాగవత మత సాంప్రదాయము వ్యాపకము గావింప బడెను-నారదోపదిష్టుడై, భాగవత ధర్మము ననుష్ఠించిన ప్రహ్లాదునిచేతను, అతని వంశీయుడగు బలిచేత,-ఈ ధర్మము దైత్యుల యందును,-పాతాళలోకమునను వ్యాపింప జేయ బడెను. ఈ మూడు పరంపరలలో;-

ప్రథమమునందపరా ప్రవర్తనునకు (నారదునకు) శతవర్షములు తపస్సు చేసి, దైవయోగబలమున జ్ఞానము లభించి తత్ఫలముగా మేరు పర్వతమునకు ఉత్తరతటమున నున్న క్షీరసాగరములో మహా ప్రకాశ మానముగా వెలుంగు శ్వేతద్వీపమునకు వెళ్ళి, అచట శ్రీమన్నారాయణుని సేవించి తదాజ్ఞచేదిరిగి మేరువు పర్వతము మీదుగా బదరికాశ్రమమునకు వచ్చి, అచట శ్రీమన్నారాయణుడే, ఆచార్యశిష్య రూపములై నరనారాయణ మహర్షులుగా నవతరించిన తత్సన్నిధిలో-శ్రీమదష్టాక్షరీ మహామంత్రమునుపదేశమై, దానిని మహోపాసించుచు చిరకాలము భగవన్మంత్రమును జపించెను. (శాంతి 337-22,26,31,32; 344-23,33; 345-27)-ప్రాశ్లోక్త పరంపరాత్రయములో,-రాజర్షి పరంపర, గంగానదివలె,-బ్రహ్మర్షి పరంపర, సరస్వతీనదివలె,-దేవర్షి పరంపర యమునానదివలె. సమస్త ముముక్షుచేతనులను, భగవన్ముఖులఁ గావించెను ఈపరంపరలలో యామున పరంపర శ్రీరామానుజీయ విశిష్టాద్వైతమునకు ఉపాదేయమాయెను.



# శ్రీ రామానుజ మూర్తి ధ్యానము

శ్రీ ఉ. వే. శ్రీమాన్.
ఆ. చి. శ్రీమన్నారాయణాచార్య.

శ్లో॥ స్వరూపం పరమాత్మానం।
స్వభావం శ్రీస్వభావకం॥

శ్లో॥ మస్తకం శ్రీశఠారాతిం।
నాథాఖ్యం ముఖమండలం।
నేత్రయుగ్మం సరోజాక్షం।
కపోలం రాఘవంతథా॥

శ్లో॥ వక్షస్థలం యామునాఖ్యం।
కంఠం శ్రీపూర్ణదేశికం।
బాహుద్వయం గోష్ఠిపూర్ణం।
శైలపూర్ణ స్తనద్వయం॥

అర్థము

శ్రీరామానుజులవారి యొక్క స్వరూపము పరమాత్ముడుగను; స్వభావము శ్రీలక్ష్మీస్వభావముగను:

శిరస్సును శ్రీనమ్మాళ్వార్లుగాను; ముఖమండలమున శ్రీమన్నాథమునులుగను; నేత్రద్వంద్వమును శ్రీపుండరీకాక్షులుగను కపోలమును శ్రీరామమిశ్రులుగను;

వక్షస్థలమును శ్రీయామునాచార్యులుగను; కంఠమును శ్రీపరాంకుశ దాసులుగను; హస్తద్వయమును పూర్ణులుగను; స్తనద్వయమును శ్రీశైలపూర్ణులుగను;

అర్థము

ఉదరమును తిరువరంగ ప్పెరుమాళరయర్ ను; వీపును తిరుమాలైయాండానుగాను; మొలను తిరుక్కచ్చినంబిగారుగను; నితంబమును ఎంబార్లుగను;

పిక్కలను భట్టరు- నంజీయర్లుగను; తొడలను నంబిళ్లగను; మోకాళ్లురెండింటిని వడక్కుత్తిరు వీధిపిళ్లైగను; పాదములను పిళ్లైలోకాచార్యులుగను;

పాదమందలి రేఖలను శ్రీశైల నాథులుగను; పాదుకలను మణవాళ మహామునులుగను; ఊర్ధ్వపుండ్రమును సేనాపతిజీయర్ గను; యజ్ఞోపవీతమును కూరత్తాళ్వార్లుగను;

త్రిదండమును మొదలియాండానుగను; కాషాయమును ఆంధ్రపూర్ణులుగను; కంఠమందలిమాలికను తిరుక్కురుగైప్పిరాన్ పిళ్లానుగను; నీడను, శ్రీధనుర్దాసులుగను;

ఈవిధముగ శ్రీరామానుజుల వారియొక్క సమస్త అవయవములను మనపూర్వాచార్యులుగను అవయవిస్థానీయులుగ మహాత్ములైన శ్రీరామానుజ మునులను భజించుచున్నారు.

పూర్వాచార్యుల నందరను తమశరీరముగ ధరించియున్న భగవద్రామానుజ యోగీంద్రులను ప్రతినిత్యము ధ్యానించు నరుడు సమస్త కోరికలను పొంది చివరకు పరమ పదమును పొందగలడు.

శ్లో॥ కుక్షింతు వరరంగార్యం ।
పృష్టం మాలాధరంతథా ।
కటిం కాంచీమునిం జ్ఞేయం ।
గోవిందార్యం నితంబకం ॥

శ్లో॥ భట్టవేదాంతి నౌజంఘే ।
ఊరూయుగ్మం కలిద్వేషం ।
కృష్ణం జానుయుగంచైవ ।
లోకం శ్రీపాదపంకజం ॥

శ్లో॥ రేఖాం శ్రీశైలనాథాఖ్యం ।
పాదుకాం వరయోగినం ।
పుండ్రం సేనాపతిం ప్రోక్తం ।
సూత్రం కూరపతిం తథా ॥

శ్లో॥ భాగినేయం త్రిదండంచ ।
కాషాయం చాంద్రపూర్ణకం ।
మాలాం చకురుకేశార్యం ।
ఛాయాం శ్రీచాపకింకరం ॥

శ్లో॥ ఏవం రామానుజార్యస్య ।
అవయవానఖిలాన్ గురూన్ ।
అవయవినం మహాత్మానం ।
రామానుజమునిం భజే ॥

శ్లో॥ గురుమూర్త్యాత్మ యోగీంద్రం ।
యోధ్యాయేత్ ప్రత్యహం నరః ।
సర్వాన్ కామాన్ సవాప్నోతి ।
లభేచ్చాంతే పరంపదం ॥

ఈవిధముగా ప్రతినిత్యము ధ్యానముచేయుటచే పూర్వాచార్యులతో గూడుకున్న భగవద్రామానుజుల వారిని ధ్యానము చేయుటయగును,





## నారీవిభాగము

శ్రీమతే రామానుజాయ నమః



# తిరుక్కోళూర్ పెణ్ పిళ్ళై రహస్యము

(రచయిత :- శ్రీ మద్భాగవత శ్రీపాదరేణువు, మదరాసు)



## భాగవతము



అ॥ తందై యెంగే యెన్రేనో ధ్రువనైప్పోలే॥

తె॥ నాతండ్రి యెక్కడనని అడిగినానా ధ్రువునివలె ॥

౧

ఉత్తానపాద మహారాజునకు సునీతి సురుచి యను నిద్దరు భార్యలు గలరు వారిలో సునీతికి ధ్రువుడును సురుచికి ఉత్తముండును బుట్టిరి. సురుచి బోధనలకు చిక్కి సునీతిని రాజు పట్టణమునకు దూరముగా నుంచెను. ధ్రువునికి ఐదు సంవత్సరములు కాగానే వీధిబడికి పంపెను. తోడిబాలురచే తన తండ్రియే రాజని విని సందేహనివృత్తికై తనతల్లితో నా తండ్రి యెక్కడ ? యని అడుగగా ఆమె దుఃఖాక్రాంతురాలై తన వర్తమానంబును దెల్పెను. ధ్రువుడు అమ్మా ! నేను నగరికి వెళ్ళి రాజు సింహాసనముపై గూర్చుండి ఉత్తముని తొడపై నిడుకుని ముద్దులాడు చుండుటను గని తానును మఱియొక్కతొడపై నెక్కి కూర్చుండెను. తటాలున సురుచి వచ్చి ధ్రువుని చెంపపై చఱచి నీవు నీతండ్రి తొడలో కూర్చొన తగవు. ఆపదవి కావలసియుండిన తపస్సుజేసి రమ్మని గెంటించె ను. ధ్రువుడు దుఃఖముతో తల్లివద్దకు వచ్చి యావద్వర్తమానంబును దెలిపి నాపినతల్లి చెప్పినట్లు తపస్సునకు వెళ్ళెదనని పట్టుపట్టి తల్లి యెంతవారించినను వినక వెళ్ళుచుండగా భగవంతునిచే ననుజ్ఞాతుండై నారదులు ప్రత్యక్షమై ధ్రువునికి ద్వాదశాక్షరియగు " ఓం నమో భగవతే వాసుదేవాయ" యను మంత్ర ముపదేశించి వెళ్ళెను. నారదులు ధ్రువుని కారణమడుగగా ధ్రువుడు స్వామీ! సపత్నిమాతృవాగిషుక్షతంబగు మనంబును భగవద్ధ్యానయోగ రసాయనంబున మాన్పుకుందునని చెప్పి యమునాతీరమున కూర్చుండి తపస్సు చేయగా భగవంతుడు ప్రత్యక్షము కాగా,

ధ్రువుడు:- గీ॥ నయనముల విభుమూర్తి పానంబు సేయు!
పగిదిదన ముఖమునను జుంబనము సేయు!
గీల దగభుజములను నాలింగనంబు సేయు!
గతిని తగదండ వన్నమస్కృతు లొనర్చు॥

ధ్రువుడు:- చం॥ నిరతము పావకీన భజనీయపదాబ్జసుగంధలబ్ధి!
నెవ్వరుమదినొందగా గలుగువారలు తత్ప్రియమర్త్యదేహము!
గరము తదీయ దారసుతకామ సుహృద్గృహ బంధువర్గమున్!
మఱతురు విశ్వతోముఖ!రమాహృదయేశ! ముకుంద! మాధవా

యని ప్రార్థింప భగవంతుడు ధ్రువుని భక్తికి మెచ్చి ధ్రువా! ఇమ్మేదినియందు బరిభ్రామ్యమాణగోచక్రంబునుబోలి గ్రహనక్షత్రతారాగణ జ్యోతిశ్చక్రంబు నక్షత్రరూపంబులైన ధర్మాగ్నికశ్యపశక్రులును సప్తర్షులును దారాసమేతులై ప్రదక్షిణంబు దిరుగుచుందురు. అట్టిదురాపంబున నన్యాధిష్ఠితంబును లోకత్రయ ప్రళయ కాలంబునందు నశ్వరంబుగాక ప్రకాశమానంబైన ధ్రువక్షితియను పదంబు ముందట (26,000) ఏండ్లుచన బ్రాపింతువని యాశీర్వదించి యంతర్ధానుడయ్యెను. (తి. అ) ధ్రువునివలె ఇటుల దృఢాధ్యవసాయము జేసినానా?

---

## నాలాయిరం.

అ॥ మూన్రెళుత్తై చ్చొన్నెనో క్షత్రబంధువైప్పోలే॥
తె॥ మూడక్షరములనో ముక్తి నిబొందినానా క్షత్రబంధువువలె॥

తిరుమాల॥ మొయ్త్త వల్వినైయుళ్ నిన్రు మూన్రెళుత్తుడైయ పేరాల్!
క్షత్తిరబందు మన్రె పరాంగది కండుకొండాన్!
ఇత్తనై యడియరానార్కు ఇరంగుం నమ్మరంగనాయ!
పిత్తనై పెట్రుమందో పిరవియుళ్ పిణంగుమారే॥

తా॥ ఎంతకాల మనుభవించినను నశింపని పాపమునొర్చననుమూడు అక్షరములుగల గోవిందయను తిరునామానుసంధానముచే క్షత్రియాధముడైన క్షత్రబంధువుగదా పరమపదమును ప్రాప్తించెను హృదయమందు లేక వాక్కుచే "గోవింద" నామ మనుసంధించు దాసులకై కనికరించు వాడైన మన "రంగని" గూడి యనుభవించుటకు ప్రాప్తముండియును జన్మదుఃఖబాధలతో పడి పరిభ్రమించు చేతనులను జూచి "భక్తాంఘ్రిరేణు" దాసులు అయ్యో అని చింతించుచున్నారు.

వి. పు. శ్లో॥ పాపిష్ఠః క్షత్రబంధుశ్చ పుండరీకశ్చ పుణ్యకృత్।
అచార్యవత్తయా ముక్తౌతస్మా దాచార్యవాన్ భవేత్ ॥

తా॥ మహాపాపియైన క్షత్రబంధువున్ను మహాపుణ్యాత్ముఁడైన పుండరీకమునియు సదాచార్యసంబంధమువల్ల ముక్తిఁజెందిరి.

క్షత్రబంధువుయొక్క వృత్తాంతము.

పూర్వమున క్షత్రబంధువను రాకొకఁడుండెను. అతనికి దగ్గు సంప్రాప్తమాయెను. వైద్యులు పరీక్షించి ఈ దగ్గుకు కుందేలు మాంసము పథ్యమనిరి. అట్లే ప్రతిరోజును భుజించుచుండెను. ఒక్క రోజు అడవిలో కుందేలు దొరకకపోయెను, రాజు వంటలవారిపై మిక్కిలి ఆగ్రహించగా ఆ మఱునాఁడు అప్పుడు పుట్టిన శిశువును జంపి పచనముచేసి యుంచిరి. ఈ కుందేలు మాంసము బహుబాగుగనున్నది. ఆదే ప్రతిరోజును పెట్టమని రాజాజ్ఞచేయగా అట్లే ప్రతిరోజును జరిగెను, నరుఁడు నరమాంసము తినుటవలన రాక్షసులకువలె ఈ రాజునకు కోరపండ్లు పెరగసాగెను. అంతః పుర స్త్రీలగు తనభార్యలను హింసించి వారల రక్తములను త్రాగ నుఱకించెను. వారందరును తమ తల్లిగారిండ్లకు పోయిచేరిరి. తర్వాత మంత్రి ప్రధానులను రాజాంగసేవకులను అట్లే పురజనులను బాధింపసాగెను. అందరును భయపడి పారిపోయిరి, ఊరేలేక శూన్యమాయెను కడకు అడవికి పోయి నర మాంసమునకై పరుగులాడుచుండగా శ్రీనారదముని ఎదురుపడెను. నారదులను హింసింపబోగా క్షత్రబంధురాజునకు హితోపదేశమునుజేసి తర్వాత మంత్రోపదేశము చేసి పోయెను. అతడట్లే ధ్యానగతుడాయెను.

తి. అ॥ ఈ క్షత్రబంధువవలె తపస్సు జేసినానా ?



# శ్రీ రామాయణము

అ॥ ముదలడిగ్గైనె ప్వట్రినో అహల్యమైపోనలే ।
శే॥ ఆదిమధ్యాంతరహితుని పాదస్పర్శను బొందినానా అహల్యవలె ॥

వి

అహల్య అయోనిజయగుటచేతను బ్రహ్మ మానస పుత్రియై పదివేల సంవత్సరములు గౌతమమహామునితో కాపురము చేయుచుండగా ఇంద్రునియొక్క మోసకృత్యమునకు మోసపోయినందున గౌతముల శాపబద్ధురాలై చట్రాయిగ బహుకాలము పడియుండి శ్రీరాముల పదరజంబు సోకి మరల అహల్యయై గౌతములను గూడి గృహస్థ ధర్మమును నిర్వర్తించెను. ఈ అహల్యా దేవిని పంచకన్యలలో నొక్కతె యందురు.

శ్లో॥ అహల్యా ద్రౌపదీ సీతా తారా మండోదరీ తథా ।
నిత్యయౌవ్వన సంపన్నాః పంచ కన్యా గుణాన్వితాః॥

క॥ ముదితాపసి వెనువెంటను వదలక చనుదెంచునట్టి వడిరాముని శ్రీ
పదరజము సోకి చిత్రిం బొదవగ గనుపట్టె నెదుట నొక యుపల మటన్॥

క॥ పదునై యొప్పిదమై కడు గదలుచు బంగారు ప్రూనె కరిగిన పగిదిన్ ।
బొదలుచు లావణ్యస్థితి సుదతై చూపట్టి నిలిచె సురుచిరలీలన్ ॥

వ॥ విశ్వామిత్రులీ అమానుషకృత్యమును జూచి మనమున నుప్పొంగుచు

ఉ॥ ఆ మునివల్లభుండు కొనియాడుచు బాడుచు వేడ్కతోడ శ్రీ।
రాముని జూచి యిట్లనియె రామ భవత్పదధూళిసోకి తా ।
భామిని యయ్యె రాయి కులపావన చూడగ జిత్రమయ్యె నీ ।
నామ మెఱుంగువారలకు నమ్మగ వచ్చును భుక్తి ముక్తులున్॥

తే॥ మంచుకప్పిన మబ్బున మాటువడిన నిండు జందురు గుచివోలె నుండుదాని
నీట ప్రతిబించితంబై నిగుడుచున్న యెండయన దేజిమాడు రాకుండుదాని॥

కం॥ శ్రీరామచంద్రు డాశ్రిమ । ధారిణిజేరంగ శాపతాపమువాయన్ ।
నారీమణి తనపూర్వా । కారంబున భువనములకు గనబడెమరలన్ ॥

(తి. అ.) అహల్యవలె నేను ఆ రామచంద్రుని పాదస్పర్శను బొందినానా?

# రామానుజుల రహస్య స్వీకారము

శ్రీ. వరమంగయ్యమ్మారావుగారు

తిరుక్కోట్టియూర్ నంబిగారు ఎంబెరుమానార్లను పదునెనిమిది పర్యాయములు మంత్రోపదేశమునకై త్రిప్పిరి. ఎంబెరుమానార్లు అప్పటికే అపారపాండిత్యము గలవారై ఆదర్శప్రాయమగు అనుష్టానమును గలవారలై సన్యాసాశ్రమ స్వీకారము చేసినవారై యుండిరి. ఇట్టి మహనీయుల నిటుల పదునెనిమిది పర్యాయములు మంత్రార్థమునకై త్రిప్పుట న్యాయమా? అనినచో నొక దృష్టాన్యాయమనే చెప్పవచ్చును.

శ్రీ నంబిగారు పదునెనిమిది పర్యాయములు పదునెనిమిది విశేషార్థముల ఎంబెరుమానార్లకు బోధించవలెనను పరమ కృపచే త్రిప్పిరే గాని మరెట్టి లోపము గాని యున్నదను సందేహముచే కాదు. గాన త్రిప్పుటలో తప్పులేదు. ఒక్కొక్క పర్యాయము ఒక్కొక్క అర్థవిశేషమును శ్రీ తిరుక్కోట్టియూరు నంబిగారు సాధించి యుండిరి. అవి యేవియన:—

1 ముముక్షువునకు సంసారబీజమునశించవలయును అది ఎటుల నశించుననగా భార్యపుత్రాదులపట్ల

"పంకా దుత్పద్యతే కీటః।
కీటః పంకం న పశ్యతే।
లోకా దుత్పద్యతే జ్ఞానీ।
జ్ఞానీ లోకం న పశ్యతే॥

మట్టి పురుగు బురదనుండియే పుట్టినను ఆబురద ఆపురుగునకు గిట్టదు అటులనే జ్ఞానియైన వాడు లోకముతో సంబంధము కలవాడే అయినను లౌకికవిషయముల యందు విరాగియై యుండును, ఈవిధముగ సంసారబీజము నశించవలయును.

2 సంసారబీజము నశించిననే తప్ప అహంకార మమకార నివృత్తి కలుగదు. అహంకార, మమకార నివృత్తి ఎటుల కలుగుననగా.

అహంకార మనగా గర్వము. మమకార మనగా మాత్సర్యము,

"అగ్ని ర్వ్యాపకదీపం చ
శైత్యాం గర్వ వివర్జయేత్॥

అగ్నివలన ఉత్పన్నమైన దీపము చల్లనైన గాలిచే ఆరిపోయినటుల అహంకార మమకార నివృత్తి కలుగవలెను.

3 అహంకార మమకారములు నశించిననే తప్ప దేహాభిమానము నశించదు.

4 దేహాభిమానము నశించిననే తప్ప ఆత్మజ్ఞానము జనించదు.

5 ఆత్మజ్ఞానము జనించిననే తప్ప ఐశ్వర్యభోగాదుల విషయమై ఉపేక్షాభావము జనించదు.

6 ఐశ్వర్యభోగాదుల విషయమై ఉపేక్షాభావము జనించిననే తప్ప భగవంతునిపై ప్రేమ జనించదు

7 భగవంతునిపై ప్రేమ జనించిననే తప్ప విషయాంతరముల యందు రుచి వదలదు.

8 విషయాంతరముల యందు రుచి వదలినగాని పారతంత్ర్యము జనించదు.

9 పారతంత్ర్యము జనించినగాని అర్థ, కామ, రాగ ద్వేషాదులు విడువవు.

10 రాగ ద్వేషాదులు నశించిననే గాని శ్రీవైష్ణవత్వము చేజిక్కదు.

11 శ్రీవైష్ణవత్వము సిద్ధించిననేగాని సాత్విక పరిగ్రహము తటస్థించదు.

12 సాత్వికపరిగ్రహము తటస్థించిననేగాని భాగవత పరిగ్రహము కలుగదు.

13 భాగవత పరిగ్రహము కలిగిననే గాని భగవత్పరిగ్రహము సంభవించదు.

14 భగవత్పరిగ్రహము కలిగిననే గాని అనన్య ప్రయోజనుడు కాజాలడు.

15 అనన్యప్రయోజనుడు గాకుండగ అనన్యార్హ శేషభూతుండు కాజాలడు.

16 అనన్యార్హ శేషభూతుండు గాకుండగ అనన్యశరణుడు అగుట కవకాశము లేదు.

17 అనన్యశరణుడు గాకుండగా అధికారపురుషుడు కాజాలడు.

18 అధికారపురుషుడైన వానికి తిరుమంత్రార్థము హస్తగతమగును.

ఈవిధముగ పదునెనిమిది పర్యాయములు ఐంచేసిన ఎంబెరుమానార్లకు పదునెనిమిది రహస్యములను తిరుక్కోట్టియూరు నంబిగారు సాయించిరి.



శ్రీమతే రామానుజాయనమః

# తిరువాయ్ మొళిలో 6 వ పదిలో 7 వ తిరువాయ్ మొళిలో మొదటి పాశుర భావము

శ్రీమతి నంబూరి ఆనందమ్మ గారు

1 ఉణ్ణుమ్ శోఱుపరుకుమ్ నీర్ తిన్నుమ్ వెత్తిలైయుమ్ ఎల్లామ్ కణ్ణన్
2 ఎమ్బెరుమానెన్ఱెన్ఱే కణ్ కళ్ నీర్ మల్కి
3 మణ్ణినుళ్ అవన్ శీర్ వళమ్మిక్కవన్ ఊర్ వినవి తిణ్ణమెన్నిళమాన్
4 పుగుమూర్ - తిరుక్కోళూరే

ఈ పాశురము ఆళ్వారు తాయ్మారవస్థలో పాడిన పాట తినే అన్నము తాగేనీరు వేసుకునే తాంబూలము అన్నీ ఆ కృష్ణ పరమాత్మ అని కంటినీరు పెట్టుకునే నా కుమార్తె ఈ లోకములో కీర్తి గల తిరుక్కోవలూరికి వెళ్ళి పోయి వుంటుంది. ఇది నిశ్చయము అని తల్లి గారి భావనతో సాయించుతూన్న పాశుర తాత్పర్యము.

సరే ఇక ఈ పాశుర భావములలోకి వచ్చి కొంచెము చర్చించు కొందాము. ఈ తిరువాయ్ మొళ్ళి దివ్యప్రబంధము వంటి ఉత్కృష్ట భావములుగల గ్రంథము వేరొకటిలేదని నొక్కిచెప్పుటకు సాహసిస్తున్నాను. ఈ తిరువాయ్ మొళ్ళి ప్రబంధము నొక్క విశిష్టాద్వైత మత సిద్ధాంతమునకే కాదు. ఆస్తికు లందరి ఆదరణకు పాత్రీభూతమయిన దీప్రబంధము. ఈ మహా ప్రబంధములో యే మతమును గాని యే దేవతను గాని నింద నిరసనా లేకుండా శ్రీవైష్ణవ సిద్ధాంతముయొక్క గొప్ప దనమును ప్రకటించారు. సంధిపట్టినవాడు యెంత సేపు తన ధోరణి గాని వీరెరుగునట్లు మన ఆళ్వార్లు యెంతసేపు తమకా పరమాత్మల యందులవుండే ప్రీతి యెడబాటు వలన కలిగే దుఃఖము జీవకారుణ్యాత ఈ గొడవలే గాని మరి అన్యభావన యెరుగకుండా పాడిన పాట ఈ తిరువాయ్ మొళ్ళి గనుకనే భక్తామృతమ్ విశ్వజనానుమోదనమ్ అనే బిరుదు ఈ దివ్యప్రబంధమునకు కలిగినది. అద్వైత ద్వైత భేదము లేకుండా విశ్వములో వుండే అన్ని వర్గముల వారికి ఆనందము కలుగచేసే ప్రబంధమిది. భక్తులకు తొండరడిప్పొడి యాళ్వార్ శొన్నమాలై గళ్ శొన్నేన్ అనునటుల ఆస్తికులకు అమృతరసమువంటి దీతిరువాయ్ మొళి నిజముగా నాకు అద్వైత స్నేహబృందమే ఎక్కువ వారంతా ఆత్మజ్ఞానముల్లో అద్వైత సిద్ధాంతములో నిధులు అటువంటి నా సోదరీమణు లంతా మన శ్రీ నమ్మయ్య శ్రీ సూక్తులు విన్నంత ఆనందము పడిపోయి ఆనందమ్మక్క గారూ (మాకు పురాణములు వద్దు. వినా ఆళ్వారుల శ్రీ సూక్తులే చెప్పండి ఎంత భోగ్యమయిన వుపనిషదర్థములని అంటూవుంటారు. ఈ అధిక ప్రసంగము యెందులకు చేసినానంటే విశ్వజనానుమోదనము అన్నమాటపై జ్ఞాపకము కలిగి మనవి చేసుకుంటున్నాను. సరే అన్నీ బాగున్నాయి గాని అడుగడుగునకూ ఈ నాయికా అవస్థ యేమి ఈ చెలికత్తె అవస్థలేమిటనీ సందేహము అందరికీ కలుగవచ్చు. సమాధానము విపులముగా చెప్పుటకు గ్రంథవిస్తరభీతి. వచ్చే సంచికలో తిరుక్కురుంగుడి విషయము విన్నవించుకొంటాను. అప్పుడు కొంచెము విపులముగా చర్చించు కొందాము. గాని ముఖ్యవిషయమేమంటే ఉప్పొంగి పోతూంది గోదావరి తాను తెప్పన్న ఎగసింది గోదావరి అని, గోదావరి మహానది పొంగుతుంది. గాని పిల్లకాలువలు పొంగవు గదా. (అటులనే సర్వేశ్వరుననుగ్రహముచే మయర్వఱ మతినలమ్ అనునటుల యించుక అయినా భ్రమలేని జ్ఞానభక్తులు వాని నిర్హేతుక కటాక్షముచే పొందిన ఆళ్వార్ల భావములు, తల్లిగానూ చెలికత్తెగాను నాయికగాను పొంగి ప్రవహించక పోతే మన భావములా పొంగేవి. ఇంతకు ఈ తిరువాయ్ మొళి అంతా అన్యాపదేశములు గల గంభీర గ్రంథము. మన ఆళ్వార్లు దివ్యదేశములు పాడినారంటే సాధారణముగా స్థలపురాణములు మొదలయిన వీటిలో ఆ దివ్యక్షేత్ర మహిమలు అచ్చట వుండే నదుల మహిమ, స్వామిమహిమ అచ్చటకు వెళ్ళి సేవించిన వారికి వచ్చేపుణ్యము మొదలైన విషయములు ప్రకటించుతే శ్రీ మన్నమ్మాళ్వార్లు అటులకాదు హిందూలా అంటామ్. అటుల ఈతిరువాయ్ మొళి శ్రీవిశిష్టాద్వైత మతలా అని చెప్పవచ్చు




## శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ ప్రకటన

మదరాసులో జరిగిన ఈసంఘ కార్యకారిణీ సమితి బదరీనారాయణములో జరుప తీర్మానించిన అష్టాక్షరి కోటిహవన క్రతువును గురించి చాలమంది వివరములుగురించి అడుగుచున్నారు, వారికొరకై ఈ ప్రకటన చేయగోరుచున్నాము.

ఈక్రతువు 1954 సంవత్సరము మెయి జూను నెలలలో,

జేష్ట ఆషాఢ మాసములలో ఉత్తర హిందూదేశములో హిమాలయ పర్వతములో యున్న బదరికాశ్రమములో మంత్రరాజమగు శ్రీ మదష్టాక్షరీ మహామంత్రమును చేతనోజ్జీవనార్థమై వెదజల్లుటకై నరనారాయణ రూపేణ అవతరించిన బదరీనారాయణస్వామివారి నుద్దేశించి లోక కల్యాణార్థమై జరుపనిశ్చయింపబడినది.

ఈ క్రతువు అచ్చట నలుబది దినములు జరుపదలంచుచున్నాము. ఈక్రతువునందు శ్రీ మన్నారాయణ భక్తులై తచ్చిహ్నములైన తాప పుండ్రనామ మంత్ర యాగరూప పంచసంస్కార పరులై యోగ్యులైన బ్రాహ్మణులు యిందు ఋత్విక్కులుగ తీసుకొనబడుదురు వీరుక ఎట్టి ప్రతిఫలాపేక్షయు లేనివారై స్వార్థరహితులై, కేవల స్వస్వరూపోజ్జీవనార్థమై మాత్రమే ఈ క్రతువు నందు పాల్గొనవలసినవారలై రాకపోకలతో సహా సుమారు రెండుమాసములు కాలము ఆ హిమవన్నగరమున ఏకదీక్షతో యుండుటకు వలయు మనస్సంకల్పము, తగిన ఆరోగ్యము శక్తిగలవారలై యుండవలయును.

ఈ క్రతువునందు దీక్షవహించ నుత్సాహముగల ఇట్టి వారు ఈసంఘ కార్యాలయమునకు యిపుడే తమయభిప్రాయమును లిఖితరూపముగ తెలుపవచ్చును. ఈక్రతువునందు ప్రధానదీక్షితులుసుమారు 2౫౦ మంది కావలసి యున్నారు.

క్రతునకు ముందుగ యాత్రికుల సౌకర్యార్థమే మదరాసు నుండి ప్రత్యేక రైలును కూడ యేర్పాటు చేయ వలెనను తలంపు కూడ గలదు. వీటన్నింటి యొక్క వివరములు ముందు ముందు యీ పత్రికలో ప్రచురింప బడగలవు.

యీ క్రతువులో ఆర్థిక సహాయ రూపముగ పాల్గొన దలచిన భక్తులందరు యీ క్రింద రూపముగ దీనికి సహాయము చేయవచ్చును.

ఈ క్రతువునందు కోటి పర్యాయములు నేతితో ఆహుతుల నిచ్చుటద్వారా శ్రీమన్నారాయణుని శాంతిలో పూజ ఆరాధించ బడును.

ఈ కోటి ఆహుతులకై సుమారు వెయ్యి డబ్బాల నెయ్యి కావలయును.

సమిధలు, మంచిగంధం చెక్కలు వగైరా క్రతు సంబారములు కావలయును, క్రతుశాంతికై పీఠములు-పుష్పములు తదీయారాధన ద్రవ్యములు కావలయును. ఋత్విక్కులు ధరించుటకై 500 జతల పీతాంబర వస్త్రములు, 250 జతలకై కప్పుకొనదగిన శాలువలు వగైరాలు కావలసి యున్నవి.

పేదవారు, ధనికులు అను భక్తులందరు కూడ యీ మహా పాల్గొనుటకై వీలుగా యుండు నట్లు ఈ క్రింది విధానము నేర్పాటు చేయబడినది.

ఈ క్రతువునకు ఆర్థిక సహాయము చేయు వారందరి గోత్ర నామములు శ్రీ బదరీనారాయణుని సన్నిధిని విన్నవించ బడును.

ఈ క్రతువునందు వొక ఆజ్యాహుతి శాంతి యుక్తముగ జరుగుటకు రూ॥ 0-1-0 అగునని అంచనా వేయబడినది. కాన యీ క్రింది విధముగ ఆర్థికాని సహాయము యేర్పాటు చేయబడినది.

| ఒక ఆజ్యాహుతి తమ గోత్ర నామ విన్నప | | రు. అ. పై. |
|---|---|---|
| ప్రార్థనముగ సమర్పించుటకు. | 1 | 0-1-0 |
| ప్రతిదిన నాలుగు ఆజ్యాహుతులకు. | 24 | 1-8-0 |
| నూట యెనిమిది ఆజ్యాహుతులకు. | 108 | 6-12-0 |
| వెయ్యి యెనిమిది ఆజ్యాహుతులకు. | 1008 | 58-0-0 మరియు ఒక డబ్బా నెయ్యిన్ని. |
| పదివేలు యెనిమిది ఆజ్యాహుతులకు, | 10008 | 501-0-0 మరియుపది డబ్బాల నెయ్యిన్ని. |
| లక్ష యెనిమిది ఆజ్యాహుతులకు. | 100008 | 5001-0-0 మరియు వంద డబ్బాల నెయ్యిన్ని. |
| పది లక్షల ఆజ్యాహుతులకు. | 1000008 | 50001-0-0 మరియు వెయ్యి డబ్బాల నెయ్యిన్ని. |

మరియు ఈ పవిత్ర పుణ్యపు యోగకాల మందు బదరికాశ్రమములోను దానికి పోవు త్రోవలో గల పుణ్యఘట్టముల యందును యాత్రికులు దిగుటకు అనువుగా యుండునటుల అష్టాక్షరి మందిరములను పేరుతో రామానుజ కూటములను (ధర్మశాలలను) నిర్మించి అందు శ్రీ రామానుజుల వారిని ప్రతిష్ఠించ వలెనని తలంచు చున్నాము.

రెండు వేల రూపాయలు సమర్పించువారి పేరున ఈ రామానుజ కూటములో వొక గది నిర్మించ బడును.

ఈ క్రతువునకు ఆర్థికముగను తదితర విధముగను సహాయము చేయదలచువారు ఈ సంఘ ప్రధాన కార్యాలయమునకు పంపవచ్చును.

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘం.
ప్రధాన కార్యాలయము,
107 వరదాముత్తియప్పన్ వీధి,
మదరాసు 1

ఇట్లు
తె. కం. గోపాలాచార్యులు,
ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులు,
కార్యదర్శులు.

N. B:—బదరీ నారాయణస్వామివారి బొమ్మగుర్తుతో గల అచ్చు రశీదు పుచ్చుకొనకుండ క్రతువు నిమిత్తమైనట్టి ధనమునుగాని, వస్తువులగాని యెవరికిఈయకూడదు అనివిజ్ఞప్తి.

## కటన్న

బందరు వాస్తవ్యులు శ్రీ ఉ. వె. శ్రీమాన్ వేదాల రంగా చార్యులు గారి మనుమడగు చిరంజీవి వేదాల కణ్ణను యొక్క జన్మదినోత్సవమున అతని తల్లిగారు ఈ పత్రికకు రూ॥ 2_0_0 లుకట్నమును సమర్పించిరి. ఈచిరంజీవికిశ్రియఃపతి ఆయురారోగ్యభాగ్యముల కృపజేయుగాక.

## శుక్రివార పూజలు.

అయినపర్రు ప॥ గోదావరిజిల్లా

కర్రిరామిరెడ్డి భార్య సూరమ్మ

కొప్పనాటి సూర్యరావు భార్య రేణుక

అల్లము పురుషోత్తము భార్య లక్ష్మీకాంతము

ఈ భక్తురాండ్రు శుక్రివార పూజలు మహోన్నైభవముగా జరిపించినారు.

ఏలేటిపాడు ప॥ గో॥ జిల్లా

గుడిమెట్ల రామిరెడ్డి భార్య సుబ్బయ్యమ్మ

బిబ్బిళ్ళసీతాయమ్మ

ద్వారంపూడి వేమనరెడ్డి భార్య సీతమ్మ

కట్టా వెంకన్న భార్య నరసమ్మ

నల్లమిల్లి తాతారెడ్డి భార్యసుబ్బయమ్మ

తానంపూడి సుబ్బన్న భార్య బుల్లి

సత్తి రాముడ్డి భార్య పద్దయ్యమ్మ

యలమర్తి శ్రీరాములుగారి భార్యకామాక్షమ్మ

తురగాసూర్యభగవానులుగారిభార్య సుబ్బలక్ష్మి

మొదలైన భక్తురాండ్రితోటి భాద్రిపద మాసంలోను అశ్వయుజ మాసంలోను వారి వారి గృహముల యందు పత్రి శుక్రివారం పూజలు భజనలు వగైరాలు జేరిపించిరి గాన వీర్లందరకు ఆ శ్రీమన్నారాయణ మూర్తి ఆయురారోగ్య అయిశ్వైర్యములు యిచ్చి రక్షించుగాక,

అర్థమూరు

| | |
|---|---|
| కోనాల పనరాజు భార్య సత్తిరాజు | 0-4-3 |
| మండ అప్పలరాజు భార్య వెంకమ్మ | 0-4-3 |
| కొప్పూర్వారి సత్యం భార్య సత్యవతి | 0-4-3 |
| నల్లమిల్లి సుబ్బయ్యభార్య సుబ్బయ్యమ్మ | 0_4_3 |
| కొప్పూర్వారి భాలిరెడ్డి భార్యవీరమ్మ | 0-4-3 |
| తాడి వెంకన్న భార్య గంగమ్మ | 0-4-3 |
| నాగిరెడ్డి వెంకటేశ్వర్లుభార్యపాపయ్యమ్మ | 0-4-3 |
| సత్తి గనిరెడ్డి భార్య చంటెమ్మ | 0-4-3 |
| కోనాల సుబ్బన్న భార్య మహాలక్ష్మి | 0_4_3 |
| చిర్ల రామచంద్రిరెడ్డి భార్య తులసమ్మ | 0-4-3 |
| మబ్బా గంగరాజు భార్య అచ్చయ్యమ్మ | 0_4_3 |
| నల్లిమిల్లి వెంకటరెడ్డి భార్యకాంతమ్మ | 0-4-3 |
| చిర్ల ఈశ్వరుడు భార్య వీరమ్మ | 0-4-3 |



# శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ మాఘమాస పండిత పరిషత్సభలు

పాలకొల్లు పశ్చిమగోదావరి

స్వస్తిశ్రీ ఖరనామ సంవత్సర మాఘ బహుళ షష్ఠి ఆదివారము (ది17-2-52) తేదీ లగాయితు వరుసగ మూడుదినములు పశ్చిమగోదావరిజిల్లా పాలకొల్లు పట్టణమున అష్టభుజ లక్ష్మీనృసింహస్వామివారి సన్నిధిని (చిన్నగోపురము) శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ మాఘమాస పండిత పరిషత్సభలు చీరాల వాస్తవ్యులగు శ్రీ. ఉ. వే. శ్రీమాన్ అనంత తిరుమల సమయోద్యోత కోలాహల లక్ష్మీనృసింహ కుమార తిరువేంగళ తాత దేశికాచార్యులయ్యవార్లంగారి అధ్యక్షత క్రింద జరుపుటకు నిర్ణయించబడినది. ప్రతిదినము ఉదయమున గం7-30 మొదలు గం 10-30 వరకున్ను; సాయంకాలము గం 4-0 మొదలు గం 7-0 వరకున్ను; పండితులచే వేదాంత సభలున్ను;

ప్రతిదినము మధ్యాహ్నము గం 2-0 మొదలు గం 4-0 వరకున్ను స్త్రీలకు మాత్రము ప్రత్యేకము విదుషీమణులచే వేదాంతోపన్యాసములు జరుగును.

గాన భక్తులందరు యిందు పాల్గొన గోరుచున్నాము.

ఇట్లు

ఆహ్వానసంఘము :-

అధ్యక్షులు:- రేపాక శేషావతారం. కార్యదర్శి:- రేపాకం [illegible]గయ్య.

సహాయకార్యదర్శి:- మోటిమఱ్ఱి సుబ్బారావు.

కార్యనిర్వాహక సభ్యులు:-

అరవిల్లి అళహశింగరాచార్యులుగారు

చెక్కా వెంకటరత్నం,

మాచేపల్లి వెంకటరత్నము,

సింహాద్రి సత్యనారాయణమూర్తి;

కంతేటి సీతారామబ్రహ్మము,

నలాది వెంకటరత్నము.

ఇమ్మిడి సత్యనారాయణ.

రేపాక రామలింగయ్య.

రేపాక వెంకటరత్నం.

చెక్కా రంగనాయకులు. బంగారు రాఘవయ్య.

త్యవటపల్లి వెంకటరామానుజయ్య, పోకల భవనారాయణ.

పినిశెట్టి చినవెంకటేశ్వరరావు, గున్నం మంగయ్యనాయుడు.

శ్రీమతే రామానుజాయనమః

# శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ ద్వాదశ వార్షిక విరాట్ సమావేశ

## ఆహ్వానపత్రిక (పాలకొల్లు పశ్చిమగోదావరిజిల్లా)

స్వస్తిశ్రీ ఖరనామసంవత్సర మాఘ బహుళ ఆదివారము (17-2-52) తేదీ లగాయతు వరుసగ మూడుదినములు ప్రతిదినము మధ్యాహ్నము గం 2-0 లగాయతు 4-0 గం వరకు శ్రీ విశిష్టాద్వైతప్రచారక సంఘ ద్వాదశ వార్షిక విరాట్ సమావేశము శ్రీ ఉ. వే. శ్రీమాన్ అస్థంకి తిరుమల సమయోద్దండ కోలాహల లక్ష్మీనృసింహ కుమార తిరువేంగళ తాతదేశికాచార్యులయ్యవార్లం గారి అధ్యక్షతక్రింద పశ్చిమగోదావరిజిల్లాలోని పాలకొల్లు గ్రామమున శ్రీ అష్టభుజ లక్ష్మీనృసింహస్వామివారి సన్నిధి యందు జరుగును. గాన ఈ సంఘసభ్యులు అభిమానులు అందరు యిందు పాల్గొన గోరుచున్నాము.

శ్రీ పరాశరసుదర్శనభట్టరుఅయ్యవార్లంగారు.
శ్రీ. వి. ప్ర. సం. అధ్యక్షులు.

శ్రీ. వి, సంఘకార్యదర్శులు
తె. కం, గోపాలాచార్యులుగారు.
ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులుగారు.

# శ్రీ విశిష్టాద్వైత ప్రచార శాశ్వతనిధి

శ్రీవిశిష్టాద్వైత ప్రచారము విరివిగను శాశ్వతముగాను జరుగునిమిత్తమై ప్రతి శ్రీ విశిష్టాద్వైత సిద్ధాంతాభిమానియు తమకు వచ్చువార్షికనికరాదాయములో రూపాయి ఒక్కంటికి ఒక పైస చొప్పున "శ్రీవిశిష్టాద్వైత ప్రచారశాశ్వత నిధి" కి విరాళమును సమర్పించ వలసినదిగ కోరియున్నాము. మా ఈవిజ్ఞప్తిని మన్నించి ఈక్రింద తెలుపబడిన మహాశయులు వాగ్దానములు చేయుటేగాక తాముసమర్పించవలసిన విరాళమును పంపియున్నారు. వారికి యిందుమూలముగా మాహృదయ పూర్వక కృతజ్ఞతను తెలుపుచున్నాము. శ్రియఃపతి వీరికి సకలశ్రేయస్సుల చేకూర్ప ప్రార్థించు చున్నాము. సంవత్సరమువక్కంటికి

శ్రీ. ఉ. వే, శ్రీమాన్

| | |
|---|---|
| శ్రీ పరాశర సుదర్శనభట్టరుఅయ్యవార్లంగారు. (కోరుకొండ) | 25-0-0 |
| శ్రీమతి శ్రీ. సూ, శ్రీవరతుంగయ్యమ్మారావుగారు. (మైలవరము) | 31-1-8 |
| తె. కం. రంగరామానుజాచార్యులుగారు. (కోరుకొండ) | 25-0-0 |
| డా, ఆ, చి. కృష్ణమాచార్యులుగారు. (మదరాసు) | 25-0-0 |

మరియు ఈపత్రికలో ఈనిధికి తోడ్పడదలచిన వారు చేయువాగ్దానపత్రములు తమకు పంపబడుచున్నది. దయయుంచి తాముస్వయముగ ఆపత్రమున తమవాగ్దానముతో పూర్తిచేసియు తమ బంధుమిత్రులచే పూర్తిచేయించియు, ఆయావాగ్దానముల ఈసంఘ కార్యాలయమునకు పంపియు ఈనిధికిన్ని తద్వారా శ్రీవిశిష్టాద్వైత సిద్ధాంత ప్రచారమునకు తోడ్పడ ప్రార్థించుచున్నాము.

ఇట్లు

శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘము,
107 వరదాముత్తియప్పన్ వీధి మదరాసు1

రిజష్టరు నెం. 5049

# భక్తి నివేదన

(వేదాంత మాసపత్రిక)

—★—

ఇందు వేదాంత విషయ రాజములున్ను, భక్తి ప్రచార విషయమైన వర్తలును వేదాంత సాంప్రదాయ విషయకమైన ప్రశ్నోత్తరములున్ను ప్రచురించబడును.

చందాలు;

సాధారణ చందా సం. ర 1కి రు. 5-0-0

సహాయ చందా ,, రు. 10-0-0

## ఏకాదశి పూజలు.

వెలగల సుబ్బిరెడ్డి భార్య కాంతమ్మ
సత్తి వెంకటరెడ్డి భార్య మీనాక్షమ్మ
వెలగల సత్తిరెడ్డి భార్య మంగయమ్మ

మొదలైన భక్తురాండ్రుతోటి పూజలు భజనలు కీర్తనలు అన్నియును అతి వైభవముగా జరిపించిరి గాన వారికి శ్రీమన్నారాయణమూర్తి ఆయురారోగ్య ఐశ్వర్యములు యిచ్చి రక్షించుగాక.

| | |
|---|---|
| కొప్పిరెడ్డి వీరన్న భార్య భూషణమ్మ | 0-4-3 |
| చిర్ల వెంకన్న భార్య సుబ్బయ్యమ్మ | 0-4-3 |
| పోకంశెట్టి వెంకన్న భార్య మహాలక్ష్మి | 0-4-3 |
| చిర్ల రెడ్డి భార్య మంగయ్యమ్మ | 0-4-3 |
| కర్రి రామిరెడ్డి భార్య మాణిక్యం | 0-4-8 |

1. శ్రీమన్నారాయణుడే సృష్టి - స్థితి - లయ కారకుడు.
2. ఆయనే మోక్షప్రదాత.
3. ఆయనే పరతత్వము-పరమాత్మ.
4. ఆయన అఖిలహేయ ప్రత్యనీక కల్యాణ గుణకుడు.
5. ఆయనకు జీవుడు శరీరభూతుడు; శేషభూతుడు, పరతంత్రుడు, నియామ్యుడు; అనుభావ్యుడు.
6. జీవులు జ్ఞానైకాకారులు.
7. జీవులు అనంతములు.
8. జీవులు పరమాత్మకంటె భిన్నులు; ఈ భేదము సత్యమైనది; నిత్యమైనది.
9. జీవ-పరమాత్ములకు ప్రకృతి శరీరభూతమైనది; శేషభూతమైనది; పరతంత్రమైనది; నియామ్యమైనది; అనుభావ్యమైనది.
10. ప్రకృతి వికారాస్పదమైనది. జీవపరమాత్మలకంటె భిన్నమైనది. ఈ భేదము సత్యమైనది; నిత్యమైనది.
11. జీవుడు ప్రకృతి వియుక్తుడై పునరావృత్తి రహితమైన పరమాత్మ సాన్నిధ్యమగు పరమపదమును పొందుటయే మోక్షము.
12. భక్తి ఒక్కటియే మోక్షసాధనము.
13. భక్తియన తైలధారవలె అవిచ్ఛిన్నమైన స్మృతి పరంపర.
14. వివేక-విమోక-అభ్యాస-క్రియా-కల్యాణ అనవసాద-అనుద్ధర్షలు భక్త్యంగములు.
15. ఇవి సదాచార్య-సమాశ్రయణ-లభ్యములు
16. జగద్గురువగు శ్రీ రామానుజాచార్యులు వారును; వారి యనుయాయులున్ను సదాచారులు-

"నగురుర్వైష్ణవాత్ పరః" భా. సం.

Edited Printed & Published by A. Ch. Srimannarayanacharya at Sriman Press, Kakinada. E.G. Dt



శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము

107, వరదా ముత్తియప్పన్‌వీధి, మదరాసు -1



## శ్రీ విశిష్టాద్వైత ప్రచార శాశ్వతనిధి వాగ్దాన పత్రము.

ది. 12-12-1951 తేదీన మదరాసులోని సంఘకార్యాలయమున శ్రీ ఉ. వే. శ్రీమాన్ శ్రీపరాశర సుదర్శన భట్టరు అయ్యవార్లంగారి అధ్యక్షత క్రింద సమావేశమైన శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ కేంద్ర కార్యకారణీ సమితి జేసిన నాల్గవ తీర్మానము.

"శ్రీవిశిష్టాద్వైత సిద్ధాంత ప్రచారము విరివిగా జరుగుటకు స్థిరమగు ఆర్థికావకాశము కల్పించుట అత్యంతావశ్యకము. ఇందు ప్రచారమున కవలంభింపవలసిన విధానములు:—

1. ముఖ్యముగ విద్యాప్రచారము జరుగవలసియున్నది. ఇవి శ్రీభాష్య-భగవద్విషయ-వేద-స్మార్తములలో పండిత పరీక్షల నేర్పరచి అందు త్తీర్ణులైన యోగ్యులగు పండితులందరకు జీవితాంతము వరకు సన్మానమును చేయుచుండుట.

2. ప్రచారకులను తయారుచేయు శిక్షణాలయములను నడుపుచుండుట.

3. వేదాంత విద్య నభ్యసించు విద్యార్థులకున్ను, అభ్యసింపజేయు పండితులకున్ను తగు ఆర్థిక సహాయమును చేయుచుండుట.

4. పత్రికా ప్రచురణ; పుస్తక ప్రచురణ; విరివిగా జరుపుట మొదలగునవి.

ఇందులకై "శ్రీవిశిష్టాద్వైత ప్రచార శాశ్వతనిధి" అనుపేరున ఒక శాశ్వత నిధిని ప్రారంభించవలెననియు దానికై ప్రతి శ్రీవిశిష్టాద్వైత సిద్ధాంతాభిమానియు తన నికర ఆదాయములో సంవత్సరమునకు రూపాయకు ఒక్క దమ్మిడీ చొప్పున ఈనిధికి శాశ్వతముగ విరాళమును సమర్పించు చుండవలసినదిగ కోరుచు తీర్మానించడమైనది. ఈనిధి కేవలము శ్రీభగవద్రామానుజులవారు సిద్ధాంతీకరించి ప్రచారము జేసిన శ్రీవిశిష్టాద్వైత సిద్ధాంత ప్రచారమునకై మాత్రమే వినియోగించవలయును".

### వాగ్దానము

పై తీర్మానమును నేను అంగీకరించుచు నేను నావార్షిక నికరాదాయము ననుసరించి సంవత్సరము (మాసము) ఒక్కంటికి రూ          అక్షరాల          చొ॥ శ్రీవిశిష్టాద్వైత ప్రచార శాశ్వతనిధికి విరాళమును శాశ్వతముగ సమర్పించు చుండుటకు వాగ్దానమును జేయుచున్నాను.

సంతకము.

పేరు

చిరునామా          గ్రామము          పోస్టు          తాలూకా          జిల్లా

విరాళమును సమర్పించు కాలవివరము.



శ్రీమతే రామానుజాయ నమః


భక్తి

# నివేదన

వేదాంత మాసపత్రిక

| సంపుటి 3 | ఖర పుష్యం | సంచిక ౧౦ |
|---|---|---|


## రామాయణంలో భ్రాతృప్రేమ

వాల్మీకి రామాయణము ఆదికావ్యమే గాక గొప్ప ఇతిహాసమున్ను, ఆధ్యాత్మికగ్రంథమున్ను. ఇందలిపాత్రలజీవిత, ప్రవృత్తులు ఆదర్శ రూపములు. సీతాదేవి ఆదర్శ పతివ్రత. శ్రీరాముడు ఆదర్శ పురుషుడే గాక, ప్రజానురంజనకై అద్భుత త్యాగ మొనర్చెను. ఇట్లే రామాయణములో భ్రాతృప్రేమయు, ఆదర్శరూపముగ చిత్రింపబడినది. రామలక్ష్మణ భరత శత్రుఘ్నుల అన్యోన్యత, ప్రేమభావమున్ను, ఎల్లరకు ఆదర్శ రూపములు, అన్నదమ్ముల మధ్య మైత్రియు. ప్రేమయు బలీయముగనుండుట సహజముగదా! ఇంద్రాధిక్యతకు తావెక్కడ, అని అందురేమో!

జ్ఞాతివైరము సోదరులలోను రాజసూను[illegible] పరస్పర విధ్వంసమునకు కారణము కావచ్చు. వాలి సుగ్రీవుల విరోధమువల్లనే వాలిని వధించునట్లు సుగ్రీవుడు శ్రీరాముని ప్రేరేపించెను. ఇట్లే రావణుడు తన్ను దూషించి వెడలగొట్టి[illegible]నందుననే విభీషణుడు, శ్రీరాముని ప్రాపుకోరెను. ఇంటిగుట్టు లంకకు చేటయినది, లంకాయుద్ధములో శ్రీరామపక్షపు విజయమునకు విభీషణుని సలహా మిక్కిలి తోడ్పడెను. తదనంతరము మనచరిత్రలో రాజకుటుంబములలో సోదరుల మధ్య కలహముల వలన చాల హత్యలు, యుద్ధములు జరిగి అనర్థములు కలుగుచు వచ్చినట్లు చరిత్రకారులవలన విదితము. కనుక రామలక్ష్మణాదుల భ్రాతృప్రేమనుండి నేర్చుకొనవలసిన అంశములనేకములు.

రామలక్ష్మణుల అన్యోన్యత విశిష్టము. భిన్నోదరులైనను లక్ష్మణుడు బాల్యమందును, పిమ్మట 14 యేండ్లను రామునితో కలసి వనవాసము చేయుటయేగాక నిద్రాహారములనుకూడ వదలి సదా సీతారాముల కాపాడుచుండెను. రామానుజ పదము ఆయనకే యుక్తమైనది! కైకేయీ వరమందు చేరకున్నను లక్ష్మణుడు రామసాన్నిధ్యముకై తనంతట వనవాస కష్టమనుభవించెను. రామునికి లక్ష్మణునిపై నుండిన ప్రేమయు అప్రతిమానము. లక్ష్మణునివంటి సోదరభావముగల భ్రాత లభింపదని శ్రీరాముడును రామాయణములో పలుమారులు పేర్కొనెను. రామ లక్ష్మణులవలె భరత శత్రుఘ్నుల మధ్యను అవినాభావపు సోదరప్రేమ యుండెను. [illegible]త్రమ్యు. [illegible] లక్ష్మణుల ప్రేమ అతి[illegible]షమే కాని వ్య[illegible]తము. నిరంతర సహవాసములో వృద్ధియైనది. భరతుడు అట్లుకాక తరుచు శ్రీ[illegible] [illegible] వసించెను, దూ[illegible] [illegible]గమనము కానెరుడు. అతనికై రాజ్యకిరీటము, సింహాసనము వేచియుండెను. దశరథ వర[illegible] నదియు జేరినదేకదా! కాని ఆయనతల్లిని నిరసించి రాజ్యము శ్రీరామునికే కట్టబెట్టుటకు గురు, బంధు జనులతోను సేనతోను వెళ్ళి శ్రీరాముని ప్రార్థించి అందుకై ప్రాయోపవేశమును జేయబూనెను మరియు తండ్రి యాజ్ఞపై ఒక పుత్రుడడవికి వెళ్ళవలెను గదా యనిన తానే అడవికిపోయి 14 యేండ్లు యుందుననియు భరతుడు కోరెను. ఇందునను భరతుని అపారప్రేమ స్పష్టము. కాని అది కైకేయీ వరములకును పితృవాక్య పాలనకును విరుద్ధములు. కనుక తుదకు రామాజ్ఞను [illegible]రించి భరతుడే రాజ్యభారము వహించెను. అయితే దానినొక "సన్యాసము"గ అనగా మహాన్యాసపు ధర్మకర్తృత్వముగా నెంచి శ్రీరామ పాదుకలు శిరసావహించి నందిగ్రామములో మునివేషధారిగ నుండుచునే పాలన సాగించుచు గడువు తీరినవెంటనే రామునికి రాజ్యపాలనము నొప్పగించెను. వాస్తవముగ రాజ్యపాలనమొక మహాభారమె. జనులందరి క్షేమపు బాధ్యతను రాజు వహించవలె. వనవాసమునను తనయొక్కని దేహమునే, యొకప్పుడు భారమువోలె కైకేయి తనయెడ పక్షపాతమును చూపెనని రా

యథార్థమునకు రాముడు సామాన్యపు భ్రాతృప్రేమతో తృప్తినొందక దక్షిణపు దండకాది మహాటవులందు దుష్టరాక్షసుల దౌర్జన్యము నణచి ఆప్రాంతమునను వాసయోగ్యంగా చేసి శాంతజీవనులగు ఋష్యాదులపై నపార ప్రేమ జూపెను. నిషాదుడైనను గుహుని తన ఆత్మ సఖునిగ జేసుకొని భ్రాతృభావము జూపెను, అంతట నాగరక కుటుంబములు వేలకొలదిగ దక్షిణ ప్రాంతమును వ్యాపించెను. భారతీయ నాగరికత ఉన్నత స్థాయిని జెందెను, జనులందరకు సౌఖ్య సంపదలు హెచ్చినవి, ఆర్య, వానర, రాక్షస జాతులు మూడును రామ సుగ్రీవ విభీషణుల మైత్రిద్వారా భ్రాతృప్రేమ నలవరచుకొన్నవి. భ్రాతృప్రేమ సోదరుల మధ్యనే నిల్చిపోక పౌరులందరిపైనను రాజుకు భ్రాతృప్రేమ యుండవలెనని శ్రీమద్రామాయణంలో నివాసితమైన సీతాదేవి శ్రీరామునికిచ్చిన అమూల్యోపదేశమునందు వ్యక్తముచేయబడినది. పౌరులందరియందును భ్రాతృభావము వహించుటే రాజుయొక్క పరమ ధర్మం వానివల్లనేమంచికీర్తియు కలుగునని శ్రీరామునికి సీతావచనపుమిషతో వాల్మీకిమహర్షి రాజవంశములన్నియు అనుసరించునట్లు లోకక్షేమము నిచ్చు మహోత్తమమైన సందేశము నిచ్చెనని మనము భావింపవచ్చును. ఆ యుపదేశము యీనాటి ప్రజాస్వామికపువిధానమునకును వర్తించును.

శ్రీమతే రామానుజాయ నమః

# ఢిల్లీ నుంచి సంపత్కుమారుని తెచ్చిన విషయము

విద్యారణ్య పంచానన, విద్యా వాచస్పతి, శ్రీమాన్ వికాల్రి రామచంద్రాచార్యులుగారు

## ఢిల్లీనుంచి సంపత్కుమారుని తెచ్చిన విషయములో గ్రంథభేదములు

1. దివ్యసూరి చరితములో (సంస్కృతము) కల్యాణ సరస్తీరమున పుట్టించినారు
2. గురుపరంపరా ప్రభావములో మూలవర్ ప్రతిష్ట చేసి వుత్సవర్ లేదనుచింతతో నున్న రామానుజులకు స్వప్నములో నావుత్సవ బేరము ఢిల్లీలో తురకరాజు యింట వున్నదని చెప్పగా ఢిల్లీకి పోయి తెచ్చినట్లున్నది. బీబీనాంచారు వచ్చినట్లులేదు.
3. ప్రపన్నామృతములో (సంస్కృతము) తిరునారాయణుని వుత్సవబేరమును ఢిల్లీలో రాజు తన కూతురుతో కూడ పల్లకీలో కూర్చుండబెట్టి రామానుజున కిచ్చెను. అంతట దోవలో ఆమె విష్ణువులో అంతర్ధానము నొందెను. ఢిల్లీశపుత్రుడు కబీరు వచ్చి జ్ఞాని అయ్యెను అని యున్నది.
4. పెరియతిరుమడి యడవులో సుల్తాను గృహము నుండి శెల్వప్పిళ్ళను తెచ్చిరి.

5. పరమ యోగి విలాసములో తిరునారాయణుని సేవించి వుత్సవ బేరమును ప్రతిష్ఠించి రనివున్నది.

6. ఆచార్యసూక్తి ముక్తావళిలో ఢిల్లీలో రామానుజులకు రామప్రియుని ఢిల్లీను డిచ్చి కూతుర్ని యిచ్చి వివాహము చేసి కుమారుని కూడ నిచ్చి పల్లకీతో పంపెను.

తండ్రి కుమార్తె సంవాద మెక్కువగ గలదు.

వతగల గ్రంథములు

1. ఆంధ్ర ప్రూర్ణ విరచిత యతిరాజ వైభవమున (సంస్కృతము)
ఢిల్లీ రాజు కూతురి యింటనున్న రామప్రియుని తీసుకుని వచ్చెను,
ఢిల్లీ రాజు కూతురు అంతర్ధానము నొందెను.అని వున్నది.
ఆలయ చండాల ప్రవేశము చెప్పలేదు.

2. తృతీయ బ్రహ్మతంత్ర స్వతంత్ర స్వామిరచిత మువ్వాయిరప్పడి గురుపరంపరలో
ఢిల్లీ రాజు కూతురు వద్దనున్న రామప్రియుని తీసుకుని వస్తూవుండగా విగ్రహమును కుమార్తె కోరకు తెమ్మని భటులను పంపగా వారి యుపద్రవమును తప్పించుకొనుటకు అచటవున్న చండాలుల సహాయమును కోరగా వారికి బహుమానముగ ఆలయప్రవేశము నిచ్చిరని గలదు.



## కృష్ణార్జున సంవాదము.

శ్రీ ఉ. వే. శ్రీమాన్
తె. కం. గోపాలాచార్యులుగారు.

శ్లో॥ శాన్తాకారం భుజగశయనం పద్మనాభం సురేశం.
విశ్వాకారం గగన సదృశం మేఘవర్ణం శుభాంగం।
లక్ష్మీకాంతం కమలనయనం యోగిహృద్ధ్యాన గమ్యం।
వందే విష్ణుం భవభయహారం సర్వలోకైకనాథమ్॥

(అనిచదువబడి తెరఎత్త బడును)

క్షీరసముద్రమున శ్రీ భూ దేవులు పాదసంవాహనము గావించు చుండశ్రీమన్నారాయణుడు శేషతల్పమునందు శయనించి లక్ష్మీదేవితో మాట్లాడు చుండును.

లక్ష్మి:- నాథా! మీరనేక యవతారము లెత్తి భూమండలమున పుట్టుచుంటిరి గదా! ఆ పుట్టుక అసత్యమా? జీవులకు వలె సత్యమా?

నారా:- సత్యమే! అందుకు సందేహమేల? నాకితరజీవులకు వలె అనేక జన్మలు గడచినవి. అవి యన్నియు సత్యములే గాని యసత్యములు గావు. వాటినన్నిటిని నేనెఱుంగుదును. ఇతరులు గతించిన [illegible] జన్మల నెఱుంగరు. అదియే నాకు గలవిశేషము.

లక్ష్మి:- సత్యమైనచో చేతనులవలె మీ పారమేశ్వర స్వభావమును విడిచి పుట్టుదురా? లేక నా నితోనే పుట్టుదురా?

నారా:- నా పారమేశ్వరమగు నజత్వ అవయత్వ సర్వేశ్వరత్వాది సమస్త స్వభావములను విడువకయే పుట్టుదును.

లక్ష్మి:- అయిన నా జన్మమున మీశరీరము జీవులశరీరము వలె ప్రాకృతమా? అప్రాకృతమా?

నారా:- పద్మపుత్రీ! ఏమియెఱుంగనట్లడుచున్నావు? నేను నా యసాధారణమగు అప్రాకృతదివ్యమంగళ విగ్రహమును ఆయాదేవమనుష్యాది జాతులకు సజాతీయమైన అవయవములు కలదానినిగా జేసుకొని దానియందు ప్రవేశింతును.

లక్ష్మి:- నాథా! జీవులకు వలె మీరును ఆజన్మకు కారణముగా పుణ్యాపాపములను కట్టించుకొందురా? లేకమీసంకల్ప మాత్రము చేతనే పుట్టుదురా?

నారా:- పద్మా! నాయవతారమునకు నాసంకల్పము తప్ప వేరొక కారణమును నేనపేక్షించను. తెలిసినదా?

లక్ష్మి:- స్వామీ! మీరట్లవతరించుట సామాన్య చేతనులవలె మీపుణ్యాపాపములు పక్వములగు కాలమునందా? లేక ధర్మమునకు గ్లానికలుగు గాలమునందా?

నారా:- (నవ్వుచు) లక్ష్మీ! నాకు కొన్నిపుణ్యాపాపములను కూడ తెచ్చిపెట్టకుము.

యదా యదాహి ధర్మస్యగ్లానిర్భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య తదాఽత్మానం సృజామ్యహం॥

నాజన్మమునకు కాలనియమము లేదు. ఎప్పుడువర్ణాశ్రమ ధర్మములకు హానియు, అధర్మమునకు వృద్ధియు గలుగునో అప్పుడెల్లను నాసంకల్పముచే నవతరించుదును.

లక్ష్మి:- నాథా! మీ యవతార మితర జీవులకువలె సుఖ దుఃఖాదు లనుభవించుటకా? లేక సాధు పరిత్రాణమునకా?

నారా:- (గట్టిగా నవ్వుచు) పిచ్చిదానా! సుఖ దుఃఖములకు నిమిత్తము పుణ్య పాపములే, అవి నాకు లేవని చెప్పి యుంటిని గదా! ఇక నీ ప్రశ్న కర్థమేమి? నాయవతార వాస్తవ ప్రయోజనమును చెప్పెద వినుము.

పరిత్రాణాయ సాధూనాం । వినాశాయచ దుష్కృతాం ।
ధర్మసంస్థాపనార్థాయ । సంభవామి యుగేయుగే ॥

వేదోక్తములగు వర్ణాశ్రమ ధర్మాచరణ శీలముగా కలిగి సన్నాశ్రయింప బూనిన నా దర్శనము లేక క్షణ మాత్ర కాలమును అనేక కల్పములుగా నెన్నుచు దుఃఖవశమున మిక్కిలి శిథిల గాత్రులగుదురని తలంచి యట్టి వారికి ఆరాధించుటకు తగిన నానాకారమును జూపియు, మనోహరములైన నాచేష్టలచే చొక్కించియు, దయతో కూడిన చూపులతో తనిపియు, ఇంపుగా భాషించి యుజ్జీవించియు రక్షించుటకును, వారిని బాధించు దుష్టులను శిక్షించుటకును, నా యారాధన రూపమైన వైదిక ధర్మము క్షీణింపగా నారాధింపదగిన నాదివ్యమంగళ విగ్రహమును జూపుటచే మరల నాధర్మమును చక్కగ స్థాపించుట కొఱకును, దేవ మనుష్యాది రూపములతో ఏ యుగమునందైనను అవతరించు చుందును, నా యవతారమునకు యుగ విశేషనియమము లేదు.

లక్ష్మి:- అయినచో మీకు ద్వాపర యుగమున నట్టి ప్రయాణావసరమేమైన కలదా ?

నారా:- ఆ. ఆ. లేకేమి, త్రేతాయుగమున నేను రామావతారముతో నడవిలో నుండగా ఋషులందఱును నా యద్భుతాకృతి దివ్య శరీరాకారమును గాంచి భక్తి పారవశ్యమున మోహించి నా యాలింగనము నపేక్షించిరి. అప్పుడు వారికి, 'నేను ద్వాపరయుగమున శ్రీకృష్ణునిగా నవతరింతును. మీరా తరుణమున గోపికలుగా బుట్టి మీ కోరిక తీర్చుకొన వచ్చునని' యభయ మొసంగి యుంటిని.

చం॥ మరియొక మాట దేవి ! వినుమా ! శిశుపాలుడు దంతవక్త్రుడుం
ద్వరు ! మన ద్వారపాలకులు ! మున్ను సనందులు శాపమీయ ! నీ
కరణి జనించిరా ! ఇదియె కాగల కార్యము ! నేటి జన్మతో,
నరియగు వారి శాపములు ! సత్కృపతో నిక నుద్ధరించెదన్ ॥

ఇదియును గాక-మొన్ననే మన నారదుడు భూమియందు రాక్షసులు పెక్కురు రాజవేషముతో వృద్ధి జెందుచు సాధుజనుల మిక్కుటముగ హింసించు చున్నారని చెప్పి యున్నాడు. వారి రక్షణ భారము నాదేగదా ! (ఏదియో వినునట్లభినయించి) అదిగో, ఎవ్వరో తీరమునందుండి నన్ను పురుష సూక్తములతో స్తుతించు చున్నారు. వీరెవరై యుందురు. (లేచి బాగుగా జూచి) గోరూపమును ధరించిన భూదేవిని వెంటబెట్టుకొని రుద్రేంద్రాది దేవ ప్రముఖులతో విచ్చేసిన మన జ్యేష్ఠపుత్రుడగు బ్రహ్మదేవుడు-బిడ్డా ! స్వాగతము, నీవు వచ్చిన పనియేమి.

బ్రహ్మ:-

క్షీరసాగర తరంగశీకరాసార తారకిత చారుమూర్తయే
భోగి భోగ శయనీయశాయినే మాధవాయ మధువిద్విషే నమః ॥
(అని సాష్టాంగ ప్రణామ మాచరించును)

స్వామీ! నీవెఱుంగని దేమున్నది? నీవు శ్రీరామావతారమున గావించిన ప్రతిజ్ఞను సఫలపరతువని నాతో ఋషీశ్వరు లందరును వ్రేపల్లెలో గోపికలై జన్మించి నీయవతారమునకై తహ తహ లాడుచున్నారు.

మ॥ ఇదిగో చూడుము భూమిదేవి! యిదిగో
యీ మాత గోమాతగా!
కదిలెన్ నీకడ! కేల్మోడ్చుచున్నదిదిగో!
కన్నీరు మున్నీరుగా!
హృదయం బెంత తపించుచున్నదో గదా!
యీ దుష్టులన్ మోయలే!
కదిరా! మాధవ! వీడుమింకఫణి!
పర్యంకంబు క్షీరాంబుధిన్॥

సాధుజనులు తమయజ్ఞయాగాది క్రియలకు స్వస్తి చెప్పి ప్రచ్ఛన్నముగా నీ యవతారమునకై తపంబొనరించుచున్నారు. ధర్మములన్నియు మంట గలసినవి. ఇక నీవుపేక్షింపగదని మనవి జేసుకొనుటకై యీ దేవబృందముతో నీ దర్శనమున కేతెంచితిని. పిమ్మట నీ చిత్తము.

[illegible]రా— చతుర్ముఖా! నాపనికై నీవింతగా చెప్పవలెనా? దేవకీ వసుదేవులును నందయశోదలును నన్ను బిడ్డగా గోరియు నా లీలారసము నాశించియు తపంబొనరించి నానుండి వరంబుల బొందియున్నారు, కావున నేను మునుముందు నా శేషతల్పమును నా సహోదరుడై బలరాముడుగా నవతరింపజేసి నేను కృష్ణుడను పేరుతో నాతనికి తమ్ముడనై యవతరింతును.

సీ॥ ఎల్లప్రాయమందున గులసతిన్ విడనాడి
నాతో నరణ్యంబు నడచినాడు!
పదునాలుగేడులు పలుకష్టముల కోర్చి
కనురెప్పరీతినన్ గాచినాడు!
యావద్రాజ్యమొసంగ నంగీకరింపక
నాసేవకతి దాస జేసినాడు!
వనిలోన సీతను వదలిపెట్టుమటన్న
వెనుకాడ కట్లుగావించినాడు॥

గీ॥ ఈతడు రామావతార మేనెత్తినపుడు
తమ్ముడై నాకు జేసిన దాస్యమునకు!
ఋణ పడితిగాదె మిగుల లక్ష్మణునికెంతో
కాన జేసెద సేవ నవ్వాని కిపుడు॥

దాన భాగవత సేవా ధర్మమొకటి నా యనుష్ఠానము ద్వారా స్థాపించి నట్లగును. మీరే గురు సేవా ప్రయత్నములో నే యున్నాను.

బ్రహ్మ:- (నమస్కరించి, చిత్తము. సెలవిచ్చినాము మేము పోయి వత్తుము. (అని నిష్క్రమింతురు)

నారా:- రమా! నేనే యవతారమెత్తినను దానికనుగుణముగ నీవును అవతరించుట చేతనే నాయవతార కార్యమంతయు సుకరమగుచుండెను. చూడుము.

ఉ॥ ఏ యవతారమేను | ధరి
యించిన నందుకు నర్హాకృతి | నా
యీ యవతారమెల్ల | ముటమూర |
వహించుట బట్టి గాదె | ప
ద్మాయతనేత్ర | నాదు నవతార
విధంబు సలక్షణంబుగా |
శోభగ సాగుచున్నది హా మందున
సర్వ జనాభిరామమై ॥

కావున నీ యవతారంబునందును నీవు నేనవతరించిన కొంతకాలమునకు భూమియందు భీష్మకపుత్రికయై రుక్మిణిగా నవతరింపుము. ఈ భూదేవి సత్రాజిత్తునింట సత్యభామగా జన్మించును. నేనప్పుడు మిమ్ముల నిరువురను పాణిగ్రహణము గావించి నాయవతార లీలారసము ననుభవింపజేతును.

ఇద్దరును—చిత్తము. (తెర వాలును)

(ధృతరాష్ట్రుడు సింహాసనాసీనుడై యుండును. ఆచెంతనే నీచాసనముపై సంజయుడు కూర్చొని యుండును)

ధృత:- (విచారముతో) సంజయా! నిశరజోగుణ మెన్ని యనర్థములకు కారణమాయి, క్రోధము లుదయించినను, పెంపొందినను దీనివల్లనే గదా! ఆహా! నేను శ్రీ వ్యాసమహర్షి వారి శ్రేయించి యార్జించిన విజ్ఞానము నంతను దీనిపాల్టనే పెట్టుకున్నదిసుమా! పెద్దల సేవజేసి గడించిన జ్ఞానము నంతను ఇదియే దిగమింగి వేసినది. కానిచో నాకు ఒక్కరా యిద్దరా! నూరుగురు బిడ్డలేమి. వీరియెడల నాకీప్రేమాంధ్యమేమి? ఎవరెన్ని చెప్పినను వినక బిడ్డని మనస్సేమి శ్లోబిల్లునో యని వాడన్నదానికంతకు తందానతానయని ముప్పు తెచ్చికొంటిని. మొక్కయై వంగనిది మ్రానైన వంగునా? ఇకనేమనుకొనిన ఏమిలాభము పాపమా ధార్మికులైదుగ్రామములు లీయమని ప్రార్థించిరి, సర్వశక్తిగల సర్వజ్ఞ శిరోమణి యగు శ్రీ కృష్ణుని రాయబార మంపిరి. అయ్యో! దౌర్భాగ్యుడైన యనసే యవమానపరచి

కట్టుచున్నారు. ఇంతకంటె నికచేసేమి కలదు? ఆనాటి ద్రౌపతి పరిభవము తలంచుకొనిన హృదయము తల్లడిల్లుచున్నది. మహాపతివ్రత! సంజయా! నిజముగా ఆభీముని పలికిన నాచెవులలో నహోరాత్రములు ప్రతిధ్వనించుచు నన్నుచికాకు పరచు చున్నది. నాకా ఘోర నిష్ఠురములు హైరానిపించుచున్నవి! నాకేమిదిక్కు? నాకేమిదారి? అయ్యో! సంజయా ఈయుద్ధము నాపుటకు నేమియు లేదుకదా! నాబిడ్డలకు యుద్ధము చేయకనే రాజ్యలాభమున కైదైన ఉపాయము జెప్పుము నాయనా!

సంజ:- ధృతరాష్ట్రా! ఏకేమైన వెర్రియా! పిచ్చియా! నీవింకను వెరటిదారినే యున్నావా

యతోధర్మస్తతోకృష్ణః। యతోకృష్ణస్తతోజయః॥

నీబిడ్డలకు స్వారాజ్యము సిద్ధముగనే యున్నది. ఇది నిశ్చయము, తప్పదు, సర్పదష్టునకు ఖండశర్కర విషతుల్యము. వినాశోన్ముఖునకు హితోపదేశము విషప్రాయము. "వినాశకాలే విపరీతబుద్ధిః" నీవికవెరతలంపుల పోవిడిచి కానున్నది కాక మానదని ప్రశాంతచిత్తుడవై భగవంతుని ధ్యానింపుము. ఇదుగో గురుపుంగవులగు వ్యాస భగవానులు ఇక్కడికి వచ్చు చున్నారు.

(లేచి ఎదురేగి సాష్టాంగనమస్కార మాచరించి)

దేవా! ఇటువిజయముచేయుడు, ధృతరాష్ట్రుడిచ్చట ఉద్విగ్న మనస్కుడై సాంత్వనోపాయము నారయు చున్నాడు.

వ్యా:- సంజయా! ధర్మప్రవర్తకా! నేను వచ్చినదిందులకే, ధృతరాష్ట్రునికడకు పోవుదము ముందునడువుము.

సం:— చిత్తము (ధృతరాష్ట్రునికడకేగి) రాజా! ఇదుగో! వ్యాసమహర్షి తగిన సమయము నకు హితకాములై విచ్చేసిరి.

ధృత:- గురుపుంగవా! ఇదేధృతరాష్ట్రుడు నమస్కరించుచున్నాడు, ఈ యాసనము నలంకరింపుడు.

వ్యా:- ధర్మోజయతు! ధృతరాష్ట్రా! అను కున్నంతయు నైనది. చూచితివా! ఎవరెన్ని జెప్పినను నీజ్యేష్టపుత్రుడు వినడయ్యె ఇకచింతించిన నేమిలాభము,

కం॥ కాలంబగుటయు నృపులకు।
నాలము సమకూరె దీనికడలకు మదిన్।
పాలోచింపగ వలసిన।
నేలోనికి దివ్యదృష్టి నిచ్చెద పుత్రా॥

ధృత:— అయ్యో! తండ్రీ. నేను పుట్టుగ్రుడ్డిని. పరశ్శత శుభపరంపరలు నా ముందు గడచినవి. నేనొక్కదానినైనను జూచియెఱుంగను. కొడుకులు పుట్టిరి, పెండ్లాడిరి, బిడ్డలగనిరి. నేనొక్క శుభ ముహూర్తమును జూచి యానందించితినా! అయ్యో! నాయనా! నాకిపుడీ కులనాశమును గాంచుటకా పాడుదృష్టి అయ్యో! వలదు. వలదు. 'నీ యనుగ్రహమున్నచో వినునట్లు అనుగ్రహింపుము' అంతియే చాలును.

వ్యా— అయినచో ధృతరాష్ట్రా! నీ ప్రియమిత్రుడగు నీ సంజయునకు దివ్యదృష్టిని దివ్యశ్రోత్రము ను ప్రసాదించుచున్నాను. ఈతనికి యీ యుద్ధమగు [illegible]వరకు చూడకయే భూతభవిష్య ద్వర్తమానములు కరతలామలకము వలె భాసించును. చెప్పకయే దేశకాల విప్రకృష్టములు విశదింపబడు [illegible] బాధింపకుండును. ఈతని నెట్టి యాయుధములైనను బాధింపనేరవు. ఇట్టి దివ్యశక్తితో నీతడు నీ చెంతనుండి సమస్త సంగ్రామ వార్తలను యథాక్రమముగా చెప్పుచు [illegible] చుండును. అట్లు వినుచు సకల యుద్ధవార్తలను వినుచుండుము. భగవత్సంకల్ప సూచకమగు ప్రళయవేగము నడ్డుట కెవరితరము ?

సంజయా! (అని పిలిచి అతనిని అభిమంత్రించును)

(సంజయుడు నూతన తేజముతో విరాజిల్లును)

సంజయా! నీ కప్రతిహతశక్తిసంపద ననుగ్రహించితిని, నీవు ధృతరాష్ట్రునకీ యుద్ధవార్తల నన్నిటిని యథార్థముగ నెఱుపుచు చుండుము.

సం— మహా ప్రసాదము.

వ్యా— ధృతరాష్ట్రా! స్వస్థచిత్తుడవగుము. నేనిక పోయి వత్తును.

ధృ— చిత్తము.

(వ్యాసుడు నిష్క్రమించును)

సం— ప్రభూ!! మన వారందరును కురుక్షేత్రమున సమావేశమై వ్యూహముల పన్ని యుద్ధోన్ముఖులై యున్నారు. నేనొక్కసారి రణరంగమునకేగి వారివారి ప్రవృత్తుల నారసి క్షణములో నీ సన్నిధికేతెంచి,

కం॥ వినినదియును నెయ్యెడనే
గనినదియును మునికృపం బ్రకాశంబైతో
చినదియును విశదంబుగ
వినిపించెద మొదలుకొని సవిస్తారముగన్ ॥

ధృ— సరియే! పోయి త్వరగారమ్ము నీకొరకై వేచియుందును.

సం— చిత్తము సెలవొసంగుము.

(నిష్క్రమించును)

# రామానుజ అష్టాక్షరీ భూరి ప్రదానము

ఉ. వే. శ్రీమాన్ కవిశ్రీయమిత్ర, విమర్శక శిరోమణి, విద్యారత్న గొ. రమాకాంతాచార్యులుగారు బి. ఏ.

అపౌరుషేయ మగు వేద చతుష్టయ మునకును వ్యాఖ్యానప్రాయమగు శ్రీమన్మహాభారతమున, వేదాంతపరమగు శాంతిపర్వమునకు సారవాక్యముగా, నిబంధింపబడిన 'నారాయణీయ ధర్మము' లకు శ్రీ పాంచరాత్రమని పేరు (శాంతి 340_111, 112). సృష్ట్యాదిని శ్రీమన్నారాయణుడు తన నాభికమలమున బుట్టిన చతుర్ముఖబ్రహ్మకు వేదము నొసఁగి, దానికి వ్యాఖ్యానముగా నుండుటకుగాను ఈ పాంచరాత్ర శాస్త్రము నిర్మించి, దానిని ఆయనకు సరహస్యముగా ససంగ్రహముగా నుపదేశించెను (శాంతి 351-67) ముముక్షువులకు నెరికిని-తప్త చక్రాంకనము, ఊర్ధ్వపుండ్రకము భగవన్నామధారణము (పేరుపెట్టు కొనుట) అష్టాక్షరీమంత్రోపదేశము, భగవదర్చాపూజ- అను పంచసంస్కారములను శ్రీ పాంచరాత్ర శాస్త్రము విధించుచున్నది-తన పితృపాదులగు శ్రీమన్నారాయణునుండి, ఈపంచసంస్కారములను బొందిన చతుర్ముఖుడు, ఇంద్రునకు దాను వానిని కృప చేసి, స్వర్గలోకమునేల బంపెను. (అవ్యక్తోపనిషత్తు-వావిళ్ల ప్రతిచూడుడు). భగవచ్ఛబ్దమునకు నారాయణునియందే ముఖ్యవృత్తి యున్నట్లుండుటను పరాశర మునివరుల శాసనముండుటచే (విష్ణుపురాణము 6_5_79 ఈ నారాయణీయ ధర్మమునకే, భగవద్ (భాగవత) ధర్మమని భాగవత మతమని పేరు._బ్రహ్మమానస పుత్రుడగు నారదమహర్షి శ్రీపాంచరాత్ర శాస్త్ర ప్రవర్తకుడు (శ్రీభాగవతము 1_5-6 శ్రీధరవ్యాఖ్య). శ్రీ పాంచరాత్రోక్తమగు ఈభాగవత మత సాంప్రదాయము మూడు పరంపరలుగా త్రిలోకముల యందును వ్యాపించెను. మొదటి పరంపర, దేవర్షి యగు (భగ 10-20) నారదునది. రెండవ పరంపర బ్రహ్మర్షి పరంపర. ఇది పురుషోత్తమాఖ్య పాంచరాత్ర సంహితా ప్రవర్తకులగు వసిష్ఠ మహర్షిది-మూడవ పరంపర రాజర్షి పరంపర,-ఇది వేదార్థ ప్రకాశకుడగు మను మహామునిది. రాజర్షి పరంపర మనువు ద్వారా ఇక్ష్వాకువు వరకు వచ్చి జగద్వ్యాప్తమాయెను (శాంతి 336-46,47,348_35 టు 52). శ్రీ పాంచ రాత్రమునకు సాత్వత మని వ్యపదేశము (శాంతి 348-79) ఇక్ష్వాకువు సాత్వత వంశీయుడు. ఆవంశమునందే భగవానుడు శ్రీరామ చంద్రమూర్తిగ నవతరించెను. శ్రీరామచంద్రమూర్తి వలెనే, శ్రీకృష్ణ భగవానుండును సాత్వత వంశీయుఁడే. త్రేతాయుగమున, శ్రీ రామచంద్రుని వంశగురువగు వసిష్ఠ మహర్షి చేతను, ద్వాపర యుగమున శ్రీకృష్ణ భగవానుని, అంతరంగ భక్తులగు శ్రీ పరాశర, వ్యాసశుక బ్రహ్మర్షుల చేతను భాగవత మత సాంప్రదాయము వ్యాపకము గావింప బడెను_నారదోపదిష్టుడై, భాగవత ధర్మము ననుష్ఠించిన ప్రహ్లాదునిచేతను, అతని వంశీయుఁడగు బలిచేత,-ఈ ధర్మము దైత్యుల యందును,-పాతాళలోకమునను వ్యాపింప జేయ బడెను. ఈ మూడు పరంపరలతో,-

ప్రథమపరంపరా ప్రవర్తకుడగు (నారదుడు) శతవర్షములు తపస్సు చేసి, దైవయోగబలమున విజ్ఞానములభించి తత్ఫలముగా మేరు పర్వతమునకు ఉత్తరతటమున నున్న క్షీరసాగరములో మహా ప్రకాశమానముగా వెలుంగు శ్వేతద్వీపమునకు వెళ్ళి, అచట శ్రీమన్నారాయణుని సేవించి తదాజ్ఞచే తిరిగి మేరువు పర్వతము మీదుగా బదరికాశ్రమమునకు వచ్చి, అచట శ్రీమన్నారాయణుడే, ఆచార్యశిష్య రూపములై నరనారాయణ మహర్షులుగా నవతరించిన తత్సన్నిధిలో-శ్రీమదష్టాక్షరీ మహామంత్రము నుపదేశమై, వానిని నభ్యసించుచు చిరకాలము భగవన్మంత్రమును జపించెను. (శాంతి 337-22,26,31,32; 344-23,33; 345-27)-ప్రాగుక్త పరంపరాత్రయములో,-రాజర్షి పరంపర, గంగానదివలె,-బ్రహ్మర్షి పరంపర, సరస్వతీనదివలె,-దేవర్షి పరంపర యమునానదివలె, సమస్త ముముక్షుచేతనులను, భగవదున్ముఖులం గావించెను. ఈపరంపరలలో యామున పరంపర శ్రీరామానుజీయ విశిష్టాద్వైతులకు ఉపాదేయమాయెను.



# శ్రీ రామానుజమూర్తి ధ్యానము

శ్రీ ఉ. వే. శ్రీమాన్.
ఆ. చి. శ్రీమన్నారాయణాచార్య.

శ్లో॥ స్వరూపం పరమాత్మానం।
స్వభావం శ్రీస్వభావకం॥

శ్లో॥ మస్తకం శ్రీశఠారాతిం।
నాథాఖ్యం ముఖమండలం।
నేత్రయుగ్మం సరోజాక్షం।
కపోలం రాఘవంతథా॥

శ్లో॥ వక్షస్థలం యామునాఖ్యం।
కంఠం శ్రీపూర్ణదేశికం।
బాహుద్వయం గోష్ఠిపూర్ణం।
శైలపూర్ణ స్తనద్వయం॥

అర్థము

శ్రీరామానుజులవారి యొక్క స్వరూపము పరమాత్ముడుగను; స్వభావము శ్రీలక్ష్మీస్వభావముగను:

శిరస్సును శ్రీనమ్మాళ్వారులుగను; ముఖమండలమున శ్రీమన్నాథమునులుగను; నేత్రద్వందమును శ్రీపుండరీకాక్షులుగను కపోలమును శ్రీరామమిశ్రులుగను;

వక్షస్థలమును శ్రీయామునాచార్యులుగను; కంఠమును శ్రీపరాంకుశ దాసులుగను; హస్తద్వయమును పూర్ణులుగను; స్తనద్వయమును శ్రీశైల పూర్ణులుగను;

శ్లో॥ కుక్షింతు వరరంగార్యం।
పృష్టం మాలాధరంతథా।
కటింకాంచీముని జ్ఞేయం।
గోవిందార్యం నితంబకం॥

శ్లో॥ భట్టవేదాంతి సౌజంఘే।
ఊరూయుగ్మం కలిద్విషం।
కృష్ణం జానుయుగంచైవ।
లోకం శ్రీపాదపంకజం॥

శ్లో॥ రేఖాః శ్రీశైలనాథాఖ్యం।
పాదుకాంవరయోగినం।
పుండ్రం సేనాపతిం ప్రోక్తం।
సూత్రం కూరపతిం తథా॥

శ్లో॥ భాగినేయం త్రిదండంచ।
కాషాయం చాంద్రపూర్ణకం।
మాలాం చకురుకేశార్యం।
ఛాయాం శ్రీచాపకింకరం॥

శ్లో॥ ఏవం రామానుజార్యస్య।
అవయవానఖిలాన్ గురూన్।
అవయవినం మహాత్మానం।
రామానుజమునిం భజే॥

శ్లో॥ గురుమూర్త్యాత్మ యోగీంద్రం।
యోధ్యాయే త్ప్రత్యహం నరః।
సర్వా న్కామా నవాప్నోతి।
లభే ద్విాంతేపరంపదం॥

అర్థము

ఉదరమును తిరువరంగ ప్పెరుమాళరయరును; వీపును తిరుమాలైయాండానుగాను; మొలను తిరుక్కచ్చినంబిగారుగను; నితంబమును ఎంబారుగను;

పిక్కలను భట్టరు నంజీయర్లుగను; తొడలను నంబిళ్లగను; మోకాళ్లురెండింటిని వడక్కుత్తిరు వీధిపిళ్లెగను; పాదములను పిళ్లెలోకాచార్యులుగను;

పాదమందలిరేఖలను శ్రీశైల నాథులుగను; పాదుకలను మణవాళ మహామునులుగను; ఊర్ధ్వపుండ్రమును సేనాపతిజీయర్‌గను; యజ్ఞోపవీతమును కూరత్తాళ్వార్లుగను;

త్రిదండమును మొదలియాండానుగను; కాషయమును ఆంధ్రపూర్ణులుగను; కంఠమందలిమాలికను తిరుక్కురుగై ప్పిరాన్ పిళ్లానుగను; నీడను, శ్రీధనుర్దాసులుగను?

ఈవిధముగ శ్రీరామానుజుల వారియొక్క సమస్త అవయవములను మనపూర్వాచార్యులుగను అవయవిస్థానీయులుగ మహాత్ములైన శ్రీరామానుజ మునులను భజించుచున్నారు.

పూర్వాచార్యుల నందరను తమశరీరముగ ధరించియున్న భగవద్రామానుజ యోగీంద్రులను ప్రతినిత్యము ధ్యానించు నరుడు సమస్త కోరికలను పొంది చివరకు పరమ పదమును పొందగలడు.

ఈవిధముగా ప్రతినిత్యము ధ్యానముచేయుటచే పూర్వాచార్యులతో గూడుకున్న భగవద్రామానుజుల వారిని ధ్యానము చేయుటయగును,

# తిరుక్కోళూర్ పెణ్ పిళ్ళై రహస్యము

(రచయిత: శ్రీ మద్భాగవత శ్రీపాదరేణువు, మదరాసు)

## భాగవతము

అ॥ తంద్దై యెంగే యెన్రేనో ధ్రువనైప్పోలే॥

తె॥ నాతండ్రి యెక్కడనని అడిగినానా ధృవునివలె ॥

౭

ఉత్తానపాద మహారాజునకు సునీతి సురుచి యను నిద్దరు భార్యలు గలరు వారిలో సునీతికి ధృవుడును సురుచికి ఉత్తముండును బుట్టిరి. సురుచి బోధనలకు చిక్కి సునీతిని రాజు పట్టణమునకు దూరముగా నుంచెను. ధృవునికి ఐదు సంవత్సరములు కాగానే వీధిబడికి పంపెను. తోడిబాలురచే తన తండ్రియే రాజని విని సందేహనివృత్తికై తనతల్లితో నా తండ్రి యెక్కడ ! యని అడుగగా ఆమె దుఃఖాక్రాంతురాలై తన వర్తమానంబును దెల్పెను. ధృవుడు అమ్మా! నేను నగరికి వెళ్ళి రాజు సింహాసనముపై గూర్చుండి ఉత్తముని తొడపై నిడుకుని ముద్దులాడు చుండుటను గని తానును మఱియొక్క తొడపై నెక్కి కూర్చుండెను. తటాలున సురుచి వచ్చి ధృవుని చెంపపై చఱచి నీవు [illegible] తొడలో కూర్చొన తగవు. ఆపదవి కావలసియుండిన తపస్సుజేసి రమ్మని గెంటించెను. ధృవుడు దుఃఖముతో తల్లివద్దకు వచ్చి యావద్వర్తమానంబును దెలిపి నాపినతల్లి చెప్పినట్లు తపస్సునకు వెళ్ళెదనని పట్టుపట్టి తల్లి యెంతవారించినను వినక వెళ్ళుచుండగా భగవంతునిచే ననుజ్ఞాతుండై నారదులు ప్రత్యక్షమై ధృవునికి ద్వాదశాక్షరియగు "ఓం నమో భగవతే వాసుదేవాయ" యను మంత్ర ముపదేశించి వెళ్ళెను. నారదులు ధృవుని కారణమడుగగా ధృవుడు స్వామీ! సపత్నీమాతృవాగిషుక్షతంబగు మనంబును భగవద్ధ్యానయోగ రసాయనంబున మాపుకుందునని జెప్పి యమునాతీరమున కూర్చుండి తపస్సు చేయగా భగవంతుడు ప్రత్యక్షము కాగా.

ధృవుడు:- గీ॥ నయనముల విభుమూర్తి బానంబుసేయు।
పగిదిదన ముఖమునను జుంబనముసేయు।
గీల దగభుజములను నాలింగనంబుసేయు।
గతిని తగదండ వన్నమస్కృతు లొనర్చె॥

ధృవుడు:- చం॥ నిరతము దావకీన భజనీయపదాబ్జసుగంధలబ్ధి।
నెవ్వరుమదినొందగా గలుగువారలు తత్ప్రియమర్త్యదేహము।
గరము తదీయ దారసుత కామ సుహృద్గృహ బంధువర్గమున్।
మఱతురు విశ్వతోముఖ!రమాహృదయేశ! ముకుంద! మాధవా

యని ప్రార్థింప భగవంతుడు ధృవుని భక్తికి మెచ్చి ధృవా! ఇమ్మేదినియందు బరిభ్రామ్యమా ణగోచక్రంబునుబోలి గ్రహనక్షత్రతారాగణ జ్యోతిశ్చక్రంబు నక్షత్రరూపంబులైన ధర్మాగ్ని కశ్యపశక్రులును సప్తర్షులును దారాసమేతులై ప్రదక్షిణంబు దిరుగు చుండుదురు, అట్టిదురాపం బున నన్యాధిష్ఠితంబును లోకత్రయ ప్రళయ కాలంబునందు నశ్వరంబుగాక ప్రకాశమానం బైన ధృవక్షితియను పదంబు ముందట (26,000) ఏండ్లుచన బ్రాపింతువని యాశీర్వదించి యం తర్ధానుడయ్యెను. (తి. అ) ధృవునివలె ఇటుల ధృఢాద్యవసాయము జేసితినా?

---

## నా లా యి ర ం.

అ॥ మూన్రెళుత్తై చ్చొన్నేనో క్షత్రబంధువైప్పోలే॥
తె॥ మూడక్షరములతో ముక్తినిబొందినానా క్షత్రబంధువువలె॥

తిరుమాల॥4॥ మొయ్త్త వల్వినైయుళ్ నిన్ఱు మూన్రెళుత్తుడైయ పేరాల్।
క్షత్తిరబందు మనే పరాంగది కండుకొండాన్।
ఇత్తనై యడియరానార్కు ఇరంగుం నమ్మరంగనాయ।
పిత్తనై పెట్రుమందో పిరవియుళ్ పిణంగుమారే॥

తా॥ ఎంతకాల మనుభవించినను నశింపని పాపమునొర్చననుమూడు అక్షరములుగల గోవిందయను తిరునామానుసంధానముచే క్షత్రియాధముడైన క్షత్రబంధువుగదా పరమపదమును ప్రాప్తించెను హృదయమందు లేక వాక్కుచే "గోవింద" నామ మనుసంధించు దాసులకై కనికరించు వాడైన మన "రంగని" గూడి యనుభవించుటకు ప్రాప్తముండియును జన్మదుఃఖబాధలలో పడి పరిభ్రమించు చేతనులను జూచి "భక్తాంఘ్రిరేణు" దాసులు అయ్యో అని చింతిం చుచున్నారు.

పి. పు. శ్లో॥ పాపిష్ఠః క్షత్రబంధుశ్చ పుండరీకశ్చ పుణ్యకృత్।
అచార్యవత్తయా ముక్తౌతస్మా దాచార్యవాన్ భవేత్ ॥

తా॥ మహాపాపియైన క్షత్రబంధువున్ను మహాపుణ్యాత్ముడైన పుండరీకమునియు సదాచార్యసంబంధమువల్ల ముక్తిజెందిరి.

క్షత్రబంధువుయొక్క వృత్తాంతము.

పూర్వమున క్షత్రబంధువను రాజొకడుండెను. అతనికి దగ్గు సంప్రాప్తమాయెను. వైద్యులు పరీక్షించి ఈ దగ్గుకు కుందేలు మాంసము పథ్యమనిరి. అట్లే ప్రతిరోజును భుజించుచుండెను. ఒక్క రోజు అడవిలో కుందేలు దొరకకపోయెను, రాజు వంటలవారిపై మిక్కిలి ఆగ్రహించగా ఆ మఱువాడు అప్పుడు పుట్టిన శిశువును జంపి పచనముచేసి యుంచిరి. ఈ కుందేలు మాంసము బహుబాగుగనున్నది. ఆదే ప్రతిరోజును పెట్టమని రాజాజ్ఞచేయగా అట్లే ప్రతిరోజును జరిగెను, నరుడు నరమాంసము తినుటవలన రాక్షసులకువలె ఈ రాజునకు కోరపండ్లు పెరగసాగెను. అంతఃపుర స్త్రీలగు తనభార్యలను హింసించి వారల రక్తములను త్రాగ నుతకించెను. వారందరును తమ తల్లిగారిండ్లకు పోయిచేరిరి. తర్వాత మంత్రి ప్రధానులను రాజాంగసేవకులను అట్లే పురజనులను బాధింపసాగెను. అందరును భయపడి పారిపోయిరి, ఊరేలేక శూన్యమాయెను కడకు అడవికి పోయి నర మాంసమునకై పరుగులాడుచుండగా శ్రీనారదముని ఎదురుపడెను. నారదులను హింసింపబోగా క్షత్రబంధురాజునకు హితోపదేశమునుజేసి తర్వాత మంత్రోపదేశము చేసి పోయెను. ఆతడట్లే ధ్యానగతుడాయెను.

తి. అ॥ ఈ క్షత్రబంధువవలె తపస్సు జేసినానా ?



# శ్రీ రామాయణము

ఆ॥ ముదలడిస్తైమె శ్రీపతిని అహల్యమైపోతే।
తె॥ ఆదిమధ్యాంతరహితుని పాదస్పర్శను బొందినానా అహల్యవలె॥

వి

అహల్య అయోనిజయగుటచేతను బ్రహ్మ మానస పుత్రియై పదివేల సంవత్సరములు గౌతమమహాముని తో కాపురము చేయుచుండగా ఇంద్రునియొక్క మోసకృత్యమునకు మోసపోయినందున గౌతముల శాపబద్ధురాలై చట్టాయిగ బహుకాలము పడియుండి శ్రీరాముల పదరజంబు సోకి మరల అహల్యయై గౌతములను గూడి గృహస్థ ధర్మమును నిర్వర్తించెను. ఈ అహల్యా దేవిని పంచకన్యలలో నొక్కతె యందురు.

శ్లో॥ అహల్యా ద్రౌపదీ సీతా తారా మండోదరీ తథా।
నిత్యయౌవ్వన సంపన్నాః పంచ కన్యా గుణాన్వితాః॥

క॥ ముదితాపసి వెనువెంటను వదలక చనుదెంచునట్టి వడిరాముని శ్రీ
పదరజము సోకి చిత్రం బాదవగ గనుపట్టె నెదుట నొక యుపల మటన్॥
క॥ పదునై యొప్పిదమై కడు గదలుచు బంగారు పూనె కరిగిన వగిదిన్।
బాదలుచు లావణ్యస్థితి సుదతై చూపట్టి నిలిచె సురుచిరలీలన్॥

వ॥ విశ్వామిత్రులీ అమానుషకృత్యమును జూచి మనమున నుప్పొంగుచు

ఉ॥ ఆ మునివల్లభుండు కొనియాడుచు బాడుచు వేడ్కతోడ శ్రీ।
రాముని జూచి యిట్లనియె రామ భవత్పదధూళిసోకి తా।
భామిని యయ్యె రాయి కులపావన చూడగ జిత్రమయ్యె నీ।
నామ మెఱుంగువారలకు నమ్మగ వచ్చును భుక్తి ముక్తులున్॥

తే॥ మంచుకప్పిన మబ్బున మాటువడిన నిండు జందురు రుచివోలె నుండుదాని
నీట ప్రతిబింబితంబై నిగుడుచున్న యొండయున దేజిచూడు రాకుంసుదాని॥

కం॥ శ్రీరామచంద్రు డాశ్రమ। ధారిణిజేరంగ శాపతాపమువాయన్।
నారీమణి తనపూర్వా। కారంబున భువనములకు గనబడెమరలన్॥

(శ్రీ. అ.) అహల్యవలె నేను ఆ రామచంద్రుని పాదస్పర్శను బొందినానా?

# రామానుజుల రహస్య స్వీకారము

శ్రీ. వరమంగయ్యమ్మారావుగారు

తిరుకోట్టియూర్ నంబిగారు ఎంబెరుమానార్లను పదునెనిమిది పర్యాయములు మంత్రోపదేశమునకై త్రిప్పిరి. ఎంబెరుమానార్లు అప్పటికే అపారపాండిత్యము గలవారై ఆదర్శప్రాయమగు అనుష్ఠానమును గలవారలై సన్యాసాశ్రమ స్వీకారము చేసినవారై యుండిరి. ఇట్టి మహనీయుల నిట్టుల పదునెనిమిది పర్యాయములు మంత్రార్థమునకై త్రిప్పుట న్యాయమా? అనినచో నొక దృష్ట్యాన్యాయమనే చెప్పవచ్చును.

శ్రీ నంబిగారు పదునెనిమిది పర్యాయములు పదునెనిమిది విశేషార్థముల ఎంబెరుమానార్లకు సాయించవలెనను పరమ కృపచే త్రిప్పిరే గాని మరెట్టి లోపము గాని యున్నదను సందేహముచే కాదు. గాన త్రిప్పుటలో తప్పులేదు. ఒక్కొక్క పర్యాయము ఒక్కొక్క అర్థవిశేషమును శ్రీ తిరుకోట్టియూరు నంబిగారు సాయించి యుండిరి. అవి యేవియన:—

ముముక్షువునకు సంసారబీజమునశించవలయును అది ఎటుల నశించుననగా భార్యపుత్రాదులపట్ల

"పంకా దుత్పద్యతే కీటః|
కీటః పంకం న పశ్యతే|
లోకా దుత్పద్యతే జ్ఞానీ|
జ్ఞానీ లోకం న పశ్యతే||

మట్టి పురుగు బురదనుండియే పుట్టినను ఆబురద ఆపురుగునకు గిట్టదు అటులనే జ్ఞానియైన వాడు లోకముతో సంబంధము కలవాడే అయినను లౌకికవిషయముల యందు విరాగియై యుండును, ఈవిధముగ సంసారబీజము నశించవలయును.

2 సంసారబీజము నశించిననే తప్ప అహంకార మమకార నివృత్తి కలుగదు. అహంకార, మమకార నివృత్తి ఎటుల కలుగుననగా.

అహంకార మనగా గర్వము. మమకార మనగా మాత్సర్యము,

"అగ్ని ర్వ్యాపకదీపం చ
శైత్యాం గర్వ వివర్జయేత్||

అగ్నివలన ఉత్పన్నమైన దీపము చల్లనైన గాలిచే ఆరిపోయినటుల అహంకార మమకార నివృత్తి కలుగవలెను.

3 అహంకార మమకారములు నశించిననే తప్ప దేహాభిమానము నశించదు,

4 దేహాభిమానము నశించిననే తప్పఆత్మజ్ఞానము జనించదు,

5 ఆత్మజ్ఞానము జనించిననే తప్ప ఐశ్వర్యభోగాదుల విషయమై ఉపేక్షాభావము జనించదు.

6 ఐశ్వర్యభోగాదుల విషయమై ఉపేక్షాభావము జనించిననే తప్ప భగవంతునిపై ప్రేమజనించదు

7 భగవంతునిపై ప్రేమ జనించిననే తప్ప విష యాంతరముల యందు రుచి వదలదు.

8 విషయాంతరముల యందు రుచి వదలినగాని పారతంత్ర్యము జనించదు.

9 పారతంత్ర్యము జనించినగాని అర్థ, కామ, రాగ ద్వేషాదులు విడువవు.

10 రాగ ద్వేషాదులు నశించిననే గాని శ్రీవై ష్ణవత్వము చేజిక్కదు.

11 శ్రీవైష్ణవత్వము సిద్ధించిననేగాని సాత్విక పరిగ్రహము తటస్థించదు.

12 సాత్వికపరిగ్రహము తటస్థించిననేగాని భాగ వత పరిగ్రహము కలుగదు.

13 భాగవత పరిగ్రహము కలిగిననే గాని భగవ త్పరిగ్రహము సంభవించదు.

14 భగవత్పరిగ్రహము కలిగినచే గాని అనన్య ప్రయోజనుడు కాజాలడు.

15 అనన్యప్రయోజనుడు గాకుండగ అనన్యా ర్హ శేషభూతుండు కాజాలడు.

16 అనన్యార్హ శేషభూతుండు గాకుండగ అన న్యశరణుడు అగుట కవకాశము లేదు.

17 అనన్యశరణుడు గాకుండగా అధికారపురుషు డు కాజాలడు.

18 అధికారపురుషుడైన వానికితిరుమంత్రార్థము హస్తగతమగును.

ఈవిధముగ పదునెనిమిది పర్యాయములు వేంచేసిన ఎంబెరుమానార్లకు పదునెనిమిది రహస్యములను తిరుక్కోట్టియూరు నంబిగారు సాయించిరి.



శ్రీమతే రామానుజాయనమః

# తిరువాయ్ మొళిలో 6 వ పదిలో 7 వ తిరువాయ్ మొళిలో మొదటి పాశుర భావము

శ్రీమతి నందూరి అనంతమ్మగారు

1 ఉణ్ణుమ్ శోఱు పరుకుమ్ నీర్ తిన్నుమ్ వెత్తిలైయు మెల్లామ్ కణ్ణన్

2 ఎమ్బెరుమానెనెనే కణ్ కళ్ నీర్ మల్కి

3 మణ్ణినుళవన్ శీర్ వళమ్మిక్కవ నూర్ వినవి తిణ్ణమెన్నిళమాన్

4 పుగుమూర్ తిరుక్కోళూరే

ఈ పాశురము అళ్వారుతాయ్‌మారవస్తలో పాడిన పాట తినే అన్నము తాగేనీరు వేసుకునే తాంబూలము అన్ని ఆ కృష్ణ పరమాత్మ అని కంటనీరు పెట్టునునే నా కుమార్తె ఈ లోకములో కీర్తి గల తిరుక్కోవలూరికి వెళ్ళి పోయి వుంటుంది. ఇది నిశ్చయము అని తల్లి గారి భావనతో సాయించుచున్న పాశుర తాత్పర్యము.

సరే ఇక ఈ పాశుర భావములలోకి వచ్చి కొంచెము చర్చించు కొందాము. ఈ తిరువాయ్ మొళ్ళి దివ్యప్రబంధము వంటి ఉత్కృష్ట భావములుగల గ్రంధము వేరొకటిలేదని నొక్కి చెప్పుటకు సాహసిస్తున్నాను. ఈ తిరువాయ్‌మొళ్ళి ప్రబంధము యొక్క విశిష్టాద్వైత మత సిద్ధాంతమునకే కాదు, ఆస్తికు లందరి ఆదరణకు పాత్రిభూతమయిన దీప్రబంధము. ఈ మహా ప్రబంధములో యే మతమును గాని యే దేవతను గాని నింద నిరసనా లేకుండా శ్రీవైష్ణవ సిద్ధాంతముయొక్క గొప్ప దనమును ప్రకటించారు. సంఘపట్టినవాడు యెంత సేపు తన ధోరణి గాని వీరెరుగునట్లు మన ఆళ్వార్లు యెంతసేపు తమకూ పరమాత్మల యెందులవుండే ప్రీతి యెడబాటు వలన కలిగే దుఃఖము జీవకారుణ్యత ఈ గొడవలే గాని మరి అన్యభావన యెరుగకుండా పాడిన పాట ఈ తిరువాయ్‌మొళ్ళి గనుకనే భక్తామృతమ్ విశ్వజనానుమోదనమ్ అనే బిరుదు ఈ దివ్యప్రబంధము నకు కలిగినది. అద్వైత ద్వైత భేదము లేకుండా విశ్వములో వుండే అన్ని వర్గముల వారికి ఆనందము కలుగచేసే ప్రబంధమిది. భక్తులకు "తొండరక్కముతుణ శొణ్మాణలైగళ్ శొన్నేన్" అనునటుల" ఆస్తికులకు అమృతరసము" వంటి దీతిరువాయ్‌మొళ్ళి నిజముగా నాకు అద్వైత స్నేహబృందమే ఎక్కువ వారంతా ఆత్మజ్ఞానముల్లో అద్వైత సిద్ధాంతముగో నిధులు అటువంటి నా సోదరీమణు లంతా మన శ్రీ నమ్మయ్య శ్రీ సూక్తులు విన్నంత ఆనందము పడిపోయి ఆనందమ్మక్క గారూ (మాకు పురాణములు వద్దు. వీరా ఆళ్వారుల శ్రీ సూక్తులే చెప్పండి ఎంత భోగ్యమయిన వుపని షదర్థములని అంటూవుంటారు. ఈ అధిక ప్రసంగము యెందులకు చేసినానంటే విశ్వజనాను మోదనము అన్నమాటపై జ్ఞాపకము కలిగి మనవి చేసుకుంటున్నాను. సరే అన్నీ బాగున్నాయి గాని అడుగడుగునకూ ఈ నాయికా అవస్థ యేమి ఈ చెలికత్తె అవస్థలేమిటనీ సందేహము అందరికీ కలుగవచ్చు. సమాధానము విపులముగా చెప్పుటకు గ్రంధవిస్తరభీతి. వచ్చే సంచికలో తిరుక్కురుంగుడి విషయము విన్నవించుకొంటాను. అప్పుడు కొంచెము విపులముగా చర్చించు కొందాము. గాని ముఖ్యవిషయమేమంటే ఉప్పొంగి పోతూంది గోదావరి తాను తెప్పున్న ఎగ సింది గోదావరి అని, గోదావరి మహానది పొంగుతుంది. గాని పిల్లకాలువలు పొంగవు గదా. (అటులనే సర్వేశ్వరు ననుగ్రహముచే మయర్వఅ మతినలమ్ అనునటుల యించుక అయినా భ్రమలేని జ్ఞానభక్తులు వాని నిర్హేతుక కటాక్షముచే పొందిన ఆళ్వార్ల భావములు, తల్లిగానూ చెలికత్తెగాను నాయికిగాను పొంగి ప్రవహించక పోతే మన భావములా పొంగేవి. ఇంతకు ఈ తిరువాయ్‌మొళి అంతా అన్యాపదేశములు గల గంభీర గ్రంధము. మన ఆళ్వార్లు దివ్య దేశములు పాడినారంటే సాధారణముగా స్థలపురాణములు మొదలయిన వీటిలో ఆ దివ్యక్షేత్ర మహిమలు అచ్చట వుండే నదుల మహిమ, స్వామిమహిమ అచ్చటకు వెళ్ళి సేవించిన వారికి వచ్చేపుణ్యము మొదలైన విషయములు ప్రకటించుతే శ్రీ మన్నమ్మాళ్వార్లు అటులకాదు హిందూలా అంటామ్. అటుల ఈతిరువాయ్‌మొళి శ్రీవిశిష్టాద్వైత మతలా అని చెప్పవచ్చు




## శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ ప్రకటన

మదరాసులో జరిగిన ఈసంఘ కార్యకారిణీ సమితి బదరీనారాయణములో జరుప తీర్మానించిన అష్టాక్షరి కోటిహవన క్రతువును గురించి చాలమంది వివరములు గోరించి అడుగుచున్నారు, వారికొరకై ఈ ప్రకటన చేయగోరు చున్నాము.

ఈక్రతువు 1954 సంవత్సరము మెయి జూను నెలలలో.

జేష్ఠ ఆషాఢ మాసములలో ఉత్తర హిందూదేశములో హిమాలయ పర్వతములో యున్న బదరికాశ్రమములో మంత్రరాజమగు శ్రీ మదష్టాక్షరీ మహామంత్రమును చేతనోజ్జీవనార్థమై వెదజల్లుటకై నరనారాయణ రూపేణ అవతరించిన బదరీనారాయణస్వామివారి నుద్దేశించి లోక కల్యాణార్థమై జరుపనిశ్చయింపబడినది.

ఈ క్రతువు అచ్చట నలుబది దినములు జరుపదలంచుచున్నాము. ఈక్రతువునందు శ్రీ మన్నారాయణ భక్తులై తచ్చిహ్నములైన తాప పుండ్రనామ మంత్ర యాగరూప పంచ సంస్కార పరులై యోగ్యులైన బ్రాహ్మణులు యిందు ఋత్విక్కులుగ తీసుకొనబడుదురు వీరుక ఎట్టి ప్రతిఫలాపేక్షయు లేనివారై స్వార్థరహితులై, కేవల స్వస్వరూపోజ్జీవనార్థమై మాత్రమే ఈ క్రతువు నందు పాల్గొనవలసినవారలై రాకపోకలతో సహా సుమారు రెండుమాసములు కాలము ఆ హిమవన్నగరమున ఏకదీక్షతో యుండుటకు వలయు మనస్సంకల్పము, తగిన ఆరోగ్యము శక్తిగలవారలై యుండవలయును.

ఈ క్రతువునందు దీక్షవహించ నుత్సాహముగల ఇట్టి వారు ఈసంఘ కార్యాలయమునకు యిపుడే తమయభిప్రాయమును లిఖితరూపముగ తెలుపవచ్చును. ఈక్రతువునందు ప్రధానదీక్షితులుసుమారు 250 మంది కావలసి యున్నారు.

క్రతునకు ముందుగ యాత్రికుల సౌకర్యార్థమే మదరాసు నుండి ప్రత్యేక రైలును కూడ యేర్పాటు చేయ వలెనను తలంపు కూడ గలదు. వీటన్నింటి యొక్క వివరములు ముందు ముందు యీ పత్రికలో ప్రచురింప బడగలవు.

యీ క్రతువులో ఆర్థిక సహాయ రూపముగ పాల్గొన దలచిన భక్తులందరు యీ క్రింద రూపముగ దీనికి సహాయము చేయవచ్చును.

ఈ క్రతువునందు కోటి పర్యాయములు నేతితో ఆహుతుల నిచ్చుటద్వారా శ్రీమన్నారాయణుని శాంతితో సహా ఆరాధించ బడును.

ఈ కోటి ఆహుతులకై సుమారు వెయ్యి డబ్బాల నెయ్యి కావలయును.

సమిధలు, మంచిగంధం చెక్కలు వగైరా క్రతు సంబారములు కావలయును, క్రతుశాంతికై క్షీరములు-పుష్పములు తదీయారాధన ద్రవ్యములు కావలయును. ఋత్విక్కులు ధరించుటకై 500 జతల దీక్షావస్త్రములు. 250 చలికై కప్పుకొనదగిన సాలువలు వగైరాలు కావలసి యున్నవి.

బీదవారు, ధనికులు అను భక్తులందరు కూడ ఇందు పాల్గొనుటకై వీలుగా యుండు నటుల ఈ క్రింది విధానము ఏర్పాటు చేయబడినది.

ఈ క్రతువునకు ఆర్థిక సహాయము చేయు వారందరి గోత్ర నామములు శ్రీ బదరీనారాయణుని సన్నిధిని విన్నవించ బడును.

ఈ క్రతువునందు వొక ఆజ్యాహుతి శాంతి యుక్తముగ జరుగుటకు రూ॥ 0-1-0 అగునని అంచనా వేయబడినది. గాన యీ క్రింది విధముగ ఆర్థికాని సహాయము యేర్పాటు చేయబడినది.

| | | |
|---|---|---|
| ఒక ఆజ్యాహుతి తమగోత్ర నామ విన్నప | | రు. అ. పై. |
| పూర్వముగ సమర్పించుటకు. | 1 | 0-1-0 |
| ఇరువది నాలుగు ఆజ్యాహుతులకు. | 24 | 1-8-0 |
| నూట యెనిమిది ఆజ్యాహుతులకు. | 108 | 6-12-0 |
| వెయ్యి యెనిమిది ఆజ్యాహుతులకు. | 1008 | 58-0-0 |
| | | మరియు ఒక డబ్బా నెయ్యిన్ని. |
| పదివేలు యెనిమిది ఆజ్యాహుతులకు, | 10008 | 501-0-0 |
| | | మరియుపది డబ్బాల నెయ్యిన్ని. |
| లక్ష యెనిమిది ఆజ్యాహుతులకు. | 100008 | 5001-0-0 |
| | | మరియు వంద డబ్బాల నెయ్యిన్ని. |
| పది లక్షల ఆజ్యాహుతులకు, | 1000008 | 50001-0-0 |
| | | మరియు వెయ్యి డబ్బాల నెయ్యిన్ని. |

మరియు ఈ పవిత్ర పుణ్యసుయోగకాల మందు బదరికాశ్రమములోను దానికి పోవు త్రోవలో గల పుణ్యఘట్టముల యందును యాత్రికులు దిగుటకు అనువుగా యుండునటుల అష్టాక్షరి మందిరములను పేరుతో రామానుజ కూటములను (ధర్మశాలలను) నిర్మించి అందు శ్రీ రామానుజుల వారిని ప్రతిష్ఠించ వలెనని తలంచు చున్నాము.

రెండు వేల రూపాయలు సమర్పించువారి పేరున ఈ రామానుజ కూటములో వొక గది నిర్మించ బడును.

ఈక్రతువునకు ఆర్థికముగను తదితర విధముగను సహాయము చేయదలచువారు ఈ సంఘ ప్రధాన కార్యాలయమునకు పంపవచ్చును.

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘం.
ప్రధాన కార్యాలయము,
107 వరదాముత్తియప్పన్ వీధి.
మదరాసు 1

ఇట్లు
తె. కం. గోపాలాచార్యులు,
ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులు,
కార్యదర్శులు.

N. B:—బదరీ నారాయణస్వామివారి బొమ్మగుర్తుతో గల అచ్చు రశీదు పుచ్చుకొనకుండ క్రతువు నిమిత్తమైనట్టి ధనమునుగాని, వస్తువులగాని యెవరికి ఈయకూడదు అనివిజ్ఞప్తి.

---

## కిటన్న

బందరు వాస్తవ్యులు శ్రీ ఉ. వె. శ్రీమాన్ వేదాల రంగాచార్యులు గారి మనుమడగు చిరంజీవి వేదాల కణ్ణను యొక్క జన్మదినోత్సవమున అతని తల్లిగారు ఈ పత్రికకు రూ॥ 2-0-0 లుకట్నమును సమర్పించిరి. ఈచిరంజీవికి శ్రియఃపతి ఆయురారోగ్యభాగ్యముల కృపజేయుగాక.

## శుక్రవార పూజలు.

అయినపర్రు ప॥ గోదావరిజిల్లా

కర్రిరామిరెడ్డి భార్య సూరమ్మ

కొప్పనాటి సూర్యరావు భార్య రేణుక

అల్లము పురుషోత్తము భార్య లక్ష్మీకాంతము

ఈ భక్తురాండ్రు శుక్రవార పూజలు మహోన్నైభవముగా జరిపించినారు.

వేలేటిపాడు ప॥ గో॥ జిల్లా

గుడిమెట్ల రామిరెడ్డి భార్య సుబ్బయ్యమ్మ

బిబ్బిళ్ళసీతాయమ్మ

ద్వారంపూడి వేమనరెడ్డి భార్య సీతమ్మ

కట్టా వెంకన్న భార్య నరసమ్మ

నల్లమిల్లి తాతారెడ్డి భార్యసుబ్బయమ్మ

తానంపూడి సుబ్బన్న భార్య బుల్లి

సత్తి రామురెడ్డి భార్య పద్దయ్యమ్మ

యలమర్తి శ్రీరాములుగారి భార్య కామాక్షమ్మ

తురగా సూర్యభగవానులుగారి భార్య సుబ్బలక్ష్మి

మొదలైన భక్తురాండ్రుకోటి భాద్రపద మాసంలోను ఆశ్వయుజ మాసంలోను వారి వారి గృహములయందు పత్రి శుక్రవారం పూజలు భజనలు వగైరాలు జేరిపించిరి గాన వీరలందరకు ఆ శ్రీమన్నారాయణ మూర్తి ఆయురారోగ్య అయిశ్వైర్యములు యిచ్చి రక్షించుగాక,

అర్ధమూరు

| | |
|---|---|
| కోనాల పనరాజు భార్య సత్తిరాజు | 0-4-3 |
| మండ అప్పలరాజు భార్య వెంకమ్మ | 0-4-3 |
| కొప్పూరి సత్యం భార్య సత్యవతి | 0-4-3 |
| నల్లమిల్లి సుబ్బయ్యభార్య సుబ్బయ్యమ్మ | 0-4-3 |
| కొప్పూరి భాలిరెడ్డి భార్యవీరమ్మ | 0-4-3 |
| తాడి వెంకన్న భార్య గంగమ్మ | 0-4-3 |
| నాగిరెడ్డి వెంకటేశ్వర్లుభార్యపాపయ్యమ్మ | 0-4-3 |
| సత్తి గనిరెడ్డి భార్య చంద్రమ్మ | 0-4-3 |
| కోనాల సుబ్బన్న భార్య మహాలక్ష్మి | 0-4-3 |
| చిర్ల రామచంద్రరెడ్డి భార్య తులసమ్మ | 0-4-3 |
| మబ్బా గంగరాజు భార్య అచ్చయ్యమ్మ | 0-4-3 |
| నల్లిమిల్లి వెంకటరెడ్డి భార్యశ్రీకాంతమ్మ | 0-4-3 |
| చిర్ల ఈశ్వరుడు భార్య వీరమ్మ | 0-4-3 |



# శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ మాఘమాస పండిత పరిషత్సభలు

పాలకొల్లు పశ్చిమగోదావరి

స్వస్తిశ్రీ ఖరనామ సంవత్సర మాఘ బహుళ షష్ఠీ ఆదివారము (ది17-2-52) తేదీ లగాయితు వరుసగ మూడుదినములు పశ్చిమగోదావరిజిల్లా పాలకొల్లు పట్టణమున అష్టభుజ లక్ష్మీనృసింహస్వామివారి సన్నిధిని (చిన్నగోపురము) శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ మాఘమాస పండిత పరిషత్సభలు చీరాల వాస్తవ్యులగు శ్రీ. ఉ. వే. శ్రీమాన్ అనంతకి తిరుమల ఉభయవేదాంత కోలాహల లక్ష్మీనృసింహ కుమార తిరువేంగడ తాత దేశికాచార్యులయ్యవార్లంగారి అధ్యక్షత క్రింద జరుపుటకు నిరయించబడినది. ప్రతిదినము ఉదయమున గం7-30 మొదలు గం 10-30 వరకున్ను: సాయంకాలము గం 4-0 మొదలు గం 7-0 వరకున్ను; పండితులచే వేదాంత సభలున్ను;

ప్రతిదినము మధ్యాహ్నము గం 2-0 మొదలు గం 4-0 వరకున్ను స్త్రీలకు మాత్రము ప్రత్యేకము విదుషీమణులచే వేదాంతోపన్యాసములు జరుగును.

గాన భక్తులందరు యిందు పాల్గొన గోరుచున్నాము.

ఇట్లు

ఆహ్వానసంఘము :-

అధ్యక్షులు:- రేపాక శేషావతారం కార్యదర్శి:- రేపాక రంగయ్య.

సహాయకార్యదర్శి:- మోటమఱ్ఱి సుబ్బారావు.

కార్యనిర్వాహక సభ్యులు:-

అరవిల్లి అళహశింగరాచార్యులు గారు

చక్రా- వెంకటరత్నం.

మాచేపల్లి వెంకటరత్నము,

సింహాద్రి సత్యనారాయణమూర్తి;

కంతేటి సీతారామబ్రహ్మము,

గలాది వెంకటరత్నము.

ఇమ్మిడి సత్యనారాయణ.

రేపాక రామలింగయ్య.

రేపాక వెంకటరత్నం.

చక్రా- రంగనాయకులు. బంగారు రాఘవయ్య.

త్యావటపల్లి వెంకటరామానుజయ్య, పోకల భవనారాయణ.

పిని శెట్టి చినవెంకటేశ్వరరావు, గుణ్ణం మంగయ్యనాయుడు.

శ్రీమతే రామానుజాయ నమః.

# శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ ద్వాదశ వార్షిక విరాట్ సమావేశ

## ఆహ్వానపత్రిక (పాలకొల్లు పశ్చిమగోదావరిజిల్లా)

స్వస్తిశ్రీ ఖరనామసంవత్సర మాఘ బహుళ ౽ ఆదివారము (17-2-52) తేదీ లగాయతు వరుస గమూడుదినములు ప్రతిదినము మధ్యాహ్నము గం 2-0 లగాయతు 4-0 గం వరకు శ్రీవిశిష్టాద్వైతప్రచారక సంఘ ద్వాదశ వార్షిక విరాట్ సమావేశము శ్రీ ఉ. వే. శ్రీమాన్ అప్పంగి తిరుమల సముద్రోద్దండ కోలాహల లక్ష్మీనృసింహ కుమార తిరువేంకట తాతదేశికాచార్యులయ్యవార్లం గారి అధ్యక్షతక్రింద పశ్చిమగోదావరిజిల్లాలోని పాలకొల్లు గ్రామమున శ్రీ అష్టభుజ లక్ష్మీనృసింహస్వామివారి సన్నిధియందు జరుగును. గాన ఈ సమావేశమునకు అభిమానులు అందరు విచ్చేసి పాల్గొన గోరుచున్నాము.

శ్రీ పరాశరసుదర్శనభట్టరుఅయ్యవార్లంగారు.
శ్రీ. వి. ప్ర. సం. అధ్యక్షులు.

శ్రీ. వి, సంఘకార్యదర్శులు
తె. కం. గోపాలాచార్యులుగారు.
ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులుగారు.

## శ్రీ విశిష్టాద్వైత ప్రచార శాశ్వతనిధి

శ్రీవిశిష్టాద్వైత ప్రచారము విరివిగను శాశ్వతముగాను జరుగునిమిత్తమై ప్రతి శ్రీ విశిష్టాద్వైత సిద్ధాంతాభిమానియు తమకు వచ్చువార్షికనికరాదాయములో రూపాయి నక్కొంటికి ఒక పైస చొప్పున "శ్రీవిశిష్టాద్వైత ప్రచారశాశ్వత నిధి" కి విరాళమును సమర్పించ వలసినదిగ కోరియున్నాము. మా ఈవిజ్ఞప్తిని మన్నించి ఈక్రింద తెలుపబడిన మహాశయులు వాగ్దానములు జేయుటేగాక తామునమర్పింపవలసిన విరాళమును పంపియున్నారు. వారికి యిందుమూలముగా మాహృదయ పూర్వక కృతజ్ఞతను తెలుపుచున్నాము. శ్రియఃపతి వీరికి సకలశ్రేయస్సుల చేకూర్చ ప్రార్థించు చున్నాము. సంవత్సరమునక్కొంటికి

శ్రీ. ఉ. వే. శ్రీమాన్

| | |
|---|---|
| శ్రీ పరాశర సుదర్శనభట్టరుఅయ్యవార్లంగారు. (కోరుకొండ) | 25-0-0 |
| శ్రీమతి శ్రీ. స్వా. శ్రీవరమంగయ్యమ్మారావుగారు. (మైలవరము) | 31-1-8 |
| తె. కం. రంగరామానుజాచార్యులుగారు. (కోరుకొండ) | 25-0-0 |
| డా. ఆ. చి. కృష్ణమాచార్యులుగారు. (మదరాసు) | 25-0-0 |

మరియు ఈపత్రికలో ఈనిధికి తోడ్పడదలచిన వారు చేయువాగ్దానపత్రములు తమకు పంపబడుచున్నది. దయయుంచి తామున్స్వయముగ ఆపత్రమున తమవాగ్దానముతో పూర్తిజేసియు తమ బంధుమిత్రులచే పూర్తిజేయుంచియు, అయావాగ్దానముల ఈసంఘ కార్యాలయమునకు పంపియు ఈనిధికిన్ని తద్వారా శ్రీవిశిష్టాద్వైత సిద్ధాంత ప్రచారమునకు తోడ్పడ ప్రార్థించు చున్నాము.

ఇట్లు
శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘము,
107 వరదాముత్తియప్పన్ వీథి మదరాసు 1

శ్రీ జిష్టరు నెం. 5049

# భక్తినివేదన

(వేదాంత మాసపత్రిక)

—★—

ఇందు వేదాంత విషయ రాజములున్ను:
భక్తి ప్రచార విషయమైన వర్తలును
వేదాంత సాంప్రదాయ విషయకమైన ప్రశ్నో
త్తరములున్ను ప్రచురించబడును.

చందాలు;

| | |
|---|---|
| సాధారణ చందా సం. ర 1కి | రు. 5–0–0 |
| సహాయ చందా ,, | రు. 10–0–0 |

**Book-Post**

To

శ్రీ ఉ. వే. శ్రీమాన్:

శ్రీమాన్:

శ్రీమతి:

కార్యాలయము:— భక్తి "నివేదన" అర్తమూరు, (వయా) ద్వారపూడి తూర్పుగోదావరిజిల్లా.

1. శ్రీమన్నారాయణుడే సృష్టి – స్థితి – లయ కారకుడు.
2. ఆయనే మోక్షప్రదాత.
3. ఆయనే పరతత్త్వము-పరమాత్మ.
4. ఆయన అఖిలహేయ ప్రతనీక కల్యాణ గుణకుడు.
5. ఆయనకు జీవుడు శరీరభూతుడు; శేషభూతుడు, పరతంత్రుడు, నియామ్యుడు; అనుభావ్యుడు.
6. జీవులు జ్ఞానైకాకారులు.
7. జీవులు అనంతములు.
8. జీవులు పరమాత్మకంటె భిన్నులు; ఈ భేదము సత్యమైనది; నిత్యమైనది.
9. జీవ–పరమాత్ములకు ప్రకృతి శరీరభూతమైనది; శేషభూతమైనది; పరతంత్రమైనది; నియామ్యమైనది; అనుభావ్యమైనది.
10. ప్రకృతి వికారాస్పదమైనది. జీవపరమాత్మలకంటె భిన్నమైనది. ఈ భేదము సత్యమైనది; నిత్యమైనది.
11. జీవుడు ప్రకృతి వియుక్తుడై పునరావృత్తి రహితమైన పరమాత్మ సాన్నిధ్యమగు పరమపదమును పొందుటయే మోక్షము.
12. భక్తి ఒక్కటియే మోక్షసాధనము.
13. భక్తియన తైలధారవలె అవిచ్ఛిన్నమైన స్మృతి పరంపర.
14. వివేక-విమోక-అభ్యాస-క్రియా-కల్యాణ అనవసాద-అనుద్ధర్షలు భక్త్యంగములు.
15. ఇవి సదాచార్య-సమాశ్రయణ-లభ్యములు
16. జగద్గురువగు శ్రీరామానుజాచార్యులు వారును; వారి యనుయాయులున్ను సదాచారులు.

"నగురద్వైష్ణవాత్ పరః" భా. సం.

Edited Printed & Published by A,Ch. Srimannarayanacharya at SrimanPress, Kakinada.E.G,Dt



శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము

107, వరదా ముత్తియప్పన్‌వీధి. మదరాసు -1



## శ్రీ విశిష్టాద్వైత ప్రచార శాశ్వతనిధి వాగ్దాన పత్రము.

ది. 12-12-1951 తేదీన మదరాసులోని సంఘకార్యాలయమున శ్రీ ఉ. వే. శ్రీమాన్ శ్రీపరాశర సుదర్శన భట్టరు అయ్యావార్లంగారి అధ్యక్షత క్రింద సమావేశమైన శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ కేంద్ర కార్యకారణీ సమితి జేసిన నాల్గవ తీర్మానము.

"శ్రీవిశిష్టాద్వైత సిద్ధాంత ప్రచారము విరివిగా జరుగుటకు స్థిరమగు ఆర్థికావకాశము కల్పించుట అత్యంతావశ్యకము. ఇందు ప్రచారమున కవలంబింపవలసిన విధానములు:—

1. ముఖ్యముగ విద్యాప్రచారము జరుగవలసియున్నది. ఇది శ్రీభాష్య-భగవద్విషయ-వేద-స్మార్తములలో పండిత పరీక్షల నేర్పరచి అందు త్తీర్ణులైన యోగ్యులగు పండితులందరకు జీవితాంతము వరకు సన్మానమును చేయుచుండుట.

2. ప్రచారకులను తయారుచేయు శిక్షణాలయములను నడుపుచుండుట.

3. వేదాంత విద్య నభ్యసించు విద్యార్థులకున్ను, అభ్యసింపజేయు పండితులకున్ను తగు ఆర్థిక సహాయమును చేయుచుండుట

4. పత్రికా ప్రచురణ; పుస్తక ప్రచురణ; విరివిగా జరుపుట మొదలగునవి.

ఇందులకై "శ్రీవిశిష్టాద్వైత ప్రచార శాశ్వతనిధి" అనుపేరున ఒక శాశ్వత నిధిని ప్రారంభించ వలెననియు దానికై ప్రతి శ్రీవిశిష్టాద్వైత సిద్ధాంతాభిమానియు తన నికర ఆదాయములో సంవత్సరము నకు రూపాయకు ఒక్క దమ్మిడీ చొప్పున ఈనిధికి శాశ్వతముగ విరాళమును సమర్పించు చుండవలసి నదిగ కోరుచు తీర్మానించడమైనది. ఈనిధి కేవలము శ్రీభగవద్రామానుజులవారు సిద్ధాంతీకరించి ప్రచారము జేసిన శ్రీవిశిష్టాద్వైత సిద్ధాంత ప్రచారమునకై మాత్రమే వినియోగించవలయును".

### వాగ్దానము

పై తీర్మానమును నేను అంగీకరించుచు నేను నావార్షిక నికరాదాయము ననుసరించి సంవత్సరము (మాసము) ఒక్కింటికి రూ అక్షరాల చొ॥ శ్రీవిశిష్టాద్వైత ప్రచార శాశ్వతనిధికి విరాళమును శాశ్వతముగ సమర్పించు చుండుటకు వాగ్దానమును జేయుచున్నాను.

సంతకము.

పేరు

చిరునామా గ్రామము పోస్టు తాలూకా జిల్లా

విరాళమును సమర్పించు కాలవివరము.

    

శ్రీమతే రామానుజాయ నమః

భక్తి

# నివేదన

## శ్రీ కృష్ణార్జున సంవాదము

[శ్రీకృష్ణు డాలోచనా నిమగ్నుడై ప్రవేశించును]

(తెరలో

నీ వడవిన్ పగల్దిరుగ నీ కుటిలాలక లాలితాస్యమి
చ్ఛావిధి చూడకున్న నిమిసంబులు మాకు యుగంబులై చనున్।
కావున రాత్రులైన నిను కన్నుల నెప్పుడు గానకుండల
క్ష్మీవర రెప్పలడ్డముగ జేసె విధాత యిదేలకూరుడై॥

(శ్రీకృష్ణుడు వినుట నభినయించి)

ఇదిగో! ఇట్టి నా భక్తులు నా దర్శనము చేతనే గాని మరియే యితర సాధనముల చేతను తమ ధారణ పోషణాదులను లభింపనివారై నన్ను చూడని క్షణమాత్ర కాలమయినను కల్ప సహస్రముగా నెన్నుచు దుఃఖవశమున మిక్కిలి శిధిల గాత్రులగుదురని తలంచి వారికి నా స్వరూపమును నా క్రీడలను నా చూపులను నా మాటలను నొసంగి రక్షించుటయే ముఖ్య ప్రయోజనముగా నవతరించితిని. ఇక వీరికి కంటకులుగా నుండు నీచులను నిర్మూలించుటయు నా యారాధనా స్వరూపమగు ధర్మసంస్థాపన గావించుటయు శేషించియున్నవి. అందు మొదటి పనిని కూడ నేను పుట్టిన నాటినుండియు పూతనా శకటాసుర (యమళార్జున అరిష్ట ప్రలంబ ధేనుక కాళియ కేశి కువలయాపీడ చాణూర ముష్టిక కోసల) కంసాదుల వధించి నెరవేర్చియే యుంటిని. ఇంకను రాజవేషముతో భూభారముగా నున్న రాక్షస ప్రకృతులు వేనకు వేలున్నారు. వీరిని కడతేర్చి నీ భారమును తీర్తునని యా భూదేవి కభయ మొసంగి యవతరించితిని. యిందరనూ ఇదే విధముగ వేరవేర సంహరించుట కాలవిలంబమునకు కారణమగును. ఇక ధర్మసంస్థాపన కవ

కాశమేది? కావున సమష్టిగా వీరల సంహరించి అందులకు నిదానముగా మన యర్జునుని గూర్చి గీత నుపదేశించు వ్యాజముతో ధర్మ సంస్థాపనను గూడ గావించ వచ్చుననియే యీ భారత యుద్ధమును గల్పించి యర్జునుని సారథ్యమున కియ్యకొంటిని.

(పరీక్షగా చూచి) (తనలో) అదిగో! అర్జునుడు యోధవేషముతో తొందరగ నిట్లే తెంచు చున్నాడు. నేనీతనికి యుద్ధవీరుల నొకసారి చూడ తలంపును బుట్టించి నాపనిని నెరవేర్చు కొందును.

(ప్రకాశముగా అర్జునా) స్వాగతము. యేమి? నాపని యేమైన వచ్చినదా?

అర్జు:- అయ్యో! అట్లందువేమి? వచ్చినదే నీపని.నీవు లేనిది మాకేపని లేములును కృష్ణా.

శా. లాక్షాగేహము నుండి గాచితివి. వా
ల్లభ్యంబు మీరన్ ననిన్ ।
సాక్షాత్కార మొసంగి నాడవిన పాం
చాలిన్ సభాసీమలో ।
నక్షయ్యంబగు వస్త్రదానమిడి రక్షా
లోకము దుంచి త
త్ప్రాక్షా! మాధవ! నీవు లేని దొక సా
హాయ్యంబు మా కున్నదే ॥

కాని కృష్ణా! అనుకొన్నంతయునైనది. యుద్ధమాసన్నమైనది. నేను భీష్మద్రోణులకే భయపడుచున్నాను. తక్కిన వారిని సంహరించుట నాకంత వింతగాదు. కృష్ణా! వారు రణరంగమునకురుకుదు రందువా! ఆ ద్రోణాచార్యులకు నా యందెంత ప్రేమ! తన పుత్రుడగు నశ్వత్థామకు గూడ జెప్పని ధనుర్వేద రహస్యములను నాకుపదేశించి యాతనికంటె నన్ను ఘనుని గావించి నాకొఱకా యేకలవ్యుని వ్రేలు నరకించె. అట్టి నా గురుడు నన్నెట్లు యుద్ధమున నెదుర్కొన నంగీకరించును?

ఇక భీష్మ పితామహునకు మన ధర్మజుడన్న యపారగౌరవము. ఇక నీవన్న యాతని భక్తికి మేరయే లేదు. ఇంకను నాతడు ధర్మమూర్తి, ఆతడెల్లప్పుడును మన ధర్మమును కౌరవుల యధర్మమును కన్నులార గాంచుచు వారల నేవగించుచు మనల యాదరించుచునే వచ్చుచున్నాడు. అట్టి వాడెట్లు మనతో యుద్ధమునకు డీకొనును. వారుభయులును తప్పక యుద్ధ విముఖులగుదురనియే నా నిశ్చయము. ఐనను త్వరగ మన రథమును బూన్చి రెండు సేనల మధ్యకును బోవుదము. నే నొకసారి ఉభయసేనా సంవిధానమును చూడగోరుచున్నాను.

కృ:- ఇదుగో యిప్పుడే రథమును గొని తెత్తును. నీ విట నుండుము. (అని రథముతో ప్రవేశించును. అర్జునుడు రథము నెక్కును. ఉభయ సేనల మధ్య రథము నిలుపబడును అర్జునుడు ఉభయసేనలను తేరి పారచూచి గడగడ వణకుచు కన్నీరు గార్చును.)

అర్జు:- కృష్ణా! ఇది ఏమి? మూలమూలల నిరికియున్న బంధుజనులందరు బయటపడి యుద్ధ సన్నద్ధులై నిలిచియున్నారే! నా ప్రియ భీష్మపితామహుడు నా పూజ్య ద్రోణాచార్యులును గూడ నాతో నెదుర్కొన సన్నద్ధులై యేతెంచిరే! ఆహా! ఎంత విపరీత కాలమాసన్నమైనది. కృష్ణా నా కేలనో వీరిని చూడగనే కరచరణములు తడబడుచున్నవి. నోరార్చుకొని పోవుచున్నది. ఆ పాదమస్తకము కంపించుచు పులకరించుచున్నది, మూడుము అయ్యో! నా దేహమంతయు మండిపోవుచున్నది. నా మనస్సు తల్లడిల్లిపోవుచున్నది. కృష్ణా! ఇక నేనీరథమున నిలువజాలక యున్నాను. (అని గాండీవమును జారవిడిచి రథముపై చతికిలబడును.)

కృ:- (తనలో) సరియె. నే తలంచి నట్లీతనికి వైరాగ్య నిదానమగు విషాద మావరించినది. ఈ యవకాశము నూతగగొని ధర్మసంస్థాపన కనువగు గీతోపన్యాసమును గావింతును. దాన మనుముందు కలియుగమున నందరు దీనిని పరమాత్మకృష్ణ ప్రమాణ రాజముగ పరిగ్రహించి కర్తవ్యా, కర్తవ్యముల నిర్ణయించుకొని సకల సంశయ నిర్ముక్తులై యథాధికారముగ మోక్ష మార్గము నవలంబింతురు గాక. ఐనను ముందీతని వైరాగ్యము నొకింత పరీక్షించి చూతును,

(ప్రకాశముగా) అర్జునా! ఇట్లేల యకస్మాత్తుగ యుద్ధ విముక్తుడ వగుచున్నావు! నీకీ యుద్ధమున తప్పక జయము లభించును. దానిచే రాజ్యము చేకూరును. అందువలన సకల సుఖ ముల ననుభ వింతువు. కావున లేచి యుద్ధమునకు గడంగుము.

అర్జు:- కృష్ణా! నా పూజ్యుడగు ఆచార్యుడు నా కత్యంత ప్రియుడగు నా తాత. ఇంకను పితృ తుల్యులు పుత్ర తుల్యులు మొదలగువారితో కలసి సుఖించుటకే గదా రాజ్యము నపేక్షించునది. అట్టివారే ప్రాణముల మీద ఆశను ధనముల యందలి తృష్ణను వీడి యుద్ధరంగమున నిలచి యున్నారు గదా! కృష్ణా! ఇట్టివారిని చంపుట పాపమునకు కారణము కాదా!

కృ:- పాపమెట్లగును, వారు నిన్ను చంపుటకు సన్నద్ధులై యున్నతరి నీవు వారిని చంపుట! క్షాత్రము కాదా!

అర్జు:- అది నిజమే కాని కృష్ణా! నేను వీరినందర జంపినచో కులమంతయు నశించి చిర కాలమునుండియు పరంపరగా వచ్చుచున్న కుల ధర్మములు నశించును. ఆ స్థానమును అధర్మ మాక్రమించును. దానిచే కులస్త్రీలు చెడుదురు. వారు చెడిన వర్ణ సాంకర్యమున కిక నేమి కావలెను. ఆ సాంకర్య దోషము కులనాశకులమగు మనకును కులమునకు నరకావహము కాదా!

ఆహా! కృష్ణా! రాజ్యలోభముచే నెట్టి పాప కార్యమున కొడిగట్టికొంటిమి! ఛీ! వారు నన్నేమి చేసినను చేయనిమ్ము! నేను మాత్రమిక గాండీవము నంటను. (అని రథముపై కూర్చుండును.)

కృ:- (తనలో) ఈతని మూలమున నేనిపుడు రెండు పనులు సాధింప సమకట్టితిని! ఒకటి ధర్మ సంస్థాపన రెండవది దుష్టశిక్షణము. కేవలము లౌకిక యుక్తులతో గాని నా విశ్వరూపమును చూపి గాని బలవంత పరచిగాని యుద్ధమునకు పురికొల్పితినా! రెండవ కార్యసిద్ధి యగును గాని ధర్మ సంస్థాపన కానేరదు. ఈతనికి కలిగిన నిర్వేదమునకనుగుణముగ వేదాంతార్థమును మాత్రమే బోధింతునా! మొదటి కార్యము సఫలమగును గాని దుష్టశిక్షణ యట్లే యుండిపోవును. కావున రెండు పనులును నెరవేరునట్లు రెండింటిని సమన్వయపరచి విస్తారముగ నీతని కుప దేశింతును. (ప్రకాశముగా) (అతని ముఖము నెత్తి) అర్జునా! ఇదియేమి? నీవు మా యర్జునుడవేనా! మా యర్జునుని జీవితమున నెన్నటి కశ్మలము నెన్నడును చూడనేలేదే! (అయ్యో పెద్దలది వినిన అపహ్యించుకొందురు.

ఉ॥ ఎందుకు నీకు కశ్మలమిదేటికి బూనితి మంచి సంకటం ।
బందున తెచ్చిపెట్టితివి యార్యులు మెచ్చరు కీర్తిపోవులే ।
వందున నిందుగూడ నుభయత్రసుఖంబులు ధైర్యమూనినీ।
వందఱు మెచ్చునట్లు రణమందు జయంబును గాంచు మర్జునా?॥

(అని గాండీవమును చేతికి నందించి చేయిబట్టి లేవదీయును అర్జునుడు లేవకయే యేడ్చుచు.)

అర్జు:- కృష్ణా! నన్ను చిన్ననాటినుండియు నందరి కంటె హెచ్చుప్రీతితో నల్లారు ముద్దుగా యెత్తి పెంచిన ముదుసలి పండగు నాతాత భీష్ముని పూజింప వలసిన చేతులతో బాణముల విడచి చంపుదునా కృష్ణా! అయ్యో! తన బిడ్డని గొణుగును సరకుగొనక దుర్యోధన కర్ణాదుల ఈర్ష్యా కలుషిత దృష్టిపై దృష్టి నిడక నన్నే యుద్దేశించి ధనుర్వేదమును బోధించుచు నా చేతనే మిగిలిన వారికి అభ్యాసము నిప్పించుచు వారు లేని సమయమున నాకాధనుర్వేద రహస్యముల నుపదేశించుచు నా యభివృద్ధిని గోరి విద్య నరిపిన నా పూజ్యతములగు ద్రోణాచార్యులకు నేను కృతఘ్నుడనై సమర్పించు గురుకట్నము ఈ తీక్ష్ణ బాణ సంప్రయోగమా! కృష్ణా! యిట్టి పాపమున కొడిగట్టుకొనుటకంటె బిచ్చమెత్తి పొట్ట పోసుకొనుట మేలుకదా! అయ్యో! నాధైర్యము మంటకలసినది. నా కృత్యాకృత్య వివేకము దూరమయినది కృష్ణా! యిక నీ పాదములే నాకు శరణ్యము. నేను నీ ప్రియశిష్యుడ! నన్ను నీటిముంచినను పాలముంచి నను నీదే భారము. నాకు శాస్త్రసారము నుపదేశించి నా కర్తవ్యమును నీవే నిర్ణయింపుము.

(అని ఆతని పాదములపై బడును.)

కృష్ణు:- ఆహా! నా యవతార కృత్య మింతటితో సార్థకము కాగల తరుణ మాసన్నమయినది. నా దీర్ఘోపన్యాస మంతయు సమాప్తియగు వరకీ యోధులందఱ నా మాయచే స్తబ్ధుల గావింతును. (అని చుట్టును తిరిగి యందరను తేరి పారచూచును.)

---

# ఉపనిషత్తులు — రామానుజదర్శనం

అనువాది:— 'శ్రీశేషి'

ఉపనిషత్తులే వేదాంతమని ఒక్కమాటలో చెప్పాలి. ఏమంటే ఇవి వేద సంహితాది భాగాలలో చివరి అధ్యాయాలు. మాధ్యందిన సంహితలో చివరి అధ్యాయం ఈశావాస్యోపనిషత్తు.

ఇక రెండో విషయమేమంటే అవి వేదాలకు అంతాలు. అంటే సారరూపాలన్నమాట. వేదములో ప్రతిపాదించబడిన బ్రహ్మజ్ఞానము ఈ ఉపనిషత్తులలో ప్రత్యక్షముగా చేరివున్నది. వేదా వశిష్టభాగాలలో మాత్రము కర్మకాండ, యజ్ఞము, దేవప్రశంస, ఇత్యాదిరూపాన అప్రత్యక్షముగా బ్రహ్మ జ్ఞానము ఉన్నది.

ఉపనిషత్తుల అర్థాన్ని చక్కగా తెలియజేయటానికీ ఉపనిషత్తులలో వర్ణించబడిన విషయాన్ని ఒక తర్కపూర్ణ వైజ్ఞానిక పద్ధతితో క్రమబద్ధం చేయటానికీ మహర్షి వేదవ్యాసులు బ్రహ్మసూత్రాలను బయలు పరిచాడు. బ్రహ్మసూత్రాలనే వేదాంత దర్శనమంటారు. వేదములో ఉత్తరభాగమీమాంస ఉండటాన వీటిని ఉత్తర మీమాంస అని కూడా అంటారు. అంతేగాక బ్రహ్మమీమాంస వుండటాన బ్రహ్మసూత్రాలనే బ్రహ్మమీమాంస అని కూడా అంటారు.

బ్రహ్మసూత్రార్థాన్ని స్పష్టం చేయటానికీ బ్రహ్మసూత్రాలకు వాటి విషయములయిన ఉపనిషత్తులకు (శృతులకూ) పరస్పర సామంజస్యాన్ని చూపటము కోసము వివిధాచార్యపాదులు బ్రహ్మసూత్రాలపై భాష్యరచనచేసారు. ఆ భాష్యాలవల్ల ఉపనిషత్తులలో ప్రతిపాదించబడిన విషయము అవగతముచేయబడ్డది. బ్రహ్మసూత్రాలు ఆ అర్థాలకు సాక్షులు గానే ఉన్నాయి. ఉపనిషత్తుల వాస్తవార్థం బ్రహ్మసూత్రాలలో వున్నది. కాని సంక్షిప్త రూపములో ఉన్నది. ఆ అర్థాన్ని విస్తృత పరచటమే భాష్యాలకార్యం. ఈ పరంపరవల్ల భాష్యాలు ఉపనిషత్తుల అర్థాన్ని దార్శనిక నీతి ప్రకారము క్రమబద్ధముగా అవగతపరుస్తాయి. ఈ భాష్యాలను నిర్మించటానికి ముందు ఆచార్యులు ఉపనిషత్తులలో ప్రతిపాదించబడిన తత్త్వాన్ని విభిన్న రూపాలలో చూచారు. శ్రీ శంకరాచార్యులు వారు అద్వైతరూపము గాను, రామానుజాచార్యులువారు విశిష్టాద్వైత రూపముగానూ, వల్లభాచార్యులవారు శుద్ధాద్వైత రూపములోను ఈ భాష్యనిర్మాణము వారి వారి స్వాభావిక సంస్కారానుగతముగా చేసారు.

ఆ తత్త్వాన్నే తమ దృష్టి కోణములో పె దాన్ని విస్తారముగా తమ తమ భాష్యాలలో ప్రతిపాదించారు. బ్రహ్మసూత్రాలలో ఆత్మత్వం యొక్క సామంజస్యాన్ని చూపారు. ఈ విధముగా శృతి-సూత్ర భాష్యాలు మూడూ ఒక పూర్ణదర్శనమైతే భాష్యానుసారంగానే వాటి పేర్లు నిర్దేశించబడుతూ వున్నాయి. శంకర వేదాంతం, రామానుజ వేదాంతము, మాధ్వ వేదాంతము, వల్లభ వేదాంతము. ఇవే క్రమముగా అద్వైత వేదాంతము, విశిష్టాద్వైత వేదాంతము, ద్వైత వేదాంతము, శుద్ధాద్వైత

వేదాంతమని చెప్పబడుతూవున్నాయి. వీటికే దర్శన శబ్దాన్ని కలిపితే శఙ్కర వేదాంత దర్శనము లేదా శాఙ్కర దర్శనం. రామానుజ వేదాంత దర్శనము లేదా రామానుజ దర్శనం. ఇత్యాది విధాల చెప్పబడుతూ ఉన్నాయి. ఈ దర్శనాలలోనిదే ఒకటి ఇప్పుడు మనము విచేస్తూ ఉన్న రామానుజ దర్శనము.

ఇక్కడ మనము చూడవలసిం దేమిటంటే ఉపనిషత్తులలో రామానుజ వేదాంత దర్శనం ఏరీతిగా సామంజస్యమై ఉన్నదని? అంటే ఉపనిషత్తులు రామానుజ దర్శనములో ఏ విధముగా నిరూపించబడినై; అనే విషయమే గాని ఇక్కడ విశిష్టాద్వైత సిద్ధాంతమన్న తర్కారంభంగాదు. ఉపనిషత్తులలో సామాన్యరూపముగా నాలుగు రకాల శృతులుదొరుకుతై. (౧) నిర్గుణాన్ని ప్రతిపాదించేవి. (౨) సగుణాన్ని ప్రతిపాదించేవి. (3) అభేదాన్ని ప్రతిపాదించేవి, (౪) భేదాన్ని వాదించేవి.

నిర్గుణ ప్రతిపాదకాలలోనూ సగుణ ప్రతిపాదకాలలోనూ పరస్పర విరోధము ఉన్నట్లు అర్థమౌతుంది, ఇదే విధముగా భేదాభేద వాదశృతులలో కూడా అనువంశికముగా అవైరుధ్యం వస్తూనే వున్నది. ఈ వైరుధ్యపరంపర ఆచార్యత్రయానికి కూడా అవశ్యానుభావ్యమై వచ్చినది. అయితే అందులో వాస్తవ దృష్టితో చూస్తే ఈ భేదాభేద సగుణ-నిర్గుణ ప్రతిపాదక శృతుల సామంజస్యమే. రామానుజ దర్శనము.

నిర్గుణ ప్రతిపాదక శృతులు.

(నిష్కలం, నిష్క్రియం, నిర్గుణం నిరవద్యం నిరంజనం, అప్రతర్క్యమ్, అవిజ్ఞేయం, ఏష ఆత్మా అపహత పాప్మ విజరో విమృత్యుర్విశోకో విజఘత్సో పిపాసః ఇత్యాదులు). కొన్ని ఉన్నాయి. వీటి తాత్పర్యమేమంటే పరబ్రహ్మలో కామ-క్రోధ-లోభ-మోహ-ఈర్ష్యా-ద్వేష-రాగ శోకాలూ ఆకలి దప్పులూ జరామరణాలూ మొదలయిన హేయ (త్యాజ్య) గుణాలు లేవు. గుణశబ్దం విశేష మాత్రానికి ద్యోతకము. విశేషణం సదసత్తులలో ఏదైనా ఒక్కటే. గాబట్టి ఆ పరబ్రహ్మ నిర్గుణుడు నిర్విశేషుడు.

ఇక సగుణ ప్రతిపాదక శృతులు

(పరాస్యశక్తిః ర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞాన బలక్రియాచ ।

సత్యకామః సత్యసఙ్కల్పః కపిర్మనీషీ సోఽకామయత సర్వగంధః సర్వరసః ఇత్యాదులు) కొన్ని ఉన్నాయి. వీటి తాత్పర్యమేమంటే పరబ్రహ్మలో జ్ఞాన-బల-ఐశ్వర్య-వీర్య-శక్తి-తేజ-సౌశీల్య-మార్దవ-ఆర్జవ-సౌహార్ద-స్వామిత్వ-కారుణ్య-మాధుర్య-గాంభీర్య-ఔదార్య-చాతుర్య-స్థైర్య-ధైర్య-శౌర్య-పరాక్రమ-సత్యకామ-సత్యసంకల్పత్వ- సర్వ లోకైకశరణ్యత్వాలు అసంఖ్యేయములుగానూ (కళ్యాణ గుణాలు) ఉన్నాయి. అని

ఈ విధముగా పరస్పరముగా సామంజస్యం చేస్తే రామానుజ దర్శనములో బ్రహ్మ స్వరూపము నిరూపించబడిన విధం పరంబ్రహ్మ పరమాత్మ యేకమాత్రముగా అనంత సచ్చిదానంద స్వరూపుడు. సమస్త త్యాజ్య దోషాలు లేనివాడు. అనంత కళ్యాణ గుణగణ పరిపూర్ణుడు. అని మాత్రే

అద్వైతా (అభేదా)న్ని ప్రతిపాదించే శ్రుతులు (ఏకమేవా ద్వితీయం, నేహ నానాస్తి కించన, శాంతం, శివ, మద్వైతం ఇత్యాదులు) కొన్ని ఉన్నాయి.

వీటి అర్థమేమంటే చిదచిద్విశిష్ట బ్రహ్మ తప్ప ఇక ఇతరం లేనే లేదని చిత్ అంటే జీవుడు అచిత్ అంటే ప్రకృతి. ఇవి బ్రహ్మ యొక్క (స్థూల-సూక్ష్మ) శరీరాలు బ్రహ్మ వీటికి (కారణ భూతమయిన) ఆత్మ, చేతనాచేతనాలన్నీ నిత్యాలే వాటితో యెల్లప్పుడూ విశిష్టముగా ఉంటాడు బ్రహ్మ. ఏమంటే చిదచిత్పదార్థాలు నిత్యాలు గాబట్టాన ఎక్కడెక్కడ ఉన్నా వుండకపోయినా అక్కడక్కడ అంతటా బ్రహ్మ అవశ్యము వుంటాడు. ఏమంటే ఆయన అనంతుడు. ఎల్లప్పుడూ యెల్లచోట్ల విరాజిల్లుతూ ఉన్నాడు. అంతే గాక బ్రహ్మ ఈ చేతనాచేతనాలలో ఆత్మ రూపముగా ఉన్నాడు. చేతనాచేతనాలను జీవుని లాగానే నియంత్రిత పరుస్తాడు.

జీవుడు కర్మవశుడు గాబట్టాన స్వేచ్ఛాపూర్వకముగా తన శరీర ప్రయోగాన్ని యే కాలములోనూ చేయలేడు. గాని బ్రహ్మ సర్వ స్వతంత్రుడూ అనంత జ్ఞాన-శక్తి యుక్తుడు గావటాన యథేచ్ఛముగా శరీరాన్ని ప్రయోగించ గలడు. శరీర విశిష్టమయిన ఆత్మను దేవదత్త మనే నామాలతో వ్యవహరిస్తూ ఉన్నట్లూ పుణ్యవంతమయిన దేవదత్తాత్మ స్వర్గాన్ని పొందుతున్నది. అని ఇత్యాది విధముగా నిర్దేశిస్తూ ఉన్నట్లూ శరీరము ఆత్మకు విశేషణము (గుణం) గావటాన ఆత్మతోటే ఏకతా వ్యవహారములో వస్తుంది. ఈ విధముగానే చేతనాచేతన శరీరిక బ్రహ్మ ఒక్కడే అయినాడు.

విశేష్యము నుంచి విశేషణము యెప్పుడూ వేరుపడదు. అంటే యిక్కడ గుణమే విశేషణమనీ, చేతనాచేతనాలు ద్రవ్యాలు గాబట్టి అవి విశేష్యాలెల్లా ఔతాయని శంకించరాదు. ఏమంటే విశేషణముతో వేరుపడలేని దాన్నే విశేష్యమంటారు. శరీరము భోగాయతన మౌతుందా అన్న సందేహము కూడదు. ఏమంటే ఏది తన శరీరముతో వేరు గాకుండా ఉండే దాని ద్వారా ధరించబడి నియంత్రితమౌతూ శరీరానికి సర్వతోభాగముగా శేషమై — సర్వ [శరీర] శేషమై వుంటుందో ఆ ద్రవ్యానికే శరీరమన్నది పేరు.

చేతనాచేతనాలు బ్రహ్మశరీరమని

(యస్యాత్మా శరీరం యస్య పృథివీ శరీరం యస్యాక్షరః శరీరః మనోమయః ప్రాణశరీర నేతా ఇత్యాది) శ్రుతులే చెపుతూ ఉన్నాయి.

ఈ విధముగా సకల విశ్వం బ్రహ్మ శరీరము గావటానికి బ్రహ్మ అనే అనబడుతూ ఉన్నది. గాబట్టే భగవతీశ్రుతి సర్వం ఖల్విదం బ్రహ్మ అంటే సర్వాన్ని వేరుగా ఎంచబోకు అది బ్రహ్మయే. అని చెబుతున్నది. ఈ భావమే (సోఽహమస్మి. అహం బ్రహ్మాఽస్మి. తత్త్వమసి. అని) శ్రుతులలో వున్నది. శరీరాన్ని శరీరి ద్వారా నిర్దేశపరచటానికి వీలున్నట్లుగానే చేతనముగాని అచేతనముగాని బ్రహ్మ శరీరము గావటాన తనకు వేరుగా శక్తిని నిలుపలేదు. గాని దాన్ని అహం బ్రహ్మాఽస్మి నేను బ్రహ్మన్ను అని మాత్రమే అనవలసివస్తుంది. ఈ విధముగానే అభేదవాద శ్రుతుల అర్థమేమంటే

చిదచిద్విశిష్ట బ్రహ్మవస్తువేమీ లేదు. కేవలము ఒక్క బ్రహ్మే ఉన్నాడు అని.

భోక్తా భోగ్యం ప్రేరితారం చమత్వా, నిత్యోఽనిత్యానాం చేతనశ్చేతనానాం, ఇత్యాది భేదవాదశ్రుతులు కొన్ని ఉన్నాయి. అవి చేతనాచేతన బ్రహ్మ తత్త్వాలు మూడనీ, అవి వేర్వేరనీ నిరూపణ మాత్రము చేస్తున్నాయి. ఈ విధానమువల్ల బ్రహ్మను ఆయన శరీరాన్ని సువిధముగా తెలుసుకోవచ్చు. ఈ మూటి సంబంధాన్ని యస్యాత్మా శరీరమ్, అనే మొదలయిన ఘటక శ్రుతులు చెప్తున్నాయి. అభేదవాదశ్రుతులు చేతనాచేతన విశిష్ట బ్రహ్మను చెపుతున్నాయి. గాబట్టి ద్వైత-అద్వైత ఘటక పరములైన శ్రుతుల సామంజస్యము మూడు విధాలుగా ఉన్నది. పూర్వోక్త శ్రుతులు నాలుగు విధాలవీ గూడా రామానుజదర్శనమునకు సామంజస్యాత్తాలై. సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ, అనే శ్రుతి బ్రహ్మస్వరూపాన్ని ఉపస్థాపితము చేస్తుంది. సగుణ-నిర్గుణ భేదాభేదాలను వివరించే శ్రుతుల సామంజస్యము గూడా రామానుజదర్శనములో వున్నది. ఇప్పుడిక బయలుదేరే నిష్కర్ష ఏమంటే సత్యానంత జ్ఞానానందైక స్వరూపుడూ అఖిలహేయ ప్రత్యనీకుడూ సకల కళ్యాణ గుణాకరుడూ, చిదచిచ్ఛరీరకుడు ఒక్క పరబ్రహ్మ వస్తువు. దాని తత్త్వమూ గూడా అని, ఇక ఇంతకు మించినదంతా మిథ్య. పూర్వోక్త గుణవిశిష్టమైన సూక్ష్మచిదచిచ్ఛరీరక బ్రహ్మకారణుడు, పూర్వోక్తగుణ విశిష్టుడైన స్థూల చిదచిచ్ఛరీరక బ్రహ్మకార్యము. కారణ కార్యాలలో అభేదమే ఇలా అయింది. కాబట్టి సూక్ష్మచిదచిద్విశిష్ట బ్రహ్మలోనూ స్థూలచిదచిద్విశిష్ట బ్రహ్మలోనూ అద్వైతము వుండటాన పరబ్రహ్మను విశిష్టాద్వైతుడనీ ఆ సిద్ధాంతాన్నే విశిష్టాద్వైత సిద్ధాంతమనీ అంటారు.

ఈ స్థితిని తెలుసుకొన్న చేతనుణ్ణి జ్ఞాని అంటారు. తెలుసుకొన్న తర్వాత తన అంతర్యామి వైపు ఆకర్షించబడిన వానినే భక్తుడు. అంటారు. అతడే తన ఉపాయాన్ని తెలుసుకొనే శరణాగతుడు; ప్రపన్నుడు అని అనిపించుకుంటాడు. శరణాగతే ప్రభువును తెలుసుకొనటానికి ఆయనను పొందటానికీ ఏకైక ఉపాయం. శరణాగతిలో తాత్పర్యమేమంటే శరణాగతిని గూడా ఉపాయమనుకోకుండా కేవలము ప్రభు చరణారవిందములకు సేవజేసే ఉపాయాన్ని తెలుసు కొనటమే. ప్రభుచరణ కైంకర్యమే ప్రాప్యము. ఇక్కడ శాస్త్ర దిగ్దర్శనము మాత్రమే చేయబడ్డది. గ్రంథవిస్తరంభీతి ఈ విచారణను సంక్షిప్తీకరించింది. ఇక మనము ఇప్పుడు ఉపనిషత్తులకూ రామానుజ దర్శనానికీ సామంజస్యాన్ని నిరూపించే ఒక శ్లోకాన్ని జప్తికి తెచ్చుకొని విశ్రమిద్దాం.

నిత్యం హేయ గుణావధూననపరా
నైర్గుణ్యవాదాః శ్రుతౌ
ముఖ్యార్థాః సగుణోక్తయః
శుభగుణ ప్రఖ్యాపనాత్ బ్రహ్మణః।
అద్వైతశ్రుతయో విశిష్టవిషయా
నిష్కృష్టరూప శ్రియా
భేదోక్తిస్త్వధిషా ఖిలశ్రుతిహితం
రామానుజీయం మతమ్॥

శ్రుతిలో నిర్గుణ స్వరూపాన్ని ప్రతిపాదించే

మాటలకు తాత్పర్యముగా పరమాత్మలో హేయ [త్యాజ్య] గుణాలు నిత్యమూ నిరాకరణ మాత్రముగా ఉన్నాయి. అంటే సకల కళ్యాణ గుణాలకూ పరమాత్మ సాగరము వంటివాడని అర్థము. సగుణ స్వరూపాన్ని ప్రతిపాదించే వచనాలు తమ ముఖ్యార్థములోనే తాత్పర్యాన్నిస్తాయి. ఎందువల్లనంటే అవి బ్రహ్మయొక్క నిత్యకళ్యాణమయ గుణాలను నిరూపిస్తాయి అద్వైతశ్రుతులు చిదచిద్విశిష్టబ్రహ్మకు వేరుగా యేమీ లేదని చెప్తున్నాయి. భేదప్రతిపాదిక శ్రుతి బ్రహ్మయొక్క చిదచిత్ స్వరూపాలను వేర్వేరుగా నిరూపణ మాత్రము చేస్తాయి. ఈ విధముగా శ్రీమద్రామానుజార్య మతము సర్వశ్రుతి సమ్మతం.

---

# ఉడయవరులకు తిరుక్కోట్టియూరు నంబిగారు సాయించిన ప్రమేయ సారము

శ్రీపన్నారాయణ

## ప్రపన్నుడైన వానికి పరిహార్యములైనవి ఆరు విషయములు.

1. ఆశ్రయణ విరోధి.
2. శ్రవణ విరోధి
3. అనుభవ విరోధి
4. స్వరూప విరోధి
5. పరత్వ విరోధి
6. ప్రాప్తి విరోధి.

ఇందు ఆశ్రయణ విరోధి యనగా:—

అహంకార-మమకారమున్ను, ఫలాభిసంధియున్ను, పురుషకారత్వమును పొందకుండుటయున్ను, ఫలమందు సంశయమున్ను కలిగియుండుట.

శ్రవణవిరోధి యనగా:- దేవతాంతరములకు సంబంధించిన కథావిషయముల యందు అవహితుడైయుండి వినుట.

అనుభవ విరోధి యనగా:- భోగద్రవ్యమును పుచ్చుకొని ప్రవేశించి స్నేహద్రవ్యమును పుచ్చుకొని బయలువెడలు విపరీతానుభవేచ్ఛ కలిగి యుండుట,

స్వరూప విరోధి యనగా:- తనను భగవంతునికి పరతంత్రునిగా ఒప్పుకొనక స్వతంత్రునిగా దలచుట.

పరత్వ విరోధి యనగా:- క్షేత్రజ్ఞులైన బ్రహ్మ- రుద్రుడు మున్నగు వారలను ఈశ్వరునిగా భ్రమించుట.

ప్రాప్తివిరోధి యనగా:- కేవలులతో చేరియుండుటయు; భగవత్ప్రాప్తి ప్రతిబంధకము శరీరము; ఆత్మ. ఆత్మీయ. అనువర్తనమునకు ప్రతిబంధకము పుత్రమిత్రాదులు; భాగవతానువర్తనమునకు ప్రతిబంధకము ఇతరసహవాసము; భగవచ్ఛేషమునకు ప్రతిబంధకము అహంకారము;

ఉపాయాధ్యవసాయమునకు ప్రతిబంధకము. మమకారము; ఉపేయరుచికి ప్రతిబంధకము. విషయప్రావణ్యము అనియు; వ్యాఘ్రసింహములవంటిది. ఉపాయవేషము; గజసమూహమున కధిపతియైన గజేంద్రుని వంటిది ఉపేయవేషము అనియు; స్వరూపము మాటలాడనివ్వదు విరోధి నోరు మూసుకొని యుండనివ్వదు.

త్వర సహించియుండనివ్వదు. స్వరూపము వంటరి తనమును సహించదు. దేహము సంఘమును సహించదు. అనియు వృత్తి తిండితో బోవును, తిండి శరీరముతో బోవును శరీరము మట్టితో బోవును, ఆత్మ కర్మతో బోవును, ఈశ్వరుడు కంటి నీటితో బోవును అనియు.

చేతనుడు ఏదైన వకదానిని దలంచునపుడు ఈశ్వరుని దివ్య సంకల్పమున ఆరు ప్రకారములుగ సంకల్పించు కొనినపుడు మాత్రమే దలంచశక్యమగును. అవి ఏవియనగా:- ౧ కర్తృత్వం ౨. కారయితృత్వం ౩. ఉదాసీనత్వం. ౪ అనుమంతృత్వం. ౫ సహకారిత్వం. ౬ ఫలప్రదత్వం. ఇందుకర్తృత్వమనగా, తాను మొదట సంకల్పించుట,

కారయితృత్వమనగా- ఆసంకల్పము ననుసరించి ఈచేతనుడు సంకల్పించు కొనునటుల జేయుట.

ఉదాసీనత్వమనగా:- చేతనునికి సంకల్పము కలిగించునపుడు వీని కర్మానుగుణముగ సంకల్పింపజేయుట,

అనుమంతృత్వమనగా:- ఈ చేతనుడు సంకల్పించు కొనునపుడు దీనిని ఆటంక పఱచ తాను శక్తుడై యుండియు ఆటంక పఱచకుండుట.

సహకారిత్వమనగా:- చేతనుడు ఈశ్వరుని తప్ప ఎట్టి ప్రవృత్తి నివృత్తికి సమర్థుడు గాకుండయుండుట.

ఫలప్రదత్వమనగా:- ఇవన్నియు ఈచేతనుడు జేసిన కర్మానుగుణముగ ఫలించునటుల సంపూర్ణముగ అనుభవింపజేయుట అనియు;

స్వరూపమునకు సంసరణయోగ్యత. పరమ చేతనత్వము.

సహకారికారణము:- అనాద్యాజ్ఞాతిలంఘన రూపమైన అపరాధము.

ప్రధానకారణము:- ఈశ్వరుని యొక్క నిరంకుశ స్వాతంత్ర్యము.

స్వరూపమునకు పరమప్రాప్యమైన కైంకర్య యోగ్యత-శేషత్వముతో పాటు చైతన్యమును కలిగి యుండును.

సహకారికారణము అనుకూల వృత్తులు భక్తి ప్రపత్తులు, ప్రధానకారణము ఈశ్వరుని యొక్క సహజ కారుణ్యము అనియూ,

జ్ఞానము, జ్ఞానమును వినియోగించు కొనుట ఎటుల యనగా :-

ఈ చేతనుని ఇంద్రియముల ద్వారా వినియోగపడును, సర్వేశ్వరుని విగ్రహము ద్వారా వినియోగించు కొన బడును.

జ్ఞానము జ్ఞానమునకు శేషమగుట ఎటుల అనగా:
దీని యొక్క స్వరూప-స్థితి-ప్రవృత్తులు దేని యందాధారపడి యున్నదో అది శేషి యగుటలో సందేహమేమి, ఇటుల యుండు జ్ఞానమును అవిద్య ఆచ్ఛాదించుట ఎటుల సంభవించెననగా.

రాళ్ళు కలగ కుండగనే నీళ్ళు కలగును గదా, అటులనే అ ప్రాప్తమందు కలతచెందుట ప్రాప్త మందు కలత చెందుట, యున్నను జ్ఞానము ద్రవ్యమగుటచే ఎప్పుడును సమముగా కలత చెంత కుండగ యుండదుకదా.

సూలమున సూక్ష్మముండుట ఎటుల యనిన- జ్ఞానేంద్రియముల యందు వ్యాపించి నిలుచును. ...యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః గృహీత్వైతాని సంయాతి వాయుర్గంధానివ ఆశయాత్ ।

అను నటుల వాయువు పుష్పమునుండి పరిమళమును తీసుకొని పోవునటుల ఇంద్రియములను సూక్ష్మశరీరముతో కూడా గ్రహించికొని పోవు చుండును,

స్థూలము విడిపోయి నపుడే సూక్ష్మము కూడ ఏల విడిపోవదు. అనిన ప్రాకృత దేశమున అప్రాకృత దేహము లేకుండుట చేతను ఇది ఏదేశమున పొందబడునో అదే అప్రాకృత దేశమగుట చేతను సూక్ష్మ శరీరము గమన సాధనమగుట చేతను, పోవునట్టి మార్గము నందున్న దేవజాతులు వీనిని సత్కరించి తమ తమ స్వరూపమును పొందవలసిన వారలై యుండుట చేత, సూక్ష్మ శరీరమును విడిచినచో పన్నిరెండు కోట్ల ఆదిత్యులు తమ తేజస్సు పోగొట్టుకొని కాంతికి ఓడి పోవునటుల యుండునట్టి వీని తేజస్సు బయలు పడినచో దేశ దేశముల యందున్న వారలు ఎదురుగ నిలచి కైంకర్యమును జేసుకొని స్వరూపమును లభించుకొన శక్యముగా కుండుట చేతను ఈ సూక్ష్మము అంతపర్యంతము యుండును.

నకు పోవునపుడు తెరలు వేసి కప్పియే తీసుకొని పోవుదురు గదా. ఆ విధముగానే దేవ జాతులున్ను

ఇడర్ కెడ వైమ్మై పోందళియాయ్
(మా దుఃఖము నశించునటుల మమ్ముల గొని పోయి రక్షించుమా) అనియు,

"నీణకర్ నీణెత్తిపై త్తరుళాయ్"
(గొప్పదయిన వైకుంఠనగరమునకు జేర్చి కటాక్షించుమా) అనియు,

చెప్పి కార్యము ఫలించిన పిమ్మట ఎదిరించి పోరాడునట్టి మనస్సు కలవారలగుటచే అట్టి నీచుల కండ్లబడకుండగ పోయి వైకుంఠ దివ్య ద్వారమున ప్రవేశించి స్వస్వరూపమును కప్పి యున్న వానిని తొలగించుకొనును.

అనగా శ్రీ వైకుంఠనాథుని సంతోషింప జేయ సమర్థులైన అప్సరస్సులు అనేకమంది హస్తములలో మాలలు వహించియు, అనేకమంది అంజనమును వహించియు, అనేకమంది చూర్ణమును వహించియు, అనేకమంది వస్త్రములు వహించియు, అనేకమంది ఫలములవహించుయు, ఈ ముక్తుని కూడ సంతోషింప జేయుటకై వచ్చినచో వారల దృష్టిలో కదా వీడు పడునది.

స్వరూపము ననుసరించి జ్ఞానముండును, అది ఆయన యానందమున అవగాహించి యుండును. అనగా ఆయనయొక్క జ్ఞానానందమున వీని సత్త ఆధారపడియుండ ఆయననే అమితముగ ఆకర్షించబడును. అని ఈనయవరులకు తిరుక్కోట్టియూరు నంబిగారు సాయించిన ప్రమేయ





# నారీవిభాగము

తిరుక్కోట్టియూరునంబిగారు సాయించిన

## ఆరువార్తలు

(శ్రీ వరమంగయమ్మారావుగారు)

పతివ్రతయగు స్త్రీకివలెనే మోక్షము నం దిచ్చగలవాడై ప్రసన్నుడై యుండు వానికి అయిదు విషయములు త్యాజ్యములున్ను మూడు విషయములు ఉపాదేయములున్ను అయి యున్నవి.

పతివ్రతయగు స్త్రీకి 1. కన్నియలు 2. వేశ్యలు. 3 వేశ్యాపతులు. 4 ఒకనికర్పించబడి లేచిపోయినామె. 5 లోపలనేయుండి యితరాభిలాషలు కలవారు అను అయిదు విధములైన వారలు త్యాజ్యులు,

1 మాతాపితృలు, 2 తనతల్లి తండ్రులకు అవర్జనీయులగు బంధువులు. 3 తనతోసమానమైన పతివ్రతలగు స్త్రీలు అను మూడువిధములైన వారలు ఉపాదేయులు.

అటులనే ముముక్షువునకు:—

1 సంసారులు

2 దేవతాంతర పరులు

3 దేవతాంతరపరతంత్రులు,

4 దర్శనమున ప్రవేశించి యుండి దర్శనమునకే అపకారపరులై యుండువారలు,

5 రూప నామములను గలవారలై దర్శనమున ప్రవేశించి అనన్యప్రయోజన పరులతో ద్వేషించు చుండువారలు,

అను అయిదు తరగతులవారలు త్యాజ్యులు

1 ఆచార్యులు,

2 శ్రీ వైష్ణవులు,

3 అనన్య బ్రహ్మచారులు;

అను మూడు తరగతులవారలు ఉపాదేయులు గాన త్యాజ్యులైన వారిని త్యజించవలెను. ఉపాదేయులగు వారితో స్నేహము బాంధవ్యము కలిగి యుండవలెను,

## కర్తవ్యము [శ్రీమతి పాపాయమ్మగారు]

పరమకారుణికుడగు పరబ్రహ్మమైన శ్రీమన్నారాయణుడు అనుభవ శూన్యులై మూల ప్రకృతిలో మునిగి మురిగియున్న జీవులకు తమ పరిపూర్ణానుభవ రూపమైన నిత్య, నిరవద్య, నిరతిశయ, నిరవచ్ఛిన్న, నిరుపాధిక, ఆనందమును కలుగజేయు నుద్దేశము తోనే జీవప్రకృతి సంఘటన యూప సృష్టిని జేసెను.

భగవంతుని యొక్క ఈసృష్టి ప్రయోజనమును పొంద ప్రయత్నించువాడే జ్ఞాని. అట్టివాడే ధన్యుడు. అట్టివాడేముక్తుడు. కాగలడు.

ఈప్రయోజనమును పొందవలె నన్నచో అందులకు జ్ఞాన మత్యంతావశ్యకము. ఆ జ్ఞానమెట్టిది.

1, ప్రయోజనమును పొందదలంచు తాను ఎట్టివాడు. తన స్వరూపమేమి? తనయోగ్యత ఎట్టిది,

2. ఆ ప్రయోజనమును అను గ్రహించువాడు ఎవడు? అతని స్వరూప స్వభావములు ఎట్టివి?

3. ఆ అనుగ్రహించువాని యనుగ్రహమును పొందుటకు ఉపాయమేది? దానిస్వరూపస్వభావములు ఎట్టివి?

4, ఆ అనుగ్రహమును పొందిన తరువాత కలుగగల అనుభవము ఎట్టిది? దాని స్వరూపస్వభావములు ఎట్టివి?

5. ఆ అనుభవము మనకిపుడే కలుగుటకు ఆటంక భూతములై యున్నవేవి? వానిస్వరూప స్వభావములు ఎట్టివి.

అను అయిదు విషయములను సంశయ, విపర్యయములు లేకుండగ విశదముగ తెలుసుకొనుటకు సాధనమైన దేదియో అదియే ఈ జ్ఞాన మనబడును.

ఈజ్ఞానము కలుగుటకు మన కాధారమేది?

ఆచార్యాను గ్రహంచే మన కుపదేశింపబడిన మంత్ర, మంత్రార్థములే ఆధారములు.

ఆధారభూతమైన ఆమంత్ర మేది? ప్రణవమే ఆ ప్రధానమైన మంత్రము ఇది. అ. అనియు; 'ఉ' అనియు; 'మ' అనియు; భాగత్రయాత్మక మైనది. అకారము పరస్వరూపమును, ఉపాయస్వరూపమును, మకారము జీవస్వరూపమును, అకారముపైగల లుప్త చతుర్థి పురుషార్థ స్వరూపమును; ఉకారము విరోధి స్వరూపమును సంగ్రహరహస్యముగా తెలుపుచున్నవి, వీని అర్థానుభవము ఆచార్యోప దేశ కృపాలబ్ధమైనదై యున్నది.

ప్రకృతి, జీవులకు యజమానియైన శ్రీమన్నారాయణుండు తన లీలకై ఈజగత్తను నొక యుపవనమును నిర్మించెను, ఇందు వివిధస్వరూప, స్వభావములుగల జీవసమూహములను వివిధములైన రంగులు, పరిమళములు గల మొక్కల నాటెను. వీటినిపెంచి పెద్దజేసి తన కుపయోగించు నటుల జేయుటకై జ్ఞానానుష్ఠాన విశిష్టులైన ఆచార్యులను తోటమాలిని వినియోగించెను. తోటమాలియైన ఈ యాచార్యులు తమ యజమానియైన భగవంతుని యున్నమను నవవిధ సంబంధమును గలవారై

వారి యందు, కృతజ్ఞతా విశిష్టులై ముముక్షువులను తేత లతలను అన్నివేళల అతిజాగరూకత త్రోజ్ఞాతోప దేశమను వేడివెలుతురను. లభింపజేయుచు. సదనుష్ఠానమను నీటిని పోయుచు మంత్రార్థాను స్మరణ యనుపందిరికి ఎక్కించి, జ్ఞానవృక్షల రూపముగ పాకించి జ్ఞాన- భక్తి. వైరాగ్యములను పుష్పముల పుష్పింపచేసి, ప్రపత్తియను ఫలముల పండించి, పరగత స్వీకరణరూపమున వాటిని పరమాత్మునికి సమర్పించి భగవంతునికి మంగళాశాసనము చేయుచు, ముగ్గురు ఆనందించుటకు అనువగునటుల చేయుచున్నారు. ఈవిషయమునే శ్రీ ఆండాళు దేవి నాచ్చియార్ తిరుమొళిలో "ఇన్రువందిత్తనైయుం అముదు శెయ్‌దిడప్పెరిల్. నాన్ ఒన్రు నూఱాయిర మాగ క్కొడుత్తు పిన్నుమాళుం శెయ్‌వన్" అను పాశురము ద్వారాసాయించిరి. ఈరహస్యార్థమును గ్రహించి తదను సరణ ద్వారాజ్ఞాన. భక్తి వైరాగ్య సంపన్నులై తరింప ప్రయత్నించుటయే చేతనుల కర్తవ్యము.

# తిరుక్కోళూర్ పెణ్‌పిళ్ళై రహస్యము

(రచయిత: శ్రీ సద్భాగవత శ్రీపాదరేణువు, మదరాసు)

## ఆళ్వారాచార్యుల చరిత్రము

అ॥ పింజాయ్‌పళుత్తేనో ఆండాళ్ళై ప్పోలే ॥

తె॥ పిందెలోనే పండినానా ఆండాళమ్మవలె॥

౭

పా॥ అంజు కుడిక్కు-ఒరుశందదియాయ్। అళ్వార్గళ్ తంశెయలై వింజినిర్కుం తన్మైయళాయ్। పింజాయ్ పళుత్తాళైయాండాళై పత్తియుడన్ నాళుం!పళుత్తాయ్ మనమేమగిళ్‌న్దు

శ్రీ. వ, భూ. ఉత్కృష్టజన్మమును కోరనటుల బ్రాహ్మణోత్తములైన పా॥ వేండియ వేదంగళోది వేదార్థ స్థాపనమొనర్చు. పెరియాళ్వార్లు ॥పా॥ వేదమనైత్తుక్కుం విత్తానమళవైచ్చొల్లుడైయ। పింజిల్ పళుత్తవివర్ తిరుమగళాన॥ ఆండాళమ్మను కృష్ణావతారానుభవములోని అభినివేశాతిశయమువలన తామవతరించిన బ్రాహ్మణవర్ణమునకు, నీచమైన మూడవవర్ణమును బొంది ॥పా అరివొన్రుమిల్లాదగోపజన్మమునే శ్లాఘించిరి. ॥పా॥ ఆయప్పాడిచ్చెల్వచ్చిరుమియర్గాళ్" అను గొల్లలవలె ఆస్థానముచేసెను. గనుక. శ్రీఆండాళమ్మను ఆళ్వార్లు ॥పా॥ కడిమామలర్పావైయొప్పాళ్ అనిరి.

ప్రేలాగనిన- ఆరుప్రకారములచేత (1) అనన్యార్హ శేషత్వం (2) అనన్యశరణత్వం (3) అనన్యభోగ్యత్వం (4) సంశ్లేషమునందుధారణ (5) విశ్లేషమందు అసహిష్ణుత్వం (6) తదేక నిర్వాహ్యత్వం అను ప్రకారషట్కపరిపూర్ణురాలగు పెరియపిరాట్టితో సామ్యమనుచున్నారు. ఈసామ్యషట్కముయొక్క భావమే పై రెండువాక్యముల ప్రాసంగికం॥ (1) దృష్టములో నుత్కర్షము (2) అదృష్టములో ఉత్కర్ష అహంకార రాహిత్యమును (1) బ్రహ్మపదవినైనను త్రోసిపుచ్చుట (2) గోపికాస్థాన మొనర్చి తదేక పరతయై యుండుట.

ఆండాళమ్మ సీ॥ ఆభోగిభోగపర్యంక మధ్యంబున। వలనొప్పపచ్చని వలువవాని। మేఘంబు పైనున్న మెరపుచందంబున। నురమునశ్రీదేవియొప్పువాని । ముసురు తేటలు విప్ప ముఖచతుష్కము లల । తనయుడాడెడి బొడ్డుదమ్మివాని । గదలని బహుపదక్రమవిశేషంబుల । రవముజూపెడినూపురములవాని ।ఆ॥ జలజగర్భరుద్రసనకసనందన । సద్విజామరప్రశస్యమాన చతురుడైనవాని సౌందర్యఖనియైన । లక్ష్మీకళత్రుని గోరి "గోద" వ్రతము సలిపె॥ ఈమె వివాహవిషయమై ఒక రాత్రి విష్ణుచిత్తులును, పద్మావతీ దేవియును ముచ్చటించుచుండ పా॥ దీనివిని ఆండాళ్ళు

పా॥ వానిడైవాళు మవ్వానవర్కు మరైయవర్ వేళ్వియిల్ వగుత్తవివ్వి ।
కాని డైత్తిరివదోర్ నరిపుగుందు కడప్పదుమోప్పదుంశెయ్వదొప్ప ।
ఊనిడైయాళికంగు ఉత్తమర్కెన్ను ఉన్నిత్తెళుందవెన్ తడములైగళ్ ।
మానిడవర్కెన్రు పేచ్చుపడిల్ వాళగిల్లేన్ కండాయ్ మన్మదనే ॥

అనగానే తల్లిదండ్రితో ఈమె మనుజుని పెండ్లాడననుచున్నది. అయితే ఆదేవునికే నర్పించివేయుండని॥

పా॥ పెరుప్పెరుత్త కణ్ణాలంగళ్ శెయ్దు। పేణినమ్మిల్లత్తుళ్ళే
ఇరుత్తవాన్ణెణ్ణామిరుక్క। వివళుంజనెణ్ణుగినార్గళ్
మరుత్తువప్పదంనీంగినాళ్ణెన్నుం। వార్తైప్పడువదన్ మున్ ।
ఒరుప్పడుత్తిడుమిన్ ఇవళ్లై। యులగళందానిక్కైక్కే ॥

అని అనుచున్నది.

(తి. అ.) ఈ ఆండాళమ్మవలె భగవంతునేకోరి నోములు నోచినానా ?

---

అ॥ ఎంబెరుమాన్ ఎన్రెనోపట్టర్ పిరాన్ పోలే ॥

తె॥ ఎంబెరుమాన్ అన్నానా శ్రీ విష్ణుచిత్తులవలె ॥

వి

శెన్ని యోంగు పా॥ ఉన్నుడై యవిక్కిరమం । ఒన్ఱాళియామలెల్లాం ।
ఎన్నుడైయ నెంజగంబాల్ । శివర్వాలి ఎళుదిక్కొండేన్ ।
మన్నడంగమళువలంగై క్కొండ । విరామనంబీ ।
ఎన్నిడై వందెంబెరుమాన్ । ఇని ఎంగుప్పోగిప్పదే ॥

అనుచు భక్తిపరవశులై పాడిరి.

పట్టర్బిరాన్లు పరతత్వనిర్ణయము చేయుట.

దక్షిణమధురకు రాజైన శ్రీ వల్లభదేవుడు, మంత్రియగు శెల్వనంబితో నొకరాత్రి పురశోధనకు పోవునప్పుడు. అగ్రహారపు వీధియందు గంగాకాశియాత్రజేసివచ్చి పరుండియున్ననొక బ్రాహ్మణునిజూచి రాజు బ్రాహ్మణా ఇంతదూరం యాత్రజేసి వచ్చినారే మీరుకనుగొన్న పురుషార్థమేమని ప్రశ్నింప అతడు——

శ్లో॥ వర్షార్థమష్టౌప్రయతేత మాసాన్ । నిశార్థమర్థం దివసంయతేత । వార్ధక్యహేతోర్వయసానవేన । పరత్రహేతోరిహజన్మనాచ ॥ దీనికి తెనుగు పద్యము——

చం॥ వినియె నెలల్చతుర్ద్వయుని, వృష్టిది నాళికి రాత్రికై దివం । బున, జరకై వయస్సునను, బూని పరంబున కిప్పుడుద్యమం । బనువుగ జేయగావలయు నంచు బురోహితధర్మమాత్మగీ । ల్గొన నలవిప్రుడా ద్విజులలోన సుభాషితమున్ బఠింపగన్॥

కం॥ ఉన్నట్లయుండవద్దటి । కిన్నరులను, నావచేర్చుకిరియ వెసదాబో । కున్నట్లయుండి కాలం । బున్నరులకు వయసుబుచ్చి మోసముదెచ్చున్ ॥ అనగా రాజు చింతాకులిత మనస్కులై ఇకనైనను ఈశ్వరభక్తి చేయుదమని ముందు పరతత్వ నిర్ణయము చేయనిశ్చయించి విద్యాశుల్కము నుంచి దేశదేశములకు లేఖలబంపెను. శ్రీ విల్లిపుత్తూరిలో వేంచేసియున్న వటపత్రశాయి విష్ణుచిత్తుల స్వప్నములో. భక్తా. నీవు మధురకువెళ్ళి నాపరత్వమును నిర్ణయించి రమ్మనగా

స్వామీ! ఆముక్తమాల్యద-ప॥ సీ॥ గృహసమ్మార్జనమో జలాహరణమో శృంగారపల్యంకికావహనంబో వనమాలికాకరణమో వాల్లభ్యలభ్యధ్వజగ్రహణ బో వ్యజనాతపత్రధృతియో ప్రాగ్దీపికారోపమో నృహరీ! వాదము లేల ? లెరే యితరుల్ నీలీలకున్ బాత్రముల్ ॥ అనగా

వ. ఆ చింత నాదిగదా! అనగా——

వి.—— 200 మంది శ్రీపాదతాంగులగోష్ఠితో మధురకు వెళ్ళి వాదములు జరిగెను. విష్ణుచిత్తులే జయించిరి. సభలో పైగా కట్టియుంచిన విద్యాశుల్కము తనంతట క్రిందపడెను. అప్పుడు వల్లభదేవరాజు అత్యంత ఆనందముతో విష్ణుచిత్తులనే ఆచార్యులుగా నియమించి వారిని హస్తిమస్తకము నధిరోపించి రాజును, మంత్రియు ఇరువంకల చామరములు వేయుచు——

శ్లో॥ జయతి జయతి విద్వాన్ భట్టనాథో మహాత్మా । జయతి జయతి విష్ణుచిత్తో మహీయాన్। జయతి జయతి ధన్యో దివ్యసూరిర్గరీయాన్ । జయతి జయతి స్థాపనాచార్యవర్య, జయతి జయతి లక్ష్మీనాథకారుణ్యపాత్రం। జయతి జయతి విద్వన్మస్తకన్యస్తపాదః। జయతి జయతి సూరిస్సర్వవిత్సార్వభౌమః । జయతి జయతి తత్త్వజ్ఞానినాం అగ్రగణ్యః ॥ అనుచు పోవుచుండగా-గూడలశిఖర్ సన్నిధికి పైగా పరమపదవాసుడు గరుడసేవ శాయించెను. విష్ణుచిత్తులు చూచి ఆనందపరవశులై స్వామికి దృష్టి దోషముకాకుండ పల్లాండు పాడిరి,

తీ. ఆ. విష్ణుచిత్తులవలె-విష్ణుపరతత్వమును నిర్ణయించినానా ?

నివేదన అనుబంధము




పశ్చిమగోదావరిజిల్లా పాలకొల్లు పట్టణ మున అష్టభుజ లక్ష్మీనారాయణస్వామివారి సన్నిధిని చీరాల వాస్తవ్యులగు శ్రీ. ఉ. వే. శ్రీమాన్ అద్దంకి తిరుమల సమయోద్దండ కోలాహల లక్ష్మీనృశింహకుమార తిరువేంగడ తాత దేశికా చార్యులయ్యవార్లంగారి. అధ్యక్షత క్రింద శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ మాఘమాస పండిత పరిషత్సభలు అతివైభవముగా జరిగినవి.

17-2-52 ఉదయము అధ్యక్షులవారి తిరుపీఠ్యుత్సవము జరిగినది.

ఆహ్వానసంఘమువారి స్వాగతోపన్యాసము.(శ్రీమాన్ ఆరవల్లిఅళహశింగరాచార్యులుగారు)

కార్యదర్శినివేదిక.

8 గం॥ అధ్యక్షులవారి ఉపన్యాసం. (అర్థపంచకజ్ఞానం)

10గం॥ శ్రీ. ఉ. వే. శ్రీమాన్. శ్రీ. తి. పురిఘళ్ల వెంకటా చార్యులుగారు. (జగత్కారణ రక్షకత్వం మొఝుంబాళ్ వూంపాళిల్)

మధ్యాహ్నము

10గం॥ శ్రీ, ఉ, వే. శ్రీమాన్. బెల్లపుకొండరాఘవాచార్యులుగారు. (శ్రీవిశిష్టాద్వైతసిద్ధాంతం)

5గం॥ ,, ,, ముడుంబై వెంకటాచార్యులుగారు. (శ్రీవైష్ణవత్వము)

సాయంకాలము

శ్రీవిష్ణుసహస్రనామస్తోత్ర. శ్రీలక్ష్మీఅష్టోత్తరశతనామస్తోత్ర సమిష్టిపారాయణము,

18-2-52 ఉదయము,

5గం॥ శ్రీ. ఉ. వే. శ్రీమాన్, శ్రీరంగం సల్లానిచక్రవర్తుల నరసింహాచార్యులుగారు. పెనుగొండ (ఆచార్యసంప్రదాయపద్ధతి)

10గం॥ ,, ,, మహాభాష్యం. వరదాచార్యులుగారు. చీరాల. (ఆచార్యవైభవము

మధ్యాహ్నము.

10ని॥ ,, ,, కుమాండూరి ఋళియవిల్లి వెంకటాచార్యులుగారు. కాళ్లకూరు.
[భక్తి. ఒళివిల్ కాలమెల్లాం]
,, ,, ఆరవిల్లి ఆళహశింగరాచార్యులుగారు. [ముముక్షుత్వము]
,, ,, శ్రీవిష్ణుసహస్రనామం శ్రీలక్ష్మీఅష్టోతరశతనామస్తోత్ర సమిష్టిపారాయణము

19-2-52 ఉదయమున

8ని॥ శ్రీ. ఉ. వే. శ్రీమాన్. శ్రీ. తి. పు. జగన్నాథాచార్యులుగారు. [భగవత్సౌలభ్యము
5ని॥ ,, ,, గోవర్థనం శేషభట్టరాచార్యులుగారు. [మంత్రమహిమ.]
,, ,, వంగిపురం బుచ్చికృష్ణమాచార్యులుగారు. [భాగవతాభిమానం]
10ని॥ ,, ,, నడాదూరిగోపాలకృష్ణమాచార్యులుగారు. [అంశిరయమనారాయ్
10ని॥ మధ్యాహ్నమున. న. చ. తిరువెంకట జగన్నాథాచార్యులుగారు. [రహస్యత్రయ మీమాంస.]
5ని॥ తూపురాణి వెంకటాచార్యులుగారు. (భాగవతవైభవం)
అధ్యక్షులవారు. [ఆచార్యనిష్ఠ]
15ని॥ అ. చి. శ్రీమన్నారాయణాచార్యులుగారు. [శ్రీపాదతీర్థమహిమ]
శ్రీవిష్ణుసహస్రనామస్తోత్ర- శ్రీలక్ష్మీఅష్టోత్తర శతనామస్తోత్ర సమిష్టి పారాయణము జరిగినది.

---

# ప్రకటన

## నందన సంవత్సర పంచాంగము

శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘముచే నందన సంవత్సర పంచాంగము, క్యాలండరు. కలిపి ప్రచురింపబడినది. ఇది నిరుటివలెనే 1/2 క్రౌనుసైజులో ఒకవైపు యింగ్లీషు తారీఖులతోను తిథివార నక్షత్ర వర్జ్యములు గంటలలో క్యాలండరును. రెండవవైపున ఘడియలలో పూర్తిగా పంచాంగమును ఒక్కొక్క మాసమునకు ఒక్కొక్క పేజీ చొప్పునను చివర రెండుపేజీలలో పీఠికను సంగ్రహముగను ప్రచురింపబడినది.

భక్తి "నివేదన" పత్రిక చందాదారు లందరకు ఇవి ఉచితముగ పంపబడును. ఇతరులు రూ 1-0-0 మణియార్డరుగ పంపినచో బుక్‌పోస్టుగా పంపబడును.

భక్తి "నివేదన" కార్యాలయము
అర్తమూరు. [వయా] ద్వారపూడి.
తూ॥ గోదావరి జిల్లా,